

# లఘుకౌముదీ-మార్గదర్శిని.

ప్రథమ భాగము

ఆనందవల్లీ గ్రంథమాల
శ్రీ వేంకటేశ్వరపురం - అనంతపురం.

శ్రీమద్వరజరాజకృత

మార్గదర్శినీ నామకాంధ్రవ్యాఖ్యా సముపేత

# లఘుసిద్ధాంతకౌముది

ప్రథమ భాగము

వ్యాఖ్యాత :

భాషాప్రవీణ : డా॥ శలాక రఘునాథ శర్మ, ఎం. ఏ., పిహెచ్. డి.

రీడరు, తెలుగుశాఖ, స్నాతకోత్తరవిద్యాకేంద్రము, అనంతపురం.

THIS BOOK IS PUBLISHED

WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME AID

TO PUBLISH RELIGIOUS BOOKS.

# సౌజన్య సంభావనము

పరబ్రహ్మ స్వరూపులగు గురుదేవులకు ప్రణామములు. నాయందు వాత్సల్యరసమును వెల్లిగొలిపిన ఆత్మబంధువులు కీ॥ శే॥ బ్రహ్మశ్రీ వేదమూర్తులు చెఱుకుపల్లి బుచ్చిరామశర్మ బ్ర॥ వే॥ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ, బ్ర॥ వే॥ బ్రహ్మజోస్యుల బాలగంగాధరశర్మలకును వారి సతీమణులకును నమస్సుమాంజలి.

గ్రంథముద్రణకు తిరుమలతిరుపతిదేవస్థాన నిధులనుండి విరాళమును అందఁజేయుటలో నిండుహృదయమును పండించిన కార్యనిర్వహణాధికారి మాన్యశ్రీ పి.వి.ఆర్. కె. ప్రసాద్ *I.A.S.* గారి సౌజన్యమును మదిలో పదిలపరచుకొందును. సప్తగిరి సంపాదకులు శ్రీయుతులు కె. సుబ్బారావు *M.A.* గారును ఈ సందర్భమున వందనీయులు.

గ్రంథప్రథమ ద్వితీయభాగ ప్రతులన్నిటియందు నలంకరించుటకు శ్రీ పద్మావతీ వేంకటేశ్వరుల త్రివర్ణచిత్రపటప్రతులను ఉచితముగా అందించిన దేవస్థానమువారి యౌదార్యము కలిగించిన ఆనంద మవధులులేనిది.

ఈ గ్రంథము వెలుగుచూడవలయునని నాకంటె ఎక్కువగా ఉవ్విళ్లూరి అనేకప్రయత్నము లొనరించిన విద్యార్థిమిత్రులు చి॥ బి. నారాయణరెడ్డి *M.A.* (నంద్యాల) చి॥ జి. రామచంద్రారెడ్డి *M.A.* (విజయవాడ)గార్లకు భగవంతుఁడు ఆయురారోగ్యభాగ్యముల నొసఁగుఁగాక.

నాపై ప్రేమాదరములతో ఈ గ్రంథముద్రణ నిర్వహణ భారమునంతటిని వహించిన ఆత్మీయులు బ్ర॥ వే॥ ఇంద్రకంటి సూర్యనారాణమూర్తి గారికి వందనశతములు.

ఇంకను ఈ కార్యమున చేయూత నొసఁగిన అనేకుల నామధేయములను ద్వితీయభాగమున స్మరించితిని.

ఏలూరు వెరైటీ ప్రింటర్సువారి ఓర్పునేర్పులు బహుధా ప్రశంసనీయములు. తదధిపతులకును, తత్పరివారమునకు, తత్కుటుంబములకును భగవంతుడు కోరిన వెల్ల నొసగుఁగాక.

రౌద్రి ఫాల్గున కృష్ణ ఏకాదశి — శ. ర. శ.

1—4—1981

# అంకితము

అస్మద్గురు వర్యులు

కళాప్రపూర్ణ, వ్యాకరణస్థాపకేత్యాది బిరుదవిరాజితులు

కీర్తిశేషులు బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రి

శ్రీచరణులకు

# పాణినీయ సంప్రదాయ పరిచయము

పాణిని మహర్షి విరచితమగు అష్టాధ్యాయ్యాదికము మొదలు కొని, దాని నాధారముగ చేసికొని ప్రవృత్తమైన వ్యాకరణశాస్త్రమున కంతటికిని పాణినీయమని పేరు. అ ఇ ఉణ్ణాది మాహేశ్వరసూత్రముల నాధారముగ చేసికొని అతులమేధాపాటవసముపేతుఁడగు పాణిని మహర్షి యెనిమిది అధ్యాయములుగల అష్టాధ్యాయి అను పేరుగల సూత్రజాలమును వినిర్మించెను. దాని కనుబంధముగా గణపాఠము, ధాతుపాఠము ఉణాది పాఠము లింగానుశాసనము అను గ్రంథములు కూడ నా మహానుభావుఁడు విరచించెను. వ్యాకరణ సంజ్ఞలు, పరిభాషలు, విధులు, నిషేధములు, నియమములు, అధికారములు, అతిదేశములు అను వానిని సూత్రీకరించిన సుమారు నాలుగువేల పరిమితిగల సూత్రజాలము అష్టాధ్యాయి యందుఁగలదు. ఒక్కొక్క అధ్యాయమునందు నాలుగు పాదములుండును. ఒక్కొక్క పాదమునకు కొన్ని సూత్రములుండును. మహాసాగర సమ్మితమైన సంస్కృతభాషను వీలయినంత తక్కువ అనుశాసనముతో నుపదేశించు తాత్పర్యముగల పాణిని మహర్షి సూత్ర నిర్మాణము నందు ప్రయోగించిన శిల్పము నాన్యతోదర్శనీయము. ప్రాచ్య పాశ్చాత్య పండిత ప్రకాండు లెల్లవారికి నిది అద్భుతజనకమగుచుండును. అల్పాక్షరము, అసందిగ్ధము, సారవంతము, విశ్వతోముఖము, అస్తోకము, అనవద్యము నైనది సూత్రమని ఆర్యోక్తి (అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్, అస్తోక మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః) సూత్రము నందలి అక్షరములు కనిష్ఠపరిమితిలో నుండవలయును. అట్లని సందేహముల కందు సందుండరాదు. దీని నింతకంటె బిగువుగా నింకొక స్వరూపముతో చెప్పగలనని యెంతవాఁడైనను అనుటకు వీలులేనిదై యుండవలయును. అనల్పప్రయోజనమును సాధించుచు తనదృష్టి నన్నివైపులకును సారించునదియై యుండవలయును. కర్త తానేదో కష్టపడి, పాఠకుని కష్టపెట్టుచున్నట్లుండరాదు. అతి వ్యాప్త్యవ్యాప్త్యసంభవ దోషములకు అందు తావుండరాదు. ఇట్టిది సూత్రము. శతవిధముల నీలక్షణము పాణినీయ సూత్రములనుబట్టియే యేర్పడి యుండవచ్చును. అల్పాక్షరమను లక్షణము సాధించుటలో మహర్షి యవలంబించిన పద్ధతులలో అనువృత్తి, అధికారములనునవి ముఖ్యములు. ఒక సూత్రములో

నున్న పదములననవసరమున్నంతమేరకు క్రిందిసూత్రములలోని కనుసరించి వర్తించుట ననువృత్తి యని పేరు. స్వస్థలములో ప్రత్యేకమైన ప్రయోజనము లేక ఉత్తరసూత్రములయందు ప్రవర్తించి వాని యర్థపూరణమునకు సహకరించు సూత్రముల నధికారసూత్రము లందురు. ఉత్తరసూత్రములలోనికి ప్రసరించుట యనులక్షణము అనువృత్తి, అధికారములకు సమానమే యైనను అనువృత్తములగు పదములకు ఉత్తరసూత్రములయందు మాత్రమేకాక స్వస్థలములో కూడ ప్రయోజన ముండును. ఉత్తర సూత్రములలోనికి ప్రసరించుటయే యధికార సూత్రములలక్షణము. ఈ భేదమును పురస్కరించుకొని యీ విధానము ఈ రెండు నామములతో వ్యవహరింపఁబడుచున్నది. ఇంతియకాక కొన్నివిధులు సూటిగాఁగాక జ్ఞాపక పద్ధతిలో నిరూపింపఁబడినవి. పాణినికృతములగు కొన్నిప్రయోగములు కూడ కొండొకయెడ విషయనిరూపకములయినవి. ఈ యంశము లన్నియు నందందీగ్రంథమునందు సందర్భానుకూలముగా వివరింపఁబడినవి. ఇట్టి యీవ్యాకరణ సంప్రదాయమునకు పాణిన్యాచార్యుఁడు ప్రవర్తకుఁడగుచున్నాఁడు.

సంస్కృతభాష అపారపారావారసదృశమని ముందే చెప్పుకొంటిమి. కావుననే సర్వతోముఖప్రతిభా సంపన్నుఁడైన పాణిని మహర్షి సూత్రజాలముకూడ లోఁగొనఁజాలని విషయములు కొన్ని మిగిలిపోయినవి. మఱియు ప్రథమాచార్యుని సూత్రపద్ధతియొక్క లోతులను గొన్నియెడల స్పష్టముచేయ వలసినయవసరముకూడ సంభవించినది. క్వాచిత్కముగాకొన్ని సర్దుబాటులుకూడ చేయవలసి వచ్చినది. పాణిన్యాచార్యుని శిష్యవతంసుడని విశ్వసింపఁబడుచున్న కాత్యాయనాపరనామక వరరుచిమహర్షి అష్టాధ్యాయి సూత్రజాలములో అవసరములగు మార్పుచేర్పులను వార్తికములను పేర. నేర్చి కూర్చి శబ్దవిద్యా సంప్రదాయ కర్తలలో ద్వితీయుఁడుగా ప్రఖ్యాతి గాంచెను. ఉక్తానుక్తదురుక్తానాం చింతాయత్ర ప్రవర్తతే, తంగ్రన్థం వార్తికం ప్రాహు ర్వార్తికజ్ఞా మనీషిణః అనుశ్లోకము వార్తికలక్షణమును విశదీకరించుచున్నది. మూలసూత్రములయందు ఉక్తములయిన యంశములను పరిశీలించుట, అనుక్తములను పేర్కొనుట, దురుక్తములను సవరించుట మున్నగునది వార్తికముల కర్తవ్యము.

ఈ వార్తికరచనముతో సూత్రగ్రంథమునకు సమగ్రత చేకూరినది. వరరుచి మహర్షి యిట్టిసంప్రదాయమును పరిపోషించి ద్వితీయాచార్యస్థానమున సుప్రతిష్ఠితుఁడాయెను.

సూత్రవార్తిక సముదాయరూప క్షీరసాగర మథనపటుమేథామంథరవిరాజితుఁడును, నిత్యప్రాతఃస్మరణీయ నామధేయుఁడునగు పతంజలిమహర్షి ఈ సంప్రదాయమున భాష్యకర్త. భాష్యమనగా స్థూలముగా వ్యాఖ్యానమనియే యర్థము. కాని వ్యాఖ్యానమెల్ల భాష్యపదముచే వ్యవహరింపఁబడదు. ఈ భాష్యమునందు సూత్ర వార్తికముల యక్షరాక్షర పరిశీలనము గావింపఁబడినది. తత్కర్తల హృదయ గతాభిప్రాయము లిందు సునిరూపితములయినవి. శబ్దశాస్త్రమును గూర్చి వక్తవ్యమెల్ల నిందు ఉక్తమైనది. అమేయ మహత్త్వ పరిపూరితమగుటచే ఈ గ్రంథమునకు మహాభాష్యమను సార్థకనామధేయము వ్యవహారసిద్ధమయినది. ఈ వ్యాకరణ సంప్రదాయమున నిందేది చెప్పఁబడెనో యది తుదిమాట. ఎట్టిసందియమునైనను తదాశ్రయము కర్తవ్యము. మహాభాష్యము నధ్యయనముచేయుట ప్రాగ్జన్మసుకృతవిశేషముచేతనే కాని సమకూరని దివ్యఫలమని భారతీయుల పరమవిశ్వాసము. తదధ్యయనము జీవితచారితార్థ్యమునకు ఘంటాపథమని తజ్జ్ఞుల అభిప్రాయము. ఇట్టిభాష్యకర్త ఈశబ్దశాస్త్రమునకు సర్వజ్ఞకల్పుఁడగుచున్నాఁడు.

పాణిని వరరుచి పతంజలులకు మునిత్రయమని వ్యవహారము. వీరిరచనలపై అసంఖ్యాకములగు వ్యాఖ్యానములు గలవు. పదవిభజనము, పదార్థవివరణము, విగ్రహనిరూపణము, (అధ్యాహార) వాక్యముఁకూర్పు, పూర్వపక్షములకు సమాధాన మొసఁగుట మున్నగు లక్షణములతో సముపేతమైనదానిని వ్యాఖ్యాన మందురు. (పదచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్యయోజనా, పూర్వపక్షసమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్). ఈ వ్యాఖ్యాన లక్షణముగల వివరణ భాగమునే వృత్తియనియు నందురు. ఇట్టి వృత్తిగ్రంథములనేకము లీశాస్త్రమున విలసిల్లినవి. కాశికావృత్తి, భాగవృత్తి మున్నగునవి యట్టివి.

ప్రకరణవిభాగ మొనరించి ప్రక్రియా నిరూపణ పురస్సరముగ వ్యాఖ్యానముచేయు గ్రంథములను ప్రక్రియా గ్రంథము

లందురు. రూపావతారము, ప్రక్రియాకౌముది మున్నగు నిట్టిగ్రంథములలో భట్టోజిదీక్షితకృత వైయాకరణసిద్ధాంతకౌముది అల్పకాలములో అనల్ప ప్రచారము నందుకొనినది. ఈ గ్రంథముపై కూడ అనేక వ్యాఖ్యానములు, బాలమనోరమ, తత్త్వబోధిని మున్నగు నామములతో వెలువడినవి. ఈ గ్రంథ ముదయించిన పిదప తత్పూర్వ వ్యాఖ్యాన గ్రంథము లనేకములు విస్మృత ప్రాయములైనవి. నేడు సాధారణముగా వ్యాకరణ శాస్త్రాధ్యయనమును ప్రారంభించు విద్యార్థికి ప్రథ మోపాదేయమిదియె. పాణినీయ సూత్రములను ప్రకరణయోగ్యముగా విశ్లేషించి సంజ్ఞ, పరిభాష, సంధి మున్నగు ప్రకరణములుగా సూత్రజాలమిందు విభజింపబడుటచే అష్టాధ్యాయిక్రమమిందు గ్రహింపఁబడుటకు వీలుకాలేదు. కావున అనువృత్త్యధికార వివేకమిందు కొంతకష్టమే యగును. అయినను నిది శబ్దశాస్త్రాధ్యయన ప్రారంభకులకు చక్కని సహకార మొనరింపఁగల గ్రంథము.

వరదరాజను పండితుఁడు సిద్ధాంత కౌముది వఱకు ప్రాకఁజాలని బాలురను, ఇతరశాస్త్రములలో కృషిచేయు వ్యక్తులను దృష్టిలో నిడుకొని వారి కవసరమగునంత విషయము నందఁజేయవలయునను భావముతో సిద్ధాంతకౌముదిని కొంత సంక్షేపించెను. ఇదియే లఘుసిద్ధాంతకౌముది. ఇందు సిద్ధాంతకౌముదియందలి సుమారు నాల్గవ వంతు భాగము స్వీకరింపఁబడినది. ఈ వరదరాజ పండితుఁడు సిద్ధాంతకౌముదికిని లఘుసిద్ధాంత కౌముదికిని వారధిగా మధ్యసిద్ధాంతకౌముది యను మఱియొక గ్రంథమును కూడ సంతరించెను. లఘుసిద్ధాంత కౌముది పేరునకు తగినట్లు బాలురకు యోగ్యమైన విషయములను మాత్రమందించుటలో కృతార్థమైనది. దీనిపైకూడ సంస్కృతాంధ్రాంగ్ల హిందూస్థానీ భాషలయందు చాల వ్యాఖ్యానము లుప్పతిల్లినవి.

ఆంధ్రమున ఈ గ్రంథమునకు అస్మన్మిత్రులు శ్రీ రవ్వా శ్రీహరి గారు సంజ్ఞాసంధికృదంతప్రకరణములకు వ్యాఖ్యానము విరచించి ప్రకటించిరి. అట్లే పూజ్యశ్రీ పుల్లెల శ్రీరామచంద్రుఁడుగారు మొత్తమునకు బాలానందిని యను నొక వ్యాఖ్యానమును విరచించిరి. ఈ మార్గదర్శిని మూడవది. ఇందు సంజ్ఞా సంధి, కృత్, విభక్త్యర్థ, సమాస, తద్ధిత, స్త్రీప్రత్యయప్రకరణములకు ఆంధ్రమున వ్యాఖ్యానము వ్రాయబడినది. శబ్దాధికార, తిఙన్త ప్రక్రియలు మాత్రమిందు

ప్రస్తుతమునకు కైకొనఁబడలేదు. సూర్యపర్శ్నిని లక్ష్యమేమో, తత్సాధనకై యవలంబించిన పద్ధతులేవో "సూర్యపర్శ్నినీ పరిచయము" అను ననంతరభాగమున వివరింపఁబడినవి. పాఠకులు దానిని పరిశీలింప వలయునని ప్రార్థన.

శ. ర. శ.



యేనాక్షర సమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః.

యేన ధౌతా గిరః పుంసాం విమలై శ్శబ్దవారిభిః
తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః.

వాక్యకారం వరరుచిం భాష్యకారం పతఞ్జలిమ్
పాణినిం సూత్రకారం చ ప్రణమామి మునిత్రయమ్.

ఓం నమః పాణిని కాత్యాయన పతంజలిభ్య శ్శబ్దవిద్యాసంప్రదాయకర్తృభ్యో వంశర్షిభ్యో మహద్భ్యో గురుభ్యః.

# మార్గదర్శినీ పరిచయము

తెలుగుభూమిలో ప్రాచ్యకళాశాలలయందును, విశ్వవిద్యాలయము లందును సంస్కృతాంధ్రభాషాప్రావీణ్యమునకై కృషిచేయు విద్యార్థిలోకమునకును, స్వతంత్రముగా అధ్యయనముచేసి పరీక్షలలో కృతార్థత నొందఁగోరు అభ్యర్థులకును, సంస్కృతభాషయందభిమానముండి దానిని వీలగునంతవఱకు స్వయంకృషితో సాధింపవలయునను తాత్పర్యముగల జిజ్ఞాసువులకును వ్యాకరణశాస్త్రమున మార్గదర్శనము చేయుట ఈ మార్గదర్శినీవ్యాఖ్యయొక్క ముఖ్యలక్ష్యము. తగినంత గ్రంథసంపద అందుబాటులో లేక, ఆయావిస్మృతాంశముల పునరాదానమునకై చిక్కువడు అధ్యాపకులకు కూడ విషయమును నెమరువేసికొనుటకు పనికివచ్చుట దీని ఆనుషంగికలక్ష్యము. ఏతల్లక్ష్యానుగుణముగ మిక్కిలి సరళమైన భాషలో విషయనివేదనము ఇందు చేయఁబడినది.

ఈ వ్యాఖ్యలో నవలంబించిన పద్ధతు లియ్యవి. సూత్రము వృత్తియు యథామూలముగ నొసఁగఁబడినవి. సూత్రవార్తికములకు పదవిభాగముతోపాటు ఆయాపదములకు విభక్తి వచనాది నిర్దేశము చేయఁబడినది. అట్లుచేయుటవలన, ఆసక్తికలవారు ఆ సంస్కృతపదములకు యథాయోగ్యముగ తెలుఁగు విభక్తులను చేర్చుకొని సూత్రాదికముయొక్క స్థూలార్థము సంభావింపఁగలుగుట ఆశింపఁబడినది. అనువృత్తి అధికారము అనురూపములతో నాయాసూత్రములలోనికి వచ్చి చేరు పదజాలమునకును విభక్తివచన నిర్దేశము చేయఁబడినది: ఏ సూత్రములనుండి యాపదము లుపాత్తములయినవో చూపుట మిక్కిలి ప్రయోజనకరమని సంభావింపఁబడియు, గ్రంథవిస్తరభీతివలనను లఘుసిద్ధాంత కౌముదిలో లేని అనేకసూత్రములను ఊరక నిర్దేశించినంతమాత్రమున అంతగా ప్రయోజనముండదేమో యనుసందియము వలనను ఆపని విడువఁబడినది. వృత్తివాక్యములు ఇంచుమించు అన్యూనానతిరిక్తముగా 'అర్థము' అనునంశమునందు అనువదించి చూపఁబడినవి. కొండొక యెడ వృత్తివిభాగము విశ్లేషింపఁబడుటయు జరిగినది. ఒకసూత్రముయొక్క ఉదాహరణాదులయందు ప్రక్రియాదులకై ప్రసక్తమగు సూత్రాంతరము వ్యాఖ్యానింపఁబడును. పై సూత్రముయొక్క మిగిలిన యుదాహరణాదికము, పదప్రయోజనచర్చ మున్నగునవి క్రిందిసూత్రములకడ చూపఁబడుచుండును. ఇట్టియంశములను విశ్లేషించి అవతారికలో పూర్వాపరసంబంధము స్పష్టము చేయుట జరిగినది. వివరణమను భాగములో సూత్రార్థము ఎట్లు ఏర్పడినది, ఏయే పరిభాషలందు ప్రసక్తములయినవి, పారిభాషికపదముల యర్థము లెట్టివి, ఉదాహరణముపై సూత్రార్థ మెట్లు సమ

స్వీతమగుచున్నది మున్నగు నంశములు మిక్కిలి సులభమైనభాషలో వ్రాయఁబడినవి. ఉదాహరణముల ప్రక్రియలో క్రమము, సాధ్యమైనంతవఱకు సూత్రోద్ఘాటన పూర్వకముగా నిరూపింపఁబడినది. స్పష్టముగా తెలియుటకు వీలయిన కొన్ని తావులిందుమాత్రము కార్యము సూచింపఁబడినది. పరిభాషల అర్థగ్రహణమునందు సాధారణముగా సంభవించు క్లేశమును తొలగించు నుద్దేశముతో పలుతావులందు వివరణము చేయఁబడినవి. విషయస్పష్టతకై పునరుక్తిదోష మొప్పరికింపఁబడినది. ఆయా సూత్రములకు సంబంధించిన గణములేవైన నున్నచో అవి అక్కడక్కడనే యొసగఁబడినవి. కుతూహలముగలవారలు, వృత్తిలో చూపిన యుదాహరణముల సాహాయ్యముతో గణపాఠమునందలి శబ్దములకు ప్రక్రియ నభ్యసించుట కీగణపాఠముల కూర్పు మిక్కిలి యుపయుక్తమగునని సంభావింపఁబడినది.

ప్రకరణముల ప్రారంభమున అవతారిక యనుభాగమున నా ప్రత్యేక విభాగము నందలి యంశములు ప్రకరణనామసార్థక్యనిరూపణముతోపాటు ఉట్టంకింపఁబడినవి. ప్రకరణావలోకనమను పేరున ఆయా ప్రకరణములయందలి విషయములన్నియు అంతమున సింహావలోకనముగావింపఁబడినవి. అవసరమని తోచిన తావులందు పట్టికల (Charts) ద్వారమున విషయనివేదనము చేయఁబడినది. సాధారణముగా మధ్యమాధికారియగు విద్యార్థి మనస్సులో పుట్టవచ్చునని తలఁపఁబడిన సందేహములన్నిటికిని సమాధానములు చెప్పుటకు మార్గదర్శినియందు చిత్తశుద్ధితో ప్రయత్నము చేయఁబడినది. కావున వైలక్షణ్యముతో నది రూపుదిద్దుకొనుచున్నదో అది తప్పక నెఱవేఱఁగలదని సంభావించుట సముచితమే యగుననుకొనుచు నీ పరిచయమును ముగింతును.

శ. ర. శ.

# సంకేత సూచిక

సూ : సూత్రము.

వృ : వృత్తి.

ప. వి : పదవిభాగము.

అను అనువృత్తి, అధికారము.

అర్థ : అర్థము.

వివ : వివరణము.

ఉదా : ఉదాహరణము.

విశే : విశేషములు.

వా : వార్తికము.

గ. సూ : గణసూత్రము.

ప : పరిభాష.

△ ఈ అక్షరమిట్లు మాఱుననునర్థమున నుంచఁబడినది.

/ లేక అనునర్థమున వాడఁబడినది.

\+ సంధ్యాదికార్యవిశేషముల ప్రక్రియను సూచించును.

(1) పదవిభాగము చేయఁబడినతర్వాత కుండలములలో నుండు అంకెలలో మొదటిది విభక్తిని, రెండవది వచనమును సూచించును. ఉదా : 3-1 - తృతీయా విభక్తి ఏకవచనము; అవ్య - అవ్యయము; క్రి. ప. క్రియాపదము.

(2) సూత్రములకు తర్వాత నుండు అంకెలలో మొదటిది అధ్యాయ సంఖ్యను, రెండవది ఆ యధ్యాయములోని పాదసంఖ్యను, మూడవది ఆ పాదము లోని సూత్రసంఖ్యను దెలుపును. ఉదా : 3-1-94. మూఁడవ అధ్యాయములోని ఒకటవపాదము యొక్క తొంబదినాలుగవసూత్రము.

(3) వార్తికము ప్రక్కనుండు సంఖ్య మొత్తము పాణినీయమున గలవార్తిక ములలో దాని సంఖ్యను సూచించును.

(4) గణములలో ' ' అను చిహ్నములకు నడుమ నుండునవి గణ సూత్రములు. వానిప్రక్కనుండు సంఖ్య మొత్తముగణసూత్రములలో దానిసంఖ్యను సూచించును

# విషయ సూచిక

ఓమ్

# లఘు సిద్ధాంత కౌముదీ

## మార్గదర్శినీ వ్యాఖ్యా

నత్వా సరస్వతీం దేవీం శుద్ధాం గుణ్యాం కరోమ్యహమ్
పాణినీయ ప్రవేశాయ లఘుసిద్ధాన్త కౌముదీమ్.

ఇది యిష్టదేవతా స్మరణపూర్వకమును, అనుబంధ చతుష్టయ నిర్దేశరూప మును నగు మంగళాచరణము. శ్రీ వరదరాజ పండితుఁడు ప్రారంభించిన గ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తి నొందుటకై విద్యలకుతల్లియగు సరస్వతికి నమస్కరించి పాణినీయవ్యాకరణ ప్రవేశమునకై శుద్ధమైనదియు, గుణయుక్తమైనదియు నగు లఘుసిద్ధాంతకౌముదిని విరచించుచున్నానని చెప్పెను.

విషయము, ప్రయోజనము, సంబంధము, అధికారి అనువానిని అనుబంధ చతుష్టయమందురు. ప్రకృతమున వ్యాకరణసంబంధములైన సిద్ధాంతములిందు విషయములు. పాణినివిరచితమైన యష్టాధ్యాయి సూత్రముల జ్ఞానము ప్రయో జనము. ప్రతిపాద్యములైన విషయములను ప్రతిపాదించుట సంబంధము. వ్యాక రణ శాస్త్రము నధ్యయనముచేయు ప్రారంభకుఁడు అధికారి. ఇట్లిందనుబంధ చతుష్ట యము ప్రతిపాదింపఁబడినది.

ఈ గ్రంథము వ్యాకరణసిద్ధాంతములకు కౌముది=వెన్నెలవంటిది. వెన్నెలలో వస్తుజ్ఞానము, ఆహ్లాదము గలుగుట అనురెండు ప్రయోజనము లున్నట్లే ఈ గ్రంథా ధ్యయనముకూడ పాఠకునకు విషయజ్ఞానము నాహ్లాదపూర్వకముగా కలిగించునని గ్రంథకర్తయొక్క తాత్పర్యము. 'శుద్ధామ్' అనుటచే నిది దోషరహితమనియు, 'గుణ్యామ్' అనుటచే గుణసహితమనియు, 'లఘు' అనుటచే ప్రారంభకులకు కావలసిన ప్రాథమికాంశము లిందు చెప్పఁబడుచున్నవనియు, 'పాణినీయప్రవేశాయ' అనుటచే పాణినీయవ్యాకరణాధ్యయనమున కిది చక్కని మార్గమును జూపుననియు గ్రంథకర్తయొక్క యాశయము.

# అథ సంజ్ఞా ప్రకరణమ్

సూత్రములు : అ ఇ ఉ ణ్ (1), ఋ ఌ క్ (2), ఏ ఓ ఙ్ (3) ఐ ఔ చ్ (4) హయవరట్ (5), లణ్ (6), ఞమఙణనమ్ (7), ఝభఞ్ (8), ఘ ఢ ధ ష్ (9) జబగడదశ్ (10), ఖ ఫ ఛ ఠ థ చ ట తవ్ (11), కపయ్ (12), శషసర్ (13), హల్ (14).

వృత్తి : ఇతి మాహేశ్వరాణి సూత్రాణ్యణాది సంజ్ఞార్థాని, ఏషామన్త్యా ఇతః. లణ్ సూత్రేఽకారశ్చ. హకారాదిష్వకార ఉచ్చారణార్థః. హల్ వ్యంజనమ్.

అర్థము : ఇవి మాహేశ్వరసూత్రములు. అణ్ మొదలగుసంజ్ఞలు ప్రయోజనముగాఁగలవి. వీని యంత్యాక్షరములు ఇత్తులు. లణ్ సూత్రములోని అకారము కూడ ఇత్తు అగును. హకారాదులలోని అకారము ఉచ్చారణము ప్రయోజనము గాగలది. హల్లనఁగా వ్యంజనము.

వివరణము : పై పదునాలుగు సూత్రములను మాహేశ్వరసూత్రము లందురు. తాండవనృత్యసమయమున శివుఁడు పదునాలుగు పర్యాయములు ఢమరుకమును మ్రోగింపఁగా పై పదునాలుగు సూత్రము లేర్పడెనని యైతిహ్యము. ఇట్లు మహేశ్వరునినుండి వచ్చిన వగుటచే నివి మాహేశ్వరసూత్రము లనఁబడెను.

ఈ మాహేశ్వరసూత్రములవలన అణ్, అచ్, హల్ మున్నగు సంజ్ఞ లేర్పడును. అవి యెట్లేర్పడునో వాని ప్రయోజన మేమియో ముందు వివరింపఁ బడును.

వీనిలో చివరి ణ్, క్ మున్నగువర్ణములకు 'ఇత్' అనిపేరు. ఇధాతువు నకు పోవుట యనియర్థము. దానిపై కృత్ప్రత్యయ మొకటి చేరఁగా 'ఇత్' అయినది. అనగాపోవునది యనియర్థము. వ్యాకరణమున ప్రక్రియా సౌలభ్యమునకై కొన్నికార్యవిశేషములను సూచించు నక్షరములు ప్రత్యయాదులందు నిబద్ధములై యుండును. ప్రయోగించునపుడవిలోపించును. ఇట్లు దీనికి ఇత్–పోవునది – అను పేరు సార్థకము. ఏయే యక్షరముల కేయే సందర్భములందు ఇత్సంజ్ఞ కలుగునో సూత్రముఖమున ముందు నిర్దేశింపఁబడును.

'లణ్' సూత్రములోని అకారమునకుకూడ ఇత్సంజ్ఞ కలదు. ఇదికాక తక్కిన హకారాదులలోఁగల అకారమునకు సుఖమైన ఉచ్చారణము ప్రయోజనము.

అనఁగా హ్, య్, వ్, ర్ ఇత్యాదిగా పలుకుట కష్టము కావున వానిపై అకారము చేర్పఁబడినది. అపుడు హ, య, వ, ర ఇత్యాదిగా పలుకుట సుఖము.

హల్లు అనఁగా వ్యంజనము. హల్లు అనుదానికి వ్యుత్పత్త్యర్థము లేదు. అది కొన్ని అక్షరముల సమూహములో మొదటి; చివరి అక్షరములను గలిపి యుచ్చరింపఁగా నేర్పడిన సంజ్ఞ.

సూ : హలన్త్యమ్ 1-3 3.

వృ : ఉపదేశేఽన్త్యం హలిత్స్యాత్. ఉపదేశ ఆద్యోచ్చారణమ్. సూత్రేష్వదృష్టం పదం సూత్రాన్తరాదను వర్తనీయంసర్వత్ర.

ప. వి : హల్ (1-1), అన్త్యమ్ (1-1).

అనువృత్తి : ఉపదేశే (7-1) ఇత్ 1-1.

అర్థ : ఉపదేశమున అంత్యమైన హల్లు ఇత్తగును. ఉపదేశమనఁగా నాద్యులైన శివపాణిన్యాదుల యుచ్చారణము. (అనఁగా సూత్రాదికమని తాత్పర్యము) సూత్రమునందు కానరానిపదమును సూత్రాంతరమునుండి యనువర్తింపఁజేయవలయును.

వివ : సూత్రమున హల్, అన్త్యమ్ అను రెండుపదములు గలవు. అంత్యమైన హల్లు అని వానికర్థము. అటైన పైయర్థ మెట్లు వచ్చినది? ఈ వ్యాకరణ సూత్రములలో ఒక ప్రత్యేకలక్షణము గలదు. పాణిని వ్రాసినగ్రంథము అష్టాధ్యాయి. అనఁగా ఎనిమిది అధ్యాయములు గలగ్రంథము. ఒక్కొక్క అధ్యాయమున నాలుగుపాదములు (భాగములు) ఉండును. ఒక్కొక్కపాదమున కొన్నిసూత్రములుండును. ఈ సూత్రమునకు ప్రక్కనున్న 1-3-3 అనుదానిలో మొదటిది అధ్యాయసంఖ్యను రెండవది పాదసంఖ్యను, మూఁడవది సూత్రసంఖ్యను దెలుపును. 'హలన్త్యమ్' అనుసూత్రము మొదటియధ్యాయములో మూఁడవపాదములో మూఁడవసూత్రమని యర్థము. ఇట్లీ సూత్రములకుఁగల స్థానమునకును ఒక ప్రత్యేకతగలదు. అష్టాధ్యాయి క్రమములో ఒకసూత్రమునఁగలపదము అవసరమును బట్టి ముందుసూత్రములలోనికి వర్తించి యా సూత్రములను అర్థవంతములఁ జేయును. ఇట్లు కొన్నిపదములు ముందుసూత్రములలోనికి వర్తించుటను 'అనువృత్తి' అందురు. ఉదాహరణమునకు ప్రకృతసూత్రములోనికి 1-3 2 నుండి ఉపదేశే, ఇత్ అనుపదములు వచ్చి చేరును. అప్పుడు సూత్రార్థము సమగ్రమగును. ఈ పద్ధతి యీ వ్యాకరణమున సాధారణముగ నంతటను గన్పట్టు నను

టను "సూత్రేష్వదృష్టం .... ...." ఇత్యాదివృత్తి వాక్యము వివరించుచున్నది. సూత్రములో కన్పడని పదములు పైసూత్రములనుండి యనువర్తింపబడును. ఇది అన్నియెడలను జరుగవచ్చును. అని పై సంస్కృత వాక్యమున కర్థము.

మఱియు ఈయనువృత్తి యవసరమును బట్టియుండును. ఎట్లన 'ఉపదేశేఽజనునాసిక ఇత్' (1-3-2) అనుసూత్రమునుండి అచ్, అనునాసికః అనుపదము లీ సూత్రములోనికి రావు. వానియవసరమిటలేదు.

ఈ సూత్రము ఉపదేశములోని చివరిహల్లునకు 'ఇత్' అను సంజ్ఞను విధించెను. ఇత్సంజ్ఞలకు ప్రయోజనము లుండును. అవి ముందు ముందు వివరింపఁబడును. ఉపదేశమనగా నాద్యుల ఉచ్చారణము. ఆద్యులనఁగా ఈ శాస్త్రమును ప్రవర్తింపఁజేసిన శివుఁడు పాణిని మున్నగువారు. వారిగ్రంథములలో విధింపఁబడిన ప్రత్యయాదులిట ఉపదేశపదముచే గ్రహింపనగును. కావున నట్టి వానిలో అంత్యమైన హల్లు ఇత్తగునని సూత్రతాత్పర్యము. దీనివలన అఇఉణ్, ఋ ఌ క్ మున్నగు పదునాలుగుసూత్రములలోని అంత్యములగు హల్లులయిన ణ్, క్, మున్నగు పదునాల్గింటికి ఇత్తులను పేరు గలుగుచున్నది. ణకారకకారాదులు ఎచట నున్నను వానికి ఇత్సంజ్ఞ సిద్ధింపదు. అవి యుపదేశమునందు అంతముననుండి నపుడే ఈ సూత్రముచే ఇత్సంజ్ఞకలవియగును. కనుక జలముక్, సుగణ్ మున్నగు వానిలోని కకారణకారము లిత్తులు కావని గ్రహింపనగును.

మాహేశ్వరసూత్ర వివరణములో ఇత్తుస్వభావము వివరింపఁబడినది. ఆ సూత్రముల వృత్తిలో 'ఏషామన్త్యాఇతః' అను వాక్యమునకీ సూత్రమే ఆధారము.

అవ : ఇత్సంజ్ఞకలదానికి లోపము కలుగునని ముందున్న 'తస్యలోపః, అను సూత్రము చెప్పుచున్నది. కావున లోపమనగా నేమో మొదట చెప్పఁబడుచున్నది.

సూ : అదర్శనం లోపః (1-1-60)

వృ : ప్రసక్తస్యాదర్శనం లోపసంజ్ఞంస్యాత్.

ప. వి : అదర్శనం (1-1) లోపః (1-1).

అర్థ : ప్రసక్తమైనది కన్పడకుండుటకు లోపమనిపేరు.

వివ : లోపమనునొక వ్యాకరణసంజ్ఞ ఈ సూత్రముచే చెప్పఁబడుచున్నది. ప్రసక్తమైనది - అనగా శాస్త్రమువలన వినఁబడవలసినది లేక కనఁబడవలసినది - వినఁబడకుండుట లేక కనఁబడకుండుట అనుదానికి లోపమనిపేరు. ఉదాహరణము ముందు చూపఁబడును.

సూ : తస్యలోపః (1-3-9).

వృ : తస్యేతోలోపఃస్యాత్. ణాదయోఽణాద్యర్థాః.

వ. వి : తస్య (6-1), లోపః (1-1).

అర్థ : ఆ ఇత్సంజ్ఞ కలదానికి లోపము వచ్చును. ణాదులు అణ్ మున్నగు వాని సిద్ధి ప్రయోజనముగాఁగలవి.

వివ : 1 వ అధ్యాయము, మూఁడవపాదము, రెండవసూత్రము మొదలు కొని 8 వ సూ. వఱకు ఏయే యక్షరములకేమే సందర్భములలో ఇత్సంజ్ఞకలుగునో చెప్పఁబడినది. ఇది తరువాతి సూత్రము. తస్య అనగా 'దానికి' అని అర్థము. 'దానికి' అనగా పై సూత్రములచే విధింపబడిన ఇత్సంజ్ఞగల యక్షరమునకు అని తాత్పర్యము. లోపమనగా కనఁబడకుండుట అని పైని జెప్పబడినదిగదా: కాన ఇత్సంజ్ఞ కలది యదృశ్యమగునని సూత్రార్థము.

ఇచ్చట నొకవిషయము నాలోచింపవలయును. ఒక యక్షరమునకు ఇత్తని పేరుపెట్టి లోపంపఁ జేసినందువలనఁ గలిగెడు ప్రయోజనమేమి? అనగా, ఇత్తులకు ప్రయోజనములు గలవు. ఆ ప్రయోజనములను సూచించి ఆ అక్షరములు లోపించును.

ఇత్సంజ్ఞలు నూతనాగంతుకునకు గృహమును చూపుబాలురవంటి వనుకొందము. బాలుఁడు కావలసిన గృహమువఱకు వచ్చి ఆ వ్యక్తికి చూపి తాను వెనుదిరిగి పోవును. వ్యక్తి గృహములోని కేగును. ఈ విషయము ముందుదాహరణములలో ఇంకను స్పష్టము చేయఁబడును.

'అఇఉణ్' మున్నగు పదునాలుగు సూత్రములోని తుది హల్లులు ఇత్తులు. వాని ప్రయోజనమును 'ణాదయోఽణాద్యర్థాః' అను వాక్యమున వృత్తికారుఁడు వివరించెను అనగా ఆ సూత్రముల చివరిణకారాదులు అణ్, అచ్ మున్నగు సంజ్ఞల నేర్పఱచుట కొఱకని ఈ వాక్యమున కర్థము. అణ్ మున్నగునవి యెట్లేర్పడునో ముందు సూత్రమునఁ జెప్పఁబడును.

సూ : ఆదిరన్త్యేన సహేతా (1-1-71),

వృ : అన్త్యేనేతా సహిత ఆదిర్మధ్యగానాం, స్వస్యచ సంజ్ఞాస్యాత్. యథా - అణితి అఇఉ వర్ణానాం సంజ్ఞా. ఏవమచ్, హల్, అల్ ఇత్యాదయః.

అయమేవ ప్రత్యాహారః. అత్రేతాం న గ్రహణమ్. అనునాసిక ఇత్యాది నిర్దేశాత్.

ప. వి : ఆదిః (1-1), అన్త్యేన (3-1), సహ (అవ్య) ఇతా (3-1),

అను : స్వమ్ (1-1).

అర్థము : అంత్యమైన ఇద్వర్ణముతో కూడిన ఆదివర్ణము మధ్యనున్న వానికిని, తనకును సంజ్ఞయగును. ఎట్లనగా అణ్ - ఇది అ ఇ ఉ వర్ణములకు సంజ్ఞ. ఇట్లే అచ్, హల్, అల్ మొదలగునవి. ఇదియే ప్రత్యాహారము. అనునాసిక ఇత్యాది నిర్దేశమువలన ప్రత్యాహారములందు ఇద్వర్ణములకు గ్రహణము లేదు.

వివ : అఇఉణ్ ఇత్యాది సూత్రముల చివరి ణకారాదు లిత్తులగుటకు ప్రయోజనము చెప్పబడుచున్నది. చివరిదగు ఇద్వర్ణముతో కూడిన ఆదివర్ణము మధ్యనున్న వర్ణములకును, తనకును సంజ్ఞ యగును. అ ఇ ఉ ణ్ సూత్రము లోని ణకారము 'హలన్త్యమ్' అను సూత్రముచే ఇత్తగును. దానితోకూడిన మొదటివర్ణమగు అకారము అనగా 'అణ్' అనునది మధ్యనున్న ఇ, ఉలను, తన్ను అనగా అకారమును బోధించును. అణ్ అనగా అ ఇ ఉ లకు సంజ్ఞ యని భావము. ఇట్లే 'ఐ ఔ చ్' లోని చకారముతో అకారమును కలిపి యుచ్చరించినచో 'అచ్' అను సంజ్ఞ యేర్పడి అది అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ అను వర్ణములను

ఇట్టి సంజ్ఞలను చేయుటలో ఆదివర్ణముగా ఇత్సంజ్ఞకమునుగాక దేనినైనను గ్రహింపవచ్చును. అంత్యవర్ణము మాత్రము తప్పక ఇత్సంజ్ఞకమై యుండవలయును.

ఇట్లు ఐదవ సూత్రము మొదటి హకారమును, 14 వ సూత్రముయొక్క తుది లకారముతో కలుపగా 'హల్' అయినది. ఇది మధ్యనున్న యవరలమున్నగు వానికిని, హకారమునకును సంజ్ఞయగును. అట్లే మొదటి అకారముతో చివరి లకారమును గలుపగా 'అల్' అగును. అది ఏవర్ణమునైన బోధించును. లేదా అన్ని వర్ణములను బోధించును. ఇట్లు అచ్, హల్, అల్, ఇణ్, యర్, ఝయ్మున్నగు సంజ్ఞలెన్నియో యేర్పడును. కాని ఈ మాహేశ్వర సూత్రమువలన నేర్పడిన యిట్టి సంజ్ఞలను నలువది నాలిగింటిని మాత్ర మీ వ్యాకరణమున పాణిని యుపయోగించెను. ఈ సూత్రముచే నేర్పడిన ఇట్టి సంజ్ఞలకు ప్రత్యాహారము లనిపేరు. వర్ణాదులు ప్రత్యాహరింపబడి = సంక్షేపింపఁబడి ఇందు చెప్పఁబడును గనుక ఇది అన్వర్థ సంజ్ఞ.

ఈ ప్రత్యాహారములలో ఇత్తులను గ్రహింపరాదు. అనగా 'అచ్' అను ప్రత్యాహారములో ణ్, క్, ఙ్, చ్ అనునవియు మనకు కన్పట్టును. కాని అవి అచ్చులు కావు. అవి ఇత్తులు గనుక వానికి ప్రత్యాహారములో గ్రహణము లేదని 'అత్రేతాం న గ్రహణం' అను వృత్తివాక్యము చెప్పుచున్నది. దీనికి ప్రమాణమేమి ? పాణిని 'అనునాసిక' అని నిర్దేశించినందువలన పై యంశము నిరూపింపఁబడుచున్నది. అను నాసా+క అని యీ శబ్దముయొక్క మొదటి స్థితి. సా లోని ఆకారమునకు ఇత్వము వచ్చి 'అనునాసి+క' అగును. ఋ ఌ క్ లోని కకారమును గూడ అచ్ ప్రత్యాహారములో గ్రహించినయెడల కకారము అచ్చగును. ఇకారమునకు అసవర్ణమైన అచ్చు పరమగునపుడు యణాదేశము రావలయును. అది యిచట రాలేదు. అనగా పాణిని కకారమును అచ్చు అనుకొన లేదన్నమాట. అచ్ ప్రత్యాహారములో నున్నది అచ్చుకాకుండుట యెట్లు ? అది అందున్నను ఇత్తు కనుక దానిని గ్రహింపరాదను పాణిని యుద్దేశమీ 'అనునాసిక' అనుశబ్దము నతడు ప్రయోగించుటచే తెలియ వచ్చినది. కావున దీని నాధారముగ కైకొని ప్రత్యాహారములలో నిద్వర్ణములకు గ్రహణము లేదను నంశము నిర్ణయింపఁ బడెను. కనుక అచ్ అనగా అ ఇ ఉ (ణ్) ఋ ఌ (క్), ఏ ఓ (ఙ్) ఐ ఔ (చ్) – అను వర్ణములు మాత్రమే. ణ్, క్, ఙ్, చ్ వర్ణములు అచ్చులు కావు. అని ఫలితారము.

ప్రారంభస్థితిలో నున్నవారి సౌకర్యార్థము ఈ వ్యాకరణమున వాడఁబడిన ప్రత్యాహరము లిట ప్రదర్శింపఁబడుచున్నవి. వీనిని మాహేశ్వరసూత్రముల నాధారముగఁ గొని యభ్యసించుటయే యుక్తము. అట్లు చేసినచో విషయము దృఢపడును.

| క్ర. సం. | ప్రత్యాహారము – | అందలి వర్ణములు |
|---|---|---|
| 1 | అణ్ – | అ ఇ ఉ |
| 2 | అక్ – | అ ఇ ఉ ఋ ఌ |
| 3 | ఇక్ – | ఇ ఉ ఋ ఌ |
| 4 | ఉక్ – | ఉ ఋ ఌ |
| 5 | ఏఙ్ – | ఏ ఓ |
| 6 | అచ్ – | అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ |
| 7 | ఇచ్ – | ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ |
| 8 | ఏచ్ – | ఏ ఓ ఐ ఔ |

| క్ర. సం | ప్రత్యాహారము | అందలి వర్ణములు |
|---|---|---|
| 9 | ఐచ్ | ఐ ఔ |
| 10 | అట్ | అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర |
| 11 | అణ్ (లణ్ సూత్రములోని ణకారముతో) | అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర ల |
| 12 | ఇణ్ ( ,, ) | ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర ల |
| 13 | యణ్ | య వ ర ల. |
| 14 | అమ్ | అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర ల ఞ మ ఙ ణ న |
| 15 | యమ్ | య వ ర ల ఞ మ ఙ ణ న |
| 16 | ఞమ్ | ఞ మ ఙ ణ న |
| 17 | ఙమ్ | ఙ ణ న |
| 18 | యఞ్ | య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ |
| 19 | ఝష్ | ఝ భ ఘ ఢ ధ |
| 20 | భష్ | భ ఘ ఢ ధ |
| 21 | అశ్ | అ ఇ ఉ ఋ ఌ ఏ ఐ ఓ ఔ హ య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద |
| 22 | వశ్ | వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద |
| 24 | ఝశ్ | ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద |
| 25 | జశ్ | జ బ గ డ ద |
| 26 | బశ్ | బ గ డ ద |
| 27 | ఛవ్ | ఛ ఠ థ చ ట త |
| 28 | యయ్ | య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప |

| క్ర. సం | ప్రత్యాహారము | అందలి వర్ణములు |
|---|---|---|
| 29 | మయ్ | మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప |
| 30 | ఝయ్ | ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప |
| 31 | ఖయ్ | ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప |
| 32 | చయ్ - | చ ట త క ప |
| 33 | యర్ - | య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స |
| 34 | ఝర్ - | ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స |
| 35 | ఖర్ - | ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స |
| 36 | చర్ - | చ ట త క ప శ ష స |
| 37 | శర్ - | శ ష స |
| 38 | అల్ - | వర్ణము లన్నియు |
| 39 | హల్ - | హ య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ |
| 40 | వల్ | వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ |
| 41 | రల్ | ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ స హ |
| 42 | ఝల్ | ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ |
| 43 | శల్ | శ ష స హ |

| క్ర. సం. | ప్రత్యాహారము – | అందలి వర్ణములు |
|---|---|---|
| 44 | ర – | లణ్ సూత్రములోని అకారమునకు ఇత్సంజ్ఞ కలదని చెప్పికొని యుంటిమి. (హయవ) రట్ ల (ణ్) దీనిచే 'ర' ప్రత్యాహార మేర్పడి రలలకు సంజ్ఞ యగును. |

ఈ ప్రత్యాహార గణన విషయమున బాల మనోరమా వ్యాఖ్యలో ఈ క్రింది శ్లోకము కానవచ్చును.

స్యాదేకో ణ ఞ ణ వ టైః షేణ ద్వౌ త్రయ ఇహ కణాభ్యామ్.
చత్వారశ్చ చమాభ్యాం పఞ్చ యరాభ్యాం శలాభ్యాం షట్.

ణ ఞ ణ వ ట – వీనితో నొక్కొక్కటి (5) షకారముతో రెండు (2) కకార (పర) ణకారములతో మూఁడేసి (6), చకార మకారములతో నాలుగేసి (8), యకార రేఫములతో నైదేసియు (10) శకార లకారములతో నారేసియు (12) మొత్తము నలుబదిమూడును, ర ప్రత్యాహార మొక్కటియు నెరసి నలుబది నాలుగు.

అవ : అచ్చులకుఁగల భేదములు చెప్పఁబడుచున్నవి.

సూ : ఊకాలో ఽజ్ఘ్రస్వ దీర్ఘప్లుతః (1-2-27).

వృ : ఉశ్చ ఊశ్చ ఊ3శ్చ వః. వాం కాల ఇవకాలో యస్య సో ఽచ్ క్రమాత్ హ్రస్వదీర్ఘప్లుత సంజ్ఞ స్స్యాత్. స ప్రత్యేక ముదాత్తాది భేదేన త్రిధా.

ప వి : ఊకాలః (1-1) అచ్ (1-1) హ్రస్వదీర్ఘ ప్లుతః (1-1).

అర్థ : ఉ, ఊ, ఊ3 – వీని యుచ్చారణ కాలమువంటి కాలముగల అచ్చు క్రమముగా హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అనుపేర్లు గలదగును. అది మరల ఉదాత్తాది భేదముచే ఒక్కొక్కటి మూడు విధములు.

వివ : 'ఆదిరన్త్యేన సహేతా' అను సూత్రము వలన 'అచ్' అను నొక ప్రత్యాహార మేర్పడుచున్నది. ఇందు అ ఇ మున్నగు నేకమాత్రాకాలికోచ్చారణము గల వర్ణములును, ఏ ఓ వంటి ద్విమాత్రాకాలికోచ్చారణముగలవియును మాత్రమే కన్పట్టుచున్నవి. భాషలో ఇతరములైన రెండుమూడు మాత్రలు గల వర్ణములు గలవు కదా ! అట్టి ఆ ఆ3 వంటి వర్ణములు అచ్చులగునా ? కావా ? వాని నిట పేర్కొనలేదేమి? అను సంశయము కలుగును. కావున నీ సూత్రముచే అచ్చు

లలో గల భేదములు కొన్ని చెప్పఁబడుచున్నవి. ఈ సూత్రమున ఉకారము వేర్వేఱు కాలప్రమాణములు గల మూడు భేదములతో నున్నది. అందు మొదటిది ఏకమాత్రా కాలికము (మాత్రాకాలికమనగా చిటికె వేయుటకు లేదా ఱెప్ప వేయుటకు పట్టునంతకాలము) రెండవది రెండుమాత్రలకాలము గలది, మూడవది మూడు మాత్రల కాలము గలది. కావున ఏకమాత్రా కాలికమైన ఉకారముయొక్క ఉచ్చారణకాలమువంటి ఉచ్చారణకాలముగల అచ్చు హ్రస్వమనఁబడును. ద్విమాత్రా కాలికమైన ఊ కారముయొక్క ఉచ్చారణ కాలమువంటి ఉచ్చారణకాలము గల అచ్చు దీర్ఘ మనఁబడును. త్రిమాత్రాకాలికమైన ఊ3కారముయొక్క ఉచ్చారణమువంటి ఉచ్చారణకాలముగల అచ్చు ప్లుత మనఁబడును. ప్లుతమునకు '3' అను చిహ్నము నుంతురు. కావున అచ్చులలో సాధారణముగ నొక్కొక్కటి మూడేసి విధములు కావచ్చునని స్పష్టమైనది. అ ఇ ఉ ఋ ఌ – హ్రస్వములు – ఆ ఈ ఊ ౠ ఏ ఓ ఐ ఔ – దీర్ఘ ములు. ఆ3 ఈ3 ఊ3 ౠ3 ౡ3 ఏ3 ఓ3 ఐ3 ఔ3 ప్లుతములు.

ఈ సూత్రమున మొదటిదగు అకారమును కాక మూడవది యగు ఉకారమును గ్రహించుటలో కోడికూతలోని ఉచ్చారణ సామ్యమును ప్రమాణముగా గ్రహింపవచ్చునను తాత్పర్యము గలదని విజ్ఞులందురు. కు కుక్కురూ కూ 3 – అను మూడు విఱుపులును క్రమముగా హ్రస్వదీర్ఘప్లుతముల కాల పరిమాణమును సూచించును.

ఇట్లు మూడు విధములైన అచ్చు మరల నొక్కొక్కటియు ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము అను మూడేసి భేదములను గలిగియున్నది.

అవ : ఈ క్రింది మూడు సూత్రములలో నుదాత్తానుదాత్తస్వరితములు నిర్వచింపఁబడుచున్నవి.

సూ : ఉచ్చై రుదాత్తః 1-2-29.

ప. వి : ఉచ్చైః (అవ్యయము) ఉదాత్తః (1-1).

అను : అచ్ (1-1).

వివ : ముఖము నందొక్కొక్కభాగము కొన్ని కొన్ని వర్ణములకు ఉత్పత్తి స్థానము. కంఠము, తాలువు, మూర్ధము, దంతములు, ఓష్ఠములు మున్నగునవి వర్ణోత్పత్తిస్థానములు. ఉచ్చైః అనగా ఊర్ధ్వభాగమని యర్థము. కంఠము, తాలువు మున్నగు వర్ణోత్పత్తిస్థానముల పైభాగమునుండి వెలువడిన అచ్చు ఉదాత్త మనఁబడును.

సూ : నీచైరనుదాత్తః 1-2-30

ప. వి : నీచైః (అవ్య) అనుదాత్తః (1-1).

అను : అచ్ (1-1).

వివ : వర్ణోత్పత్తి స్థానముయొక్క క్రిందిభాగమునుండి వెలువడిన యచ్చు అనుదాత్త మనఁబడును.

సూ : సమాహారః స్వరితః 1-2-31

ప. వి : సమాహారః (1-1) స్వరితః (1-1)

అను : అచ్ (1-1).

వివ : ఉదాత్తానుదాత్త వర్ణధర్మములు కూడియున్న అచ్చు స్వరిత మన బడును. ఉదాత్తవర్ణధర్మ మనగా వర్ణోత్పత్తిస్థానము యొక్క పైభాగమునుండి పుట్టుట. అనుదాత్తవర్ణధర్మ మనగా క్రిందిభాగమునుండి పుట్టుట. ఇవి రెండును గలసిన యెడల నది స్వరితమనఁబడును.

ఈ యుదాత్తానుదాత్తస్వరిత భేదములు వేదభాషలో అధికముగా కన్పట్టును.

ఇట్లొక యచ్చు హ్రస్వదీర్ఘ ప్లుతభేదముచే మూడై మరల నొక్కొక్కటి యును నుదాత్తానుదాత్త స్వరితభేదములతో మూడేసి కాగా మొత్తము తొమ్మిది భేదము లేర్పడుచున్నవి.

వృ : స నవవిధోఽపి ప్రత్యేకమనునాసికాననునాసికత్వాభ్యాం ద్విధా.

వివ : ఈ తొమ్మిదియు మరల నొక్కొక్కటి అననునాసికము అనునాసికము అని రెండేసి విధములగుచున్నది.

అవ : అనునాసికత్వము నిర్వచింపఁబడుచున్నది.

సూ : ముఖనాసికా వచనోఽను నాసికః 1-1-8.

వృ : ముఖ సహిత నాసిక యోచ్చార్యమాణో వర్ణోఽనునాసిక సంజ్ఞః స్యాత్.

ప. వి : ముఖనాసికావచనః (1-1) అనునాసికః (1-1).

అర్థము : ముఖముతో కూడిన నాసికతో నుచ్చరింపఁబడు వర్ణము అనునాసిక మగును.

వివ : వర్ణముల పుట్టుకకు నోటిలో కంఠము, తాలువు మున్నగుస్థానములు గలవని 'ఉచ్చైరుదాత్తః' అను సూత్రవివరణమున వ్రాయఁబడినది. ఆ కంఠము మున్నగుస్థానముతోకూడిన నాసికతో ఉచ్చరింపబడువర్ణము అనునాసికమగును.

ఉదా : అఁ - అకారమునకు కంఠము స్థానము. దానితోపాటు నాసికకూడ స్థానమైన యెడల నీ వర్ణము అనునాసికమగును. నాసికాస్థానములేని 'అ' వర్ణము అననునాసికము. అచ్చులన్నియు నిట్లు అనునాసికములనియు, అననునాసికములనియు రెండేసి విధములగుచున్నవి.

ఇట్లొక్కొక్క అచ్చు పదునెనిమిది భేదములు గలిగియున్నట్లు తెలిసినది. కాని అచ్చులలో కొన్నింటికి హ్రస్వభేదము లేదు. కొన్నింటికి దీర్ఘము లేదు. దానిని బట్టి యేయే యచ్చున కెన్ని భేదము లేర్పడుచున్నవో సకారణముగ వృత్తికారుఁడు వివరించుచున్నాఁడు.

వృత్తి : తదిత్థమ్ - అ ఇ ఉ ఋ - ఏషాం వర్ణానాం ప్రత్యేక మష్టాదశ భేదాః. ఌవర్ణస్య ద్వాదశ. తస్య దీర్ఘాభావాత్. ఏచామపి ద్వాదశ. తేషాం హ్రస్వాభావాత్.

అర్థ : సారాంశ మిది - అ ఇ ఉ ఋ వర్ణములకు ఒక్కొక్కదానికి పదునెనిమిది భేదములు. ఌ వర్ణమునకు దీర్ఘము లేని కారణమున పండ్రెండు భేదములు. ఏచ్చులకు హ్రస్వము లేనందువలన నొక్కొక్కదానికి పండ్రెండేసి భేదములు.

వివ : 'ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః' అనునది మొదలుకొని ఈ సూత్రము వఱకుఁగల విషయముయొక్క సారాంశము నీ వృత్తి వాక్యములు వివరించుచున్నవి. హ్రస్వము, ఉదాత్తానుదాత్తస్వరితభేదములతో మొదట మూడై, అనునాసిక అననునాసిక భేదములతో మఱల అందొక్కొక్కటి రెండై, ఆఱు విధములగుచున్నది. ఇట్లే దీర్ఘమున కాఱు, ప్లుతమున కాఱు మొత్తము పదునెనిమిది భేదము లేర్పడును. ఇట్లు హ్రస్వ దీర్ఘప్లుత భేదములు మూడును గల అ ఇ ఉ ఋ అనువానికి పదునెనిమిదేసి భేదములు. దీర్ఘములు, దీర్ఘములేని ఌ వర్ణమునకు పండ్రెండు భేదములు. (దీర్ఘ భేదము లాఱు తక్కువయగును) (హ్రస్వములేని ఏ ఓ ఐ ఔ లకును పండ్రెండేసి భేదములే (హ్రస్వ భేదములాఱు తగ్గును.)

ఈ పదునెనిమిది భేదముల నీ క్రింది విధముగ వ్యవహరింప వచ్చును.

(i) హ్రస్వము : (1) అనునాసికోదాత్త హ్రస్వము (2) అనునాసికానుదాత్త హ్రస్వము. (3) అనునాసిక స్వరిత హ్రస్వము (4) అననునాసికోదాత్త

హ్రస్వము. (5) అనను నాసికానుదాత్త హ్రస్వము (6) ననునాసిక స్వరిత హ్రస్వము.

ii దీర్ఘము : (7) అనునాసికోదాత్తదీర్ఘము (8) అనునాసికానుదాత్త దీర్ఘము (9) అనునాసిక స్వరితదీర్ఘము (10) అననునాసికోదాత్త దీర్ఘము. (11) అనను నాసికానుదాత్త దీర్ఘము (12) అననువాసిక స్వరితదీర్ఘము.

iii ప్లుతము : (13) అనునాసికోదాత్త ప్లుతము (14) అనునాసికానుదాత్త ప్లుతము (15) అనునాసిక స్వరిత ప్లుతము (16) అననునాసికోదాత్త ప్లుతము (17) అననునాసికానుదాత్త ప్లుతము (18) అననునాసిక స్వరిత ప్లుతము.

అవ : మాహేశ్వరసూత్రములలోని ఒక అకారము తక్కిన పదునేడువిధము లగు అకారములను ఎట్లు గ్రహించును? అనఁగా అవి అచ్చులగుట యెట్లు? అను ప్రశ్నకు సమాధానముగా "అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః" అనుసూత్రమును వ్యాఖ్యానింపఁ బూనుకొని యందలి సవర్ణపద నిర్వచనమునకై యీ క్రింది సూత్ర మును వృత్తికారుడు గ్రహించుచున్నాఁడు.

సూ : తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్ 1-1-9.

వృ : తాల్వాది స్థాన మాభ్యంతర ప్రయత్నశ్చేత్యేతద్వయం యస్యయేన తుల్యం తన్మిథ స్సవర్ణ సంజ్ఞంభవతి.

వ. వి : తుల్యాస్యప్రయత్నమ్ (1-1) సవర్ణమ్ (1-1),

అర్థ : తాలువు మున్నగు స్థానము, ఆభ్యంతరప్రయత్నము ఈ రెండును ఏ వర్ణమున కేవర్ణముతో తుల్యముగా నుండునో యవి రెండు నొకదానికొకటి సవర్ణము లగును.

వివ : ఏదేని అర్థములను తెలుపఁగోరిన బుద్ధితో కూడిన మానవుని యాత్మ మనస్సును చేరును. ఆ మనస్సు శరీరములో నున్న అగ్నిని ప్రజ్వలింపఁజేయును. ఆ అగ్నివాయువును ప్రేరించును. అట్లు ప్రేరితమైన వాయువు ముఖావయవ ములో కంఠము తాలువు మున్నగుచోటులందు తాకుటచే భిన్నభిన్నమైన ధ్వను లుత్పన్న మగును. ఈ విషయమును స్పష్టము చేసికొనుటకు 'హార్మోనియమ్' పెట్టెను పోలికగా తీసికొనవచ్చును. పెట్టెకు ముందుభాగముననుండు గాలితిత్తి లోపల గాలిని పూరించును. ఒక్కొక్కమీట నొక్కినపుడు గాలి అందుండి వెలు వడి ఒక్కొక్కధ్వనిని పుట్టించును. అట్లే అక్షరముల పుట్టుకయు జరుగుచున్నది. ఇట్లు నాభినుండి ఉత్పన్నమైన వాయువు ముఖావయవములో నెచ్చట తాకుటచే నొక

వర్ణముత్పన్నమగునో యాచోటును ఆ వర్ణమునకు స్థానమందురు. సూత్రము నందలి 'ఆస్య' పదమునకు స్థానమని యర్థము. ఆస్యమనగా ముఖమని అర్థము. అందున్న తాలువు, కంఠము, మూర్ధము మున్నగునవియు ఆస్యములే యనఁబడును. ఉదాహరణమునకు పవర్గము నుచ్చరించునపుడు పెదవులయందు గాలి తాకును. కావున పవర్గమునకు ఓష్ఠములు స్థానమనిభావము.

కాని వర్ణోత్పత్తికి స్థానమొక్కటియున్న చాలదు. తనకు నిర్దేశించిన భోజన పదార్థమును తినుటకు చేయి యున్నంత మాత్రమున భుజించుట అను పనిజరుగదు. చేతిని పదార్థమువైపు ప్రసరింపఁజేసి పైకి తీసికొని, నోటిలో నుంచుకొని నమలి మ్రింగవలయును. ఈ కార్యజాతము నంతటిని 'యత్నము' అని వ్యవహరింతము. అట్లే అక్షరోత్పత్తికి కూడ యత్నమవసరము. పవర్గమును పలుకఁ దలచినపుడు ఓష్ఠములు రెండును ఒకదానికొకటి కలిసి విడివడుట అను క్రియాజాతము జరుగ వలయును. దీనినే యత్నమందురు. ఇది రెండు విధములు. అధికమైన యత్న మును ప్రయత్నమందురు.

ప్రతివర్ణమునకు స్థానము, ప్రయత్నము రెండు నుండును. ఏవేని రెండు వర్ణములకు స్థానము ప్రయత్నము సమానముగా నున్నచో ఆ రెండు వర్ణ ములను పరస్పరము సవర్ణము లందురు. ఉదాహరణకు ప ఫ – ఈ రెంటికిస్థానము పెదవులు – ప్రయత్నము స్పృష్టము అనునది. కావున నివి రెండును పరస్పరము సవర్ణములు.

స్థాన సామ్య మొక్కటియేకాని ప్రయత్న సామ్య మొక్కటియే కాని సవర్ణ తను గలిగింపఁ జాలవు.

ఈ వ్యాకరణమున నీ సవర్ణతను దెలియుట చాల అవసరము. అనేక సంద ర్భములలో దీనిప్రసక్తియుండును.

సవర్ణతను దెలియవలయునన్న ఏయే వర్ణముల కేవి యేవి స్థానములో ఏవి యేవి ప్రయత్నములో తెలియవలయును. కావున వృత్తికారులు వర్ణముల స్థానము లను పేర్కొనుచున్నారు.

వృత్తి : అకుహ విసర్జనీయానాం కణ్ఠః.
ఇచుయశానాం తాలు.
ఋటురషాణాం మూర్ధా.
ఌతులసానాం దంతాః.

ఉపూపధ్మానీయా నామోష్ఠౌ.

ఞ మ ఙ ణ నానాం నాసికాచ.

ఏదైతోః కణ్ఠతాలు.

ఓదౌతోః కంఠోష్ఠమ్.

వకారస్య దంతోష్ఠమ్.

జిహ్వామూలీయస్య జిహ్వామూలమ్.

నాసికానుస్వారస్య.

అర్థము : అ, కవర్గము, హ, విసర్గము – వీనికి కంఠము స్థానము. ఇ, చ వర్గము, య, శ – వీనికి తాలువు స్థానము ఋ, టవర్గము, ర, ష – వీనికి మూర్ధము స్థానము. ఌ, తవర్గము, ల, స–వీనికి దంతములు స్థానము. ఉ, పవర్గము, ఉపధ్మానీయము (ᳶ ప, ᳶ ఫ) వీనికి – ఓష్ఠములు (పెదవులు) స్థానము. ఞ మ ఙ ణ న – వీనికి నాసికకూడ స్థానము. ఏ ఐ లకు కంఠము తాలువు రెండును స్థానములు. ఓ ఔ లకు కంఠము ఓష్ఠము స్థానములు. వకారమునకు దంతములు ఓష్ఠములు స్థానములు. జిహ్వామూలీయమునకు (ᳵ క, ᳵ ఖ) జిహ్వామూలము స్థానము. అనుస్వారమునకు (సున్నకు) నాసిక స్థానము.

వివ : పై వాక్యములలో కు, చు, టు, తు, పు అనునవి వరుసగా క చ ట త ప వర్గములను బోధించును (కవర్గను క ఖ గ ఘ ఙ. ఇట్లే తక్కినవియును) అ ఇ ఉ మున్నగు నచ్చులు వానివానికిఁగల దీర్ఘ ఉదాత్త అనునాసికాది భేదములను బోధించును. తాలువనగ లోదవుడ. దీనినే కాకుదమనియు నందురు. మూర్ధమనగా నాలుకకు పై భాగమున లొట్టవేయునపుడు నాలుకపోయి తగులు పుటాకార భాగము. జిహ్వామూలీయమనగా నాలుకయొక్క లోపలికొన. జిహ్వామూలీయ ఉపధ్మానీయములు ముందు వివరింపఁబడును. కంఠమునఁ బుట్టువర్ణములను కంఠ్యములందురు. అట్లే తాలువున బుట్టునవి తాలవ్యములు. మూర్ధమునఁ బుట్టునవి మూర్ధన్యములు. దంతమునఁబుట్టునవి దంత్యములు. ఓష్ఠమునఁబుట్టునవి ఓష్ఠ్యములు. కంఠోష్ఠజన్యములు కంఠోష్ఠ్యములు. దంతోష్ఠస్థానము కలది దంతోష్ఠ్యము. జిహ్వామూలమునఁబుట్టునది జిహ్వామూలీయము. నాసిక యందుఁబుట్టునది నాసిక్యము.

ఇట్లు స్థానములు వివరింపబడిన పిదప యత్నము వివరింపబడుచున్నది,

వృత్తి : యత్నోద్విధా. ఆభ్యంతరో బాహ్యశ్చ.

అర్థము : యత్నము, ఆభ్యంతరము, బాహ్యమునని రెండువిధములు.

వివ : వర్ణముపుట్టుటకు స్థానముతోపాటు కొంత యత్నముకూడ కావలయునని గుర్తింపతగును. నాలుక కొన, నడిమి ప్రదేశము క్రిందిపెదవి మున్నగునవి కదలి స్థానమును స్పృశించుట, కొంచెము స్పృశించుట మున్నగు ప్రక్రియ యంతయు ముఖావయవములలో జరుగుచుండును. లోపల జరుగునదికాన దీనిని ఆభ్యంతరమందురు. ఈ స్థానమును స్పృశించుట మున్నగు వ్యాపారము లేక స్థానమునకు బహిర్భాగమున కలుగు ప్రాణమను వాయువు ప్రతిహతమై, నివృత్తమై వర్ణవ్యక్తికి కారణమగుట తోడ్పడుచున్నది. కావున నట్లు జరుగుయత్నమును బాహ్యమందురు. ప్రయత్నమనగా నాభ్యంతరమనియు, యత్నమనగ బాహ్యమనియు వ్యవహారము. కాని సాధారణముగా ఆభ్యంతర ప్రయత్నము బాహ్యప్రయత్నమనియు వాడుట కలదు

సవర్ణతను నిర్ణయించుటలో బాహ్యయత్నమునకు ప్రసక్తి లేదు.

అవ : అభ్యంతర ప్రయత్నములును, అవి యేయే వర్ణముల కేయేవి అను విషయమును నిరూపింపబడుచున్నవి.

వృత్తి : ఆద్యః పఞ్చధా. స్పృష్టేషత్ స్పృష్టేషద్వివృత వివృత సంవృత భేదాత్. తత్ర స్పృష్టప్రయతనం స్పర్శానామ్. ఈషత్స్పృష్టమన్తఃస్థానామ్. ఈషద్వివృత మూష్మణామ్. వివృతం స్వరాణామ్. హ్రస్వస్యా వర్ణస్య ప్రయోగే సంవృతమ్, ప్రక్రియాదశాయాంతు వివృతమేవ.

అర్థము : మొదటిదగు అభ్యంతరప్రయత్నము స్పృష్టము, ఈషత్స్పృష్టము, ఈషద్వివృతము, వివృతము, సంవృతములను పేరులతో నైదువిధములు. అందు స్పృష్టము స్పర్శములకు, ఈషత్స్పృష్టమంతఃస్థములకు, ఈషద్వివృతము ఊష్మములకు, వివృతము స్వరములకు గలవు. హ్రస్వమగు అవర్ణమునకు ప్రయోగమున సంవృతము ప్రక్రియాదశయందు మాత్రము వివృతమే.

వివ : ఈ ప్రయత్నములపేర్లన్నియు నర్థవంతములే. ముఖావయవమున నాలుక కొనయో-మఱియొకభాగమో వర్ణోత్పత్తిస్థానమును పూర్తిగా స్పృశించినచో అది స్పృష్టము. కొంచెముగ స్పృశించుట ఈషత్ స్పృష్టము. అవయవములు కొంచెము విడివడిన ఈషద్వివృతము. ఎక్కువగ విడిపడిన వివృతము. అవయవములు సమీపమునకు వచ్చుట (ముడుచుకొనుట) సంవృతము. స్పర్శములు మున్నగు

సంజ్ఞలుముందు వివరింపఁబడును. స్పర్శాక్షరములకు (క నుండి మ వరకు) స్పృష్టము ప్రయత్నము. అంతఃస్థములకు (య ర ల వ) ఈషత్ స్పృష్టము. ఊష్మములకు (శ ష స హ) ఈషద్వివృతము. స్వరములకు వివృతము. హ్రస్వమైన అవర్ణము వాక్యమునందు ప్రయోగింపఁబడునపుడు సంవృత ప్రయత్నము కలదియగును. ఉదా : అత్రాగచ్ఛ. ఇందు అకారము సంవృతప్రయత్నముకలది. వ్యాకరణమునుబట్టి ప్రక్రియ జరుగుదశలోనది తక్కిన యచ్చులవలె వివృతమే యగును. ఉదా : బల + అరిః : ఇందు అకారము వివృతప్రయత్నము కలది. పాణినీయ సూత్రముచే నీ భేదము విధింపఁబడినది. ఈ రెండు స్థితులే ప్రయోగదశ, ప్రక్రియాదశ అని వృత్తి యందు చెప్పఁబడినది.

అవ : బాహ్యప్రయత్నముల వివరణము.

వృత్తి : బాహ్యప్రయత్నస్త్వేకాదశధా - వివారః సంవారః శ్వాసో నాదో ఘోషోఽఘోషోఽల్పప్రాణో మహాప్రాణ ఉదాత్తోఽనుదాత్తః స్వరితశ్చేతి. ఖరో వివారాః శ్వాసా అఘోషాశ్చ. హశః సంవారా నాదాఘోషాశ్చ. వర్గాణాం ప్రథమ తృతీయ పంచమాయణశ్చాల్పప్రాణాః. వర్గాణాం ద్వితీయ చతుర్థౌ శలశ్చ మహాప్రాణాః.

అర్థము : 1) వివారము 2) సంవారము 3) శ్వాసము 4) నాదము 5) ఘోషము 6) అఘోషము 7) అల్పప్రాణము 8) మహాప్రాణము 9) ఉదాత్తము 10) అనుదాత్తము 11) స్వరితము అను పేర్లతో బాహ్య ప్రయత్నములు పదునొకండువిధములు. ఖర్ వర్ణములు వివారములు, శ్వాసములు అఘోషములు. హశ్ వర్ణములు సంవారములు, నాదములు, ఘోషములు. వర్గాక్షరములలో మొదటివర్ణములు, మూడవవర్ణములు, ఐదవవర్ణములు, యణ్ వర్ణములును అల్పప్రాణములు. వర్గాక్షరములలో రెండవవర్ణములు, నాల్గవవర్ణములు శల్ వర్ణములును మహాప్రాణములు.

వివ : బాహ్యమనగ వర్ణోత్పత్తి స్థానమునకు బహిర్భాగమనియు, నందు జరుగు యత్నము బాహ్యప్రయత్నమనియు తెలిసికొంటిమి. నిజముగ నీభేదము చాల సూక్ష్మమైనది. కవర్గాక్షరములు క ఖ గ ఘ ఙ అనునవి ఐదింటికిని కంఠమే స్థానము. స్పృష్టమే ఆభ్యంతరప్రయత్నము. అట్టియెడ ఐదుభిన్నధ్వనులు పుట్టుట ఎట్లు? అనగా ఒక దృష్టాంతముచే దీనిని స్పష్టపరచుటకు ప్రయత్నింతుము. ఒక మృదంగము యొక్క తోలుపై చేతితో ఒక దెబ్బకొట్టినప్పుడు ఒకధ్వనివచ్చును.

ఆ తోలును మరియొకచేతితో పట్టుకొని దెబ్బవేసినచో ధ్వని, పూర్వధ్వనికంటె భిన్నమగును. తోలును కొంచెము తడిపి దెబ్బవేసినచో మరల భేదము కన్పట్టును. ఇట్లు దెబ్బవేసినస్థానము, చేయి, ఒకటియే యైనను ఊరకవేయుట, పట్టుకొనివేయుట, తడిపివేయుట అను వానిచే ధ్వనులలో భేదము కలుగుచున్నది. అట్లే వర్ణోత్పత్తి స్థానము, ప్రయత్నము సమానముగనే యున్నను శ్వాసత, నాదత, ఘోషత మున్నగులక్షణములను బట్టి కంఠమునఁ బుట్టిన ఒకేధ్వనియుద్ద భిన్న భిన్నధ్వనులుగ రూపొందుటకు వీలగుచున్నది. ఈ బాహ్యప్రయత్నములట్టివి. ఇవి పదునొకటి. ఇవి కొన్ని జంటలుగా విడదీయనగును.

1) వివారము – సంవారము

2) శ్వాసము – నాదము

3) అఘోషము – ఘోషము

4) అల్పప్రాణము – మహాప్రాణము

ఇవి యెనిమిదియు హల్లులకు సంబంధించినవి. ఉదాత్త అనుదాత్త స్వరితములు అచ్చులకు సంబంధించినవి, పూర్వమే వివరింపఁబడినవి.

వర్ణోచ్చారణ సమయమున ముఖము, లేదా అందలి భాగము తెఱచికొనుట, మూసికొనుట అనువిధమునుబట్టి వివారసంవారప్రయత్నములు గుర్తింపఁబడును. (ఇవి ఆభ్యంతరప్రయత్నమునందలి వివృత సంవృతభేదములకంటె భిన్నమైనవి) ఒకవిధమైన శ్వాసము – ఒకవిధమైననాదము ఉత్పత్తియగుటనుబట్టి శ్వాసనాదప్రయత్నము లుండును. ధ్వని కొంచెము గంభీరముగ నుండుటను బట్టి ఘోషప్రయత్నమును, అట్లు లేకుండుటనుబట్టి అఘోషప్రయత్నమును తెలియనగును. వర్ణోచ్చారణములో ప్రాణవాయువు అధికముగ వినియోగింపబడిన మహాప్రాణమును, అల్పముగ వినియోగింపఁబడిన అల్పప్రాణము అను ప్రయత్నములు పేర్కొనబడును.

ఉదాహరణమునకు కంఠమునుండి పుట్టిన కవర్ణము ముఖభాగము తెఱచుకొనుటచే, శ్వాసమును అధికముగ ప్రయోగించుటచే గంభీరధ్వని వెలువడకుండుటచే ప్రాణవాయువు అల్పముగ వినియోగింపబడుటచే వ్యక్తమగుచున్నది. ఖకారము కూడ అట్లే ఉత్పన్నమగుచున్నది. కాని దీనికి ప్రాణవాయువు అధికముగా కావలయును. కావున ఈ రెండు వర్ణములును వివార, శ్వాస, అఘోషయత్నములచే నొక్కటియే యయ్యును అల్పప్రాణత,మహాప్రాణత అనులక్షణములనుబట్టి రెండగు

చున్నవి. ఇట్లే గ ఘ ల ఉచ్చారణమందలి సంవారత, నాదత, ఘోషత అను లక్షణ ములు సమానములే అయినను అల్పప్రాణత, మహాప్రాణత అను లక్షణములచే అవి భిన్నములగుచున్నవి. 'జ' అనునది మరల సంవారత, నాదత, ఘోషత, అల్ప ప్రాణత అను లక్షణములను బట్టి గ కారముVంటిదియే అయినను నాసికయను స్థానము భిన్నమగుటచే వేరుధ్వని యగుచున్నది. ఈవివారాది ప్రయత్నముల సూక్ష్మస్థితి గుర్తింపఁబడనియెడల క ఖ గ ఘ ల వైవిధ్యములేదన్నమాట. ఇట్లే తక్కినవర్ణములకును దెలియనగును.

ఏయేవర్ణములకు ఏయే బాహ్యప్రయత్నములు గలవో వివరింపఁబడుచున్నది. ఖర్ వర్ణములకు – అనగా వర్గప్రథమ ద్వితీయ వర్ణములు, శ,ష,సలు అనువానికి వివారము శ్వాసము, అఘోషము అను ప్రయత్నములు కలవు. హశ్ వర్ణములకు – వర్గతృతీయ చతుర్థపంచమవర్ణములకు, హయవరల అనువానికిని – సంవారము – నాదము–ఘోషము అను ప్రయత్నములు కలవు. వర్గాక్షరములలో ప్రథమతృతీయ పంచమవర్ణములకు, య వ ర ల లకును అల్పప్రాణయత్నము. వర్గములలో ద్వితీయ చతుర్థ వర్ణములకును శ ష స హ లకును మహాప్రాణ ప్రయత్నము.

బాహ్య ప్రయత్నములకు సవర్ణతను నిర్ణయించుటలో వినియోగములేదు. మరి వీనిని తెలిసికొననేల? అను ప్రశ్న రావచ్చును. ముమ్ముందు సూత్రములలో ఒకవర్ణముల సముదాయమునకు మఱియొక వర్ణముల సముదాయము ఆదేశాదిరూప మున వచ్చునని చెప్పఁబడును. ఉదా : ఝల్ వర్ణములకు జశ్శులు వచ్చును. అన్నచో ఝల్ వర్ణములు చాలకలవు. జశ్శులైదే. ఇచట నేవర్ణముల కేవర్ణము లాదేశములగునో నిర్ణయించుటకు ఈ బాహ్యప్రయత్నము లుపకరించును ఒక సముదాయములోని వర్ణమునకు మఱియొక సముదాయములోని వర్ణము ఆదేశముగ విధింపబడినయెడల అచటనున్న వర్ణమునకును, వచ్చెడు వర్ణమునకు స్థానమును బట్టియో, ప్రయత్నమునుబట్టియో సాదృశ్యముండవలయును. అట్టి సాదృశ్యము ఒక వర్ణముతో అనేకవర్ణములకున్న యెడల బాహ్యప్రయత్నముల నుపయోగించి మిక్కిలి సాదృశ్యముగల ఒక్క వర్ణమునే గ్రహించుటకు వీలుకలదు. ఇట్లు ఏ వర్ణమునకు ఏ వర్ణముతో మిక్కిలి సాదృశ్యముకలదో పరీక్షించుటనే "ఆంతర తమ్యపరీక్ష" అందురు. అందు బాహ్యయత్నము ఎక్కువ సహకరించును. ఉదాహర ణమునకు 'ఝయోహో ఽన్యతరస్యామ్' సూత్రవివరణము చూడుడు.

'స్పృష్టప్రయతనం స్పర్శానామ్' ఇత్యాదివాక్యములలోని స్పర్శములు మున్నగు సంజ్ఞలు వివరింపబడుచున్నవి.

## సంజ్ఞా ప్రకరణమ్

వృత్తి : కాదయో మావసానాః స్పర్శాః। యణోఽన్తఃస్థాః। శల ఊష్మాణః. అచః స్వరాః ≍క, ≍ఖ కఖాభ్యాం ఇతి ప్రాగర్ధవిసర్గ సదృశో జిహ్వామూలీయః ≍ప, ≍ఫ ఇతి పఫాభ్యాం ప్రాగర్ధ విసర్గసదృశ ఉపధ్మానీయః అం అః ఇత్యచః పరావనుస్వార విసర్గౌ.

అర్థము: కకారము మొదలు మకారము వరకుగల వర్ణములు స్పర్శములు. య ర ల వ లు అంతఃస్థములు శ ష స హ లు ఊష్మములు. అచ్చులు స్వరములు, క ఖ లకు వెనుక అర్ధవిసర్గముతో సమానమగు చిహ్నముగల ≍ అను వర్ణము జిహ్వామూలీయము. అం అః అనుచోట అచ్చులకు తరువాతనుండు ం, ః అనునవి క్రమముగా అనుస్వారము, విసర్గము అనబడును.

వివ : కానుండి మ వరకు అనుటలో మాహేశ్వర సూత్రములోని అక్షర క్రమము సరిపడదు. సాధారణముగ మనము ఉపయోగించు వర్ణమాలలోని క్రమమిట గ్రహింపవలెను. అర్ధవిసర్గ సదృశాక్షరము క ఖ లకు పూర్వమున నుండినపుడు జిహ్వామూలీయము. పఫలకు పూర్వమున నుండినప్పుడు ఉపధ్మానీయము. ఈ నాలుగు వర్ణములకు కాక మరియే యితర వర్ణమునకును అది ముందుగాని, వెనుక గాని, యుండదు. 'కః' అనునపుడు విసర్గమునెట్లు ఉచ్చరింతుమో యట్టి యుచ్చారణము కఖ లకు ప ఫ లకు ముందు (పూర్వభాగమున) ఉండిన యెడల నీజిహ్వామూలీయోపధ్మానీయము లేర్పడును. యణ్, శర్, అచ్ అనునవి ప్రత్యాహారములు. అంతఃస్థములు, ఊష్మములు, స్వరములు అనునవి వానికి సంజ్ఞలు. అనుస్వార విసర్గములు ఏ అచ్చునకైనను తరువాత నుండవచ్చును. అవి అచ్చులతర్వాత మాత్రమే యుండుననుటను సూచించుటకై వర్ణమాలలో వానిముందు అకారము నుంతురు. అకారమిట అచ్చులనన్నిటిని సూచించును.

(క ఖ గ ఘ ఙ – కవర్గము, చ ఛ జ ఝ ఞ చవర్గము, ట ఠ డ ఢ ణ – టవర్గము, త థ ద ధ న తవర్గము, ప ఫ బ భ మ– పవర్గము).

వర్ణముల స్థాన ప్రయత్న యత్న సంజ్ఞా వివరము క్రింది పట్టికల వలన సులభముగా గుర్తింప నగును.

(1) అచ్చులు

| వర్ణము | స్థానము | ఆభ్యంతర ప్రయత్నము | బాహ్యప్రయత్నము | సంజ్ఞ | విశేషము |
|---|---|---|---|---|---|
| అ | | వివృతము | | స్వరము | ప్రయోగదశయందిది (హ్రస్వఅకారము)సంవృతము |
| | | | సర్వితము | | |
| ఇ | తాలువు | | ,, | ,, | |
| ఉ | ఓష్ఠములు | , | ,, | ,, | |
| ఋ | మూర్ధము | | | ,, | |
| ఌ | దంతములు | | | ,, | |
| | కంఠతాలువులు | | | ,, | |
| | కంఠఓష్ఠములు | , | ,, | ,, | |
| ఐ | | | | ,, | |
| | తాలువులు | | | | |
| | కంఠఓషములు | | | ,, | |

సూచన : ఇచట అకారాదులకు వానివానికిఁ గల హ్రస్వదీర్ఘప్లుతాది భేదములను, ఉదాత్తాదిభేదములను, అనునాసికాననునాసికా భేదములను గ్రహింపవలయును. అచ్చులన్నియు అల్పప్రాణములు.

(2) హల్లులు.

| వర్ణము | స్థానము | ఆభ్యంతర ప్రయత్నము | బాహ్యయత్నములు | సంజ్ఞలు |
|---|---|---|---|---|
| క | కంఠము | స్పృష్టము | వి, శ్వా, అ, అ. ప్రా | స్పర్శము |
| ఖ | ,, | ,, | ,, ,, ,, మ. ప్రా | , |
| గ | ,, | ,, | సం,నా,ఘో, అ. ప్రా | ,, |
| ఘ | ,, | ,, | ,, ,, ,, మ ప్రా | ,, |
| ఙ | ,, | ,, | ,, ,, ,, అ. ప్రా | స్పర్శము, అనునాసికము |
| చ | తాలువు | ,, | వి, శ్వా, అ, అ. ప్రా | స్పర్శము |
| ఛ | ,, | ,, | ,, ,, ,, మ. ప్రా | ,, |
| జ | ,, | ,, | సం,నా,ఘో, అ. ప్రా | ,, |

| వర్ణము | స్థానము | అభ్యంతర ప్రయత్నము | బాహ్య ప్రయత్నములు | సంజ్ఞలు |
|---|---|---|---|---|
| ఝ | తాలువు | స్పృష్టము | సం, నా, ఘో, మ. ప్రా | స్పర్శము |
| ఞ | ,, | ,, | ,, ,, ,, అ. ప్రా | స్పర్శము, అనునాసికము |
| ట | మూర్ధము | ,, | వి, శ్వా, అ, అ. ప్రా | స్పర్శము |
| ఠ | ,, | ,, | ,, ,, ,, మ. ప్రా | ,, |
| డ | ,, | ,, | సం, నా, ఘో, అ. ప్రా | ,, |
| ఢ | ,, | ,, | ,, ,, ,, మ ప్రా | ,, |
| ణ | ,, | ,, | ,, ,, ,, అ. ప్రా | స్పర్శము, అనునాసికము |
| త | దంతములు | ,, | వి, శ్వా, అ, అ. ప్రా | స్పర్శము |
| థ | ,, | ,, | సం, నా, ఘో, అ. ప్రా | ,, |
| ద | ,, | ,, | ,, ,, ,, మ. ప్రా | ,, |
| ధ | ,, | ,, | ,, ,, ,, మ. ప్రా | ,, |
| న | ,, | ,, | ,, ,, ,, అ. ప్రా | స్పర్శము, అనునాసికము |
| ప | ఓష్ఠములు | ,, | వి, శ్వా, అ, అ. ప్రా | స్పర్శము |
| ఫ | ,, | ,, | ,, ,, ,, మ ప్రా | ,, |
| బ | ,, | ,, | సం, నా, ఘో, అ. ప్రా | ,, |
| భ | ,, | ,, | ,, ,, ,, మ. ప్రా | ,, |
| మ | ,, | ,, | ,, ,, ,, అ. ప్రా | స్పర్శము, అనునాసికము |
| య | తాలువు | ఈషత్స్పృష్టము | సం, నా, ఘో, అ ప్రా | అంతస్థము |
| ర | మూర్ధము | ,, | ,, ,, ,, ,, | ,, |
| ల | దంతములు | ,, | ,, ,, ,, ,, | ,, |
| వ | దంతోష్ఠములు | ,, | ,, ,, ,, ,, | ,, |
| శ | తాలువు | ఈషద్వివృతము | వి, శ్వా, అ, మ. ప్రా | ఊష్మము |
| ష | మూర్ధము | ,, | ,, ,, ,, ,, | ,, |
| స | దంతములు | ,, | ,, ,, ,, ,, | ,, |
| హ | కంఠము | ,, | సం, నా, ఘో, ,, | ,, |
| ః | కంఠము | | | విసర్గము, విసర్జనీయము |
| ం | నాసిక | | | అనుస్వారము |

వి = వివారము, శ్వా = శ్వాసము, అ = అఘోషము; అ. ప్రా = అల్ప ప్రాణము, సం = సంవారము, నా = నాదము, ఘో = ఘోషము, మ. ప్రా = మహాప్రాణము.

అక్షరముల సవర్ణతను గుర్తించుటకును, ఆంతరతమ్య పరీక్షచేయుటకును "తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్" అను సూత్రము మొదలుకొని యింతవఱకు నున్న యంశములు చాలముఖ్యములు. ఈ సవర్ణత, ఆంతరతమ్య పరీక్ష అనునవి యీ వ్యాకరణమున బహుసందర్భములందావశ్యకములగుటచే ఈ విషయమంతయు శ్రద్ధగా గమనింపదగును.

అవ : తుల్యాస్య సూత్రముచే సవర్ణతసిద్ధింపని ఋ ఌ వర్ణముల కావశ్యక మగుటచే నీ క్రిందివార్తికము సవర్ణతను విధించుచున్నది.

వార్తి : ఋ ఌ వర్ణయోర్మిథస్సావర్ణ్యం వాచ్యమ్ (150).

ప. వి. : ఋ ఌ వర్ణయోః (6–2) మిథః (అవ్య) సావర్ణ్యమ్ (1–1) వాచ్యమ్ (1–1).

అర్థ : ఋ ఌ వర్ణములకు పరస్పరము సావర్ణ్యము చెప్పనగును.

వివ : స్థానమును, అభ్యంతరప్రయత్నమును సమానముగనున్న రెండు వర్ణములు సవర్ణములని పైని చెప్పఁబడినది. దీనినిబట్టి మూర్ధన్యమగు ఋవర్ణము నకును, దంత్యమగు ఌ వర్ణమునకును సవర్ణతలేదు. కాని యీ రెంటికి సావర్ణ్యము శాస్త్రమున నావశ్యకమగుటచే వార్తికకారులు దానిని విధించిరి. ఋ ఌ వర్ణములకు సావర్ణ్యముండుటలో ప్రయోజనము ముందు వివరింపఁబడును.

అవ : సవర్ణ సంజ్ఞయొక్క ప్రయోజన మీక్రింది సూత్రముచే వివరింపఁ బడుచున్నది.

సూ : అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః 1-1-69.

వృ : అవిధీయమానోఽణుదిచ్చ సవర్ణస్య సంజ్ఞాస్యాత్. అత్రైవాణ్ పరేణ ణకారేణ. కు చు టు తు పు ఏతే ఉదితః.

ప. వి : అణుదిత్ (1-1) సవర్ణస్య (6-1) చ (అవ్య) అప్రత్యయః (1-1)

అర్థ : విధింపఁబడని అణును, ఉదిత్తును, సవర్ణమునకు సంజ్ఞయగును, ఇక్కడమాత్రమే అణు పరణకారముతో ప్రత్యాహారము. కుచుటుతుపు - ఇవి ఉదిత్తులు.

వివ : 'అణ్' అనునది ప్రత్యాహారము. మాహేశ్వరసూత్రములలో ఇత్తులగు ణకారములు రెండు గలవు. 1) అ ఇ ఉణ్ 2) లణ్ వ్యాఖ్యాతలు సూత్ర కారుని హృదయమును పరిశీలించి యిచట పరణకారముతో = లణ్ లోని ణకారముతో ప్రత్యాహారము గ్రహింపవలయునని బోధించిరి ఇదికాక మఱియెచటనైనను 'అణ్' ప్రత్యాహారము పూర్వణకారముతోడనే (అ ఇ ఉ ణ్). కాన ఈ సూత్రము నందలి అణ్ ప్రత్యాహారముచేత అచ్చులు హయవరలలు గ్రహింపఁబడును.

ఉదిత్తనగా ఉత్ = హ్రస్వఉకారము – ఇత్తుగా గలది. అవి ఐదు కు చు టు తు పు. క్ అనుదానికి ఉ వర్ణము ఇత్తుగ చేర్చుటచే 'కు' అయినది. ఇట్లే తక్కినవియును.

అప్రత్యయః అనగా ప్రత్యయము కానిది. ప్రత్యయమనగా ఆగమాదేశాది రూపమునఁగాని, అర్థవిశేషబోధకముగాగాని విధింపఁబడు వర్ణము, లేదా వర్ణ సము దాయము. అప్రత్యయమనఁగా నట్లు విధింపఁబడనిది.

విధింపఁబడనివగు 'అణ్' ప్రత్యాహారములోని వర్ణములును (అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ, ఐ, ఔ, హ, య, వ, ర, ల ల) ఉదిత్తులును (క్, చ్, ట్, త్, ప్) తమ సవర్ణములకు సంజ్ఞలగును. అనగా నవి తమ సవర్ణము లన్నింటిని గ్రహించును. ఉదా : అ ఇ ఉ ణ్ సూత్రములోని అకారము ఆదేశాదిరూపమున విధింపఁబడినది కాదు. అది యీ సూత్రముచే తన సవర్ణములగు దీర్ఘాదిభేదము లను, ఉదాత్తాదిభేదములను, అనునాసికాననునాసికభేదములను గ్రహించును. అనగా అకారమనినచో అ, ఆ, అ3 మున్నగు పదునెనిమిదింటిని చెప్పినట్లే. ఇట్లే తక్కినవర్ణములును ఉదిత్తయిన కు అనునది దానిసవర్ణములగు ఖ, గ, ఘ, ఙ అను వానిని గ్రహించును. కు అనగా క ఖ గ ఘ ఙ అను వర్ణ మీ సూత్రమువలననే సిద్ధించినది. (అకుహవిసర్జనీయానాంకణ్ఠః).

ఇదియొక పరిభాషా సూత్రము. శాస్త్రమున అనేకసందర్భములలో ప్రసక్త మగు విధానములను సంగ్రహణము కొఱకై ఒక సూత్రమున సూత్రకారులు చెప్పు దురు. అట్టి సూత్రములను పరిభాషా సూత్రములందురు. ఉదా : ప్రకృత సూత్రము అనేక సందర్భములలో అకారమనగా పదునెనిమిది విధములైన అకార ములను గ్రహింపనగుననువిషయమును బోధించినది. ఇది లేనిచో ఆ సందర్భము లందెల్ల ఈ యర్థమును జెప్పుకొనుచుండవలయును. ఇట్టి శ్రమను పరిభాషలు తొలఁగించును.

సవర్ణములనగా స్థానప్రయత్నముల సామ్యముగల వర్ణములని పూర్వమె తెలిపితిమి. అకారభేదము లన్నియు కంఠమున పుట్టినవియే. వివృతప్రయత్నముకలవియే. కనుక అవి యన్నియు పరస్పరము సవర్ణములగును. అట్లే క ఖ గ ఘ ఙ లు సవర్ణములు. ఈ సూత్రముయొక్క ప్రయోజనమును 'అకుహవిసర్జనీయానాం కంఠః' ఇత్యాదులందు గమనింపనగును. ఇందు 'అ' అనుదానికి ప్రకృతసూత్రమును బట్టి పదునెనిమిది విధములగు అకారములకు అనునర్థము వచ్చును. అట్లే కు అనగ క ఖ గ ఘ ఙ లకు అను నర్థము వచ్చును. మఱియు మాహేశ్వరసూత్రములలో కన్పట్టని ఆ, ఈ, ఊ మున్నగు వర్ణములుకూడ ఈసూత్రము చేతనే 'అచ్చు' లగును.

'అప్రత్యయః' అనుటవలన ప్రత్యయరూపమున విధింపఁబడెడు అణు తన సవర్ణములను గ్రహింపదు. ఉదా : దశరథునికుమారుఁడు అనునర్థమున దశరథ శబ్దమునకు 'ఇ' అను ప్రత్యయము వచ్చును. ఇచట 'ఇ' అనునది అణ్ ప్రత్యాహారములో నున్నవర్ణమే యైనను, విధింపఁబడినది యగుటచే తన దీర్ఘాదిభేదములను గ్రహింపదు, అనగా దశరథశబ్దమునకు ప్రక్క 'ఇ' అను హ్రస్వమైన వర్ణమే చేరును కాని 'ఈ' మొదలగు వర్ణములు చేరవని తాత్పర్యము. 'దాశరథిః' అనిరూప మేర్పడును.

(ఈ సూత్రార్థము సంధిమున్నగు ప్రకరణములలో నింకను స్పష్టము చేయఁబడును.)

ఈ సూత్రముయొక్క ఫలితార్థము వృత్తికారునిచే వివరింపఁబడుచున్నది.

వృ : తదేవమ్ - అ ఇత్యష్టాదశానాం సంజ్ఞా. తథేకారోకారౌ. ఋకార స్త్రింశతః. ఏవం ఌకారోఽపి, ఏచో ద్వాదశానామ్.

అర్థము : ఫలితమిది - అకారము పదునెనిమిదింటికి సంజ్ఞ యగును. అట్లే ఇకారఉకారములును. ఋకారము ముప్పదింటికి సంజ్ఞ యగును. ఇట్లే ఌకారమును. ఏచ్చులు ఒక్కొక్కటి పండ్రెండింటికి సంజ్ఞలగును.

వివ : అకారమునకు హ్రస్వ, దీర్ఘ, ప్లుత - ఉదాత్త, అనుదాత్త, స్వరిత - అనునాసికాననునాసికరూపమున పదునెనిమిది భేదములు గలవని పూర్వమె తెలిపితిమి. ఒక అకారమును గ్రహించినయెడలనది తనకు సవర్ణములగు మిగిలిన పదునేడింటిని తనతోపాటు గ్రహించును. అట్లే ఇకార ఉకారములు కూడ ఒక్కొ-

క్కుటి తమ తమ పదునెనిమిదేసి భేదములను గ్రహించును. ఋకారమునకు పదునెనిమిది భేదములు గలవు. ఌకారమునకు దీర్ఘములేనికారణమున పండ్రెండు భేదములు గలవు. ఋ ఌ వర్ణములకు సావర్ణ్యము విధింపఁబడినది. కావున ఋకారము తన పదునెనిమిదిభేదములతో పాటు ఌకారముయొక్క పండ్రెండు భేదములను గూడ గ్రహించును. కావుననే ఋకారము ముప్పదింటికి సంజ్ఞయగునని చెప్పఁబడినది. ఇట్లే ఌకారముకూడ ముప్పదింటికి సంజ్ఞయగును. ఏ ఓ ఐ ఔలకు హ్రస్వము లేదు కావున అవి తమ తమ పండ్రెండేసి భేదములకు సంజ్ఞలగును.

ప్రకృతసూత్రమున 'అణ్' ప్రత్యాహారములో 'హ య వ ర ల' లు కూడ గలవు. రూపభేదములు అచ్చులకు మాత్రమే వివరింపఁబడినవి. అట్టియెడ హ య వ ర ల తో కూడిన 'అణ్' ప్రత్యాహారమును గ్రహింపనేల? అచ్ ప్రత్యాహారమును గ్రహించిన చాలునుగదా ! యను సంశయమునకు సమాధాన మొసఁగఁబడుచున్నది.

వృత్తి : అనునాసికాననునాసికభేదేన యవలా ద్విధా. తేనాననునాసికాస్తే ద్వయోర్ద్వయో స్సంజ్ఞా.

అర్థ : అనునాసికము, అననునాసికము నని 'య వ ల' లు రెండు విధములు. అందుచే అననునాసికములైనయవి రెంటి రెంటికి సంజ్ఞలగును.

వివ : హ య వ ర ట్ లణ్ అను సూత్రములలోని య వ ల అనువానికి అనునాసిక భేదము కూడ గలదు. అనగా య్ - య్ఁ, వ్ - వ్ఁ, ల్ - ల్ఁ అని రెండేసి వర్ణములు భాషలో వ్యవహరింపఁబడుచున్నవి. ఇందు మొదటివి అననునాసికములు. మాహేశ్వరసూత్రములలో అవియే గ్రహింపఁబడినవి. రెండవవి అనునాసికములు. మొదటిని రెండవవానిని గ్రహింపవలయునన్నచో ప్రకృత సూత్రమున 'అచ్' ప్రత్యాహారమును గ్రహించినచో కుదురదు. కావున ప్రత్యాహారమును 'లణ్' లోని ణకారమువఱకు పొడిగింపవలసి వచ్చినది.

ఈ ప్రత్యాహారమునందలి హకారరేఫములకు భేదములేవియు లేవు కనుక ఈ సూత్రమునకవి లక్ష్యములు కావు.

సూచన : ఈ ప్రకరణమున నింతవఱకుఁ జెప్పఁబడిన సూత్రములన్నియు నీ అణుదిత్ సూత్రమున పర్యవసించుచున్నవి. ఈ సూత్రములోని సవర్ణపద

మును నిర్వచించుటకే తుల్యాస్య సూత్రము చెప్పఁబడినది. అకారాదులయొక్క సవర్ణములను దెలుపుటకే ఊకాలోఽజ్ఘ్రస్వదీర్ఘప్లుతః', 'ఉచ్చైరుదాత్తః', 'నీచైరనుదాత్తః', 'సమాహారః స్వరితః', 'ముఖనాసికావచనోఽనునాసికః' అను సూత్రములు చెప్పఁబడినవి. అచ్, అణ్ మున్నగుప్రత్యాహారము లీసూత్రములలో వాడఁబడినవి. అవి యెట్లేర్పడునో తెలుపుటకు మాహేశ్వర సూత్రములును, 'హలన్త్యమ్', 'ఆదిరన్త్యేన సహేతా' అను సూత్రములును చెప్పఁబడినవి. ఇత్సంజ్ఞకు సంబంధించినది, 'తస్యలోపః' అనుసూత్రము లోపమనగా నేమియో 'అదర్శనం లోపః' చెప్పినది ఇట్లీ సూత్రములన్నియు అణుదిత్సూత్రమును లక్ష్యముగానుంచుకొని యీ ప్రకరణమున నీ క్రమమున నిట్లు చెప్పఁబడినవి. కావున నీ సూత్రముల పరస్పరసంబంధమును పాఠకుఁడు జాగ్రత్తగా పరిశీలింపవలయును.

అవ : మఱికొన్ని సంజ్ఞలు ఇచట చెప్పఁబడుచున్నవి.

సూ : పరస్సంనికర్షః సంహితా 1-4-109.

వృత్తి : వర్ణానా మతిశయిత స్సన్నిధిః సంహితాసంజ్ఞః స్యాత్.

ప వి : పరః (1-1) సంనికర్షః (1-1) సంహితా (1-1)

అర్థ : వర్ణములయొక్క దగ్గఱతనము సంహిత యనఁబడును.

వివ : ముందు సంధిపరిచ్ఛేదము ప్రారంభింపఁబడుచున్నది. సంధులు సంహిత యున్నపుడు వచ్చునని యీప్రకరణారంభమునఁ జెప్పఁబడును. కనుక సంహితాసంజ్ఞ యిట చెప్పఁబడుచున్నది. వర్ణములయొక్క మిక్కిలిచేరువకు సంహిత యని పేరు. దీనినే వ్యాఖ్యాత లిట్లు చెప్పుదురు. "అర్ధమాత్రాతిరిక్తకాల వ్యవధానాభావః సంహితా". మాత్రాకాలమనగా ఱెప్పపాటు కాలము లేక చిటికవేయుటకు పట్టుకాలమని వెనుక తెలిసికొంటిమి. అందులో సగము కాలముకంటె ఎక్కువ వ్యవధానము లేకుండుటకు సంహిత యని పేరు. ఉదాహరణమునకు 'సుధీ + ఉపాస్యః' అనుచోట ఈకార ఉకారములకు సంహిత గలదు. సులోని ఉకారముతో ఉ' కారమునకు సంహిత లేదు.

సూ : హలోఽనన్తరాః సంయోగః 1-1-7.

వృ : అజ్భి రవ్యవహితా హల స్సంయోగసంజ్ఞాః స్యుః.

ప. వి : హలః (1-3) అనన్తరాః (1-3) సంయోగః (1-1).

అర్థ : అచ్చులతో వ్యవధానములేని హల్లుల సముదాయమునకు సంయోగ మని పేరు.

వివ : రెండుగాని యంతకెక్కువగాని హల్లులు నడుమ అచ్చులు లేకుండ నున్నయెడల ఆ హల్లులకు సంయోగమని పేరు. ఉదా : క్ ష్ ఇవి రెండును హల్లులు. వీనికి నడుమ అచ్చులేదు. కావున 'క్ష' అనునది సంయోగము. 'రామ' అనుచో రేఫమకారములు రెండుహల్లులున్నను వానికి నడుమ 'ఆ' అచు అచ్చుండుటచే నవి సంయోగ సంజ్ఞను పొందవు. త్, స్, న్-అ = త్స్న = కృత్స్న. ర్ ష్ ట్ య్ - అ = ర్ష్ట్య - ధార్ష్ట్య - మొన్నగునవి సంయోగములు. ముందు 'సంయోగే గురు' ఇత్యాదిసూత్రములలో నీ సంజ్ఞ ప్రయోగింపఁబడి యుండుటచే నిది యిట చెప్పఁబడినది.

సూ : సుప్తిఙన్తం పదమ్ 1-1-14.

వృ : సుబన్తం తిఙన్తం చ పదసంజ్ఞం స్యాత్.

ప. వి : సుప్తిఙన్తమ్ (1-1) పదమ్ (1-1).

అర్థ : సుబంతమునకును, తిఙన్తమునకును 'పదము' అని సంజ్ఞ.

వివ : సుప్పులనగా నామవిభక్తులు. ఏడు విభక్తులకు మూడేసి వచనముల చొప్పున మొత్తము ఇరువదియొక్క ప్రత్యయములు. వానిస్వరూపమియ్యది.

| | | ఏ- | ద్వి- | బహు. |
|---|---|---|---|---|
| ప్రథమా విభక్తి — | | సు | ఔ | జస్ |
| ద్వితీయా | ,, | అమ్ | ఔట్ | శస్. |
| తృతీయా | ,, | టా | భ్యామ్ | భిస్ |
| చతుర్థీ | ,, | ఙే | భ్యామ్ | భ్యస్ |
| పంచమీ | ,, | ఙసి | భ్యామ్ | భ్యస్ |
| షష్ఠీ | ,, | ఙస్ | ఓస్ | ఆమ్. |
| సప్తమీ | ,, | ఙి | ఓస్ | సుప్. |

సంబోధనయందును ప్రథమావిభక్తి ప్రత్యయములే చేరును. ఇందు మొదటి 'సు' తో చివరి పకారమును (ఇత్తు) 'ఆదిరన్త్యేనసహేతా' అను సూత్రముచే కలుపగా 'సుప్' అను ప్రత్యాహారము ఏర్పడి అది యీ ప్రత్యయముల నన్నింటిని బోధించును. కావున 'సుప్' అనునది పై ఇరువదియొక్క ప్రత్యయములకు సంజ్ఞ. 'సుప్' అంతమందుఁగలది సుబంతము. సుప్పులు ప్రాతిపదికములకుఁ జేరును.

ధాతువుకానిదియు, ప్రత్యయముకానిదియు, ప్రత్యయాంతముకానిదియు నగు అర్థవంతమైన శబ్దస్వరూపమును ప్రాతిపదికమందురు. ఆ ప్రాతిపదికమునకు ఈ సుప్పులలో నేదేనొకటి చేరినయెడల ఆ మొత్తమునకు పదమనుపేరు ఈ సూత్రముచే సిద్ధించుచున్నది.

ఉదా : రామ + సు=రామః, అగ్ని + అమ్=అగ్నిమ్. మొ॥వి.

నామ విభక్తులవలెనే క్రియావిభక్తులును గలవు. వానికి 'తిఙ్' అని సంజ్ఞ. అదియును ఒక ప్రత్యాహారము. ధాతువులు (క్రియాపదముల మూలరూపములు) పరస్మైపదులనియు, ఆత్మనే పదులనియు రెండువిధములు - క్రియలలో ప్రథమ, మధ్యమ, ఉత్తమభేదములతో మూడుపురుషములు గలవు. ఒక్కొక్కపురుషమునకు ఏకవచన, ద్వివచన, బహువచనములు గలవు. కాన మూడుపురుషములకు మూఁడేసి వచనములచొప్పున పరస్మైపదికి తొమ్మిదియు, ఆత్మనేపదికి తొమ్మిదియు మొత్తము క్రియాప్రత్యయములు పదునెనిమిది. వానిస్వరూప మిట్టిది.

పరస్మైపదము

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్రథమపురుషము | తిప్ - | తస్ | ఝి |
| మధ్యమపురుషము | సిప్ | థస్ | థ |
| ఉత్తమపురుషము | మిప్ | వస్ | మస్. |

ఆత్మనేపదము

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు | త | ఆతామ్ | ఝ |
| మ. పు | థాస్ - | ఆథామ్ | ధ్వమ్ |
| ఉ. పు | ఇట్ | వహి | మహిఙ్ |

ఇందు మొదటి 'తి' అను అక్షరము చివరి 'మహిఙ్'లోని ఙకారముతోఁగలసి 'ఆదిరన్త్యేన' అనుసూత్రమువలన 'తిఙ్' అని అయి తనకును మధ్యవానికిని సంజ్ఞయగుచున్నది. కావున తిఙ్ఙనగా ఈ పదునెనిమిది ప్రత్యయములు తెలుపఁబడును. వీనిలో నేదేని అంతమందుఁ గల దానిని 'తిఙంతము' అందురు. అదియు ఈ సూత్రమువలన పదమగును. ఉదా : భవతి, అలభత మొ॥వి.

'ఏజః పదాన్తాదతి' మున్నగు వక్ష్యమాణసూత్రములలో పదశబ్దప్రయోగము కలదు కావున పదమనునది నిర్వచింపఁబడినది.

సూ : హ్రస్వం లఘు 1.4-10.

ప వి : హ్రస్వమ్ (1-1) లఘు (1-1).

అర్థ : హ్రస్వము లఘు వగును.

వివ : హ్రస్వదీర్ఘప్లుతములు అచ్చులకు మాత్రమే సంబంధించినవి కనుక హ్రస్వమైన అచ్చునకు లఘువను సంజ్ఞ కలదను నర్థము సిద్ధించును. అ హ మ్ అనుపదములోని అకారము హ్రస్వమగుటచే లఘువు.

సూ : సంయోగే గురు 1-4-11

వృ : సంయోగే పరే హ్రస్వం గురుసంజ్ఞం స్యాత్.

ప. వి : సంయోగే (7-1) గురు (1-1).

అను : హ్రస్వమ్ (1-1) 1-4-10.

అర్థ : సంయోగము పరమగునప్పుడు హ్రస్వము గురువను సంజ్ఞ కలది యగును.

వివ : అచ్చుల వ్యవధానములేని హల్లులకు సంయోగమను సంజ్ఞ కలదని పూర్వము చెప్పబడినది అట్టి సంయోగము ప్రక్కనున్నపుడు దానికిపూర్వమున నున్న హ్రస్వమగు నచ్చు గురువగునని తాత్పర్యము. ఇది పైసూత్రమున కప వాదము. అపవాదమనగా నొక సామాన్య సూత్రముచే నొకకార్యము జరుగవలసి యుండగా నొక ప్రత్యేకదశలో నట్లుకాదట్లగునని చెప్పుట హ్రస్వము లఘు వగును. కాని సంయోగము పరమగునపుడు మాత్రము గురువగునని చెప్పబడి నది. ఉదా : అద్య ఇచట 'ద్య' సంయోగము అది పరముగా నుండుటచే పూర్వమున నున్న హ్రస్వఅకారము గురువైనది.

సూ : దీర్ఘంచ 1-4-12.

ప. వి. దీర్ఘమ్ (1.1) చ (అవ్య).

అను : గురు (1-1)

అర్థ : దీర్ఘముకూడ గురువగును.

వివ : దీర్ఘమగు అచ్చులకు కూడ గురువను సంజ్ఞ కలుగును. ఉదా : ఆగచ్ఛతు మొ॥వి.

హల్లులు సాధారణముగ నచ్చులతో కూడియే యుండును. కావున వానిపై నున్న అచ్చులకే లఘుగురు సంజ్ఞలుండునని గుర్తింపనగును. 'పుగంతలఘూప

ధస్యచ', 'ఇజాదేశ్చ గురుమతో౽నృచ్ఛః' మున్నగుసూత్రములలో వీని ప్రయోగము కలదు. ఇవి వ్యాకరణ సంజ్ఞలు. ఛందస్సునందును ఇవి కలవు కాని వీనికంటె కొంతభేదము వానికి కలదు.

## ప్రకరణావలోకనము.

సంజ్ఞలనగా పేరులు. లోకమున వ్యవహారముకొఱకు పేరుపెట్టుదురు. శాస్త్రమున కూడ వ్యవహారముకొఱకు కొన్ని సంజ్ఞలవసరమగును. ఈ సంజ్ఞా ప్రకరణమున వర్ణములు, వానిభేదములు చూపఁబడినవి ప్రత్యాహారములు, వర్ణోత్పత్తి స్థానములు, ఆభ్యంతర ప్రయత్నములు, బాహ్యప్రయత్నములు నిరూపింపఁబడినవి. అక్షరములకుఁగల సవర్ణత చూపఁబడినది. పిదప, సంహిత, సంయోగము, పదము, లఘువు, గురువు అనుసంజ్ఞలు నిర్వచింపఁబడినవి.

ఈ సంజ్ఞలింకను అనేకములు గలవు. అవి యెన్నియు ముందు ముందు సందర్భానుసారముగా నిర్వచింపఁబడును.

ఇది సంజ్ఞా పరిచ్ఛేదము.

# అథాచ్సంధి ప్రకరణమ్

ఈ ప్రకరణమునందు సంధివిశేషములు తెలుపఁబడును. సంధియనఁగా రెండు పదములో, రెండుశబ్దస్వరూపములో కలియుట. అట్లు కలియునపుడు సాధారణముగా వర్ణములు లోపించుట, ఆగమాదేశరూపమున వచ్చుట మున్నగు మార్పులు జరుగుచుండును. అందచ్చులకు సంబంధించిన మార్పులీప్రకరణమునందుఁ జెప్పఁబడుచున్నవి కాన నిది అచ్సంధి ప్రకరణ మనఁబడుచున్నది.

ఇచట ప్రకరణమునకు ముఖ్యముగా అవసరములైన రెండు పరిభాషలు చెప్పఁబడుచున్నవి.

సూ : షష్ఠీ స్థానేయోగా 1-1-49.

వృ : అనిర్ధారిత సంబన్ధవిశేషా షష్ఠీ స్థానేయోగాబోధ్యా. స్థానం చ ప్రసఙ్గః.

ప. వి : షష్ఠీ (1-1), స్థానే యోగా (1-1).

అర్థ : నిర్ధరింపఁబడని సంబంధ విశేషముగల షష్ఠి 'స్థానే' అనుపదముతో యోగము గలదియగును. స్థానమనగా ప్రసంగము.

వివ : సాధారణముగ షష్ఠి రెండిటికిఁ గల సంబంధమును దెలుపును. 'రామునియొక్క పుత్త్రుఁడు' అన్నచో, రాముఁడనువ్యక్తికిని, పుత్త్రుఁడను వ్యక్తికిని పితాపుత్రసంబంధము గలదు అని యర్థము. ఇట్టి సంబంధములు లోకములో అనేకములుండును. శబ్దమునకు శబ్దముతో సంబంధము మూడువిధములుగా నుండును. (1) ఈ శబ్దమునకుఁ దరువాతనున్న శబ్దము (ఆనంతర్యము) (2) ఈ శబ్దమునకు సమీపమున నున్నశబ్దము(సామీప్య సంబంధము)(3)ఈశబ్దముయొక్క ప్రసంగమున వచ్చు శబ్దము (ప్రసంగసంబధము). (ప్రసంగమనగా ఒకటి ఒకచోట నుండవలసిన స్థితి యనిభావము). ఇట్లు మూడువిధములుగానున్న సంబంధములలో నేదిగాని నిర్ణయింపఁబడని షష్ఠ్యంతపదము 'స్థానే' అనుపదముతో కలిసి అర్థమును జెప్పునని సూత్ర తాత్పర్యము. ఉదాహరణమునకు 'ఇకోయణచి' అను వక్ష్యమాణసూత్రమున 'ఇకః' అనునది షష్ఠ్యంతపదము. దానికి ఇక్కులసమీపమున, అనిగాని, ఇక్కుల అనంతరమున అనిగాని సంబంధవిశేషము నిర్ధరింపఁబడలేదు. కావున 'ఇకః' అనుపదమునందలి షష్ఠీ సంబంధవిశేషము నిర్ధరింపఁబడనిది. కనుక ప్రకృత పరిభాషచే 'ఇకఃస్థానే' అనుస్థితి యేర్పడును. ఇక్కులస్థానమున అని దానికర్థము. స్థానమనగానేమిః ఇచటస్థానమనగా ఆ వర్ణము ఉండవలసిన సందర్భమున అని

యర్థము. కాన ఇక్కులు ఉండవలసిన వినఁబడవలసిన సందర్భమున అవి ఉండక వినఁబడక యణులు వచ్చునను సూత్రార్థమును ఈ పరిభాషసాహాయ్యముచే గ్రహించితిమి.

సూ : తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య 1-1-66.

వృ : సప్తమీనిర్దేశేన విధీయమానం కార్యం వర్ణాంతరే ణావ్యవహితస్య పూర్వస్య బోధ్యమ్.

ప. వి : తస్మిన్ (7-4) ఇతి (అవ్య) నిర్దిష్టే (7-1) పూర్వస్య (6-1).

అర్థ : సప్తమీనిర్దేశముచే విధింపఁబడు కార్యము మఱియొక వర్ణముతో వ్యవధానములేని పూర్వమునకు అగునని తెలియఁదగును.

వివ : ఇదియు నొక పరిభాష. సూత్రమున సప్తమ్యంతపదమును ప్రయోగించి ఒక కార్యము విధింపఁబడినయెడల నాకార్యము, ఆసప్తమ్యంతపదముచేఁ జెప్పఁబడుదానికి అవ్యవహితముగా (మధ్యలో వేఱువర్ణములు లేకుండునట్లుగా) పూర్వముననున్నదానికి అగును. ఉదా : ఇకోయణచి – ఇందు 'అచి' అనునది సప్తమ్యంతపదము. అచ్చునందని సాధారణార్థము. కాని యా యర్థమిట సరిపడదు. కాన పరిభాష నాశ్రయింపవలయును. ప్రకృతపరిభాషచే 'అచి' అను సప్తమ్యంతపదమును నిర్దేశించి (చూపి) విధింపఁబడిన యణాదేశము అనుకార్యము అచ్చునకు అవ్యవహితముగా పూర్వమున నున్న వర్ణమునకు వచ్చునను నర్థము సిద్ధించినది. కావున సూత్రమున సప్తమ్యంతపద మున్నయెడల సాధారణముగా 'అది పరమందుండఁగా పూర్వమునకు' అనునర్థము సిద్ధించునని సూత్రతాత్పర్యము. ఇందలి 'తస్మిన్' అనునది సప్తమికి చిహ్నము.

సూ : సంహితాయామ్ 6-1-72.

వృ : ఇత్యధికృత్య.

ప. వి : సంహితాయామ్ (7-1).

అర్థ : సంహితవిషయమైనపుడు అని అధికారమై.

వివ : ఇది యధికారసూత్రము, ఈ వ్యాకరణమున లాఘవమునకై ఒక పద్ధతి యవలంబింపఁబడినది ఒక యర్థవిశేషము అనేకసూత్రములలో క్రమము తప్పక అవసరమగునేని ఆ యర్థము నొకసూత్రమునందుఁ జెప్పి యా సూత్రము మొత్తము తఱువాతి సూత్రములలో అవసరమైనంతవఱకుఁ బ్రవేశించి వానియర్థమును సమగ్రమొనర్చును. ఇట్లు ఏ సూత్రమునకు స్వస్థలమున చరితార్థత లేక, ఉత్తర

సూత్రములలోనికి పోయి వానికి సమగ్రతను గల్పించు నధికారముండునో, యా సూత్రము నధికారసూత్ర మందుదు. 'సంహితాయామ్' అను ప్రకృత సూత్ర మట్టిది. 'సంహిత యుండఁగా' అనునర్థముగల యీ సూత్రమిట సమగ్రమైన యర్థము నొసఁగఁజాలదు. ఇది 6-1-73 నుండి 153 వఱకుఁగల సూత్రముల లోనికిఁ బ్రవేశించి వానికర్థపూర్తిని కలిగించును. ఇట్టి సూత్రములనేకములు మనకీ వ్యాకరణమున గోచరించును. సంహిత యనఁగా వర్ణములు మిక్కిలి దగ్గఱగా నుండుట. (పరస్సన్నికర్షః సంహితా).

సూ : ఇకో యణచి 6-1-74.

వృ : ఇకః స్థానే యణ్ స్యాదచి సంహితాయాం విషయే సుధీ + ఉపాస్యః ఇతి స్థితే.

ప. వి : ఇకః (6-1) యణ్ (1-1) అచి (7-1).

అర్థ : సంహితావిషయమున, అచ్చు పరమగునపుడు ఇక్కులస్థానమున యణ్ణులు వచ్చును. సుధీ + ఉపాస్యః అని యుండగా.

వివ : పై మూడుసూత్రములు నీ సూత్రమున ప్రయోజనమును బొందుచున్నవి. వాని యుపయోగములేనిచో సూత్రార్థము కుదురదు. 'ఇక్కులయొక్క అచ్చునందు యణ్ణు' అను వికారమైన యర్థము వచ్చును. అది గ్రాహ్యము కాదు. ఇచట 'ఇకః' అనునది సంబంధవిశేషము నిర్ధరింపఁబడని షష్ఠ్యంతపదము కనుక 'స్థానే' అనుపదముతో యోగము కలదియై ఇకఃస్థానే=ఇక్కు స్థానమున-అనఁగా ఇక్ ప్రత్యాహారములోని వర్ణముయొక్క ప్రసక్తి ఉన్నపుడు అను నర్థమును పొందును.

'అచి' అనునది సప్తమ్యంతపదము. 'తస్మిన్నితి నిర్దిష్టేపూర్వస్య' అను పరిభాషనుబట్టి అచిపరే=అచ్చుపరమగునపుడు అనునర్థము సిద్ధించును.

'సంహితాయామ్' అనునధికారము గలదు. ఇట్లు ఈమూడు సూత్రముల యర్థములచే ప్రకృతసూత్రార్థము సమగ్రమైనది. సంహిత విషయమైనపుడు (అనగా ఇక్కునకు అచ్చుతో మిక్కిలి దగ్గఱతన మున్నపుడు) ఇక్కుస్థానమున యణ్ణు వచ్చును. ఇట్లు వచ్చుట అచ్చుప్రక్కగానున్నపుడే జరుగును. స్థానమున వచ్చుననఁగా ఇక్కును తొలఁగించి యది ఉన్నచోట యణ్ణువచ్చునని యర్థము. ఇట్లున్న వర్ణమును తొలఁగించి వేఱొకవర్ణము వచ్చుటకే యాదేశమనిపేరు.

ఒకశబ్దస్వరూపములో తుదివర్ణము ఇక్ప్రత్యాహారములోని దై యుండిన యెడల, దానికి పరముగా నేదేనిఅచ్చు ఉన్నయెడల నట్టి పరిస్థితులలో ఇక్కును తొలఁగించి యణ్ ప్రత్యాహారములోని వర్ణమొకటి చేరునని ఫలితార్థము.

సుధీ+ఉపాస్యః - ఇచట ధీలోని ఈకారము ఇక్కు. (అణుదిత్సూత్రముచే) 'ఉ' అచ్చు. ఈ రెంటికి సంహిత గలదు. కావున యణు వచ్చును. కాని ఇక్కులు నాలుగున్నవి. యణులు నాలుగున్నవి. దేనికేది రానగునో నిర్ణయము చేయుటకై యీ క్రింది పరిభాష ప్రసక్తమగుచున్నది.

సూ : స్థానేఽన్తరతమః 1-1-50.

వృ : ప్రసంగేసతి సదృతమ ఆదేశ స్స్యాత్. యత్రానేక విధమాంతర్యం తత్ర స్థానత ఆన్తర్యం బలీయః, సుధ్య్ ఉపాస్యః ఇతిజాతే.

ప. వి : స్థానే (7-1) అన్తరతమః (1-1).

అర్థ : ప్రసంగమున్నయెడ మిక్కిలి సదృశమైనది ఆదేశమగును. అనేక విధమైన ఆంతర్యమున్నచోట స్థానమువలనఁ గలిగిన ఆంతర్యము బలీయము.

వివ : స్థానమనగా ప్రసంగము. ఒకవర్ణమునకు ఆదేశముగా వచ్చుటకు అనేకవర్ణములకు ప్రసక్తి యున్నయెడల అందు మిక్కిలి సదృశమైన వర్ణము మాత్రమే ఆదేశమగును. వర్ణములకు పరస్పరము సాదృశ్యమును స్థానమునుబట్టి కాని, ప్రయత్నమునుబట్టిగాని, యత్నమును (బాహ్యము) బట్టికాని నిర్ణయింపనగును. ప్రకృతమున 'సుధీ + ఉపాస్యః' అనునుదాహరణమున ఈకారమునకు అచ్చుపర మైనది కావున యణ్వర్ణమాదేశము కావలెను. యణులునాలుగు (య వ ర ల) ఇందు ఇకారస్థానమున రాఁదగిన వర్ణమేది? ఒక్కటి వచ్చునా? లేక అన్నియును పర్యాయముగాఁగాని ఒక్కమాఱుగాఁగాని వచ్చునా? అను సందేహము కలుగును. దానికీ పరిభాష పరిష్కార మొనర్చును. ఉన్నవర్ణమునకును (స్థానికిని) ఆదేశమగు వర్ణమునకును మిక్కిలిసాదృశ్య ముండవలెను. మిక్కిలిసదృశమైనది అంతరతమము. అంతరతమముయొక్క భావము ఆంతరతమ్యము. ఇది నాలుగువిధములు (1) స్థానకృతము (2) అర్థకృతము (3) గుణకృతము (4) ప్రమాణకృతము. స్థానమనఁగా తాలువు మున్నగునది. అర్థమనఁగా ప్రత్యయాదులకుఁ గలయర్థము. గుణమనఁగా ప్రయత్నము (బాహ్యాంతరములు రెండును) ప్రమాణమనఁగా హ్రస్వ దీర్ఘాదికము. ఉదాహరణములు సందర్భానుసారముగా చూతుము. ఒక్కొకయెడ అనేకవిధములగు ఆంతర్యము లుండవచ్చును. అప్పుడు స్థానమునుబట్టి యేర్పడిన ఆంతర్యమే పరిగణింపఁబడును.

ప్రకృతమున ఇ ఉ ఋ ఌ లకు య వ ర ల లు విధింపఁబడినవి. వీనిలో దేనికేది యాదేశమగు నను నిర్ణయమునకు అంతరతమ్య పరీక్ష చేయవలెను. ఇకారమునకు తాలువు స్థానము. ఆదేశములగు వర్ణములు నాల్గింటిలో యకారము తాలు స్థానికము. అట్టిది మఱియొకటి లేదు. కావున ఇకారమునకు యకారము అంతరతమము. అనఁగా ఇకారయకారములకు స్థానకృతమైన ఆంతర తమ్యము కలదన్న మాట. అట్లే ఉకారము ఓష్ఠస్థానికము. కేవలము ఓష్ఠస్థానికమగు వర్ణము యణ్ణులలో లేదు. వకారమునకు దంతోష్ఠములు స్థానము. ఓష్ఠస్థానికత యను సామ్యము రెంటికి నుండుటచే ఉకారమునకు వకారము అంతరతమము. మూర్ధస్థానికమగు ఋకారమునకు మూర్ధస్థానికమగు రేఫము అంతరతమము. దంత స్థానికమగు ఌకారమునకు కేవలదంతస్థానికమగు లకార మంతరతమము. వకారమునకు దంతములు కూడ స్థానమైయైనను ఓష్ఠ విషయముగా నది ఉకారమునకు అంతరతమమై చరితార్థమైనది కనుక ఌకారవిషయమున దానికి ప్రసక్తిలేదు. ఇట్లాంతరతమ్యమును పరిశీలించుటచే ఇకారమునకు యకారము, ఉకారమునకు వకారము, ఋకారమునకు రేఫము, ఌకారమునకు లకారము నాదేశమగునను ఏర్పాటు కలిగినది. గుణాదికృతాంతరతమ్యమును ముమ్ముందు తెలిసికొనఁగలము.

దీనినిబట్టి 'సుధీ + ఉపాస్యః' అనుచోట ఈకారమునకు యకారము మాత్రమే యాదేశమగును. సుధ్ య్ ఉపాస్యః అయినది.

అవ : ఇట్టి పరిస్థితిలో నగుకార్యవిశేష మొకటి చెప్పఁబడుచున్నది.

సూ : అనచి చ 8-4-47.

వృ : అచః పరస్య యరోద్వే వాస్తో న త్వచి.

ప. వి : అనచి (7-1) చ (అవ్య).

అను : యరః (6-1) అచః (5-1) ద్వే (1-2) వా (అవ్య).

అర్థ : అచ్చునకు పరముగానున్న యఱ్ఱునకు ద్విత్వము వికల్పముగా నగును. అచ్చు పరమగునపుడు మాత్రము కాదు.

వివ : యర్ అనునది ప్రత్యాహారము హకారము కాక తక్కిన హల్లులన్నియు నిందుఁగలవు. అందేదేనివర్ణమునకు పూర్వమున అచ్చు ఉండుట, పరమున లేకుండుట అనులక్షణములున్నచో అది రెండగును. అనఁగా నా హల్లు రెండుమారులు ఉచ్చరింపఁబడును. దీనినే ద్విత్వమందురు. ప్రకృతోదాహరణమగు 'సుధ్య్ ఉపాస్యః' అనుదానియందు ధకారము యర్వర్ణము. దానికి పూర్వమున

అచ్చుగలదు (న్+ఉ-ధ్). పరముగా యకారమున్నది. అది అచ్చు కాదు. కనుక లక్షణము సరిపడుటచే ద్విత్వము వచ్చును. 'సు ధ్ ధ్ య్ ఉపాస్యః' అగును. ఈవిధి వైకల్పికము కావున రానిచో 'సు ధ్ య్ ఉపాస్యః' అను రూపము కూడ నుండును.

అవ : ఇందు మొదటిధకారము దకారమగుటను క్రిందిసూత్రము విధించు చున్నది.

సూ : ఝలాం జశ్ ఝశి 8–4–53.

వృ : స్పష్టమ్. ఇతి ధకారస్య దకారః.

ప. వి : ఝలాం (6–3) జశ్ (1–1) ఝశి (7–1).

అర్థ : ఝల్లులకు ఝశ్శుపరమగునపుడు జశ్శువచ్చును. దీనిచే ధకారమునకు దకారమాదేశమగును.

వివ : 'ఝలామ్' అను షష్ఠ్యంతపదమునకు 'షష్ఠీస్థానేయోగా' అను పరిభాషచే 'ఝల్లుల స్థానమున' అని యర్థము. 'ఝశి' అను సప్తమ్యంత పదమునకు 'తస్మిన్నితి నిర్దిష్టేపూర్వస్య' అను పరిభాషచే 'ఝశ్శుపరమగునపుడు' అనియర్థము. ఝల్, జశ్, ఝశ్శులు ప్రత్యాహారములు. ఝల్లులనఁగా అనునాసికములు కాక తక్కిన వర్గాక్షరములు. శష స హలును. ఝశ్శులనఁగా వర్గ తృతీయచతుర్థాక్షరములు. జశ్శులనఁగా వర్గ తృతీయాక్షరములు. 'స్థానేఽన్తరతమః' అను పరిభాషచే ప్రకృతోదాహరణమున దంత స్థానికమగు ధకారమునకు దంతస్థానికమగు దకారమాదేశమగును. కాఁగా 'సు ద్ ధ్ య్ ఉపాస్యః' అయినది. (ఇదిద్విత్వము వచ్చిన పక్షమున జరుగుమార్పు).

అవ : పై ఉదాహరణమున యకారమునకు క్రిందిసూత్రముచే లోపము ప్రాప్తించుచున్నది. (ఒకకార్యము రావలసియున్నది కాని పర్యవసానమున రాదు అను నభిప్రాయమున్నచోట 'ప్రాప్తించు' అను ధాతువును ప్రయోగింతురు.)

సూ : సంయోగాన్తస్య లోపః 8–2–23.

వృ : సంయోగాన్తం యత్ పదం తదన్తస్య లోపః స్యాత్.

ప. వి : సంయోగాన్తస్య (6–1) లోపః (1–1).

అను : పదస్య (6–1).

అర్థము : సంయోగసంతసుందుగల పదముయొక్క అంతమునకు లోపము వచ్చును.

వివ : సంయోగమనఁగా నడుమ అచ్చులు లేని హల్లుల సముదాయము (హలోఽనన్తరాస్సంయోగః). 'సంయోగాన్తస్య' అనునది 'పదస్య' అనుదానికి విశేషణము. కావున సంయోగమంతమందుఁగల పదమునకు లోపము వచ్చునని స్థూలముగా అర్థము వచ్చినది. లోపమనఁగా నున్నది కన్పడకుండుట (అదర్శనం లోపః) పదమనఁగా విభక్త్యంతము (సుప్తిఙన్తం పదమ్).

ఈ సూత్రమునుబట్టి పదమంతయు లోపింపవలసి వచ్చును. అది సమ్మతము కాదు. కనుక పరిభాష నాశ్రయించి యిచట సరియగు నర్థమును గ్రహింపవలసియున్నది.

సూ : అలోఽన్త్యస్య 1-1-52.

వృ : షష్ఠీ నిర్దిష్టాన్త్యస్యాల ఆదేశో భవతి.

ప. వి : అలః (6-1) అన్త్యస్య (6-1).

అను : షష్ఠీ (1-1) స్థానే (7-1).

అర్థ : ఆదేశము షష్ఠీవిభక్తిచే నిర్దేశింపఁబడినదానియొక్క తుదివర్ణమున కగును.

వివ : అల్ అను ప్రత్యాహారము అన్ని వర్ణములను దెలుపును. అలః అనునది షష్ఠ్యంతము. అన్త్యస్య అనునది దానికి విశేషణము. అన్త్యమైన వర్ణమునకు వచ్చును అని ఈ రెండుపదములకు నర్థము. అను వృత్తమైనస్థానే అనుపదము వలన ఆదేశము అనునది సిద్ధమగును. ఒకసూత్రమున ఒకదానిని షష్ఠ్యంత పదముచే నిర్దేశించి ఒకయాదేశము విధించినయెడల ఆదేశము ఆషష్ఠ్యంతపదముచే నిర్దేశింపఁబడినదానియొక్క తుదివర్ణమునకు వచ్చును అని సూత్ర తాత్పర్యము. (సంయోగాన్తస్య లోపః)

ప్రకృతమున సంయోగాన్తమైనపదము షష్ఠ్యంతపదముచే నిర్దేశింపఁబడినది. లోపమనునాదేశము విధింపఁబడినది. అలోపము, షష్ఠీనిర్దిష్టమైన సంయోగాంత పదమునకు మొత్తమునకు కాక దాని తుది వర్ణమునకు మాత్రమే వచ్చునని యీ పరిభాషవలన తెలిసినది. ఇచట 'సు ద్ ధ్ య్' అనునది పదము. (సుధీ యొక్క రూపాంతరము) ఇందు 'ద్ ధ్ య్' అను మూడును హల్లులు. దీనికి నడుమ అచ్చులేదు కనుక ఈమూడును గలిపి సంయోగమనఁబడును. కావున 'సు ద్

ధ్ య్' అనునది సంయోగమంతమందుఁగల పదము. దానికి (సంయోగాన్తస్య లోపః అను సూత్రముచే) విధింపఁబడిన లోపము ప్రకృత పరిభాషచే తుదివర్ణమైన యకారమునకు మాత్రమే ప్రాప్తించును. ఈ విషయమునే వృత్తికారుఁడు చెప్పుచున్నాఁడు.

వృ : ఇతి యలోపే ప్రాప్తే.

అర్థ : ఇట్లు 'సంయోగాన్తస్యలోపః' అను సూత్రముచే యకారమునకు లోపము ప్రాప్తించుచుండఁగా.

క్రింది వార్తికము దానిని వారించుచున్నది.

వా : యణః ప్రతిషేధో వాచ్యః (4806).

ప. వి : యణః (1-1) ప్రతిషేధః (1-1) వాచ్యః (1-1).

అర్థ : సంయోగాన్తలోపము యణ్ణులకు రాదని చెప్పవలయును.

వివ : సంయోగాంతపదముయొక్క తుదివర్ణము య, వ, ర, ల అను వానిలో నొకటి యైనచో దానికిలోపము ప్రవర్తింపదు అని వార్తికకారులు సూత్రమును సవరించిరి. యణ్భిన్నవర్ణములకే సంయోగాంతలోపమని తాత్పర్యము.

ఇట్లు యలోపమును శంకించి రాదనిచెప్పినతరువాత వృత్తికారులు ఇ ఉ ఋ ఌ లకు క్రమముగా నుదాహరణములు చూపుచున్నారు.

వృ ; సుద్ధ్యుపాస్యః. మద్ధ్వరిః. ధాత్త్రంశః. లాకృతిః.

వివ : పైవానిరూప నిష్పత్తి క్రమమును క్రిందివిధముగా పరిశీలింపనగును. పై చెప్పిన సూత్రములన్నియు ఈ ఉదాహరణము లన్నింటి యందును వర్తింపవు. కారణమరయఁ దగును.

| సూ. | | | | |
|---|---|---|---|---|
| | సుధీ + ఉపాస్యః | మధు + అరిః | ధాతృ + అంశః | ఌ+ఆకృతిః |
| ఇకోయణచి | - సుధ్య్ఉపాస్యః | మధ్+వ్+అరిః | ధాత్ర్అంశః | ల్+ఆకృతిః |
| అనచిచ | - సుద్ధ్య్ఉపాస్యః | మద్ధ్వ్అరిః | ధాత్త్ర్అంశః | — |
| ఝలాంజశ్ఝశి | - సుద్ధ్య్ఉపాస్యః | మద్ధ్వ్అరిః | — | — |
| సంయోగాన్తస్యలోపః యణఃప్రతిషేధో వాచ్యః | సుద్ధ్యుపాస్యః | - మద్ధ్వరిః | ధాత్త్రంశః | లాకృతిః. |
| ద్విత్వమురానిచో | - సుధ్యుపాస్యః | - మధ్వరిః | ధాత్రంశః | |

'లాకృతిః' అనుచోట ద్విత్వమునకు ప్రసక్తి లేదు. లకారమునకు పూర్వమున అచ్చులేదు. ధాత్త్ర్ అంశః అనుచోట ఝశ్వర్ణము పరమున లేదు కనుక జశ్త్వకు ప్రాప్తి లేదు.

సంధి ప్రకరణమున నింతవఱకుఁ జెప్పినసూత్రములన్నియు నేకోన్ముఖముగా ప్రవర్తించినవి. దానినొక మాఱవలోకింతము.

ప్రకృతమున 'ఇకోయణచి' అనునది ప్రధానసంధి సూత్రము. 'అనచిచ' అనునది ద్విత్వమును విధించిన సూత్రము. 'ఝలాంజశ్ ఝశి' అనునది 'సుద్ధ్యుపాస్యః' 'మద్ధ్వరిః' అనునుదాహరణములలో మొదటి ధకారమునకు దకారాదేశమును (జశాదేశమును) విధించినది. 'సంయోగాన్తస్యలోపః' అనునది పై మొదటి మూఁడుదాహరణములలో క్రమముగా యకారవకారరేఫములకు లోపమును జెప్పుచుండగా 'యణః ప్రతిషేధో వాచ్యః' అను వార్తికము దానిని వారించినది. ఈ యుదాహరణముల సిద్ధియందు 'షష్ఠీస్థానేయోగా' 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య' 'స్థానేఽన్తరతమః' 'అలోఽన్త్యస్య' అను పరిభాషలు అవసరములయినవి. 'సంహితాయామ్' అనునది సంధివిషయమున సాధారణమైన యధికార సూత్రము ఇట్లు సంధి ప్రకరణమున ఆరంభమునుండి యింతవఱకుఁ గలవిషయమును సమన్వయము చేసికొనఁదగును.

అవ : అయవాయావాదేశసంధి చెప్పఁబడుచున్నది.

సూ : ఏచోఽయవాయావః 6-1-78.

వృ : ఏచః క్రమాత్ అయ్, అవ్, ఆయ్, ఆవ్ ఏతే స్యురచి.

ప. వి : ఏచః (6-1) అ య వా యా వః (1-3).

అను : అచి (7-1) సంహితాయామ్ (7-1).

అర్థ : సంహితయున్నపుడు ఏచ్చులకు, అచ్చుపరమగుచో, క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనునాదేశములు వచ్చును.

వివ : ఏచ్ ప్రత్యాహారమున ఏ ఓ ఐ ఔ లు గలవు. 'అచి' అనుసప్తమ్యంతపదమునకు అచ్చుపరమున నుండగా అని యర్థము. 'ఏచః' అను షష్ఠ్యంత పదమునకు 'ఏచ్చులస్థానమున' అని యర్థము. క్రమాత్ - క్రమముగా అనునర్థమెట్లు వచ్చెనో ముందు సూత్రము చెప్పును. అచ్చుపరమగునపుడు ఏకారమునకు 'అయ్', ఓకారమునకు 'అవ్', ఐకారమునకు 'ఆయ్', ఔకారమునకు 'ఆవ్' అనునాదేశములు వచ్చునని సూత్రతాత్పర్యము.

'స్థానేఽన్తరతమః' అను పరిభాష ప్రకృతసూత్రమున నర్థనిర్ణయమును జేయఁజాలదు. ఇందు అయ్, ఆయ్ అనునవి ఏ ఐ లకు, అవ్, ఆవ్ అనునవి ఓ ఔలకు రెండురెండుగా అంతరతమములగును. కావున వేరొక పరిభాష అవసరమగు చున్నది. అది యిటఁ జెప్పఁబడుచున్నది.

సూ : యథాసంఖ్య మనుదేశః సమానామ్ 1-3-10.

వృ : సమసమ్బన్ధీ విధి ర్యథాసంఖ్యం భవతి.

ప. వి : యథాసంఖ్యమ్ (2-1) అనుదేశః (1-1) సమానామ్ (6-1).

అర్థ : సమసంబంధియగు విధి యథాసంఖ్యముగా నగును.

వివ : దేని నుద్దేశించి యొకకార్యమును విధింతుమో యది ఉద్దేశ్య మనఁబడును. ఏది విధింపఁబడునో యది విధేయము. ఏ పరిస్థితులలో ఆ కార్యము విధింపఁబడునో యాస్థితిని నిమిత్తమందురు. ఉదాహరణమునకు ప్రకృత సూత్రమున ఏచ్చునుద్దేశించి, అచ్చు పరమగుట నిమిత్తమైనపుడు, అయవా యావాదేశము విధింపఁబడుచున్నది. కావున ఏచ్చు ఉద్దేశ్యము, అచ్చుపరమగుట నిమిత్తము, అయవాయాదేశము విధేయము. ఎచట ఉద్దేశ్య విధేయములు, లేక ఈ మూడింటిలో ఏ రెండుగాని సమానమైన సంఖ్యలో నుండునో ఆకార్యము సంఖ్యానుసారముగ నగునని సూత్రతాత్పర్యము. ప్రకృతసూత్రమున ఉద్దేశ్యములయిన ఏచ్చులు నాలుగు. విధేయములయిన ఆదేశములు నాలుగు. అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనునవి. ఆ నాల్గింటికి నీనాలుగును సంఖ్యాక్రమము ననుసరించి వచ్చుననుట నీ సూత్రము తెలుపుచున్నది దీనినిబట్టి ఏ—అయ్, ఓ—అవ్, ఐ - ఆయ్, ఔ—ఆవ్ అను రీతిగా నాదేశములగునని ఫలితార్థమేర్పడినది. ఈ సూత్రమును బట్టియే పై సూత్రవృత్తియందు క్రమాత్ - క్రమముగా అనుపదము గ్రహింపఁబడినది.

అయవాయా వాదేశమున కుదాహరణములు ప్రదర్శింపఁబడుచున్నవి.

వృ : హరయే, విష్ణవే, నాయకః, పావకః.

వివ : 'హరి' అను ప్రాతిపదికమునకు చతుర్థీ విభక్త్యేక వచన ప్రత్యయము (ఙే = ఏ) పరమగునపుడు గుణము వచ్చి హరే + ఏ అనికాఁగా ప్రకృతసంధి సూత్రముచే (ఏచోఽయవాయావః) రేఫము తరువాతి ఏకారస్థానమున అయాదేశము వచ్చును. ఇట్లు అయాదేశము వచ్చుటకు ప్రక్కనున్న అచ్చు (ఏ) నిమిత్తము. హర్ + ఏ + ఏ - హర్ + అయ్ + ఏ = హరయే.

ఇక్లే విష్ణు + జే - విష్ణు + ఏ - విష్ణో + ఏ-విష్ణ్ + ఓ + ఏ విష్ణ్ + అవ్ + ఏ = విష్ణవే అగును.

'నీ' అనుధాతువునకు కర్త్రర్థమున (నడపువాఁడు అనునర్థమున) 'ణ్వుల్' అను ప్రత్యయము వచ్చును. అందు ణకారలకారములు లిత్తులు. లోపించును. మిగిలిన 'వు' అనుదానికి 'అక' అనునాదేశము విధింపఁబడినది. నీలోని అచ్చునకు వృద్ధి (ఐ) విధింపఁబడినది. ఇట్లు నై + అక అనియుండ ప్రకృతసూత్రముచే ఐకారమునకు 'ఆయ్' ఆదేశమురాగా న్ + ఆయ్ + అక = నాయక అగును. నాయకః. (ప్రథమైకవచనరూపము).

ఇక్లే పూ (ధాతువు) ణ్వుల్ - ప్రత్యయము-పూ + వు పూ + అక, పౌ + అక ప్ + ఆవ్ + అక = పావక-పావకః అగును.

అవ : ఈ నాలుగాదేశములలో అవ్, ఆవ్ అనునవి కొన్నియెడల హల్లు పరమగునపుడును వచ్చును. ఆ విషయమును దెలుపు 'వాన్తో యి ప్రత్యయే' అను వక్ష్యమాణ సూత్రమున కవసరమగు పరిభాష యొకటి చెప్పఁబడుచున్నది.

ప : యస్మిన్విధి స్తదాదా వల్గ్రహణే.

ప. వి : యస్మిన్ (7-1) విధిః (1-1) తదాదౌ (7-1) అల్గ్రహణే (7-1).

అర్థ : అల్గ్రాహకమైన సప్తమ్యంతపదము విశేషణము కాఁగా విధింపఁబడిన కార్యము ఆ వర్ణమాదియందుఁగలది పరమగునపు డగును.

వివ : అల్ అనుప్రత్యాహారము అన్నివర్ణములను గ్రహించును. 'యస్మిన్' అనునది సప్తమికి చిహ్నము. అల్గ్రహణమనగా వర్ణమును గ్రహించుట. ఒక వర్ణమును లేదావర్ణసముదాయమును సప్తమీ విభక్త్యంతము చేసి, దానినొకదానికి విశేషణముగాఁ జేసి ఏదేని కార్యము విధింపఁబడునేని ఆ కార్యము ఆ వర్ణము ఆదియందుఁగల ఆ అంశము పరమగునపుడు పూర్వమున నున్నదానికి అగును అని తాత్పర్యము. ఉదాహరణము ముందుసూత్రమున చూడనగును.

సూ : వాన్తో యి ప్రత్యయే 6-1-79.

వృ : యకారాదౌ ప్రత్యయే పరే ఓదౌతోః అవ్ ఆవ్-ఏతౌస్తః. గవ్యమ్, నావ్యమ్.

ప. వి : వాన్తః (1-1) యి (7-1) ప్రత్యయే (7-1).

అర్థ : యకారమాది యందుఁగల ప్రత్యయము పరమగునపుడు ఓ ఔలకు క్రమముగా అవ్ ఆవ్ అనునాదేశములు వచ్చును. ఉదా : గవ్యమ్, నావ్యమ్.

వివ : వాన్తః అనగా వకారము అంతమందుఁ గలది. పూర్వసూత్ర సంబంధము వలన వాన్తమనఁగా పైనాలుగు ఆదేశములో వకారము అంతమందుఁగల ఆదేశములు-అవ్, ఆవ్ అనునవి. పూర్వసూత్రానుసారము ఈ ఆదేశములు రెండును క్రమముగా ఓ ఔలకు వచ్చును. 'యి' 'ప్రత్యయే' అనునవి యిచట నిమిత్తమును దెలుపుచున్నవి. ఇందు 'యి' అనుదాని అర్థమును నిర్ణయించుటకే పై పరిభాష చెప్పఁబడినది. 'య్' అనునది ఒకవర్ణము. దానిని సప్తమ్యంత పదముగా చేయఁగా 'యి' అయినది. అది ప్రత్యయే అనుదానికి విశేషణము. 'తస్మిన్నితినిర్దిష్టే పూర్వస్య' అను పరిభాషచే ప్రత్యయే అనగా ప్రత్యయము పరమగునపుడు అని యర్థము. ఆ ప్రత్యయమెట్టిది కావలయునను సంశమునను 'యి' అనునది నిరూపించును. ఇందుఁ జెప్పఁబడిన యకారము ప్రత్యయముయొక్క తొలివర్ణము కావలయునా? తుదివర్ణము కావలయునా? లేక యకారమే ప్రత్యయ స్వరూపము కావలయునా? ఇత్యాది సందేహమిట జనించును. దానిని నివారించుటకై యీ పరిభాష నాశ్రయించితిమి. 'యి' అనునది వర్ణగ్రాహకమైన సప్తమ్యంత పదము. అది ప్రత్యయే అనుదానికి విశేషణముగాఁ జేయఁబడినది. అవావాదేశ మిట విధేయము. కనుక 'యి' అనుదానికి 'అది ఆదియందుఁగల' అనునర్థమిట నీ పరిభాషచే సంభావితమగుచున్నది. కావున 'యకారమాది యందుఁగల ప్రత్యయము పరమగునపుడు' ఓ ఔలకు అవ్, ఆవ్ అనునాదేశములు క్రమముగా వచ్చునను సూత్రార్థము సిద్ధమైనది. పూర్వసూత్రమున అచ్చు పరమగునపుడు మాత్రమే విధింపఁబడిన యీ యాదేశము లిట హల్లు (య) పరమగునపుడు వచ్చుచున్నవి కనుక విశేషముగాఁ జెప్పఁబడినవి.

ఉదా : గవ్యమ్ - గోవుయొక్క వికారము-క్షీరాదికము అనునర్థమున గో శబ్దమునకు యత్ అను తద్ధిత ప్రత్యయము విధింపఁబడినది. గో + యత్-(తకార మిత్తు). ఇందు 'య' అనునది యకారాది ప్రత్యయము. అది పరమైనపుడు పూర్వమునన్న ఓకారమునకు ప్రకృతసూత్రముచే అవాదేశము వచ్చును. గో + య - గ్ + అవ్ + య-గవ్య-గవ్యమ్.

నావచే తరింపఁదగినది అనునర్థమున నౌశబ్దమునకు యత్ ప్రత్యయము విధింపఁ బడినది. నౌ + య-న్+ఆవ్+య=నావ్య - నావ్యమ్.

ఇట్లే అవాదేశము రాఁదగిన మఱియొక సందర్భము నీ క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా : అధ్వపరిమాణే చ (3544).

వృ : గవ్యూతిః.

ప. వి : అధ్వపరిమాణే (7-1) చ (అవ్య).

వి : ఈ వార్తికమునకు ముందు 'గోర్యూతౌ ఛందస్యుప సంఖ్యానమ్' అను వార్తికము గలదు. గోశబ్దమునకు యూతిశబ్దము పరమగునపుడు, వేదమున, అవాదేశము వచ్చునని వార్తికార్థము. అట్లు వేదమునందే కాక లోకభాషయందును గోశబ్దమునకు యూతిశబ్దము పరమైనపుడు మార్గముయొక్క కొలత తెలియఁబడునపుడు అవాదేశము వచ్చునని యీ వార్తికము చెప్పుచున్నది. గో + యూతిః అని యుండఁగా అచ్చు పరముగా లేనికారణమున ఏచోఽయవాయావః అనుసూత్రము చేతను, 'యూతి' అనునది ప్రత్యయముకాదు కాన వాన్తోయిప్రత్యయే' అను సూత్రముచేతను అవాదేశము వచ్చుటకు వీలులేనందువలన ఈ వార్తికముచే ప్రత్యేకముగా అవాదేశము విధింపఁబడినది. గో + యూతిః - గ్+అవ్+యూతిః - గవ్యూతిః. గవ్యూతి యనఁగా రెండుక్రోశముల దూరమని యర్థము.

'ఏచోఽయవా యావః' మొదలుకొని యింతవఱకుఁగల భాగము అయవా యావాదేశమునకు సంబంధించినది.

అవ : ఇటుపై గుణసంధి చెప్పఁబడుచున్నది. కానగుణమనగానేమియో తెలుపు సంజ్ఞా సూత్రమిట జెప్పఁబడుచున్నది.

సూ : అదేఙ్గుణః 1-1-2.

వృ : అత్ ఏఙ్ చ గుణసంజ్ఞ స్స్యాత్.

ప. వి : అదేఙ్ (1-1) గుణః (1-1).

అర్థ : అత్తు, ఏఙ్ఞు - ఇవి గుణసంజ్ఞకలవి అగును.

వివ : 'అత్' అనగా హ్రస్వ అకారము, ఏఙ్ ప్రత్యాహారము ఏ ఓ లను బోధించును. కాన హ్రస్వఅకారమునకును, ఏ ఓ లకును ఈ వ్యాకరణమున గుణమనిపేరు. ఈ మూఁడక్షరములను వ్యవహరింపఁదలఁచినపుడెల్ల గుణపదమును ప్రయోగింతురని తాత్పర్యము.

అవ : పై సూత్రమున 'అత్' అనుపదమునకు హ్రస్వఅకారమను నర్థము ను గ్రహించితిమి. అది యెట్లు సిద్ధించెనో క్రింది పరిభాష చెప్పుచున్నది.

సూ : తపరస్తత్కాలస్య. 1-1-70.

వృ : తః పరో యస్మాత్ సచ, తాత్పర శ్చోచ్చార్యమాణ సమకాలస్యైవ సంజ్ఞాస్యాత్.

ప. వి : తపరః (1-1) తత్కాలస్య (1-1).

అర్థ : తకారము పరమందుఁగలదియు, తకారమునకు పరమందున్నదియు నుచ్చరింపఁబడుసర్వముయొక్క సమకాలమునకే సంజ్ఞ యగును.

వివ : ఇదియొక పరిభాష. 'తపరః' అను సమాసమునకుఁ బ్రకృతమున రెండువిధములుగా విగ్రహము చెప్పఁబడినది. (1) తః పరోయస్మాత్ దేనికి తకారము పరముగాఁ గలదో అది - అత్ - ఈత్ మొ॥ది. (బహువ్రీహి), (2) తాత్పరః - తకారమునకుఁ బరముగానున్నది -త- (త్ + అ) (తత్పురుషము). సూత్రమునందలి కాలశబ్దసామర్థ్యముచేత ఉచ్చారణమునందు కాలభేదములు గల అచ్చులు మాత్రమే గ్రహింపఁబడును. ఇంతకుముందు 'అణుదిత్సవర్ణస్య చాప్ర త్యయః' అను పరిభాష అచ్చులలో నేదేనొకటి గ్రహింపఁబడినచో వాని సవర్ణము లన్నియు గ్రహింపఁ బడునని, తేల్పినది. దానికీసూత్రము అపవాదము. హ్రస్వ దీర్ఘ ప్లుతములలో నేదోయొకభేదమే గ్రహింపఁబడవలసినపుడు, వానిలో నేది యవ సరమో దానికి ముందు గాని తరువాతగాని 'త్' అనునక్షరము చేర్చినయెడల అది యాభేదమును (హ్రస్వాదికమును) మాత్రమే గ్రహించి తక్కినవానిని వదలును. ఉదా : అత్ - 'అ' అను ఏకమాత్రోచ్చరితమైన అకారమునకుఁ బరముగా 'త్' అను దానిని చేర్చుటచే నిచట హ్రస్వఅకారమే గ్రహింపవలయు ననుట సూచి తము. ఆతకారము లేనిచో 'అ' అనునది తన సవర్ణములైన పదునెనిమిదింటిని గ్రహించును. అత్వలె 'త' అనునదియు హ్రస్వఅకారమునకే సంజ్ఞ. దీనిని బట్టియే 'అదేఙ్గుణః' అనుసూత్రమున అత్ అనుదానికి హ్రస్వ అకారమను నర్థము గ్రహింపఁబడినది. ఈత్ అనగా దీర్ఘఇకారము. ఊ3త్ అనగా ప్లుతఉకారము, ఇత్యాద్యర్థమీసూత్రముచే సిద్ధించును.

తకారము ముందుండుట కుదాహరణముగా ప్రకృత సూత్రమునే గ్రహింప వచ్చును. త్ + ఏచ్ - ఇచట తకారమును ముందుంచుటచే దీర్ఘములైన ఏచ్‌లే గ్రహింపఁబడును గాని వానిప్లుతములు గ్రహింపఁబడవు. కావున ప్లుతములైన ఏచ్ లకు గుణసంజ్ఞలేదు.

ఇట్లు తకారమును జేర్చి హ్రస్వాద్యన్యతమ గ్రహణము చేయుటకే తపర కరణమని పేరు.

అవ : సంధి విషయమునకు సంబంధించిన పటియొక్క అధికారసూత్ర మిచటఁ జెప్పఁబడుచున్నది.

సూ : ఏకః పూర్వపరయోః 6-1-84.

వృ : ఇత్యధికృత్య.

ప. వి ; ఏకః (1-1) పూర్వపరయోః (6-2).

అర్థ : ఇది యధికారము.

వివ : ఇది యధికారసూత్రము. 6-1-109 వఱకుఁగల సూత్రములలో నిది అధికారరూపమున ప్రవేశించి యర్థము చెప్పును. పూర్వాక్షరముయొక్కయు, పరాక్షరము యొక్కయు స్థానమున నొక్కటి యాదేశమగునని సూత్రార్థము. ముందు చెప్పఁబోవు గుణాదికము ఈ యధికారమువలన ఏకాదేశరూపమున నగునని తాత్పర్యము. ఒకవర్ణము స్థానమున నొకవర్ణమే వచ్చుచో అదేశమనియు, రెండువర్ణముల స్థానమున ఒకవర్ణము వచ్చుచో ఏకాదేశమనియుఁ దెలియునది.

అవ : గుణసంధి విధింపఁబడుచున్నది.

సూ : అద్గుణః 6-1-87.

వృ : అవర్ణాదచిపరే పూర్వపరయోరేకో గుణోఽన్తరతమ ఆదేశఃస్యాత్. ఉపేన్ద్రః. గంగోదకమ్.

ప. వి : అత్ (5-1) గుణః (1-1).

అను : సంహితాయామ్ (7-1) ఏకః (1-1) పూర్వపరయోః (6-2) అచి (7-1).

అర్థ : అవర్ణమునకు అచ్చుపరమగునపుడు పూర్వపరముల స్థానమున అంతరతమమైన గుణమొక్కటి ఆదేశమగును. ఉదా : ఉపేన్ద్రః, గంగోదకమ్.

వివ : ఈ సూత్రమున 'అత్' అనునెడ తపరకరణముకాదు. 'అ' అను ప్రాతిపదికమునకు పంచమీవిభక్త్యేకవచన ప్రత్యయము చేరగా నేర్పడిన రూపము (రామ-రామాత్, అ-అత్). కావున అవర్ణమునకు అనగా హ్రస్వదీర్ఘములు రెండును గ్రహింపఁబడును. ప్లుతమునకు అచ్చుపరమగునపుడు సంధిరాదని ముందుఁ జెప్పఁబడును. 'అచి' అనుదానిచే పరమైన అచ్చుకూడ హ్రస్వ దీర్ఘములలో నే దేని కావచ్చును (అణుదిత్స వర్ణస్యచాప్రత్యయః) 'స్థానేఽన్తరతమః' అను పరిభాషచే 'అంతరతమమైన' అనునర్థము లభ్యమైనది. కావున అకారమున కేదేని

అచ్చుపరమగునపుడు, పూర్వమగు అకారముయొక్కయు, పరమగు అచ్చు యొక్కయు స్థానమున గుణమనుపేరుగల యక్షరము, మిక్కిలి సదృశమైనది, ఒక్కటి వచ్చునని సూత్ర తాత్పర్యము.

ఉదా : ఉప+ఇన్ద్రః- ఇచట 'ప' లోని అకారమునకు, 'ఇన్ద్రః' లోని ఇకారమునకు సంహిత గలదు. అకారమునకు 'ఇ' అను అచ్చు పరమైనది. కావున ప్రకృత సూత్రముచే గుణము రావలయును. గుణము అనగా అ, ఏ, ఓ. ఇందు మిక్కిలి సదృశమైనది రాఁదగును. ఇచటస్థానులు అ ఇ లు. అకారమునకు కంఠమును, ఇకారమునకు తాలువును స్థానములు. గుణములలో ఏకారమునకు కంఠతాలువులు స్థానములు కనుక అదియే యిట అంతరతమము కావున ఉప్ + (అ + ఇ) ఏ + న్ద్రః = ఉపేన్ద్రః అగును.

ఇట్లే 'గంగా + ఉదకమ్' అనుచోట కంఠస్థానికమగు అకారముయొక్కయు ఓష్ఠస్థానికమగు ఉకారముయొక్క స్థానమున కంఠోష్ఠస్థానికమగు ఓకారమంతరతమమై ఏకాదేశమగును. గంగ్ + (అ + ఉ) ఓ + దకమ్=గంగోదకమ్.

ఈ సూత్రమున అచ్ పదముచే ఇ ఉ ఋ ఌలు మాత్రమే గ్రహింపఁబడును తక్కిన యచ్చులకు వేర్వేఱు అపవాదములు గలవు.

అవ : ఈ గుణసంధికే కృష్ణర్ధిః, తవల్కారః అను మఱి రెండుదాహరణములు చూపఁబడుచున్నవి. అందుగుణమగు అకారము ఋకారమునకు రపరముగా ఌకారమునకు లపరముగా నాదేశమగుచున్నది. అట్లు రలపరముగా వచ్చునని నిర్దేశించు పరిభాషా సూత్రము 'ఉరణ్ రపరః' అను వక్ష్యమాణసూత్రమునందలి 'ర' అనునది ప్రత్యాహారమనుటకై ఇత్సంజ్ఞావిధాయక సూత్రము ఆరంభింపఁబడుచున్నది.

సూ : ఉపదేశేఽజనునాసిక ఇత్ 1-3-2.

వృ : ఉపదేశే అనునాసికోఽజిత్సంజ్ఞస్స్యాత్. ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః.

ప. వి : ఉపదేశే (7-1) అచ్ (1-1) అనునాసికః (1-1) ఇత్ (1-1)

అర్థ : ఉపదేశమున అనునాసికమైన అచ్చు ఇత్సంజ్ఞక మగును. పాణినీయులు అనునాసిక్యము నెఱిఁగినవారు.

వివ : మాహేశ్వరసూత్రవివరణమున 'లణ్' సూత్రములోని అకారమున కిత్సంజ్ఞ కలదని చెప్పఁబడినది. హకారాదులలోని అకార ముచ్చారణార్థమనియుఁ జెప్పఁబడినది. 'లణ్'లోని అకారమున కిత్సంజ్ఞ యీ సూత్రముచే విధింపఁబడు చున్నది. ఉపదేశమున అనునాసికమైన అచ్చు ఇత్తగును. ప్రత్యయాగమాదుల లోని అచ్చు అనునాసికమో, కాదో తెలియుటకుఁ దగిన చిహ్నము నేఁడు కన్పట్టదు. అట్టియెడ ఏది అనునాసికమో, ఏదికాదో తెలియుటకు మార్గములేక ఏయచ్చు ఇత్తగునో యేదికాదో నిరూపించుట కష్టమగును దీనికొఱకే 'ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః' అనువాక్యము వృత్తిలోఁ జెప్పఁబడినది. పాణినీయ మనఁగా పాణిని విరచితమగు వ్యాకరణ సూత్రాదికము పాణినీయులనఁగా దానిని సంప్రదాయ పద్ధతిలో నధ్యయనము చేయువారు. వారికి పరంపరాక్రమముగా అధ్యయనము చేసి నందువలన నేది యనునాసికమగు అచ్చో ఏదికాదో తెలియును. కనుక వ్యాఖ్యాతలు అనునాసికముగా నిర్దేశించిన వానిని ప్రమాణముగఁ గొని ఏ అచ్చు ఇత్తగునో తెలియవలయును. నేఁడు అనునాసికలేఖన చిహ్నము గ్రంథములలో లుప్తమైనను, వేదపాఠకులు పుస్తకసాహాయ్యము లేకయే స్వరజ్ఞానమును గలిగియున్నట్లు, పాణినీయులు లేఖన చిహ్నము లేకయే యానునాసిక్యమును దెలియ జాలుదురు.

అవ : ఈ సూత్రమిట చెప్పఁబడినదానికి ప్రయోజనమును వృత్తికారులు వివరించుచున్నారు.

వృ : లణ్ సూత్రస్థావర్ణేన సహోచ్చార్యమాణో రేఫో రలయోస్సంజ్ఞా.

అర్థ : లణ్ సూత్రము లోని అవర్ణముతోఁగూడి ఉచ్చరింపఁబడు రేఫము రలలకు సంజ్ఞయగును.

వివ : 'ఆదిరన్త్యేన సహేతా' అను సూత్రమునుబట్టి అంత్యమైన ఇద్వర్ణమైన లణ్ సూత్రములోని అకారముతోఁ గలిపి ఉచ్చరింపఁబడిన ఆదివర్ణమగు రేఫము (హయవరట్‌లోనిది) 'ర' అను ప్రత్యాహారముగ నేర్పడును. హ య వ (రట్ ల) ణ్. ర్+అ=ర. నడుమనున్నటకార మిత్సంజ్ఞకము దానికి గ్రహణము లేదు. కావున 'ర' అను ప్రత్యాహారము రేఫలకారములకు సంజ్ఞయగును. అణ్ అనగా అ ఇ ఉ లు గ్రహింపఁబడినట్లు, ర అనగా ర, లలు గ్రహింపఁబడునని ఫలితార్థము.

హ యవ మున్నగువానిలోని అకారముతో ప్రత్యాహారము చేయఁజాలము ఇత్సంజ్ఞ యున్నదానితోడనే ప్రత్యాహార మేర్పడును. అచ్చు ఇత్తుకావలయునన్న

అనునాసికమై యుండవలెను. మాహేశ్వరసూత్రములలో 'లణ్'లోని అచ్చుకాక తక్కినదెల్ల అనునాసికము కాదు. కావున వానితో ప్రత్యాహార మేర్పడదు.

అవ : ఈ ర ప్రత్యాహారమీ క్రిందిసూత్రమున ప్రయుక్తమైనది.

సూ : ఉరణ్ రపరః 1-1-51.

వృ : ఋ ఇతి త్రింశత స్సంజ్ఞేత్యుక్తమ్. తత్స్థానే యోఽణ్ సరపర స్సన్నేవ ప్రవర్తతే.

ప. వి : ఉః (6-1) అణ్ (1-1) ర ప రః (1-1).

అర్థ : ఋకారము ముప్పదింటికి సంజ్ఞయని చెప్పఁబడినది. ఆ ముప్పదింటి స్థానమున విధింపఁబడిన అణు రపరముగా మాత్రమే ప్రవర్తించును.

వివ : ఇది పరిభాషాసూత్రము. 'ఉః' అనునది 'ఋ' అను ప్రాతిపదికము యొక్క షష్ఠీ విభక్త్యేక వచనరూపము. కాన 'ఉః' అనగా 'ఋకారముయొక్క' యనియర్థము. ఉదా - ధాతృ (ప్రాతిపదికము) ధాతా (ప్రథమాఏకవచనము) అట్లే ఋ ఆ ప్ర, ఏ. ధాతుః షష్ఠీఏకవచనము ఉః - ష. ఏ. షష్ఠీ స్థానేయోగా అను పరిభాషచే ఉః అనుదానికి ఋకారముయొక్కస్థానమున అనునర్థము లభించి నది. ఇచటి ఋకారము విధీయమానము కాదు కావున అణుదిత్సూత్రముచే తన భేదములు పదునెనిమిదింటిని, ఌకారము తనకు సవర్ణము కావున దానిభేదములు పండ్రెండింటిని మొత్తము ముప్పదింటిని గ్రహించును. ఆ విధముగా ముప్పది భేదములుగల ఋకారముయొక్క (ఋ ఌ ల) స్థానమున అణు అనగా అ ఇ ఉ లలో నేదేనొకటి విధింపఁబడినయెడల నది ర పరముగా వచ్చునని సూత్రార్థము. ఇందు 'ర' అనునది ప్రత్యాహారము. అది ర ల లను బోధించునని పూర్వసూత్రము వలన నెఱుఁగితిమి. కావున ర పరమనగా ర ల పరమను నర్థము సిద్ధించును. ఆంతరతమ్యమునుబట్టి యిందు రేఫము ఋకారమునకు, లకారము ఌకారమునకును సంబంధించును. సారాంశమేమనఁగా నీవ్యాకరణమున నెందైన ఋకారముయొక్క స్థానమున అకారము విధింపఁబడినయెడల అది రపరముగా-'అర్' అనురూపమున వచ్చును. అట్లే ఌకారస్థానమున విధింపఁబడిన అకారము లపరమై 'అల్' అను రూపమున వచ్చును. ఇట్లే ఇ - ఇర్, ఇల్, ఉ - ఉర్, ఉల్ అను రూపములతో ఋ ఌల స్థానమున వచ్చును. వాని దీర్ఘాదులును అట్లే అగును, ఆర్-ఆల్, ఈర్-ఈల్ ఇత్యాది.

అవ : ఈ క్రింది యుదాహరణములలో ఋకారస్థానికమగు గుణాక్షరము అకారము రలపరముగా వచ్చుట చూపఁబడుచున్నది.

వృ : కృష్ణర్ధిః, తవల్కారః.

వివ : కృష్ణ+ఋద్ధిః, తవ+ఌకారః అని యుండఁగా 'అద్గుణః' అను సూత్రముచే గుణము రావలయును. గుణమను సంజ్ఞగల అ ఏ ఓ లలో నిచట నేది యంతరతమ మగునో పరీక్షింతము. ఇందుఋకారము మూర్ధన్యము. ఌకారము దంత్యము. గుణసంజ్ఞ కలవానిలో మూర్ధన్యము కాని దంత్యముకాని లేదు. కావున పూర్వముననున్న అకారమునుబట్టి కంఠస్థానికమగు 'అ' అను గుణమే యిట రాఁదగును. అనగా అకార ఋకారముల స్థానమున వచ్చుగుణము అకారము. ఉరణ్ రపరః అను పరిభాషననుసరించి అది ర పరముగా వచ్చును. కృష్ణ్+ (అ + ఋ) = అర్ + ధ్దిః = కృష్ణర్ధిః. అన్యత్ర అ+ఌ=అల్ - తవ్ + (అ+ఌ)= అల్ - కారః తవల్కారః.

ఈ క్రింది యుదాహరణములలో గుణము ప్రసక్తమగుచుండగా నది వారింపఁ బడుచున్నది.

అవ : హరే + ఇహ, విష్ణో + ఇహ అనియుండఁగా ఏచోఽయవాయావః అనుసూత్రముచే అయ్, అవ్ అనునాదేశములిట ఏ ఓ లకు క్రమముగా రాఁగా హరయ్ + ఇహ, విష్ణవ్ + ఇహ అని యగును. ఇందలి యకార వకారములకు క్రిందిసూత్రము పాక్షికముగా (వైకల్పికముగా) లోపమును విధించుచున్నది.

సూ : లోపశ్శాకల్యస్య 8-3-19.

వృ : అవర్ణపూర్వయోః పదాన్తయో ర్యవయోర్వాలోపోఽశిపరే.

ప. వి : లోపః (1-1) శాకల్యస్య (6-1).

అను : అపూర్వస్య (6-1) అశి (7-1) వ్యోః (6-2) పదస్య (6-1).

అర్థ : అవర్ణపూర్వములును, పదాంతములును అగు యకారవకారములకు, అశ్ వర్ణము పరమగునపుడు, లోపము వచ్చును.

వివ : ఈ సూత్రముచే య వలకు (య్, వ్) లోపము విధింపఁ బడుచున్నది. అవి అపూర్వములు కావలయును. అపూర్వమనఁగా అవర్ణము పూర్వమందు కలది. పరమున 'అశ్' ప్రత్యాహారములోని యేదేని వర్ణముండవలయును. ఆ య వలు పదముయొక్క చివరివి కావలయును. ఇట్టిస్థితిలో శాకల్యాచార్యుని

మతమున వీనికి లోపము వచ్చును. ఇతరుల మతమున రాదు. అనగా నీలోపము వైకల్పికమని ఫలితార్థము. (ఈ సూత్రములలో అందందు మఱికొందఱు ఆచార్యుల నామములు పేర్కొనఁబడిన తావులందెల్ల సాధారణముగా వైకల్పికమను నర్థము గ్రాహ్యము).

హరే, విష్ణో అనుపదములకు (సంబోధనప్రథమైకవచనాంతములు) అచ్చు పరమగునపుడు అయవాదేశమురాగా హరయ్ + ఇహ, విష్ణవ్ + ఇహ అనియుండును. ఇందలి యవలకు పూర్వమున అకారము గలదు. పరమున అశ్ ప్రత్యాహారము లోనిదగు ఇకారము గలదు. కావున లోపము రాఁగా హర + ఇహ, విష్ణ + ఇహ అని యగును. లోపమురాని పక్షమున హరయిహ, విష్ణవిహ అనురూపము లుండును.

అవ : లోపము వచ్చిన పక్షమున హర + ఇహ, విష్ణ + ఇహ అను వానిలో 'ఆద్గుణః' అను సూత్రముచే గుణము ప్రాప్తించుచున్నది. కాని యది సమ్మతము కాదు కాన దానిని వారించుటకై యీ క్రింది పరిభాష చెప్పఁబడు చున్నది.

సూ : పూర్వత్రాసిద్ధమ్ 8-2-1.

వృ : సపాదసప్తాధ్యాయీం ప్రతి త్రిపాద్యసిద్ధా. త్రిపాద్యామపిపూర్వం ప్రతి పరం శాస్త్రమసిద్ధం స్యాత్.

ప. వి : పూర్వత్ర (అవ్య) అసిద్ధమ్ (1-1)

అర్థ : సపాదసప్తాధ్యాయి ప్రవర్తించుచుండగా త్రిపాది అసిద్ధమగును.

వివ : ఇది యీ వ్యాకరణమున ప్రముఖమైన పరిభాషలలో నొకటి. పాణిని విరచితమగు నీ సూత్రగ్రంథమునకు అష్టాధ్యాయి అనిపేరు. ఎనిమిది అధ్యాయముల సమాహారమని దానియర్థము. అందు ప్రకృతసూత్రమున రెండుభాగములు చేయఁబడినవి. ఈ సూత్రము ఎనిమిదవ అధ్యాయమునందలి రెండవపాదము యొక్క మొదటిసూత్రము. దీనికి పూర్వమునఁ గల యేడధ్యాయములును, ఒకపాదమును కలిపి యొకభాగము, దీనికి తరువాత నున్న మూడుపాదము లొకభాగము. ఇందు మొదటిదానిని సపాదసప్తాధ్యాయి అనియు, రెండవదానిని త్రిపాది అనియు సార్థకముగా వ్యవహరింతురు. ఒకశబ్దమునకు సంబంధించిన ప్రక్రియయందు సపాద సప్తాధ్యాయిలోని యేదేని సూత్రము ప్రవర్తించుచుండఁగా నచట ప్రవర్తింప వలసిన త్రిపాదిలోని కార్యము అసిద్ధమగును. అనగా ప్రవర్తింపదని తాత్పర్యము.

ఇది యధికారసూత్రమగుటచే ఎనిమిదవ అధ్యాయము తుదివఱకు నిది ప్రవర్తించి ఆ మూడు పాదములలోఁగూడ పూర్వశాస్త్రము ప్రవర్తించినపుడు పరశాస్త్రము ప్రవర్తింపదని యీ సూత్రము వక్కాణించును. ఈ నియమము గ్రంథాంతము వఱకుఁ గలదు.

ప్రకృతోదాహరణములలో నీ సూత్రార్థమును సమన్వయించు కొందము. హర + ఇహ, విష్ణ + ఇహ అనునుదాహరణములలో 'ఏచోఽయవాయావః' అనుసూత్రముచే వచ్చిన అయవాదేశములోని య వ లకు లోపశ్శాకల్యస్య (8-3-19) అనుసూత్రముచే వైకల్పికముగా లోపము వచ్చినది. ఇపుడు అద్గుణః (6-1-87) అనుసూత్రముచే గుణము ప్రసక్తమగుచున్నది. 'లోపశ్శాకల్యస్య' అనునది త్రిపాదిలోనిది. 'అద్గుణః' అనునది సపాద సప్తాధ్యాయిలోనిది. ప్రకృత పరిభాషచే సపాదసప్తాధ్యాయిసూత్రముచే గుణమను కార్యము చేయఁబోవుచుండఁగా త్రిపాదియగు లోపము (లోపశ్శా కల్యస్య) అసిద్ధమగును. అనగా లోపము రాలే దన్నమాట. లోపమురానిచో హరయ్ + ఇహ, విష్ణవ్ + ఇహ అని యున్న రూపములో అకారమున కచ్చుపరమగుట సంభవింపదు కావున గుణము రాఁజాలదు. గుణము చేయఁదలఁపు లేనిచో లోపము వచ్చును., గుణము చేయఁదలఁచినపుడెల్ల లోపము రాదు. సారాంశమేమనగా హర + ఇహ, విష్ణ + ఇహ అనుచోటు లందు గుణము చేయఁజాలము. కావున హర ఇహ, విష్ణ ఇహ అనురూపములే యుండును. యవలలోపము వైకల్పికమగుటచే రానిచో హరయిహ, విష్ణవిహ అను రూపము లుండును. యవలలోపము వచ్చినపుడు గుణసంధి లక్షణము లన్నియు సరి పడుచున్నను నీ పరిభాషవలన సంధి వారింపఁబడినది.

అవ : గుణసంధి కపవాదముగా వృద్ధిసంధి చెప్పఁబడుచున్నది, అందు వృద్ధి యననేమో యీ క్రిందిసూత్రము నిర్వచించుచున్నది.

సూ : వృద్ధిరాదైచ్ 1-1-1.

వృ : ఆదైచ్చ వృద్ధి సంజ్ఞః స్యాత్.

వ. వి : వృద్ధిః (1-1) ఆదైచ్ (1-1).

అర్థ : దీర్ఘ అవర్ణమునకును, ఐచ్చునకును వృద్ధియని పేరు.

వివ : 'ఆత్' అనఁగా 'తపరస్తత్కాలస్య' అనుసూత్రముచే దీర్ఘ అవర్ణ మని యర్థము. ఐచ్ ప్రత్యాహారము ఐ ఔలను బోధించును. అవి తకారమునకుఁ బరమందుండుటచే దీర్ఘములే గ్రహింపఁబడును గాని ప్లుతములు గ్రహింపఁబడవు.

కావున ఆ, ఐ, ఔ వర్ణములకు వృద్ధియనిపేరు. ఈ వ్యాకరణమున వృద్ధియనఁగా నీమూఁడువర్ణములు గ్రహింపఁబడును.

అవ : ఈ క్రిందిసూత్రము వృద్ధిసంధిని విధించుచున్నది.

సూ : వృద్ధిరేచి 6-1-88.

వృ : ఆదేచి పరే వృద్ధిరేకాదేశః స్యాత్, గుణాపవాదః, కృష్ణైకత్వమ్, గఙ్గౌఘః, దేవైశ్వర్యమ్, కృష్ణౌత్కణ్ఠ్యమ్.

ప. వి. : వృద్ధిః (1-1) ఏచి (7-1).

**అను** : సంహితాయామ్ (7-1) ఏకః (1-1) పూర్వపరయోః (6-2) ఆత్ (5-1).

అర్థ : అవర్ణమునకు ఏచ్చుపరమగునపుడు పూర్వపరముల స్థానమున వృద్ధి ఏకాదేశమగును. ఇది గుణమున కపవాదము. ఉదా : కృష్ణైకత్వమ్, గఙ్గౌఘః, దేవైశ్వర్యమ్, కృష్ణౌత్కణ్ఠ్యమ్.

వివ : ఇది గుణమున కపవాదము. అనగా ప్రకృతోదాహరణములందును గుణము ప్రాప్తించుచుండఁగా నిది యట్లు రాదని చెప్పుచున్నది. అపవాదమనఁగా నొకసామాన్యసూత్రముచే నొకకార్యము జరుగవలసియుండగా విశేషసూత్రముచే నది రాకుండుట, వేఱొక కార్యము జరుగుట. ప్రకృతమున నిమిత్తములగు (పరముగా నుండవలసినవియగు) ఏచ్చులు కూడ అచ్చులే. అవర్ణమున కచ్చు పరమగునపుడు గుణమగునని 'అద్గుణః' సూత్రము సామాన్యముగఁ జెప్పినది. ఈసూత్రము అచ్చులలో నొకభాగమైన ఏచ్చు పరమగునపుడు వృద్ధి యగునని చెప్పుచున్నది. కావున ఏచ్చు పరమగునపుడు గుణమగునా? వృద్ధియగునా? యనుసందేహము కలుగును. అల్పమైన అవకాశముగలదియగుటచే నిది దానికపవాదమై వృద్ధియే వచ్చుననుటను దెలుపును. దీనినిబట్టియే గుణసంధి వివరణమున అచ్చుఅనఁగా ఇ, ఉ, ఋ, ఌ మాత్రమేయని చెప్పఁబడినది. ఈ సూత్రమువలన అద్గుణః అనుసూత్రములోనికి వచ్చిన 'అచి' అనుపదమునకు 'ఏచ్చుకాక తక్కిన అచ్చుపరమగునపుడు' అను నర్థము వచ్చినది.

వృద్ధియనఁగా ఆ ఐ ఔలు. ఆంతరతమ్యమును బట్టి యీ వర్ణము లాదేశములగును. అ + ఏ = ఐ, అ + ఐ = ఐ, అ + ఓ = ఔ, అ + ఔ = ఔ. (ఇందు అ వర్ణము హ్రస్వదీర్ఘములలో నేదైనఁగా వచ్చును). వీనికి క్రమముగా నుదాహరణములు చూపఁబడుచున్నవి.

(1) కృష్ణ + ఏకత్వమ్ - కృష్ణ్ + (అ+ఏ), ఐకత్వమ్ = కృష్ణైకత్వమ్.

(2) గంగా + ఓఘః - గంగ్ + (ఆ + ఓ) ఔఘః=గంగౌఘః.

(3) దేవ + ఐశ్వర్యమ్ — దేవ్ + (అ + ఐ) ఐశ్వర్యమ్ = దేవైశ్వర్యమ్.

(4) కృష్ణ + ఔత్కంఠ్యమ్ — కృష్ణ్ + (అ + ఔ) ఔత్కంఠ్యమ్= కృష్ణౌత్కంఠ్యమ్.

ప్రక్రియాసౌలభ్యముకొఱకు పదములలోని అక్షరములు వేఱుచేసి చూపఁబడినవి.

అవ : మఱికొన్ని సూత్రముల కపవాదముగా వృద్ధివచ్చు సందర్భము లీ క్రింద వివరింపఁబడుచున్నవి.

సూ : ఏత్యేధత్యూఠ్సు 6-1-89.

వృ : అవర్ణా దేజాద్యో రేత్యేధత్యో రూఠి చ పరేవృద్ధిరేకాదేశః స్యాత్. పరరూపగుణాపవాదః. ఉపైతి, ఉపైధతే. ప్రష్ఠౌహః ఏజాద్యోఃకిమ్? ఉపేతః. మాభవాన్ ప్రేదిధత్.

ప. వి : ఏత్యేధత్యూఠ్సు (7-3).

అను : ఆత్ (5-1) వృద్ధిః (1-1) ఏచి (7-1) ఏకః (1-1) పూర్వ పరయోః (6-2) సంహితాయామ్ (7-1.)

అర్థ : అవర్ణమునకు ఏచ్చు ఆదియందుఁగల ఇణ్ ధాతు, ఏధాతురూపము లును, ఊఠ్ అనునదియు పరమగునపుడు పూర్వపరములస్థానమున వృద్ధి ఏకాదేశమగును. ఇది పరరూపగుణముల కపవాదము. ఉదా : ఉపైతి, ఉపైధతే, ప్రష్ఠౌహః. ఏజాద్యోః అననేల? ఉపేతః, మాభవాన్ ప్రేదిధత్ అనుచోట వృద్ధి రాకుండుటకు.

వివ : అనువృత్తమైన 'ఏచి' అనువర్ణగ్రాహకసప్తమ్యంతపదము, ఏత్యేధత్యూఠ్సు అనుదానికి విశేషణమగుటచే 'యస్మిన్విధిస్తదాదా వల్గ్రహణే' అను పరిభాషచే 'ఏజాద్యోః' = 'ఏచ్చు ఆదియందుఁగల' అనునర్థము లభించినది. ఇది ఏతి, ఏధతి, అనువానికి మాత్రమే సంబంధించును. (ధాతువును పేర్కొనవలసినపుడు ఇక్కలను జేర్చిగాని, 'శ్తిప్' అను ప్రత్యయమును చేర్చికాని పేర్కొం

దురు. ప్రకృతము న ఏతి, ఏధతి అనునవి శ్తిప్ ప్రత్యయము చేరినరూపములు. ఇ (ణ్), ఏధ్ అనున విధాతురూపములు) 'ఊఠ్' అనునది వాహ్ అనుదానికి వచ్చు సంప్రసారణము. (వివరణమునకు ముందు చూడు(డు). ఇది ఏజాదియగుట అసంభవము అగుటచే ఏజాది అను విశేషణము, ఏతి, ఏధతి అనువానికిమాత్రమే సంబంధించును.

అకారమునకు ఏజాదియగు ఇణ్ ధాతు, ఏధధాతురూపములుగాని, 'ఊఠ్' అనునదికాని పరమగునపుడు పూర్వపరముల స్థానమున వృద్ధి ఏకాదేశమగును. ఇందు ఏజాదులగు ఇణ్, ఏధ్ ధాతురూపములు పరములగునపుడు 'వృద్ధిరేచి' అను సూత్రముచేతనే వృద్ధిరావచ్చును. కాని దానికపవాదముగా 'ఏజి పరరూపమ్' అను సూత్రముచే పరరూపము విధింప(బడినది. దానినికాదని వృద్ధియే వచ్చుటకై యిచట ఏతి, ఏధతి, అనునవి గ్రహింప(బడినవి. 'ఊఠ్' పరమగునపుడు గుణము రావలసియుండ(గా దానికి బాధకముగా వృద్ధి విధింప(బడినది. కావున నీ సూత్రము మొదటి రెండింటి విషయమున వక్ష్యమాణమగు పరరూపమునకును, మూ(డవదాని విషయమున గుణమునకును అపవాదమని చెప్ప(బడినది.

ఉదా : ఉప + ఏతి - (ఏతి అనునది. ఇ ధాతువుయొక్క వర్తమాన కాల ప్రథమైకవచనరూపము). ఇచట అపవాదక్రమమును గమనింపు(డు. ఇందు పూర్వాక్షరము అకారము. పరాక్షరము 'ఏ' ఇది అచ్చు. కావున ఆద్గుణః అను సూత్రముచే గుణము ప్రాప్తించును. కాని ఏకారము అచ్చు అయినను ఏచ్చు కావున గుణమును బాధించి 'వృద్ధిరేచి' అనుసూత్రముచే వృద్ధి ప్రాప్తించును. కాని యీ వృద్ధి కపవాదముగా వక్ష్యమాణమగు 'ఏజి పరరూపమ్' అనుసూత్రముచే పర రూపము ఏకాదేశము కావలసియుండ(గా దానికపవాదముగా ప్రకృతసూత్రముచే మఱల వృద్ధి ఏకాదేశముగా విధింప(బడినది. ఉప్ + (అ+ఏ) ఐతి = ఉపైతి. ఇట్లే ఉప + ఏధతే - ఉప్ (అ + ఏ) ఐధతే = ఉపైధతే. 'వాహ్' అను ధాతువునకు 'వాహ ఊఠ్' అనుసూత్రముచే సంప్రసారణముగా ఊకారము విధింప(బడినది. య వ ర ల లకు ఇ ఉ ఋ ఌలు వచ్చుటకు సంప్రసారణమని పేరు (ఇగ్యణః సంప్రసారణమ్). ప్రష్ఠ + ఊహః ఇచట గుణము రావలసియుండ(గా వృద్ధి చెప్ప(బడినది - ప్రష్ఠౌహః.

ఇచటికి ఏచి అనుపదము నను వృత్తిగా తెచ్చి ఏజాద్యోః - ఏచ్చు ఆది యందు(గల అనునర్థమును జెప్పనియెడల ఏకారమాదియందు లేని ఇణ్, ఏధ్

ధాతురూపములు పరములగునపుడును వృద్ధిప్రాప్తమగును. అది యిష్టము కాదు. కావున 'ఏచి' అనువృత్తమైనది. ఉదా : ఉప + ఇతః (ఇతః - వర్తమానకాల ప్రథమపురుషద్వివచనరూపము) ఇచట ఇణ్ ధాతురూపము ఏజాది కాదు కనుక వృద్ధిరాదు. గుణమే వచ్చును. ఉపేతః.

ఇట్లే ప్ర + ఇది ధత్ - ప్రేదిధత్. ఇచట ఇదిధత్ అనునది ఏధ్ ధాతువునకు ప్రేరణార్థమున ణిచ్ ప్రత్యయము చేరినపిమ్మట లుఙ్ లకారమున (మాఙిలుఙ్) ప్రథమపురుషైకవచనము చేరినరూపము. ఇది ఏజాదికాదు కావున వృద్ధిరాక గుణము వచ్చినది. మా భవాన్ ప్రేదిధత్. (లుఙ్ లకారమున ధాతువునకు అడాగమము చేరును. అప్పుడు అ + ఇదిధత్ = ఏదిధత్ అగును అప్పుడది అజాదియే యగును. కాని మా అనుఅవ్యయముతో యోగమున్నపుడు అడాగమము రాదు. ఇది అట్టిదని తెలుపుటకే మా భవాన్ ప్రేదిధత్ అనువాక్యము ఉదాహరింపఁబడినది).

అవ : మఱికొన్ని వృద్ధి సందర్భములు వార్తికకారులచేఁ జూపఁబడు చున్నవి.

వా : అక్షాదూహిన్యాముపసంఖ్యానమ్ (3604).

ఉ : అక్షౌహిణీ సేనా.

ప. వి : అక్షాత్ (5-1) ఊహిన్యామ్ (7-1) ఉపసంఖ్యానమ్ (1-1).

అర్థ : అక్షశబ్దమునకు ఊహినీశబ్దము పరమగునపుడు పూర్వపరములస్థానమున వృద్ధి యేకాదేశమగును.

వివ : ఇచట గుణము రావలసియుండగా వృద్ధి చెప్పఁబడినది. సూత్రకారుఁడు చెప్పని యీ విషయమును వార్తికకారుఁడు చెప్పెను. అక్ష + ఊహినీ - అక్ష్ (అ + ఊ) ఔ, హినీ - అక్షౌహిణీ - (షకారయోగముచే ణకారముగా మార్పుచెందును).

వా : ప్రాదూహోఢోఢ్యేషైష్యేషు (3605).

ఉదా : ప్రౌహః, ప్రౌఢః, ప్రౌఢిః, ప్రైషః, ప్రైష్యః.

ప. వి : ప్రాత్ (5-1) ఊహోఢోఢ్యేషైష్యేషు (7-3).

అర్థ : ప్ర అనుదానికి ఊహ, ఊఢ, ఊఢి, ఏష, ఏష్య అనుశబ్దములు పరములగునపుడు పూర్వపరములస్థానమున వృద్ధి యేకాదేశమగును.

వివ : ఇందు, ఊహ, ఊఢ, ఊఢి అనునవి పరమగునపుడు గుణము వచ్చు చుండఁగా అపవాదముగా వృద్ధి విధింపఁబడినది. ప్ర + ఊహః = ప్రౌహః, ప్ర + ఊఢః = ప్రౌఢః, ప్ర + ఊఢిః = ప్రౌఢిః.

ఏష, ఏష్య అనునవి పరములగునపుడు 'ఏఙి పరరూపమ్' అనువక్ష్యమాణ సూత్రముచే పరరూపము రావలసియుండఁగా వృద్ధివిధింపఁబడినది. ప్ర + ఏషః = ప్రైషః, ప్ర + ఏష్యః - ప్రైష్యః.

వా : ఋతేచ తృతీయాసమాసే (3607).

వృ : సుఖేనఋతః సుఖార్తః. తృతీయేతికిమ్? పరమర్తః.

ప. వి : ఋతే (7-1) చ (అవ్య) తృతీయాసమాసే (7-1).

అర్థ : తృతీయాసమాసమున అకారాంతపదమునకు ఋతశబ్దము పరమగు నపుడు వృద్ధి యేకాదేశమగును.

వివ : సుఖేనఋతః అను విగ్రహవాక్యముగల సుఖ + ఋత అను తృతీయా తత్పురుష సమాసమున పూర్వపరములస్థానమున గుణము రావలసియుండఁగా ప్రకృతవార్తికముచే అపవాదముగా వృద్ధి విధింపఁబడినది. ఇచట ఆంతరతమ్యము చేత అకారఋకారములస్థానమున వచ్చు వృద్ధి 'ఆ' అనునది. "ఉరణ్ రపరః" అను పరిభాషచే ఇది ఋకారస్థానమున వచ్చునది యగుటచే రపరముగా వచ్చును. అ + ఋ = ఆర్ అగును. సుఖ్ + అ + ఋ, తః సుఖ్ + ఆర్ త = సుఖార్తః.

ఇట్టి వృద్ధి తృతీయాసమాసమునందే వచ్చును. తక్కిన సమాసములలో రాదు. 'పరమశ్చాసౌ ఋతశ్చ' అను విగ్రహముగల కర్మధారయ సమాసము మున్నగువానియందు వృద్ధిరాకుండుటకై 'తృతీయా సమాసే' అను పదము వార్తిక మున గ్రహింపఁబడినది. పరమ + ఋత-గుణము, 'అర్' అనునది రాఁగా పరమర్తః అగును.

వా : ప్ర వత్సతర కమ్బల వసనార్ణదశానా మృణే (3608).

వృ : ప్రార్ణమ్, వత్సతరార్ణమ్ ఇత్యాది.

ప. వి : ప్ర. వత్సతర, కమ్బల, వసన, ఋణ, దశానామ్ (6-3) ఋణే (7-1).

అర్థ : ప్ర, వత్సతర, కమ్బల, వసన, ఋణ, దశ అనుశబ్దములకు ఋణ శబ్దము పరమగునపుడు పూర్వపరముల స్థానమున వృద్ధి యేకాదేశమగును.

వివ : ఈ యన్నియెడలను గుణము రావలసియున్నది. అపవాదముగా వృద్ధి విధింపఁబడినది. ఈ యన్నియెడలను 'ఉరణ్ ర పరః' అను పరిభాషచే వృద్ధి యగు ఆకారము ర పరమై ప్రవర్తిల్లును.

ఉదా : ప్ర + ఋణమ్ ప్ర్ + (అ+ఋ) ఆర్ ణమ్=ప్రార్ణమ్.

వత్సతర+ఋణమ్=వత్సతరార్ణమ్.

కమ్బల + ఋణమ్=కమ్బలార్ణమ్.

వసన + ఋణమ్=వసనార్ణమ్.

ఋణ + ఋణమ్=ఋణార్ణమ్.

దశ + ఋణ=దశార్ణః (దేశవిశేషము).

అవ : ముందు, 'ఉపసర్గాదృతిధాతౌ' అనుసూత్రము చెప్పఁబడుచున్నది· అందలి, ఉపసర్గము, ధాతువు అను వ్యాకరణసంజ్ఞలు నిర్వచింపఁబడుచున్నవి.

సూ : ఉపసర్గాః క్రియాయోగే 1-4-59.

వృ : ప్రాదయః క్రియాయోగే ఉపసర్గసంజ్ఞాస్స్యుః, ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప—ఏతే ప్రాదయో ద్వావింశతిః.

అర్థ : ప్ర మొదలగు ఇరువది రెండింటికిని, క్రియతో కూడికయున్నపుడు, ఉపసర్గములని పేరు.

వివ : క్రియావాచకపదముతో కూడియున్న, ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉ ప - అను నీ యిరువదిరెంటికిని ఉపసర్గములని పేరు. ఇది సంజ్ఞా సూత్రము.

సంస్కృతభాషలో ఈ ఉపసర్గముల ప్రయోజనమధికము. వీనిచేరికవలన ధాత్వర్థము మాఱుచుండును.

ఉపసర్గేణధాత్వర్థో బలాదన్యత్ర నీయతే.
ప్రహా రాహారసంహార విహార పరిహారవత్"

ఉపసర్గములవలన ధాత్వర్థము వేఱువిధముగా నగును. 'హృ' అను ధాతువున కొక కృత్ప్రత్యయము చేరఁగా 'హార' అగును. దీనికి ప్ర, ఆ, వి, సమ్, వి, పరి

అనునుపసర్గములు పర్యాయమునఁజేరఁగా అర్థము మాఱుచున్నది. ప్రహారము = దెబ్బ; ఆహారము=తినఁబడునది; సంహారము=చంపుట; విహారము = తిరుగుట; పరిహారము=వదలించుట. ఇత్యాది.

అవ : ధాతుపదనేమో చెప్పఁబడుచున్నది.

సూ : భూవాదయో ధాతవః 1-3-1.

వృ : క్రియావాచినో భ్వాదయో ధాతుసంజ్ఞాః స్యుః.

ప. వి : భూవాదయః (1-3) ధాతవః (1-3).

అర్థ : క్రియలను జెప్పెడి 'భూ' మొదలగునవి ధాతుసంజ్ఞ కలవి యగును.

వివ : "భూ-సత్తాయామ్" ఇత్యాదిగా సంస్కృతమునఁగల క్రియావాచక పదముల మూలస్వరూపములన్నియు పాణిని మహర్షిచే అర్థసహితముగ ఒకగ్రంథ రూపమున వ్రాయఁబడినవి. ఆ గ్రంథమును ధాతుపాఠమందురు. అందు పేర్కొనిన వన్నియు ధాతువులని యీ సూత్రముచే సంజ్ఞ చేయఁబడినది. భూ సత్తాయామ్ అను దానియందు భూ అనునది ధాతువు, సత్తాయామ్ అనునది యాధాతువే యర్థమున వర్తించునో దానిని పేర్కొనును. 'సత్తా' అనగా ఉనికి. ఉనికి యను నర్థమున 'భూ' ధాతువు ప్రయుక్తమగునని భూసత్తాయామ్ అని దానికర్థము. ఇట్లే సర్వధాతువులకును మహర్షిచే అర్థనిర్ణయము చేయఁబడినది.

'భూవాదయః' అను సమాసమునకు 'భూశ్చ వాశ్చభూవౌ, ఆదిశ్చ ఆదిశ్చ ఆదీ, భూవౌ ఆదీ యేషాం తే భూవాదయః' అను విగ్రహము చెప్పఁబడినది. ఇందు మొదటి ఆదిశబ్దమునకు 'మొదలైన' అనునర్థమును, రెండవ ఆదిశబ్దమునకు 'వంటి' అనునర్థమును గ్రహింపఁ బడినది. కావున భూ మున్నగునవియును, 'వా గతిగంధనయోః' అనుదానితో సదృశములైనవియు ధాతువులగునని సూత్ర తాత్పర్యము.

'క్రియావాచకములైన' అను విశేషణమువలన భూమి అనునర్థముగల భూ శబ్దమునకును, వికల్పము అనునర్థముగల 'వా' అను అవ్యయమునకును ధాతుత్వము కలుగదు.

అవ : పైని నిర్వచింపఁబడిన ఉపసర్గ ధాతుపదములతోఁ గూడిన వృద్ధి సంధి సూత్రమొకటి చెప్పఁబడుచున్నది.

సూ : ఉపసర్గాదృతి ధాతౌ 6-1-91.

వృ : అవర్ణాన్తాదుపసర్గా దృకారాదౌ ధాతౌపరే వృద్ధిరేకా దేశఃస్యాత్. ప్రార్ఛతి.

ప వి : ఉపసర్గాత్ (5-1) ఋతి (7-1) ధాతౌ (7-1).

అను : అత్ (5-1) వృద్ధిః (1-1) ఏకః (1-1) పూర్వపరయోః (6-2) సంహితాయామ్ (7-1)

అర్థ : అవర్ణాంతమైన ఉపసర్గమునకు ఋకారాదిధాతువు పరమగునపుడు పూర్వపరములస్థానమున వృద్ధియేకాదేశమగును. ఉ॥ప్రార్ఛతి.

వివ : 'అత్' అను పంచమ్యంతపదము 'ఉపసర్గాత్' అనుదానికి విశేషణము. విశేషణము తదంతమునకు సంజ్ఞ యగునను పరిభాష కలదు. (యేనవిధి స్తదంతస్య). కావున అత్ అనగా అవర్ణాన్తాత్ - అవర్ణాంతమైన ఉపసర్గమునకు అనునర్థము వచ్చును. 'ఋతి' అనునది 'ఋత్' అనువర్ణమును గ్రహించు సప్తమ్యంతపదము. అది ధాతౌ అనుదానికి విశేషణము. తపర స్తత్కాలస్య అను పరిభాషచే ఋత్ అనునది హ్రస్వ ఋ వర్ణమును బోధించును. 'యస్మిన్విధి స్తదా దావల్గ్రహణే' అను పరిభాషచే 'ఋతి ధాతౌ' అనగా హ్రస్వఋవర్ణము ఆదియందు గలధాతువు పరమగునపుడు అనునర్థము కలుగును. ఇట్లు, సంహితయందు, అవర్ణాంతమైన ఉపసర్గమునకు ఋవర్ణాదిధాతువు పరమగునపుడు పూర్వపరముల స్థానమున వృద్ధి యేకాదేశమగునను సూత్రార్థము సిద్ధించినది. ఇది గుణమున కపవాదము. ఇచట ఆంతరతమ్యముచే వచ్చు వృద్ధిసంజ్ఞకమగు ఆకారము ఋవర్ణస్థానమున వచ్చునదగుటచే రపరమై (ఉరణ్ ర పరః) 'అర్' అనురూపముతో వచ్చును.

ఉదా : ప్ర + ఋచ్ఛతి - ఇందు 'ప్ర' అనునది అవర్ణాంతమైన ఉపసర్గము. ఋచ్ఛతి యనునది హ్రస్వ ఋ వర్ణాదిక్రియాపదము. (క్రియాపదము యొక్క మూలరూప మేధాతువు). వృద్ధిరాఁగా ప్ర్ + (అ + ఋ) అర్ చ్ఛతి = ప్రార్ఛ్ఛతి అగును.

[వృద్ధిరాదైచ్ మొదలుకొని యింతవఱకుఁ గల భాగము వృద్ధిసంధికి సంబంధించినది.]

అవ : పరరూపసంధి చెప్పఁబడుచున్నది.

సూ : ఏఙి పరరూపమ్ 6-1-94.

వృ : అదుపసర్గాదేఙాదౌ ధాతౌ పరే పరరూప మేకాదేశఃస్యాత్. ప్రేజతే. ఉపోషతి.

ప వి : ఏఙి (7-1) పరరూపమ్ (1-1)

అను : అత్ (5-1); ఉపసర్గాత్ (5-1); ధాతౌ (7-1); ఏకః (1-1); పూర్వపరయోః (6-2); సంహితాయామ్ (7-1).

అర్థ : అవర్ణాంతమైన ఉపసర్గమునకు ఏఙాదిధాతువు పరమగునపుడు పరరూప మేకాదేశమగును. ఉదా : ప్రేజతే, ఉపోషతి.

వృ : 'అత్' అనునది ఉపసర్గాత్ అనుదానికి విశేషణము. విశేషణము తదంతమునకు సంజ్ఞ యగును కనుక 'అవర్ణాంతమైన ఉపసర్గమునకు' అనునర్థము వచ్చును. ఏఙ్ అను ప్రత్యాహారము ఏ ఓ లకు బోధకము. అది వర్ణగ్రాహక సప్తమ్యంత విశేషణమగుటచే 'యస్మిన్విధిః....' ఇత్యాది పరిభాషచే ఏఙ్ (ఏ,ఓ) వర్ణములాదియందుఁగల ధాతువు పరమగునపుడు అనునర్థము వచ్చును. అవర్ణమంతమందుఁగల ఉపసర్గమునకు, ఏఙ్వర్ణము ఆదియందుఁగలధాతువు పరమగునపుడు పూర్వపరములస్థానమున పరరూప మేకాదేశమగును. అనగా అ+ఏ=ఏ, అ + ఓ= ఓ అగును. ఇది వృద్ధికి అపవాదము.

ఉదా : ప్ర+ఏజతే - ఇందు 'ప్ర' అనునది అకారాంత ఉపసర్గము ఏజతే అనునది ఏఙాదిక్రియాపదము. పరరూపము రాగా ప్ర్ + (అ+ఏ) ఏ, జతే = ప్రేజతే. ఉప + ఓషతి + ఉప్ (అ+ఓ) ఓ, షతి=ఉపోషతి.

అవ : "శకంధ్వాదిషు పరరూపం వాచ్యమ్" అను వక్ష్యమాణవార్తికమున 'టి' అను సంజ్ఞ యావశ్యక మగుచున్నది. కావున 'టి' అననేమో చెప్పఁబడుచున్నది.

సూ : అచోఽన్త్యాది టి 1-1-24.

వృ : అచాం మధ్యేయోఽన్త్యః స ఆది ర్యస్య తట్టి సంజ్ఞంస్యాత్.

ప వి : అచః (6-1) అన్త్యాది (1-1) టి (1-1).

అర్థ : అచ్చులలో చివరియచ్చు ఆదిగాఁగలది టి యనఁబడును.

వివ : ఒకశబ్దస్వరూపములో ఉన్న అచ్చులలో చివరియచ్చు ఏ అక్షర సమూహమునకు ఆదివర్ణమగునో ఆ సమూహమునకు 'టి' అనిపేరు. అనగా శబ్ద స్వరూపము అజంతమగునెడల ఆ చివరిఅచ్చునకే టి అనుపేరుండును. ఉదా : శక- ఇందు కకారము తరువాతి అకారము టి. శబ్దము హలన్తమైనచో, చివరి అచ్చు, తరువాతి హల్లు - ఈ రెండును కలిపి 'టి' అగును. ఉదా : మనస్-ఇందు తుది

యచ్చు నకారముపై నున్న అకారము. దానితోఁ గలసిన సకారమునకు-అనగా 'అస్' అనుదానికి - టి సంజ్ఞ.

వా : శకంధ్వాది షు పరరూపం వాచ్యమ్ (3632).

వృ : తచ్చటేః. శకన్ధుః, కర్కన్ధుః, మనీషా, లాంగలీషా. ఆకృతిగణోఽయమ్. మార్తణ్డః.

ప. వి : శకన్ధ్వాదిషు (7-3) పరరూపమ్ (1-1) వాచ్యమ్ (1-1).

అర్థ : శకంధు మొదలగువానిలో టి భాగమునకు పరరూపము చెప్పనగును.

వృ : శకన్ధ్వాదిగణములో నున్నపదములన్నియు పరరూపము ఏకాదేశమైన తావలని తాత్పర్యము. ఈ పరరూపాదేశము పూర్వభాగము యొక్క తుదివర్ణమునకు మాత్రమేకాక 'టి' భాగమునకు వచ్చుననిభావము.

ఉదా : శక+అన్ధుః - ఇందు పూర్వపరములైన అకారములకు పరమైన అకారమొక్కటి ఆదేశమైనది. శక్ + (అ + అ) అ, న్ధుః శకన్ధుః. కర్క + అన్ధుః = కర్కన్ధుః - ఇవి రెండును వక్ష్యమాణ సవర్ణ దీర్ఘసంధి కపవాదములు.

మనస్ + ఈషా అనుచోట టి సంజ్ఞకమగు అస్ అనుదానికిని ఈషాలోని ఈకారమునకును, ఈకారమేకాదేశమగును. మన్ + (అస్ + ఈ) ఈషా=మనీషా. ఇది వక్ష్యమాణ విసర్గసంధి కపవాదము.

లాంగల + ఈషా అనుచోట గుణము రావలసియుండగా పరరూపము చెప్పఁబడినది. లాంగల్ + (అ + ఈ) ఈ ఈ షా=లాంగలీషా.

ఇది ఆకృతిగణము. అనగా పరరూపమేకాదేశమై, వేఱుగతిలేని యుదాహరణముల నన్నిటిని, ఈ గణములో పఠింపకున్నను జేర్చుకొనవలయు ననిభావము. ఆకృతినిబట్టి మఱికొన్ని శబ్దములను గణించుటకు వీలుగల గణము ఆకృతిగణము. దీనిచే 'మార్తణ్డః' అనురూపమును ఈ గణమునఁ జేర్చి సాధింపవలెను. మృతమైన అండమునుండి పుట్టినవాఁడు అనునర్థమున 'మృత + అండ' అనుదానికి 'అణ్' ప్రత్యయము చేరును ఇచట పరరూపమేకాదేశమై తద్ధిత ప్రక్రియ ననుసరించి మార్తణ్డః అనురూప మేర్పడును.

శకన్ధ్వాదిగణము : శకన్ధుః, కర్కన్ధు, కులటా, సీమన్తః కేశవేశేషు 150. హలీషా, మనీషా, లాంగలీషా, పతఞ్జలిః. సారంగః పశుపక్షిణోః.

సూ : ఓ మాఙోశ్చ 1-1-95.

వృ : ఓమి ఆఙి చాత్పరే పరరూపమేకాదేశః స్యాత్. శివాయోన్నమః, శివేహి.

ప. వి : ఓమాఙోః (7-2) చ (అవ్య).

అను : ఆత్ (5-1) పరరూపమ్ (1-1) ఏకః (1-1) పూర్వపరయోః (6-2) సంహితాయామ్ (7-1).

అర్థ : అవర్ణమునకు ఓమ్ అనునదియు, ఆఙ్ అనునదియు పరమగునపుడు పూర్వపరములకు పరరూప మేకాదేశమగును. ఉదా : శివాయోంనమః. శివేహి.

వివ : ఇచట 'ఓమ్' అనునది పరమగునపుడు వృద్ధియును, ఆఙ్ పరమగునపుడు వృద్ధ్యాదులును రావలసియుండగా పరరూపము విధింపఁబడినది.

ఉదా : శివాయ + ఓంనమః - అ+ఓ> ఓ శివాయోంనమః. శివ + ఏహి (ఇహి = పొమ్ము - ఇణ్ ధాతువుయొక్క లోణ్మధ్యమపురుషైక వచనరూపము. దానికి ఆఙ్ అనునుపసర్గము కూడినపుడు ఆ + ఇహి గుణసంధిచే 'ఏహి' (—రమ్ము) అగును) పరరూపముచే శివేహి అయినది.

[ఏఙి పరరూపమ్ అనుసూత్రము మొదలుకొని యింతవఱకుఁ గలభాగము పరరూపసంధికి సంబంధించినది].

అవ : సవర్ణదీర్ఘ సంధి చెప్పఁబడుచున్నది.

సూ : అకస్సవర్ణేదీర్ఘః 6-1-101.

వృ : అకస్సవర్ణేఽచి పరే పూర్వపయోర్దీర్ఘ ఏకాదేశఃస్యాత్. దైత్యారిః, శ్రీశః, విష్ణూదయః, హోతౄకారః.

ప. వి : అకః (5-1) సవర్ణే (7-1) దీర్ఘః (1-1).

అను : అచి (7-1) ఏకః (1-1) పూర్వపరయోః (6-2) సంహితాయామ్ (7-1).

అర్థ : అగ్వర్ణమునకు సవర్ణమైన అచ్చు పరమగునపుడు పూర్వపదములకు దీర్ఘ మేకాదేశమగును. ఉదా : దైత్యారిః, శ్రీశః, విష్ణూదయః, హోతౄకారః.

వివ : అక్ అనగా అ ఇ ఉ ఋ ౡ. వీనికి, వీనితో సమానమైన స్థాన ప్రయత్నములు గలవి సవర్ణములు. ఈ అక్కులకు సవర్ణములైన అచ్చులు పరములగునపుడు పూర్వపరములకు వానివాని దీర్ఘము లేకాదేశమగును. ఇందు పూర్వపరములు రెండును హ్రస్వదీర్ఘములలో నేవేనికావచ్చును (అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః). ప్లుతములకు మాత్రము వక్ష్యమాణవిధిచే సంధిరాదు. అ + అ=ఆ, ఆ+ఆ=ఆ. అ + ఆ=ఆ; ఆ + అ = ఆ - ఇట్లు తక్కినవానికిని భావింప నగును.

ఉదా : దైత్య + అరిః - ఇందు పూర్వపదముచివరనున్న అకారమునకు పరపదాదియగు అకారము సవర్ణము. ఈ రెంటిస్థానమున అకారదీర్ఘము వచ్చును దైత్య + (అ + అ) > ఆ రిః = దైత్యారిః ఇట్లే శ్రీ + ఈశః =శ్రీశః, విష్ణు + ఉదయః = విష్ణూదయః, హోతృ + ఋకారః = హోతౄకారః.

ఈ సూత్రసామర్థ్యముచేతనే గుణసంధిలో సామాన్యముగా 'అచ్చుపరమగు నపుడు' అని చెప్పఁబడినను, అకారమునకు అకారము పరమగునపుడు గుణము రాదు. కావున ఆ విషయమున నిది గుణమున కపవాదము. ఇట్లే ఇకారమునకు ఇకారము, ఉకారమునకు ఉకారము, ఋ కారమునకు ఋకారము, ౡకారమునకు ౡకారమును పరములగునపుడు యణాదేశము ప్రాప్తమగుచుండఁగా నీ సూత్రము వారించును. ఆ విషయమున నిది యణాదేశమున కపవాదము. ఈ సూత్రమునుబట్టియే ఇక్కులకు అసవర్ణములగు నచ్చులు పరములగునపుడే యణాదేశమగునను ఫలితార్థము సిద్ధించును.

అవ : పూర్వరూపసంధి చెప్పఁబడుచున్నది.

సూ : ఏఙః పదాన్తాదతి 6-109.

వృ : పదాన్తాదేఙోఽతిపరే పూర్వరూపమేకాదేశః స్యాత్. హరేఽవ, విష్ణోఽవ.

అను : ఏకః (1-1) పూర్వపరయోః (6-2) సంహితాయామ్ (7-1); పూర్వః (1-1).

అర్థ : పదాంతమైన ఏఙ్ వర్ణమునకు అత్తుపరమగునపుడు పూర్వరూపమేకాదేశమగును. ఉదా : హరేఽవ, విష్ణోఽవ.

వివ : పదమనఁగా విభక్త్యంతము (సుప్తిఙన్తంపదమ్). విభక్తులు క్రియా విభక్తులు, నామవిభక్తులు నని రెండువిధములు. ఈ రెండువిధములైన విభక్తులలో

నేదికాని యంతమందుఁగల శబ్దస్వరూపము చివర ఏ, ఓలు ఉన్నయెడల, ఆపదము నకు పరముగా హ్రస్వఅవర్ణమున్నయెడల రెంటికిని పూర్వాక్షర మేకాదేశమగును. ఏ + అ = ఏ, ఓ + అ=ఓ. ఇది ఏచోఽయవాయావః అనుదాని కప వాదము.

ఉదా : హరే + అవ (హరే అనునది సంబోధన ప్రథమైకవచనాంతము) హర్ + (ఏ + అ) ▷ ఏ వ = హరేఽవ. ఇట్టిచోటులందు, స్పష్టతకై 'ఽ' అను గుర్తు నుంతురు. దీనికే అకార ప్రశ్లేషమనియు, అవగ్రహమనియు వ్యవ హారము కలదు.

విష్ణో + అవ = విష్ణోఽవ.

అవ : ఇటనుండి ప్రకృతిభావము చెప్పఁబడుచున్నది. ప్రకృతిభావమనగా నెట్టిసంధియు రాకుండుట.

సూ : సర్వత్ర విభాషా గోః 6-1-122.

వృ : లోకే వేదే చైఙన్తస్య గోరతివా ప్రకృతిభావః పదాన్తే. గో అగ్రమ్, గోఽగ్రమ్. ఏఙన్తస్యకిమ్? చిత్రగ్వగ్రమ్. పదాన్తే కిమ్? గోః.

ప. వి : సర్వత్ర (అవ్య) విభాషా (1-1) గోః (6-1).

అను : ఏఙః (5-1) పదాన్తాత్ (5-1) అతి (7-1) ప్రకృత్యా (3-1).

అర్థ : లోకమునందును, వేదమునందును ఏఙన్తమైన గో శబ్దమునకు హ్రస్వ అకారము పరమైనపుడు, పదాంతమున ప్రకృతిభావము విభాషనగును. ఉదా : గో అగ్రమ్, గోఽగ్రమ్. ఏఙన్తమున కననేల ? చిత్రగ్వగ్రమ్. పదాంతమునందన

వివ : 'యజుషి' అనుపద మనువృత్త మగుచున్నందువలన దానిని వృత్తి కిని, లోకవేదభాషలరెంటియందును ఈకార్యము వర్తించుటకును, సర్వత్ర అను పదము సూత్రమున చేర్పఁబడెను. ఏఙన్తమైన అనుమాటచే గోశబ్దముయొక్క చివర తప్పక ఓకారముండవలయును. అట్టి గోశబ్దప్రకృతికపదమునకు, హ్రస్వ అకారము పరమగునపుడు లోకవేదభాషల రెంటియందును వైకల్పికముగా ప్రకృతి భావము అగును. అనగా సంధి రాకుండుట వైకల్పికము.

ఉదా : గో + అగ్రమ్ - ప్రకృతభావమైనయెడల 'గో అగ్రమ్' అగును. అది రానిచో పూర్వసూత్రముచే పూర్వరూపము వచ్చి 'గోఽగ్రమ్' అగును.

(ఇచట గోవుయొక్క అగ్రము అనియర్థము. సమాసమున విభక్తి లోపించినను పదత్వమునకు లోపము రాదు - కావున 'గో' అనునది యిచట ఏజంతమైన పదము).

ఈ సూత్రములోనికి 'ఏఙః' అనుపదము ననువృత్తముచేసి ఏజంతమైన గోశబ్దమునకు ప్రకృతిభావము విధింపఁబడినది. అట్లు చేయనేల? అట్లు చేయక గో శబ్దమున కని సామాన్యముగా చెప్పినచో చిత్రగు + అగ్రమ్ అనుచోటను ప్రకృతి భావము ప్రాప్తమగును. అది ఇష్టముకాదు. చిత్రాః గావః యస్మిన్ స చిత్రగుః- చిత్రమైనగోవులుగలది చిత్రగువు. ఇచట పదాంతమున గోశబ్దము కలదు కాని అది ఏజన్తము (ఓకారాంతము) కాదు. అందుచే ఈ సూత్రము ప్రవర్తింపదు. యణాదేశము వచ్చి 'చిత్రగ్వగ్రమ్' అగును.

ఈ కార్యము గోశబ్దమునకు పదాంతముననే అగునని చెప్పఁబడినది. అట్లు చెప్పనిచో 'గో+అస్' అనుచోటకూడ ప్రకృతిభావము ప్రాప్తమగును. అది సమ్మతము కాదు. ఇందు 'గో' అనునది ప్రాతిపదికము. పదముకాదు, 'అస్' అను నది విభక్తి ప్రత్యయము. అది చేరినతర్వాతనే మొత్తమునకు పదత్వము సిద్ధించును. ఇట్టియెడ ప్రకృతిభావమును వారించుటకై 'పదాంతమున' అనుపదమావశ్యకమగును. 'గో+అస్' 'ఙసి ఙ సోశ్చ' అను సూత్రముచే పూర్వరూపము వచ్చి గోస్, అయి, సకారము విసర్గముగా మారి గోః అగును.

అవ: ముందు గోశబ్దమునకు అవఙాదేశము చెప్పఁబడుచున్నది. ఆ ఆదేశము ఉద్దేశ్యముయొక్క యేభాగమునకు వచ్చునో నిర్ణయించుటకు రెండు పరిభాషలు చెప్పఁబడుచున్నవి.

సూ : అనేకాల్ శిత్ సర్వస్య 1-1-55.

వృ : ఇతి ప్రాప్తే.

వ. వి : అనేకాల్ శిత్ (1-1) సర్వస్య (6-1).

అర్థ : అనేకవర్ణములుగల ఆదేశమును, శిత్తగునాదేశమును సర్వము యొక్కస్థానమున వచ్చును. దీనిచే గోశబ్దము మొత్తమునకు అవఙాదేశము ప్రాప్తించుచుండఁగా.

వివ : 'అనేకాల్' అనఁగా అనేకమైన వర్ణములుగలది. రెండు, అంతకంటె నెక్కువ వర్ణములు గలది. శిత్తు అనగా శకారమిత్తుగాఁ గలది. ఆదేశముగా విధింపఁబడినది అనేకవర్ణములు గలదియైనను, శవర్ణమిత్తుగాఁగలదియైనను నది

స్థానికంతటికి వచ్చును. అనగా నున్నదానిని మొత్తముగా తొలగించితాను జేరును. ఇంతకుముందు ఆదేశము దేనికి విధింపఁబడునో దాని తుదివర్ణమునకు వచ్చునని 'అలోఽన్త్యస్య' అను పరిభాష చెప్పినది. ఇది దాని కపవాదము. ఆదేశము తుది వర్ణమునకు వచ్చుట సాధారణము. కాని యది అనేకవర్ణములు గలదియు, శిత్తయి నదియు నగుచో సర్వముయొక్క స్థానమున వచ్చును. ఉదాహరణము ముందు చూపఁబడును.

అవ : ఈ పరిభాషకు అపవాదమైన మఱియొక పరిభాష చెప్పఁబడు చున్నది.

సూ : ఙిచ్చ.

వృ : ఙి దనేకాలప్యన్త్యస్యైవ స్యాత్.

ప. వి : ఙిత్ (1-1) చ (అవ్య).

అను : అలః (6-1) అన్త్యస్య (6-1).

అర్థ : ఙిత్తు అనేకాలైనను అంత్యవర్ణమునకే వచ్చును.

వివ : ఙకారమిత్తుగాఁగలది ఙిత్తు. ఙిత్తయిన ఆదేశము అనేకవర్ణములుగలది యైనను విధింపఁబడినదాని తుదివర్ణమునకే వచ్చును. ఇది 'అనేకాల్ శిత్సర్వస్య' అనుదాని కపవాదము.

ఈ వ్యాకరణమునందు విధింపఁబడిన యాదేశముల విషయమున (1)అలోఽన్త్యస్య (2) అనేకాల్శిత్సర్వస్య (3) ఙిచ్చ అనుమూఁడు సూత్రములను ఆధారముగఁగొని నిర్ణయము చేయవలయును, (1) ఆదేశము ఏకవర్ణమైనచో విధింపఁబడినదాని తుదివర్ణమున కగును. ఆదేశము ఏకవర్ణమే యైనను శకారమిత్తుగాఁగలదియైనచో సర్వమునకు నగును. (2) ఆదేశము అనేకవర్ణములు గలది యైనచో సర్వమునకును అగును. (3) ఆదేశము అనేకవర్ణములు గలదియైనను ఙకారమిత్తుగాఁగలది యగుచో అన్త్య వర్ణమునకు మాత్రమే వచ్చును. కావున ఆదేశము ఏకవర్ణమా? శిత్తా? అనేకవర్ణమా? ఙిత్తా? అనునది గమనించి కార్యము చేయవలయును.

అవ : గోశబ్దమునకు కొన్నిసందర్భములందు అవఙాదేశము విధింపఁబడు చున్నది.

సూ : అవఙ్ స్ఫోటా యనస్య 6-1-123.

వృ : పదాన్తే ఏజన్తస్య గో రవఙ్ వాఽచి. గోఽగ్రమ్, గవాగ్రమ్. పదాన్తేకిమ్? గవి.

ప. వి : అవఙ్ (1-1) స్ఫోటాయనస్య (6-1)

అను ; పదాన్తాత్ (5-1) ఏజః (5-1) అచి (7-1).

అర్థము ; ఏజన్తమైన గోశబ్దమునకు, పదాంతమున, అచ్చుపరమగునపుడు అవఙాదేశము వైకల్పికముగా వచ్చును. ఉ॥ గోఽగ్రమ్, గవాగ్రమ్. పదాంతమున నననేల? గవి.

వివ : ఓకారమంతమందుఁగల గోశబ్దమునకు, అచ్చు పరమైనయెడల అవఙా దేశము వచ్చును. ఈ కార్యము గోశబ్దము పరమైనపుడే అగును. స్ఫోటాయనుఁ డను ఆచార్యుఁడు ఇట్లగునని చెప్పెను. తదితరులు దీనిని చెప్పలేదు. కావున నిది రావచ్చును, రాకపోవచ్చును. వైకల్పికమని తాత్పర్యము.

ఉదా : గో+అగ్రమ్ - ఇచట అవఙ్ అనునాదేశము గోశబ్దమునకు విధింపఁబడినది. 'అలోఽన్త్యస్య' అను పరిభాషచొప్పున నిది గోశబ్దముయొక్క తుది వర్ణమైన ఓకారస్థానమున రావలసియున్నది. కాని ఇది అనేకవర్ణములు గలది. అవ్ అ-మూఁడువర్ణము లిందుఁగలవు. కావున అనేకాల్ పరిభాషచే గకార ఓకార ముల రెంటిని తొలగించి వచ్చుచుండఁగా ఙిత్తగుటచే 'ఙిచ్చ' అను పరిభాషచే అంత్యవర్ణమును మాత్రమే తొలఁగించి వచ్చునని చెప్పఁబడినది. గ్ + ఓ అవ+ అగ్రమ్, గవ + అగ్రమ్, సవర్ణదీర్ఘసంధి - గవాగ్రమ్. (అవఙ్' - ఇందు ఙకారమునకు 'హలన్త్యమ్' అనుసూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును.)

ఇది వైకల్పికముగావున రానిచో 'ఏఙః పదాన్తాదతి' అనుసూత్రముచే పూర్వ రూపము రాఁగా 'గోఽగ్రమ్' అగును. 'సర్వత్ర విభాషాగోః' అను సూత్ర ముచే ప్రకృతిభావము కూడ చెప్పఁబడినది కావున 'గోఅగ్రమ్' అనియు రూప ముండును.

ఈ సూత్రమున 'పదాన్తమున' అననిచో 'గో + ఇ' అనుచోటను అవఙా దేశము ప్రాప్తమగును. ఇచట 'ఇ' సప్తమ్యేక వచన ప్రత్యయము. అది చేరక ముందు 'గో' అనునది పదము కాదు. కావున నిట్టితావులందు అవఙాదేశమును వారించుటకై పదాంతమున నీకార్యము అగునని చెప్పఁబడినది. 'ఏచోఽయవా యావః' అను సూత్రముచే 'అవ్' ఆదేశము వచ్చి గ్ + అవ్ + ఇ = గవి అగును.

సూ : ఇన్ద్రే చ 6-1-124.

వృ : గోరవఙ్ స్యాదిన్ద్రే. గవేన్ద్రః.

ప. వి : ఇన్ద్రే (7-1) చ (అవ్య).

అను : అవఙ్ (1-1) గోః (6-1).

అర్థ : గో శబ్దమునకు ఇంద్రశబ్దము పరమగునపుడు అవఙాదేశమువచ్చును.
ఉదా : గవేన్ద్రః.

వివ : పూర్వసూత్రముచే అవఙాదేశము వైకల్పికముగా నగుచుండఁగా నిత్యముగా వచ్చుటకై యీసూత్రము చెప్పఁబడినది. గోశబ్దమునకు ఇంద్ర శబ్దము పరమైనపుడు అవఙాదేశము నిత్యము. గో + ఇన్ద్రః - గ్ + అవ + ఇన్ద్రః - గవ + ఇన్ద్రః - ఆద్గుణః అనుసూత్రముచే గుణము రాఁగా 'గవేన్ద్రః' అగును.

అవ : 'ప్లుత ప్రగృహ్యా అచి నిత్యమ్' అను వక్ష్యమాణ సూత్రముచే ప్లుతములకును, ప్రగృహ్యములకును అచ్చుపరమగునపుడు ప్రకృతిభావము అగునని చెప్పఁబడుచున్నది. కావున నేయేసందర్భములందు ప్లుతము ఆదేశమగునో ముందు వివరింపఁబడుచున్నది.

సూ : వాక్యస్య టేః ప్లుత ఉదాత్తః 8 2-82.

వృ : ఇత్యధికృత్య.

ప. వి : వాక్యస్య (6-1) టేః (6-1) ప్లుతః (1-1) ఉదాత్తః (1-1).

అర్థ : ఇది యధికారసూత్రము. ఇఁకముందుఁ జెప్పఁబోవుసందర్భములలో వాక్యముయొక్క టి భాగమునకు ప్లుతమాదేశమగును. అది ఉదాత్తమును అగును.

సూ : ప్రత్యభివాదేఽశూద్రే 8-2-83.

వృ : అశూద్రే ప్రత్యభివాదే వాక్యస్య టేః ప్లుతః. అభివాదయే దేవదత్తోఽహమ్. ఆయుష్మాన్ఏధి దేవదత్త౩అ.

ప. వి : ప్రత్యభివాదే (7-1) అశూద్రే (7-1).

అను : వాక్యస్య (6-1) టేః (6-1) ప్లుతః (1-1) ఉదాత్తః (1-1).

అర్థ : అశూద్రవిషయమైన ప్రత్యభివాదవాక్యముయొక్క టి భాగమునకు ప్లుతము వచ్చును. అది ఉదాత్తమగును.

వివ : నామాదులను చెలిపి పూజ్యులగువారికి నమస్కరించుట అభివాద మనఁబడును. దానికై ప్రయోగించు వాక్యము అభివాదవాక్యము. అట్లు అభివాదము చేసెడు శిష్యాదుల నాశీర్వదించుచు గుర్వాదులు పలుకువాక్యము ప్రత్యభివాద వాక్యము. ఈ ప్రత్యభివాదము శూద్రుఁడుకాక తక్కినవానియందు ప్రయుక్త మైన యెడల దానిని తెలుపువాక్యముయొక్క టి భాగమునకు ప్లుతమాదేశమగును. అనగా నంత్యాచ్చుతోఁగూడిన వర్ణములసముదాయము. పదము హలంతమైనచో ప్లుతము అచ్చునకు మాత్రమే యుండును. గనుక టి లోని అచ్చునకుమాత్రమే యీ యాదేశమగును. అభివాదయే దేవదత్తోఽహమ్ - దేవదత్తుఁడను నేను నమస్కరించుచున్నాను. ఇది అభివాదవాక్యము - అయుష్మానేధి దేవదత్త3అ దేవదత్త (ఆయుష్మంతుఁడవు కమ్ము - ఇది ప్రత్యభివాదవాక్యము. ఈ వాక్యాంతమున) దేవదత్త శబ్దములోని అకారము టి. దానికి ప్రకృతసూత్రముచే ప్లుతమాదేశమగును అనఁగా అచటి హ్రస్వమైన అకారము పోయి ప్లుతమైన అకారము వచ్చినది. 3 - ప్లుతచిహ్నము. (ప్రత్యభివాదవాక్యమున సంబోధ్యవాచకమునకు పిదప అకారము నుచ్చరింపవలయునని ధర్మశాస్త్ర కథితము).

వా : స్త్రియాంన (4864).

వృ ; అభివాదయే గార్గ్యహ్యమ్. భో ఆయుష్మతీభవగార్గి.

ప. వి : స్త్రియామ్ (7-1) న (అవ్య).

అర్థ : ప్రత్యభివాదము స్త్రీని ఉద్దేశించినది యైనయెడల ఆ వాక్యముయొక్క టి భాగమునకు ప్లుతము రాదు. ఉదా : అభివాదయే గార్గ్యహమ్ - గార్గిని నేను నమస్కరించుచున్నాను. భో ఆయుష్మతీభవ గార్గి - ఓ గార్గి, ఆయుష్మతివి కమ్ము. ఇందు మొదటిది అభివాదవాక్యము. రెండవది స్త్రీ విషయకమైన ప్రత్యభివాద వాక్యము. ప్రకృతనిషేధముచే ఈ వాక్యమునందలి 'టి' అగు గార్గిలోని ఇకారమునకు ప్లుతము రాలేదు.

వా . భో రాజన్యవిశాంవేతి వాచ్యమ్ (4865).

వృ : ఆయుష్మానేధి భో3ః. ఆయుష్మానేధీంద్ర వర్మ3న్. ఆయుష్మానేధీంద్రపాలిత3.

ప. వి : భో రాజన్య విశామ్ (6-3) వా (అవ్య) ఇతి (అవ్య) వాచ్యమ్ (1-1).

అర్థ : ప్రత్యభివాద వాక్యమున భో శబ్దముయొక్కయు, రాజన్యవాచకము యొక్కయు, వైశ్యవాచకము యొక్కయు టి భాగమునకు ప్లుతము వైకల్పికముగా నగునని చెప్పనగును.

వివ : 'ప్రత్యభివాదేఽశూద్రే' అనుసూత్రముచే నిత్యముగా ప్రాప్తించు చుండ నీవార్తికమీతావులందు ప్లుతమును వైకల్పికముగా విధించుచున్నది.

ఉదా : ఆయుష్మానేధిభోః – ఆయుష్మంతుఁడవు కమ్మోయి – ఇందు 'ఓః' అను భాగమునకు 'టి' అని పేరు. కాని అందు ప్లుతము ఓకారమునకు మాత్రమే వచ్చుటకు వీలున్నది. ఆయుష్మానేధిభో౩ః – ప్లుతము రానిచో ఆయుష్మానేధిభోః అని యుండును.

'ఆయుష్మానేధీంద్రవర్మన్' – ఇంద్రవర్మ రాజన్యవాచకము. ఇందు 'అన్' అనునది టి. కాని ప్లుతాదేశము అకారమునకే సంభవము. ఆయుష్మానేధీంద్ర వర్మ౩న్. ప్లుతము రానిచో ఆయుష్మానేధీంద్రవర్మన్. ఇట్లే ఆయుష్మానేధీంద్ర పాలిత౩. ఆయుష్మానేదీంద్రపాలిత. (ఇంద్రపాలిత అనునది వైశ్య వాచకము).

అవ : ఇట్లు ప్రత్యభివాద వాక్యములలో ప్లుతమగుట చెప్పఁబడినది. ఇతరసందర్భములలో ప్లుతమాదేశమగుట నీక్రింది సూత్రము విధించుచున్నది.

సూ : దూరాద్ధూతే చ 8–2–84.

వృ : దూరత్సంబోధనే వాక్యస్యటేః ప్లుతఃస్యాత్.

ప. వి : దూరాత్ (5–1) హూతే (7–1) చ (అవ్య).

అను : వాక్యస్య (6–1) టేః (6–1) ప్లుతః (1–1) ఉదాత్తః (1–1).

అర్థ : దూరముననున్నవానిని సంబోధించుటకు ప్రయుక్తమైన వాక్యము యొక్క టి భాగమునకు ప్లుతము వచ్చును.

వివ : దూరమునందున్న వ్యక్తిని పిలుచుటకు ప్రయోగింపఁబడిన వాక్యము యొక్క టి భాగమునందలి అచ్చునకు ప్లుతమాదేశమగును. అభిముఖముగాలేని వానిని అభిముఖముగా చేసికొనుట సంబోధనము. ఉదాహరణము ముందుసూత్ర మున చూపఁబడుచున్నది.

అవ : ఇట్లు 'వాక్యస్యటేః ప్లుత ఉదాత్తః' అను సూత్రము మొదలుకొని యింతవఱకు ఏయేసందర్భములందు ప్లుతాదేశము అగునో తెలుపఁబడినది. తత్ప్ర యోజనము ఈ క్రిందిసూత్రమునఁ జెప్పఁబడుచున్నది.

సూ : ప్లుతప్రగృహ్యా అచినిత్యమ్ 6–1–125.

వృ : ఏతేఽచి ప్రకృత్యాస్యుః, ఏహి కృష్ణ౩ అత్రగౌశ్చరతి.

వ. వి : ప్లుత ప్రగృహ్యాః (1-3) అచి (7-1) నిత్యమ్ (2-1).

అను : ప్రకృత్యా (3-1).

అర్థ : ప్లుతములు, ప్రగృహ్యములును అచ్చుపరమగునపుడు నిత్యముగా ప్రకృతిభావముతో నుండును. ఉదా : ఏహికృష్ణ3 అత్ర గౌశ్చరతి.

వివ : ప్లుతములు వివరింపఁబడినవి. ప్రగృహ్యములు వివరింపఁబడనున్నవి. పూర్వము చెప్పఁబడిన సంధులన్నియు ప్లుతములవిషయమునను, ప్రగృహ్యముల విషయమునను వర్తింపవని తాత్పర్యము. అచ్చుపరమగునపుడవి ప్రకృతిభావముతో-ఎట్టిమార్పును పొందనిస్థితితో-నుండును.

ఉదా : ఏహి కృష్ణ3 + అత్రగౌశ్చరతి - కృష్ణా రమ్ము. గోవు ఇక్కడ తిరుగుచున్నది. ఏహికృష్ణ అనునది దూరమునను్నకృష్ణుని సంబోధించువాక్యము. దీని టి భాగమునకు 'దూరాద్ధూతేచ' అను సూత్రముచే ప్లుతమగును. ఏహికృష్ణ3. అత్రగౌశ్చరతి అనువాక్యముయొక్క మొదటి అకారము దీనికి పరమైనపుడు 'అకః సవర్ణేదీర్ఘః' అనుసూత్రముచే ప్రాప్తమగు సవర్ణదీర్ఘాదేశము ప్రకృతసూత్రముచే వారింపఁబడినది. కావున 'ఏహికృష్ణ3 అత్రగౌశ్చరతి' అనియే యుండును.

ఇది అచ్సంధి కపవాదము.

అవ : పైసూత్రమునందలి ప్రగృహ్య సంజ్ఞ వేనికగునో క్రిందిసూత్రము చెప్పుచున్నది.

సూ : ఈ దూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్ 1-1-11.

వృ : ఈ దూదేదన్తం యద్ద్వివచనం ప్రగృహ్యం స్యాత్. హరీ ఏతౌ. విష్ణూఇమౌ, గంగేఅమూ, పచేతేఇమౌ.

ప. వి : ఈదూదేత్ (1-1) ద్వివచనమ్ (1-1) ప్రగృహ్యమ్ (1-1).

అర్థ : ఈ, ఊ, ఏలు అంతమందుఁ గలద్వివచనపదములు ప్రగృహ్యము లగును. హరీఏతౌ, విష్ణూ ఇమౌ, గంగేఅమూ, పచేతేఇమౌ.

వివ : 'ఈత్' అనగా తపరస్తత్కాలస్య అను సూత్రముచే దీర్ఘ ఇకార మని యర్థము. అట్లే ఊత్, ఏత్ అనగా దీర్ఘ ఉకార ఏకారములు. తపరకరణ ముచే హ్రస్వప్లుతములు గ్రహింపఁబడవు. 'ఈదూదేత్' అనునది 'ద్వివచనమ్' అనుదానికి విశేషణమగుటచే విశేషణము తదంతమునకు సంజ్ఞయగునను న్యాయము ననుసరించి 'ఈదూదేదంతమైన' అనునర్థము సిద్ధించును. ఈ ఊ, ఏకారము లంత

మందుఁగలిగి ద్విత్వసంఖ్యకలవానిని తెలుపు పదములు 'ప్రగృహ్యము' అను సంజ్ఞ కలవి యగును. ఇదియొక సంజ్ఞాసూత్రము. హరీ, విష్ణూ, గంగే ఇవి వరుసగా ఈ ఊ ఏ అంతమందుఁగల ద్వివచనపదముల కుదాహరణములు. క్రియాపదము లకును ప్రగృహ్యసంజ్ఞ ఉండునని తెలుపుటకై పచేతే (ఇద్దఱువండుచున్నారు) అను క్రియాపదముకూడ ఉదాహరింపఁబడినది.

వీనికి అచ్చుపరమగునపుడు యణాదేశాదిసంధులు రావు. ప్రకృతిభావమగును, (ప్లుతప్రగృహ్యా అచినిత్యమ్) ఉదా: హరీ + ఏతౌ-హరీ ఏతౌ విష్ణూ + ఇమౌ - విష్ణూ ఇమౌ (ఈరెంటియందును యణాదేశము రావలసియున్నది. రాలేదు). గంగే + అమూ=గంగే అమూ (ఇచట 'ఏఙః పదాన్తాదతి' అనుదానిచే పూర్వ రూపము రావలసియున్నది. రాదు) పచేతే + ఇమౌ = పచేతే ఇమౌ-(ఇచట అయా దేశము రావలసియున్నది. రాదు).

అవ : పై సూత్రమునఁ జెప్పఁబడినవియే కాక మఱికొన్ని సందర్భము లందును కొన్నిపదములు ప్రగృహ్యము లగును. అవి వివరింపఁబడుచున్నవి.

సూ : అదసోమాత్ 1-1-72.

వృ : అస్మాత్పరావీదూతౌ ప్రగృహ్యౌస్తః. అమీఈశాః. రామకృష్ణావమూ ఆసాతే. మాత్కిమ్? అముకేఽత్ర.

ప. వి : అదసః (6-1) మాత్ (5-1).

అను : ఈదూత్ (1-1) ప్రగృహ్యమ్ (1-1).

అర్థ : అదస్ శబ్దముయొక్క మకారమునకు పరముగానున్న ఈ ఊ లకు ప్రగృహ్యసంజ్ఞ కలుగును. ఉదా : అమీ ఈశాః, రామకృష్ణావమూ ఆసాతే.

వివ : 'అదస్' శబ్దము ఒక సర్వనామము. వీఁడు, ఈమె, ఇది యని దీని కర్థము. ఆ శబ్దముయొక్క మకారమునకు పరముగానున్న ఈకార ఊకారములు ప్రగృహ్యములగును. మకారముతరువాత నున్న ఈకార . ఊకారములు అంతమందున్న అదశ్శబ్దరూపములకు ప్రగృహ్యసంజ్ఞ కలుగునని తాత్పర్యము. ఈ శబ్దముయొక్క మూఁడు లింగములందును ప్రథమా ద్వితీయావిభక్తిరూపము లిట్లుండును. తక్కినవిభక్తులలో అంతమున ఈకార ఊకారము లుండవు.

| పులింగము- | ఏ | ద్వి | బ. |
|---|---|---|---|
| ప్రథమా | అసౌ - | అమూ | అమీ |
| ద్వితీయా. | అముమ్ - | అమూ | అమూన్. |

| స్త్రీలింగము. | ఏ | ద్వి | బ. |
|---|---|---|---|
| ప్రథమా- | అసౌ - | అమూ | అమూః |
| ద్వితీయా | అమూమ్ - | అమూ | అమూః |

నపుంసకలింగము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | అదః | అమూ | అమూని |
| ద్వితీయా | అదః | అమూ | అమూని |

పై వానిలో మకారమునకు తరువాత ఈకారఊకారములు అంతమందుగల రూపములు పుంలింగమున ప్రథమాద్వి బహువచనాంతములును, ద్వితీయాద్వి వచనాంతమును. అట్లే స్త్రీ నపుంసకలింగములలో ప్రథమా ద్వితీయావిభక్తులలో ద్వివచనాంతములు. అవి క్రీగీతగలరూపములు మొత్తమేడు. ప్రకృతసూత్రముచే పుంలింగబహువచనమగు 'అమీ' అనుదానికిని, పుంలింగ ద్వివచనమగు 'అమూ' అను రెండురూపములకును మొత్తము మూఁడింటికి ప్రగృహ్యసంజ్ఞ కలుగును. స్త్రీ నపుంసకలింగ ద్వివచనరూపములకు "ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్"అను సూత్రముచేతనే ప్రగృహ్యసంజ్ఞ కలుగును.

ఉదా : అమీ + ఈశాః అమీఈశాః (పులింగంబహువచనము) రామకృష్ణౌ, అమూ + - ఆసాతే - రామకృష్ణావమూ ఆసాతే (పుంలింగద్వివచన రూపము) ఇది పుంలింగమని తెలుపుటకే 'రామకృష్ణౌ' అనుపదముదాహరణమున గ్రహింపఁబడినది.

రూపసామ్యమున్న ద్వివచనరూపములన్నింటికిని ఈదూదేదిత్యాది సూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ కలుగక, పుంలింగరూపములకు ఈసూత్రముచే నేల కలుగవలయునుః అనుసందేహమిట కలుగును. అది నివారింపఁబడవలయునన్న వాని ప్రక్రియ నరయవలయును.

పుంలింగరూపము : అదస్ ప్రాతిపదికము ఔ ప్రత్యయము. (ప్రథమా ద్వితీయాద్వివచన ప్రత్యయము) 'అదస్ + ఔ' అనియుండఁగా 'త్యదాదీనామః' అను సూత్రముచే సకారస్థానమున అకారము వచ్చును. అద + అ. దానికి పూర్వ అకారముతో (ద్ + అ) పరరూప మేకాదేశమగును. (అతోగుణే) అద+ఔ - ఇపుడు వృద్ధియేకాదేశమగును, అదౌ. ఇట్టిస్థితిలో 'అదసోసేర్దాదుదోమః' అను సూత్రముచే దకారమునకు తరువాత నున్న భాగమునకు ఉకారాదేశమును, దకారమునకు, మకారాదేశము విధింపఁబడినది. అద్ + ఔ అమ్ + ఊ = 'అమూ' అయినది. ఇపుడు దీనికి ఈదూదేదిత్యాది సూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ చేయఁ

దలఁచినయెడల 'అదసోసేర్దాదుదోమః' అనుసూత్రముచే చేసిన మకార ఊకారాదేశము అసిద్ధమగును. ఈదూదేత్సూత్రము సపాదసప్తాధ్యాయి లోనిది (1-1-11) అదసోసేర్దాదుదోమః అనునది త్రిపాదిలోనిది (8-2-80) పూర్వత్రాసిద్ధమ్ అను పరిభాషచే మకార ఊకారాదేశము అసిద్ధమైనచో 'అదౌ' అనురూపముండును. ఔకారాంతములకు ప్రగృహ్యసంజ్ఞ లేదు. కావున ఈదూదేత్ సూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ రా వీలులేదు. కాని ప్రగృహ్యసంజ్ఞ లేనిచో అనిష్టరూపము లేర్పడును. అందుకొఱకు విశేషముగా 'అదసోమాత్' అనుసూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ పుంలింగద్వివచనరూపములకు విధింపఁబడినది. ఈదూదేత్ సూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ చేయ నెంచనిచో మకార ఊకారదేశము వచ్చుటకభ్యంతరములేదు. విశేషవిహితమగుటచే 'అదసోమాత్' అనుసూత్రమునుబట్టి అదసోసే .... ఇత్యాదిసూత్రము అసిద్ధమగుట అను ప్రసక్తి లేదు. ఇట్లు ఈదూదేత్ సూత్రముచే సిద్ధింపని ప్రగృహ్యసంజ్ఞను పుంలింగద్వివచనములయెడ సిద్ధింపఁజేయుటకై యీ సూత్రము ఆవశ్యకమయ్యెను. 'అమీ' అను బహువచనరూపవిషయమున ఈదూదేత్ సూత్ర మెట్లును ప్రవర్తింపదు.

ఇఁక స్త్రీనపుంసకలింగద్వివచనరూపములకు ఈదూదేత్ సూత్రమువలననే ప్రగృహ్యసంజ్ఞ సిద్ధించును. వాని ప్రక్రియ నరయుదము. సకారమున కత్వము వచ్చుట, పరరూపసంధివఱకు పుంలింగరూపమునకు వలెనే అగును. అద + ఔ అనియుండ స్త్రీలింగనపుంసకలింగములలో ఔ ప్రత్యయమునకు 'శీ' అను నాదేశము విధింపఁబడినది. ఇందు శకారమిత్తు 'అద+ఈ' గుణమురాఁగా 'అదే' అగును. అదసోసేరిత్యాది సూత్రముచే ఏకారమునకు ఊకారాదేశము, దకారమునకు మకారదేశము నగును. 'అమూ' అగును. ఇపుడు ఈదూదేత్ సూత్రము ప్రవర్తించును. మకార ఊకారాదేశము 'పూర్వత్రాసిద్ధమ్' అను సూత్రముచే అసిద్ధమైనను ఇచట నష్టములేదు. అసిద్ధమయినచో 'అదే' అనురూపముండును. ఏదంతద్వివచనము కూడ ప్రగృహ్యమే కదా! కావున అసిద్ధమగుటవలన ఇష్టసిద్ధికి అంతరాయము కలుగలేదు. అగుటచే స్త్రీనపుంసకలింగములలో ఈదూదేత్ సూత్రమే ప్రగృహ్యసంజ్ఞను విధించినది. పుంలింగమునకును వీనికిని భేదమేమనగా అందు అసిద్ధమైనప్పటిరూపము 'అదౌ' అని ఔకారాంతము. వీనియందు 'అదే' అను ఏకారాంతరూపము. కావుననే పుంలింగవిషయమున మఱల ప్రకృతసూత్రము ఆవసరమైనది.

అనువృత్తము కావలసిన 'ఈదూదేత్' అనుసమాసములో ఏకదేశమైన 'ఏత్' అనునది యీ సూత్రములో నేల పరిహరింపఁబడినది? అను సందియమునకు

సమాధానముగా సూత్రములోని 'మాత్' అనుపదముయొక్క సార్థక్యము విచారింపఁబడుచున్నది. పైని పేర్కొనిన యేడురూపములందును. ఈకార ఊకారములు మకారమునకు తరువాత నేయుండుటయు, మకారము పూర్వమునలేని ఈకార ఊకారాంతములు లేకపోవుటయు కన్పట్టుచుండఁగా సూత్రమున 'మాత్' అను పదము లేనిచో నష్టమేమి? అని మాత్ కిమ్ - మకారమునకు తరువాతనున్న అని అననేల? అను ప్రశ్నయొక్క తాత్పర్యము. దానికి సమాధానముగా అముకేఽత్ర అను నుదాహరణము చూపఁబడినది. మాత్ అనుపదము సూత్రమున లేనిచో 'అముకే' అను అదశ్శబ్దరూపమునకును ప్రగృహ్యసంజ్ఞ ప్రాప్తమగును అది అనిష్టము. 'అముకే' అనునది 'అదస్' శబ్దమునకు 'అకచ్' అను తద్ధిత ప్రత్యయము చేరిన ప్రాతిపదికముపై ప్రథమాబహువచనరూపము. అకచ్ ప్రత్యయము సర్వనామముయొక్క టి భాగమునకు పూర్వమున చేరును. అదకస్ + జస్ = అముకే' అగును. ఈ సూత్రమున 'మాత్' అనుపదము లేనిచో ఏకారముకూడ పైనుండి అనువృత్తి వచ్చును. ఇచటి ఏకారము మకారమునకు తరువాతనున్నది గాదు. 'మాత్' అనునది లేనిచో దీనికిని ప్రగృహ్యసంజ్ఞ ప్రాప్తమగును, దానిని వారించుటకై మాత్ పదము అవసరము. కావున 'అముకే' అనుదానికి ప్రగృహ్య సంజ్ఞ లేదు. కావున దానికచ్చు పరమగునపుడు ప్రకృతిభావముండదు. సంధి యగును. ఏచః పదాన్తాదతి-అముకేఽత్ర.

అవ : ఏకాచ్చయిన నిపాతము ప్రగృహ్యమగునని ముందు 'నిపాత ఏకాజనాఙ్' అనుసూత్రముచే చెప్పఁబడుచున్నది. అందున్న నిపాతమను సంజ్ఞ వేనికిఁ గలదో యవి మూఁడు సూత్రములచేఁ దెలుపఁబడుచున్నవి.

సూ : ప్రాగ్రీశ్వరాన్ని పాతాః 1-4 56.

వృ

ప. వి : ప్రాక్ (1-1) రీశ్వరాత్ (5-1) నిపాతాః (1-3).

అర్థ : ఇది అధికారసూత్రము. ఈ సూత్రము మొదలుకొని 'రీశ్వర'అను శబ్దము గల సూత్రమువఱకుఁ జెప్పఁబడినవి నిపాతములు.

వివ : నిపాతమనునది యొకసంజ్ఞ. సంస్కృతభాషలోఁ గలశబ్ద జాలమంతయు నాలుగువిధములుగా నున్నది. (1) నామములు-సుబంతములు; (2) ఆఖ్యాతములు - తిఙంతములు; (3) ఉపసర్గములు ఉపసర్గములు-క్రియాయోగము గల ప్రాదులు; (4) నిపాతములు - లింగవచనవిభక్తి శూన్యములైన యవ్య

యాదులు. ఇందు నాలుగవిభాగమునకు చెందిన కొన్నింటిని అష్టాధ్యాయిలోని ఈ ఈ ప్రకరణము (1-4-56 మొదలుకొని అధిరీశ్వరే (1-4-97) అనురీశ్వరశబ్దము గలసూత్రము వఱకుగల భాగము, చెప్పను. వానికి నిపాత సంజ్ఞను ఈసూత్ర మొనరించినది.

సూ : చాదయోఽసత్త్వే 1-4-57.

వృ : అద్రవ్యార్థాశ్చాదయో నిపాతాః స్యుః.

ప. వి : చాదయః (1-3) అసత్త్వే (7-1).

అను : నిపాతాః (1-3).

అర్థ : అద్రవ్యార్థములైనచాదులు నిపాతములగును.

వివ : సత్త్వమనఁగా ద్రవ్యము. లింగము, సంఖ్య, కారకము అను వానితో కూడినది ద్రవ్యము. అదికానిది అద్రవ్యము. అదియే అసత్త్వము. అట్టి అద్రవ్యవాచకములైన 'చ'మున్నగువానికి నిపాతమని పేరు. ఉదా : చ, ఏవ, నూనమ్ మొ॥వి. అసత్త్వే అనుపదము సూత్రములో లేనియెడల చాదిగణము లోని 'పశు' అనుపదమునుబట్టి ద్రవ్యవాచకమైన పశుశబ్దమునకును నిపాతసంజ్ఞ ప్రాప్తమగును. దానిని వారించుటకై 'అసత్త్వే' అనుపదము సూత్రమునందుంచఁ బడినది. ద్రవ్యవాచకమైన శబ్దమునకు 'జంతువు' అనియర్థము. అది నిపాతము కాదు. ద్రవ్యవాచకముకాని పశుశబ్దమునకు మంచి, బాగు అనియర్థము. అది నిపాతము.

చాదిగణము : చ, వా, హ (అహ) ఏవ ఏవమ్ నూనమ్ శశ్వత్ యుపత్ (యుగపత్)(భూయస్)సూపత్ కూపత్ కువిత్ నేత్ చేత్ చణ్ కచ్చిత్ యత్ర తత్ర నహ హన్త మాకిమ్ (మాకీమ్) మాకిర్ నకిమ్ (నకీమ్) నకిర్ (ఆకీమ్) మాఙ్ నఞ్ తావత్ యావత్ త్వా త్వై త్రై (ద్రై వై) రై శ్రౌషట్ వౌషట్ వషట్ స్వాహా స్వధా ఓమ్ తథా (తథాహి) ఖలు కిల అథ సు (సుష్ఠు) స్మ అ ఇ ఉ ఋ ఌ ఏ ఐ ఓ ఔ ఆదహ ఉఞ్ ఉకఞ్ వేలాయామ్ మాత్రాయామ్ యథాయత్ తత్ కిమ్ పురా వధా(వధ్వా)ధిక్ హాహా హేహై(హాహే)పాట్ ప్యాట్ అహో ఉతాహో హో అహో నో (నౌ) అథో నను మన్యే మిథ్యా అసి బ్రూహి తు ను ఇతి ఇవ వత్ వాత్ వన బత (సమ్ వశమ్ శికమ్ దికమ్)సనుకమ్ ఛంట్ (ఛంవట) శఙ్కే శకుమ్ ఖమ్ సనాత్ సనతర్ నహికమ్ సత్యమ్ ఋతమ్ అద్ధా ఇద్ధా నోచేత్ నచేత్ నహి జాతు కథమ్ కుతః కుత్ర అవ అను హా హే(హై)అహోస్విత్ శమ్కమ్ ఖమ్ దిష్ట్యా

పశు వట్ సహ (అనుషట్) అనుషక్ అఙ్గ ఫట్ తాజర్ (ఖాజర్) అయే అరే వాట్ (చాటు) కుమ్ ఖుమ్ ఘుమ్ అమ్ ఈమ్ సీమ్ సిమ్ సి వై. ఉపసర్గ విభక్తి స్వర ప్రతిరూపకాశ్చనిపాతాః ఆకృతిగణో௨యమ్. ఇతి చాదయః.

సూ : ప్రాదయః 1-4-58.

వ : ఏతే௨పితథా.

ప వి : ప్రాదయః (1-3).

అను : అసత్త్వే (7-1) నిపాతాః (1-3).

అర్థ : అద్రవ్యార్థములైన ప్రాదులును చాదులవలె **నిపాతములగును** అద్రవ్య వివరణము పైసూత్రమున చూడనగును.

ప్రాదిగణము : ప్ర పరా అప సమ్ అను అవ నిస్ నిర్ దుస్ దుర్ వి ఆఙ్ ని అధి అపి అతి సు ఉద్ అభి ప్రతి పరి ఉప - ఇతిప్రాదయః.

అవ : పై మూఁడు సూత్రములచే నిపాతములు చెప్పఁబడినవి. ఒక ప్రత్యేక లక్షణముగల నిపాతము ప్రగృహ్యమగునని యీ క్రింది సూత్రమున చెప్పఁబడు చున్నది.

సూ : నిపాత ఏకాజనాఙ్ 1-1-14.

వృ : ఏకో௨చ్ నిపాత అఙ్వర్జః ప్రగృహ్యః. ఇ ఇన్ద్రః. ఉ ఉమేశః. వాక్యస్మరణయో రఙిత్. ఆ ఏవం ను మన్యసే. ఆ ఏవం కిలతత్. అన్యత్ర. ఙిత్. ఆ=ఈషత్ ఉష్ణమ్ - ఓష్ణమ్.

ప. వి : నిపాతః (1-1) ఏకాచ్ (1-1) అనాఙ్ (1-1).

అను : ప్రగృహ్యమ్.

అర్థ : నిపాతసంజ్ఞ కలదియు ఆఙ్భిన్నమైనదియు అగు అచ్చొక్కటి ప్రగృహ్యమగును. ఉ॥ ఇ ఇన్ద్రః, ఉ ఉమేశః. ఆ అను నిపాతము వాక్య స్మరణములలో అఙిత్తు. ఉదా : ఆ ఏవంనుమన్యసే, ఆ ఏవం కిలతత్. తక్కిన యెడల ఙిత్తు. ఆ ఉష్ణమ్ - ఓష్ణమ్.

వివ ; నిపాతసంజ్ఞకలిగిన ఒకే ఒక అచ్చు ప్రగృహ్యమగును. 'ఏకాచ్' అనునది కర్మధారయము. బహువ్రీహికాదు. కావున ఒక అచ్చుగలది యను నర్థమిట గ్రాహ్యము కాదు. ఒక అచ్చు అని యర్థము. ఒక్క అచ్చు మాత్రమే అయి నిపాత సంజ్ఞగల అ ఇ ఉ ఋ ఌ వంటివి యిచట గ్రాహ్యములు.

అట్టివానికి ప్రగృహ్యసంజ్ఞ కలుగును. అనగా వానికి అచ్చు పరమగునపుడు సంధి రాదు. (ప్లుతప్రగృహ్యా అచినిత్యమ్)

ఉదా : ఇ ఇన్ద్రః – ఇందు మొదటి 'ఇ'నిపాతమైన ఒక అచ్చు. దీనికి ప్రకృతసూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ కలుగును. కాన పరమైన ఇకారముతో సంధి రాదు. ఇ ఇన్ద్రః. ఇప్లే ఉ ఉమేశః.

ఆ(ఙ్) అనుదానికి నిపాతసంజ్ఞయున్నను, అది ఒక అచ్చే అయినను ప్రగృహ్యసంజ్ఞ కలుగదని 'అనాఙ్' అనుపదము చెప్పుచున్నది. ఇందుఙకారమిత్తు. నిపాతసంజ్ఞగల 'ఆ' రెండువిధములుగా నున్నది. అందొకటి ఙిత్తు (ఆఙ్) రెండవది అఙిత్తు (ఆ). వీనిలో ఙిత్తునకు మాత్రమే ప్రగృహ్యసంజ్ఞ యుండదు. అఙిత్తు ప్రగృహ్యమే యగును. (ఙిత్తు, అఙిత్తులనగా ఙకారమిత్తుగా గలది లేనిది అని తెలియనగును). వాక్యములలో ప్రయోగించునపుడివి రెండును ఒక స్వరూపముతోడనే యుండును. (ఆ). అప్పుడు ఏది ప్రగృహ్యమో ఏది కాదో గుర్తించుట యెట్లు? ఈ సంశయమును ఈ క్రింది కారిక వారించును.

శ్లో॥ ఈషదర్థే క్రియాయోగే మర్యాదాభివిధౌ చ యః

ఏతమాతం ఙితం విద్యాత్

వాక్యస్మరణయో రఙిత్.

అర్థము : ఈషత్ – కొంచెము అనునర్థమునను, క్రియఁతోఁగూడియున్నపుడును, మర్యాద, అభివిధి అనునర్థములందును 'ఆ' అనునిపాతము ఙిత్తు. వాక్యస్మరణములయందలిది అఙిత్తు. మర్యాద అనగా హద్దు. అది దేనిని హద్దుగా చెప్పుదుమో దానిని కలుపుకొనదు. ఉదా : ఆ పర్వతమువఱకు మాఊరు అనగా పర్వతము మా ఊరిలో భాగముకాదు. అనియర్థము. అభివిధికూడ ఇట్టి అవధినే చెప్పును కాని దేనిని అవధిగా చెప్పుదుమో అదికూడ కలుపఁబడును. ఉదా : ఆచివరివానివఱకు పదిమంది రండు అన్నచో చివరివాఁడు కూడ రావలయును. ఈ రెండర్థములందును 'ఆఙ్' అనునిపాతము సంస్కృతమున ప్రయోగింపఁబడును. ఇట్లు కొంచెము అనునర్థము గలదియు, క్రియాయోగము గలదియు, మర్యాదాభివిధులను దెలుపునదియు నగు 'ఆ' అనునిపాతము ఙిత్తు కావున అనాఙ్ అనుటవలన దీనికి ప్రగృహ్యసంజ్ఞ కలుగదు. కావున దానికి అచ్చుపరమగునపుడు సంధిరావచ్చును. ఉదా : ఆ=ఈషత్,+ఉష్ణమ్–ఆ + ఉష్ణమ్–గుణము, ఓష్ణమ్. ఈషదర్థమున నుదాహరహణము చూపఁబడెను.

ఇంక వాక్యస్మరణములయందలిది ఙకారమిత్తుగా లేని కేవల 'ఆ'కారము. దీనికి అనాఙ్ అనునిషేధము వర్తింపదు. కావుననది ప్రగృహ్యమే అగును. అగుటచే దానికి అచ్చుపరమగునపుడు సంధి రాదు.

వాక్యార్థమున నుదాహరణము 'ఆ ఏవం ను మన్యసే' - నీవిట్లు తలఁచుచున్నావా? - ఇచటి 'ఆ' అనునిపాతము ఙిత్తుకాదు. ప్రగృహ్యమగును. కావున 'ఏవం'లోని అచ్చు ఏకారము పరమగునపుడు వృద్ధికి ప్రాప్తియున్నను నది రాలేదు. అట్లే స్మరణార్థమున 'ఆ ఏవం కిలతత్' ఆ అది ఇట్లు కదా ! - ఇచటి నొక విషయముయొక్క స్మరణము 'ఆ' అనునిపాతముచే తెలుపఁబడెను. ఇదియు ప్రగృహ్యమే. కావున సంధి రాదు.

సూ : ఓత్ 1-1-15.

వృ : ఓదన్తో నిపాతః ప్రగృహ్యః. అహో ఈశాః.

ప. వి : ఓత్ (1-1).

అను : నిపాతః (1-1) ప్రగృహ్యః (1-1).

అర్థ : ఓదంతమైన నిపాతము ప్రగృహ్యమగును. ఉదా : అహో ఈశాః.

వివ : ఓత్ అనునది నిపాతః అనుదానికి విశేషణము. విశేషణము తదంతమునకు సంజ్ఞయగు నను పరిభాషచే ఓదంతమైననిపాతమను నర్థము కలిగినది. ఇందలి తకారము ఓకారముయొక్క దీర్ఘమును గ్రహించుటను సూచించును (తపరకరణము). పూర్వసూత్రము నిపాతమైన ఒక్క అచ్చునకే ప్రగృహ్యసంజ్ఞను విధించుచుండగా అనేకవర్ణములు గల ఓదంత నిపాతమునకు ప్రగృహ్యసంజ్ఞకై యీ సూత్రము చెప్పఁబడినది. 'అహో' అనునది ఓదంతనిపాతము. ఇది ప్రగృహ్యమగును. కావున దీనికి అచ్చుపరమగునపుడు ప్రకృతిభావముండును. ఉదా : అహో + ఈశాః - అహో ఈశాః.

సూ : సంబుద్ధౌ శాకల్యస్యేతా వనార్షే 1-1-16.

వృ : సంబుద్ధి నిమిత్తక ఓకారో వా ప్రగృహ్యోఽవైదికే ఇతౌ పరే. విష్ణో ఇతి, విష్ణ ఇతి, విష్ణవితి.

ప. వి : సంబుద్ధౌ (7-1) శాకల్యస్య (6-1) ఇతౌ (7-1) అనార్షే (7-1).

అను : ఓత్ (1-1) ప్రగృహ్యః (1-1).

అర్థ : సంబుద్ధినిమిత్తకమైన ఓకారము అవైదికమైన ఇతిశబ్దము పరమగునపుడు, వికల్పముగా ప్రగృహ్యమగును. ఉదా : విష్ణో ఇతి, విష్ణ ఇతి, విష్ణవితి.

వివ : ఋషియనగా వేదము. ఋషిసంబధమైనది ఆర్షము. అది కానిది అనార్షము. అనగా వేదమునకు సంబంధింపనిది. లౌకికభాషకు సంబంధించినదని తాత్పర్యము. అట్టి 'ఇతి' శబ్దముపరమగునపుడు సంబుద్ధినిమిత్తక ఓకారము అంతమందుఁగలపదము ప్రగృహ్యమగును. సంబుద్ధియనఁగా సంబోధనప్రథమావిభక్త్యేకవచనము. అది పరమగునపుడు ఉకారాంతశబ్దములకు గుణరూపమున ఓకారము వచ్చును. (హ్రస్వస్యగుణః). ఉదా : విష్ణు + సు - గుణము - ఉకారమునకు గుణము ఓకారమువచ్చును. విష్ణోసు. సుప్రత్యయమున కిటలోపము విధింపఁబడినది. విష్ణో అగును ఇందలి ఓకారము సంబుద్ధిని నిమిత్తముగా చేసికొని వచ్చినది. దానికి లోకభాషయందలి ఇతిశబ్దము పరమగునపుడు ప్రగృహ్యసంజ్ఞ కలుగును. అనగా సంధిరాదు. ఇదిశాకల్యుఁడు చెప్పినదగుటచే తక్కిన ఆచార్యుల మతమున నిది ప్రగృహ్యముకాదు. కావున వైకల్పికమని తాత్పర్యము. ఉదా : విష్ణో + ఇతి - ప్రగృహ్యమైనచో 'విష్ణో ఇతి' అనియే యుండును. కానిచో అవాదేశము వచ్చి విష్ణవ్ + ఇతి=విష్ణవితి అనియగును. 'లోపశ్శాకల్యస్య' అను సూత్రముచే వికల్పముగా వకారలోపము రాగా 'విష్ణ ఇతి' అను రూపము కూడ ఉండును.

(ఈ విష్ణ ఇతి అనురూపము ప్రామాదికమై యుండునోపునని విమర్శకుల అభిప్రాయము. ఏలయన శాకల్యునిమతమున సంధిరాదు. రానిచో వకారముండదు. వకారలోపము కూడ శాకల్యుఁడు చెప్పినదియే. కావున వకారలోపము గలరూపము ప్రమాదవశమున చేరియుండునని విజులతలంపు).

అవ : 'ఉఞ్' అనునిపాతమునకు ప్రగృహ్యసంజ్ఞతోపాటు వకారాదేశము కూడ దృష్టమగుచున్నది. దాని నీ క్రిందిసూత్రము విధించుచున్నది.

**సూ : మయ ఉఞో వో వా 8-3-33.**

వృ : మయః పరస్య ఉఞః వో వాఽచి. కిమ్వుక్తమ్ః కిము ఉక్తమ్. వత్వస్యాసిద్ధత్వాన్నానుస్వారః.

ప. వి : మయః (5-1) ఉఞః (6-1) వః (1-1) వా (అవ్య).

అను : అచి (7-1).

అర్థ : మయ్ వర్ణమునకు పరముగానున్న ఉఞ్ అనునిపాతమునకు అచ్చు పరముగానున్నపుడు, వకారము వైకల్పికముగా నగును. ఉదా : కిమ్వుక్తమ్. కిము ఉక్తమ్. వత్వ మసిద్ధమగుటవలన అనుస్వారము రాదు.

వృ : ఉఞ్ అనునది యొకనిపాతము. ఇందలి ఞకారమిత్తు. ఇది ఏకాచ్చు. దీనికి 'నిపాత ఏకాజనాఙ్' అనుసూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ కలిగి అచ్చుపరమగు నపుడు ప్రకృతిభావముండును. కాని దీనికిట వైకల్పికముగా వకారాదేశము విధింపఁబడినది. ఇది మయ్ ప్రత్యాహారములోని వర్ణమునకు పరముగా నున్నయెడల, దానికి పరముగా అచ్చున్నయెడల నప్పుడే వకారాదేశము వచ్చును. ఉదా : కిము + ఉక్తమ్ - కిమ్ ఉ + ఉక్తమ్, కిమ్వ్ + ఉక్తమ్ = 'కిమ్వుక్తమ్' అగును. ఇందు 'కిమ్'లోని మకారము మయ్ వర్ణము. ఉ నిపాతము. 'ఉక్తమ్' లోని ఉకారము అచ్చుపరమైనది. ఇది వైకల్పికమగుటచే రానిపక్షమున ప్రగృహ్య సంజ్ఞ కలిగి ప్రకృతి భావమగును. కిము ఉక్తమ్.

వకారాదేశము వచ్చినపుడు మకారమునకు హల్లుపరమగును. 'కిమ్ వ్' పదాంతముననున్న మకారమునకు హలు పరమగునపుడు అనుస్వారము రావల యును. (మోఽనుస్వారః అను వక్ష్యమాణ సూత్రమును చూడుఁడు) ఇచట నది యేల రాలేదు? 'పూర్వత్రా సిద్ధమ్' అను పరిభాష ఇట అనుస్వారాదేశమును నివారించును. 'మోఽనుస్వారః' (8-3-23) అనునది త్రిపాదిలోనిది. ప్రకృత సూత్రముకూడ త్రిపాదిలోనిదే. అది అధికారసూత్రమగుటచే త్రిపాదియందును పూర్వకార్యము ప్రవర్తించునపుడు పరకార్య మసిద్ధమగును. అనగా 'మోఽను స్వారః' అనుపూర్వసూత్రముచే అనుస్వారాదేశము చేయఁదలఁచినయెడల పరకార్య మగు వకారాదేశము (33 వ సూత్రము) అసిద్ధమగును. అట్లసిద్ధమైనచో 'కిము' అని యున్నపుడు హల్లుపరమగుట సంభవింపదు కనుక అనుస్వారము రాదు. ఈ అంశమునే 'వత్వస్యాసిద్ధత్వాత్' ఇత్యాదివృత్తి వాక్యము బోధించినది.

సూ : ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ. 6-1-127.

వృ : పదాన్తా ఇకో హ్రస్వా వాస్యు రసవర్ణేఽచి. హ్రస్వవిధి సామర్థ్యాన్న స్వరసంధిః. చక్రిఅత్ర. చక్ర్యత్ర. పదాన్తా ఇతికిమ్? గౌర్యౌ.

ప. వి : ఇకః (6-1) అసవర్ణే (7-1) శాకల్యస్య (6-1) హ్రస్వః (1-1) చ (అవ్య).

అను : పదాన్తాత్ (5-1) అచి (7-1).

అర్థ : పదాంతములగు ఇక్కులు, అసవర్ణమైన అచ్చుపరమగునపుడు వికల్పముగ హ్రస్వము లగును. హ్రస్వవిధిసామర్థ్యమున స్వరసంధిలేదు. ఉదా : చక్రిఅత్ర, చక్ర్యత్ర. పదాంతము లననేల ? గౌర్యౌ.

వివ : ఇచట 'ఇకః' అనునది షష్ఠ్యంతపదము. అనువృత్తమైన 'పదాంతాత్' అనుపదమును కూడ షష్ఠ్యంతముగా మార్చుకొనవలయును. అపుడు పదాంతమైన 'ఇగ్వర్ణముయొక్క స్థానమున' అనునర్థము వచ్చును. స్థానప్రయత్నములతో సామ్యముగల వర్ణము సవర్ణము. అదికానిది అసవర్ణము. పదముయొక్క అంతముననున్న ఇ ఉ ఋ ౡ లకు అసవర్ణమైన అచ్చుపరమగునపుడు వికల్పముగా హ్రస్వమాదేశమగును. (శాకల్యస్య అనుపదము వికల్పమను నర్థము నిచ్చినది). హ్రస్వమును విధించుటవలన స్థానిదీర్ఘమని తెలియనగును. ఉదా : చక్రీ + అత్ర. ఇచట చక్రీ అనునది ప్రథమైక వచనప్రత్యయాంతమైనపదము. దాని అంతమున 'ఈ' అనుదీర్ఘాక్షరముగలదు. పరముగా నున్న అకారము దానికి సవర్ణము కాదు. కావున హ్రస్వము రాగా 'చక్రి + అత్ర' అగును. ఇట్టియెడ 'ఇకో యణచి' అను సూత్రముచే ఇకారమునకు యణాదేశము ప్రాప్తమగుచున్నది. కాని అట్లు యణాదేశము వచ్చుట సూత్రకారునికి ఇష్టమైనచో ఈ హ్రస్వవిధానమే యనవసరము. యణాదేశము, హ్రస్వమువకువలె దీర్ఘమునకును రావచ్చును. దానికై హ్రస్వము చేయనేల ? కావున హ్రస్వమును విధించినందువలన హ్రస్వము వచ్చినపుడు స్వరసంధి రాదను నంశము వ్యక్తమైనది. ఈ విషయమునే 'హ్రస్వ విధిసామర్థ్యాన్న స్వరసంధిః' అనువాక్యము చెప్పుచున్నది. కావున చక్రిఅత్ర అని ప్రకృతి భావమే యుండును. హ్రస్వవిధి వైకల్పికము కావున రానిచో 'చక్రీ + అత్ర' అనియుండ యణాదేశము వచ్చును. 'చక్ర్యత్ర' అగును.

ఇట్లు హ్రస్వము వచ్చుట పదాంతములైన ఇక్కులకే అనుటచే 'గౌరీ + ఔ' అనుచోట హ్రస్వమురాదు. 'గౌరీ' అనునది ప్రాతిపదికము. ఔ (ప్రథమా ద్వివచన ప్రత్యయము) చేరినపిమ్మట మాత్రమే అది పదమగును. కావున నిచట హ్రస్వము రాదు. యణాదేశము వచ్చి 'గౌర్యౌ' అనియగును.

అవ : ప్రసంగవశమున 'గౌర్యౌ' అనునుదాహరణమునందలి యకారమునకు ద్విత్వమును విధించు సూత్రమొకటి యిట చెప్పఁబడుచున్నది.

సూ : అచో రహాభ్యాంద్వే 8-4-46.

వృ : అచః పర్యాభ్యాం రేఫహకారాభ్యాం పరస్య యరో ద్వే వా స్తః. గౌర్య్యౌ. నహ్య్యస్తి.

ప. వి. : యరః (6-1) వా (అవ్య).

అర్థ : అచ్చులకు పరముగా నున్న రేఫహకారములకు పరమందున్న యర్ వర్ణమునకు ద్విత్వము వికల్పముగా నగును. ఉదా : గౌర్య్యౌ, గౌర్యౌ; నహ్య్యస్తి. నహ్యస్తి.

వివ : ఈ సూత్రముచే యర్ (ప్రత్యాహారము) వర్ణమునకు ద్విత్వము విధింపఁబడుచున్నది. ద్విత్వమనగా నొకవర్ణము రెండుమాఱు లుచ్చరింపఁబడుట. ఆ 'యర్' వర్ణమునకు పూర్వమున రేఫముగాని హకారముగాని యుండవలయును. వానికి పూర్వమున అచ్చుండవలయును. అట్టియెడల ద్విత్వము వికల్పముగా నగును.

ఉదా : గౌర్యౌ. గ్ ఔ ర్ య్ ఔ. ఇందు రేఫమునకు పరముగా నున్న యర్ వర్ణము యకారము. రేఫమునకు పూర్వమున అచ్చుగలదు. కావున యకారమునకు ద్విత్వము రాఁగా గౌర్య్యౌ, గౌర్య్యౌ—అగును. ద్విత్వము రానిచో గౌర్యౌ అనురూప ముండును. ఇట్లే హకారమునకు పరముగానున్న యర్ వర్ణమునకును ద్విత్వము వచ్చును. నహ్యస్తి. నహ్ య్ అస్తి - నహ్య్యస్తి. ద్విత్వము రానిచో నహ్యస్తి.

అవ : 'ఇకోఽసవర్ణే....' అనుసూత్రముచే విధింపఁబడిన హ్రస్వాదేశము సమాసములో రాదని యీ క్రిందివార్తికము చెప్పుచున్నది.

వా ; న సమాసే (684).

వృ : వాప్యశ్వః.

ప. వి : న (అవ్య) సమాసే (7-1).

అర్థ : సమాసమున పదాంతమైన ఇక్కునకు, అసవర్ణాచ్చు పరమగునపుడు హ్రస్వము రాదు. ఉదా : వాప్యశ్వః.

వివ : 'వాప్యామశ్వః' (బావియందలి గుఱ్ఱము) అను విగ్రహముగల 'వాప్యశ్వః' అనుచోట 'ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ' అనుసూత్రముచే హ్రస్వము ప్రాప్తమగుచున్నది. అపుడు 'వాపి అశ్వః' అనునవిష్టరూప మేర్పడును. దానిని వారించుటకై యీ వార్తికము సమాసమున హ్రస్వనిషేధమును జెప్పినది. 'వాప్యశ్వః' అను సంధిరూపమే యుండును.

సూ : ఋత్యకః 6-1-128.

వృ : ఋతిపరే పదాన్తే అకః ప్రాగ్వద్వా. బ్రహ్మఋషిః. బ్రహ్మర్షిః. పదాన్తాః కిమ్? ఆర్ఛత్.

ప. వి : ఋతి (7-1) అకః (6-1).

అను : హ్రస్వః (1-1) శాకల్యస్య (6 1) పదాన్తాత్ (5-1).

అర్థ : హ్రస్వఋవర్ణము పరమగునపుడు పదాంతములైన అగ్వర్ణములు వికల్పముగా హ్రస్వము లగును. ఉదా : బ్రహ్మఋషిః. బ్రహ్మర్షిః.పదాంతము లననేల? ఆర్ఛత్.

వివ : పూర్వసూత్రమున ఇగ్వర్ణములకు, అసవర్ణాచ్చులు పరములగునపుడు హ్రస్వము విధింపఁబడినది. ఈ సూత్రమున అకారముకూడ కలుపఁబడినది. (అక్ - అ ఇ ఉ ఋ ఌ). హ్రస్వము వచ్చినపుడు స్వరసంధిరాదు, ఉదా : బ్రహ్మ + ఋషిః - బ్రహ్మఋషిః. వికల్పమగుటచే హ్రస్వము రానియెడల గుణ మేకాదేశమై 'బ్రహ్మర్షిః' అగును.

ఈ సూత్రమున 'పదాంతమైన' అను విశేషణము లేనియెడల 'ఆ + ఋచ్ఛత్' అనునెడ కూడ హ్రస్వప్రకృతిభావములు ప్రాప్తములగును. అది సమ్మతము కాదు. ఇచట 'ఆ' అనునది పదము కాదు. అది యొక ఆగమము. కావున ప్రకృత సూత్రమున కుదాహరణముకాదు. అచట వృద్ధ్యేకాదేశమై 'ఆర్ఛత్' అగును.

'సర్వత్రవిభాషాగోః' అనుసూత్రము మొదలుకొని యింతవఱకునుగల భాగ మున అచ్సంధిరాని సందర్భములు తెలుపఁబడినవి. కావున నిది ప్రకృతిభావసంధి యనుపేరున వ్యవహరింపఁబడును. నడుమ కొన్ని కార్యవిశేషములును ప్రసక్తాను సారము చెప్పఁబడినవి.

ఇది అచ్సంధి ప్రకరణము.

## ప్రకరణావలోకనము

అచ్చులకు సంబంధించినసంధి విశేషము లిందు తెలుపఁబడినవి. (1) యణాదేశము (2) అయవాయావాదేశము (3) గుణము (4) వృద్ధి (5) పరరూపము (6) సవర్ణదీర్ఘము (7) పూర్వరూపాదేశము అనునవి యిందుఁ జెప్పఁబడినసంధి విశేషములు ఈః చెప్పఁబడిన యన్నిటికి నపవాదముగా ప్రకృతి భావము కూడ ప్లుతములకు ప్రగృహ్యములకును విధింపఁబడినది. అందు ప్రాస్తా వికముగా అవఙాదేశము, హ్రస్వాదేశము అనుకార్యవిశేషములును చెప్పఁబడినవి. సందర్భానుగుణముగా నీ ప్రకరణమున ముఖ్యములగు పరిభాషలనేకములు వివరింపఁ బడినవి. (1) షష్ఠీస్థానేయోగా (2) తస్మిన్నితి నిర్దిష్టేపూర్వస్య (3) స్థానేఽ న్తరతమః (4) అలోఽన్త్యస్య (5) యథాసంఖ్య మనుదేశః సమానామ్ (5) యస్మిన్విధి స్తదాదా వల్గ్రహణే (6) తపర స్తత్కాలస్య (7) ఉరణ్ రపరః (8) పూర్వత్రాసిద్ధమ్ (9) అనేకాల్ శిత్సర్వస్య (10) ఙిచ్చ అను పరిభాషలిందు అర్థనిర్ణయమున సహకరించినవి. ప్రకరణానుగుణముగ (1) గుణము (2) వృద్ధి (3) ఉపసర్గము (4) ధాతువు (5) టి (6) ప్రగృహ్యము (7) నిపాతము అను సంజ్ఞలు వివరింపఁబడినవి. ఇట్లు ఏవి సంజ్ఞాసూత్రములో, ఏవి పరిభాషా సూత్రములో, ఏవి సంధివిధాయక సూత్రములో, ఏవి తదితరకార్యవిశేష ములను జెప్పునో జాగ్రత్తగా గమనింపనగును.

ఈ ప్రకరణమునందలి సంధివిశేషముల స్థూల వివేకము నీ క్రిందిపట్టికనుబట్టి పొందవచ్చును.

| సం | సంధి నామము | విధాయకసూత్రము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| 1 | యణాదేశ సంధి | ఇకోయణచి | ఇ+అసవర్ణ మైనఅచ్చు =య్ | సుధ్యుపాస్యః | ఇది ఏకాదేశరూపము కాదు. అనగాపరస్వరము నకు మార్పురాదు. ఇందు ప్రాస్తావికముగా అనచిచ, ఝలాంజశ్ఝశి, సంయోగాన్తస్య లోపః అను సూత్రములచే కొన్ని కార్యవిశేషములు చెప్పఁబడినవి. |
| | | | ఉ+,, =వ్ | మధ్వరిః | |
| | | | ఋ+ ,,= ర్ | ధాత్రంశః | |
| | | | ఌ+,,=ల్ | లాకృతిః | |
| 2 | అయవాయా వాదేశ సంధి | (1) ఏచోఽయవాయావః | ఏ + అచ్చు =అయ్ | హరయే | ఇదియునేకాదేశరూపము కాదు. పూర్వముననున్న ఏఓఐఔలకే మార్పు. |
| | | | ఓ+ అచ్చు = అవ్ | విష్ణవే | |
| | | | ఐ+అచ్చు =ఆయ్ | నాయకః | |
| | | | ఔ+అచ్చు =ఆవ్ | పావకః | |
| | | (2) వాన్తోయి ప్రత్యయే | ఓ+యకారాదిప్రత్యయము=అవ్ | గవ్యమ్ | ఇదియునాదేశము మాత్రమే. |
| | | | ఔ + యకారాదిప్రత్యయము=ఆవ్ | నావ్యమ్ | |
| | | (3) అధ్వపరిమాణే చ | గో + యూతిః | గవ్యూతిః | ఇదియునాదేశము మాత్రమే. |
| 3 | గుణసంధి | ఆద్గుణః | అ+ఇ=ఏ | ఉపేన్ద్రః | ఇది ఏకాదేశరూపము. పూర్వ పరస్వరములు రెండునుపోయి విధింపఁబడినవర్ణము వచ్చును. ఇందు ప్రాస్తావికముగ 'లోపశ్శాకల్యస్య' అను సూత్రముచెప్పఁబడినది. |
| | | | అ+ఉ=ఓ | గంగోదకమ్ | |
| | | | అ+ఋ= అర్ | కృష్ణర్ధిః | |
| | | | అ+ ఌ = అల్ | తవల్కారః | |

ఈ ప్రకరణమునందలి సంధివిశేషముల స్థూల వివేకము నీ క్రిందిపట్టికనుబట్టి పొందవచ్చును.

| సం | సంధి నామము | విధాయకసూత్రము వార్తికము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| 4 | వృద్ధిసంధి | (1) వృద్ధిరేచి. | అ+ఏ=ఐ | కృష్ణైకత్వమ్ | ఇది ఏకాదేశము |
| | | | అ+ఐ=ఐ | దేవైశ్వర్యమ్ | గుణమున కపవాదము |
| | | | అ+ఓ=ఔ | గంగౌఘః | |
| | | | అ+ఔ=ఔ | కృష్ణౌత్కంఠ్యమ్ | |
| | | (2) ఏత్యేధత్యూఠ్సు | అ + ఏతి ఏధతి = ఐ | ఉపైతి | ఏకాదేశము. పరరూప |
| | | | | ఉపైధతే | మున కపవాదము. |
| | | | అ + ఊఠ్ = ఔ | ప్రష్ఠౌహః | |
| | | (3) అక్షాదూహిన్యా ముపసంఖ్యానమ్ | అక్ష + ఊహినీ | అక్షౌహిణీ | ఏకాదేశము. గుణమున కపవాదము. |
| | | (4) ప్రాదూహోఢో -ఢ్యేషైష్యేషు | ప్ర + ఊహః | ప్రౌహః | ఏకాదేశము - గుణాప వాదము |
| | | | ప్ర + ఊఢః | ప్రౌఢః | |
| | | | ప్ర + ఊఢిః | ప్రౌఢిః | ,, ,, |
| | | | ప్ర + ఏషః | ప్రైషః | ,, పరరూపాప |
| | | | ప్ర + ఏష్యః | ప్రైష్యః | వాదము |
| | | (5) ఋతే చ తృతీయాసమాసే | సుఖ+ఋతః | సుఖార్తః | ,, గుణాపవాదము |
| | | | | | ,, ,, |
| | | (6) ప్రవత్సతర కమ్బల వసనార్ణ దశానామృణే. | ప్ర + ఋణమ్ | ప్రార్ణమ్ | ,, ,, |
| | | | వత్సతర + ఋణమ్ | వత్సతరార్ణమ్ | ,, ,, |
| | | | | | ,, ,, |
| | | | కమ్బల + ఋణమ్ | కమ్బలార్ణమ్ | ,, ,, |
| | | | | | ,, ,, |
| | | | వసన+ఋణమ్ | వసనార్ణమ్ | ,, ,, |
| | | | ఋణ+ఋణమ్ | ఋణార్ణమ్ | ,, ,, |
| | | | దశ + ఋణ | దశార్ణః. | ,, ,, |
| | | | | | ,, ,, |
| | | (7) ఉపసర్గాదృతి ధాతౌ | అవర్ణాంతమైన ఉపసర్గము + ఋకారాది ధాతువు= ఆర్ | ప్రార్ఛతి. | ,, ,, |
| | | | | | ,, ,, |

ఈ ప్రకరణమునందలి సంధివిశేషముల స్థూల వివేకము నీ క్రిందిపట్టికనుబట్టి పొందవచ్చును.

| సం | సంధి నామము | విధాయకసూత్రము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| | పరరూప సంధి | (1) ఏఙిపరరూపమ్ | అవర్ణాంత ఉపసర్గము+ ఏఙాదిధాతువు =ఏ ఓ | ప్రేజతే ఉపోషతి | వృద్ధ్యపవాదము |
| | | (2) శకన్ధ్వాదిషుపరరూపంవాచ్యమ్ | శక+అన్ధుః కర్క+అన్ధుః మనస్+ఈషా లాంగల+ఈషా | శకన్ధుః కర్కన్ధుః మనీషా లాంగలీషా | సవర్ణదీర్ఘాపవాదము ,, విసర్గసంధ్యపవాదము గుణాపవాదము |
| | | (3) ఓమాఙోశ్చ | అ+ఓమ్=ఓ అ + ఆఙ్ | శివాయోన్నమః శివేహి | ,, వృద్ధ్యపవాదము |
| 6 | సవర్ణ దీర్ఘ సంధి | అకస్సవర్ణేదీర్ఘః | అ+అ=ఆ ఇ+ఇ=ఈ ఉ+ఉ = ఊ ఋ ఋ=ౠ | దైత్యారిః శ్రీశః విష్ణూదయః హోతౄకారః | ఏకాదేశము - ఇచట ,, పూర్వపరములైన అచ్చులు హ్రస్వదీర్ఘములలో నేవైనను కావచ్చును గుణయణాదేశములకపవాదము. |
| | పూర్వరూప సంధి | ఏఙఃపదాన్తాదతి | ఏ+అ=ఏ ఓ+అ=ఓ | హరేఽవ విష్ణోఽవ. | ఏకాదేశము. అయవాదేశమున కపవాదము. |
| | ప్రకృతి భావము | (1) సర్వత్ర విభాషాగోః | గో + | గో అగ్రమ్ | వైకల్పికము. రానిచో పూర్వరూపమువచ్చును. |
| | | (అవఙాదేశము) | | | |
| | | (అ) అవఙ్స్ఫోటాయనస్య | + అ | గవాగ్రమ్. | వైకల్పికము. రానిచో ప్రకృతి భావము పూర్వరూపము. |
| | | (ఇ) ఇన్ద్రేచ | గో + ఇన్ద్రః | గవేన్ద్రః | |

ఈ ప్రకరణమునందలి సంధివిశేషముల స్థూల వివేకము నీ క్రిందిపట్టికనుబట్టి పొందవచ్చును.

| సం | సంధి నామము | విధాయకసూత్రము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| ౮ | ప్రకృతి భావము | (2) ప్లుత ప్రగృహ్యా అచి నిత్యమ్. | (అ) ప్లుతము + అచ్చు | ఏహికృష్ణ౩అత్ర గౌశ్చరతి | 'దూరాద్ధూతేచ' అనుసూత్రముచేప్లుతము. |
| | | ,, | (ఇ) ప్రగృహ్యము | | |
| | | | (1) ద్వివచనాంతములు | హరీఏతౌ విష్ణూఇమౌ గంగేఅమూ పచేతేఇమౌ | 'ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్' అనుసూత్రముచే ఇందు మొదటిపదములకు ప్రగృహ్యసంజ్ఞ |
| | | | ఇతరములు | | |
| | | ,, | 1) బహువచనము | అమీఈశాః | అదసోమాత్ అనుసూత్రముచే ప్రకృతిభావము. |
| | | ,, | 2) ద్వివచనము | రామకృష్ణావమూ ఆసాతే | ,, |
| | | | నిపాతములు | | |
| | | ,, | 1) ఏకాచ్చు | ఇ ఇన్ద్రః ఉ ఉమేశః | నిపాత ఏకాజనాఙ్ సూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ |
| | | ,, | 2) అనేకాచ్చు | అహో ఈశాః | ఓత్ అనుసూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ |
| | | | ఇతరములు | | |
| | | | ఓ + ఇతి | విష్ణో ఇతి | సంబుద్ధౌ శాకల్యస్యేతావనార్షే అనుసూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ |
| | వకారాదేశము ప్రకృతి భావము | మయఉఞోవో వా | కిము+ఉక్తమ్ | కిమ్వుక్తమ్- కిముఉక్తమ్. | |
| | హ్రస్వము ప్రకృతి భావము | 1) ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ | చక్రీ + అత్ర | చక్రి అత్ర | హ్రస్వవిధిసామర్థ్యమున ప్రకృతిభావము. వైకల్పికము. |
| | ,, | (2) ఋత్యకః | బ్రహ్మా + ఋషిః | బ్రహ్మ ఋషిః | ,, |

# అథహల్సంధి ప్రకరణమ్

ఒక హల్లు మఱియొక హల్లుతోఁ గాని, అచ్చుతోఁ గాని కలియునపుడు లేక అవసానమున నున్నపుడును కలుగు మార్పులీప్రకరణమున తెలుపఁబడుచున్నవి. హల్లులకు సంబంధించిన మార్పులను దెలుపు ప్రకరణమగుటచే నిది హల్సంధి ప్రకరణ మనఁబడును.

సూ : స్తోః శ్చునా శ్చుః 8-4-40.

వృ : సకారతవర్గయోః శకారచవర్గాభ్యాం యోగే శకారచవర్గౌ స్తః. రామ శ్శేతే. రామశ్చినోతి, సచ్చిత్, శార్ఙ్గిఞ్జయ.

ప. వి : స్తోః (6-1) శ్చునా (3-1) శ్చుః (1-1).

అర్థ : సకారాతవర్గములకు, శకారచవర్గములతో కూడిక యున్నపుడు శకారచవర్గము లాదేశములగును. ఉదా : రామశ్శేతే, రామశ్చినోతి, సచ్చిత్ శార్ఙ్గిఞ్జయ.

వివ : ఇందు తు, చు అనునవి ఉదిత్తులు. అవి తవర్గచవర్గములకు సంజ్ఞ లగును (అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః). స్తోః అనునది షష్ఠ్యంతపదము. 'సకార తవర్గములయొక్క స్థానమున' అని దానికర్థము (షష్ఠీస్థానేయోగా) శ్చునా అనునది తృతీయైక వచనాంతము. శకారచవర్గములతో నని దానికర్థము. కలయికయుండుట అనునది సందర్భమునుబట్టి వచ్చునర్థము. ఇట్లు సకారమునకును తథదధన అను వానికిని, శకారము చ ఛ జ ఝ ఞ అను వర్ణములతో కలయిక యున్నపుడు అనగా వాని కివి పూర్వపరములలో నెందైనను ఉన్నపుడు సకారతవర్గముల స్థానమున క్రమ ముగా శకారచవర్గము లాదేశములగును. ఇచట యథాసంఖ్యానియమము స్థానులగు సకారతవర్గములకును, ఆదేశములగు శకారచవర్గములకును మాత్రమే అనగా సకారమునకు, శవర్ణముతోఁగాని చవర్గముతోఁగాని యోగమున్నపుడు, శవర్ణమాదేశ మగును. తవర్గమునకు, శవర్ణముతోఁగాని, చవర్గముతోఁగాని యోగమున్నపుడు, చవర్గమాదేశమగును. స్థానులకును నిమిత్తములకును యథాసంఖ్యానియమము వర్తింపదు. అనగా 'సకారమునకు శకారముతో కూడికయున్నపుడు, తవర్గమునకు చవర్గముతో కూడికయున్నపుడు' అనునర్థము చెప్పుకొనరాదు. ఈ విషయము వక్ష్యమాణమగు 'శాత్' అనుసూత్రమువలన తెలుపఁబడుచున్నది.

ఉదా : రామస్ + శేతే. ఇచట సకారమునకు శకారముతో యోగ ముండుటచే సకారనస్థామున శకారమాదేశమగును. రామశ్ + శేతే=రామశ్శేతే.

రామస్ + చినోతి - ఇచట సకారమునకు చవర్గాక్షరమగు చకారముతో యోగమున్నది. కావున సకారమును దొలఁగించి శకారము వచ్చును. రామశ్చినోతి =రామశ్చినోతి.

సత్ + చిత్ - ఇచట తవర్గాక్షరమగు తకారమునకు చకారముతో కల యిక గలదు. కావున తకారము చకారముగ మారును. సచ్‌చిత్ =సచ్చిత్.

శార్ఙ్గిన్ + జయ - ఇచట తవర్గాక్షరమగు నకారమునకు జకారముతో కల యిక గలదు. కావున నకారమునకు, యథాసంఖ్య నియమమునుబట్టి చవర్గపంచ మాక్షరము ఆదేశమగును. శార్ఙ్గిఞ్ జయ=శార్ఙ్గిఞ్జయ.

శకారచవర్గము లాదేశములగు సంధియగుటచే దీనికి శ్చుత్వసంధియనిపేరు. శ్, చు=శ్చు, శ్చుయొక్క-భావము శ్చుత్వము. అది యగుసంధిశ్చుత్వసంధి.

అప : యోగమనుటచే సకారతవర్గములకు శకారచవర్గములు పూర్వమునఁగాని పరమునఁగాని యుండవచ్చును. అట్లుండుటలో నొక సన్నివేశములో దీనికి నిషేధము చెప్పఁబడు చున్నది.

సూ : శాత్ 8-4 44.

వృ : శాత్ పరస్య తవర్గస్య శ్చుత్వం న. విశ్నః, ప్రశ్నః

ప వి : శాత్ (5-1).

అను : శ్చుః (1-1) న (అవ్య) తోః (6-1).

అర్థ : శవర్గమునకు పరముగానున్న తవర్గమునకు శ్చుత్వము రాదు. ఉదా : విశ్నః, ప్రశ్నః.

వివ : శాత్ అనగా శవర్గమునకు పరముగానున్న అని యర్థము. 'తోః' అనగా 'త వర్గాక్షరముయొక్క- స్థానమున' అని యర్థము. శవర్గమునకు పరముగా నున్న త వర్గాక్షరమునకు పూర్వసూత్రముచే విధింపఁబడిన శ్చుత్వము రాదు. ఈ సూత్రమువలననే పూర్వసూత్రమున శకారచవర్గములు సకారతవర్గములకు పూర్వపర ములుగా నెట్లయిననుండవచ్చుననునర్థము సంభావింపఁబడినది. అట్లుకాక సకారతవర్గ ములకు శకారచవర్గములు పరముగనేయుండవలయునన్నచో నిషేధము వ్యర్థమగును.

ఏలయన శకారమునకు పరముగా నున్న తవర్గమునకు శ్చుత్వము ప్రాప్తించుటయే లేదుకదా! ప్రాప్తిలేనిదే నిషేధమేల? అందువలన శకారచవర్గములతో యోగమున్నపుడు అనునర్థ మాసూత్రమున చెప్పఁబడినది. దానివలన శకారమునకు పరమైన తవర్గాక్షరమునకు శ్చుత్వము ప్రాప్తించుచుండగా నట్లగుటకు సమ్మతిలేదు కావున నీ సూత్రముచే నిషేధము చెప్పఁబడినది.

ఉదా : (విచ్ఛ, ప్రచ్ఛ అనునవి ధాతువులు. దీనికి 'నఙ్' అను కృత్ప్రత్యయము చేరును. దానియోగమున ఛకారమునకు శకారమాదేశమగును) విచ్ఛ + నఙ్ ఙకారమిత్తు - విశ్+న - 'ఇచట పూర్వసూత్రముచే శ్చుత్వము ప్రాప్తించుచుండఁగా నిషేధము చెప్పఁబడినది. విశ్నః - అన్లే, ప్రచ్ఛ + నఙ్=ప్రశ్ + న = ప్రశ్నః. ఈ నిషేధము లేనియెడల విశ్ఞః, ప్రశ్ఞః ఇత్యాది దుష్టరూపము లేర్పడును.

సూ : ష్టునా ష్టుః. 8-4-41.

వృ : స్తోః ష్టునా యోగే ష్టుః. రామష్షష్ఠః, రామష్టీకతే, పేష్టా, తట్టీకా, చక్రిణ్ఢౌకసే.

ప. వి : ష్టునా (3-1) ష్టుః (1-1).

అను : స్తోః (6-1).

అర్థ : సకారతవర్గములకు, షకారటవర్గములతో కలయికయున్నపుడు, షకారటవర్గము లాదేశములగును. ఉదా : రామష్షష్ఠః, రామష్టీకతే, పేష్టా, తట్టీకా, చక్రిణ్ఢౌకసే.

వివ : ష్టు అనగా షకారటవర్గములు-టు ఉదిత్తు. పూర్వసూత్రమునవలెనే యిచటను స్థానులకు నాదేశములకు యథాసంఖ్యనియమము. సకారమునకు షకారముతో గాని టవర్గముతోగాని కలయికయున్నయెడల షకారమాదేశమగును. తవర్గమునకు షకారముతోగానిటవర్గముతోగాని యోగమున్నయెడల టవర్గమాదేశమగును. ఉదా : రామస్ + షష్ఠః - ఇచట సకారమునకు షకారముతో కలయిక కలదు, కావున సకారము షకారమగును. రామష్ + షష్ఠః=రామష్షష్ఠః.

రామస్ + టీకతే-ఇచట సకారమునకు టకారముతో యోగము కలదు. రామష్ + టీకతే-రామష్టీకతే.

పిష్+తృచ్ - పిష్ధాతువు. తృచ్ ప్రత్యయము (ఇందు చకారమిత్తు)ఇచట తకారమునకు పూర్వముననున్న షకారముతో యోగము కలదు. కావున ట వర్గాక్షర మగుటకారము వచ్చును. (ధాతువులోని ఇకారమునకు గుణము విధింపఁబడినది). పేష్ + టృ=పేష్టృ-ప్రథమావిభక్త్యేకవచనమున 'పేష్టా' అగును.

తత్ + టీకా - ఇచట తకారమునకు ట వర్గాక్షరముతో యోగము కలదు. కావున తకారమునకు టకారమాదేశమగును. తట్ + టీకా - తట్టీకా.

'చక్రిన్+ఢౌకసే'-ఇచట తవర్గాక్షరమగు నకారమునకు టవర్గాక్షరమగు ఢకారముతో యోగము కలదు. కావున నకారము టవర్గ పంచమాక్షరమగుణకారమగును. చక్రిణ్ఢౌకసే=చక్రిణ్ఢౌకసే.

షకారముటవర్గమును కలిసి'ష్టు'అగును. ష్టుయొక్కభావము. ష్టుత్వముష్టుత్వమాదేశమగు సంధి కావున నిదిష్టుత్వసంధి యనఁబడును.

అవ : పై విధికి కొందొక నిషేధము చెప్పఁబడుచున్నది.

సూ : నపదాన్తాట్టోరనామ్ 8-4-42.

వృ : పదాన్తాట్టవర్గాత్పరస్య అనామఃస్తోః ష్టుర్నస్యాత్. షట్సన్తః షట్తే. పదాన్తాత్ కిమ్? ఈట్టే, టోఃకిమ్? సర్పిష్టమమ్.

ప. వి : న (అవ్య) పదాన్తాత్ (5-1) టోః (5-1) అనామ్ (లుప్తషష్ఠీకమైన పదము).

అను : స్తోః (6-1) ష్టుః (1 1).

అర్థ : పదాంతమైన టవర్గమునకు పరమందున్న సకారతవర్గములకు ష్టుత్వము రాదు. 'నామ్' అనుదాని నకారమున కీనిషేధములేదు. ఉదా : షట్ సన్తః. షట్ తే. పదాంతమైన అననేల ? ఈట్టే. 'ట వర్గమునకు పరమందున్న అననేల? సర్పిష్టమమ్.

వివ : ఇది ష్టుత్వసంధికి కొన్నితావుల నిషేధము చెప్పుసూత్రము. పదము యొక్క అంతమున ట వర్గాక్షరముండినపుడు దానికి పరమున సకారతవర్గములున్నయెడల పూర్వసూత్రవిహితమైన ష్టుత్వము వానికి రాదని సూత్రతాత్పర్యము. కాని యీ నిషేధము పదాంతటవర్గమునకు పరముగా 'నామ్' అనుదాని త వర్గాక్షరమునకు వర్తింపదని 'అనామ్' అనుపదము చెప్పుచున్నది.

ఉదా : షట్ + సన్తః - ఇచట షట్ అనునది పదము. దానియంతమున ట వర్గాక్షరము గలదు. దానికి పరముగా నున్న సకారమునకు ష్టుత్వము పూర్వ

సూత్రముచే ప్రాప్తమగుచుండగా ప్రకృతసూత్రముచే నిషేధింపఁ బడినది. షట్ సన్తః.

షట్ + తే - ఇచటను తవర్గాక్షరమగు తకారమునకు ష్టుత్వమురాదు. 'షట్తే' అగును.

సూత్రమునందలి 'పదాన్తాత్' అనుపదముయొక్క ప్రయోజనము పరీక్షింపఁ బడుచున్నది. (పదాన్తాత్ కిమ్? ఈట్టే). 'పదాంతాత్' అననియెడల పదముకానిదాని యంతమున నున్న టవర్గమునకు పరమందున్న సకారతవర్గములకుకూడ ష్టుత్వ నిషేధము ప్రాప్తమగును. అది యిష్టము కాదు. ఉదా : ఈట్+తే. ఇచట 'ఈట్' అనునది ధాతువు. 'తే' అను ప్రత్యయము చేరినపిదపనే దానికి పదత్వము సిద్ధించును (సుప్తిఙన్తం పదమ్) కావున పదాంతాత్ అనుటవలన లక్షణమిట సరిపడక పోవును. కావున తకారమునకు ష్టుత్వము (టకారము) వచ్చి 'ఈట్టే' అగును.

ష్టుత్వమునకు నిమిత్తములైన షకారటవర్గములలో షకారమును వదలి 'టోః' అని టవర్గము నొక్కదానినే గ్రహించుటలో భావమేమి? యని 'టోః కిమ్' అను ప్రశ్నయొక్క యాంతర్యము. పదాంతమైన షకారమునకు పరముగానున్న సకారతవర్గములకు ష్టుత్వము వచ్చుట యిష్టమే కనుక షకారమును వదలి, టవర్గమునకు పిదపనున్న సకారతవర్గములకే ష్టుత్వనిషేధము చెప్పఁబడినదని సమాధానము. ఉదా : సర్పిష్+తమ. ఇక్కడ తవర్గాక్షరము పదాంతమైన షకారమునకు పరముగా నున్నది. కావున ష్టుత్వనిషేధములేదు. అనగా ష్టుత్వమువచ్చును. ఇట్టియెడలష్టుత్వము వచ్చుటకే 'టోః' అనిటవర్గముమాత్రమే గ్రహింపఁబడినది. 'సర్పిష్టమమ్'. (ఇచట 'సర్పిష్' అనునది సుబంతము కాకపోయినను 'తమప్' అను తద్ధిత ప్రత్యయము పరమగునపుడు 'స్వాదిష్వసర్వనామస్థానే' అనుసూత్రముచే పదసంజ్ఞ కలుగును).

అవ : ఈ సూత్రమునందలి 'అనామ్' అనుపదము 'నామ్' అనుదాని తవర్గాక్షరమునకు ష్టుత్వనిషేధము లేదని చెప్పుచున్నది. అట్లు ష్టుత్వనిషేధము లేకుండుట మఱి రెండు సందర్భములందును గలదని క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా : అనామ్నవతి నగరీణామితి వాచ్యమ్ (5016).

ఉ : షణ్ణామ్, షణ్ణవతిః, షణ్ణగర్యః.

ప. వి : అనామ్నవతి నగరీణామ్ (6-3) ఇతి (అవ్య) వాచ్యమ్ (1-1).

అర్థ : ఈష్టుత్వనిషేధము 'నామ్' నవతి, నగరీ అనువాని తవర్గాక్షమునకు వర్తింపదని చెప్పనగును. ఉదా : షణ్ణామ్, షణ్ణవతిః, షణ్ణగర్యః.

విష : న పదాన్తాత్ ఇత్యాదిసూత్రమున పదాంతటవర్గమునకు పరముగా నున్న 'నామ్'లోని నకారమునకు ష్టుత్వనిషేధములేదని మాత్రమే చెప్పినది. కాని అట్లు ష్టుత్వనిషేధము లేకుండుట ఒక్క 'నామ్' అనుదానికే కాక నవతి, నగరీ అను వానిలోని నకారమునకు వర్తించునని వార్తికకారులు చెప్పిరి. ఇది సూత్రమున అనుక్తమైన విషయము.

ఉదా : షట్+నామ్. (షష్ఠీబహువచన ప్రత్యయము 'ఆమ్' అనునది.దానికి కొన్ని సందర్భములలో 'నుట్' ఆగమము వచ్చును. అప్పుడది 'నామ్' అగును. అదియే ప్రకృతవిషయము). ఇచట 'షట్' అనుదానికి 'స్వాదిష్వసర్వ నామ స్థానే' అను సూత్రముచే పదత్వముండును. 'నపదాన్తాట్టోః' అనుసూత్రముచే నకారమునకు ష్టుత్వనిషేధము ప్రాప్తమగుచుండఁగా ప్రకృత వార్తికము దానినివారించినది. కావున ష్టుత్వము వచ్చును. షట్+ణామ్-'ప్రత్యయేభాషాయాం నిత్యమ్' అను వక్ష్యమాణ వార్తికముచే టకారమునకు నిత్యముగా అనునాసికాదేశ మగును. షణ్ ణామ్ = షణ్ణామ్.

షట్ + నవతిః (తొంబదియాఱు) ష్టుత్వనిషేధము నపదాన్తాదిత్యాది సూత్రముచే ప్రాప్తమగుచుండగా వారింపఁబడినది. కావున ష్టుత్వము రాఁగా షట్ + ణవతిః - 'యరోఽనునాసికేఽనునాసికోవా' అనువక్ష్యమాణ సూత్రముచే టకారమునకు ణకారమాదేశమగును. షణ్ణవతిః.

అట్లే షట్ + నగర్యః (ఆఱునగరులు) షణ్ణగర్యః.

అవ : 'ష్టునా ష్టుః' అనుదానికే మఱియొక సందర్భమున నిషేధము చెప్పఁబడుచున్నది.

సూ : తోః షి 8-4-43.

వృ : నష్టుత్వమ్. సన్ షష్ఠః.

ప. ప : తోః (6-1) షి (7-1).

అను : న (అవ్య) ష్టుః (1)1).

అర్థ : తవర్గమునకు షష్టుకారముపరమగునపుడుష్టుత్వమురాదు. ఉదా: సన్ షష్ఠః

వివ : సకారతవర్గములకు పూర్వపరములలో నెంద్తైనను షకారటవర్గములున్న యెడల ష్టుత్వము విధింపఁబడినది. కాని షకారము పరముగానున్నయెడల పూర్వమున నున్న తవర్గాక్షరమునకు ష్టుత్వము రాదని ప్రకృతసూత్రము చెప్పుచున్నది. షి అనగా షకారము పరమైనపుడు అనునర్థము 'తస్మిన్నితి నిర్దిష్టేపూర్వస్య' అను పరిభాషచే వచ్చును.

ఉదా ; సన్ + షష్ఠః - ఇచట నకారము తవర్గాక్షరము. దానికి పరముగా షకారము గలదు. ష్టుత్వము ప్రాప్తించుచుండగా నిషేధము. 'సన్ షష్ఠః' ఈ నిషేధము చెప్పనియెడల 'షణ్ షష్ఠః' అనుదుష్టరూప మేర్పడవలసి వచ్చును.

సూ : ఝలాం జశోఽన్తే 8 2-39.

వృ : పదాన్తే ఝలాం జశస్స్యుః. వాగీశః.

ప. వి : ఝలామ్ (6-3) జశః (1-3) అన్తే (7-1).

అను : పదస్య (6-1).

అర్థ : పదాంతమున ఝల్లులకు జశ్శులగును. ఉదా : వాగీశః.

వివ : అనునాసికములు కాక తక్కిన వర్గాక్షరములును, శషసహలును 'ఝల్' ప్రత్యాహారములోఁ గలవు. జశ్శులనగా వర్గతృతీయాక్షరములు (జ బ గ డ ద) పదమనగా సుబంతము, లేక తిజంతము పదముయొక్క అంతమున నున్న ఝల్వర్ణములస్థానమున జశ్ వర్ణములు వచ్చును. ఆంతరతమ్యమునుబట్టి యా యాదేశమగును. ఉదా : క ఖ గ ఘ అనువానికి గకారము వచ్చును. ఇట్లే తక్కినవియు నూహ్యములు. ఉదా : వాక్ + ఈశః - ఇచట వాక్ అనుపదముయొక్క అంతముననున్న ఝల్ ప్రత్యాహారములోనిదగు కకారమునకు జశ్ వర్ణములలోని గకార మాదేశమగును. వాగ్ + ఈశః - వాగీశః.

జశ్శు. యొక్కభావము 'జశ్త్వము' అది ఆదేశమగు సంధిగాన దీనిని జశ్త్వ సంధి యందురు.

సూ : యరోఽను నాసికేఽను నాసికో వా 8-4-45.

వృ : యరః పదాన్తస్యాను నాసికే పరేఽనునాసికో వా స్యాత్; ఏతన్మురారిః, ఏతద్మురారిః.

ప. వి : యరః (6-1) అనునాసికే (7-1) అనునాసికః (1-1) వా (అవ్య).

అను : పదాన్తాత్ (5-1).

అర్థ : అనునాసికము పరమగునపుడు పదాంతస్థమైన యర్ వర్ణమునకు అనునాసికాదేశము వికల్పముగా నగును. ఉదా : ఏతన్మురారిః, ఏతద్మురారిః.

వివ : యర్ ప్రత్యాహారమునందు హకారముకాకతక్కినహల్లులన్నియుగలవు. అట్టి యర్ణులకు పరమున ననునాసికమున్నచో నవి (యర్ణులు) అనునాసికములుగా మారును. ఇచటను ఆదేశములు అంతరతమములైనవి వచ్చును. ఉదా : క ఖ గ ఘ అను యర్ణులకు ఙకారము వచ్చును. ఇట్లే తక్కినవియు నూహ్యములు. ఈ కార్యము పదాంతములైన యర్వర్ణములకే యగును. అదియు వికల్పముగా నగును.

ఉదా : ఏతద్ + మురారిః - ఇచట దకారము యర్ వర్ణము. దానికి అనునాసికమగు మకారము పరమునఁగలదు కావున దకారస్థానమున, దానికి అంతరతమమైన త వర్గానునాసికము నకారము వచ్చును. ఏతన్మురారిః రానిచో 'ఏతద్మురారిః' అనియు నుండును.

అవ : ఈ క్రింది వార్తికమీసూత్రమునకొక సవరణము చేయుచున్నది.

వా : ప్రత్యయే భాషాయాం నిత్యమ్ (5017).

ఉ : తన్మాత్రమ్, చిన్మయమ్.

ప. వి : ప్రత్యయే (7-1) భాషాయామ్ (7-1) నిత్యమ్ (2-1).

అర్థ : లోకభాషయందు, అనునాసికవర్ణమాదియందుగల ప్రత్యయము పరముగా నున్నపుడు పూర్వమున నున్న యర్వర్ణమున కనునాసికాదేశము నిత్యముగా నగును. ఉ॥ తన్మాత్రమ్, చిన్మయమ్.

వివ : పూర్వసూత్ర మీయనునాసి దేశమును వైకల్పికముగా విధించుచుండగా నీవార్తికము కొన్నియెడల దానికి నిత్యత్వమును జెప్పుచున్నది. 'భాషాయామ్' అనుటవలన నిది వేదభాషయందు వర్తింపదు. ప్రత్యయమనగా అర్థవిశేషమును స్ఫురింపఁజేయుచు నామములు, ధాతువులు మున్నగువానికి చేరు అక్షరము లేక అక్షరసముదాయము. ప్రత్యయములు అష్టాధ్యాయిలో 3,4,5 అధ్యాయములలో విధింపఁ బడినవి. మొదటివర్ణము అనునాసికమైన ప్రత్యయము పరమగునపుడు పూర్వమున నున్న యర్ వర్ణమునకు నిత్యముగా అనునాసిక మాదేశమగును.

ఉ॥ తద్ + మాత్ర(చ్) (మాత్రచ్ అనునది ప్రమాణార్థమున విధింపఁబడిన తద్ధిత ప్రత్యయము. ఇందు చకారమిత్తు) ఇచట అనునాసికమగు మకారము మొదటగల ప్రత్యయము పరముగా నున్నది కావున ద రమునకు నకారాదేశము నిత్యముగా రాఁగా 'తన్మాత్రమ్' అగును. ఇట్లే చిత్ + మయ(ట్) ('మయట్' అనునది తాద్రూప్యార్థమున విధింపఁబడిన తద్ధిత ప్రత్యయము) చిన్మయమ్.

అనునాసిక మాదేశమగు సంధి కావున దీని ననునాసకసంధి యందురు.

సూ : తోర్లి 8-4-60.

వృ : పరసవర్ణః. తల్లయః, విద్వాఁల్లిఖతి. నస్యానునాసికోలః.

ప. వి : తోః (6-1) లి (7-1).

అను : పరసవర్ణః (1-1).

అర్థ : తవర్గమునకు లకారము పరమగునపుడు పరసవర్ణమాదేశమగును.

ఉదా : తల్లయః. విద్వాఁల్లిఖతి. నకారమున కనునాసికలకార మాదేశమగును.

వివ : 'తు' అనునది ఉదిత్తు. ఇది తన సవర్ణములను గ్రహించును. (అణుదిత్) తు అనుదాని షష్ఠ్యేక వచనరూపము 'తోః' అనునది. 'తవర్గము యొక్క స్థానమున' అనియర్థము. 'ల్' అనుదాని సప్తమ్యేకవచనరూపము 'లి' లకారముపరమగునపుడని దానికర్థము (తస్మిన్నితి నిర్దిష్టేపూర్వస్య). లకారము పరమగునపుడు త వర్గము (త, థ, ద, ధ, న) యొక్కస్థానమున పరసవర్ణము - అనగా లకారము ఆదేశమగును.

ఉదా : తద్ + లయః - ఇచట దకారము తవర్గాక్షరము. లకారము పరమైనది. కాన దకారముపోయి లకారము వచ్చును. తల్ + లయః = తల్లయః.

విద్వాన్ + లి ఖ తి, ఇచట తవర్గాక్షరమగు నకారముయొక్క స్థానమున వచ్చు లకారము ఆంతరతమ్యమునుబట్టి అనునాసిక లకారమగును(స్థానేఽన్తరతమః) విద్వాఁల్ లిఖతి - విద్వాఁల్లిఖతి.

దీనిని పరసవర్ణాదేశసంధి అనవచ్చును.

సూ : ఉదః స్థాస్తమ్భోః పూర్వస్య 8-4-61.

వృ : ఉదఃపరయోః స్థాస్తమ్భోః పూర్వస వర్ణః.

ప. వి : ఉదః (5-1) స్థాస్తమ్భోః (6-2) పూర్వస్య (6-1).

అను : సవర్ణః (1-1).

అర్థ : 'ఉద్' అనుదానికి పరమందున్న స్థాస్తమ్భుధాతువులకు పూర్వ సవర్ణమగును.

వివ : 'ఉద్' అనునది ఉపసర్గము (ఉపసర్గాః క్రియాయోగే). స్థా, స్తమ్భు అనునవి ధాతువులు (భూవాదయోధాతవః) ఉద్ అను ఉపసర్గమునకు పరముగానున్న స్థాస్తమ్భుధాతువులకు పూర్వసవర్ణాక్షరము ఆదేశమగును. అనగా 'ఉద్'లోని దకారమునకు సవర్ణమైన అక్షరము వచ్చును. ఉదాహరణము ముందు చూపఁబడును.

అవ : 'ఉదః' అనువదమునకు ఉద్ అనుదానికి పరముగానున్న అనునర్థమెట్లు కలిగినదో యీ క్రింది పరిభాష చెప్పుచున్నది.

సూ : తస్మాదిత్యుత్తరస్య 1-1-67.

వృ : పంచమీనిర్దేశేన క్రియమాణంకార్యం వర్ణాంతరే ణావ్యవహితస్య పరస్య జ్ఞేయమ్.

ప. వి : తస్మాత్ (5-1) ఇతి (అవ్య) ఉత్తరస్య (6-1).

అర్థ : పంచమ్యంతపద నిర్దేశముచేత చేయఁబడు కార్యము మఱియొక వర్ణముతో వ్యవధానములేని పరమున కగునని తెలియనగును.

వివ : 'తస్మాత్' అనునది పంచమ్యంత పదమునకు సూచనము. ఒక సూత్రములో పంచమ్యంతపదమును ప్రయోగించి ఒక కార్యము విధింపఁబడిన యెడల ఆ కార్యము, ఆ పంచమ్యంతపదముచే చెప్పఁబడుదానికి అవ్యవహితముగ (నడుమ వేఱు వర్ణములేకుండ) పరముగా నున్నశబ్దభాగమున కగును. ఉదా: పై సూత్రమున 'ఉదః' అనునది పంచమ్యంతము. ఇచట పూర్వసవర్ణము అను కార్యము విధింపఁబడినది. ఆ కార్యము పంచమ్యంతముచే చెప్పఁబడిన 'ఉద్' అనుదానికి అవ్యవహితముగ నున్న స్థా, స్తమ్భు ధాతువులకు అగు ననువిషయము ప్రకృత పరిభాషచే నిర్ణీతమైనది. అవ్యవహితముగ అనుటచే నడుమవేఱువర్ణములున్నచో ఈ కార్యము జరుగదు. ఉదా : ఉద్ + ప్రస్థానమ్ - ఇచట స్థాధాతువునకు 'ఉద్' అనుదానికిని నడుమ 'ప్ర' అనునుపసర్గము కలదు. కాన ఈ కార్యము ప్రవర్తింపదు.

అవ : 'ఉదఃస్థాస్తమ్భోః పూర్వస్య' అనుసూత్రముచే విధింపఁబడిన పూర్వసవర్ణాదేశము 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే స్థాస్తంభుధాతురూపముల తుదివర్ణము

నకు ప్రాప్తించుచున్నది. అది అయిష్టము కాదు. కావున నీయాదేశ మెచట వచ్చునో నిర్ణయించు పరిభాష మఱియొకటి చెప్పఁబడుచున్నది.

సూ : ఆదేః పరస్య 1-1-54.

వృ : పరస్య యద్విహితం తత్తస్యాదేర్బోధ్యమ్. ఇతి సస్యథః.

ప. వి : ఆదేః (6-1) పరస్య (6-1).

అను : స్థానే (7-1) అలః (6-1).

అర్థ : పరమునకు విధింపఁబడిన ఆదేశము దాని యాది వర్ణమున కగును. ఇట్లు సకారమునకు థకారము.

వివ : ఒక ఉదాహరణమున పూర్వభాగము, పరభాగము అని రెండు ఉన్నపుడు ఆదేశము పరముగా నున్నదానికివిధింపఁబడినయెడల నది పరముగా నున్నదాని తొలివర్ణమున కగును. ఇది 'అలోఽన్త్యస్య' అనుదాని కపవాదము.

ప్రకృతమున ఉద్ అనుదానికి పరముగానున్న స్థాస్తమ్భధాతువులకు పూర్వసవర్ణాదేశము విధింపఁబడినది. కావున నీ పరిభాషచే నీయాదేశము పరములగు స్థా, స్తంభధాతువులయొక్క ఆదివర్ణమగు సకారముయొక్క స్థానమున వచ్చును.

ఇట్లీ రెండు పరిభాషల సాహాయ్యమున స్థాని నిర్ణయింపఁబడెను.

ఉదా : ఉద్ + స్థానమ్-ఇచట పూర్వాక్షరము దకారము. దానికి త్, థ్, ద్, ధ్ అనునవి సవర్ణములు. ఇందు సకారస్థానమున రాఁదగిన వర్ణమును నిర్ణయించుటకు ఆంతరతమ్యమును పరీక్షింపవలయును. స్థానమును బట్టి చూచినయెడల సకారము దంత్యమగుటచే నాల్గును సదృశములే యగును. ప్రయత్నమును బట్టి చూచినయెడల సకారమునకు వివృతము ప్రయత్నము, తవర్గమునకు స్పృష్టము. కావున నేయొక్కటియు సదృశముకాదు. ఇట్లు స్థానప్రయత్నములు ఆంతరతమ్యమును నిర్ణయించుటలో విఫలము లయినపుడు బాహ్యప్రయత్నములనుబట్టి నిర్ణయింపవలయును. సకారమునకు వివారము, శ్వాసము, అఘోషము, మహాప్రాణము అను బాహ్యయత్నములు గలవు. ఈ నాలుగుబాహ్యప్రయత్నములు గల తవర్గాక్షరము వర్గద్వితీయమగు 'థ' అనునది మాత్రమే. కావున సకారమున కంతరతమమైన థకారమే యాదేశమగును. ఇట్టి సందర్భములనుబట్టియే బాహ్యప్రయత్నములకు సవర్ణసంజ్ఞలో ప్రయోజనము లేకపోయినను ఆంతరతమ్య పరీక్షలోనవి యుపయుక్తము లగునని చెప్పఁబడినది.

ఉద్ + స్ థానమ్ - ఉద్ + థ్ థానమ్. అట్లే ఉద్+స్+తమ్భనమ్= ఉద్ + థ్ తమ్భనమ్. అనియగును.

అవ : ఈ యుదాహరణముల పరినిష్ఠితరూపమునకై యీ క్రిందిరెండు సూత్రములలో చెప్పఁబడిన కార్యములను జేయవలయును.

సూ : ఝరో ఝరి సవర్ణే. 8-4-64

వృ : హలః పరస్య ఝరో వాలోప స్సవర్ణే ఝరి.

ప. వి : ఝరః (6-1) ఝరి (7-1) సవర్ణే (7-1).

అను : హలః (5-1) లోపః (1-1) అన్యతరస్యామ్. (అవ్య).

అర్థ. హల్లునకు పరముగా నున్న ఝర్‌వర్ణమునకు, సవర్ణమైన ఝర్వర్ణము పరమగునపుడు, వైకల్పికముగా లోపము వచ్చును.

వివ : హలః అను పంచమ్యంతపదమునకు 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాషచే 'హల్లునకు పరమందున్న' అనునర్థము కలిగినది. ఇచట ఝర్ ప్రత్యాహారములోని వర్ణమునకు లోపము విధింపఁబడుచున్నది. దానికి పూర్వమున నేదేని హల్లుండవలయును. పరమున తనకు సవర్ణమైన ఝర్వర్ణముండవలయును. అట్టియెడ లోపము వైకల్పికముగా నగును.

ఉదా : ఉద్ థ్ థానమ్ - ఇచట లోపించునది సకారమున కాదేశమైన థకారము. దానికి పూర్వము హల్లు దకారముగలదు. పరమున సవర్ణమైన థకారము గలదు. కావునలోపింపఁగా 'ఉద్‌థానమ్' అనియగును. లోపింపనిచో రెండు థకారము లుండును. అట్లే ఉద్ థ్ తంభనమ్ - ఉద్ తంభనమ్ లేక ఉద్ థ్ తంభనమ్.

అవ : ఇట్టి స్థితిలో నీక్రిందిసూత్రము చర్త్వమును విధించుచున్నది.

సూ : ఖరి చ 8-4-55.

వృ : ఖరి ఝలాం చరస్స్యుః. ఇత్యుదో దస్యతః. ఉత్థానమ్, ఉత్తమ్భనమ్.

ప. వి : ఖరి (7-1) చ (అవ్య).

అను : ఝలామ్ (6-1) చర్ (1-1).

అర్థ ; ఖర్ వర్ణము పరమగునపుడు ఝల్లులకు చర్లులు వచ్చును. దీనిచే 'ఉద్'లోని దకారమునకు తకారాదేశము ఉ॥ ఉత్థానమ్, ఉత్తమ్భనమ్.

వివ : ఖర్ వర్ణములు(పవర్గ ప్రథమద్వితీయాక్షరములు, శ ష స లు) పరము లగునపుడు ఝల్లుల స్థానమున చర్ వర్ణములు (చ ట త క ప శ ష స) ఆంతర తమ్యమును బట్టి ఆదేశమగును.

ఉదా : ఉద్ థానమ్ (ఒక థకారమునకు లోపమువచ్చినపుడు) ఇందు థకారము ఖర్ వర్ణము పరమయినది. పూర్వమునన్న దకారము ఝల్లు. దానికి చర్త్వము వచ్చును. ఆంతరతమ్యమువలన తకారము వచ్చును. ఉత్ థానమ్ - ఉత్థానమ్. ఝరోఝరీత్యాదిసూత్రముచే థకారము లోపింపనిచో 'ఉ త్ థ్ థానమ్' 'ఉ త్థానమ్' అనురూపము కూడ నుండును. ఇందు మొదటిథకారమునకు చర్త్వము రాదు. చర్త్వము చేయునపుడు పూర్వసవర్ణాదేశము అసిద్ధమగును (పూర్వత్రాసిద్ధమ్).

ఉద్ తంభనమ్ - చ ర్త్వము - ఉత ంభనమ్. థకారలోపము రానిచో 'ఉత్ థ్ తంభనమ్' అనురూపముండును.

(పై రెండుదాహరణములలో థకారములోపింపని పక్షమున చర్త్వము థకారమునకును రావచ్చుననియు, ఉత్థానమ్, ఉత్తంభనమ్ అనురూపములగుననియు కొందఱు వ్యాఖ్యాతలు భాష్యసమ్మతముగా నిరూపించిరి.)

'ఉదఃస్థాస్తమ్భోః పూర్వస్య' అనుసూత్రమువలన నగుదానిని పూర్వసవర్ణాదేశసంధి యని వ్యవహరింపవచ్చును. ఖరిచ అనుసూత్రముచే నగు కార్యమును 'చర్త్వసంధి' అని వ్యవహరించుచున్నారు.

సూ : ఝయో హోఽన్యతరస్యామ్ 8-4-62.

వృ : ఝయః పరస్య హస్యం వా పూర్వసవర్ణః. నాదస్య, ఘోషస్య, సంవారస్య, మహాప్రాణస్య తాదృశో వర్గ చతుర్థః. వాగ్ఘరిః వాగ్హరిః.

ప. వి : ఝయః (5-1) హః (6-1) అన్యతరస్యామ్ (అవ్య).

అను : పూర్వస్య (6-1) సవర్ణః (1-1).

అర్థ : ఝయ్ వర్ణమునకు పరమందున్న హకారమునకు పూర్వసవర్ణము వికల్పముగా నగును. నాదము, ఘోషము, సంవారము, మహాప్రాణమునైన హకారముయొక్క స్థానమున నట్టిదే యగు వర్గచతుర్థాక్షరము ఆదేశమగును. ఉదా : వాగ్ఘరిః, వాగ్హరిః.

వివ : 'ఝయః' అను పంచమ్యంతపదమునకు 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాషచే 'ఝయ్ వర్ణమునకు పరమందున్న' అనునర్థము వచ్చును. ఝయ్ అనగా అనునాసికములుకాక తక్కిన వర్గాక్షరములు. 'హః' అనునది హ అనుదాని షష్ఠ్యంతరూపము. హకారముయొక్క స్థానమున అని దానికర్థము (షష్ఠీస్థానే యోగా), ఝయ్ వర్ణములకు పరముగా నున్న హకారముయొక్క స్థానమున పూర్వసవర్ణాక్షరము వికల్పముగా నాదేశమగును. ఇచటను ఆంతరతమ్య పరీక్షలో బాహ్యప్రయత్నముల అవసరము కలదు. హకారమునకు నాదము, ఘోషము, సంవారము, మహాప్రాణము అనుబాహ్యాయత్నములు గలవు. వర్గాక్షరములలో ఆ యత్నములు గలవి వర్గచతుర్థములే (ఘ, ఝ, ఢ, ధ, భ). కావున నవియే అంతరతమములు. కావున కవర్గమునకుఁ బరమైన హకారముయొక్కస్థానమున ఘకారము వచ్చును. చవర్గమునకు పరమైన హకారమునకు ఝకారము వచ్చును ఇట్లే తక్కినవియు.

ఉదా : వాక్ + హరిః – ఇచట కకారము ఝయ్ వర్ణము. దానికి పరముగా. నున్న హకారమునకు పూర్వసవర్ణమురాఁగా వాక్ ఘ్ఘ్ అరిఃకకారమునకు జశ్త్వము. (ఝలాంజశోఽన్తే) వాగ్ఘరిః వాగ్ఘరిః. ఇది వైకల్పికము కావున రానిచో వాగ్ హరిః అను రూపముండును.

ఇదియు పూర్వసవర్ణాదేశసంధి యనఁబడదగును.

సూ : శశ్ఛోఽటి 8–4–63.

వృ : ఝయః పరస్య శస్య ఛో వాఽటి. తద్ + శివ ఇత్యత్రదస్య శ్చుత్వేన జకారేకృతే ఖరిచేతి జకారస్యచకారః. తచ్ఛివః. తచ్ శివః.

ప. వి : శః (6–1) ఛః (1–1) అటి (7–1).

అను : ఝయః (5–1) అన్యతరస్యామ్. (అవ్య) పదాన్తాత్ (5–1).

అర్థ : ఝయ్వర్ణమునకు పరముగా నున్న శవర్ణమునకు, 'అట్' వర్ణము పరమగునపుడు, ఛకారమాదేశమగును. తద్ + శివః అనుచోట దకారమునకు శ్చుత్వముచేత జకారమురాగా దానికి ఖరిచ అనుసూత్రముచే చకారము వచ్చును. తచ్ఛివః, తచ్ శివః.

వివ : ఈపదాంతమైన ఝయ్ వర్ణమునకు పరముగానున్న శవర్ణముయొక్క స్థానమున ఛకారము వచ్చును. అట్లగుట, ఆశవర్ణమునకు పరముగా అట్

ప్రత్యాహారములోని వర్ణమున్నప్పుడే ఝయ్ - శ్ + అట్ అనురీతిలో నుండ వలయును.

ఉదా : తద్ + శివః - ఇచట తద్ అనునది పదము. దాని అంతమునఁ గల ఝయ్ వర్ణము దకారము. దానికి పరముగానున్న శవర్ణమునకు ('శ్') ఇకారము పరముగా నున్నది (శ్ + ఇ), ఇకారము అట్ ప్రత్యాహారములోనిది.కావున ప్రకృతసూత్రముచే శకారమును తొలగించి ఛకారము వచ్చును. తద్ + ఛివః. ఇపుడు దకారమునకు స్తోః శ్చునా శ్చుః అనుసూత్రముచే శ్చుత్వము వచ్చును. దకారము జకారమగును. తజ్ + ఛివః - ఖరిచ అనుసూత్రముచే జకారమునకు చర్త్వము రాఁగా తచ్ ఛివః తచ్ఛివః అగును. ఈ ఛకారాదేశము వికల్పమగుటచే రానిచో 'తచ్ శివః' అగును. అనగా దకారమునకు శ్చుత్వచర్త్వములు వచ్చునని భావము.

అవ : ఈ సూత్రమున శవర్ణమునకు పరముగా 'అట్' వర్ణముండవలయుట చెప్పఁబడినది. దాని నీక్రిందివార్తికము సవరించుచున్నది.

వా : ఛత్వమమీతి వాచ్యమ్ (5025).

ఉ॥ తచ్ఛ్లోకేన

ప. వి : ఛత్వమ్ (1-1) అమి (7-1) ఇతి (అవ్య) వాచ్యమ్ (1-1).

అర్థము : పైని విధింపఁబడిన ఛత్వము శకారమునకు 'అమ్' వర్ణము పరమగునపుడు చెప్పనగును. ఉ॥ తచ్ఛ్లోకేన.

వివ : అట్ ప్రత్యాహారములో అచ్చులు, హ య వ ర - లు గలవు. సూత్రములో ఛకారదేశమునకు నిమిత్తముగా నీ వర్ణములు మాత్రమే చెప్పఁబడినవి. వార్తికకారులు వానితోపాటు లకారమును, అనునాసికములనుగూడ గ్రహింపవలయునని చెప్పిరి. అనగా పదాంతమైన ఝయ్వర్ణమునకు పరముగానున్న శకారమునకు, అమ్ (అచ్చులు, హ య వ ర ల ఞ మ ఙ ణ న లు) వర్ణములు పరములగు' నపుడు ఛకారమాదేశమగునని భావము.

ఉదా : తద్ + శ్లోకేన - ఇచట శకారమునకు పరముగా లకారముగలదు. శశ్ఛోఽటి అనుసూత్రముచే నిట ఛకారాదేశము రాదు. రావలయును. కావున వార్తికము వచ్చుటను విధించినది. తద్ + శ్లోకేన - దకారమునకు శ్చుత్వముచే జకారము, చర్త్వముచే చకారమును రాగా 'తచ్ఛ్లోకేన' అగును. ఛత్వము రానిచో 'తచ్ శ్లోకేన' అనియు రూపముండును.

ఛకారముయొక్క భావము ఛత్వము. అదియగు సంధి కావున దీనిని ఛత్వ సంధి యందురు.

సూ : మోఽనుస్వారః 8 3-23.

వృ : మాంతస్య పదస్యానుస్వారో హలి. హరింవన్దే.

ప. వి : మః (6-1) అనుస్వారః (1-1).

అను : పదస్య (6-1) హలి (7-1).

అర్థ : హల్లు పరమగునపుడు మకారాంతపదమునకు (పదముయొక్క తుది వర్ణమునకు) అనుస్వార మాదేశమగును. ఉదా : హరింవన్దే.

వివ : 'మః' అనునది షష్ఠ్యేకవచనాంతపదము. ఇది అధికారరూపమున వచ్చు 'పదస్య' అనుదాకి విశేషణము. విశేషణము తదంతమునకు సంజ్ఞ యగు నను పరిభాషచే మకారము అంతమున గల పదమునకు అనుసర్థము కలుగును. ఈ సూత్రముచే విధింపఁబడు అను స్వారాదేశము, 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే పదముయొక్క తుదివర్ణమునకు వచ్చును. మకారము అంతమునఁ గలపదముయొక్క తుదివర్ణమునకు, హల్లుపరమగునపుడు, అనుస్వారమాదేశమగును.

ఉదా : హరిమ్ + వన్దే. ఇందు హరిమ్ అనునది ద్వితీయైకవచనాంత పదము. దానియంతమున మకారము గలదు. పరమున హల్లు, వకారము గలదు. కావున అను స్వారాదేశము రాఁగా 'హరింవన్దే' అగును.

అవ : పదాంతముకాని నకారమకారములకు ఈ క్రింది సూత్ర మనుస్వార మును విధించుచున్నది.

సూ : నశ్చాపదాంతస్య ఝలి. 8-3-24.

వృ : నస్య మస్య చాపదాన్తస్య ఝల్యనుస్వారః. యశాంసి, ఆక్రంస్యతే.

ప వి : నః (6-1) చ (అవ్య) అపదాన్తస్య (6-1) ఝలి (7-1).

అను : మః (6-1) అనుస్వారః (1-1).

అర్థ : అపదాంతములగు నకారమకారములకు, ఝల్లుపరమగునపు డనుస్వార మగును, ఉదా : యశాంసి, ఆక్రంస్యతే.

వివ : పూర్వసూత్రమున అనుస్వారాదేశము మకారమునకు మాత్రమే విధింపఁబడినది. అందును పదాంతమకారమునకు మాత్రమే. అదియు హల్లుపరమగు నపుడు. ఈ సూత్రమునందును అనుస్వారాదేశము విధింపఁబడుచున్నది. అది

మకారముతోపాటు నకారమునకు కూడ వచ్చును. కాని అపదాంతములైన నకార మకారములకు వచ్చును. మఱియు ఝల్ వర్ణము పరమగునపుడు మాత్రమే వచ్చును. పదమనగా సుబంతము లేక తిఙన్తము. అది కానిది అపదము. అపదాంతము లైన నకారమకారములకు, ఝల్లు పరమగునపుడు, అనుస్వారమాదేశమగును.

ఉదా : 'యశాంసి' - 'యశస్' అను సకారాంత ప్రాతిపదికమునకు 'జస్' అను ప్రథమా బహువచన ప్రత్యయము చేరును. యశస్+జస్. ఈ ప్రత్యయమునకు 'శి' అనునాదేశము చెప్పఁబడినది. అందు శకారమిత్తు. 'అనేకాల్ శిత్ సర్వస్య' అను పరిభాషచే 'జస్' మొత్తమునకు 'ఇ' వర్ణమాదేశమగును (శ్ + ఇ) - యశస్ + ఇ.పిదప ప్రాతిపదికమునకు నుమాగమము విధింపఁబడినది. ఇందు మకారమిత్తు. ఉకార ముచ్చారణార్థము. ఆగమముగా నగునది 'న్' మాత్రమే (న్ + ఉమ్) మిత్తయిన ఆగమము విధింపఁబడినదాని తుది అచ్చునకు పరముగా నగును. యశన్స్ + ఇ. పిమ్మట శవర్ణముమీఁది అచ్చునకు దీర్ఘము విధింపఁబడినది. 'యశాన్ + స్ ఇ'. ఈ స్థితిలో నకారమునకు అనుస్వారము ప్రకృతసూత్రముచే రగును. ఇందు 'యశాన్' అనునది అపదము నకారము దాని అంతమునఁ గలదు. పరముగా ఝల్ వర్ణమగు సకారము గలదు. కావున అనుస్వారాదేశము రాఁగా యశాంసి' అగును.

ఆ క్రంస్యతే - 'ఆఙ్' అను ఉపసర్గముగల 'క్రమ్' ధాతువునకు కర్త్రర్థమున ఆత్మనేపద ప్రథమ పురుషైకవచన ప్రత్యయము 'త' చేరును. ఆక్రమ్ + త. దాని టి భాగమునకు ఏత్వము విధింపఁబడినది. ఆక్రమ్ + తే-ఇది భవిష్యదర్థమున విధింపఁబడిన ప్రత్యయమగుటచే దానికి ముందు 'స్య' అను ప్రత్యయమొకటి వచ్చును. ఆక్రమ్ + స్యతే, ఈ మొత్తము పరమగును. కాని 'ఆక్రమ్' అనుదానికి పదత్వముండదు. కాన అందలి మకారము అపదాంతమైన మకారము. దానికి ఝల్వర్ణమగు సకారము పరముగా నున్నది. కాన అనుస్వారాదేశమురాఁగా 'ఆక్రంస్యతే' అగును.

పై రెండుసూత్రముల వలన నగుసంధిని అనుస్వారసంధి యని వ్యవహరింపనగును.

**సూ : అనుస్వారస్య యయి పరసవర్ణః 8-4-58.**

వృ ; శాన్తః.

ప. వి : అనుస్వారస్య (6-1) యయి (7-1) పరసవర్ణః (1-1).

అర్థః యయ్' వర్ణముపరమగునపు డనుస్వారమునకు పరసవర్ణమాదేశమగును.
ఉదా : శాన్తః.

వివ : యయ్' అనగా శ, ష, స, హ కాక తక్కిన హల్లులు. అవి పరమగు నపుడు అనుస్వారము యొక్క స్థానమున పరవర్ణమునకు సవర్ణమైన అక్షరమగు ఆదేశమగును.

ఉదా : శాన్తః – 'శమ్' ధాతువునకు 'క్త' అనుకృత్ప్రత్యయము చేరగా నగురూపము. శమ్ + క్త (ఇందు కకారమిత్తు) శమ్ + త ఇట్టిస్థితిలో ధాతువు యొక్క ఉపధకు (తుదివర్ణమునకు పూర్వముననున్న వర్ణమునకు దీర్ఘము విధింపఁ బడినది. శామ్ + త. 'నశ్చాపదాన్తస్య ఝలి' అనుసూత్రముచే మకారమున కనుస్వారమాదేశమగును. 'శాం + త' – ఇచట అనుస్వారమునకు యయ్వర్ణమగు తకారము పరముగా నున్నది. కావున తకారసవర్ణము అనుస్వారస్థానమున వచ్చును. ఆంతరతమ్యమునుబట్టి నాసికస్థానముగాఁ గల అనుస్వారము యొక్కస్థానమున నాసికాస్థానముగల తవర్గాక్షరము నకారము రాఁగా శాన్ + త=శాన్తః అగును.

అవ : పై సూత్రమునకు కొండొకచో వైకల్పికత్వము చెప్పఁబడు చున్నది.

సూ : వా పదాన్తస్య.

ఉదా : త్వఙ్కరోషి. త్వం కరోషి.

ప. వి : వా (అవ్య) పదాన్తస్య (6–1).

అను : అనుస్వారస్య (6–1) యయి (7–1) పరసవర్ణః (1–1).

అర్థ : యయ్ వర్ణము పరమగునపుడు పదాంతమైన యనుస్వారమునకు పరస వర్ణాదేశము వైకల్పికముగా నగును. ఉదా : త్వఙ్కరోషి, త్వం కరోషి.

వివ : పదముయొక్క అంతమున నున్న అనుస్వారమునకు పరసవర్ణా దేశము పూర్వసూత్రముచే నిత్యముగా ప్రాప్తించుచుండఁగా నీ సూత్రము వైకల్పిక ముగా విధించుచున్నది.

ఉదా : త్వమ్ + కరోషి' అనియుండగా 'మోఽనుస్వారః' అనుసూత్ర ముచే మకారమున కనుస్వారమగును. త్వం+కరోషి. ఇచట 'త్వమ్' అనునది పదము దానియంతముననున్న అనుస్వారమునకు యయ్ వర్ణము కకారము పరమైనది. కావున పరసవర్ణమైన ఙకారము రాఁగా 'త్వఙ్కరోషి' యగును. రానిచో 'త్వం కరోషి'

యమురూపముండును. ఇచట నాసికాస్థానముగల అనుస్వారమునకు కవర్గమునందలి ఙకారము అనునాసికమగుటచే అంతరతమము.

పై రెండుసూత్రములవలన నగు సంధిని పరసవర్ణాదేశసంధి యన నగును.

అవ : 'మోఽనుస్వారః' అనుసూత్రమునకు కొన్ని యపవాదములు చెప్పఁ బడు చున్నవి.

సూ : మోరాజి సమః క్వౌ 8-3-25.

వృ : క్విబన్తే రాజతౌపరే సమోమస్యమ ఏవస్యాత్. స్రమాట్.

ప. వి : మః (1-1) రాజి (7-1) సమః (6-1) క్వౌ (7-1).

అను : మః (6-1).

అర్థ : క్విబన్తమైన రాజ్ ధాతువు పరమగునపుడు 'సమ్ అనునుపసర్గము యొక్క మకారమునకు మకారమే వచ్చును. ఉదా : స్రమాట్.

వివ : 'క్విప్' అనునది యొక కృత్ప్రత్యయము 'క్వౌ' అనునది రాజి అను దానికి విశేషము. కావున క్విప్ ప్రత్యయము అంతమందుఁగల రాజ్ ధాతువు పర మగునపుడు అనునర్థము కలుగును. క్విబంతమగు రాజ్ ధాతురూపము 'రాజ్' అను నది (ప్రథమైకవచనాంతము). ఇది పరమగునపుడు 'సమ్' యొక్క మకారమునకు మకారమే యగును. ఇట్లు చెప్పుటవలన మకారమునకు 'మోఽనుస్వారః' అను సూత్రముచే అనుస్వారాదేశము రాదని తాత్పర్యము. సమ్ + రాట్=స్రమాట్.

సూ : హే మపరే వా 8-3-26.

వృ : మపరే హకారే పరే మస్య మో వా. కిమ్హ్మలయతి, కిం హ్మలయతి.

ప. వి : హే (7-1) మపరే (7-1) వా (అవ్య).

అను : మః (6-1) మః (1-1) మొదటిది 'మోఽనుస్వారః' నుండి, రెండ వది 'మోరాజి సమఃక్వౌ' నుండి.

అర్థ : మపరమైన హకారము పరమగునపుడు మకారస్థానమున మకారము వికల్పముగానగును. ఉదా : కిమ్ హ్మలయతి, కిం హ్మలయతి.

వివ : మకారము పరమునఁగల హకారము పరమైనపుడు పూర్వముననున్న మకారమునకు మకారాదేశము వైకల్పికముగా నగును. మ్ హ్మ్ - అనుస్థితిలో మొదటిమకారమునకు మకారాదేశము. లేనిచో అనుస్వారాదేశము. ఇచట 'మోఽను

స్వారః అనుసూత్రముచే అనుస్వారాదేశము నిత్యముగా వచ్చుచుండగా వికల్పమని చెప్పఁబడినది.

ఉదా : కిమ్ + హ్మలయతి – 'కిమ్' లోని మకారమునకు మకారపర ముగఁ గల హకారము పరమైనది. కావున మకారము (మొదటిది) అట్లే యున్నచో 'కిమ్ హ్మలయతి' అనురూపముగును. వైకల్పికముగుటచే నిదికానిచో 'మోఽనుస్వారః' అను సూత్రముచే అనుస్వారమగును. కిం హ్మలయతి.

వా : యవలపరే యవలా వా (4902).

ఉదా : కియ్ హ్యః, కిం హ్యః; కివ్ హ్వలయతి, కింహ్వలయతి. కిల్ హ్లాదయతి, కిం హ్లాదయతి.

వ. వి : య వలపరే (7-1) యవలాః (1-3) వా (అవ్య).

అర్థ : యవల పరమగు హకారము పరమగునపుడు మకారమునకు యవలలు వికల్పముగా వచ్చును. ఉదా ' కియ్ హ్యః, కిం హ్యః, కివ్ హ్వలయతి, కిం హ్వలయతి; కిల్ హ్లాదయతి, కిం హ్లాదయతి.

అర్థ : వకారము యకారవకారలకారములు పరమునఁ గలదియై మకారము నకు పరమైనపుడు క్రమముగా యకారవకారములు దాని కాదేశము లగును. ఇచట నాదేశములగు యవలలు అనునాసికమగు మకారము స్థానమున వచ్చునవి యగుటచే నవియును అనునాసికములే కావలయును. (స్థానేఽన్తరతమః).

ఉదా : కిమ్ + హ్యః – ఇచట హకారమునకు యకారము పరమైనది ఇట్లు యకారపరహమైన హకారము పరముగా నుండుటచే 'కిమ్' లోని మకారము నకు అనునాసిక యకారము ఆదేశమగును. కియ్ హ్యః. ఇట్లగుట వికల్పము కాన గానిచో 'మోఽనుస్వారః' అనుసూత్రముచే అను స్వారాదేశమగును. కిం హ్యః. ఇట్లే.

కిమ్ + హ్వలయతి - కివ్ హ్వలయతి, కిం హ్వలయతి- కిమ్ + హ్లాద యతి - కిల్ హ్లాదయతి, కింహ్లాదయతి

సూ : నపరే నః 8-3-27.

వృ : నపరే హకారే మస్యనో వా. కిన్ హ్నుతే, కిం హ్నుతే.

ప. వి ; నపరే (7-1) సః (1-1).

అను : మః (6-1) హే (7-1). వా (అవ్య).

అర్థ : నపరమైన హకారము పరమగునపుడు మకారమునకు నకారము వైకల్పికముగా నగును. ఉదా : కిన్‌హ్నుతే, కింహ్నుతే.

వివ : పూర్వసూత్రమునందువలెనే నకారము పరమందుఁగల హకారము పరమగునపుడు మకారస్థానమున నకారము వికల్పముగా వచ్చును. అట్లు రానిచో 'మోఽనుస్వారః' అనుసూత్రముచే అను స్వారము వచ్చును.

ఉదా : కిమ్ + హ్నుతే - ఇచట న పరక హకారముపరమున నుండగా కిమ్‌లోని మకారమునకు నకారాదేశము. కిన్ హ్నుతే. రానిచో అనుస్వారాదేశము కిం హ్నుతే.

మోఽనుస్వారః అనుసూత్రమునుండి యింతవఱకు మకారము పొందు మార్పులు చెప్పఁబడినవి. ఇంతవఱకు కొన్ని ఆదేశసంధులు చెప్పఁబడినవి.

అవ : ఇటుపై కొన్ని ఆగమసంధులు చెప్పఁబడుచున్నవి. ఆగమమనగా

సూ : డ స్సిధుట్ 8-3-29.

వృ : డాత్పరస్య సస్య ధుడ్వా.

ప. వి : డః (5-1) సి (7-1) ధుట్ (1-1).

అను : వా (అవ్య).

అర్థ : డకారమునకు పరమున నున్న సకారమునకు ధుడాగమము వైకల్పికముగా నగును.

వివ : ఇచట 'డః' అను పంచమ్యేక వచనాంతపదము 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాష ననుసరించి, విధింపఁబడిన ధుడాగమమును డకారమునకు అవ్యహితముగా పరమున నున్నదానికి అవయవముగా అగునని చెప్పును. 'సి' అను సప్తమ్యంతపదము, తస్మిన్నితి నిర్దిష్టేపూర్వస్య' అను పరిభాషచే సకారమునకు అవ్యవహితముగా పూర్వమున నున్న వర్ణమునకు అవయవముగా నగునని చెప్పును. తస్మాదిత్యాది పరిభాషనుబట్టి యాగమము పరముననున్న సకారమున

కవయవముగను, తస్మిన్నిత్యాది పరిభాషచే నీయాగమము పూర్వమున నున్న దకారమున కవయవముగను అగునను సర్థ మేర్పడినచో సందిగ్ధపరిస్థితి యేర్పడును. ఇట్టియెడ పంచమియో, సప్తమియో షష్ఠిగా మారవలయును. ఉభయనిర్దేశే పంచమీనిర్దేశో బలీయాన్, పరత్వాత్-పంచమీసప్తమీ నిర్దేశములు రెండును గలచోట పంచమి బలీయము పరమగుటవలన-అనున్యాయముచే పంచమీ నిర్దేశము సప్తమీనిర్దేశముకంటె బలీయమై సప్తమ్యంతము నిటషష్ఠ్యంతముగా మార్చును. కావున డకారమునకు పరముగానున్న సకారమునకు ధుడాగమము వచ్చు ననునర్థ మేర్పడినది ('విప్రతిషేధేపరంకార్యమ్' అనువక్ష్యమాణ పరిభాషచే తుల్యబల విరోధమున్నచోట పరకార్యము కర్తవ్యమగును. తస్మాదిత్యుత్తరస్య అనునది తస్మిన్నితినిర్దిష్టే పూర్వస్య అను దానికంటె పరశాస్త్రము) ధుట్ అనునాగమము నందు టకారమిత్తు. ఉకారము ఉచ్చారణార్థమైనది. 'ధ్' అనునది యాగమముగా నగు వర్ణము.

అవ : ఈ క్రింది పరిభాష ఆగమములకు స్థాననిర్దేశము నొనర్చును.

సూ : ఆద్యన్తౌ టకితౌ 1-1-46.

వృ : టిత్కితౌ యస్యోక్తౌ తస్యక్రమా దాద్యన్తౌ స్తః.

ప. వి : ఆద్యన్తౌ (1-2) టకితౌ (1-2).

అర్థము : టిత్కిత్తులు దేనికి చెప్పఁబడినవో దానికి క్రమముగా ఆద్యంతావయవములుగా నగును.

వివ : ఆగమమనగా నొకవర్ణము అధికముగా వచ్చుట. అట్లు వచ్చెడువర్ణము దేనికి విధింపఁబడునో దానికి పూర్వపరములందెచట వచ్చునను సంశయము నీ పరిభాష తొలగించును. ఆగమము టిత్తు (టకారమిత్తుగాఁగలది) అయినయెడల నది దేనికి విధింపఁబడునో దానికి ఆద్యవయవముగా నగును. ఆద్యవయవమనగా చెప్పఁబడినదానికి ముందుభాగమునఁ జేరి దానియొక్క అవయవముగా - భాగముగా పరిగణింపఁ బడును. ఆగమము కిత్తు (కకారమిత్తుగాఁగలది) అయినచో చెప్పఁబడిన దానికి అంతావయవముగ నగును. అనగా దానికి చివరిభాగమున దాని అవయవమగు నట్లుగచేరును.

పై సూత్రమున విధింపఁబడిన 'ధుట్' అనునాగమము టిత్తుకావున ఆద్యవయవముగఁ జేరును. దాని కుదాహరణము చూపఁబడుచున్నది.

ఉదా : షట్ త్సన్తః, షట్ సన్తః.

వివ : షడ్ + సన్తః అనియుండ 'డస్సిధుట్' అను సూత్రముచే నిచట డకారమునకు పరమైన సకారమునకు 'ధుట్' అనునాగమము వచ్చును. సకారమున కీ యాగమము ఆదిభాగమున చేరుటను 'అద్యన్తౌటకితౌ' అను పరిభాష విధించినది. షడ్ + ధ్సన్తః. ఇందు ధకారమునకు 'ఖరిచ' అనుసూత్రముచే చర్త్వము రాఁగా 'షడ్ త్సన్తః' అగును. 'షడ్'లోని డకారమునకు చర్త్వము అగును. షట్త్సన్తః. ధుడాగమము వైకల్పికమగుటచే రానిచో షడ్ + సన్తః, చర్త్వముచే 'షట్సన్తః' అగును.

కిత్తున కుదాహరణము ముందు సూత్రమునఁ జూడనగును.

సూ : ఙ్ణోః కుక్టుక్ శరి 8-3-28.

వృ : వా స్తః.

ప. వి : ఙ్ణోః (6-2) కుక్టుక్ (1-1) శరి (7-1).

అను : వా (అవ్య).

అర్థ : ఙకార ణకారములకు, శర్వర్ణము పరమగునపుడు, కుక్ టుగాగమములు వచ్చును.

వివ : కుక్ టుక్ అనువానిలో చివరి కకారము లిత్తులు (హలన్త్యమ్) వానిలోని ఉకారము ఉచ్చారణార్థములు (అనగా క్క్, ట్క్ అని యుచ్చరించుట కష్టము కనుక నడుమ సుఖోచ్చారణమునకై ఒక అచ్చు చేర్పఁబడినదని భావము) ఆగమములుగా మిగులునవి క్, ట్ అనునవి. ఙకారణకారములకు, శర్వర్ణములు (శ, ష, స) పరములగునపుడు క్రమముగా కుక్ (క్) టుక్ (ట్) అను నాగమములు వచ్చును. ఇవి కిత్తులగుటచే పై పరిభాషననుసరించి ఙకారణకారములకు తరువాత చేరును.

ఉదా : ప్రాఙ్ + షష్ఠః. ఇచట శర్వర్ణమగు షకారము ఙకారమునకు పరమైనది. కావున ఙకారమునకు 'కుక్' ఆగమము వచ్చును. ప్రాఙ్క్ + షష్ఠః, అట్లే సుగణ్ + షష్ఠః - సుగణ్ట్ + షష్ఠః.

అవ : ఇందాగమములైన కకారటకారములకు క్రమముగా ఖకారఠకారము లీక్రింది వార్తికముచే వైకల్పికముగా నగును.

వా : చయో ద్వితీయాశ్శరి పౌష్కరసాదేరితి వాచ్యమ్ (5023).

ప. వి : చయః (6-1) ద్వితీయాః (1-3) శరి (7-1) పౌష్కరసాదేః (6-1) ఇతి (అవ్య) వాచ్యమ్ (1-1).

అర్థ : శర్ వర్ణములు పరములగునపుడు 'చయ్' వర్ణములకు (వర్గప్రథమాక్షరములకు) ద్వితీయవర్ణములు పౌష్కరసాది మతమున వచ్చును. ఉదా : ప్రాఙ్ ఖ్ షష్ఠః, ప్రాఙ్ క్షష్ఠః, ప్రాఙ్ షష్ఠః; సుగణ్ ఠ్ షష్ఠః, సుగణ్ ట్ షష్ఠః, సుగణ్ షష్ఠః.

వివ : చయ్వర్ణములనగా (చటత (ప్) కప (య్)) వర్గప్రథమాక్షరములు. ద్వితీయములనగా ఖ, ఛ, ఠ, థ, ఫ లు. క చ ట త ప లకు, శర్వర్ణములు పరములగునపుడు ఖ ఛ ఠ థ, ఫ లువైకల్పికముగా వచ్చును. పౌష్కరసాదియను ఆచార్యుని మతమున వచ్చును. తక్కినవారి మతమున రాదు. వైకల్పికమనునర్థమిట్లు వచ్చినది.

ఉదా : ప్రాఙ్ క్ + షష్ఠః – ఇచట కకారమునకు శర్వర్ణమగు షకారము పరమైనది. కావున ఖకారమాదేశమగును. ప్రాఙ్ ఖ్ షష్ఠః. ఇది వైకల్పికమగుటచే రానియెడల ప్రాఙ్క్షష్ఠః అగును. ఈ రెండురూపములును కుగాగమము వచ్చినపక్షమున నగును. కుగాగమము వికల్పమగుటచే రానియెడల ప్రాఙ్షష్ఠః అను రూపముండును.

ఇట్లే సుగణ్ ట్ + షష్ఠః – సుగణ్ ఠ్ షష్ఠః, సుగణ్ట్ షష్ఠః, టుగాగమము రానిచో సుగణ్ షష్ఠః అనియుండును.

సూ : నశ్చ 8–3. 30.

వృ : నాన్తాత్ పరస్య సస్య ధుడ్వా. సన్త్సః. సన్సః.

ప. వి : నః (5–1) చ (అవ్య).

అను : సి (7–1) ధుట్ (1–1) వా (అవ్య).

అర్థ : నకారాంతమైనపదమునకు పరమైన సకారమునకు ధుడాగమమువికల్పముగా నగును. ఉదా : సన్త్సః, సన్సః.

వివ : ఇది డస్సిధుట్ అనుసూత్రమునకు తరువాతిది. 'ఆద్యన్తౌ టకితౌ' అనుసూత్రమునందలి టిత్కిత్తులకు లక్ష్యముల చూపు తలంపుతో కావలయు 'ఙ్ణోః కుక్టుక్ శరి' అనుసూత్రము 'డస్సిధుట్' అనుదానికి పిదప చెప్పఁబడినది. 'డస్సిధుట్' అనుసూత్రమునందువలె నిందును అను వృత్తమైన 'సి' అను సప్తమ్యంత పదమును 'సస్య' అని షష్ఠ్యంతముగా మార్చుకొనవలయును. 'నః' అనునది 'పదస్య' అను అధికారలబ్ధమైన దానికి విశేషణము. 'పదస్య' అనునది 'పదాత్' అని పంచమిగా మార్చుకొనవలయును. ఇట్లు చేయుటవలన నకారమంతమునఁ గల

మునకు పరముగా నున్న సకారమునకు ధుడాగమము వైకల్పికముగా నగు నను నర్థము వచ్చినది. ఈ యాగమము టిత్తు కావున సకారమునకు పూర్వభాగమున వచ్చును.

ఉదా : సన్ + సః – ఇందు 'సన్' అనునది నాంతమైన పదము. దానికి పరముగా నున్న సకారమునకు 'ధుట్' ఆగమము వచ్చును. సన్ + ధ్సః. 'ఖరిచ' అనుసూత్రముచే చర్త్వము. సన్త్సః. ఈ యాగమము రానిచో 'సన్సః' అగును,

సూ : శి తుక్ 8–3 31.

వృ : పదాన్తస్య నస్య శే పరే తుగ్వా. సఞ్ఛమ్భుః, సఞ్చ్ఛమ్భుః, సఞ్చ్ శంభుః, సఞ్ శమ్భుః.

ప. వి : శి (7–1) తుక్ (1–1).

అను : పదస్య (6–1) నః (5 1) వా (అవ్య).

అర్థ : పదాంతమగు నకారమునకు, శవర్ణము పరమగునపుడు, తుగాగమము వికల్పముగా నగును. ఉదా : సఞ్ఛమ్భుః, సఞ్చ్ఛమ్భుః, సఞ్చ్ శంభుః, సఞ్ శంభుః.

వివ : 'నః' అను పంచమ్యంతపదమును ఇట షష్ఠ్యంతముగా మార్చుకొన వలయును. 'పదస్యనః' అనగా పదాంతమైన నకారమునకు అని యర్థము. 'శి' అనునది సప్తమ్యంతపదము. కావున శకారము పరమగునపుడు పదాంతమైన నకారమునకు 'తుక్' అనునాగమము (వచ్చును. ఇందు కకారమిత్తు. కిత్తగుటచే నీయాగమముగా) నకారమునకు అంతావయవముగవచ్చును. ఉకారముచ్చారణార్థము, త్ ఉ క్ ఆగమముగా వచ్చునది 'త్' అనునది.

ఉదా : సన్ + శమ్భుః – ఇందు 'సన్' అనునది పదము. అందు అంతమున నకారము గలదు. దానికి శకారము పరమునఁ గలదు కావున తుగాగమము రాఁగా 'సన్ త్ + శంభుః' అగును. శకారయోగమున తకారమునకు శ్చుత్వముచే చకారమాదేశమగును. (స్తోఃశ్చునాశ్చుః) సన్చ్శమ్భుః నకారమునకు కూడ శ్చుత్వముచే ఞకారమాదేశమగును. సఞ్చ్ శంభుః 'శశ్ఛోఽటి' అను సూత్రముచే శకారమునకు ఛత్వము రాఁగా 'సఞ్ చ్ ఛంభుః' – అగును. 'ఝరో ఝరి సవర్ణే' అనుసూత్రముచే నిందలి చకారమునకు వైకల్పికముగా లోపము. లోపము వచ్చినచో సఞ్ఛమ్భుః – (1) అని యగును. రానిచో సఞ్చ్ఛమ్భుః – (2) అని యుండును. 'శశ్ఛోఽటి' అనుసూత్రముచే నగు ఛత్వముకూడ వికల్పమే.

కావున రానిచో సఞ్ చ్ శంభుః - (3) అని యగును. ఈ సూత్రముచే విధింపఁ బడిన తుగాగమము వికల్పమగుటచే నదియు రానిచో 'సఞ్ శంభుః - (4) అని యగును. తుగాగమము, ఛత్వము, చలోపము-ఈ మూఁడును వైకల్పికములగుటచే నాలుగురూపము లేర్పడుచున్నవి. వానిస్వరూపము నిట్లు వింగడించు కొన వచ్చును.

(1) సఞ్ చ్ ఛమ్భుః-తుగాగమము, ఛత్వము.

(2) స ఞ్ ఛ మ్భుః-తుగాగమము, ఛత్వము చలోపము.

(3) స ఞ్ చ్ శంభుః-తుగాగము వచ్చి ఛత్వము రానిరూపము.

(4) సఞ్ శంభుః-తుగాగమ ఛత్వములు రానిరూపము.

శ్చుత్వము నిత్యము కనుక ఞకారమన్నింటను ఉండును.

ఈ యర్థమునే యీ క్రిందిశ్లోకము సంగ్రహించుచున్నది.

శ్లో॥ ఞఛౌ, ఞ చ ఛా ఞ చ శా ఞ శావితి చతుష్టయమ్.
రూపాణా మిహ తుక్ ఛత్వచలోపానాం వికల్పనాత్॥

అర్థము : ఇచట తుగాగమ ఛత్వచలోపముల వైకల్పికత్వము వలన ఞకార ఛకారములుగల రూపమొకటి, ఞకారచకారఛకారములు గలది యొకటి, ఞకారచకార శకారములు గలదియొకటి, ఞకార శకారములుగలది యొకటి - మొత్తము నాలుగు రూపములుండును.

సూ : ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యమ్ 8-3-32.

వృ : హ్రస్వాత్ పరో యో ఙమ్ తదన్తం యత్పదం తస్మాత్పరస్యాచో నిత్యం ఙముట్ స్యాత్. ప్రత్యఙ్ఙాత్మా, సుగణ్ణీశః, సన్నచ్యుతః.

ప. వి : ఙమః (5-1) హ్రస్వాత్ (5-1) అచి (7-1) ఙముట్ (1-1) నిత్యమ్ (2-1).

అను : పదస్య (6-1)

అర్థ : హ్రస్వమునకు పరముగా నున్న ఙ మ్వర్ణము అంతమునఁగల పద మునకు పరముగానున్న అచ్చునకు నిత్యముగా ఙముడాగమము వచ్చును. ఉదా : ప్రత్యఙ్ఙాత్మా, సుగణ్ణీశః, సన్నచ్యుతః.

వివ : ఙమ్' అను ప్రత్యాహారము ఙణనలను తెలుపును. (ఙమ [ఙణ నమ్]). ఈ వర్ణములు తమకు పూర్వమున హ్రస్వముగలవియై పదముయొక్క

అంతమున నున్నయెడల అట్టిపదమునకు పరముగా నున్న అచ్చునకు 'ఙముట్' అనునాగమము వచ్చును. ఙముట్ అనుదాని యందు టకారమిత్తు. ఉకార ముచ్చారణార్థము ఆగమముగా 'ఙమ్' ప్రత్యాహారములోని వర్ణము వచ్చును.

అనగా హ్రస్వాక్షరమునకు పరముగానున్న ఙకారము అంతమునఁగల పదమునకు పరమైన అచ్చునకు ఙకారము ఆద్యవయవముగవచ్చును.

ఉదా : ప్రత్యఙ్ + ఆత్మా. ఇందు ప్రత్యఙ్ అనునది ఙకారాంతమైన పదము. ఙకారమునకు వెనుక హ్రస్వము గలదు. (త్ య్ అ ఙ్). ఈ పదమునకు పరముననున్న అచ్చు 'ఆత్మా'లోని ఆకారము. దానికి ఙకారము ఆగమముగా వచ్చును – ప్రత్యఙ్ + ఙ్ ఆత్మా – ప్రత్యఙ్ఙాత్మా.

ఇట్లే హ్రస్వాక్షరమునకు పరముగానున్న ణకారమంతమునఁగల పదమునకు పరమైన అచ్చునకు ణకార మాద్యవయవముగ వచ్చును.

ఉదా : సుగణ్ + ఈశః సుగణ్+ణ్ ఈశః=సుగణ్ణీశః.

ఇట్లే హ్రస్వాక్షరమునకు పరముగనున్న నకారము అంతమునఁగల పదమునకు పరమైన అచ్చునకు నకారమాద్యవయవముగ వచ్చును.

ఉదా : సన్ + అచ్యుతః సన్+న్ అచ్యుతః=సన్నచ్యుతః.

ఇట్లు 'డస్సిధుట్' మొదలుకొని యింతవఱకు ధుట్, కుక్, టుక్, ఙముట్ అను ఆగమములు చెప్పఁబడినవి.

అవ : సంధిలో కొన్ని సందర్భములందు కొన్నివర్ణములకు 'రు' అనునది యాదేశమగును. ఆ సందర్భము లిట చెప్పఁబడుచున్నవి. ఈ రుత్వమును విధించు సూత్రముల సముదాయము గలభాగమునకు రుప్రకరణమని పేరు.

సూ : సమస్సుటి 8–3–5.

వృ : సమోరుస్స్యాత్సుటి.

ప. వి : సమః (6–1) సుటి (7–1).

అను : రుః (1–1).

అర్థ : 'సమ్' అనుదానికి 'సుట్' అనునది పరమగునపుడు రుత్వము వచ్చును.

వివ : 'సమః' అనునది షష్ఠ్యంతపదము. 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే షష్ఠ్యంతమునకు విధింపఁబడిన యాదేశము తుదివర్ణమునకు వచ్చును గావున

'సమ్' అనుదాని మకారమున కీయాదేశము వచ్చును. 'రు' అనుదానిలో రెండు వర్ణములున్నవి కనుక నిది అనేకాలయిన ఆదేశమనుకొనరాదు. ఇందు ఉకారమిత్తు. (ఉపదేశేఽజనునాసికఇత్) కావున మిగులునది 'ర్' అనునదిమాత్రమే. ఏకాల్, అనేకాల్ అను విచారణములో ఇత్తులను గ్రహింపరాదు.

'సుట్' అనునది యొకయాగమము. 'సంపరిభ్యాం కరోతౌ భూషణే' అను సూత్రముచే సమ్, పరి అనునుపసర్గములకు పరముననున్న కృధాతురూపమున కిది విధింపఁబడినది. అది పరమగునపుడు 'సమ్' అనుదాని మకారమున కీసూత్రముచే రుత్వము (రు=ర్) వచ్చును.

ఉదా : సమ్ + కర్తా అని యుండఁగా సుట్ ఆగమము రాగా 'సమ్ + స్కర్తా' అని యగును. ఇచట 'సమ్' అనుదానికి 'సుట్' పరమయినది కనుక 'సమ్'లోని మకారమునకు రుత్వము వచ్చును. 'సరు+స్కర్తా'. ఇందు 'రు' లోని ఉకారమునకు 'ఉపదేశేఽజను నాసికఇత్' అను సూత్రముచే ఇత్సంజ్ఞ 'తస్యలోపః' అను సూత్రముచే అదిలోపించును. సర్ + స్కర్తా అనియుండగా క్రిందిప్రక్రియ అగును.

సూ : అత్రానునాసికః పూర్వస్యతు వా 8-3-2.

వృ : అత్ర రుప్రకరణే. రోఃపూర్వస్యానునాసికోవా.

ప. వి : అత్ర (అవ్య) అనునాసికః (1-1) పూర్వస్య (6-1) తు (అవ్య) వా (అవ్య).

అర్థ : ఈ రుప్రకరణమున 'రు' అనుదానికి పూర్వమున నున్న వర్ణమున కనునాసికమాదేశమగును.

వివ : 'అత్ర' యనగా ఇచట ననియర్థము. దీనికి పై సూత్రమగు 'మతువసోరు సంబుద్ధౌ' అనునది మొదలుకొని కొన్నిసూత్రములు రుత్వమును విధించును. దీనిని రు ప్రకరణమందురు. కావున నిచటి అత్ర శబ్దమునకు 'రుత్వ ప్రకరణమున' అనునర్థము సిద్ధించును. 'పూర్వస్య' అనుదానికి ఆకాంక్షనుబట్టి 'రు అనుదానికి పూర్వమున నున్నవర్ణమునకు' అనునర్థము కలుగును. ఈ రుప్రకరణమున రు అనుదానికి పూర్వమున నున్న అచ్చునకు అనునాసికము ఆదేశమగునని సూత్రార్థము. ఇది వైకల్పికముగా నగును. రానిచో నగుకార్యము ముందు సూత్రమున చెప్పఁబడుచున్నది.

ప్రకృతోదాహరణమగు 'సర్ + స్కర్తా' అనుదానియందు 'ర్' అనుదానికి పూర్వముననున్న సకారములోని అకారము అననునాసికము. దానిస్థానమున అనునాసికమగు అకారము ఈ సూత్రముచే వచ్చును. 'సఁర్ + స్కర్తా'. ఇచట రేఫమునకు మఱికొంత ప్రక్రియ గలదు.

అవ : పై సూత్రమున విధింపఁబడిన యనునాసికాదేశము వైకల్పికము. అది రానిచో నగుకార్యము నీక్రింది సూత్రము విధించుచున్నది.

సూ : అనునాసికాత్పరోఽనుస్వారః 8-3-4.

వృ : అనునాసికం విహాయరోః పూర్వస్మాత్పరోఽనుస్వారాగమః.

ప. వి : అనునాసికాత్ (5-1) పరః (1-1) అనుస్వారః (1-1).

అను : పూర్వస్య (6-1) దీనిని పంచమ్యంతముగా మార్చుకొనవలయును.

అర్థ : అనునాసికమును విడచి 'రు'కు పూర్వమున నున్నదానికి పరముగా అనుస్వారాగమము అగును.

వివ : 'అనునాసికాత్' అనుదానిని 'ల్యబ్లోపపంచమి' అందురు, ల్యబంత రూపము ('ల్యప్' అనునది క్త్వా ప్రత్యయమునకు కొన్నియెడల ఆదేశమగును. రెండు పనులలో ముందు జరిగినదానిని చెప్పునపుడు ధాతువునకు క్త్వా ప్రత్యయము వచ్చును). లోపించునపుడు కర్మమునకు, అధికరణవాచకమునకు పంచమి వచ్చును. ఇచటి 'అనునాసికాత్' అనుపంచమ్యంతపదము అట్టిది. కావున అనునాసికం విహాయ=అనునాసికమును వదలి=అనునాసికము రానియపుడు అనునర్థము వచ్చినది. అనువృత్తమైన 'పూర్వస్య' అను పదమును పంచమ్యంతముగా మార్చుకొనవలయును. ఆకాంక్షవలన (దేనికి పూర్వము అనుప్రశ్నవలన.) 'రు అనుదానికి పూర్వముననున్నదానికి' అనునర్థము కలుగును. ఇట్లు పైసూత్రమున విధింపఁబడిన అనునాసికము రానియపుడు రు అనుదానికి పూర్వముననున్న అచ్చునకు పరముగా అనుస్వారము (బిందువు) ఆగమముగా వచ్చును అనునర్థము సిద్ధించినది.

'సర్ + స్కర్తా' అనునాసికము రానిచో 'రు' అనుదానికి పూర్వముననున్న అకారమునకు పరముగా అనగా అకారరేఫములకు నడుమ బిందువు వచ్చును. 'సంర్ + స్కర్తా' అగును. అనునాసిక రూపమొకటియు ననుస్వారరూప

మొకటియు మొత్తము రెండురూపము లేర్పడుచున్నది. సర్ + స్కర్తా (1), సంర్ స్కర్తా (2).

అవ : ఈ రెంటియందును రేఫమునకు క్రిందిసూత్రముచే విసర్గాదేశము విధింపఁబడుచున్నది.

సూ : ఖరవసాన యో ర్విసర్జనీయః 8-3-15.

వృ : ఖర్యవసానే చ పదాన్తస్య రస్య విసర్గః.

ప. వి : ఖరవసానయోః (7-2) విసర్జనీయః (1-1).

అను : రః (6-1) పదస్య (6-1).

అర్థ : ఖరవసానములు పరములగునపుడు పదాంతమైన రేఫమునకు విసర్గము వచ్చును.

వివ : ఖర్ అనునది ప్రత్యాహారము (వర్గప్రథమద్వితీయాక్షరములు, శ ష సలు) అవసానమనగా విరామము. అనగా ఆ వాక్యమునకు లేక పదమునకు సంబంధించిన వర్ణములు లేకుండుట. 'రః' అను షష్ఠ్యంతపదము 'పదస్య' అను దానికి విశేషణము. విశేషణము తదంతమునకు సంజ్ఞయగును కావున 'రేఫాంతమైన పదమునకు' అనునర్థము వచ్చును. ఖర్ వర్ణము పరమైనపుడును, అవసానమునందును రేఫాంతమైన పదమునకు విసర్జనీయము=విసర్గము ఆదేశమగును. ఈ ఆదేశము అలోఽన్త్యస్య అను పరిభాషచే రేఫాంతపదముయొక్క తుదివర్ణమునకు=రేఫమునకు వచ్చును.

ఉదా : సర్ + స్కర్తా, సంర్ + స్కర్తా అను రెంటియందును, (సర్, సంర్ అనునవి పదములు.) అంతమున రేఫముగలదు. పరమున ఖర్ వర్ణమగు సకారము గలదు. కావున నీ సూత్రముచే విసర్గ మాదేశమగును. సః + స్కర్తా (1) సంః + స్కర్తా (2).

(అవ : ఈ రెంటియందును విసర్గమునకు సకారాదేశము నీ క్రింది వార్తికము విధించుచున్నది.)

వా : సంపుం కానాం సో వక్తవ్యః 4892

వృ : సస్స్కర్తా, సంస్స్కర్తా.

ప. వి : సంపుం కానామ్ (6-3) సః (1

అర్థ : సమ్, పుమ్, కాన్ అనువాని విసర్గమునకు సకారాదేశము చెప్ప నగును.

వివ : సమ్, పుమ్, కాన్ అనువానికి సంబంధించిన విసర్గమునకు సకారాదేశమును నిత్యముగా నీ వార్తికము విధించుచున్నది. వక్ష్యమాణమగు 'వాశరి' ను సూత్రముచే సకారాదేశము వికల్పముగా నగుటచే నపవాదముగా నీవార్తికముచే త్యముగా విధింపబడినది. సఁస్స్కర్తా (1), సంస్స్కర్తా (2) - ఇందు. క సకారము పాక్షికముగా లోపించుట భాష్యసమ్మతము. అపుడు సస్కర్తా, ంస్కర్తా అనియు రూపములుండును.

ఈ యుదాహరణముల ప్రక్రియా క్రమము నీ క్రింద చూపినవిధమున రిశీలింపనగును.

సమ్ + కర్తా.

| సూత్రము | కార్యము | రూపము. |
|---|---|---|
| (1) సమ్పరిభ్యాం కరోతౌభూషణే | - సుడాగమము - | సమ్ + స్కర్తా. |
| (2) సమః సుటి | - మకారమునకు రుత్వము | సరు + స్కర్తా. |
| (3) ఉపదేశేఽజనునాసిక ఇత్<br>(4) తస్యలోపః | 'రు'లోనిఉకారమునకిత్సంజ్ఞ<br>దానికి లోపము | సర్ + స్కర్తా. |
| (5) అత్రానునాసికః పూర్వస్య తువా - | 'స'లోని అకారమునకు అనునాసికాదేశము | సఁర్ + స్కర్తా (1) |
| (6) అనునాసికాత్పరోఽనుస్వారః - | అనునాసికము రాని యెడల అనుస్వారాగమము | సంర్ + స్కర్తా (2) |
| (7) ఖరవసానయోర్విసర్జనీయః - | పై రెండురూపములలో రేఫమునకు విసర్గాదేశము | సఁః + స్కర్తా (1)<br>సంః + స్కర్తా (2) |
| (8) సమ్పుఙ్కానాంసోవక్తవ్యః - | పై రెండురూపములలో విసర్గమునకు సకారాదేశము | సఁస్స్కర్తా - (1)<br>సంస్స్కర్తా - (2) |

ఒక సకారము లోపించినయెడల సఁస్కర్తా (1)

సంస్కర్తా (2) అనియు రూపములుండును.

సూ : పుమః ఖయ్యమ్పరే 8-3-6.

వృ : అమ్పరే ఖయి పుమో రుః. పుꣳస్కోకిలః, పుంస్కోకిలః.

ప. వి : పుమః (6-1) ఖయి (7-1) అమ్పరే (7-1).

అను : రుః (1-1).

అర్థ : అమ్పరమైన ఖయ్ వర్ణము పరమగునపుడు పుమ్‌శబ్దమునకు రుత్వము వచ్చును. ఉదా : పుꣳస్కోకిలః, పుంస్కోకిలః.

వివ : 'అమ్' 'ఖయ్' అనునవి ప్రత్యాహారములు. అమ్ అనగా అచ్చులు, హయవరల ఞమఙణనలు. ఖయ్ అనగా వర్గప్రథమ ద్వితీయాక్షరములు. అమ్ వర్ణము పరమునఁగల వర్గద్వితీయాక్షరములు పరమగునపుడు 'పుమ్' అనుశబ్దము యొక్క మకారమునకు (అలోఽన్త్యస్య) రుత్వము వచ్చును.

ఉదా : పుమ్ + కోకిలః - పుꣳస్కోకిలః, పుంస్కోకిలః.

వీని ప్రక్రియాక్రమము నిట్లరయఁదగును.

పుమ్ + కోకిలః

| సూత్రము | కార్యము | రూపము. |
|---|---|---|
| (1) పుమఃఖయ్యమ్పరే | మకారమునకు రుత్వము ఇచట 'కో' లోనికకారము ఖయ్‌వర్ణము. దానికిపరమైన ఓకారము అమ్ వర్ణము. | పురు + కోకిలః. |
| (2) ఉపదేశేఽజనునాసిక ఇత్ | 'రు'లోని ఉకారము ఇత్తగును. | పుర్ + కోకిలః |
| (3) తస్య లోపః | దానికి లోపము. | |
| (4) అత్రానునాసికః పూర్వస్య తు వా | పువర్ణములోని ఉకారమున కనునాసికాదేశము | పుꣳర్ + కోకిలః (1) |
| (5) అనునాసికాత్పరోఽనుస్వారః | అనునాసికము రానియపుడు అనుస్వారాదేశము | పుంర్ + కోకిలః (2) |
| (6) ఖరవసానయోర్విసర్జనీయః | పై రెండురూపములలో రేఫమునకు విసర్గాదేశము | పుꣳః + కోకిలః (1)<br>పుంః + కోకిలః-(2) |
| (7) సమ్పుంకానాం సో వక్తవ్యః | విసర్గమునకు సకారాదేశము | పుꣳస్కోకిలః (1)<br>పుంస్కోకిలః-(2) |

పుః + కోకిలః, పుంః + కోకిలః అనుచోట వక్ష్యమాణమగు 'కుప్వోః౿క ౘపౌచ' అనుసూత్రముచే జిహ్వామూలీయమును అది రానిపక్షమున విసర్గమును ఉండవలసి వచ్చుటచే అపవాదముగా సమ్పుఙ్కానామ్ ఇత్యాది వార్తికముచే సకారాదేశము విధింపఁబడినది.

సూ : నశ్ఛవ్యప్రశాన్ 8-3-7.

వృ : అమ్పరే ఛవినాన్తస్య పదస్య రుః, నతు ప్రశాన్ శబ్దస్య.

ప. వి : నః (6-1) ఛవి (7-1) అప్రశాన్ (షష్ఠీవిభక్తిలోపించిన పదము)

అను : అమ్పరే (7-1) రుః (1-1) పదస్య (6-1).

అర్థ : అమ్వర్ణము పరమునఁగల ఛవ్ వర్ణము పరమగునపుడు నకారాంత పదమునకు రుత్వము వచ్చును. ప్రశాన్ శబ్దమునకు మాత్రమురాదు.

వివ : అమ్, ఛవ్ అనునవి ప్రత్యాహారములు. (ఛవ్-ఛ ఠ థ, చట త). అమ్పరే ఛవి అనుదానికి అమ్వర్ణము పరమందు గల ఛవ్ వర్ణము పరమగునపుడు అనునర్థము 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య' అను పరిభాషచే కలుగును. నఃఅనునది పదస్య అనుదానికి విశేణము. కావున నాంతమైనపదమునకు అమ్వర్ణమునకు పూర్వమునగల ఛవ్ వర్ణము పరమగునపుడు రుత్వము వచ్చును అనునర్థము కలుగును. 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే రుత్వము నాంతపదము యొక్క తుది వర్ణము స్థానమున వచ్చును. ఈ కార్యము ప్రశాన్ శబ్దమునకు మాత్రము రాదని 'అప్రశాన్' అను పదమువలన తెలియుచున్నది.

ఇట్లు రుత్వము వచ్చినపుడు అనునాసికాదేశము, అనుస్వారాగమము మున్నగు కార్యములు పూర్వోదాహరణములందువలె యథాయోగ్యముగ జరుగును.

ఉదా : చక్రిన్ + త్రాయస్వ - ఇందు చక్రిన్ అనునది నకారాంత పదము (సంబోధన ప్రథమైకవచనాంతము) దానికి ఛవ్ వర్ణమగు తకారము పరమైనది. ఆతకారమునకు పరముగా అమ్వర్ణమగు రేఫము గలదు. కావున రుత్వము వచ్చును. చక్రిరు + త్రాయస్వ.

ప్రక్రియ నిట్లరయుదము.

| సూత్రము | కార్యము | రూపము. |
|---|---|---|
| (1) నశ్ఛవ్యప్రశాన్ | నకారమునకు రుత్వము | చక్రిరు + త్రాయస్వ |
| (2) ఉపదేశేఽజనునాసికఇత్-'రు'లోని ఉకారమిత్తగును | | చక్రిర్+త్రాయస్వ |
| (3) తస్యలోపః | దానికిలోపము వచ్చును | |
| (4) అత్రానునాసికః పూర్వస్యతువా-అనునాసికాదేశము- | | చక్రిర్ँ+త్రాయస్వ(1) |
| (5) అనునాసికాత్పరోఽనుస్వారః-అనునాసికమురానిచో అనుస్వారాగమము | | చక్రింర్+త్రాయస్వ (2) |
| (6) ఖరవసానయోర్విసర్జనీయః-పై రెండురూపములలో రేఫమునకువిసర్గాదేశము | | చక్రిః+త్రాయస్వ(1) చక్రింః + త్రాయస్వ (2) |

అవ : ఈ రెండింటి యందును క్రిందిసూత్రముచే విసర్గమునకు సకారాదేశము విధింపఁబడుచున్నది.

సూ : విసర్జనీయస్య సః 8-3-34.

వృ : ఖరి, చక్రిస్త్రాయస్వ, చక్రింస్త్రాయస్వ.

ప. వి : విసర్జనీయస్య (6-1) సః (1-1).

అను : ఖరి (7-1).

అర్థ : ఖర్వర్ణము పరమగునపుడు విసర్గమునకు సకారమాదేశమగును.

ఉదా: చక్రిస్త్రాయస్వ, చక్రింస్త్రాయస్వ.

వివ : ఖర్ ప్రత్యాహారములోనివర్ణము పరమున నున్నపుడు దానికి అవ్యవహితముగ పూర్వముననున్న విసర్గమునకు సకారము ఆదేశమగును.

చక్రిః + త్రాయస్వ, చక్రింః + త్రాయస్వ అను రెండురూపములంలిద విసర్గమునకు ఖర్వర్ణమగు తకారము పరమైనది కావున సకారాదేశమురాఁగా చక్రిస్త్రాయస్వ, చక్రింస్త్రాయస్వ అనురూపము లేర్పడును.

'నశ్ఛవ్యప్రశాన్' సూత్రమునందలి 'అప్రశాన్' పదమునకు, 'పదస్య'అను అకారరూపమున వచ్చినదానికిని ప్రయోజనము వృత్తికారునినే ప్రదర్శింపఁబడు చున్నది.

వృ : అప్రశాన్ కిమ్? ప్రశాన్తనోతి. పదస్యేతికిమ్? హన్తి

వివ : 'అప్రశాన్' అనుటవలన నిది నకారాంతపదమే యయినను, దానికి అవ్వరమైన ఛవ్ వర్ణము (త అనునది) పరముగా నున్నను ఇచట రుత్వము రాదు. కావున 'ప్రశాన్తనోతి' అనియే యుండును. '(అప్రశాన్' అననిచో 'ప్రశాస్తనోతి', 'ప్రశాంస్తనోతి, అను దుష్టరూపములు ప్రాప్తములగును). పదస్య అనుటవలన 'హన్తి' అను నెడ రుత్వము వారింపఁబడినది. హన్ధాతువునకు వర్తమానకాలమున ప్రథమపురుషైక వచనమున 'తి' ప్రత్యయము చేరి 'హన్ + తి' అనియుండ 'పదస్య' అననియెడల నిచటను రుత్వము ప్రాప్తించును. ఇచట 'హన్' అనునది నాంతమే కాని పదము కాదు. కావున రుత్వము రాదు, హన్తి. ('పదస్య' అననిచో హఁస్తి, హంస్తి అనునవిష్టరూపము లేర్పడవలసి వచ్చును.

సూ : నౄన్ పే 8-3-10.

వృ : నౄనిత్యస్య రుర్వా పే

ప. వి : నౄన్ (షష్ఠీ విభక్తిలోపించిన పదము) పే (7-1).

అను : రుః (1-1) ఉభయథా (అవ్య).

అర్థ : నౄన్ అనుదానికి పవర్గము పరమగునపుడు రుత్వము వైకల్పికముగా నగును.

వివ : 'నౄన్' అనునది నృశబ్దముయొక్క ద్వితీయా బహువచనరూపము. దానికి రుత్వము విధింపఁబడినది. 'ఆ పదమునకు' అనునర్థమున దానిపై షష్ఠీవిభక్తి ప్రత్యయము చేరవలయును. నౄనః అనియుండవలయును. సూత్రములు వేద వాక్కులవంటివి కావున నందుకొన్ని లౌకికనియమములు లేకుండుట దోషము కాదు. అను వృత్తమైన ఉభయథా అనుపదమునకు రెండువిధములుగానని యర్థము, కావున నీకార్యము వైకల్పికముగా నగును, 'ప' అనుదాని సప్తమ్యేకవచన రూపము 'పే' అనునది. తస్మిన్నిత్యాధిపరిభాషచే అది పరమగునపుడు నర్థము కలుగును ఇట్లు 'నౄన్' అనుపదమునకు, పవర్గము పరమగునపుడు, రుత్వము

వచ్చును అనునర్థము సిద్ధించినది. అలోఽన్త్యస్య' అను పరిభాషచే రుత్వము నౄన్ అనుదాని తుది నకారమునకు వచ్చును.

ప్రక్రియా-క్రమ మీక్రింది విధముగా నుండును.

నౄన్ + పాహి

| సూత్రము | కార్యము | రూపము. |
|---|---|---|
| (1) నౄన్ పే | రుత్వము | నౄరు+పాహి |
| (2) ఉపదేశేఽజనునాసికఇత్-ఇత్సంజ్ఞ<br>(3) తస్యలోపః | దానికిలోపము | నౄర్ + పాహి. |
| (4) అత్రానునాసికఃపూర్వస్యతువా | అనునాసికాదేశము | నౄ̐ర్ + పాహి (1) |
| (5) అనునాసికాత్పరోఽనుస్వారః | అనుస్వారాగమము | నౄంర్+పాహి (2) |
| (6) ఖరవసానయోర్విసర్జనీయః | రేఫమునకు విసర్గాదేశము | నౄ̐ః + పాహి<br>నౄంః + పాహి. |

అవ : ఇట్లుండగా నీరెండురూపములందును విసర్గమునకు వైకల్పికముగా ఉపధ్మానీయాదేశము విధింపఁబడుచున్నది.

సూ : కుప్వోః ≍క≍పౌచ 8-3-37.

వృ : కవర్గే పవర్గే చ విసర్గస్య ≍ క ≍పౌ స్తః. చాద్విసర్గః, నౄ̐ ≍ పాహి, నౄం ≍పాహి, నౄ̐ఃపాహి, నౄంఃపాహి, నౄన్పాహి.

ప. వి : కుప్వోః (7-2) ≍ క≍పౌ (1-2) చ (అవ్య).

అను : విసర్జనీయస్య (6-1).

అర్థ : కవర్గ పవర్గములు పరములగునపుడు విసర్గమునకు క్రమముగా ≍ క ≍ ప లు వచ్చును. 'చ' అనుదానివలన విసర్గము కూడనగును. ఉదా : నౄ̐≍పాహి (1), నౄం≍పాహి (2), నౄ̐ఃపాహి (3) నౄంః పాహి (4), నౄన్పాహి (5).

వివ : ఇందు విసర్గమునకు కవర్గము పరమగునపుడు ≍ క (జిహ్వామూలీయము), పవర్గము పరమగునపుడు ≍ ప, (ఉపధ్మానీయమును) ఆదేశములగుట

విధింపఁబడినది. కు పులు ఉదిత్తులు' 'కుప్వోః' అను సప్తమ్యంతపదమునకు కవర్గపవర్గములు పరములగునపుడని యర్థము. 'ఖరి' అనుపదమును గూడ నను వృత్తిగా గైకొని ఖర్ ప్రత్యాహారములో నున్న కవర్గపవర్గములు పరములగునపుడు అనునర్థమును గ్రహించుట యిచట అవసరము. అపుడు పరముగా నుండువర్ణములు కఖలు, ప ఫ లు మాత్రమే యగును. ≍క ≍పౌచ = ≍క ≍ పలు కూడ నగునను సముచ్చయార్థకమువలన నివి వైకల్పికముగా నగును. ఇట్లు క ఖ లు పరము లగునప్పుడు విసర్గమునకు జిహ్వామూలీయము (≍క≍ఖ), ప ఫలు పరము లగునపుడు విసర్గమునకు ఉపధ్మానీయమును (≍ప≍ఫ) వైకల్పికముగా నాదేశ మగు నను నర్థమేర్పడినది. దీనిచే, అనునాసికము వచ్చినపక్షమున విసర్గముతో నుండురూపమొకటియు నుపధ్మానీయముతో నుండు రూపమొకటియు నిట్లురెండును, అనుస్వారపక్షమున విసర్గరూపము, ఉపధ్మానీయరూపము నిట్లు రెండును, రుత్వ విధి యిచట వైకల్పికము కావున రానిరూపమొకటియు మొత్తమైదు రూపము లుండును.

(1) నౄః పాహి (2) నౄఁ≍ పాహి (3) నౄంఃపాహి, (4) నౄం ≍ పాహి (5) నౄన్ పాహి.

[సూత్రములలో హల్లులను నిర్దేశించునపుడు కొన్నియెడల శితుక్-(శ్ + ఇ) వాన్తోయి ప్రత్యయే-(య్ + ఇ) మోఽనుస్వారః - (మ్+అన్) ఇత్యాదిరూపమున కేవలహల్లులకే విభక్తిని చేర్చి నిర్దేశించుటయు, కొన్నియెడల 'నౄన్పే' ఇత్యాదిస్థలములలో హల్లుపై ఉచ్చారణార్థమైన అచ్చుతో కలిపి దానికి విభక్తిచేర్చుట (ప + ఇ = పే) (హేమపరేవా - హ + ఇ = హే)గలదు].

అవ : ముందు మత్వమును విధించుసూత్రములోని ఆమ్రేడితమను వ్యాకరణ సంజ్ఞను ఈ క్రింది సూత్రము నిర్వచించుచున్నది.

సూ : తస్య పరమామ్రేడితమ్ 8-1-2.

వృ : ద్విరుక్తస్య పరమామ్రేడితం స్యాత్.

ప. వి : తస్య (6-1) పరమ్ (1-1) ఆమ్రేడితమ్ (1-1).

అర్థ : ద్విరుక్తముయొక్క రెండవరూప మామ్రేడిత మనఁబడును.

వివ : 8, వ అధ్యాయము మొదటిపాదము మొదటిసూత్రము 'సర్వస్య ద్వే' అనునది. అది మొదలుకొని కొన్నిసూత్రములు ఏయే సందర్భములలో

పదములకు ద్విరుక్తి (రెండుమాఱు లుచ్చరింపఁ బడుట) అగునో తెలుపును. రెండవసూత్రమగు దీనియందలి తస్య అను సర్వనామమునకు "అట్లు ద్విత్వము వచ్చిన పదముయొక్క" అని యర్థము. 'పరమ్' అనగా తర్వాతిది. ఒకపదము రెండుమాఱులు వరుసగా నుచ్చరింపఁబడినపుడు, అందు రెండవమాఱు ఉచ్చరింపఁ బడినది యామ్రేడిత మనఁబడును. ఉదా : కాన్ కాన్. ఇందు రెండవది ఆమ్రేడిత మనఁబడును.

ఈ సంజ్ఞ యీ క్రిందిసూత్రమునకై యిటఁజెప్పఁబడినది.

సూ : కానామ్రేడితే 8-3-12.

వృ : కాన్నకారస్య రు రామ్రేడితే. కాఁస్కాన్. కాంస్కాన్.

ప. వి : కాన్ (షష్ఠీ విభక్తిలోపించినపదము) ఆమ్రేడితే (7-1).

అను : రుః.

అర్థ : కాన్ అనుపదమునకు, ఆమ్రేడితము పరమగునపుడు, రుత్వము వచ్చును. ఉదా ; కాఁస్కాన్, కాంస్కాన్.

వివ : 'కాన్' అనునది పుంలింగమైన కిం శబ్దముయొక్క ద్వితీయా బహువచనరూపము. న్యాన్వలెనే యిదియు షష్ఠీ విభక్తిలోపించిన పదము, దానికి ఆమ్రేడితము పరమగునపుడు రుత్వము వచ్చును. 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే అంతిమాక్షరమగు నకారమున కీరుత్వము వచ్చును.

ప్రక్రియా స్వరూపమిట్లుండును.

కాన్ + కాన్.

| సూత్రము | కార్యము | రూపము |
|---|---|---|
| (1) కానామ్రేడితే | రుత్వము | కారు + కాన్. |
| (2) ఉపదేశేఽజనునాసికఇత్<br>(3) తస్యలోపః | ఇత్సంజ్ఞ,<br>లోపము | కార్ కాన్ |

| సూత్రము | కార్యము | రూపము. |
|---|---|---|
| (4) అత్రానునాసికః పూర్వస్యతువా | – అనునాసికము | కాఁర్ + కాన్ (1) |
| (5) అనునాసికాత్పరో౽నుస్వారః | – అనుస్వారము | కాంర్+కాన్ (2) |
| (6) ఖరవసానయోర్విసర్జనీయః | – విసర్గము | – కాఁఃకాన్, కాంఃకాన్. |
| (7) సమ్పుఙ్కానాంసో వక్తవ్యః | – సకారాదేశము | –కాఁస్కాన్, కాంస్కాన్. |

ఇచట కుప్వోఃᳵకᳶపౌచ అనుసూత్రముచే జిహ్వామూలీయ విసర్గ సహితరూపములు ప్రాప్తించుచుండగా సమ్పుఙ్కానామిత్యాది వార్తికముచే సకారాదేశము విధింపఁబడినది.

'సమస్సుటి' అనుసూత్రము మొదలుకొని యింతవఱకు రు ప్రకరణము.

అవ : క్రింద రెండుసూత్రములలో తుగాగమము విధింపఁబడుచున్నది.

సూ : ఛే చ 6-1-73.

వృ : హ్రస్వస్య ఛే తుక్. శివచ్ఛాయా.

ప. వి : ఛే (7-1) చ (అవ్య).

అను : హ్రస్వస్య (6-1) తుక్ (1-1) సంహితాయామ్.

అర్థ : సంహితయున్నపుడు హ్రస్వమునకు, ఛకారము పరమైనచో తుగాగమము వచ్చును. ఉదా : శివచ్ఛాయా.

వివ : హ్రస్వమంతమునఁగల శబ్దస్వరూపమునకు, ఛకారముపరమైనయెడల 'తుక్' అను నాగమము వచ్చును. ఇందు కకారమిత్తు. ఉకారముచ్చారణార్థము ఆగమముగా వచ్చునది తకారహల్మాత్రమే (త్). ఇది కిత్తగుటచే ఆద్యన్తౌ టకితౌ అను పరిభాషచే హ్రస్వాంతమునకు అంతావయవముగా వచ్చును.

ఉదా : శివ + ఛాయా - ఇచట 'వ' లో అకారమునకు 'ఛాయా'లోని ఛకారమునకు సంహితగలదు - అకారము హ్రస్వము దానికి ఛకారము పరముగా నుండుటచే నీ సూత్రమువలన తుగాగమము వచ్చును. శివత్ + ఛాయా. ఈ తకారమునకు 'స్తోః శ్చునాశ్చుః' అనుసూత్రముచే శ్చుత్వము రాగా శివచ్ ఛాయా- 'శివచ్ఛాయా' అగును.

సూ : పదాన్తాద్వా 6-1-76.

వృ : దీర్ఘాత్పదాన్తాచ్ఛే తుగ్వా. లక్ష్మీచ్ఛాయా. లక్ష్మీఛాయా.

అను : తుక్ (1-1) ఛే (7-1) దీర్ఘాత్ (5-1).

అర్థ : పదాంతమైన దీర్ఘమునకు, ఛకారము పరముగా నున్నపుడు తుగాగమము వైకల్పికముగా నగును. ఉదా : లక్ష్మీచ్ఛాయా, లక్ష్మీఛాయా.

వివ : పదమనగా విభక్త్యంతము. అట్టిపదముయొక్క అంతమున దీర్ఘాక్షరమున్నయెడల, దానికి పరముగా ఛవర్ణమున్నయెడల తుగాగమము వైకల్పికముగా నగును. ఈ తుగాగమము దీర్ఘాక్షరమునకు వచ్చునా ? లేక ఛకారమునకు వచ్చునా? 'దీర్ఘాత్' అను పంచమీ నిర్దేశమువలన 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాషచే నిది దీర్ఘాక్షరమునకు పరముగానున్న ఛకారమునకు ప్రాప్తించును. 'ఛే' అనుసప్తమీ నిర్దేశమువలన 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య'. అను పరిభాష చొప్పున నీతుగాగమము ఛకారమునకు పూర్వముననున్న దీర్ఘమునకు రావలసియున్నది. ఇట్లొక యాగమము రెండు పరిభాషలచే రెండుతావులలో ప్రసక్తమగుచున్నది. ఒక్కస్థలముననే రావలయును. ఇట్లు పంచమీ సప్తమీ నిర్దేశములు రెండును గలచోట పంచమీనిర్దేశము బలీయమగును. 'విప్రతిషేధే పరంకార్యమ్' అను వక్ష్యమాణ పరిభాష ఈ నిర్ణయము నొనర్చును. కావున 'ఛే' అనునది 'ఛస్య' అని షష్ఠ్యంతముగా మాఱి ఛకారమునకు తుగాగమము వచ్చునని చెప్పవలసియున్నది. కాని పాణిని మహర్షి 'విభాషాసేనాసురాచ్ఛాయాశాలా నిశానామ్' అను సూత్రమున తుగాగమమును ఛకారమునకు కాక దీర్ఘమునకు చేసి ప్రయోగించెను. (సురాచ్ఛాయా). మహర్షియొక్క ఆ ప్రయోగ

గము, ఈ యాగమము దీర్ఘమునకే వచ్చును గాని ఛకారమునకు రాదనునంశమును జ్ఞాపకముచేయును. కావున నీతుగాగమము దీర్ఘమునకే కాని ఛకారమునకు కాదని తెలియనగును.

ఉదా : లక్ష్మీ + ఛాయా-ఇచట క్ష్మీలోని ఈకారము దీర్ఘము. లక్ష్మీ అనునది పదము. ఛకారము పరమైనది. తుగాగమము రాఁగా 'లక్ష్మీత్ + ఛాయా'- శ్చుత్వము - లక్ష్మీచ్ఛాయా - లక్ష్మీచ్ఛాయా. తుగాగమము రానిచో 'లక్ష్మీఛాయా' అనురూపముండును.

ఇదిహల్సంధి ప్రకరణము.

## ప్రకరణావలోకనము.

ఇందు హల్లులకు సంబంధించిన సంధివిశేషములు చెప్పఁబడినవి. ఇందు ముఖ్యముగా మూఁడు విభాగములు గలవు (1) ఆదేశసంధులు (2) రుత్వ ప్రకరణము (3) ఆగమసంధులు. శ్చుత్వము, ష్టుత్వము జశ్త్వము, అనునాసికము, పరసవర్ణము, పూర్వసవర్ణము, చర్త్వము, ఛత్వము, అనుస్వారము, మకారాద్యాదేశము - అనునవి ఆదేశములు. సమ్, పుమ్ అనువానికిని, కొన్ని నాంతశబ్దములకు కొన్నికొన్ని ప్రత్యేక పరిస్థితులలో రుత్వము విధింపఁబడినది. ఇదియు నాదేశమే. ధుట్, తుక్, ఙుక్, ఠుక్, జముట్ అనునాగమములు భిన్న భిన్న పరిస్థితులలో విధింపఁబడినవి. ఈ ప్రకరణమున, తస్మాదిత్యుత్తరస్య, ఆదేఃపరస్య, అద్యన్తౌటకితౌ, అను పరిభాషా సూత్రములు పరిచయము చేయఁబడినవి. ఆమ్రేడితమను సంజ్ఞ యొకటి చెప్పఁబడినది. ప్రాస్తావికముగా విసర్గసంధికి సంబంధించిన ఖరవసానయోర్విసర్జనీయః, విసర్జనీయస్యసః, కుప్వోః ≍ క ≍ పౌ చ అను సూత్రములు కూడ చెప్పఁబడినవి.

ఈ ప్రకరణమున చెప్పఁబడిన సంధిస్వరూపముయొక్క స్థూల వివేకము నీ క్రింది పట్టికలో పరిశీలింపఁదగును.

| సంఖ్య | సంధి నామము | సూత్రము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| 1 | శ్చుత్వసంధి | స్తోఃశ్చునాశ్చుః | సకారతవర్గములకు శకారచవర్గములతో యోగముండుట- శకారచవర్గము లాదేశము లగుట | రామశ్శేతే రామశ్చినోతి సచ్చిత్ శార్ఙ్గిఞ్జయ | ఆదేశసంధి 'శాత్' అనునదిదీనికి నిషేధసూత్రము |
| 2 | ష్టుత్వసంధి | ష్టునాష్టుః | సకారతవర్గములకు షకారటవర్గములతో యోగము. షకారటవర్గము లగుట. | రామష్షష్ఠః రామష్టీకతే పేష్టా తట్టీకా చక్రిణ్ఢౌకసే | ఆదేశసంధి. — నపదాన్తాట్టోరనామ్ తోఃషి అనునవి దీనికిసంబంధించిన నిషేధ సూత్రములు. 'అనామ్నవతినగరీణామితివాచ్యమ్' అనునది యీ నిషేధమున కపవాదము. |
| 3 | జశ్త్వసంధి | ఝలాంజశోఽన్తే | పదాంతమున ఝల్లులు జశ్శు లగును. | వాక్ + ఈశః =వాగీశః. | ఆదేశసంధి. |
| 4 | అనునాసికసంధి | యరోఽనునాసికే ఽనునాసికోవా | యర్ + అనునాసికము = యర్వర్ణము వికల్పముగా అనునాసికమగును. | ఏతన్మురారిః ఏతద్మురారిః | ఆదేశసంధి. 'ప్రత్యయేభాషాయాం నిత్యమ్' అను వార్తికము దీనికపవాదము. |
| 5 | పరసవర్ణాదేశసంధి | తోర్లి | తవర్గము + లకారము. తవర్గములకారముగామారును. | తల్లయః విద్వాల్లిఖతి | ఆదేశసంధి |
| 6 | పూర్వసవర్ణాదేశసంధి | దఃస్థాస్తమ్భోః పూర్వస్య | ఉద్+స్థానమ్ ఉద్ + స్తమ్భనమ్. | ఉత్థానమ్ ఉత్తమ్భనమ్ | ఆదేశసంధి ఇందుప్రాస్తావికముగా ఝరోఝరి సవర్ణే అనుసూత్రముచే లోపము ఝర్వర్ణమునకు చెప్పఁబడినది. |

| సం. | సంధి నామము | సూత్రము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| | చర్త్వసంధి | ఖరిచ | ఝల్ + ఖర్ ఝల్ ▷ చర్ | ఉద్ + స్థానమ్ = ఉత్థానమ్ | ఆదేశము. |
| | పూర్వసవర్ణాదేశసంధి | ఝయోహోఽన్యతరస్యామ్ | ఝయ్ + హ్<br>హ్ > పూర్వసవర్ణము | వాగ్ఘరిః వాగ్హరిః | ఆదేశము, వైకల్పికము |
| | ఛత్వసంధి | శశ్ఛోఽటి | ఝయ్ + శ్ = శ్ > ఛ్ | తచ్ఛివః తచ్ శివః | ఆదేశము, వైకల్పికము సూత్రమునందలి 'అటి' అనుపదము 'ఛత్వమమీతివాచ్యమ్' అనువార్తికముచే 'అమి'గా మార్పఁబడినది. |
| | అనుస్వారాదేశసంధి | మోఽనుస్వారః | మ్ + హల్ = మ్ > ం (బిందువు) | హరింవన్దే | ఆదేశము. పదాంతమకారమునకు మాత్రమే. |
| | ,, | నశ్చాపదాన్తస్యఝలి | న్ + ఝల్, మ్ + ఝల్ = న్/మ్ ▷ - ం | యశాంసి. ఆక్రంస్యతే | ఆదేశము. అపదాంతనకారమకారములకు |
| | పరసవర్ణాదేశము | అనుస్వారస్య యయి పరసవర్ణః | ం + యమ్ = ం > పరసవర్ణము | శాన్తః. | ఆదేశము. |
| | ,, | వాపదాన్తస్య | ం + యమ్ = ం > పరసవర్ణము | త్వఙ్కరోషి త్వంకరోషి | ఆదేశము. వైకల్పికము. |
| | మకారాద్యాదేశసంధి | (1) మోరాజిసమఃక్వౌ<br>(2) హేమపరేవా | సమ్ + రాట్<br>మ్ + హ్మ = మ్ ▷ మ్/ ం | సమ్రాట్.<br>కిమ్హ్మలయతి<br>కింహ్మలయతి | 'మోఽనుస్వారః'కు అపవాదము |

| సంఖ్య | సంధి నామము | సూత్రము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| | | (3 యవలపరే<br>౦ వలావా | మ్ + హ్యా = య్̐/ం | కియ్̐హ్యః, కింహ్యః | యవలాదేశము మకారమునకు వైకల్పికముగా నగును. |
| | | | మ్ + హ్వా వ్̐/ం | కివ్̐ హ్వాలయతి, కిం హ్వాలయతి | |
| | | | మ్ + హ్లా = ల్̐/ం | కిల్̐హ్లాదయతి కింహ్లాదయతి | |
| | | ( నపరేనః | మ్ + హ్నా = మ్ > న్/ం | కిన్హ్నుతే కింహ్నుతే | 'మోఽనుస్వారః'కు అపవాదము. మకారమునకు నకారాదేశము వైకల్పికము. |
| 13 | ధుడాగమము | డ స్సిధుట్ | డ్ + స్ = ధుట్ ఆగమము | షట్-త్సన్తః షట్సన్తః | ఆగమము పరముగానున్న సకారమునకు వైకల్పికముగా నగును. |
| | ,, | నశ్చ | న్ + స్ ధుట్ | సన్త్సః సన్సః | ,, |
| 14 | కుక్ టుగాగమము | ఙ్ణోః కుక్టుక్శరి | ఙ్ + శర్ – కుక్<br>ణ్ + శర్ = టుక్ | ప్రాఙ్ఖ్షష్ఠః ప్రాఙ్క్షష్ఠః ప్రాఙ్షష్ఠః<br>సుగణ్ఠ్ షష్ఠః సుగణ్ట్ షష్ఠః సుగుణ్ షష్ఠః | ఆగమము ఙకారణకారములకు వైకల్పికముగానగును. ఆగమములైన కకారటకారములకు వైకల్పికముగా ద్వితీయాక్షరము లాదేశములగును (చయో ద్వితీయాశ్శరి పౌష్కరసాదేరితి వాచ్యమ్) |

| సం. | సంధి నామము | సూత్రము | | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| | తుగాగమము | శి తుక్ | న్ + శ్ – తుక్ | సఞ్ ఛమ్భుః సఞ్చ్ ఛమ్భుః సఞ్చ్ శమ్భుః సఞ్ శమ్భుః | ఆగమము పూర్వముననున్న నకారమునకు వైకల్పికముగావచ్చును. ప్రకృతోదాహరణమున వర్తించు ఛత్వచలోపములీతుగాగమముతో పాటు వైకల్పికములగుటచే నాలుగురూపములు. |
| | ఙముడాగమము | ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యమ్ | హ్రస్వము + ఙ్ + అచ్చు – ఙ్ | ప్రత్యఙ్ఙాత్మా | ఈ యాగమము పరముననున్న అచ్చునకు విధింపఁబడినది. |
| | | | హ్రస్వము + ణ్ + అచ్చు – ణ్ | సుగణ్ణీశః | |
| | | | హ్రస్వము + న్ + అచ్చు – న్ | సన్నచ్యుతః | |
| | రుత్వసంధి | 1) సమస్సుటి | సమ్ + స్కర్తా | సఁస్స్కర్తా సంస్స్కర్తా | ఆదేశము, రుత్వమునకు పూర్వమున అనునాసికాదేశ, అనుస్వారాగమములు పర్యాయమునవచ్చుట రుత్వ ప్రకరణమున సామాన్యము. రేఫము విసర్గమగును. విసర్గము సకారముగా మారును. |

| ష్ట | నామము | సూత్రము | స్వరూపము | ఉదాహరణము | విశేషములు |
|---|---|---|---|---|---|
| | | పుమఃఖయ్యమ్పరే | పుమ్ + ఖయ్ + అమ్ | పుస్కోకిలః పుంస్కోకిలః | పుమ్ యొక్క మకారమునకు రుత్వాదేశము. |
| | 3 | నశ్ఛవ్యప్రశాన్ | న్ + ఛవ్ + అమ్ | చక్రిస్త్రాయస్వ చక్రింస్త్రాయస్వ | పదాంతనకారమునకు రుత్వాదేశము. |
| | | నౄన్ పే | నౄన్ + పవర్గము | నౄఁపాహి నౄంపాహి నౄఃపాహి నౄంఃపాహి నౄన్‌పాహి | 'నౄన్'లోని తుది నకారమునకు రుత్వాదేశము. రేఫమున కాదేశమైన విసర్గమునకు పాక్షికముగా ఉపధ్మానీయాదేశము. ; రుత్వమిచట వైకల్పికము. |
| | | కాన్నామ్రేడితే | కాన్ + కాన్ | కాస్కాన్ కాంస్కాన్ | మొదటి 'కాన్'యొక్క నకారమునకు రుత్వాదేశము. |

# అథ విసర్గసంధి ప్రకరణమ్

అవ : విసర్గము, తనకు పరముగ నున్న అక్షరములనుబట్టి యేయేమార్పులను పొందునో తెలుపు ప్రకరణము కావున దీనికి విసర్గసంధి ప్రకరణ మని పేరు. విసర్గమునకు పూర్వరూపమైన 'రు' అనునది పొందు మార్పులు కూడ నిందు చెప్పఁబడును. విసర్గమునే విసర్జనీయమనియు నందురు.

సూ : విసర్జనీయస్య సః 8-3-34.

వృ : ఖరి. విష్ణుస్త్రాతా.

ప వి : విసర్జనీయస్య (6-1) సః (1-1)

అను : ఖరి (7-1).

అర్థ : ఖర్ వర్ణము పరమగునపుడు విసర్గమునకు సకారమాదేశమగును.

వివ : ఖర్ ప్రత్యాహారమునందు వర్గ ప్రథమద్వితీయాక్షరములు, శ ష స లును గలవు. 'ఖరవసాన యో ర్విసర్జనీయః' (8-3-15) నుండి 'ఖరి' అనుపదము మండూక ప్లుతితో నీ సూత్రమునకు వచ్చునని కొందఱి యభిప్రాయము కప్పదాటువలె కొన్నింటిని వదలి పైచి దూరమున నున్న సూత్రములలోనికి పదములు వచ్చి చేరుటకు మండూక ప్లుతియని యిందు వ్యవహారము. విసర్గమునకు, ఖర్ వర్ణము పరమైనచో, సకారమాదేశమగును.

ఉదా : విష్ణుః + త్రాతా. ఇందు తవర్ణము ఖర్ ప్రత్యాహారములోనిది. అది పరమయినది కావున 'విష్ణుః' అనిదాని విసర్గమునకు సకారమాదేశమగును. విష్ణుస్ త్రాతా - విష్ణుస్త్రాతా. (ఈ సూత్రము హల్సంధి ప్రకరణమందును వ్యాఖ్యానింపఁబడినది).

అవ : పై సూత్రమున కొక యపవాదము చెప్పఁబడుచున్నది.

సూ : వాశరి 8-3-36.

వృ : శరి విసర్గస్య విసర్గోవా. హరిః శేతే, హరిశ్శేతే.

ప. వి : వా (అవ్య) శరి (7-1).

అను : విసర్జనీయస్య (6-1) విసర్జనీయః (1-1).

అర్థ : శర్వర్ణము పరమగునపుడు విసర్గమునకు విసర్గము వైకల్పికముగా నగును. ఉదా : హరిః శేతే, హరిశ్శేతే.

వివ : 'శర్' అనునది 'శ ష స' లను బోధించు ప్రత్యాహారము. ఇవి యును 'ఖర్' ప్రత్యాహారములోఁ గలవు. పైసూత్రముచే నివి పరనుగునపుడు విసర్గమునకు సకారాదేశము నిత్యముగా నగుచుండగా నీ సూత్రముచే వైకల్పికముగా విసర్గమే విధింపఁబడినది. విసర్గము రానిపక్షమున సకారమాదేశమగును. విసర్గము నకు సకారము వైకల్పికముగా వచ్చునని చెప్పనొప్పునుగదాః విసర్గమునకు విసర్గము వైకల్పికమని విధింపనేలః అనుసందియము గలుగవచ్చును. అష్టాధ్యాయిలో దీనికి పై సూత్రము శర్పరే విసర్జనీయః (8-3-35) అనునది. అందుండి అనువృత్త మగు 'విసర్జనీయః' అను పదముతో సూత్రార్థమును జెప్పుట లాఘవము కనుక అట్లు చెప్పఁబడినది.

ఉదా : హరిః + శేతే - ఇచట విసర్గమునకు శర్ వర్ణమగు శకారము పర మైనది. కాన విసర్గము అట్లేయుండినచో 'హరిః శేతే' అనురూపముండును. ఇట్లుం డుట పాక్షికము కావున నిదికానిచో 'విసర్జనీయస్య సః' అనుసూత్రముచే సకారా దేశము వచ్చును. హరిస్ + శేతే. ఇట్టియెడ సకారమునకు 'స్తోఃశ్చునాశ్చుః' అను సూత్రముచే శ్చుత్వము రాఁగా (శ్) హరిశ్ శేతే-'హరిశ్శేతే' అగును.

సూ : స సజు షో రుః 8-2-66.

వృ : పదాన్తస్య సస్య సజుషశ్చ రుఃస్యాత్.

ప. వి : ససజుషోః (6-2) రుః (1-1)

అను : పదస్య (6-1).

అర్థ : పదాంతమైన సకారమునకును, 'సజుష్' శబ్దమునకు రుత్వము వచ్చును.

వివ : ససజుషోః అనుషష్ఠ్యంతపదము, అధికారరూపమున వచ్చిన 'పదస్య' అనుదానికి విశేషణము. విశేషణము తదంతమునకు సంజ్ఞయగు నను పరిభాషచే 'సకారాంతమైన పదమునకు, సజుష్ శబ్దమునకును' ఈః కార్యమ్ము అగును. 'అలోఽ న్త్యస్య' అను పరిభాషచే నీకార్యము సకారాంతపదముయొక్క తుదివర్ణమగు సకా రమునకును, 'సజుష్' అనుదాని షకారమునకును వచ్చును. 'షష్ఠీస్థానేయోగా' అను పరిభాషచే సకారషకారములు తొలఁగింపఁబడిన తత్స్థానమున 'రు' అనునది వచ్చును.

ఉదా : శివస్ - ఇచట 'శివస్' లోని సకారము ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయమగు 'సు' అనుదానియందలిది. కావున 'శివస్' అనునది పదము. దానికి ప్రస్తుత సూత్రముచే రుత్వము రాఁగా 'శివరు' అగును. ఇందు ఉకారమిత్తు. కావున లోపించును. 'శివర్' అగును.

ఇది 'ఝలాం జశోఽన్తే' అనుసూత్రముచే నగు జశ్త్వమున కపవాదము.

అవ : పై సూత్రముచే వచ్చిన 'రు' అనుదానికొక సన్నివేశములో ఉత్వము నీక్రింది సూత్రము విధించుచున్నది.

సూ : అతో రో రప్లుతా దప్లుతే 6-1-113.

వృ : అప్లుతా దతః పరస్య రోరుస్స్యా దప్లుతేఽతి. శివోఽర్చ్యః.

ప. వి : అతః (5-1) రోః (6-1) అప్లుతాత్ (5-1) అప్లుతే (7-1).

అను : అతి (7-1) ఉత్ (1-1).

అర్థ : అప్లుతమైన హ్రస్వఅకారమునకు పరముగానున్న 'రు' అనుదానికి, అప్లుతమైన హ్రస్వఅకారము పరమగునపుడు, ఉత్త్వము వచ్చును. ఉదా : ఽర్చ్యః

వివ : ప్లుతమనగా త్రిమాత్రాకాలికమైన అచ్చు. 'అత్' అనగా తపరస్తత్కాలస్య' అను పరిభాషచే హ్రస్వఅకారమని యర్థము, 'అప్లుతాత్' అనునది అతః అనుదానికి, అప్లుతే అనునది 'అతి' అనుదానికి విశేషణములు. హ్రస్వ అకారమునకు పరముగా నున్న 'రు' అనుదానికి హ్రస్వఅకారము పరమగునపుడు ఉత్తు ఆదేశమగును. 'రు' అనుదానికి పూర్వపరములలో నుండవలసిన అకారము ప్లుతము కానియపుడే యీ కార్యము జరుగును. (హ్రస్వమెట్లును ప్లుతముకాదుకదా అట్టియెడ 'అత్' అనిచెప్పి మరల ప్లుతముకాని అను విశేషణము లుంచుట యేలః అను ప్రశ్న ఇట కలుగును. కొన్ని సన్నివేశములలో హ్రస్వము ప్లుతమగును. అట్టి యెడ నీ సూత్రము వర్తించును. ఇది వర్తించునపుడు ప్లుతమసిద్ధమగును. అట్టి సందర్భములలో ఉత్త్వము వారింపఁబడుటకై యీ ప్లుతమను విశేషణ మవసర మగును. ఇంకను వివరములు సిద్ధాంత కౌముది మున్నగు గ్రంథములలో చూడ

ఉదా శివర్ + అర్చ్యః - ఇచట 'ర్' అనునది ససజుషోరుః అనుసూత్ర ముచే వచ్చినది. దానికి పూర్వమున హ్రస్వఅకారము గలదు (వ్+అ) అట్లే

ధానికి పరమున 'అర్చ్యః' అనుదానిలోని అకారము (మొదటిది) గలదు. కావున ప్రకృతసూత్రముచే 'ర్' అనుదాని స్థానమున హ్రస్వఉకారము రాఁగా 'శివ + ఉ + అర్చ్యః' అగును. ఇందు 'శివ+ఉ' అనునది యొకపదము కనుక ముందు అందలి అకారఉకారములకు 'అద్గుణః' అనుసూత్రముచే గుణము చేయగా 'శివో+అర్చ్యః' అని యగును. పిదప 'ఏఙః' పదాన్తాదతి' అనుసూత్రముచే పూర్వరూపాదేశము రాఁగా 'శివోఽర్చ్యః' అగును.

'రోః' అనుటవలన నీకార్యము 'ససజుషోరుః' ఇత్యాది సూత్రములలో విధింపఁబడిన 'రు' అనిదానిలోని రేఫమునకే వచ్చును కాని సామాన్యరేఫము నకు 'పునర్' మొదలగువానియందలి దానికి రాదని గుర్తించునది. ఇట్లే ముందు సూత్రములందును 'రోః' అను నెల్లచోటులందును గ్రహించునది.

అవ : ఇట్లు రుత్వమునకు ఉత్త్వము వచ్చుట మఱికొన్ని వర్ణములు పరము లగునపుడు అగునని క్రిందిసూత్రము చెప్పుచున్నది.

సూ : హశిచ 6-1-114.

వృ : తథా. శివోవన్ద్యః

ప. వి : హశి (7-1) చ (అవ్య).

అను : ఉత్ (1-1) అప్లుతాత్ (5-1) అతః (5-1) రోః (6-1).

అర్థ : ప్లుతముకాని హ్రస్వఅకారమునకు పరముగానున్న 'రు' అను దానికి, హశ్‌వర్ణము పరమగునపుడును, ఉత్త్వము వచ్చును. ఉదా : శివో వన్ద్యః.

వివ : హశ్ ప్రత్యాహారములో హ య వ ర ల లును, వర్గ తృతీయ చతుర్థపంచమవర్ణములును గలవు. అవి పరమైనప్పుడును పూర్వమువలె ప్లుతము కాని హ్రస్వఅకారమునకు పరముగనున్న 'రు' అనుదానికి ఉత్త్వము వచ్చును. (అ + ర్ + హశ్). 'శివస్' అనుదానికి 'ససజుషోరుః' అనుసూత్రముచే రుత్వము వచ్చును. శివర్.

ఉదా : శివర్ +వన్ద్యః. ఇచట అవర్ణపూర్వకమైన 'రు' అనుదానికి వకారము (వన్ద్యః) పరమైనది. కావున రుత్వముయొక్క స్థానమున ఉత్త్వము వచ్చును. శివ + ఉ, వన్ద్యః, అద్గుణః అనుసూత్రముచే అకారఉకారములకు గుణమే కాదేశమగును, శివోవన్ద్యః.

(పై సూత్రములలో అప్లుతాత్, అప్లుతే అను విశేషణములు, హ్రస్వఅకార మునకు ప్లుతము విధింపఁబడిన సందర్భములలో నీకార్యము జరుగకుండుటకై చేర్పఁబడినవని గ్రహింపనగును.)

అవ : 'రు' అనుదానికి కొన్నిపరిస్థితులలో యకారాదేశమగుట నీ క్రింది సూత్రము విధించుచున్నది

సూ : భోభగో అఘో అపూర్వస్య యోఽశి 8-3-17.

వృ : ఏతత్పూర్వస్య రోర్యాదేశోఽశి. దేవా ఇహ, దేవాయిహ.

ప. వి : భభోగో అఘో అపూర్వస్య (6-1) యః (1-1) అశి (7-1).

అను : రోః (6-1).

అర్థ : భోస్, భగోస్. అఘోస్ అనునవియు అకారమును పూర్వమునఁగల 'రు' అనుదానికి, అశ్ వర్ణము పరమగునపుడు, యకార మాదేశమగును. ఉదా : దేవా ఇహ. దేవాయిహ.

వివ : 'భోభగో అఘో' అన్నంతవఱకు వివరణము తర్వాత చేయఁబడు చున్నది. 'అపూర్వస్య' అనగా అవర్ణము పూర్వమునఁ గలదానికి అనియర్థము. ఇచట 'అ' అనునది హ్రస్వదీర్ఘములను గ్రహించును. (అణుదిత్ సవర్ణస్య చా ప్రత్యయః)అశ్ అనునది అకారమునుండి జ బ గ డ దశ్ లోని శకారము వఱకుఁ గల వర్ణములను తెలుపు ప్రత్యాహారము. అశ్ వర్ణము పరమగునపుడు భోస్, భగోస్, అఘోస్ అనునవియును, అవర్ణమును పూర్వమునఁ గల 'రు' అనుదానికి 'య్' అనువర్ణమాదేశమగును, 'య'లోని అకార ముచ్చారణార్థము.

ఉదా : దేవాస్ - దేవ అను ప్రాతిపదికమునకు ప్రథమాబహువచన ప్రత్యయము 'జస్' అనునది చేరినరూపము. దానికి 'ససజుషోరుః' అనుసూత్రముచే రుత్వము వచ్చును. దేవారు. ఇందు ఉకారమిత్తు కావున లోపించును. దేవార్ + ఇహ ఇచట 'రు' అనుదానికి అవర్ణము పూర్వమున గలదు. పరమున అశ్ ప్రత్యాహారములోనిదగు ఇకారము గలదు. కావున యకారమాదేశము కాఁగా 'దేవాయ్ + ఇహ' అగును. 'లోపశ్శాకల్యస్య' అను సూత్రముచే నిచటి యకారమునకు వైకల్పికముగా లోపము వచ్చును. వచ్చినచో 'దేవా + ఇహ' అని యగును. ఇచట గుణసంధి ప్రసక్తమైనపుడు యలోపము 'పూర్వత్రాసిద్ధమ్' అను పరిభాషచే అసిద్ధమగును కావున 'దేవా ఇహ' అనియే రూపముండును. యలోపము రానిచో 'దేవాయిహ' అనురూపమగును.

అవ : భోభగో అఘో అనుదాని విషయము వివరింపఁబడుచున్నది.

వృ : భోస్, భగోస్. అఘోస్ ఇతి సకారాన్తా నిపాతాః, తేషాం రోర్యత్వే కృతే.

వివ ; భోస్, భగోస్, అఘోస్ అనునవి సకారాంతములైన నిపాతములు (ప్రాగీశ్వరాన్నిపాతాః) వీనితుది సకారమునకు వచ్చినరుత్వమునకు 'అశ్'వర్ణము పరమగునపుడు యకారాదేశము వచ్చును.

ఉదా : భోస్ - భోరు - భోర్+దేవాః-భోయ్ + దేవాః, భగోస్-భగోరు-భగోర్+నమస్తే - భగోయ్+నమస్తే, అఘోస్-అఘోరు-అఘోర్ + యాహి - అఘోయ్ + యాహి అనియుండగా క్రిందిసూత్రముచే యకారలోపము నిత్యముగా విధింపబడుచున్నది.

అవ : 'లోపశ్శాకల్యస్య' అనుసూత్రముచే వైకల్పికముగా ప్రాప్తమగు యకారలోపమిట నిత్యముగా నీక్రిందిసూత్రముచే విధింపఁబడుచున్నది.

సూ : హలి సర్వేషామ్ 8-3-22.

వృ : భోభగో అఘో అపూర్వస్య యస్య లోపః స్యాద్ధలి. భో దేవాః, భగో నమస్తే, అఘోయాహి.

ప. వి : హలి (7-1) సర్వేషామ్ (6-3).

అను : భోభగో అఘో అపూర్వస్య (6-1) యః (6-1).

అర్థ : భోభగో అఘో అపూర్వమైన యకారమున కాచార్యులందఱ మతమున లోపము వచ్చును. ఉదా ; భోదేవాః, భగోనమస్తే, అఘోయాహి.

వివ : 'లోపశ్శాకల్యస్య' అనుసూత్రముచే అవర్ణపూర్వములై పదాంతములైన యకారవకారములకు, అశ్‌వర్ణము పరమగునపుడు వైకల్పికముగా లోపము విధింపఁబడినది. దాని కపవాదముగా నీసూత్రము, భో, భగో, అఘో అనునవియు అకారమును పూర్వమునఁగల యకారమునకు హల్లుపరమగునపుడు నిత్యముగా లోపమగునని చెప్పుచున్నది. సర్వేషామ్=ఆచార్యులందఱమతమున ననుట వలన నిత్యమను నర్థము సిద్ధించినది, దీనిచే భోయ్ + దేవా, భగోయ్ + నమస్తే, అఘోయ్ + యాహి అనునుదాహరణములందు యకారము లోపింపఁగా భోదేవాః, భగోనమస్తే, అఘోయాహి అనురూపము లేర్పడును.

సూ : రోఽసుపి 8-2-69.

వృ : అహ్నో రేఫాదేశో నతు సుపి, అహరహః. అహర్గణః.

ప. వి : రః (1-1) అసుపి (7-1).

అను : అహన్ షష్ఠీవిభక్తిలోపించిన పదము.

అర్థ : అహన్ శబ్దమునకు రేఫమాదేశమగును. సుప్ప్రత్యయము పరమగునపుడు మాత్రము కాదు. ఉదా : అహరహః, అహర్గణః.

వివ : 'అహన్' అను శబ్దమునకు రేఫమాదేశమగును. 'రః' అనుదాని యందు అకారముచ్చారణార్థము. కావున 'ర్' అనునది యాదేశమగును. 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే 'అహన్' శబ్దముయొక్క నకారమున కీయాదేశము వచ్చును. 'అసుపి' అనుటవలన సుప్ - నామవిభక్తి పరమగునపు డీ రేఫాదేశము రాదు.

ఉదా ; అహన్ + అహన్ - ఇందు మొదటిదానికి రేఫమాదేశమగును. అహర్ + అహన్, తర్వాత విభక్తికార్యము 'అహరహః' అగును.

అట్లే అహ్నాంగణః అనునర్థమున అహన్ + గణ అనియుండ రేఫాదేశము 'అహర్గణః' అగును.

ఇది 'అహన్' అను సూత్రముచే విధింపఁబడిన రుత్వమున కపవాదము. రుత్వము వేఱు, రేఫాదేశము వేఱు. కావుననే పైఉదాహరణములలో అతోరోరప్లుతాదప్లుతే, హశిచ అనుసూత్రములు వర్తింపవు.

అవ : పునర్ + రమతే, హరిర్ + రమ్యః మున్నగుచోటులందగుకార్య విశేషమొకటి చెప్పఁబడుచున్నది. హరిస్, శంభుస్ అనువాని సకారమునకు 'ససజుషోరుః' అనుసూత్రముచే రుత్వము రాఁగా హరిర్, శంభుర్ అనియగును. 'పునర్' అనుదానిలోనిది సహజమైనరేఫము. వీనికి రేఫము పరమగునపుడు అగు కార్యమీక్రిందిసూత్రముచే విధింపఁబడుచున్నది.

సూ : రోరి 8-3-14.

వృ : రేఫస్య రేఫే పరే లోపః.

ప. వి : రః (6-1) రి (7-1).

అను : లోపః (1-1).

అర్థ : రేఫమునకు, రేఫము పరమగునపుడు, లోపము వచ్చును.

వివ : పునర్ + రమతే, హరిర్+రమ్యః, శంభుర్ + రాజతే అను నిత్యాది ఉదాహరణములందు రేఫమునకు రేఫము పరమైనది. ఇట్టి స్థితిలో పూర్వమున నున్న రేఫమునకు ఈ సూత్రము లోపమును విధించుచున్నది. లోపముచే పున + రమతే, హరి + రమ్యః, శంభు+రాజతే అని యగును.

అవ : పై యుదాహరణములలో ప్రవర్తించు కార్యవిశేషము నీ క్రింది సూత్రము చెప్పుచున్నది.

సూ : ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః 6-3-111.

వృ : ఢరేఫయో ర్లోపనిమిత్తయోః పరతః పూర్వస్యాణో దీర్ఘః. పునా రమతే, హరీరమ్యః, శమ్భూరాజతే.

ప. వి : ఢ్రలోపే (7-1) పూర్వస్య (6-1) దీర్ఘః (1-1) అణః (6-1)

అర్థ : ఢకారరేఫములలోపమునకు నిమిత్తమైనవి పరమగునపుడు. పూర్వమున నున్న అణునకు దీర్ఘమగును. ఉదా : పునారమతే, హరీరమ్యః, శమ్భూరాజతే.

వివ : రోరి అనుసూత్రమునకు (అష్టాధ్యాయిలో) పూర్వసూత్రము ఢో ఢే లోపః అనునది. ఢకారమునకు ఢకారము పరమగునపుడు లోపము వచ్చునని దానియర్థము. 'రోరి' అనుసూత్రము రేఫమునకు రేఫము పరమగునపుడు లోపమును విధించినది. ఇట్లు పూర్వభాగమున నున్న ఢకారరేఫములు లోపించుటకు పరమముననున్న ఢకార రేఫములు నిమిత్తములు. అట్టి ఢకారరేఫముల లోపమునకు నిమిత్తములయిన ఢకారరేఫములు పరములగునపుడు పూర్వముననున్న అణ్వర్ణములకు (అ, ఇ, ఉ లకు) దీర్ఘమాదేశమగును.

ఉదా : పున + రమతే - ఇచట 'పునర్' అనుదానిరేఫము లోపించినది. అది లోపించుటకు నిమిత్తమైనది 'రమతే'లోని రేఫము. అది పరమగునపుడు పూర్వముననున్న అణ్వర్ణమగు అకారమునకు దీర్ఘము రాగా 'పునా రమతే' అగును.

ఇట్లే హరీరమ్యః, శమ్భూరాజతే అనునవి. ఇవి క్రమముగా ఇకార ఉకారములకు దీర్ఘము వచ్చిన ఉదాహరణములు.

ఈ సూత్రమునందలి 'అణః' అను పదముయొక్క ప్రయోజనము పరీక్షింపఁబడుచున్నది.

వృ : అణః కిమ్? తృఢః, వృఢః.

వివ : సూత్రమున 'అణ్' అనుపదమేల? అనగా దీర్ఘము అణ్వర్ణములకే అని చెప్పనేల ? అన్నచో అదిలేనియెడల తృఢః, వృఢః అనువానియందు ఋకారమునకు కూడ దీర్ఘము ప్రాప్తమగును. అది సమ్మతముకాదు. తృహ్, వృహ్ అను హకారాంతధాతువులకు క్త ప్రత్యయము చేరినపుడు పై రూపము లేర్పడును. అందు హకారమునకు ఢకారము, పరముననున్న తకారమునకు ధకారము, దానికి ష్టుత్వముచే ఢకారమును అగును. తృఢ్ + ఢ, వృఢ్, + ఢ అని యుండ 'ఢో ఢే లోపః' అనుసూత్రముచే పూర్వఢకారము లోపించును. తృ + ఢ, వృ + ఢ-ఇట్టి స్థితిలో 'అణః' అనుపదము ప్రకృతసూత్రమున లేనియెడల నిచటి ఋకారమునకు కూడ దీర్ఘము ప్రాప్తమయి అనిష్టరూపము లేర్పడును. వానిని వారించుటకై 'అణః' అనుపదము సూత్రమున చేర్చఁబడెను. ఋకారము అ్రణ్ప్రత్యాహారములోనిది కాదు కావున నిచట దీర్ఘము రాదు. తృఢః, వృఢః.

అవ : మనర్ + రథః అనుచోట రెండుసూత్రము లొక్కమాఱు ప్రసక్తము లగుచున్నవి. దానిసంగతి విచారింపఁబడుచున్నది.

వృ : మనస్ + రథ ఇత్యత్ర రుత్వే కృతే హశి చేత్యుత్వే రోరీతిలోపే చ ప్రాప్తే—

వివ : 'మనస్' అనుపదముయొక్క సకారమునకు 'ససజుషోరుః' అను సూత్రముచే రుత్వము వచ్చి 'మనర్' అగును. దానికి 'రథః' అను శబ్దము పరమయి 'మనర్+రథః' అనియుండ నిచట 'హశిచ' అనుసూత్రముచే రుత్వమునకు ఉత్వము ప్రాప్తించుచున్నది. రోరి అను సూత్రముచే లోపమునకు లోపమును ప్రాప్తించుచున్నది. ఉత్వము చేసినచో మనోరథము సిద్ధించును. లోపము చేసినచో మనారథము కావలయును. కాని ఉత్వమే చేయవలయుననుటకు కాని, లోపమే చేయవలయుననుటకు కాని మునిత్రయము వారిలో నొకరి ప్రమాణము కావలయును. రెండును అగుట సాధ్యము కానిపని. సమానమైన బలముగల రెండుసూత్రములకు విరోధము సంభవించినయెడల నేమి చేయవలయునో యీ క్రింది పరిభాష చెప్పుచున్నది.

సూ : విప్రతిషేధే పరం కార్యమ్ 1-4 2.

వృ : తుల్యబలవిరోధే పరం కార్యం స్యాత్. ఇతిలోపేప్రాప్తే పూర్వత్రాసిద్ధమితి రోరీత్యస్యాసిద్ధత్వా దుత్వమేవ. మనోరథః.

ప. వి : విప్రతిషేధే (7-1) పరమ్ (1-1) కార్యమ్ (1-1).

అర్థము : తుల్యబలవిరోధము సంభవించినప్పుడు పరకార్యము ప్రవర్తించును, అను నీసూత్రముచే లోపము ప్రాప్తించుచుండగా 'పూర్వత్రా సిద్ధమ్' అనుసూత్రముచే లోపమసిద్ధమైన ఉత్వమే వచ్చును.

వివ : విప్రతిషేధమనగా తుల్యబలవిరోధము. తుల్యమైనబలముగల రెండుసూత్రములకు విరోధము గలుగుట. సూత్రములకు బలములో తుల్యతను నిర్ణయించుట యెట్లు? వానికి విరోధ మనగా నేమి? వేర్వేఱు లక్ష్యములలో చరితార్థములైన రెండుసూత్రములొక లక్ష్యమున నొక్కమాఱుగా ప్రవర్తించుటను తుల్యబల విరోధమందురు (అన్యత్ర చరితార్థయో శ్శాస్త్రయో రేకస్మిన్ లక్ష్యేయౌగ యౌగపద్య సంభవః తుల్యబలవిరోధః) అట్లు తుల్యబలములయిన సూత్రములకు విరోధము సంభవించినపుడు వానిలో పరమైనదియే ప్రవర్తించునని యీ సూత్రము నిర్ణయము చేసినది.

ప్రకృతమున హ శి చ 6-1-114, రోరి 8-3-14- అను రెండుసూత్రములకు విప్రతిషేధము సంభవించినది. 'శివోవన్ద్యః' మొదలగు నుదాహరణములలో హాశిచ అనునది చరితార్థమగును. అట్టియెడల 'రోరి' అనునది 'హాశిచ' అను దానిపై పోటీపడదు. దానికచట ప్రసక్తి లేదు. 'పునారమతే' మున్నగు నుదాహరణములందు 'రోరి' అనునది చరితార్థమైనది. అట్టియెడల 'హాశిచ' అను దానికి ప్రసక్తి లేదు. ఇట్లీరెండు సూత్రములు కొన్ని ప్రత్యేక లక్ష్యములలో పరస్పరవిరోధము లేక ప్రవర్తించుచున్నవి. కావున నివి అన్యలక్ష్యములందు చరితార్థములై తుల్యమైన బలము కలవి యగుచున్నవి. ఇంక 'మనర్ + రథః' అను చోట రెండును విరోధమును పొందుచున్నవి. అవర్ణ పూర్వకమైన 'రు' అనుదానికి హశ్వర్ణమైన 'రథః' లోని రేఫము పరమయినది కావున 'హాశిచ' అనుసూత్రముచే ఉత్వము ప్రాప్తించును. రేఫమునకు రేఫము పరమయినది కావున 'రోరి' అను సూత్రముచే లోపముకూడ ప్రాప్తమగును. ఇట్లు 'మనర్ + రథః' అనునుదాహరణమున నీరెంటికి విరోధము సంభవించినది. ఇట్టియెడ పరముగానున్న కార్యమే జరుగునని యీ పరిభాష చెప్పుటచే పరమైన 'రోరి' అనునదియే ప్రవర్తింపవలసి యున్నది. కాని 'విప్రతిషేధే పరంకార్యమ్' అను నీ పరిభాషకు అపవాదమైన 'పూర్వత్రాసిద్ధమ్' అను పరిభాష ఈ 'రోరి' అనుదాని నిట వారించును. 'రోరి' అనునది 'హాశిచ' అనుదానికి పరముగానున్నదియే అయ్యును. అది త్రిపాదిలోనిది. 'హాశిచ' అనునది సపాద సప్తాధ్యాయిలోనిది కావున సపాదసప్తాధ్యాయి ప్రవర్తించుచుండగా త్రిపాది అసిద్ధమగును కావున హాశిచ ప్రవర్తింపవలసి

యుండగా 'రోరి' అను త్రిపాది అసిద్ధమగును. ప్రవర్తించుటకు వీలులేదు. కావున 'హశిచ' అనుసూత్రముచే నిచట ఉత్త్వమే యగును. మనర్ + రథః మన+ఉ+ రథః-ఆద్గుణః-మనోరథః.

ఈ రెండుపరిభాషలయొక్క సమన్వయము నిట్లు పరిశీలింపవగును. అష్టాధ్యాయి యందు మొదటి ఏడధ్యాయములు, ఎనిమిదవయధ్యాయమునందలి మొదటిపాదము అనుభాగములో తుల్యబల విరోధము ప్రాప్తించిన యెడల పరకార్యము జరుగును (విప్రతిషేధేపరం కార్యమ్). 8 వ అధ్యాయమునందలి, 2,3,4 పాదముల ప్రసంగము వచ్చినపుడే 'పూర్వత్రాసిద్ధమ్' అను పరిభాష ప్రసక్తమగును.

అవ : కొన్నియెడల 'సు'ప్రత్యయమునకు లోపము విధింపఁబడుచున్నది.

సూ : ఏతత్తదో స్సులోపో౽కో రనఞ్ సమాసే హలి 6-1-132.

వృ : అకకారయో రేతత్తదో ర్యస్సుస్తస్య లోపో హలి, నతు నఞ్ సమాసే. ఏషవిష్ణుః, సశమ్భుః.

ప. వి : ఏతత్తదోః (6-2) సు (షష్ఠిలోపించిన పదము) లోపః (1-1) అకోః (6-1) అనఞ్ సమాసే (7-1) హలి (7-1).

అర్థ : కకారములేని ఏతద్, తద్ - శబ్దముల సు ప్రత్యయమునకు, హల్లు పరమగునపుడు లోపము వచ్చును, నఞ్ సమాసమునరాదు. ఉదా : ఏష విష్ణుః, సశమ్భుః.

వివ : ఏతద్, తద్ అనునవి సర్వనామములు. తెలుగునందలి ఈ, ఆ అను వానితో నివి సమానార్థకములు. వీనికి చేరిన ప్రథమావిభక్తిఏకవచన ప్రత్యయమగు 'సు' అనునది, హల్లు పరమగునపుడు లోపించును. అట్లు లోపించుట, ఇవి కకార సహితములు కాని యపుడే జరుగును. మఱియు నఞ్ సమాసములో నివి యున్నపుడు లోపము రాదు. ఇది 'ససజుషోరుః' అనుసూత్రమునకు అపవాదము.

ఉదా : ఏతద్ అనునది సుప్రత్యయము చేరినపుడు 'ఏషస్' అగును. 'ఏషస్ + విష్ణుః' - ఇచట ఏతచ్ఛబ్దము కకారములేనిది. నఞ్ సమాస ఘటితముయ కానిది. దానికి వకారమను హల్లు పరమైనది. కావున దాని యొక్క సుప్రత్య సంబంధమైన సకారము లోపించును. 'ఏషవిష్ణుః' అగును.

'తద్' శబ్దముయొక్క సు ప్రత్యయము చేరినరూపము 'సస్' అనునది. సస్ + శమ్భుః' అనియుండ సుప్రత్యయమునకు లోపమురాఁగా 'సశమ్భుః' అగును. ఇచటను తచ్ఛబ్దము కకారహితము, నఞ్ సమాసఘటితము, కాదు. హల్లు పరమైనది.

ఈ సూత్రమునందలి కొన్నిదళములకు సార్థక్యము పరిశీలింపఁ బడు చున్నది.

వృ : అకోః కిమ్? ఏషకోరుద్రః. అనఞ్ సమాసేకిమ్? అనశ్శివః. హలి కిమ్? ఏషోఽత్ర.

అర్థ : 'అకోః' అననేల? ఏ షకోరుద్రః అనునెడ లోపనివారణమునకు. 'అనఞ్ సమాసే' అననేల? అసశ్శివః అనుచోట ఈ లోపము రాకుండుటకు.'హలి' యననేల 'ఏషోఽత్ర' అని అచ్చు పరమగునపుడు లోపము రాకుండుటకు.

వ ; ఏతత్తచ్ఛబ్దములు నకారసహితములైనపుడు వానికి చేరిన సుప్రత్యయమునకు లోపము రాదని చెప్పుటకై సూత్రమున 'అకోః' అనుపదము అవసరము. సర్వనామములకు 'అకచ్' అను తద్ధిత ప్రత్యయము టిభాగమునకు పూర్వమున చేరును. (అవ్యయసర్వనామ్నా మకచ్ ప్రాక్టేః) దానిచే ఏతద్ – ఏతకద్ అగును. దీనికి సుప్రత్యయము చేరినపుడు 'ఏషకస్' అనురూప మేర్పడును. దీనికి హల్లుపరమగునపుడు సులోపము వచ్చుట సమ్మతము కాదు. కావున 'అకోః' అనుపదముచే నది వారింపఁబడినది. ఏషకస్ + రుద్రః – ససజుషోరుః – ఏషకర్ + రుద్రః, హశిచ ఏషక + ఉ, రుద్రః - ఆద్గుణః-ఏషకోరుద్రః 'అకోః' అననిచో 'ఏషక రుద్రః' అను దుష్టరూప మేర్పడును.

ఏతత్తచ్ఛబ్దములు నఞ్ సమాసఘటితములైనచో నీ సులోపము వచ్చుట యిష్టము కాదు. కావున 'అనఞ్ సమాసే' అనుపదము సూత్రబద్ధమయినది. (వ్యతిరేకార్థమగు 'నఞ్' అను నవ్యయము మఱియొక పదముతో సమసించినచో నది నఞ్ సమాసమనఁబడును) ఉదా : 'అసస్' 'తద్' శబ్దముతో 'నఞ్' అనునది సమసింపగా 'అతద్' అగును. దానికి సుప్రత్యయము చేరినరూపము 'అసస్' 'అసస్ + శివః'-ఇచట తచ్ఛబ్దము నఞ్ సమాస ఘటితమగుటచే సుప్రత్యయమునకు లోపమురాదు. 'అసస్ + శివః' – ససజుషోరుః అసర్ + శివః ఖరవసానయోర్విసర్జనీయః - అసః+శివః, 'వాశరి' అను సూత్రముచే సకారము వచ్చిన పక్షమున దానికి శ్చుత్వము వచ్చి అసశ్ శివః 'అసశ్శివః' అగును.

సులోపము వచ్చుట హల్లుపరమగునపుడే యగు ననుటచే అచ్చుపరమగునపుడు రాదు. ఉదా : ఏషస్ + అత్ర. ఇచట అచ్చుపరమయినది. కావున రుత్వము (ససజుషోరుః) వచ్చి ఏషరు + అత్ర అయి, దానికి 'అతో రో రప్లుతా

దప్లుతే' అనుసూత్రముచే ఉత్వము వచ్చును. ఏష+ఉ, అత్ర, గుణపూర్వరూప సంధులు రాగా 'ఏషోఽత్ర' అగును.

అవ : ఒక నిబంధనకు కట్టుబడి తచ్ఛబ్దముయొక్క సుప్రత్యయమునకు అచ్చుపరమగునపుడును లోపము వచ్చునని యీ క్రింది సూత్రమున చెప్పఁబడుచున్నది.

సూ : సోఽచి లోపే చేత్పాద పూరణమ్ 6-1-134.

వృ : స ఇత్యేతస్య సోర్లోపస్స్యాదచి పాదశ్చేల్లోపే సత్యేవ పూర్యేత. ఋ. సేమామవిడ్ఢి ప్రభృతిమ్. శ్లో. సైషదాశరథీరామః

ప. వి : సస్ - షష్ఠిలోపించినపదము, అచి (7-1) లోపే (7-1) చేత్ (అవ్య) పాద పూరణమ్ (1-1).

అను : సు (షష్ఠిలోపించినపదము) లోపః (1-1).

అర్థ : 'సస్' అనుపదముయొక్క సుప్రత్యయమునకు, లోపించినపుడే పాద పూరణమయిన యెడల, అచ్చుపరమగునపుడు, లోపము వచ్చును. ఉదా : సేమామవిడ్ఢి ప్రభృతిమ్, సైషదాశరథీరామః.

వివ : పూర్వసూత్రమున హల్లుపరమగునపుడే విధింపఁబడిన సుప్రత్యయ లోపము తచ్ఛబ్దమునకు అచ్చుపరమగునపుడును అగునని ఈ సూత్రము చెప్పుచున్నది సూత్రమునందలి 'సస్' అనునది తచ్ఛబ్దమునకు ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయమగు 'సు' అనునది చేరినరూపము. దాని తుది సకారమునకు అచ్చుపరమగునపుడు లోపమగును. లోపము వలన పాదపూరణమయ్యెడుస్థితియున్నపుడే యీలోపము కలుగును. పాదశబ్దమువలన నిది గద్యవిషయము కాదని చెప్పఁబడినది.

ఉదా : 'సస్ ఇమామవిడ్ఢి ప్రభృతిమ్' ఇందు సస్ అనుదానికి అచ్చుపరమయినది. ఇచట సకారలోపము రానియెడల పాదభంగమగును. కావున నీ సూత్రముచే లోపమురాగా స + ఇమామ్ - గుణమేకాదేశమై సేమామవిడ్ఢి ప్రభృతిమ్. ఇది ఋక్పాదము. జగతీఛందమునకు సంబంధించినది. అందు పాదమునకు పండ్రెండక్షరము లుండును. సకారలోపము రానియెడల నొకవర్ణమధికమగును (సేమామవిడ్ఢి ప్రభృతిం యఈశిషే అనునది పూర్తిపాదము).

ఇట్లే 'సస్ + ఏష దాశరథీరామః' ఇది అనుష్టుప్ ఛందము. పాదమునకు ఎనిమిదేసి అక్షరము లుండును. సస్ అనుదానికి అచ్చుపరమైనది. ఇందలి తుది

సకారమునకు లోపము వచ్చినపుడే పాదము భంగము లేనిదగును. లోపము రాఁగా స + ఏష = సైష దాశరథీరామః - (వృద్ధిసంధి) ఈ లోపము రానిచో 'సఏషదాశరథీరామః' అగును. అపుడు పాదమునకు తొమ్మిది అక్షరము లగును. అది సరికాదు.

ఇది విసర్గసంధి ప్రకరణము.

## ప్రకరణావలోకనము.

ఇందు విసర్గము తనకు పరముగానున్న అక్షరమునుబట్టి పొందు మార్పులును, పదాంత సకారమునకు రుత్వాదేశమును, దానికి భిన్నభిన్న సన్నివేశములలో జరుగు మార్పులును జెప్పఁబడినవి. రేఫాదేశము, రుత్వమున కపవాదముగా ఏతత్తచ్ఛబ్దముల సు ప్రత్యయలోపము జెప్పఁబడినవి. రేఫమునకు రేఫము పరమగునపుడు లోపమగుటయు పూర్వమున నున్న అణ్వర్ణమునకు దీర్ఘమును జెప్పఁబడినవి. 'విప్రతిషేధేపరం కార్యమ్' అను పరిభాష యిందు పరిచయము చేయఁబడినది.

# అథ కృత్య ప్రక్రియా

సంధిప్రకరణములైన పిదప ఈ లఘుకౌముది గ్రంథములో శబ్దాధికారము చెప్పఁబడినది. ప్రాతిపదికములకు సుబ్విభక్తులు చేరునపుడు కలుగు ప్రక్రియ యంతయు నా ప్రకరణమున చెప్పఁబడినది. దానితర్వాత తిఙన్తప్రకరణము గలదు. ధాతువులకు తిఙ్ ప్రత్యయములు చేరునపుడు కలుగుప్రక్రియ యంతయు నందు చెప్పఁబడినది. ఈ శబ్దాధికార తిఙన్తప్రకరణములు రెండును ప్రస్తుత వ్యాఖ్యానమున వ్యాఖ్యానింపఁబడుటలేదు. అవి రెండవభాగముగా కాలాంతరమున గ్రంథరూపమును దాల్పవచ్చును.

క్రియావాచకపదములయొక్క మూలరూపములను ధాతువులందురు. (భూవాదయోధాతవః) వానికి చేరు విభక్తిప్రత్యయములు తిప్, తస్, ఝి మున్నగునవి. వీనికి తిఙులనిపేరు. ధాతువులకు ఈతిఙ్ ప్రత్యయములే కాక మఱికొన్ని ప్రత్యయములు కూడ చేరును. అట్లు చేరువానికి 'కృత్తు'లనిపేరు. వానియొక్క చేరికతో ధాతువు ప్రాతిపదికమగును. అనఁగా కృత్ప్రత్యయములు చేరినవానికి పదత్వసిద్ధికై 'సుప్' ప్రత్యయములు (నామవిభక్తులు) చేర్తురన్నమాట. ఈకృత్ప్రత్యయములలోనే ఒక విభాగమునకు కృత్యప్రత్యయము లనిపేరు. ప్రకృత పరిచ్ఛేదమున నట్టి కృత్యప్రత్యయములు కొన్ని, ధాతువులకు విధింపఁబడుచున్నవి. కృత్యప్రత్యయములకు సంబంధించిన ప్రక్రియకనుకనిది 'కృత్యప్రక్రియ' అనఁబడును. కృత్యప్రత్యయసముదాయము, కృత్ప్రకరణమున అంతర్భాగమే కాన వీనికిని 'కృత్' అను సంజ్ఞ యుండును.

ప్రత్యయమనగా విధింపఁబడునది యనియర్థము. ఒక యర్థవిశేషమును స్ఫురింపఁజేయుచు నామాదులకు చేరు అక్షరము లేక అక్షర సముదాయమును ప్రత్యయ మందురు. అవి స్వతంత్రముగా ప్రయోగింపఁబడవు. వానిచేరికవలన నామము, ధాతువు మున్నగువానికి అర్థవిశేషములు కలుగుచుండును. అష్టాధ్యాయిలో 3,4,5 అధ్యాయములలో వివిధములైన ప్రత్యయములు విదింపఁబడినవి. అందు ధాతువులకు సంబంధించిన ప్రత్యయములు 3 వ అధ్యాయమున చెప్పఁబడినవి.

అవ : ఈ ప్రత్యయములకు సంబంధించిన యొక యధికారసూత్రముతో నీ ప్రకరణము ప్రారంభమగుచున్నది.

సూ : ధాతోః 3-1-91.

వృ : ఆతృతీయాన్తం యే ప్రత్యయాస్తే ధాతోః పరే స్యుః. కృదతిఙితి కృత్సంజ్ఞా.

ప. వి : ధాతోః (5-1).

అను : ప్రత్యయః (1-1) పరః (1-1).

అర్థ : తృతీయాధ్యాయాంతము వఱకు విధింపఁబడిన ప్రత్యయములు ధాతువునకు పరములై వచ్చును 'కృదతిఙ్' అను సూత్రముచే కృత్సంజ్ఞ కలుగును.

వివ : ధాతోః అను పంచమ్యేక వచనాంతరూపము ఇచటినుండి (3-1-91 నుండి) మూఁడవ అధ్యాయము చివఱివఱకు అధికారరూపమున ప్రతిసూత్రము లోనికి చేరి అందలి పదములతోకూడి యాసూత్రముల యర్థమును సమగ్ర మొనరించును. మూడవఅధ్యాయము మొదటిపాదము మొదటిసూత్రము 'ప్రత్యయః' అనునది. అది అయిదవ అధ్యాయము కడవఱకు అధికారము కావున నీ పరిధిలో విధింపఁబడున వన్నియు ప్రత్యయములని తాత్పర్యము. 3-1-92 నుండి 3-4-117 వఱకు విధింపఁబడెడు ప్రత్యయములు ధాతుసంజ్ఞ కలవానికే పరముగ చేరునని యీ యధికారసూత్రముయొక్క తాత్పర్యము. ధాతువులనగా 'భూ' సత్తాయామ్ మున్నగునవి. 'కృదతిఙ్' అనుసూత్రము చొప్పున ధాతువునకు విధింపఁబడు తిఙ్ భిన్నప్రత్యయమునకు కృత్తనిపేరు. కావున నివి కృత్ప్రత్యయములనఁబడును.

గమనిక : ఈ ప్రకరణమునకు పూర్వమునఁగల తిఙన్త ప్రక్రియలో ధాతువులకు ఆయాప్రత్యయములు పరములగునపుడు కలుగు కొన్ని కార్యవిశేషములు చెప్పఁబడినవి. ఆ కార్యము లీప్రకరణమునందును అగుచుండును. అవి యిచట స్థూలముగా వివరింపఁబడుచున్నవి. ఇవి యీప్రకరణమున (కృత్య, కృత్ ప్రకరణముల రెంటను) అనేక సందర్భములలో ప్రసక్తములగును. కావున దీనిని ముందు దృఢము చేసికొనవలయును.

ధాతువులు మూడువిధములు (1) పరస్మైపదులు (2) ఆత్మనేపదులు (3) ఉభయపదులు. ధాతువునకు చేరు ప్రత్యయములలో తఙ్ (త, ఆతామ్, ఝ; థాస్, ఆథామ్, ధ్వమ్; ఇట్, వహి, మహిఙ్) ప్రత్యయములును, శానచ్, కానచ్ అను ప్రత్యయములును ఆత్మనేపద ప్రత్యయములనఁబడును. కాలార్థ స్సూచకములగు లట్, లిట్, లుట్ మున్నగు దశవిధ లకారములకు ఆదేశములగు

తఙ్భిన్న ప్రత్యయములు పరస్మైపదము లనఁబడును. పరస్మైపద ప్రత్యయములు చేరు ధాతువులను పరస్మైపదులనియు, ఆత్మనేపద ప్రత్యయములు చేరు ధాతువులను ఆత్మనేపదులనియు, రెండును జేరువానిని ఉభయపదులనియు వ్యవహరింతును. ఇవి విడివిడిగాఁగలవు.

ధాతువులకు చేరుప్రత్యయములు రెండువిధములుగా వింగడింపఁ బడినవి. (1) సార్వధాతుకములు – తిఙ్ఙులును (తిఙ్ మున్నగు పదునెనిమిది ప్రత్యయములును) శిత్తులును (శవర్ణమిత్తుగాఁగలవియును) సార్వధాతుకములనఁబడును (తిఙ్ శిత్ సార్వధాతుకమ్), (2) ఆర్ధధాతుకములు–సార్వధాతుకములు కాక, ధాతువునకు విధింపఁబడిన ప్రత్యయము లన్నియు ఆర్ధధాతుకములు (ఆర్ధధాతుకం శేషః).

ఈ రెండువిధములైన ప్రత్యయములు పరములగునపుడు ధాతువులందలి యచ్చులకు కొన్నియెడల గుణము, కొన్నియెడల వృద్ధియును విధింపఁబడినవి. ధాతువు చివరనున్న ఇగ్వర్ణములకు సార్వధాతు కార్ధధాతుకములు పరములగునపుడు గుణము వచ్చును (సూ : సార్వధాతుకార్ధధాతుకయోః 7-3-84) ధాతువు హలన్తమైనచో అందు ఉపధాక్షరము (తుదివర్ణమునకు పూర్వముననుండు వర్ణము) లఘు సంజ్ఞగల ఇగ్వర్ణమైనచో దానికిని సార్వధాతుకార్ధధాతుకములు పరములగునపుడు గుణము వచ్చును. (సూ : పుగన్తలఘూపధస్య చ 7-3-84) ఞకారణకారము లిత్తుగాఁగల ప్రత్యయములు పరములగునపుడు ధాతువు తుది అచ్చునకు వృద్ధి వచ్చును (సూ : అచో ఞ్ణితి 7-2-115) అట్లే ఞిత్తుగాని ణిత్తుగాని అయిన ప్రత్యయము పరమగునపుడు ధాతువులోని ఉపధ హ్రస్వ అకారమైనచో దానికి వృద్ధి వచ్చును (సూ : అత ఉపధాయాః 7-2-116) ఈ వృద్ధిసూత్రములు రెండును ధాతువులకు మాత్రమే పరిమితములయినవి కావు. 'అంగము' అనునొక వ్యాకరణ సంజ్ఞకలదు. ఆ సంజ్ఞ కలవాని కన్నింటికిని ఈ వృద్ధి వచ్చును. ఈ ప్రత్యయములు కకారగకార ఙకారములు ఇత్తులుగాఁగలవి యైనచో పైని చెప్పిన గుణవృద్ధులేవియును రావు (సూ : క్ఙితి చ 1-1-5).

గుణము చేయఁదలఁచినపుడు ధాతువు ఇగంతమా, (ఇక్ – ఇ ఉ ఋ ఌ) లఘూపధమా, అను విచారణము చేయవలయును. ఇకారమునకు ఏ, ఉకారమునకు ఓ, ఋకారమునకు అర్, ఌకారమునకు అల్ అనునవి గుణములుగా ఆదేశములగును. పరమున నున్న ప్రత్యయము కిత్తు, గిత్తు, ఙిత్తు గాని యపుడే గుణము వచ్చును. వృద్ధిచేయఁదలఁచినపుడు అంగము (ఉదాహరణముపై వివరింపఁబడును) అజంతమా, హలన్తమా, అనునది పరిశీలింపవలయును. ప్రత్యయముణిత్తా?

క్ఙిత్తా? అనునది చూడవలయును. అజంతమైనచో చివరి అచ్చు అకారమైనచో ఆ. ఇకారమైనచో ఐ, ఉకారమైనచో ఔ, ఋకారమైనచో ఆర్, ౡకారమైనచో ఆల్, ఏకారమైనచో ఐ, ఓకారమైనచో ఔ అనువర్ణములు వృద్ధిరూపమున ఆదేశము లగును, కిత్తు, గిత్తు ఙిత్తుఅయిన ప్రత్యయము పరముగా నున్నచో వృద్ధియు రాకుండుట గుణమువలెనే చూడనగును. ఈ ప్రక్రియ యందంతటను ఈ విషయ ములు మెలఁకువతో సమన్వయించుకొనవలయును.

అవ : ఈ ప్రత్యయములకు సంబంధించిన యొక పరిభాష యిట చెప్పఁబడు చున్నది.

సూ : వాఽసరూపోఽస్త్రియామ్ 3-1-94.

వృ : అస్మిన్ ధాత్వధికారేఽసరూపోఽపవాద ప్రత్యయ ఉత్సర్గస్యబాధకో వా స్యాత్, స్త్ర్యధికారోక్తం వినా.

ప. వి : వా (అవ్య) అసరూపః (1-1) అస్త్రియామ్ (7-1).

అర్థ : ఈ ధాత్వధికారమున సరూపము కాని అపవాద ప్రత్యయము ఉత్సర్గ మునకు విభాషగా బాధకమగును. 'స్త్రియాం క్తిన్' అనునధికారమున మాత్రమిది వర్తింపదు.

వివ : 3-1-91 నుండి 3-4-117 వఱకు ధాత్వధికారమని చెప్పఁబడినది అందనేకప్రత్యయములు ధాతువులకు విధింపఁబడుచున్నవి. సాధారణముగా సామాన్య ముగ విధింపఁబడిన కార్యమును, విశేషముగ విధింపఁబడు కార్యము బాధించును. అనగా సామాన్యకార్యము విశేషకార్యమున్నచోట ప్రవర్తింపదని తాత్పర్యము. ఒక ఉదాహరణము ద్వారమున ఈ యంశమును గమనింతము. అకారమునకు అచ్చుపరమగునపుడు గుణమేకాదేశమగునని 'ఆద్గుణః' అనుసూత్రము చెప్పెను. అకారమునకు ఏచ్చుపరమగునపుడు వృద్ధియగునని 'వృద్ధిరేచి' చెప్పినది. కావున ఏచ్చు పరమగునపుడు వృద్ధిగుణమును బాధించి ప్రవర్తించునుగదా! 'ఆద్గుణః' అనుసూత్రమున 'అచి' అనునది సామాన్యముగా చెప్పఁబడినది. 'వృద్ధిరేచి' అనునది గుణసూత్రమునందలి 'అచి అనుదాని పరిమితిని తగ్గించుటకై విశేషముగా చెప్పఁబడినది. కావున 'ఏచి' అనునది అచి అనుదానిని బాధించును. అనగా ఏచ్చులు పరములగునపుడు గుణము రానేరాదని తాత్పర్యము. సాధారణమైన అపవాదలక్షణమిది. కాని యీ ధాత్వధి కారములో ఈ యపవాదలక్షణమున కాక ప్రత్యేకత యీ పరిభాషచే చెప్పఁబడుచున్నది.

సామాన్య ప్రత్యయముతో అపవాదము ప్రత్యయము సమానమైన రూపము గలది కాని యెడల (అసరూపః) అది సామాన్య ప్రత్యయమును వైకల్పికముగ బాధించును. అనగా విశేషముగా చెప్పఁబడిన ప్రత్యయము వైకల్పికముగ బాధించును. అనగా విశేషముగా చెప్పఁబడిన ప్రత్యయము వైకల్పికముగ వచ్చునని భావము. అది రానిచో సామాన్యప్రత్యయము వచ్చును. ప్రత్యయములలోని ఇత్తులను తొలఁగించినతర్వాతనే సరూపమా? అసరూపమా? అను విషయమును నిర్ణయింపవలయును. ఇత్సంజ్ఞాకృతమైన అసరూపత్వము గ్రాహ్యము కాదు. ఉదా : యత్, ణ్యత్ అను రెండుప్రత్యయములు గలవు. ఇందు మొదటిదాని యందు తకారము, రెండవదానియందు ణకారతకారములు నిత్తులు. ప్రత్యయస్వరూపము రెంటియందును 'య' అనునదియే కావున నీ రెండు ప్రత్యయములు సరూపములుగనే గ్రహింపవలయును.

ఉదాహరణమునకు ధాతువులకు సామాన్యముగా తవ్యత్, తవ్య అనీయర్ అను ప్రత్యయములు విధింపఁబడినవి. వాని కపవాదముగా అజంతధాతువులకు యత్ ప్రత్యయము విధింపఁబడినది ఇది తవ్యత్ మొదలగువానికి సరూపము గాదు. కావున ఇది తవ్యదాదులను వైకల్పికముగా బాధించును. అనగా అజంత ధాతువులకు 'యత్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చునని తాత్పర్యము. రాని యెడల తవ్యదాదులు వచ్చును. ఉదాహరణము ముందు చూడనగును.

సరూపమైనపు డీ స్థితిలేదు. ఉదాహరణమునకు అజంతధాతువులకు 'యత్' ప్రత్యయము విధింపఁబడినది. దాని కపవాదముగా ఋకారాంతధాతువులకు విధింపఁబడిన 'ణ్యత్' ప్రత్యయము యత్తునకు సరూపము. కావున యత్తును ణ్యత్తు నిత్యముగనే బాధించును. అనగా ఋకారాంతధాతువులకు ణ్యత్తే కాని యత్తు రాదని తాత్పర్యము. (ఇత్సంజ్ఞాకృతమైన అసరూపత్వము గ్రాహ్యము కాదని చెప్పఁబడినది)

ఈధాత్వధికారములో 'స్త్రియాం క్తిన్' అనునొకసూత్రము గలదు. అందు 'స్త్రియామ్' అనుపదము అధికారరూపమున కొంతదూరము ప్రసరించును. ఆ య్యధికారములో అసరూపమైన అపవాదప్రత్యయము, సామాన్య ప్రత్యయమునకు నిత్యముగనే బాధకమగుటను ఈ సూత్రమునందలి 'అస్త్రియామ్' అనుపదము తెలుపుచున్నది. ఉదాహరణము ఆ సందర్భమున చూపఁబడును.

ఉత్సర్గమనగా సామాన్యమని యర్థము.

అవ : 'కృదతిఙ్' 3-1-93 అనుసూత్రముచే ధాతువునకు విధింపఁబడిన ప్రత్యయములలో తిఙ్లు (తిప్, తస్ మున్నగు పదునెనిమిదియు) కాక తక్కిన వానికి 'కృత్' అనుసంజ్ఞ చేయఁబడినది. ఆకృత్తులలోనే ఒకహద్దువఱకు గల కొన్ని ప్రత్యయములకు కృత్యసంజ్ఞ కలదని యీ క్రింది సూత్రముచే చెప్పఁబడుచున్నది.

సూ : కృత్యాః 3-1-95.

వృ ; ణ్వుల్తృచావిత్యతః ప్రాక్ కృత్య సంజ్ఞాః స్యుః.

ప. వి : కృత్యాః (1-3).

అను : ధాతోః (5-1) అతిఙ్.

అర్థ : 'ణ్వుల్తృచౌ' అనుసూత్రమువఱకు విధింపఁబడిన ప్రత్యయములు కృత్యసంజ్ఞకలవి యగును.

వివ : 3-1-95 నుండి 3-1-132 వఱకుఁగల సూత్రములచే విధింపఁబడిన ప్రత్యయములకు కృత్యప్రత్యయములను సంజ్ఞ నీసూత్రము విధించుచున్నది. ఇవి కూడ ధాతువునకు విధింపఁబడినతిఙ్భిన్నప్రత్యయములే కనుక కృత్యసంజ్ఞతోపాటు కృత్సంజ్ఞయు వీనికుండును.

అవ : ఈ ప్రత్యయములు ధాతువులకు కర్త్రర్థమునను, కర్మార్థమునను, భావార్థమునను, అట్లే మఱికొన్ని యర్థములందును చేరును. ఏయే ప్రత్యయము లేయే యర్థములందు చేరునో యీ క్రింది రెండుసూత్రములు చెప్పుచున్నవి.

సూ : కర్తరికృత్ 3-4-67.

వృ : ఇతి ప్రాప్తే-

ప. వి : కర్తరి (7-1) కృత్ (1-1).

అర్థ : కృత్ప్రత్యయము కర్త్రర్థమున వచ్చును. అని ప్రాప్తించుచుండగా (క్రింద. అపవాదము చెప్పఁబడుచున్నది).

వివ : ఒక పనిజరిగినదనగా అందు చేయువాఁడు, చేయఁబడినది, చేయుట అను మూఁడంశములుండును. చేయువాఁడు కర్త, చేయఁబడినది కర్మము. చేయుట భావము. ధాతువులకు ప్రత్యయములు ఈ మూఁడింటిలో దేనినైనను దెలుపుచు రావచ్చును. అందు కృత్ప్రత్యయములు కర్త్రర్థమున వచ్చునని యీ సూత్రముచే సామాన్యముగా చెప్పఁబడినది. అనఁగా ధాతువునకు కృత్ప్రత్యయము

చేరగా నేర్పడినరూపము ఆ వ్యాపారము చేసిన కర్తను బోధించునని తాత్పర్యము. ఉదా : కృధాతువునకు 'ణ్వుల్' అను ప్రత్యయము విధింపఁబడినది. 'కారకః' అను రూప పదిచేయుటచే నగును. 'కారకః' అనగా చేయువాఁడు-కర్త.

అవ : ఇట్లు కృత్ప్రత్యయములు కర్త్రర్థమున వచ్చునను పై సూత్రముచే కృత్యప్రత్యయములు కూడ కర్త్రర్థముననే ప్రాప్తించుచుండగా నీక్రింది సూత్ర మట్లుకాదని కృత్యప్రత్యయము లేయర్థమున వచ్చునో తెలుపుచున్నది.

సూ : తయోరేవ కృత్య క్తఖలర్థాః 3-4-70.

వృ : ఏతే భావకర్మణో రేవస్యుః.

ప. వి : తయోః (7-2) ఏవ (అవ్య) కృత్య క్తఖలర్థాః (1-3).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : ధాతువునకు విహితము లైనకృత్యప్రత్యయములును, క్త ప్రత్యయమును, ఖలర్థ ప్రత్యయములును భావకర్మార్థములందే వచ్చును.

వివ : పూర్వసూత్రమున కృత్ప్రత్యయము కర్త్రర్థమున వచ్చునని చెప్పఁబడినది. కృత్ప్రత్యయముచే అగు కృత్యప్రత్యయములును, క్త ప్రత్యయమును, ఖలర్థప్రత్యయములును (కర్త్రర్థమున కాక) భావార్థమునను, కర్మార్థమునను వచ్చునని యీ సూత్రము చెప్పినది. ఇది పై సూత్రమున కపవాదము. కృత్యప్రత్యయము, క్త ప్రత్యయము, ఖలర్థప్రత్యయములును చేరినపదములు ఆధాతువుల యొక్క భావమును లేదా కర్మమును తెలుపును గాని కర్తను తెలుపవని భావము. ఉదాహరణములు ముందు చూడనగును.

ధాతువునకు రెండు అర్థములుండును (1) వ్యాపారము (2) ఫలము. 'వండెను' అనగా వంటచేసెను అనియర్థము. ఇందు చేయుట వ్యాపారము. వంటకము ఫలము. ధాత్వర్థమగు వ్యాపార మెవనియందుండునో వాఁడు / అది కర్త యనఁబడును. ధాత్వర్థమైనఫల మెవనియందు లేక దేనియందుండునో వాడు / అది కర్మమనబడును. వ్యాపారమునే భావమందురు. దేవదత్తుడు వంటకమునువండెను- ఇందు వండుట యనువ్యాపారము చేసిన దేవదత్తుఁడు కర్త. వంటకముగా నగుట అనుఫలమును బొందిన వంటకము కర్మము. వండుట భావము. పై రెండు

సూత్రములలో కృత్ప్రత్యయములు కర్త్రర్థమునను, కృత్య క్త ఖలర్థ ప్రత్యయములు భావకర్మార్థములందును ధాతువులకు చేరునని చెప్పఁబడినది. అనగా నివి అకర్మకధాతువులకు భావార్థమునను సకర్మకధాతువులకు కర్మార్థమునను వచ్చునని తాత్పర్యము. వివరణము ముందుసూత్రమున చూడుఁడు.

అవ : సామాన్య కృత్యప్రత్యయములు మూఁడు క్రింది సూత్రముచే విధింపఁబడుచున్నవి.

సూ : తవ్యత్తవ్యానీయరః 3-1-96.

వృ : ధాతో రేతే స్యుః. ఏధితవ్య మేధనీయం త్వయా. భావే ఔత్సర్గిక మేకవచనం క్లీబత్వంచ. చేతవ్యశ్చయనీయో వాధర్మ స్త్వయా.

ప. వి. తవ్యత్, తవ్య, అనీయరః (1-3).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్యాః 1-3.

అర్థ : ధాతువునకు భావకర్మార్థములందు తవ్యత్, తవ్య, అనీయర్ అను ప్రత్యయము లగును. ఉదా : ఏధితవ్యమేధనీయం త్వయా. భావమున సాధారణ మగు నేకవచనమును నపుంసకమును అయినవి, చేతవ్యః చయనీయో వా ధర్మ స్త్వయా.

వివ : ఈ సూత్రముచే ధాతువునకు తవ్యత్, తవ్య, అనీయర్ అను మూఁడు ప్రత్యయములు విధింపఁబడినవి. ఇవి 'కృత్యాః' అనునధికారములోనివి కావున వీనికి కృత్యప్రత్యయములనిపేరు. కృత్యప్రత్యయములు భావకర్మార్థములలో ధాతువునకు చేరునని 'తయోరేవ కృత్య క్త ఖలర్థాః' అనుసూత్రముచే తెలిసికొంటిమి. తవ్యత్ అనుదానియందలి చివరితకారమునకును, అనీయర్‌లోని రేఫమునకును, 'హలన్త్యమ్' అను సూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును. వానికి 'తస్యలోపః' అనుసూత్రముచే లోపము వచ్చును. అప్పుడు తవ్య (త్), తవ్య అనునవి రెండును ఒకస్వరూపముతోడనేయుండును. ఏర్పడు రూపము కూడ నొక్కటియే. కాని ఉదాత్తాది స్వరనిర్ణయములో వీనికి కొంతభేదము గలదు. ఆ భేదమును తెలుపుటకై రెండు ప్రత్యయములుగా 'తవ్య' అనునది చెప్పఁబడినది.

భావార్థమున నుదాహరణము చూపఁబడుచున్నది. ఏధితవ్యమ్, ఏధనీయం త్వయా. ఇచట 'ఏధ్' అనునది ధాతువు-ఏధవృద్ధౌ వృద్ధిపొందుట అని దీనికర్థము. ఇది అకర్మకధాతువు. కర్మముయొక్క ఆకాంక్షకలుగుటకు వీలున్నధాతువు సకర్మక

మనియు, నట్లు లేనిది అకర్మక మనియు ననఁబడును. 'ధేనిని వృద్ధిపొందుట అను ఆకాంక్షకు తావులేదు కనుక నిది యకర్మకము. దీనికి ఈ ప్రత్యయములు భావార్థమున వచ్చును. ఏధ్ + తవ్య (త్). తవ్య అనునది ఆర్ధధాతుకము. ఆర్ధధాతుకస్యేడ్వలాదేః (7-7-35) అనునొక సూత్రము గలదు. వల్‌వర్ణము ఆదియందుఁగల ఆర్ధధాతుకమునకు ఇడాగమ మగునని సూత్రార్థము. 'వల్' ప్రత్యాహారములో యకారము కాక తక్కిన హల్లులన్నియుఁ గలవు. తవ్య అనునది వలాది ఆర్ధధాతుకము. దానికి ఇడాగమము వచ్చును. 'ఇట్' - ఇందు టకారమిత్తు. టిత్తయిన ఆగమము ఆద్యవయవమగును. (అద్యన్తౌ టకితౌ) కావున ఏధ్ + ఇతవ్య = 'ఏధితవ్య' అగును. 'కృత్తద్ధిత సమాసాశ్చ (1-2-46) అనుసూత్రముచే కృదంతములును, తద్ధితాంతములును, సమాసములును ప్రాతిపదికములగును. కావున దీనికి 'సుప్' ప్రత్యయములు చేరును. ఏధితవ్య+సు-నపుంసకలింగమున 'ఏధితవ్యమ్' అగును. అట్లే ఏధ్ + అనీయ (ర్)=ఏధనీయ + సు='ఏధనీయమ్' అగును. (అనీయర్ ప్రత్యయము 'వలాది' కాదు కావున ఇడాగమ ప్రసక్తిలేదు) భావార్థమున శబ్దము నపుంసకలింగమగుట సాధారణము. భావమున ద్విత్వబహుత్వ ప్రసక్తి యుండదు కనుక నది యేకవచనమే యగును. భావే ఔత్సర్గికమ్— ఇత్యాది వచన మీ యర్థమునే చెప్పును. ఏధితవ్యమ్ త్వయా లేక ఏధనీయం త్వయా అనగా నీవు వృద్ధినొందవలయునని యర్థము.

కర్మార్థమున నుదాహరణము : చేతవ్యః చయనీయోవా ధర్మస్త్వయా - 'చిఞ్' (చయనే)- = కూడఁబెట్టుట అని యీ ధాతువున కర్థము. ఇందు ఞకారమిత్తు (హలన్త్యమ్) 'చి + తవ్య' అనియుండ 'సార్వధాతుకార్ధధాతుకయోః' (7-3-84) అనుసూత్రముచే 'చి'లోని ఇకారమునకు గుణమాదేశమగును (వివరములు గుణనిక అనునంశమున చూడుఁడు) చే + తవ్య = చేతవ్య + సు = చేతవ్యః (సకారమునకు రుత్వము (ససజుషోరుః) దానికి విసర్గము (ఖరవసానయోర్విసర్జనీయః) తవ్యత్, తవ్య అను రెండు ప్రత్యయములలో నేదిచేరినను ఇదేరూపమగును. ఇచట ఆర్ధధాతుకస్యేడ్వలాదేః అనుసూత్రముచే ప్రాప్తమగు ఇడాగమమునకు, ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్ (7-2-10) అనుసూత్రముచే నిషేధము చెప్పఁబడినది. ఏకాచ్చయి, ఉపదేశమున అనుదాత్తమయిన ధాతువునకు పరమైన వలాది ఆర్ధధాతుకమునకు ఇడాగమమురాదు అని సూత్రార్థము. 'చి' ధాతువట్టిది కావున నిచటి తవ్యప్రత్యయమునకు ఇడాగమము రాలేదు, చి+అనీయర్-ఇందు రేఫమిత్తు. ఇకారమునకు గుణము ఏకారము వచ్చును.

(సార్వధాతు కార్ధధాతుకయోః) చే+అనీయ ఏచో౽యవాయావః - అయాదేశము-చయ్ + అనీయ-చయనీయ + సు=చయనీయః. చేతవ్యః చయనీయో వాధర్మ స్త్వయా అనువాక్యమున 'ధర్మః' అనునది కర్మవాచకము. ఈ కృదంతరూపము దానికి విశేషణము. అది పుంలింగమగుటచే నివియును పుంలింగములే యగును. నీచే ధర్మముకూడఁబెట్టబడఁదగినది అని యీ వాక్యమున కర్థము. చిఞ్ ధాతువు సకర్మకమగుటచే ఈ ప్రత్యయములు దానికి కర్మార్థమున వచ్చినవి.

అవ : ఇట్టి ప్రత్యయమే మఱియొకటి యీ క్రింది వార్తికముచే విధింపఁబడుచున్నది.

వా : కేలిమర ఉపసంఖ్యానమ్.

వృ : పచేలిమా మాషా , పక్తవ్యా ఇత్యర్థః. భిదేలిమా సరళాః. భేత్తవ్యాః ఇత్యర్థః. కర్మణి ప్రత్యయః.

వ. వి : కేలిమరః (6 1) ఉపసంఖ్యానమ్.

అర్థము : ధాతువునకు 'కేలిమర్' అను ప్రత్యయము భావకర్మార్థములందు వచ్చును. ఉదా : పచేలిమా మాషాః - పక్తవ్యములని యర్థము. భిదేలిమా సరళాః - భేత్తవ్యములని యర్థము. ఇచట కర్మార్థమున నీ ప్రత్యయము వచ్చినది

వివ : 'కేలిమర్' అను ప్రత్యయము కూడ తవ్యదాదులకు వలె భావకర్మార్థములందు ధాతువునకు పరముగా వచ్చును. ఇందు తొలివర్ణమగు కకారమునకు 'లశక్వతద్ధితే' (=ప్రత్యయాదివర్ణములగు లకారశకారకవర్గములు ఇత్తులగును తద్ధితములందు కావు) అను సూత్రముచే ఇత్సంజ్ఞ వచ్చును. చివరిదగు రేఫమునకు 'హలన్త్యమ్' అనుసూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును. అవి లోపింపగా 'ఏలిమ' అను నది ప్రత్యయస్వరూపము. ఇది కిత్తు కావున ధాతువునందలి ఇక్కునకు గుణము రాదు (క్ఙితిచ).

ఉదా : 'డుపచష్' పాకే. ఇందు 'పచ్' అనునది ధాతువు (డు, ష్ లు ఇత్తులు. అకారముచ్చారణార్థము). పచ్+ఏలిమ = పచేలిమ+జస్=పచేలిమాః మాషాః. మాషములు (మినుములు) వండఁబడఁదగినవి.

అట్లే భిద్ + కేలిమర్ - భిద్ + ఏలిమ - ఈ ప్రత్యయము కిత్తగుటచే గుణమురాదు. భిదేలిమ + జస్ =భిదేలిమాః సరళాః సరళవృక్షములు భేదింపఁబడ

దగినవి. పక్తవ్యాః, భేత్తవ్యాః అనునవి తవ్యత్ ప్రత్యయము చేరిన రూపములు.

అవ : ఈ కృత్యప్రత్యయములు భావకర్మార్థములందే కాక మఱికొన్ని యితరార్థములందును వచ్చుట క్రింది సూత్రము గతి కల్పించుచున్నది.

సూ : కృత్యల్యుటో బహులమ్ 3-3-113.

వృ : శ్లో. క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ.
విధేర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహుళకం వదన్తి.

స్నాత్యనేనేతి స్నానీయం చూర్ణమ్. దీయతేఽస్మైదానీయో విప్రః

ప. వి : కృత్యల్యుటః (1-3) బహులమ్ (2-1).

అను : ధాతోః (5 1).

అర్థ : ధాతువునకు పరముగా కృత్యప్రత్యయములును, ల్యుట్ ప్రత్యయమును బహుళముగా నగును.

కొన్నియెడల ప్రవృత్తియు, కొన్నియెడల అప్రవృత్తియు, కొన్నియెడల విభాషయు, కొన్నియెడల నన్యకార్యము-ఇట్లు విధింపఁబడినకార్యము అనేక విధములుగా నగుటను సమీక్షించి బాహుళకమును నాలుగువిధములు గలదిగా చెప్పుదురు.

ఉదా : దీనిచే స్నానముచేయుదురను నర్థమున 'స్నానీయమ్' (చూర్ణమ్) అగును. ఈతనికొఱకు ఈఁబడుచున్నది అనునర్థమున 'దానీయః' (విప్రః) అగును.

వివ : ఈ సూత్రము, కృత్యప్రత్యయములును, 'ల్యుట్' అనునొక కృత్ప్రత్యయమును ధాతువునకు బహుళముగా నగుటను జెప్పుచున్నది. విధింపఁబడిన కార్యము కొన్నిలక్ష్యములలో నిత్యముగా ప్రవర్తించుట, కొన్నియెడల అసలు ప్రవర్తింపకపోవుట, కొన్నియెడల ప్రవర్తించుటయు ప్రవర్తింపకుండుటయు రెండును సంభవించుట, కొన్నియెడల విధింపని కార్యవిశేషములు కూడ కలుగుట-అని యిట్లు నాలుగుపద్ధతులను దెలుపవలసినపుడు బహుళమను పదమును వాడుదురు. ఈ కృత్యప్రత్యయములకును, ల్యుట్ ప్రత్యయమునకు అట్టి స్థితి కలదని యీ సూత్రము చెప్పినది.

కృత్యప్రత్యయములు 'తయోరేవ కృత్యక్తఖలర్థాః' అను సూత్రముచే భావకర్మార్థములందే రావలయున్నది. కాని కరణాద్యర్థములలో కూడనవి వచ్చు

చున్నవి. అట్లు వచ్చుటకు విధానము లేదు. ఈ బహుళ గ్రహణము వలన అన్యకార్యముగా ఆయర్థములలో నీ ప్రత్యయములు వచ్చుటకు గతి కల్పింపఁబడినది

ఉదా : స్నాత్య నేనేతి స్నానీయం చూర్ణమ్. ఇచట స్నాధాతువునకు అనీయర్ ప్రత్యయము చేరినది. 'స్నానీయమ్' అనునది యిచట కర్మమును గాని భావమును గాని తెలుపుటలేదు. కరణమును తెలుపుచున్నది. కరణమనగా క్రియ నెరవేఱుటలో ముఖ్యమైన సాధనము. స్నానము చేయుటకు వలసిన ముఖ్యసాధనముగా ఇట చూర్ణము-నలుగుఁబిండి 'స్నానీయ'పదముచే చెప్పఁబడినది. కావున నిది కరణార్థమున వచ్చిన ప్రత్యయము.

స్నా + అనీయర్-రేఫమిత్తు. సవర్ణదీర్ఘసంధి. స్నానీయ + సు=నపుంసక లింగమున 'స్నానీయమ్' అయినది. (విశేషణములు విశేష్యములను బట్టి లింగ విభక్తి వచనములను బొందును. కావున చూర్ణశబ్దము (విశేష్యము) నపుంసకమగుటచే 'స్నానీయమ్' అనునదియు నపుంసకమయినది.

దీయతేఅస్మై-దానీయో విప్రః - 'డుదాఞ్' దానే అనుధాతువునకు ఇచట సంప్రదానార్థమున కృత్యప్రత్యయమగు 'అనీయర్' వచ్చినది. ధాతువున డు, ఞ్ అనునవి యిత్తులు. దా + అనీయ-సవర్ణదీర్ఘసంధి దానీయ + సు = రుత్వ విసర్గములు - దానీయః విప్రః అను పుంలింగమునకు విశేషణము. సంప్రదానమనగా ఎవనినుద్దేశించి త్యాగముచేయఁబడునో యావ్యక్తి.

సూ : అచో యత్ 3-1-97,

వృ : అజన్తా ద్ధాతోః యత్స్యాత్. చేయమ్'

ప. వి : అచః (5-1) యత్ (1-1),

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్యాః 1-3.

అర్థ : అజంతమైన ధాతువునకు యత్ప్రత్యయము వచ్చును. ఉదా : చేయమ్.

వివ : అచః అనుపదము 'ధాతోః' అనుదానికి విశేషణము. విశేషణము తదంతమునకు సంజ్ఞయగును కావున 'అజంతమైన ధాతువునకు పరముగా' అను నర్థము వచ్చును. అట్టిధాతువునకు 'యత్' అను ప్రత్యయము వచ్చును. ఇది కృత్యప్రత్యయమగుటచే భావకర్మార్థములందు వచ్చును.

ఉదా : చి (ఞ్) (చయనే) అనుధాతువు అజంతము. దీనికి 'యత్' ప్రత్యయము రాగా చి + యత్ అనియుండును. ఇందు తకారము 'హలన్త్యమ్'

అనుసూత్రముచే ఇత్తు యి లోపించును (తస్యలోపః). 'చి+య' 'సార్వధాతు కార్ధధాతుకయోః' అనుసూత్రముచే ధాతువు తుది ఇగ్వర్ణమునకు గుణము ఏకారము రాగా చేయ అగును. అది ప్రథమైక వచనమున 'చేయమ్' అగును (నపుంసకము) (కూడఁబెట్టఁబడఁదగినది).

ఇది తవ్యత్, తవ్య, అనీయర్ ప్రత్యయములతో సమానరూపము కలది కాదు. వానికి అపవాదముగా చెప్పఁబడిన ప్రత్యయము. 'వాసరూపోఽస్త్రియామ్' అను పరిభాషచే నిది వానిని వైకల్పికముగా బాధించును. అనగా అజంత ధాతువులకు 'అచ్' ప్రత్యయముతోపాటు తవ్యదాదులు కూడ రావచ్చునని భావము. చేతవ్యమ్, చయనీయమ్ అనురూపములు కూడ నుండును.

అవ : ఈ ప్రత్యయము పరమగునపుడు ఆకారాంతధాతువుల కొకకార్య మీక్రింది సూత్రముచే నగును.

సూ : ఈద్యతి 6–4–45.

వృ : యతిపరే ఆతఈత్స్యాత్. దేయమ్. గ్లేయమ్.

ప వి : ఈత్ (1–1) యతి (7–1).

అను : ఆతః (6–1).

అర్థ : యత్ ప్రత్యయము పరమగునపుడు ఆకారమునకు ఈకారము వచ్చును. ఉదా : దేయమ్, గ్లేయమ్.

వివ : 'అచోయత్' అనుసూత్రముచే ఆకారాంతధాతువులకును యత్ ప్రత్యయము వచ్చును. అది పరమగునపుడు పూర్వమున ధాతువునంతమున నున్న ఆకారస్థానమున ఈకారము వచ్చును.

ఉదా : దా+యత్. ఇచట ఆకారము పోయి ఈకారము రాగా 'దీ + య' అగును. 'గ్లై' (హర్షక్షయే) అనుధాతువునకు శిద్భిన్నప్రత్యయము పరమగునపుడు ఆకారమాదేశమగును (ఆదేచ ఉపదేశేఽశితి 6–1–45) గ్లా + యత్ - గ్లీ + య. ఈ రెంటియందును ఈకారమునకు గుణమాదేశమగును. (సార్వధాతుకార్ధధాతుకయోః) దేయ + సు = దేయమ్, గ్లేయ + సు = గ్లేయమ్.

అవ : ఈయత్ ప్రత్యయము కొన్నిహలంతధాతువులకును అగునని క్రింది సూత్రము చెప్పుచున్నది.

సూ : పోరదుపధాత్ 3-1-98.

వృ : పవర్గాన్తా దదుపధాద్యత్ స్యాత్. ణ్యతోఽపవాదః శప్యమ్, లభ్యమ్.

ప. వి ; పోః (5-1) అదుపధాత్ (5-1).

అను : ధాతోః (5-1) యత్ (1-1) ప్రత్యయః (1-1) కృత్యాః (1-3).

అర్థ : పవర్గాంతమై, అదుపధమైన ధాతువునకు యత్ ప్రత్యయము వచ్చును. ఇది ణ్యత్ప్రత్యయమున కపవాదము. ఉదా : శప్యమ్, లభ్యమ్.

వివ : 'పు' అనునది ఉదిత్తు. అణుదిత్సూత్రముచే నిది తనసవర్ణములను గ్రహించును కాన పవర్గమని యర్థము. దాని పంచమ్యంతరూపము 'పోః' అనునది. అదిధాతోః అనుదానికి విశేషణము. అదుపధాత్ అనగా హ్రస్వ అవర్ణము ఉపధగా కలదానికి అనియర్థము. అత్ – తపరకరణము. ఉపధయనగా తుదివర్ణమునకు పూర్వమున నున్నవర్ణము. అదుపధాత్ అనునదియు ధాతోః అనుదానికి విశేషణము. కావున పవర్గాంతమైనదియు, హ్రస్వఅకారము ఉపధగాఁ గలదియు నగు ధాతువునకు భావకర్మార్థములయందు 'యత్' ప్రత్యయము వచ్చును. ముందు 'ఋహలోర్ణ్యత్' అనునొక సూత్రముచే హలన్తధాతువులకు ణ్యత్ప్రత్యయము విధింపఁబడుచున్నది. దానికిది అపవాదము. అనగా అదుపధములైన పవర్గాంతధాతువులు హలన్తములే యైనను ణ్యత్ప్రయము రాక యత్ ప్రత్యయము వచ్చునని తాత్పర్యము.

ఉదా : 'శప్' ధాతువు పవర్గాంతము. దీనియందలి ఉపధాక్షరము హ్రస్వ అకారము. కావున యత్ ప్రత్యయము వచ్చును. శప్ + యత్ తకార మిత్తు. శప్య + సు=శప్యమ్ (నపుంసకలింగము). ప్రాతిపదికార్థమున ప్రథమావిభక్తి వచ్చినది. (శపింపఁబడఁదగినది).

'లభ్' – ఇదియు పవర్గాంతమైన, అకారోపధమైనధాతువు. యత్ ప్రత్యయము రాఁగా లభ్ + య=లభ్య+సు = లభ్యమ్ అగును. (పొందఁబడఁదగినది) (ణ్యత్ప్రత్యయము వచ్చినచో ఉపధావృద్ధి రావలసియుండును).

సూ : ఏతిస్తు శాస్వృదృజుషః క్యప్ 3-1-109.

వృ : ఏభ్యః క్యప్.

ప. వి : ఏతి స్తు శాస్ వృ దృ జుషః (5-1) క్యప్ (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్యాః (1-3).

అర్థ : ఇ, స్తు, శాస్, వృ, దృ, జుష్ అనుధాతువులకు క్యప్ ప్రత్యయము వచ్చును.

వివ : ధాతువును సూత్రాదులలో పేర్కొనునపుడు ఇగ్వర్ణములనుగాని 'శ్తిప్' అను ప్రత్యయము గాని చేర్చి పేర్కొందురు (ఇక్ శ్తిపౌధాతునిర్దేశే) 'ఏతి' అనునది శ్తిప్ ప్రత్యయము చేర్పఁబడినరూపము. ఇణ్ధాతువని దాని కర్థము. ఇణ్, స్తు ధాతువులు అజంతములు కాన 'అచోయత్' అనుసూత్రముచే 'యత్' ప్రత్యయము ప్రాప్తించుచుండఁగా అపవాదముగా వానికి 'క్యప్' ప్రత్యయము విధింపఁబడినది. వృ, దృ అనునవి ఋకారాంతములు. జుష్ ధాతువు హలంతము. వీనికి వక్ష్యమాణమగు 'ఋహలోర్ణ్యత్' అనుసూత్రముచే ణ్యత్ ప్రత్యయము ప్రాప్తమగుచుండగా నపవాదముగా 'క్యప్' ప్రత్యయము విధింపఁబడినది. ఇందు కకారపవర్ణము లిత్తులు. ప్రత్యయము-య ఇది యత్, ణ్యత్ ప్రత్యయములకు సరూపమైనది కనుక వానిని నిత్యముగనే బాధించును. అనగా నీ ధాతువులకు యత్ణ్యత్తులు రావని భావము. ఉదాహరణములు ముందు సూత్రమున చూపఁబడుచున్నవి.

అవ : ఈ ప్రత్యయము పరమగునపుడు కొన్నియెడల తుగాగము వచ్చుట చెప్పఁబడుచున్నది.

సూ : హ్రస్వస్య పితి కృతి తుక్ 6-1-71.

వృ : ఇత్యః, స్తుత్యః.

ప. వి : హ్రస్వస్య (6-1) పితి (7-1) కృతి (7-1) తుక్ (1-1).

అర్థ : హ్రస్వమునకు, పవర్ణమిత్తుగాఁగల కృత్తుపరమగునపుడు తుగాగమము వచ్చును. ఉదా : ఇత్యః, స్తుత్యః.

వివ : కృత్తుపరమగునపుడనుటచే, కృత్తులు ధాతువునకే చేరును గావున 'ధాతువునకు' అనునది సందర్భమువలన సిద్ధించును. 'హ్రస్వస్య' అనునదిదానికి విశేషణమై 'హ్రస్వాంతమైన ధాతువునకు' అనునర్థము లభించును. 'పిత్' అనగా పవర్ణమిత్తుగాఁగలది. ప్ ఇత్ యస్యసః = పిత్. పితి యనునది కృతి యను వానికి విశేషణము సప్తమ్యంతమగుటచే 'తస్మిన్నితి నిర్దిష్టే' అను పరిభాష చొప్పున 'పవర్ణమిత్తుగాగల కృత్ప్రత్యయము పరమగునపుడు' అనునర్థము వచ్చును. ఇట్లు పవర్ణమిత్తుగా గల కృత్ప్రత్యయము పరమగునపుడు హ్రస్వము అంతమునఁగల ధాతువులకు తుగాగమము వచ్చును. ఇందు కకారమిత్తు. ఉకార ముచ్చారణార్థము. ఆగమముగా వచ్చునది 'త్' అనునది.ఇది కిత్తగుటచే ఆద్యన్తౌ కితౌ అను పరిభాష చొప్పున ధాతువుయొక్క తుదినిజేరి దానియవయవమగును.

ఉదా : ఇ (ఇణ్) + క్యప్ - ఇ + య - ఇచట 'య' ప్రత్యయము పిత్తయిన కృత్తు. ఇధాతువు హ్రస్వాంతము. కావున తుగాగమము రాఁగా ఇత్+య=ఇత్య + సు=ఇత్యః (పుంలింగము). (పోఁదగినది).

స్తు + క్యప్ - స్తు + య - స్తుత్ + య-స్తుత్య+సు=స్తుత్యః (పుం) (స్తుతింపఁదగినవాఁడు).

అవ : 'శాస్' ధాతువునకు క్యప్ ప్రత్యయము పరమగునపుడు అగు కార్య విశేషము నీక్రిందిసూత్రము విధించుచున్నది.

సూ : శాస ఇదఙ్ హలోః 6-4-34.

వృ : శాస ఉపధాయా ఇత్స్యాదఙి హలాదౌ క్ఙితిచ. శిష్యః.

ప వి : శాసః (6-1) ఇత్ (1-1) అఙ్ హలోః (7-2).

అను : ఉపధాయాః (6-1) క్ఙితి (7-1).

అర్థ : 'శాస్' ధాతువుయొక్క ఉపధకు 'అఙ్' అనునదిగాని హలాదులగు కిత్తు, ఙిత్తులుగాని పరములగునపుడు హ్రస్వఇవర్ణ మాదేశమగును. ఉదా : శిష్యః.

వివ : 'శాస్' ధాతువులోని ఉపధకు హ్రస్వఇకారము (ఇత్) ఈ సూత్రముచే విధింపఁబడుచున్నది. ఇందు ఉపధాక్షరము ఆకారము. ఆ ధాతువునకు 'అఙ్' అనునదిగాని, హలాదియై కిత్తు, గిత్తులేక ఙిత్తు అయిన ప్రత్యయము పరమగునపుడు, ధాతువునందలి ఉపధయగు ఆకారమునకు హ్రస్వ ఇకారము ఆదేశమగును.

ఉదా : శాస్ ('శాసు' అనుశిష్టౌ) + క్యప్ - య-ఇందు తొలివర్ణము హల్లు మఱియు నిందు కకారమిత్తు. ఇది పరమగుటచే ధాతువులోని ఆకారము స్థానమున ఇత్త్వము వచ్చును. శ్, అ, స్ + య-శ్, ఇ, స్+య=శిస్+య, అనియుండ 'శాసివసి ఘసీనాంచ' 3-3-60 (ఇణ్వర్గమునకు కవర్గమునకు పరమున నున్న శాస్, వస్, ఘస్ధాతువుల సకారమునకు షకారమాదేశమగును) అనుసూత్రముచే సకారమునకు షకారమాదేశము కాఁగా శిష్+య=శిష్య + సు = శిష్యః (పుం) అగును. (శాసింపఁబడువాఁడు).

అవ : ఏతిస్త్యాది సూత్రమునందలి తక్కిన ధాతువుల కుదాహరణములు చూపఁబడుచున్నవి.

వృ : వృత్యః, ఆదృత్యః, జుష్యః.

వివ : వృ (ఞ్) అనుధాతువునకు క్యప్ ప్రత్యయము చేరును. వృ + క్యప్ - వృ + య - తుగాగమము (హ్రస్వస్య పితికృతితుక్) వృత్ + య= వృత్య + సు=వృత్యః (పుం).

ఆఙ్ పూర్వక దృధాతువు. (దృఙ్ ఆదరే) ఆదృ(ఙ్)+క్యప్ ఆదృ+య, తుగాగమము ఆదృత్ + య+ఆదృత్య + సు=ఆదృత్యః (పుం).

జుషీ ప్రీతిసేవనయోః. జుష్+ క్యప్-జుష్ + య= జుష్య + సు=జుష్యః, ఈజుష్ధాతువులఘూపధము. పుగన్తలఘూపధస్య' అనుసూత్రముచే ఇందలి ఉకారము నకు గుణము ప్రాప్తమగును. కాని ప్రత్యయము కిత్తగుటచే 'క్ఙితిచ' అను నిషేధము ప్రవర్తించును. (ఇది హలంతమగుటచే తుగాగమ ప్రసక్తి లేదు).

అవ : క్యప్ ప్రత్యయము మృజ్ ధాతువునకు వైకల్పికముగా విధింపఁబడు చున్నది.

సూ : మృజే ర్విభాషా 3-1-113.

వృ : మృజేః క్యబ్వా. మృజ్యః.

ప. వి : మృజేః (5-1) విభాషా (1-1).

అను : ధాతోః (5-1) క్యప్ (1-1) ప్రత్యయః (1-1) కృత్యాః (1-3).

అర్థ : మృజ్ దాతువునకు క్యప్రత్యయము విభాషనగును. ఉదా : మృజ్యః.

వివ : 'మృజూ' శుద్ధౌ అనుధాతువునకు 'ఋహలోర్ణ్యత్' అను వక్ష్యమాణ సూత్రముచే నిత్యముగా 'ణ్యత్' ప్రత్యయము వచ్చుచుండగా పాక్షికముగా క్యప్ ప్రత్యయమీసూత్రముచే విధింపఁబడుచున్నది.

ఉదా : మృజ్ + క్యప్ - మృజ్+య. ప్రత్యయము కిత్తగుటచే ధాతువు లోని ఋకారమునకు గుణమురాదు మృజ్య+సు=మృజ్యః (పుం).

అవ : క్యప్ ప్రత్యయము రానిచో నగుప్రత్యయము చెప్పఁబడుచున్నది.

సూ : ఋ హలోర్ణ్యత్ 3-1-124.

వృ : ఋ వర్ణాన్తాద్ధలన్తాచ్చ ధాతోః ణ్యత్. కార్యమ్ హార్యమ్, ధార్యమ్.

ప. వి : ఋ హలోః (6-2) ణ్యత్ (1-1),

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్యాః (1-3).

అర్థ : ఋ వర్ణాంతధాతువునకును, హలంతధాతువునకును ణ్యత్ ప్రత్యయము వచ్చును. ఉదా : కార్యమ్, హార్యమ్, ధార్యమ్.

వివ : మృజ్ ధాతువునకు కార్యవిశేషము ముందు చెప్పఁబడుచున్నది. కావున దానియుదాహరణ మందు ప్రదర్శింపఁబడును. ధాతువు ఋకారాంతముకాని హలంతము కాని యయినచో నట్టిదానికి పరముగా 'ణ్యత్' అను కృత్యప్రత్యయము వచ్చును. ఈ సూత్రమునందలి 'ఋహలోః' అను షష్ఠ్యంతపదమును పంచమ్యంతముగా మార్చుకొనిదానిని 'ధాతోః' అనుదానికి విశేషణము చేయుటచే నీయర్థము లభ్యమైనది. ఇందు ణకారమునకు చుటూ (1-3-7) (ప్రత్యయము యొక్క ఆది వర్ణములగు చ వర్గ ట వర్గాక్షములు ఇత్తులగును) అను సూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును. తకారము 'హలన్త్యమ్' అను సూత్రమునకు లక్ష్యమగును, కావున నవి లోపింపగా 'య' అనునది మిగులును. ణిత్తగుటచే ఇది పరమగునపుడు ధాతువునంతమున నున్న అచ్చునకును, (అచోఞ్ణితి)ధాతువులోని ఉపధాభూతమైన హ్రస్వ అకారమునకును (అత ఉపధాయాః) వృద్ధి వచ్చును. (ప్రకరణారంభమున చెప్పఁబడిన 'గమనిక' అనునంశమును జూడుఁడు).

ఋకారాంత ధాతువులుదాహరింపఁబడుచున్నవి.

(1) 'డు కృఞ్' కరణే - ఇందు డు, ఞ్‌లు ఇత్తులు, 'కృ' ఇది ఋకారాంతధాతువు. అచోయత్ అనుసూత్రముచే యత్ ప్రత్యయము ప్రాప్తమగుచుండగా నపవాదముగా ణ్యత్ప్రత్యయము ఇట చెప్పఁబడినది. ఇది సరూప ప్రత్యయము కావున నిత్యముగా దానిని బాధించును. (చూ వాస రూపోఽస్త్రియామ్). కృ + ణ్యత్. - కృ + య. 'అచోఞ్ణితి' అను సూత్రముచే ఋకారమునకు వృద్ధివచ్చును. ఇచట వృద్ధియగు ఆకారము 'ఉరణ్ రపరః' అను పరిభాషచే రపరముగా వచ్చును. వృద్ధిగా ఆదేశమగునది 'ఆర్' అనునది. క్ ఋ+య-క్, ఆర్+య=కార్య+సు=కార్యమ్ (నపుం).

'హృఞ్' హరణే - హృ+ణ్యత్-హృ+య-వృద్ధి,హార్ + య-హార్య + సు=హార్యమ్ (నపుం).

ధృఞ్ - ధృ + ణ్యత్-ధృ+య, ధార్+య=ధార్య + సు=ధార్యమ్ (నపుం).

అవ : కొన్ని హలంత ధాతువుల కీణ్యత్ప్రత్యయయోగమున నగుకార్యవిశేషమొకటి యీ సూత్రముచే విధింపఁబడుచున్నది.

సూ : చజోః కుఘిణ్ణ్యతోః 7-3-72.

వృ : చజోః కుత్వం స్యాత్ ఘితి ణ్యతి చ.

ప. వి : చజోః (6-2) కు (ప్రథమావిభక్తిలోపించిన పదము) ఘిణ్ణ్యతోః (7-2).

అర్థ : ఘిత్తుగాని ణ్యత్తుగాని పరమగునపుడు చకారజకారములకు కుత్వ మగును.

వివ : ఘిత్తనగా ఘకారమిత్తుగాఁగలది. 'ణ్యత్' అనునది పైని విధింపఁబడిన ప్రత్యయము. ఇవి పరములగునపుడు పూర్వమున మన్న చకారజకారములకు కుత్వము (కవర్గాక్షరమాదేశమగుట) అగును. ఇందు చ జ లకును, ఘిత్తు ణ్యత్తులకును యథాసంఖ్య నియమములేదు. కావున చకారమునకు ఘిత్తుణ్యత్తులు పరమగునపుడు, జకారమునకు ఘిత్తుణ్యత్తులు పరములగునపుడు అనునర్థమును గ్రహింపవలయును. ఇచట అంతరతమ్యమునుబట్టి చకారస్థానమున కకారము జకారస్థానమున గకారము నగును.

ఉదా : మృజ్ ధాతువునకు మృజేర్విభాషా అను సూత్రముచే క్యప్ ప్రత్యయము రానిపక్షమున 'ఋహలోర్ణ్యత్' అను సూత్రముచే ణ్యత్ ప్రత్యయము అగును. మృజ్+ణ్యత్ - ఇచట ణ్యత్ ప్రత్యయము పరమైనది కావున జకారమునకు కుత్వము రాగా మృగ్ + ణ్యత్ అనియుండును. ఘిత్తుపరమగునపుడు కుత్వమున కుదాహరణము సందర్భమునననుసరించి చెప్పఁబడును.

అవ : మృజ్ ధాతువులోని ఋకారమునకు వృద్ధి ఆదేశమగుట విధింపఁబడుచున్నది.

సూ : మృజే ర్వృద్ధిః 7-2-114.

వృ : మృజేరికో వృద్ధి స్సార్వధాతుకార్ధధాతుకయోః. మార్గ్యః.

ప. వి : మృజేః (6-1) వృద్ధిః (1-1).

అను : సార్వధాతుకార్ధధాతుకయోః (7-2).

అర్థ : సార్వధాతుకార్ధధాతుకములు పరములగునపుడు మృజ్ ధాతువుయొక్క ఇక్కునకు వృద్ధియగును. ఉదా : మార్గ్యః.

వివ : ఈ వ్యాకరణమున నెందైన స్థానియగు వర్ణమును పేర్కొనక గుణముగాని వృద్ధిగాని గుణవృద్ధిశబ్దములచే విధింపఁబడునపుడు అవి ఇగ్వర్ణములకగు

వని 'ఇకో గుణవృద్ధీ' (1-1-3) అనుపరిభాష చెప్పును. కావున నిచట సార్వ ధాతుకార్ధధాతుకములు పరములగునపుడు మృజ్‌ధాతువునకు విధింపఁబడిన వృద్ధి, యందలి ఇగ్వర్ణమగు ఋకారమునకు వచ్చును. ఋకారస్థానమున వచ్చు వృద్ధ్యక్షర మగు ఆకారమురపరమై వచ్చును. (ఉరణ్ రపరః). ధాతువులకు విధింపఁబడెడు తిఙ్ ప్రత్యయములును, శవర్ణమిత్తుగాఁగల ప్రత్యయములును సార్వధాతుకములనఁ బడును. తక్కినవి యార్ధధాతుకములు, ణ్యత్ప్రత్యయము ఆర్ధధాతుకము.

ఉదా : మృజ్‌ధాతువునకు 'ఋహలోర్ణ్యత్' అనుసూత్రముచే ణ్యత్ప్రత్యయము. అందు ణకారతకారము లిత్తులు. దానిజకారమునకు పూర్వసూత్రముచే కుత్వము విధింపఁబడినది, 'మృగ్+య' అనియుండ ప్రకృతసూత్రముచే వృద్ధిరాగా మ్ ఋ గ్+య=మ్ ఆర్‌గ్+య మార్గ్య+సు=మార్గ్యః అగును. (శుద్ధిచేయఁబడఁ దగినది).

అవ : 'చజోః కుఘిణ్ణ్యతోః' అనుసూత్రముచే విధింపఁబడిన కుత్వమున కొకయెడ నపవాదము చెప్పఁబడుచున్నది.

సూ : భోజ్యం భక్ష్యే 7-3-69.

వృ : భోగ్యమన్యత్.

ప. వి : భోజ్యమ్ (1-1) భక్ష్యే (7-1).

అర్థ : భక్ష్యము అనునర్థమున 'భోజ్యమ్' అగును. ఇతరార్థమున భోగ్యమ్ అగును.

వివ : 'భుజ్' ధాతువుహలన్తము. దీనికి 'ఋహలోర్ణ్యత్' అనుసూత్రముచే ణ్యత్ప్రత్యయము వచ్చును. అదిపరమగునపుడు 'చజోఃకుఘిణ్ణ్యతోః' అనుసూత్రముచే నిందలి జకారమునకు గకారము రావలసియున్నది. ఈ ప్రత్యయము చేరిన రూపము భక్ష్యము (తినఁబడునది) అనుర్థము నిచ్చునదియైనయెడల కుత్వమురాదని యీ సూత్రము చెప్పుచున్నది.

భుజ్ + ణ్యత్-భుజ్+య- 'పుగంతలఘూపధస్యచ' అను సూత్రముచే ధాతువునందలి ఉపధయగు ఉకారమునకు గుణము వచ్చును. భోజ్ + య = భోజ్య+సు=భోజ్యమ్ (నపుం)

భక్ష్యము అని కాక యితరమైన అర్థమున ఈ కుత్వనిషేధములేదు. ఉదా : భుజ్ + ణ్యత్-భుగ్ + య-భోగ్ + య=భోగ్య + సు + భోగ్యమ్ అనుభవింపఁదగినది యని యర్థము.

## ఇది కృత్యప్రక్రియ.

## ప్రకరణావలోకనము.

ధాతువులకు భావకర్మార్థములందు చేరు ప్రత్యయములు కొన్ని యిందు చెప్పఁబడినవి. కర్తరికృత్, తయోరేవకృత్యక్తఖలర్థాః అనుసూత్రములును, కృత్యల్యుటో బహుళమ్ అనుసూత్రమును ఏయే యర్థములలో ఈ ప్రత్యయములు వచ్చునో తెలిపినవి తవ్యత్. తవ్య, అనీయర్ అనుమూడు ప్రత్యయములు సామాన్యముగ సర్వధాతువులకు విధింపఁబడినవి. యత్, క్యప్, ణ్యత్ అను ప్రత్యయములు విశేషముగ కొన్నికొన్నిధాతువులకు మాత్రము విధింపఁబడినవి. ఈ ద్యతి, హ్రస్వస్య పితి కృతితుక్, శాసఇదఙ్ హలోః, చజోః కుఘిణ్ణ్యతోః, మృజేర్వృద్ధిః భోజ్యంభక్ష్యే అను సూత్రములు పై ప్రత్యయములు పరములగు నపుడు కలుగు కార్యవిశేషములను దెలిపినది. 'వాసరూపోఽస్త్రియామ్' అనునొక పరిభాష యిందు ప్రసక్తమైనది, ధాతోః, కృత్యాః అనునవి అధికార సూత్రములు.

# అథ కృదన్త ప్రకరణమ్

అవ : కృత్ప్రకరణములో అవాంతరవిభాగమైన కృత్యప్రత్యయ ప్రక్రియ చెప్పఁబడినది. 3-1-133 నుండి అధ్యాయము తుదివఱకు విధింపఁబడిన ప్రత్యయములలో తిజ్భిన్నములు కృత్తులనఁబడును. అవి యిందు వివరింపఁబడుటచే ఈ ప్రకరణమునకు కృదంతప్రకరణమనిపేరు. గుణము, వృద్ధి, వాని నిషేధము మున్నగు నంశములు పూర్వ ప్రకరణప్రారంభమున గమనికలో వ్రాయఁబడినవి యిందును వర్తించును. అసరూపమైన అపవాద ప్రత్యయము సామాన్యప్రత్యయమునకు వైకల్పికముగా బాధకమగుట యిందును అగును.

సూ : ణ్వుల్ తృచౌ 3-1-133.

వృ : ధాతో రేతౌ స్తః. కర్తరి కృదితి కర్త్రర్థే.

ప. వి : ణ్వుల్‌తృచౌ (1-2).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : ధాతువునకు ణ్వుల్‌తృచ్ అనుప్రత్యయములు వచ్చును. 'కర్తరి కృత్' అను సూత్రముచే నివి కర్త్రర్థమున వచ్చును.

వివ : కృత్యప్రత్యయములు భావకర్మార్థములందు వచ్చును. ఈకృత్ ప్రత్యయములు కర్త్రర్థమున వచ్చును. అనగా నివి చేరినరూపములు కర్తను— ఆ వ్యాపారము చేసిన వ్యక్తిని - బోధించును. తవ్యత్, తవ్య, అనీయర్ అను ప్రత్యయములవలె నన్నిధాతువులకును సామాన్యముగా ణ్వుల్, తృచ్ అను ప్రత్యయము లీసూత్రముచే విధింపఁబడినవి. ణ్వుల్, ప్రత్యయమున ణకారమునకు 'చుటూ' అను సూత్రముచే ఇత్సంజ్ఞకలుగును. అందలి లకారమునకును, తృచ్ ప్రత్యయము నందలి చకారమునకును, 'హలన్త్యమ్' అనుసూత్రముచే ఇత్సంజ్ఞ. వానికి 'తస్యలోపః' అను సూత్రముచే లోపము వచ్చును.

'డుకృఞ్' కరణే అనుధాతువున డు, ఞ్ లు ఇత్తులు. కృ అనుదానికి ణ్వుల్ ప్రత్యయము చేరి కృ + ణ్వుల్-'క్ర వు' అని యుండును.

అవ : పై స్థితిలో నగు కార్యవిశేషము నీక్రిందిసూత్రము విధించుచున్నది.

సూ : యువో రనాకౌ 7-1-1.

వృ : యు వు ఏతయో రనాకౌ స్తః. కారకః, కర్తా.

ప. వి : యువోః (6–2) అనాకౌ (1-2).

అర్థ : యు, వు అను ప్రత్యయములకు క్రమముగా, అన, అకఅను ఆదేశములు వచ్చును. ఉదా : కారకః.

వివ : 'యు' అను స్వరూపముతో నున్న ప్రత్యయమునకు 'అనః అను ఆదేశమును, 'వు' అను స్వరూపముతో నున్న ప్రత్యయమునకు 'అక' అను ఆదేశమును వచ్చును. ఈ యాదేశములు అనేకవర్ణములు కలవి యగుటచే 'అనేకాల్ శిత్ సర్వస్య' అను పరిభాషచే యువులను మొత్తముగా తొలగించి వచ్చును.

ఉదా : కృ + వు కృ + అక – ఇది ణిత్తయిన ప్రత్యయమగుటచే (ణ్వుల్) 'అచోఞ్ణితి' అను సూత్రముచే ధాతువుయొక్క అచ్చునకు వృద్ధి వచ్చును. ఇచట రాఁగల వృద్ధ్యక్షరము ఆకారము రపరమై వచ్చును. క్, ఋ + అక – క్ ఆర్ + అక = కారక + సు = కారకః (పుం) చేయునది, చేయువాఁడు అని యర్థము. (కర్త).

తృచ్ ప్రత్యయమున కుదాహరణము. కృ+తృచ్. చకారమిత్తు. కృ + తృ – 'సార్వధాతు కార్ధధాతుకయోః' అను సూత్రముచే నిట ఋకారమునకు గుణము (అర్) వచ్చును. క్, ఋ+తృ = క్, అర్+తృ = కర్తృ, దీనికి ప్రథమావిభక్తి ఏకవచనమున, పుంలింగమున 'సు' ప్రత్యయము చేరగా 'కర్తా' అగును. (చేయువాఁడు).

సూ : నన్దిగ్రహి పచాదిభ్యో ల్యుణిన్యచః 3–1–134.

వృ : నన్ద్యాదే ర్ల్యుః, గ్రహ్యాదేర్ణినిః, పచాదేరచ్. నన్దయతీతి నన్దనః, జనార్దనః, లవణః. గ్రాహీ, స్థాయీ, మన్త్రీ. పచాదిరాకృతి గణః.

ప. వి : నన్ది గ్రహి పచాదిభ్యః (5–3) ల్యుణిన్యచః (1–3).

అను : ధాతోః (5–1) ప్రత్యయః (1–1) కృత్ (1–1).

అర్థ : నంద్యాదిధాతువులకు ల్యుప్రత్యయము, గ్రహ్యాదిధాతువులకు ణిని ప్రత్యయము, పచాదిధాతువులకు అచ్ ప్రత్యయమును వచ్చును.

ఉదా : నన్దయతీతి నన్దనః, జనార్దనః, లవణః.

గ్రాహీ, స్థాయీ, మన్త్రీ, పచాది గణ మాకృతిగణము.

వివ : నంద్యాదిగణపఠితములగు ధాతువులకు పరముగా 'ల్యు' అను ప్రత్యయమును, గ్రహ్యాదిగణధాతువులకు పరముగా 'ణిని' అను ప్రత్యయమును,

పచాదులకు అచ్ ప్రత్యయము కర్త్రర్థమున వచ్చును. ఇందు పచాదిగణము ఆకృతిగణము. 'అ' అనురూపముతో వచ్చిన ప్రత్యయమునకు మఱియే సూత్రము చేతను విధానము లేనియెడల నట్టి ధాతువుల నిందు చేర్చుకొననగునని తాత్పర్యము.

1. నంద్యాదులు - నందయతి - ఆనందపెట్టువాఁడు అనునర్థమున ప్రేరణార్థకమగు ణిచ్ ప్రత్యయముచేరిన 'నన్ది' అనుధాతువునకు 'ల్యు' ప్రత్యయము నన్ది + ల్యు-ఇందు లకారమిత్తు (లశక్వతద్ధితే) నన్ది + యు-యువో రనాకౌ-నన్ది + అన అనియుండ 'ణేరనిటి' (అనిడాది ఆర్ధధాతుకము పరమగునపుడు ణి ప్రత్యయమునకు లోపము వచ్చును) అనుసూత్రముచే 'ణిచ్' ప్రత్యయమునకు (ఇకారమునకు) లోపము వచ్చును. నన్ద్ + అన - నన్దన + సు=నన్దనః.

జనమ్ అర్దయతి ఇతి జనార్దనః అర్ద్ ధాతువునకు 'ల్యు' ప్రత్యయము. అర్ద్+ల్యు - లకారమిత్తు అర్ద్+యు-అన ఆదేశము-అర్ద్+అన అర్దన, జన + అర్దన-జనార్దన + సు=జనార్దనః.

లునాతి - ఛేదించునది అను నర్థమున 'లూఞ్' ఛేదనే అను ధాతువునకు ల్యు ప్రత్యయము. లూ ఞ్ + ల్యు - లూ + యు - లూ + అన, సార్వధాతుకార్ధధాతుకయోః గుణము. లో + అన-ఏచోఽయవాయావః-అవాదేశము లవ్ + అన-లవన - ఈశబ్దము నంద్యాదిగణములో పాణిని మహర్షిచే ణకారఘటితముగా పఠింపఁబడినది. కనుక నకారముణకారముగా మాఱునని చెప్పినట్లయినది. లవణ + సు=లవణః

నంద్యాదిగణము : 'నన్ది వాశి మది దూషి సాధి వర్ధి శోభి రోచిభ్యో ణ్యన్తేభ్యః సంజ్ఞాయామ్'. నందనః, వాశనః మదనః దూషణః సాధనః వర్ధనః శోభనః రోచనః. 'సహి తపి దమః సంజ్ఞాయామ్' సహనః తపనః దమనః జల్పనః రమణః దర్పణః సంక్రందనః సంకర్షణః సంహర్షణః జనార్దనః యవనః మధుసూదనః విభీషణః లవణః చిత్తవినాశనః కులదమనః (శత్రుదమనః) ఇతి నన్ద్యాదిః.

(ii) గ్రహ్యాదులు : వీనికి 'ణిని' ప్రత్యయము వచ్చును. ఇందు తొలి ణకారము తుది ఇకారమును ఇత్తులు. (చుటూ, ఉపదేశేఽజనునాసిక ఇత్) 'ఇన్' అనునది ప్రత్యయము. గ్రహ్ + ణిని - గ్రహ్ + ఇన్-ఇది ణిత్తయిన ప్రత్యయము కావున ధాతువులోని ఉపధయగు హ్రస్వఅకారమునకు వృద్ధి ఆకారము వచ్చును. (అత ఉపధాయాః) గ్రాహ్ + ఇన్-గ్రాహిన్. (పుం) గ్రాహిన్+ సు=గ్రాహీ. (గ్రహించువాఁడు.)

స్థా+ణిని - 'స్థా + ఇన్' అనియుండగా ఆకారాంత ధాతువులకు చిణ్ ణిత్, ణిత్ కృత్ప్రత్యయములు పరములగునపుడు 'యుక్' అనునాగమము వచ్చునను నర్థముగల ఆతోయుక్ చిణ్కృతోః (7-3-33) అనుసూత్రముచే యుగాగమము రాఁగా 'స్థాయ్ + ఇన్' - స్థాయిన్ + సు 'స్థాయీ' అగును. (యుక్ కిత్తుకావున అంతా వయవముగ ధాతువునకు వచ్చును. ధాతువు తొలిస్వరూపము 'ష్ఠా' గతి నివృత్తౌ అనునది. ధాత్వాదేః షః సః అను సూత్రముచే షకారము సకారమగును. షకారముమబట్టి వచ్చిన ఠకారము థకారముగ మారును.)

మన్త్రి ధాతువునకు ణిచ్ ప్రత్యయము చేరి 'మన్త్రి' అగును. దానికి ప్రకృతసూత్రముచే 'ణిని' ప్రత్యయము. మన్త్రి + ణిని - మన్త్రి+ఇన్ - 'ణేరనిటి' అనుసూత్రముచే ణిచ్ ప్రత్యయమునకు (ధాతువునందలి ఇకారమునకు) లోపము. మన్త్రి + ఇన్=మన్త్రిన్+సు=మన్త్రీ. ఇచట ఉపధాక్షరము అకారము కాదుకావున ఉపధావృద్ధిరాదు.

గ్రహ్యాదిగణము ; గ్రాహీ ఉత్సాహీ ఉద్దాసీ ఉద్భాసీ స్థాయీ మన్త్రీ సంమర్దీ. 'రక్షశ్రువపశాంనౌ' 24. నిరక్షీ నిశ్రావీ నివాపీ నిశాయీ. 'యాచ్ఛ వ్యాహృ' సంవ్యాహృ వ్రజ వాద వసాం ప్రతిషిద్ధానామ్' 25. అయాచీ అవ్యాహారీ అసంవ్యాహారీ అవ్రాజీ అవాదీ అవాసీ. 'అచామచిత్త కర్తృకాణామ్' 26. అకారీ అహారీ అవి నాయీ (విశాయీ విషాయీ) 'విశయీ విషయీ దేశే' 27. విశయీ విషయీదేశః. 'అభిభావీభూతే' 28 అపరాధీ ఉపరోధీ పరిభవీ పరిభావీ. ఇతి గ్రహాదిః.

(iii) పచాదులు. పచతీతి పచః పచ్ + అచ్-ప్రత్యయమునందలి చకారమిత్తు పచ్ + అ= పచ+సు=పచః. నదట్-నద్ + అచ్ =నద-స్త్రీలింగమున జీప్ ప్రత్యయము - నదీ. ఇది యాకృతిగణము.

పచ్ఛాదిగణము : పచ వచ వప వద చల పత నదట్ భషట్ ప్లవట్ చరట్ గరట్ తరట్. చోరట్ గాహట్ సూరట్ దేవట్ (దోషట్) జర (రజ) మద (మద) క్షమ (క్షప) సేవ మేష కోప (క్రోష) మేఘ నర్త వ్రణ దర్శ సర్ప (దమ్భ దర్ప) జార భర శ్వపచ. ఇతి పచాది రాకృతిగణః.

సూ : ఇ గు ప ధ జ్ఞా ప్రీ కిరః కః 3-1-135.

వృ : ఏభ్యః కః. బుధః, కృశః, జ్ఞః, ప్రియః, కిరః.

ప. వి : ఇగుపధజ్ఞాప్రీకిరః (5-1) కః (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : ఇగ్వర్ణ ముపధగాఁగల ధాతువులకును, జ్ఞా ప్రీ కౄధాతువులకును కర్త్రర్థమున 'క' ప్రత్యయము వచ్చును. ఉదా : బుధః, కృశః. జ్ఞః, ప్రియః, కిరః.

వివ : ఇక్ (ఇ ఉ ఋ ౡ) వర్ణములు ఉపధగా గల ధాతువులకును జ్ఞా, ప్రీ. కౄ అనుధాతువులకు 'క' అను కృత్ప్రత్యయము కర్త్రర్థమున వచ్చును. ఇందు కకారము (క్+అ) ఇత్తు. ప్రత్యయస్వరూపము అ. (లశక్వతద్ధితే). ప్రత్యయము కిత్తగుటచే ధాతువులోని ఇగ్వర్ణములకు గుణమురాదు. (క్ఙితి చ).

ఉదా : 'బుధ' అవగమనే బుధ్ - ఇది ఉకారోపధము. బుధ్ + క - బుధ్ + అ = బుధ + సు=బుధః- (తెలియువాఁడు).

కృశ్ధాతువు ఋదుపధము - కృశ్ + క - కృశ్+అ=కృశ + సు కృశః= (కృశించినవాఁడు).

'జ్ఞా' అవబోధనే. జ్ఞా + క - జ్ఞా+అ' అనియుండ 'ఆతోలోప ఇటిచ (6-4-64) (అజాది ఆర్ధధాతుకములైన కిత్, గిత్ ఙిత్తులుగాని ఇడాగమము గాని పరమగునపుడు ఆకారాంతధాతువుల ఆకారమునకు లోపము వచ్చును) అను సూత్రముచే ధాతువులోని ఆకారములోపించును జ్ఞ్+అ=జ్ఞ + సు = జ్ఞః - (తెలిసినవాఁడు)

'ప్రీఞ్' తర్పణే కాన్తౌచ. ప్రీ (ఞ్) - ఞకారమిత్తు. ప్రీ + క — ప్రీ + అ అనియుండ అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ (6-4-77) (శ్ను ప్రత్యయాంతముయొక్కయు ఇవర్ణ ఉ వర్ణాంతధాతువులయొక్కయు, భ్రూ ధాతువుయొక్కయు అంగమునకు అజాది ప్రత్యయము పరమగునపుడు ఇయఙ్ ఉవఙ్ అనునాదేశములు వచ్చును ఇకారమునకు ఇయఙ్, ఉకారమునకు ఉవఙ్ అనువవి వచ్చును). అను సూత్రముచే నిట 'ఇయఙ్' ఆదేశము వచ్చును. ప్రీ అనునది ఈకారాంతధాతువు. దానికి 'అ' అను అజాది ప్రత్యయము పరమయినది. కావున ఇయఙాదేశము. ఇందు ఙకారము ఇత్తు. అకారముచ్చారణార్థము. 'ఇయ్' అనునాదేశము ఙిత్తగుటచే 'ఙిచ్చ' అను పరిభాషనుబట్టి తుదివర్ణమైన ఈకారస్థానమున వచ్చును. ప్ర్ = ఇయ్ + అ + ప్రియ + సు = ప్రియః (తృప్తినొసఁగువాఁడు.)

'కౄ' విక్షేపే. కౄ + క 'కౄ + అ' అనియుండ ఋత ఇద్ధాతోః (7-1-100) (ఋకారాంత ధాతువు సంగమునకు ఇత్తు ఆదేశమగును).అను సూత్ర ముచే నిందలి ఋకారమునకు హ్రస్వఇకార మాదేశమగును. 'ఉరణ్ రపరః' అను పరిభాషచే నది రపరముగా వచ్చును. క్ + ఇర్ + అ = కిర + సు = కిరః (విరజిమ్ము వాఁడు).

సూ : ఆతశ్చోపసర్గే 3-1-136.

వృ : ప్రజ్ఞః, సుగ్లః.

ప వి : ఆతః (5-1) చ (అవ్య) ఉపసర్గే (7-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కః (1-1) కృత్ (1-1).

అర్థ : ఉపసర్గ ముపపదముగాఁగల ఆకారాంతధాతువునకు పరముగా కప్రత్యయము వచ్చును. ఉదా : ప్రజ్ఞః, సుగ్లః.

వివ : క్రియాయోగముగల ప్రాదులు ఉపసర్గములనఁబడును. ధాత్వధికార మున సప్తమ్యంతపదములచే వాచ్యములగునవి యుపపదము లనఁబడును (ముందు వివరింపఁబడును) ఆతః అను పంచమ్యంతపదము ధాతోః అనుదానికి విశేషణము. తదంత విధిచే ఆకారాంతధాతువునకు పరముగా' అనునర్థముకలుగును. ఉపసర్గము ఉపపదముగా నున్నపుడు ఆకారాంతధాతువునకు పరముగా క ప్రత్యయము వచ్చునని సూత్రార్థము, ప్రత్యయమునందు కకారమిత్తు (లశక్వతద్ధితే).

ప్ర జ్ఞా - ఇందు 'ప్ర' అనునది యుపసర్గము జ్ఞా, ఆకారాంతధాతువు. కావున కప్రత్యయము వచ్చును. ప్రజ్ఞా + క - ప్రజ్ఞా + అ ఆతోలోప ఇటి చ - ఆకారలోపము ప్రజ్ఞ్ + అ=ప్రజ్ఞ + సు=ప్రజ్ఞః.

సుగ్లై - ఇందు సు ఉపసర్గము. గ్లైధాతువులోని ఐకారమునకు 'ఆదేశ ఉపదేశేఽశితి' అను సూత్రముచే ఆకారమాదేశమగును. సుగ్లా+క - సుగ్ల్+అ- సుగ్ల+సు=సుగ్లః.

సూ : గేహే కః 3-1-144.

వృ : గేహే కర్తరి గ్రహేః కఃస్యాత్. గృహమ్.

ప. వి : గేహే (7-1) కః (1-1).

అను : గ్రహః (5-1) ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : గేహము అనునర్థమున గ్రహాధాతువునకు కర్త్రర్థమున 'క' ప్రత్యయము వచ్చును. ఉదా : గృహమ్.

వివ : గేహమనగా ఇల్లు. కర్తృవాచకమైన గేహము అర్థమైనపుడు గ్రహ్ ధాతువునకు 'క' ప్రత్యయము వచ్చును.

ఉదా : 'గ్రహ' ఉపాదానే. గృహ్ణాతి ధాన్యాదికమ్ - ధాన్యము మొదలగు వానిని గ్రహించునది అనునర్థమున ధాతువునకు 'క' ప్రత్యయము. గ్రహ్+క - కకారమిత్తు. గ్రహ్ + అ, ఇట్లుండ, గ్రహిజ్యా వయి వ్యధి వష్టి విచతి వృశ్చతి భృజ్జతీనాం జితిచ (6-1-16) - (గ్రహ్ మున్నగుధాతువులకు కిత్తుగాని జిత్తుగాని పరమగునపుడు సంప్రసారణము వచ్చును). అనుసూత్రముచే గకారమునకు పిదప నున్న రేఫమునకు సంప్రసారణము అగును. సంప్రసారణమనగా య వ ర ల లకు (హల్లులకు మాత్రమే) ఇ ఉ ఋ ౡ లు ఆదేశమగుట. (ఇగ్యణః సంప్రసారణమ్) 'గ్ ఋ + అహ్ + అ' ఋ+అ = ఋ అగును. (సంప్రసారణాచ్చ అను సూత్రముచే ఋకార అకారములకు పూర్వరూపమేకాదేశమగును). గృహ్+అ= గృహ + సు=గృహమ్ (నపుం).

సూ : కర్మణ్యణ్ 3-2-1.

వృ : కర్మణ్యుప పదే ధాతోరణ్. కుంభం కరోతీతి కుమ్భకారః.

ప. వి : కర్మణి (7-1) అణ్ (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్.

అర్థ : ధాతువునకు కర్మముపపదముగా నున్నపుడు 'అణ్' ప్రత్యయము వచ్చును. కుంభమును చేయువాఁడు-కుంభకారః.

వివ : కర్మమనగా ధాత్వర్థమైన ఫలమున కాశ్రయమైనది. కుంభంకరోతి= కుండను చేయుచున్నాఁడు. ఇందు చేయు అను ధాతువున కర్థము ఒకవస్తు వేర్పడు నట్లొనర్చుట. ఇందు ఏర్పడుట ఫలము, ఒనర్చుట వ్యాపారము. ఏర్పడునది కుండ కావున నది ఫలమున కాశ్రయమైనది. కావున కర్మము. దానిని చెప్పు పదము 'కుంభమ్' అన్నునది కర్మవాచకపదము. ఉపపదము అను వ్యాకరణ సంజ్ఞను తత్రోప పదం సప్తమీస్థమ్' అను సూత్రము నిర్వచించును. ఈః ధాత్వధికారమున సప్తమ్యంతపదముచే వాచ్యమగుదానికి వాచకము అగునది ఉపపదమనఁబడును ప్రకృతసూత్రమున 'కర్మణి' అనునది సప్తమ్యంతపదము, దానిచే వాచ్యమగునవి కుండ, మొదలగు వస్తువులు. వానికి వాచకములైన పదములు 'కుంభమ్', మొదలగునవి. వీనికిట ఉపపదమని పేరు. కర్మవాచకము ఉపపదముగాఁగల ధాతువునకు పరముగా అణ్ ప్రత్యయము వచ్చును. ఈ ప్రత్యయమున ణకారమిత్తు.

ఉదా : కుమ్భ + అమ్ కృ + అణ్ - ఇది సమాసమగును. కావున విగ్రహవాక్యములోని పదములకు ప్రకృతిప్రత్యయవిభాగము చేసి చూపుదురు. విభక్తి ప్రత్యయములు లోపించుటను ప్రదర్శించుటకు ఇది అనువైనమార్గము. ఇట్లు చూపిన వాక్యమును అలౌకిక విగ్రహవాక్యమందురు. కుమ్భ ప్రాతిపదికము, అమ్ - ద్వితీయైకవచన ప్రత్యయము. ఈ మొత్తమిచట ఉపపదము. కృ + అణ్. అచో ఞ్ణితి - వృద్ధి, అకారము ర పరమై వచ్చును. (ఉరణ్ ర పరః) క్ + ఆర్ + అ = కార, కుంభ + అమ్, కార, సమాస మగుటచే 'అమ్' ప్రత్యయము లోపించును. కుంభకార + సు = కుంభకారః. ఇట్లే వస్త్రం కరో - వస్త్రకారః. మొ॥వి.

సూ : ఆతో౽ను ప సర్గే కః 3-2-3.

వృ : అదనాద్ధాతో రనుపసర్గా త్కర్మణ్యుపపదే కః స్యాత్. ఆతో లోపః. అణో౽పవాదః. గోదః, ధనదః కమ్బలదః. అనుపసర్గేకిమ్ ? గో సన్దాయః.

ప. వి : ఆతః (5-1) అనుపసర్గే (7-1) కః (1-1).

అను : ధాతోః (5-1) కర్మణి (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : ఉపసర్గము పూర్వమున లేని ఆదంతమైన ధాతువునకు కర్మవాచకము ఉపపదమైనపుడు, క ప్రత్యయము వచ్చును. ఆకారమునకు లోపము. అణ్ ప్రత్యయమున కపవాదము. ఉదా : గోదః, ధనదః, కమ్బలదః. అనుపసర్గే అననేల? గోసన్దాయః

వివ : పూర్వమాత్రమున కర్మవాచక ముపపదముగానున్న ఏధాతువునకైనను 'అణ్' ప్రత్యయము సాధారణముగా నగునని చెప్పఁబడినది. ఈ సూత్రము దాని కపవాదముగా ఉపసర్గములు పూర్వమున లేని ఆకారాంత ధాతువులకు, కర్మవాచక ముపపదమైనపుడు కప్రత్యయము వచ్చునని చెప్పుచున్నది. ఇందు కకారమిత్తు (లశక్వతద్ధితే) - ఇది అణ్ ప్రత్యయముతో సమానరూపము గలది యగుటచే దానిని నిత్యముగనే బాధించును. (అ (ణ్) — అ, క - (క్) + అ).

ఉదా : గాం దదాతి - గోవును ఇచ్చువాఁడు. గో+అమ్, దా. ఇందు 'గామ్' అనునది కర్మవాచకపదము. 'దా' అనునది ఉపసర్గము లేని ఆకారాంత

ధాసపు. కావున క ప్రత్యయము వచ్చును. గో + అమ్, దా+క. గో+అమ్, దా + అ, 'ఆతోలోప ఇ 'టిచ' అను సూత్రముచే కిత్తయిన ప్రత్యయము పర పగుటచే ధాతువులోని ఆకారము లోపించును. గో + అమ్, ద్ + అగో + అమ్, ద, సమాసమున విభక్తిలోపము (సుపోధాతు ప్రాతిపదికయోః) గోద + సు = గోదః.

ధనం దదాతి, ధనమిచ్చువాఁడు - ధన + అమ్, దా + క - - దా + అ ద్ + అ, ద, ధన + అమ్, ద, ధనద + సు = ధనదః. ప్రక్రియ పై వలె చూచునది.

కమ్బలం దదాతి, కమ్బలము నిచ్చువాఁడు. కమ్బల + అమ్, దా + క కమ్బల + అమ్, ద్ + అ, కమ్బల + అమ్ + ద, కమ్బలద + సు= కమ్బలదః

అను పసర్గే అనుటవలన ధాతువు ఉపసర్గ సహితమైనచో ఈ సూత్రముచే క ప్రత్యయము రాదు. అణ్ ప్రత్యయమే వచ్చును. (కర్మ ణ్యాణ్). ఉదా : గాం సందదాతి - గో + అమ్, సమ్దా, ఇచట ఆకారాంత ధాతువు 'సమ్' అనుసుప సర్గముతో కూడియున్నది. కావున ప్రకృతసూత్రమునకు లక్ష్యము కాదు. అణ్ ప్రత్యయమగును. గో+అమ్, సందా + అ(ణ్) - ఆతోయుక్ చిణ్కృతోః అను సూత్రముచే నిచట ధాతువునకు యుగాగమము రాఁగా సందాయ్ + అ = గో సందాయ + సు=గో సందాయః అగును. (క ప్రత్యయము రాఁగా నేర్పడు 'గోసందః' అను దుష్టరూపమును వారించుటకై 'అనుపసర్గే' అనుపదము సూత్ర మున నిబద్ధమైనది.)

వా॥ మూల విభుజాదిభ్యః కః

వృ : మూలాని విభుజతి మూల విభుజోరథః. ఆకృతిగణోఽయమ్. మహీధ్రః, కుధ్రః.

ప. వి : మూల విభుజాది భ్యః (5-3) కః (1-1).

అర్థ : మూల విభుజాదులకు క ప్రత్యయము చెప్పనగును. ఉదా : మూలములను మర్ధించునది - మూలవిభుజః రథః. మహీధ్రః, కుధ్రః.

వివ : మూలాది కర్మవాచక పదములు ఉపపదములుగా నున్నపుడు విభుజాది ధాతువులకు 'క' ప్రత్యయము వచ్చునని సూత్రతాత్పర్యము. ఇది 'కర్మణ్య అనుసూత్రముచే ప్రాప్తమగు 'అణ్' ప్రత్యయమునకు అపవాదము.

ఉదా : మూలాని విభుజతి - మూలములను పరించునది-మూల + శస్, విభుజ్ + క - కకారమిత్తు, కావున భుజ్‌లోని ఉపధయగు ఉకారమునకు ప్రాప్త మగు గుణము రాదు. మూల + శస్, విభుజ్ + అ మూల + శస్ - విభుజ, విభక్తిలోపము మూల విభుజ + సు=మూలవిభుజః - ఇది 'రథః' అనుదానికి విశే షణము. మూలములను పరించురథము.

మహీం ధరతి - భూమిని ధరించునది. 'ధృఞ్' ధారణే. మహీ + అమ్, ధృ + క. మహీ + అమ్, ధృ + అ, గుణమురాదు. ఋకారమునకు 'ఇకో యణచి' అనుసూత్రముచే యణాదేశము (రేఫము) ధ్+ర్-అ-ధ్ర మహీ + అమ్, ధ్ర - విభక్తిలోపము, మహీధ్ర + సు=మహీధ్రః-పర్వతము.

కుం ధరతీతి - కుధ్రః, కు + అమ్, ధృ + క,—ధృ+అ=ధ్ర కుధ్రః. పర్వతము.

సూ : చరేష్టః 3-2-16.

వృ : అధికరణే ఉపపదే. కురుచరః.

ప. వి : చరేః (5-1) టః (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1) అధికరణే (7-1).

అర్థ : అధికరణవాచకముపపదముగా నున్నపుడు 'చర్' ధాతువునకు ట ప్రత్యయము వచ్చును. ఉదా : కురుచరః.

వివ : అధికరణమనగా ఆధారము. ఆధారమును బోధించు పదము ఉపపదముగా నున్నపుడు 'చర్' ధాతువునకు 'ట' అను కృత్ప్రత్యయము కర్త్రర్థమున వచ్చును. ఇందు టకారమిత్తు. (చుటూ). ప్రత్యయ స్వరూ పము, అ

ఉదా : కురుషు చరతి - కురుదేశములందు తిరుగువాఁడు. ఇచట తిరుగుట అనుపనికి ఆధారమైన స్థలము కురుదేశములు కావున దానిని చెప్పు 'కురు' అనునది అధికరణ వాచకము. కురు + సుప్, చర్ + ట - కురు + సుప్, చర్ + అ = కురు + సుప్, చర, సమాసమగుటచే విభక్తికి (సుప్) లోపము కురుచర + సు = కురుచరః. ఈ ప్రత్యయమున టకార మిత్తుగా నుండుటచే స్త్రీలింగమున ఙీప్ ప్రత్యయము వచ్చి 'కురుచరీ' అగును.

సూ : భిక్షాసేనాదాయేషు చ 3-2-17.

వృ : భిక్షాచరః, సేనాచరః, ఆదాయేతి ల్యబన్తమ్. ఆదాయచరః.

ప. వి : భిక్షాసేనాదాయేషు (7-3) చ (అవ్య).

అను : ధాతోః (5-1) చరేః (5-1) టః (1-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : భిక్షా, సేనా, ఆదాయ అనునవి యుపపదములుగా నున్నపుడును చర ధాతువునకు ట ప్రత్యయము అగును. ఉదా : భిక్షాచరః, సేనాచరః, ఆదాయ అనునది ల్యబంతము, ఆదాయచరః.

వివ : పూర్వసూత్రముచే అధికరణవాచకము ఉపపదమైనపుడు చరధ్ధాతువునకు టప్రత్యయము విధింపఁబడినది, ఈ సూత్రము అధికరణవాచకములు కాని భిక్షా, సేనా అను కర్మవాచకపదములును, 'ఆదాయ' అను ల్యబంతపదమును ఉపపదముగా నున్నపుడు 'చర్' ధాతువునకు ట ప్రత్యయమును విధించుచున్నది.

ఉదా : భిక్షాంచరతి - భిక్షమునకై తిరుగుచున్నవాఁడు : భిక్షా + అమ్, చర్ + ట, టకారమిత్తు, భిక్షా + అమ్, చర్+అ, విభక్తిలోపము భిక్షాచర + సు=భిక్షాచరః.

సేనాంచరతి - సేనను ప్రవేశించుచున్నవాఁడు సేనా+అమ్, చర్ + ట, సేనా+అమ్, చర, సేనాచర+సు=సేనాచరః.

అదాయ అనునది ల్యప్ ప్రత్యయము చేరినరూపము. క్త్వా ప్రత్యయమునకు సమాసమున 'ల్యప్' ఆదేశమగును. సమాన కర్తృకములైన రెండుపనులలో పూర్వము జరిగినదానిని తెలుపుచు ధాతువునకు క్త్వాప్రత్యయము వచ్చును. ఆదాయ, చరతి గ్రహించి పోవుచున్నాడు. ఆదాయ, చర్ + ట, ఆదాయ, చర్+అ = ఆదాయ చర+సు=ఆదాయచరః. (లభించినదానిని గ్రహించిపోవు వాఁడనియర్థము. దొంగ కావచ్చును.)

సూ : కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యేషు 3-2-20.

వృ : ఏషుద్యోత్యేషు కరోతేష్టః.

ప. వి : కృఞః (5-1) హేతుతాచ్ఛీల్యానులోమ్యేషు (7-3).

అను : ధాతోః (5-1) టః (1-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : హేతువు, తాచ్ఛీల్యము, ఆనులోమ్యము అనునవి తెలియఁబడునపుడు కృఞ్ ధాతువునకు ట ప్రత్యయమగును.

వివ : హేతువు అనగా ఫలమును సాధించుటకు యోగ్యమైన పదార్థము' ఒక విషయమును పేర్కొని యది శీలముగా కలవాఁడు అనుటకు తచ్ఛీలశబ్దముప యోగింపఁబడును. వాని / దానిభావము తాచ్ఛీల్యము. అనులోమము యొక్క భావము ఆనులోమ్యము. క్రమభంగము లేని అనుకూల స్వభావమని తాత్పర్యము. ఈ హేతువు. తాచ్ఛీల్యము, ఆనులోమ్యము అనునవి (ధాతుప్రత్యయముల సమాహారముచే) తెలియఁబడునపుడు కృఞ్ ధాతువునకు ట ప్రత్యయము వచ్చును.

హేతువున కుదాహరణము యశః కరోతి (విద్యా) యశస్సును చేయునది (విద్య) – ఇచట 'యశస్సు' అనుఫలమును సాధించుటకు యోగ్యమైనది విద్య. అది హేతువు. అది తెలియఁబడుచున్నది కావున 'యశస్' శబ్దము ఉపపదముగా నున్న కృ (ఞ్) ధాతువునకు ట ప్రత్యయమగును. యశస్+అమ్, కృ + ట (టకారమిత్తు) ఇచట ఆర్ధధాతుకమైన ప్రత్యయము పరమగుటచే ధాతువులోని ఇగ్వర్ణమగు ఋకారమునకు గుణము (అర్) వచ్చును. యశస్+కర్ + అ = 'యశస్+కర' అనియుండును. ఇందు సకారమునకు రుత్వ విసర్గములు రాగా 'యశః+కర' అని యుండును.

అవ : పై ఉదాహరణమున విసర్గమునకు సకారాదేశము విధింపఁబడు చున్నది.

సూ : అతః కృ కమి కంస కుమ్భ పాత్ర కుశా కర్ణీష్వనవ్యయస్య 8-3-46.

వృ : అత ఉత్తరస్యానవ్యయస్య విసర్గస్య సమాసేనిత్యం సాదేశః కరోత్యాదిషు పరేషు. యశస్కరీ విద్యా.

ప. వి : అతః (5-1) కృ ......... ... కర్ణీషు (7-3) అనవ్యయస్య (6-1).

అను : నిత్యమ్ (2-1) సమాసే (7-1) సః (1-1) విసర్జనీయస్య (1)1).

అర్థ : హ్రస్వఅకారమునకు పరమున నున్నదియు, అవ్యయసంబంధము కానిదియు నగు విసర్గమునకు సమాసమున, కృ, కమ్ ఇత్యాదులు

పరమలగునపుడు నిత్యముగా సకారాదేశమగును. ఉదా : యశస్కరీ విద్యా.

వివ : కుప్వోః ౹౹ క ౹౹ పౌచ' అను సూత్రమున కియ్యది అపవాదము. కఖ, ప ఫ లు పరములగునపుడు విసర్గమునకు, విసర్గము లేక జిహ్వామూలీ యోపధ్మానీయములను ప్రాప్తించుచుండగా నపవాదముగా సకారాదేశము చెప్పఁబడినది. ఎట్టి పరిస్థితులయందో చూతము. విసర్గమునకు పూర్వమున హ్రస్వఅకార ముండవలయును. పరమున కృ, కమ్ అను ధాతువులరూపములుగాని, కంస, కుంభ,పాత్ర, కుశా, కర్ణీ అనుపదములుగాని ఉండవలయును. వీనితో కూడిన విసర్గాంతరూపము సమానఘటితమై యుండవలయును. అట్టి పరిస్థితులలో విసర్గమునకు సకారాదేశమగును.

ఉదా : యశః + కర, ఇందు విసర్గమునకు పూర్వమున హ్రస్వఅకారము గలదు (క్ + అ) కృధాతురూపమగు 'కర' అనునది పరమైనది. ఈ మొత్తము సమాసము. కావున సకారాదేశము రాఁగా 'యశస్కర' అగును. ఇది 'విద్యా' అను స్త్రీలింగశబ్దమునకు విశేషణ మగుటచే దీనికి స్త్రీత్వమున 'టిడ్ఢాణఞ్ – –' అనుసూత్రముచే ఙీప్ ప్రత్యయము వచ్చును. యశస్కర + ఙీప్ (ఙకార పకారము లిత్తులు) యశస్కర + ఈ ( ర లోని అకారమునకు యస్యేతిచ అను సూత్రముచే లోపము వచ్చును.) యశస్కరీ + సు = యశస్కరీ (స్త్రీ).

అవ : కృఞో హేతు – – ఇత్యాది సూత్రమునందలి తాచ్ఛీల్యానులోమ్యములకుదాహరణములు వృత్తికారునిచే చూపఁబడుచున్నవి.

వృ : శ్రాద్ధకరః, వచనకరః.

వివ : శ్రాద్ధంకరోతీతి శ్రాద్ధకరః, శ్రాద్ధముచేయుట శీలముగాఁగలవాఁడు. శ్రాద్ధ + అమ్, కృ + ట, శ్రాద్ధ + అమ్ - కృ + అ, గుణము విభక్తి లోపము శ్రాద్ధ కర + సు = శ్రాద్ధకరః. ఇది తాచ్ఛీల్యము గమ్యమానమయిన దాని కుదాహరణము.

వచనంకరోతీతి వచనకరః – అధికారి చెప్పినమాటను విధేయతతో ఆచరించువాఁడు – వచన + అమ్, కృ + ట – వచన + అమ్ కర – వచన కర + సు = వచనకరః ఇది అనులోమ్యము తెలియఁబడినపుడు ట ప్రత్యయమగుట కుదాహరణము.

సూ : ఏజేః ఖశ్ 3-2-28.

వృ : ణ్యన్తాదేజేః ఖశ్.

ప. వి : ఏజేః (5-1) ఖశ్ (1.1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1) కర్మణి (7-1).

అర్థ : ణ్యంతమైన ఏజృధాతువునకు, కర్మవాచక మువపదముగా నున్నపుడు కర్త్రర్థమున ఖశ్ ప్రత్యయము వచ్చును.

వివ : ధాతువునకు ప్రేరణార్థమున ణిచ్ ప్రత్యయము విధింపఁబడినది అందు ణకారచకారము లిత్తులు. ప్రత్యయస్వరూపము ఇ. ఈ ప్రత్యయమంత మున ఏజృధాతువునకు, కర్మవాచక మువపదముగా నున్నపుడు కర్త్రర్థమున, 'ఖశ్' అను కృత్ప్రత్యయము చేరును. ఇందు ఖకారశకారము లిత్తులు. (లశక్వ తద్ధితే, హలన్త్యమ్). ప్రత్యయ స్వరూపము అ.

ఇది శిత్తగుటచే సార్వధాతుకము. కర్త్రర్థమున విధింపఁబడిన సార్వధాతు కము పరమగునపుడు భ్వాదిగణపఠితమైన ధాతువునకు పరముగా 'శప్'అను ప్రత్య యము వచ్చును. (కర్తరిశప్) శకారపవర్ణము లిత్తులు.

ఉదా 'ఏజృ' కమ్పనే - ఇందు ఋకారమిత్తు. జనమ్ ఏజయతీతి జనమే జయః - జనమును కంపింపఁజేయువాఁడు - జన + అమ్, ఏజి (ణిజన్తము) ఖశ్- ఏజి + శప్ + ఖశ్ - ఇత్తులకు లోపము రాఁగా ఏజి + అ + అ - సార్వ ధాతుకార్ధధాతుకయోః అను సూత్రముచే సార్వధాతుకమైన 'శప్' పరమైనది కాన ధాతువులోని ఇకారమునకు గుణము - ఏకారము వచ్చును. ఏజే + అ + అ - అయాదేశము, ఏచోఽయవాయావః ఏజయ్+అ + అ—ఏజయ+అ-అతో గుణే అనుసూత్రముచే నిచట పరరూప మేకాదేశమగును. 'జన + అమ్, ఏజయ' అని యుండ సమాసము కాన విభక్తి లోపము వచ్చును. 'జన + ఏజయ'అని యుండును.

అవ : పై యుదాహరణమున నీక్రిందిసూత్రముచే నొకకార్యము విధింపఁ బడుచున్నది.

సూ : అరుర్ద్విష దజన్తస్య ముమ్. 6 3-67.

వృ : అరుషో ద్విషతోఽజన్తస్య చ ముమాగమః ఖిదన్తే పరే నత్వవ్య యస్య. శిత్త్వాచ్ఛబాది. జనమేజయతీతి జనమేజయః.

ప. వి : అరుర్ద్విషదజన్తస్య (6-1) ముమ్ (1-1).

అను : ఖితి (7-1) అన వ్యయస్య (6-1) ఉత్తరపదే.

అర్థ : అరుస్, ద్విషత్ అనువానికి అజంతమునకును, ఖిదంతము పరమగు నప్పుడు ముమాగమము వచ్చును. అవ్యయమునకు రాదు. శిత్త్వమువలన శబాది కార్యమగును. జన మేజయతీతి జనమేజయః.

వివ : ఖితి అనునది ఉత్తరపదే అనుదానికి విశేషణము. తదంత విధిచే 'ఖిదంతమైన ఉత్తరపదము పరమగునపుడు' అనునర్థము వచ్చును. ఉత్తరపద మనునది సమాసముయొక్క చరమావయవము అనునర్థమున రూఢము. ఖకార మిత్తుగాఁగల ప్రత్యయమంత మునఁ గల ఉత్తరపదము పరమగునపుడు, అరుస్, ద్విషత్ అను హలంతశబ్దములకును, అజంతశబ్దములకును 'ముమ్' అనునాగమము వచ్చును. ఇది అవ్యయ ములకు రాదు.

ఉదా : జన + ఏజయ - ఇందు ఏజయ అనునది ఖిదంతము. ఖశ్ ప్రత్యయాంతము. అది యిచట ఉత్తరపదము. జన అనునది అజంతము (అచ్చు అంతమునఁగలది) దానికి 'ముమ్' అనునాగమము వచ్చును. ఇందు చివరి మకార మిత్తు. ఉకారముచ్చారణార్థము. ఆగమస్వరూపము 'మ్' అనునది. 'మిదచోఽన్త్యాత్పరః' 1-1-47 అనునొక పరిభాష గలదు. మకారమిత్తుగాగల ఆగమము తుది అచ్చునకు పరముగా వచ్చునని దానియర్థము. కావున నీయాగమము 'జన' అనుదాని తుది యచ్చునకు పరముగా వచ్చును జనమ్ + ఏజయ-జనమేజయ + సు=జనమేజయః.

శప్ ప్రత్యయము వచ్చుట మున్నగు ప్రక్రియ పూర్వసూత్ర వివరణమున చూపఁబడినది.

['మిదచోఽన్త్యాత్పరః' అను పరిభాషకు హలంతముల విషయమున ప్రత్యేకత కలదు. అందు ఈ యాగమము చివరిఅచ్చునకు దాని తరువాత నున్న హల్లునకును నడుమ వచ్చును. ఉదా : ద్విషత్ - ద్విషమ్త్-వలె].

సూ : ప్రియవశే వదః ఖచ్ 3-2-38.

వృ : ప్రియంవదః, వశంవదః.

ప. వి : ప్రియవశే (7-1) వదః (5-1) ఖచ్ (1-1),

అను : ధాతోః (5-1) కర్మణి (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : కర్మవాచకములైన ప్రియ, వశశబ్దములు ఉపపదములుగా నున్నపుడు 'వద్' ధాతువునకు 'ఖచ్' ప్రత్యయము వచ్చును. ఉదా : ప్రియంవదః, వశంవదః.

వివ : ప్రియం వదతి వశంవదతి అనునర్థములందు, ప్రియ, వశ అను కర్మవాచకపదములు ఉపపదములుగా నున్న 'వద్' ధాతువునకు 'ఖచ్' అను కృత్ప్రత్యయము వచ్చును. ఇందు ఖకారచకారము లిత్తులు (లశక్వతద్ధితే, హలన్త్యమ్), ఈః ప్రత్యయము ఖిత్తగుటవలన ఉపపదమునకు పూర్వసూత్రముచే ముమాగమము వచ్చును.

ఉదా : ప్రియ + అమ్, వద్+ఖచ్ - ఇత్తులగు ఖకారచకారములు లోపింపఁగా ప్రియ+అమ్, వద్+అ=ప్రియ+అమ్, వద, సమాసమయి విభక్తిలోపము రాఁగా ప్రియ + వద' అగును. 'అరుర్ద్విషదజన్తస్యముమ్' అను సూత్రముచే ముమాగమము రాగా ప్రియమ్+వద అని యుండ 'మోఽనుస్వారః' అను సూత్రముచే మకారమున కనుస్వారాదేశమగును. ప్రియంవద + సు = ప్రియంవదః (ప్రియములు పలుకువాఁడు),

వశ + అమ్, వద్+ఖచ్, వశ + అమ్, వద, వశ+వద, ముమాగమము వశమ్+వద, అనుస్వారాదేశము వశంవద+సు=వశంవదః. (ఇతరునికి) వశమగునట్లు పలుకువాఁడు.

సూ : ఆత్మమానే ఖశ్చ 3-2-83.

వృ : స్వకర్మకే మననే వర్తమానా న్మన్యతే స్సుపి ఖశ్ స్యాత్. చాణ్ణినిః పణ్డితమాత్మానం మన్యతే పణ్డితంమన్యః, పండితమానీ.

ప. వి : ఆత్మమానే (7-1) ఖశ్ (1-1) చ (అవ్య).

అను : సుపి (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1) మనః (5-1) ధాతోః (5-1) తాచ్ఛీల్యే (7-1).

అర్థ : స్వకర్మకమైన మననమునందు వర్తించు 'మన్' ధాతువునకు సుబంతముపపదముగానున్నపుడు, తాచ్ఛీల్యము తెలియఁబడునపుడు, ఖశ్ ప్రత్యయము వచ్చును. 'చ' అనుటవలన 'ణిని' ప్రత్యయము కూడ వచ్చును. ఉదా : పండితమాత్మానం మన్యతే - తన్నుతాను పండితునిగా తలఁచువాఁడు - పండితంమన్యః, పండితమానీ.

వివ : 'మన' జ్ఞానే అనుధాతువు స్వకర్మకమయినపుడు, తన్నుగూర్చి తాను భావించుట యనునది యున్నపుడు, అది శీలమగుట వ్యక్తమయినపుడు సుబంతము ఉపపదముగానున్న ఆ ధాతువునకు 'ఖశ్' అను ప్రత్యయము వచ్చును. సముచ్చయార్థకమగు 'చ' అనుపదము సూత్రమున నుండుటచే ఈ ఖశ్ ప్రత్యయమే కాక దీనికి పైని విధింపబడిన ణిని ప్రత్యయము కూడవచ్చును. అనగా ణిని, ఖశ్ ప్రత్యయములు 'మన్' ధాతువునకు పర్యాయముగా వచ్చునని తాత్పర్యము. తనయందు (లేని) ఒక లక్షణము గలదని తానుభావించుట స్వభావముగాఁ గలవానిని ఈ ప్రత్యయాంతము తెలుపును. ఈ ప్రత్యయమున ఖ్. శ్ అనునవి ఇత్తులు ఇది శిత్తగుటచే సార్వధాతుకమగును. కర్త్రర్థమున వచ్చిన సార్వధాతుకము పరమగునపుడు దివాదిగణపఠితములగు ధాతువులకు 'శ్యన్' అను ప్రత్యయము వచ్చును. ఇందు శ్, న్ అనునవి ఇత్తులు. (లశక్వ తద్ధితే, హలన్త్యమ్.)

ఉదా : పండితమ్ ఆత్మానం మన్యతే – తన్నుతాను పండితునిగా తలఁచు వాఁడు – అనునర్థమున 'పండితమ్' అను సుబంతము ఉపపదముగానున్న 'మన్' ధాతువునకు ఖశ్ ప్రత్యయము వచ్చును. పండిత + అమ్, మన్ + ఖశ్ – ఖశ్ అను సార్వధాతుకము పరమగుటచే 'శ్యన్' ప్రత్యయము ధాతువునకు పరమున చేరును. పండిత + అమ్, మన్ + శ్యన్ + ఖశ్-ప్రత్యయములందలి శ్, న్, ఖ్, శ్ వర్ణములు ఇత్తులు. మన్ + య + అ – యకారములోని అకారమునకును, పరమున నున్న అకారమునకు 'అతోగుణే' (6-1-97) (అపదాంతమైన అకారమునకు గుణము పరమగునపుడు పూర్వపరముల స్థానమున పరరూపమేకాదేశమగును) అను సూత్రముచే పరరూపమేకాదేశము కాఁగా మన్యఅగును. పండిత + అమ్, మన్య. సమాసమగుటచే విభక్తిలోపము పండిత + మన్య. 'అరుర్ద్విషదజన్తస్యముమ్' అను సూత్రముచే ఖిదన్తము పరమైనది కావున 'పండిత' అనుదానికి ముమాగమము వచ్చును పండితమ్ + మన్య–మోఽనుస్వారః అనుసూత్రముచే మకారమునకు అనుస్వారము. పండితం మన్య+సు=పండితం మన్యః.

ఈ యర్థమున ణిని ప్రత్యయము కూడ వచ్చును. పండిత + అమ్, మన్+ ణిని – ణ్, ఇలు ఇత్తులు – మన్ + ఇన్, 'అత ఉపధాయాః' అనుసూత్రముచే ధాతువులోని అకారమునకు వృద్ధి. మాన్+ఇన్=మానిన్. విభక్తిలోపము పండిత మానిన్ + సు=పండితమానీ.

సూ : అన్యేభ్యోఽపి దృశ్యన్తే 3-2-75.

వృ : మనిన్, క్వనిప్, వనిప్, విచ్ ఏతే ప్రత్యయా ధాతోః స్యుః.

ప. వి : అన్యేభ్యః (5-3) అపి (అవ్య) దృశ్యన్తే (క్రియాపదము. వర్త మాన కాలిక ప్రథమ పురుషబహువచనాంతము).

అర్థము : మనిన్, క్వనిప్, విచ్ అను ప్రత్యయములు ఇతరధాతువులకును గన్పట్టుచున్నవి.

వివ : 3-2 73, 74 సూత్రములలో విచ్, మనిన్, క్వనిప్, వనిప్ ప్రత్యయములు కొన్ని ధాతువులకు కొన్నిసందర్భములలో విధింపఁబడినవి. ఆ ప్రత్యయము లా సందర్భములం దాధాతువులకే కాక యితరములకును కన్పట్టుచున్న వని యీ సూత్రము చెప్పుచున్నది. మనిన్ ప్రత్యయమునందు తుది నకారమిత్తు. ఇకార ముచ్చారణార్థము. 'మన్' ప్రత్యయస్వరూపము క్వనిప్ ప్రత్యయమునందు మొదటి కకారము తుది పవర్ణము నిత్తులు. ఇకార ముచ్చాణార్థము-వన్ - ప్రత్యయ స్వరూపము. వనిప్-పవర్ణమిత్తు ఇకార ముచ్చారణార్థము. వన్ - ప్రత్యయము. విచ్ - చకారమిత్తు ఇకారముచ్చారణార్థము. వ్-ప్రత్యయస్వరూపము.

అవ : మన్, వన్, వ్ అను నీ ప్రత్యయములు వలాది ఆర్ధధాతుకములు. వానికి ఆర్ధధాతుకస్యేడ్వలాదేః అనుసూత్రముచే ఇడాగమము రావలసియుండగా నీక్రింది సూత్రము దానిని నిషేధించుచున్నది

సూ : నేడ్వశి కృతి 7-2-8.

వృ : వశాదేః కృత ఇ ణ్ న. శ్వా హింసాయామ్. సుశర్మా. ప్రాతరిత్వా,

ప. వి : న (అవ్య) ఇట్ (1-1) వశి (7-1) కృతి (7-1).

అర్థ : వశాదికృత్ప్రత్యయమునకు ఇడాగమము రాదు. ఉదా : శ్వాహింసాయాం సుశర్మా, ప్రాతరిత్వా.

వివ : ఇచట వశి కృతి అను సప్తమ్యంతములు షష్ఠ్యర్థము కలవి, అనగా పర్యవసానమున వానిని షష్ఠ్యంతములుగా భావింపవలయును, 'వశి'-వశ్ అనునది ప్రత్యాహారము. వర్గ తృతీయచతుర్థపంచమవర్ణములును, వ, ర, ల అనునవియు నిందుఁగలవు. ఇది వర్ణగ్రాహకమైన సప్తమ్యంత విశేషణము కాన 'యస్మిన్విధి స్తదా దా వల్గ్రహణే' అను పరిభాషచే వశాది అనునర్థము వచ్చును. వశ్వర్ణము ఆదియందుఁగల కృత్ప్రత్యయమునకు 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' అనుసూత్రముచే ప్రాప్తమగు ఇడాగమము రాదు.

పై సూత్రమునందలి మనిన్. క్వనిప్ ప్రత్యయములకు ఉదాహరణములు చూపఁబడుచున్నవి.

సు 'శౄ' (హింసాయామ్) + మనిన్-సుశౄ+మన్-(ఇందు 'సు' ఉప పదము) 'సార్వధాతుకార్ధధాతుకయోః' అనుసూత్రముచే ఋకారమునకు గుణమగు అకారము ర పరమై రాఁగా సుశ్ + అర్+మన్=సుశర్మన్ అగును. సుశర్మన్+ సు=సుశర్మా.

ప్రాతర్ అను అన్యయము ఉపపదముగాగల ఇ (ణ్)ధాతువునకు క్వనిప్ ప్రత్యయము - ప్రాతర్ + ఇ + క్వనిప్ - ప్రాతర్ + ఇ + వన్-ఇది పిత్తయిన కృత్ప్రత్యయము కాన హ్రస్వమునకు తుగాగమము వచ్చును. (హ్రస్వస్య పితి కృతి తుక్) ప్రాతర్+ఇత్ + వన్=ప్రాతరిత్వద్ + సు=ప్రాతరిత్వా. (ఉదయ మున పోవువాఁడు.)

పై రెండుదాహరణములందును ప్రత్యయములకు ప్రాప్తమగు ఇడాగమమును ప్రకృతసూత్రము నిషేధించినది.

అవ : క్వనిప్, వనిప్ ప్రత్యయములు పరములగునపుడు కొన్ని ధాతువుల కగు కార్యము చెప్పఁబడుచున్నది.

సూ : విడ్వనోరను నాసికస్యాత్ 6-4-41.

వృ : అనునాసిక స్యాత్ స్యాత్. విజాయత ఇతి విజావా. ఓణృ అపన యనే అవావా.

ప వి : విడ్వనోః (7-2) అనునాసికస్య (6-1) ఆత్ (1-1).

అర్థ : విట్, వన్ అను ప్రత్యయములు పరములగునపుడు అనునాసిక వర్ణమునకు ఆకారమాదేశమగును. ఉదా : విజాయతే ఇతి విజావా. ఓణృ అప నయనే అ వా వా.

వివ : విట్, వన్ అనునవి కృత్ప్రత్యయములు. ఇవి పరముగానుండుట యనునంశమునుబట్టి పూర్వమున నుండున విధాతువులని తెలియును. ధాతువుయొక్క అంతమున నున్న అనునాసికవర్ణమునకు, విట్, వన్ అను ప్రత్యయములు పరము లగునపుడు, ఆకారమాదేశమగును. ఇందువన్ అనునది క్వనిప్, వనిప్ ప్రత్యయములలో నేదైన కావచ్చును.

ఉదా : 'జనీ' ప్రాదుర్భావే - ఇందు ఈకారముఇత్తు. 'వి' అనునుపసర్గము ఉపపధముగాఁ గల జన్ధాతువునకు 'వనిప్' ప్రత్యయము. వి జన్ + వనిప్.

విజన్ + వన్. ఇపుడు ప్రకృతసూత్రముచే ధాతువులోని అనునాసికమగు నకారమునకు ఆకారమాదేశమగును. విజ + ఆ + వన్, సవర్ణదీర్ఘము విజావన్ + సు = విజావా (జనించువాఁడు.)

'ఓణృ' అపనయనే – తొలగించుట అనునర్థముగల ఓణృధాతువునకు వనిప్ ప్రత్యయము ధాతువునందు ఋకారమిత్తు. ఓణ్ + వన్ ణకారమున కాకారాదేశము. ఓ + ఆ + వన్. ఓకారమునకు అవాదేశము (ఏచోఽయవాయావః) అవ్ + ఆ + వన్ = అవావన్ + సు = అవావా. (తొలగించువాఁడు.)

అవ : విచ్ ప్రత్యయమునకు ఉదాహరణములు చూపఁబడుచున్నవి.

వృత్తి : విచ్ – రుష్, రిష్ హింసాయామ్. రోట్, రేట్, సుగణ్.

వివ : రుష్, రిష్ అను రెండుధాతువులును హింసార్థకములు, వీనికి 'విచ్' ప్రత్యయము చేరును. ఇందు చకారమిత్తు. ఇకార ముచ్చారణార్థము. రుష్ + వ్. 'పుగన్తలఘూపధస్యచ' గుణము. 'రోష్ + వ్ – ఇచట వకారమునకు 'వేరపృక్తస్య' (6-1-67) (అపృక్తమైన వకారమునకు లోపము వచ్చును)అను సూత్రముచే లోపము వచ్చును. రోష్ అగును. రోష్ + సు 'రోట్' అగును. (అపృక్తమనగా ఒకేవర్ణముగల ప్రత్యయము. అపృక్త ఏకాల్ ప్రత్యయః 1-2-41). ఇట్లే రిష్ + వ్ – రేష్ + సు = రేట్. హింసించువాఁడు. (రోష్, రేష్ అనువాని షకారమునకు జశ్త్వము, వైకల్పికముగా చర్త్వము నగును)

సు అనునది ఉపపదముగాఁగల గణ (సంఖ్యానే) అనుధాతువునకు విచ్ ప్రత్యయము. సుగణ్ + విచ్ (విచ్ అంతయు లోపించును) సుగణ్ + సు = సుగణ్ (బాగుగా లెక్కించువాఁడు.)

విచ్ ప్రత్యయముసర్వలోపి. ఇట్టివి క్విప్ మొదలగునవి మఱికొన్ని కలవు. ఇవి చేరినందువలన ధాతువులు ప్రాతిపదికములగును వానికి సుప్పులు చేరును.

సూ : క్విప్ చ 3-2-76,

వృ : అయమపి దృశ్యతే. ఉఖాస్రత్, పర్ణధ్వత్, వాహభ్రట్.

ప. వి : క్విప్ (1-1) చ (అవ్య).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1) దృశ్యతే (1-1).

అర్థ : ధాతువునకు క్విప్ ప్రత్యయముకూడ కన్పట్టుచున్నది. ఉదా : ఉఖాస్రత్, పర్ణధ్వత్, వా హ భ్రట్.

వివ : అను వృత్తమైన దృశ్యతే - కన్పట్టుచున్నది అనుపదము వలన నే ధాతువునకైనను, ఉపపదమున్నను, లేకున్నను, వేదభాషయందును, లోకభాషయందును కర్త్రర్థమున 'క్విప్' అను ప్రత్యయము వచ్చునమనర్థము కలుగును. ఇందు మొదటివర్ణమగు కకారము తుదివర్ణమగు పవర్ణమును ఇత్తులు (లశక్వతద్ధితే, హలన్త్యమ్). ఇకార ముచ్చారణార్థము. ఇఁక మిగిలిన 'వ్' అనునది 'వేరపృక్తస్య' అనుసూత్రముచే లోపించును. కావుననిదిసర్వలోపి. కాని కకారపవర్ణములు ఇత్తులయినందువలన కలుగుకార్యములన్నియు కలుగును.

ఉదా : ఉఖాయాః స్రంసతే - ఉఖ యనగా నొకపాత్ర - దానినుండి జాఱునది అనునర్థమున ఉఖాశబ్దము ఉపపదముగానున్న 'స్రంసు' ధాతువునకు క్విప్ ప్రత్యయము. ఉఖా + జసి, స్రంస్ + క్విప్ క్విప్ అంతయు లోపించును. ఉఖా + జసి, స్రంస్ - అనియుండ అనిదితాం హల ఉపధాయాః క్ఙితి 6-4-24 (ఇదిత్తులుకాని హలంతములైన అంగముల ఉపధానకారమునకు, కిత్తుగాని ఙిత్తుగాని పరమగునపుడు లోపము వచ్చును) అనుసూత్రముచే ధాతువులోని అనుస్వారరూప నకారము లోపించును. సమాసమగుటచే ప్రత్యయలోపము (జసి అనునది) ఉఖాస్రస్ + సు. హలంతశబ్దములకు పరముగానున్న సుప్రత్యయమునకు లోపము వచ్చును. ఉఖాస్రస్ అనునది పదమగును. ఇట్టిస్థితిలో వసుస్రంసుధ్వంస్వనడుహాం దః 8-2-72 (వసుప్రత్యయాంతములకును స్రంసు, ధ్వసు దాతువులకును, అనడుహ్ శబ్దమునకును పదాంతమున దకారమాదేశమగును) అనుసూత్రముచే తుది సకారమునకు దకారమగును దానికి వైకల్పికముగా చర్త్వము వచ్చును (వావసానే) ఉఖాస్రత్.

పర్ణాత్ ధ్వంసతే - ఆకునుండి పడునది-'పర్ణాత్' అనునది ఉపపదము. ధ్వంస్ ధాతువు. క్విప్ ప్రత్యయము వచ్చును. పర్ణ + జసి, ధ్వంస్ + క్విప్, క్విప్సర్వలోపి. నకారలోపము, విభక్తిలోపము (జసి) సు ప్రత్యయము తల్లోపము, దకారాదేశము, చర్త్వము (పైయుదాహరణము చూడుఁడు) పర్ణధ్వత్.

వాహాత్ భ్రశ్యతే - గుఱ్ఱమునుండి జాఱువాఁడు-వాహాశబ్దము ఉపపదము. భ్రంశ్ధాతువు. క్విప్ ప్రత్యయము. వాహ+జసి, భ్రంశ్ + క్విప్. ప్రత్య

యములో వర్ణములలోపము, ధాతువులోని అనుస్వారరూప నకారలోపము, సమాసము, విభక్తిలోపము కలిగి 'వాహభ్రశ్' అనియుండ సు ప్రత్యముచేరి శబ్దము హలంతమగుటచే లోపించును. ఇపుడు 'వాహభ్రశ్' అనునది పదమగును. అపుడు 'వ్రశ్చభ్రస్జసృజమృజ యజరాజ భ్రాజచ్ఛశాంషః' 8 2-36 - (వ్రశ్చాది సప్తధాతువులకును ఛకారాంతములకును ఝల్‌వర్ణముపరమగునపుడును పదాంతమునను షకారమంతాదేశమగును) అనుసూత్రముచే శకారమునకు షకారమగును. దానికి ఝలాంజశోఽన్తే అనుసూత్రముచే జశ్త్వము. దానికి వైకల్పికముగా చర్త్వము. వాహభ్రట్.

సూ : సుప్యజాతౌ ణినిస్తాచ్ఛీల్యే 3-2-78.

వృ : అజాత్యర్థే సుపి ధాతోర్ణినిస్తాచ్ఛీల్యే ద్యోత్యే. ఉష్ణభోజీ.

ప. వి : సుపి (7-1) అజాతౌ (7-1) ణినిః (1-1) తాచ్ఛీల్యే (7-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : తాచ్ఛీల్యము తెలియఁబడునపుడు, జాత్యర్థము కాని సుబంతము ఉపపదముగా నున్నపుడు, ధాతువునకు ణిని ప్రత్యయము వచ్చును. ఉదా : ఉష్ణభోజీ.

వివ : అది శీలముగాఁగలవాఁడు తచ్ఛీలుఁడు తచ్ఛీలుని భావము తాచ్ఛీల్యము. పేర్కొనిన లక్షణము శీలముగా కలవాఁడని తాత్పర్యము. జాతివాచకము కాని సుబంతము ఉపపదముగా నున్నపుడు తాచ్ఛీల్యము తెలియఁబడునపుడు ధాతువునకు 'ణిని' అను కృత్ప్రత్యయము కర్త్రర్థమున చేరును. ఇందు ణకారఇకారము లిత్తులు (చుటూ, ఉపదేశేఽజనునాసిక ఇత్). ప్రత్యయము 'ఇన్'.

ఉదా : ఉష్ణమ్ భోక్తుం శీలమస్య - వేడిగానున్న పదార్థమును తినుస్వభావము గలవాఁడు. ఇందు 'ఉష్ణమ్' అను సుబంతము ఉపపదము. ఇది గుణవాచకము. జాతివాచకము కాదు. ఇది ఉపపదముగా నున్న 'భుజ' పాలనాభ్యవహారయోః అనుధాతువునకు ణిని ప్రత్యయము. ఉష్ణ + అమ్, భుజ్ + ణిని - భుజ్+ఇన్, ఉపధాక్షరమగు ఉకారమునకు 'పుగంతలఘూపధస్య' అనుసూత్రముచే గుణము-భోజ్+ఇన్ ఉష్ణ+అమ్, భోజిన్ - సమాసము, విభక్తిలోపము - ఉష్ణభోజిన్ + సు = ఉష్ణభోజీ.

సూ : మనః 3-2-82.

వృ : సుపి మన్యతేర్ణినిః స్యాత్. దర్శనీయమానీ.

ప. వి : మనః (5-1).

అను : ధాతోః (5-1) సుపి (7-1) ణినిః (1-1).

అర్థ : సుబంతము పపదముగానున్నపుడు 'మన' ధాతువునకు ణిని ప్రత్యయము వచ్చును. ఉదా : దర్శనీయమానీ.

వివ : 'మన' జ్ఞానే అను దివాదిగణధాతువునకు సుబంతముపపదముగా నున్నపుడు ణిని ప్రత్యయము వచ్చును. ఇందు ణకార ఇకారము లిత్తులు. ఇది ణిత్తగుటవలన ధాతువుయొక్క ఉపధా అకారమునకు వృద్ధివచ్చును (అత ఉపధాయాః).

ఉదా : దర్శనీయమ్ మన్యతే - దర్శనీయునిగా భావించును ఇందు 'దర్శనీయమ్' అనునది ఉపపదము. దర్శనీయ + అమ్, మన్ + ణిని. ఇత్తులకు లోపము, ఉపధావృద్ధి, దర్శనీయ + అమ్, మాన్ + ఇన్ సమాసము, విభక్తిలోపము. దర్శనీయమానిన్ + సు=దర్శనీయమానీ.

అవ : కాలీ మా త్మానం మన్యతే - తన్నుతాను కాళినిగా తలఁచుకొనునది అనునర్థమున 'కాలీమ్' అనునది యుపపదముగా నున్నపుడు మన్ ధాతువునకు 'ఆత్మమానే ఖశ్ చ' అనుసూత్రముచే 'ఖశ్' ప్రత్యయము వచ్చును. కాలీ + అమ్, మన్ + ఖశ్ - శ్యన్ ప్రత్యయము, - మన్ + శ్యన్+ఖశ్ - ఇత్సర్జ లోపము, మన్+య+అ పరరూపసంధి -- మన్య, కాలీ + అమ్, మన్య అని యుండ సమాసమై విభక్తిలోపించును. కాలీ + మన్య అనియుండ నిచట పూర్వపదాంత దీర్ఘమునకు క్రిందిసూత్రముచే హ్రస్వము విధింపఁబడుచున్నది.

సూ : ఖిత్య నవ్యయస్య 6-3-66.

వృ : ఖిదన్తే పరే. పూర్వపదస్య హ్రస్వః. కాలింమన్యా.

ప. వి : ఖితి (7-1) అనవ్యయస్య (6-1).

అను : హ్రస్వః (1-1) ఉత్తరపదే.

అర్థ : ఖిదంతము పరమగునపుడు పూర్వపదమునకు హ్రస్వము వచ్చును. ఉదా : కాలింమన్యా.

వివ : ఖకారము ఇత్తుగాగల ప్రత్యయము అంతమునగలపదము సమాసమున చరమావయవమైనపుడు దానికి పూర్వమునన్న పదముయొక్క చివరి దీర్ఘాక్షరము నకు హ్రస్వమగును.

ఉదా : పై అవతారికలో చూపఁబడిన కాలీ + మన్య అను నుదాహరణమున మన్య అనునది ఖిదంతమైన (ఖశ్ ప్రత్యయాంతము) ఉత్తరపదము. అది పరముగా నున్నది కావున కాలీశబ్దములోని ఈకారమునకు హ్రస్వము వచ్చును. కాలి+మన్య. 'అరుర్ద్విషదజన్తస్యముమ్' అనుసూత్రముచే ముమాగమము. కాలిమ్ + మన్య. మోఽనుస్వారః-అనుస్వారాదేశము-కాలింమన్య, స్త్రీత్వమున టాప్ ప్రత్యయము కాలింమన్యా+సు=కాలింమన్యా.

సూ : కరణే యజః 3-2-85.

వృ : కరణే ఉపపదే భూతార్థయజేర్ణినిః కర్తరి. సోమేనేష్టవాన్ సోమయాజీ, అగ్నిష్టోమయాజీ.

ప. వి : కరణే (7-1) యజః (5-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1) భూతే (7-1) కర్తరి (7-1) ణినిః (1-1).

అర్థ : కరణవాచక ముపపదముగా నున్నపుడు, భూతకాలక్రియావృత్తియగు యజధాతువునకు కర్త్రర్థమున ణిని ప్రత్యయము వచ్చును. ఉదా : సోమేన ఇష్టవాన్ - సోమయాజీ, అగ్నిష్టోమయాజీ.

వివ : కరణమనగా క్రియాసిద్ధియందు మిక్కిలిగా నుపకరించు సాధనము (సాధకతమం కరణమ్). కరణవాచకము ఉపపదముగా నున్నపుడు భూతకాలార్థము గల యజధాతువునకు, కర్తను దెలుపుచు ణిని ప్రత్యయము వచ్చును. క్రియాపదము నుచ్చరించుకాలమునకు పూర్వమైనకాలము భూతకాలము.

ఉదా : సోమేన ఇష్టవాన్ - సోమరసముచే యజించినవాఁడు. ఇచట సోమరసము కరణము. 'సోమేన' అనునది కరణవాచకపదము. 'యజించిన' అనుటచే యాగము పూర్తి అయినదని యర్థము. కావున యజధాతు విచట భూతకాలికము. సోమ + టా, యజ్ + ణిని ణకార ఇకారము లిత్తులు లోపించును. ప్రత్యయము ణిత్తగుటచే ధాతువులోని ఉపధయగు హ్రస్వఅకారమునకు వృద్ధి. సోమ + టా, యాజిన్, సమాసము, విభక్తిలోపము, సోమయాజిన్ + సు = సోమయాజీ.

ఇష్టే అగ్నిష్టోమేన ఇష్టవాన్-అగ్నిష్టోమముచే యజించినవాఁడు. అగ్నిష్టోమ + టా, యజ్+ణిని, అగ్నిష్టోమ టా, యజ్+ఇన్, అగ్నిష్టోమయాజిన్ + సు=అగ్నిష్టోమయాజీ (ప్రక్రియపూర్వము వలెనే చూచునది.)

సూ : దృశేః క్వనిప్ 3-2-94.

వృ : కర్మణి, భూతే, పారం దృష్టవాన్ పారదృశ్వా.

ప. వి : దృశేః (5-1) క్వనిప్ (1-1).

అను : ధాతోః (5-1) కర్మణి (7-1) భూతే (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : కర్మవాచక మువపదమైనపుడు భూతార్థమున దృశ్ధాతువునకు 'క్వనిప్' ప్రత్యయము వచ్చును. ఉదా : పారం దృష్టవాన్ పారదృశ్వా.

వివ : 'దృశిర్' ప్రేక్షణే అనునదిధాతువు. ఇందు 'ఇర్' అనునది ఇత్తు. కర్మవాచకము ఉపపదముగాగల ఈ ధాతువునకు భూతకాలమున జరిగిన వ్యాపారము తెలియఁబడునపుడు 'క్వనిప్' అను ప్రత్యయము కర్తను తెలుపుచు వచ్చును.

ఉదా : పారం దృష్టవాన్ - పారమును చూచినవాఁడు. ఇందు 'పారమ్' అను కర్మవాచకము ఉపపదము. 'చూచిన' అనుటచే చూచుట అనువ్యాపారము ముగిసినదని తెలిసినది. కావున నిచట ధాతువు భూతార్థకము. కావున క్వనిప్ ప్రత్యయము వచ్చును. ఇందు కకార పవర్ణములిత్తులు (లశక్వతద్ధితే, హలన్త్యమ్) ఇకార ముచ్చారణార్థము. ప్రత్యయము కిత్తగుటచే ధాతువులోని ఋకారమునకు ప్రాప్తమగుగుణము వారింపఁబడును (క్ఙితిచ).

ఉదా : పార + అమ్, దృశ్ + క్వనిప్ - ఇత్తులకు లోపము పార + అమ్, దృశ్ + వన్. సమాసము, విభక్తిలోపము పారదృశ్వన్ + సు = పారదృశ్వా.

సూ : రాజని యుధి కృఞః 3-2-95.

వృ : క్వనిప్. యుధిరన్తర్భావితణ్యర్థః. రాజానం యోధితవాన్ రాజయుధ్వా, రాజకృత్వా.

ప. వి : రాజని (7-1) యుధికృఞః (5-1).

అను : ధాతోః (5-1) కర్మణి(7-1)భూతే (7-1) క్వనిప్ (1-1)ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : కర్మవాచకపగు రాజన్ అనునది ఉపపదమైనపుడు, భూతార్థకములగు యుధ్, కృఞ్ ధాతువులకు క్వనిప్ ప్రత్యయము వచ్చును. ఇచట యుధ్ధాతువు అంతర్భావిత ప్రేరణార్థకము. ఉదా : రాజానం యోధితవాన్, రాజయుధ్వా, రాజకృత్వా.

వివ : ఇచట యుధ్ధాతువు అంతర్భావితప్రేరణము. అనగా ప్రేరణార్థమును బోధించు ణిచ్ ప్రత్యయము చేరకున్నను ప్రేరణార్థము నిచ్చునది యని యర్థము. యుధ్ పోరు, యోధి–పోరించు ఇచట యుధ్ అనుదానికే 'పోరించు' అనునర్థము కలదని తాత్పర్యము. అట్టి ప్రేరణార్థము గల యుధ్ధాతువునకును, కృధాతువునకును కర్మవాచకమైన 'రాజన్' శబ్దము ఉపపదముగా నున్నపుడు, భూతార్థమున 'క్వనిప్' ప్రత్యయము వచ్చును. ఇందు కకారపవర్ణము లిత్తులు. కిత్తగుటచే గుణనిషేధమును, పిత్తగుటచే కృధాతువునకు తుగాగమమును వచ్చును.

ఉదా : రాజానం యోధితవాన్ – రాజును పోరించినవాఁడు ఇందు'రాజానమ్' అనునది కర్మవాచకము. యుధ్ధాతువు భూతకాలికము. రాజన్ + అమ్, యుధ్ + క్వనిప్, ఇత్తులకులోపము గుణనిషేధము రాజన్ + అమ్, యుధ్వన్, సమాసము, విభక్తిలోపము రాజయుధ్వన్ ('రాజన్' అనుదానిలోని నకారమునకు 'నలోపః ప్రాతిపదికాంతస్య' అనుసూత్రముచే లోపమగును) రాజయుధ్వన్ + సు = రాజయుధ్వా

రాజానం కృతవాన్ - రాజన్ + అమ్, కృ+క్వనిప్............కృ + వన్, హ్రస్వస్య పితికృతితుక్ అనుసూత్రముచే 'కృ'అనుదానికి తుగాగమము. రాజన్ + అమ్, కృత్వన్, విభక్తిలోపము, నకారలోపమును రాగా రాజకృత్వన్ అగును. రాజకృత్వన్ + సు=రాజకృత్వా.

సూ : సహేచ 3–2–96.

వృ : సహయోధితవాన్ సహయుధ్వా, సహకృత్వా.

ప. వి : సహే (7–1) చ (అవ్య).

అను : యుధి కృఞః (5–1) ధాతోః (5–1) క్వనిప్ (1–1) ప్రత్యయః (1–1) కృత్ (1–1) భూతే (7–1).

అర్థ : 'సహ' అను నవ్యయము ఉపపదముగానున్నప్పుడును యుధ్కృఞ్ ధాతువులకు క్వనిప్ ప్రత్యయము వచ్చును. ఉదా : సహయోధిత వాన్ సహయుధ్వా, సహకృతవాన్ సహకృత్వా.

వివ : పూర్వసూత్రమున కర్మవాచకమగు రాజశబ్దముపపదముగా నున్నపుడే యుధ్, కృఞ్ ధాతువులకు 'క్వనిప్' ప్రత్యయము విధింపఁబడినది. 'సహ' అనున వ్యయము ఉపపదమైనపుడు ఆధాతువులకు 'క్వనిప్' ప్రత్యయము వచ్చుట నీ సూత్రము చెప్పుచున్నది. యుధ్‌ధాతువు ప్రేరణార్థకమగుట యిందును గలదు.

ఉదా : సహ యోధితవాన్ - కూడిపోరించినవాఁడు. సహ, యుధ్ + క్వనిప్ - సహ యుధ్ + వన్, సహయుధ్వన్ + సు = సహయుధ్వా క్జితిచ గుణనిషేధము.

సహ, కృతవాన్ - కూడిచేసినవాఁడు. సహ, కృ + క్వనిప్ సహ, కృ+ వన్, సహ, కృత్+వన్, సహకృత్వన్ + సు = సహకృత్వా ఇందుధాతువునకు గుణనిషేధము, తుగాగమము.

సూ : సప్తమ్యాం జనేర్డః 3-2-97.

ప. వి : సప్తమ్యామ్ (7-1) జనేః (5-1) డః (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : సప్తమ్యంతము ఉపపదమైనపుడు'జన్' ధాతువునకు డ ప్రత్యయము వచ్చును.

వివ : 'జనీ' ప్రాదుర్భావే-అనుధాతువున ఈకారమిత్తు. దీనికి సప్తమ్యంత పదము ఉపపదముగా నున్నపుడు 'డ' అను కృత్ప్రత్యయము వచ్చును. ఇందు డకారమునకు 'చుటూ' అనుసూత్రముచే ఇత్సంజ్ఞకలుగును. అదిలోపింపగా అకారము మిగులును.

ఉదా : సరసి జాయతే - సరస్సునందు పుట్టునది అనునర్థమున 'సరసి' అను సప్తమ్యంతపదము ఉపపదముగా నున్న జన్ ధాతువునకు డ ప్రత్యయము. సరస్ + ఙి, జన్ + డ - డకారమిత్తు. 'సరస్+ఙి, జన్ + అ' అనియుండ ప్రత్యయము డిత్తుకావున ధాతువుయొక్క టి భాగమునకు లోపము వచ్చును. [టేః (6-4-143) అను సూత్రముచేత డిత్తుపరమగునపుడు భసంజ్ఞ కలదానియొక్క టి భాగమునకు లోపము విధింపఁబడినది. యకారాది ప్రత్యయములు అజాది ప్రత్యయములును అయిన స్వాదులు పరములగునపుడు పూర్వమునకు భసంజ్ఞ విధింపఁ బడినది-యచిభమ్. 1-4-18. స్వాది ప్రత్యయములనగా 4 వ అధ్యాయము నుండి విధింపఁబడిన ప్రత్యయములు. కృత్ప్రయములు మూఁడవ అధ్యాయము

నందలివి కనుక అవి పరమగునపుడు భ సంజ్ఞ కలుగదు. కలుగనిచో టి లోపము వచ్చుటకు వీలులేదు. కాని యీ ప్రత్యయమునందలి ఇద్వర్ణమైన డకారమునకు వేఱొక ప్రయోజనమేమియు లేదు. కావున డిత్త్వసామర్థ్యమువలన (టి లోపము కంటివేఱు ప్రయోజనములేని డకారము నిత్తుగా నుంచినందువలన) భసంజ్ఞలేని దానికిని టి లోపము వచ్చును] జన్+అ, జ్+అన్+అజ్+అ=జ, 'సరస్+ ఙి, జ' అనియుండ నిది సమాసమగును. సమాససంజ్ఞ కలదానికి ప్రాతిపదిక సంజ్ఞ కలదు. ప్రాతిపదికావయవమైన సుప్పునకు లుక్కు వచ్చును (సుపోధాతు ప్రాతి పదికయోః) లుక్కనగా ప్రత్యయముయొక్క అదర్శనము (ప్రత్యయస్య లుక్ శ్లులుపః-ప్రత్యయముయొక్క అదర్శనమును లుక్, శ్లు, లుప్ అను మూడుపద ములతో వ్యవహరింతురు.)

అవ : పై ఉదాహరణమున 'సుపోధాతు ప్రాతిపదికయోః' అను సూత్ర ముచే ప్రాప్తమగు ఙి ప్రత్యయముయొక్క లుక్కును ఈ క్రిందిసూత్రము వారించుచున్నది.

సూ : తత్పురుషే కృతి బహుళమ్ 6-3-14.

వృ : ఙే రలుక్, సరసిజమ్, సరోజమ్.

ప. వి : తత్పురుషే (7-1) కృతి (7-1) బహుళమ్ (2-1).

అను : సప్తమ్యాః (6-1) అలుక్ (1-1) ఉత్తరపదే (7-1).

అర్థ : తత్పురుష సమాసమున కృదంతమైన ఉత్తరపదము పరమగునపుడు సప్తమీ విభక్తికి బహుళముగా అలుక్కగును. ఉదా : సరసిజమ్, సరోజమ్.

వివ : 'కృతి' అనునది 'ఉత్తరపదే' అనుదానికి విశేషణము కావున తదంత విధిచే కృదంతమైన ఉత్తరపదము పరమగునపుడు అనునర్థము వచ్చును. అట్టిది పర మగునపుడు తత్పురుష సమాసమున సప్తమీవిభక్తికి లుక్కు (అదర్శనము) కాక పోవుట బహుళమని సూత్రతాత్పర్యము.

ఉదా : 'సరస్+ఙి, జ' ఇది తత్పురుషసమాసము. ఇందు 'జ' అనునది కృదంతమైన ఉత్తరపదము. కావున 'సుపోధాతు—' అనుసూత్రముచే ప్రాప్త మగు లుక్కు రానిచో సరస్+ఙి+జ, ఙి ప్రత్యయముతో ఙకారమిత్తు కావున లోపింపఁగా సరస్+ఇ, జ='సరసిజ' అగును. సరసిజ+సు= సరసిజమ్.

ఈ అలుక్కు బహుళమగుటచే లుక్కు వచ్చుటయు కలదు. అపుడు సరస్ + జ = సరోజ + సు=సరోజమ్ అగును. (ఇందు సరస్‌లోని తుది సకారమునకు రుత్వము, దానికి హశిచ అను సూత్రముచే ఉత్వము, పిదప గుణమేకాదేశమగుటయు నగును). 'సరసిజమ్' వంటివానినే అలుక్ సమాసము లందురు.

సూ : ఉపసర్గే చ సంజ్ఞాయామ్ 3-2-99.

వృ : ప్రజా స్యాత్సంతతౌ జనే.

ప. వి : ఉపసర్గే (7-1) చ (అవ్య) సంజ్ఞాయామ్ (7-1).

అను : జనేః (5-1) డః (1-1) ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : ఉపసర్గము ఉపపదముగా నున్నపుడు, సంజ్ఞ గమ్యమానమైనపుడు 'జన్' ధాతువునకు డ ప్రత్యయము వచ్చును. ఉదా : ప్రజాస్యాత్సంతతౌ జనే. (అమరము).

వివ : పూర్వసూత్రమున సప్తమ్యంతము ఉపపదముగా నున్నపుడు 'జన్' ధాతువునకు విధింపఁబడిన డ ప్రత్యయము, ఇచట ఉపసర్గము ఉపపదముగా నున్నపుడును వచ్చునని చెప్పఁబడినది. ఈడప్రత్యయాంతముచేత నొకసంజ్ఞ తెలియఁబడునపుడే యిది వచ్చును.

ఉదా : ప్ర + జన్ + డ - ఇచట 'ప్ర' ఉపసర్గము, ఉపపదము. టిలోపము ప్రజ్ + అ = ప్రజ, ఇది స్త్రీ లింగము కావున స్త్రీత్వమున టాప్ ప్రత్యయము (ఆ) రాఁగా ప్రజ + ఆ='ప్రజా'+సు=ప్రజా. 'ప్రజా' అనగా సంతానము లేక జనము అని సంజ్ఞ.

అవ : ఇచటినుండి నిష్ఠాప్రకరణము ప్రారంభింపఁబడుచున్నది. నిష్ఠాసంజ్ఞ యీ క్రింది సూత్రముచే విశదీకరింపఁబడుచున్నది.

సూ : క్తక్తవతూ నిష్ఠా 1-1-26.

వృ : ఏతౌ నిష్ఠా సంజ్ఞౌస్తః.

ప. వి : క్తక్తవతూ (1-2) నిష్ఠా (1-1).

అర్థ : 'క్త,' క్తవతు అను రెండు ప్రత్యయములకు 'నిష్ఠ' అని పేరు.

వివ : ఇది సంజ్ఞాసూత్రము. ఈ ప్రత్యయములు రెండును ధాతువులకు విధింపఁబడును. ఎచటనైనను ఈ వ్యాకరణమున 'నిష్ఠా' శబ్దము ప్రయోగింపఁబడిన యెడల నది క్త, క్తవతు అను ప్రత్యయములను బోధించును.

అవ : నిష్ఠా ప్రత్యయములు ధాతువులకు పరముగా విధింపఁబడుచున్నవి.

సూ : నిష్ఠా 3-2-102.

వృ : భూతార్థ వృత్తేర్ధాతో ర్నిష్ఠా. తత్ర తయోరేవేతి భావకర్మణోః క్తః, కర్తరికృదితి కర్తరి క్తవతుః. స్నాతం మయా, స్తుతస్త్వయా విష్ణుః. విశ్వం కృతవాన్ విష్ణుః.

ప. వి : నిష్ఠా (1-1).

అను : ధాతోః (5-1) భూతే (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : భూతార్థవృత్తియగు ధాతువునకు నిష్ఠాప్రత్యయము చేరును. అందు క్త ప్రత్యయము 'తయోరేవ....' అను సూత్రముచే భావకర్మము లందగును క్తవతు ప్రత్యయము కర్తరికృత్ అను సూత్రముచే కర్త్రర్థమున నగును. ఉదా : స్నాతం మయా, స్తుతస్త్వయావిష్ణుః, విశ్వంకృతవాన్ విష్ణుః.

వివ : నిష్ఠా అనునది క్త, క్తవతు అను రెండు ప్రత్యయములను బోధించునని క్రిందటి సూత్రమున తెలిసికొంటిమి. ఈ సూత్ర మాప్రత్యయములను ధాతువులకు విధించుచున్నది. ఈ ధాత్వధికారమున 'భూతే' 3 2 84 అనుసూత్రము 3-2-122 వఱకు అధికారము. ప్రకృతసూత్రము ఆ అధికారమున నున్నది యగుటచే 'భూతార్థ వృత్తియగు ధాతువునకు' అనునర్థము కలిగినది. భూతమున జరిగిన పనిని తెలుపు ధాతువునకు ఈ ప్రత్యయములు చేరును. అందు 'క్త ప్రత్యయము భావకర్మార్థములయందు వచ్చునని 'తయోరేవ కృత్యక్త ఖలర్థాః' అను సూత్రముచే చెప్పఁబడినది. క్త ప్రత్యయము చేరినపదము ధాతువుయొక్క భావమునో, కర్మమునో తెలుపునని భావము. అందు అకర్మకధాతువులకు భావార్థమునను, సకర్మక ధాతువులకు కర్మార్థమునను క్త ప్రత్యయము వచ్చును. ఇంక 'క్తవతు' ప్రత్యయము 'కర్తరి కృత్' అను సూత్రము ననుసరించి కర్త్రర్థమున వచ్చును. అనగా నది చేరినరూపము కర్తను బోధించునని భావము. ఈ రెంటియందును మొదటి కకారమిత్తు. (లశక్వతద్ధితే). 'క్తవతు' ప్రత్యయములో ఉకారమిత్తు త, తవత్ అనునవి ప్రత్యయస్వరూపములు. ఇవి కిత్తులగుటచే గుణనిషేధము, సంప్రసారణము మున్నగు కార్యములు ధాతువులందు అగును.

ఉదా : 'ష్ణా' శౌచే – ఇది అకర్మకము. దీనికి భావార్థమున క్త ప్రత్యయము వచ్చును. ఇందు షకారము సకారమగును ధాత్వాదేః షః సః (6-1-64) ధాతువు న్క- ఆదివర్ణమగు షకారము సకారమగును. షకారమునుబటి ణకారముగా మాఱిన సకారము షకారము పోయినతోడనే తనస్వరూపమును పొందును. స్నా + క్త – కకారమున కిత్సంజ్ఞ, లోపము. స్నాత + సు = స్నాతమ్ – స్నాతం మయా – నాచే స్నాతము. ఇది భూతకాలికమైన స్నానక్రియయొక్క భావమును తెలుపును. భావార్థమున శబ్దము నపుంసకమును, ఏకవచనము నగును.

'ష్టుఞ్' స్తుతౌ – ఇందు ఞకారమిత్తు. షకారము సకారముగ మాఱును. దానినిబట్టి టకారము కూడ తకారమగును. ఇది సకర్మకము కావున కర్మార్థమున క్త ప్రత్యయము. స్తు + క్త, ఇత్సంజ్ఞ, స్తు + త – కిత్తగుటచే గుణము రాదు. స్తుత + సు = స్తుతః, స్తుత స్త్వయా విష్ణుః – నీచే విష్ణువు స్తుతింపఁబడినవాఁడు–ఇందు స్తుతః అను క్త ప్రత్యయాంతము కర్మవాచకమగు విష్ణువునకు విశేషణము స్తుతింపఁబడుట భూతకాలమున జరిగినది.

క్తవతు – 'డుకృఞ్' కరణే – కృ + క్తవతు, కకార ఉకారము లిత్తులు. కృ + తవత్, కిత్తగుటచే గుణమురాదు. కృతవత్ + సు = కృతవాన్ = చేసినవాఁడు. విశ్వం కృతవాన్ విష్ణుః, విశ్వమును చేసినవాఁడు విష్ణువు. చేయుట అను పనిలో కర్త విష్ణువు. అతనిని ఈ క్తవతు ప్రత్యయాంతము తెలుపుచున్నది. కావున నిది కర్త్రర్థమున వచ్చినదని భావము. 'చేసినవాఁడు' అనుటచే చేయుట అను పని ముగిసినదని తెలియుచున్నది. కావున నీ ప్రత్యయము భూతార్థమున వచ్చినదని భావము.

అవ : ఈ క్తక్తవతు ప్రత్యయములయొక్క మొదటి తకారమునకు ఆయా ధాతువులనుబట్టి యనేకమైన మార్పులు కలుగును. అవి యీ క్రింది సూత్రములచే చెప్పఁబడుచున్నవి.

సూ : రదాభ్యాం నిష్ఠాతో నః పూర్వస్యచ దః 8-2 42.

వృ : రదాభ్యాం పరస్య నిష్ఠాతస్య నో,నిష్ఠాపేక్షయా పూర్వస్య ధాతోర్దస్య చ. శౄహింసాయాం శీర్ణః, ఛిన్నః, భిన్నః.

వ. వి : రదాభ్యామ్ (5-2) నిష్ఠాతః (6-1) నః (1-1) పూర్వస్య (6-1) చ (అవ్య) దః (6-1).

అర్థ : రేఫదకారములకు పరముగా నున్న నిష్ఠాతకారమునకు నకారమాదేశ మగును. నిష్ఠాప్రత్యయమునకు పూర్వమున నున్న దకారమునకును నకార మాదేశ మగును. ఉదా : శౄహింసాయాం శీర్ణః, ఛిన్నః, భిన్నః.

వివ : నిష్ఠా ప్రత్యయములు క్త, క్తవతు అనునవి. వీనిలోని మొదటి త కారమునకు నకారాదేశమును ఈ సూత్రము విధించుచున్నది. ధాతువుతుదిని రేఫము గాని దకారముగాని యున్నచో వానికి పరముగానున్న నిష్ఠా ప్రత్యయముయొక్క తకారమునకు నకారమాదేశమగును. అంతేకాక నిష్ఠా ప్రత్యయమునకు అవ్య వహితముగా పూర్వముననున్న ధాతువులోని దకారమునకు కూడ నకారమాదేశ. మగును.

ఉదా : శౄ - హింసాయామ్, శౄ + క్త - శౄ + త, 'ౠత ఇద్ధాతోః అను సూత్రముచే ధాతువులోని ౠకారమునకు హ్రస్వ ఇకారము ఆదేశమగును'. అది ఋ స్థానికమగుటచే 'ఉరణ్ రపరః' అను పరిభాషచే రపరముగా వచ్చును. శిర్ + త అనియుండ హలిచ (8-2-77) (రేఫాంతముగాని వకారాంతముగాని యగుధాతువుయొక్క ఉపధయగు ఇగ్వర్ణమునకు, హల్లుపరమగునపుడు దీర్ఘము వచ్చును) అనుసూత్రముచే ధాతువులోని ఇకారమునకు దీర్ఘము వచ్చి 'శీర్ + త' అని యగును. ఇప్పుడు నిష్ఠాప్రత్యయము రేఫమునకు పరముగా నున్నది. కావున దానికి ప్రకృతసూత్రముచే నకారాదేశమురాఁగా శీర్+త్+అ 'శీర్న్ + అ' అని యుండ 'రషాభ్యాంనోణస్సమానపదే' 8-4-1 అను సూత్రముచే నకారమునకు ణకారమాదేశమగును. (రేఫషకారములకుపరముగా నున్న నకారమునకు ణకారాదేశము సమానపదము నందగును అని సూత్రార్థము). శీర్ణ + సు = శీర్ణః.

దకారాంతమున కుదాహరణము : 'భిదిర్' విదారణే. ఇందు 'ఇర్' ఇత్తు. భిద్ + క్త, భిద్+త, భిద్+న, భిన్ + న=భిన్న + సు = భిన్నః. భేదింపఁ బడినది

'ఛిదిర్' ద్వైధీకరణే. ఇందును 'ఇర్' అనుభాగమిత్తు. ఛిద్ + క్త, ఛిద్+న, ఛిన్+న=ఛిన్న + సు=ఛిన్నః=చీల్పఁబడినది.

ప్రత్యయము కిత్తగుటచే పై రెండుదాహరణములయందును గుణము రాదు.

సూ : సంయోగాదే రాతో ధాతోర్యణ్వతః 8-2-43.

వృ : నిష్ఠాతస్య నః స్యాత్. ద్రాణః, గ్లానః.

ప. వి : సంయోగాదేః (5-1) ఆతః (5-1) ధాతోః (5-1) యణ్వతః (5-1).

అను : నిష్ఠాతః (6-1) నః (1-1).

అర్థ : సంయోగాదియు, నాకారాంతమును యణ్ణుగలదియు నగుధాతువునకు పరముగ నున్న నిష్ఠాతకారమునకు నకారమాదేశమగును. ఉదా : ద్రాణః, గ్లానః.

వివ : సంయోగమనగా అచ్చులతో వ్యవధానములేని హల్లులసముదాయము. 'ఆతః' అనునది విశేషణమగుటచే తదంత విధిచే 'ఆకారాంతమైన' అనునర్థము కలుగును. యణ్ ప్రత్యాహారము య వ ర ల లను తెలుపును. యణ్వత్ అనగా యణ్ణుగలది. సంయోగము ఆదియందు కలదియు, ఆకారాంతమైనదియు, య వ ర ల అను అక్షరములలో నేదోయొక వర్ణము గలదియు నగుధాతువునకు పరముగ నున్న నిష్ఠాప్రత్యయముయొక్క తకారమునకు నకారమాదేశమగును.

ఉదా : 'ద్రా' కుత్సాయాం గతౌ- ఇది సంయోగాదియగు ధాతువు. ద్ర్, అనుసంయోగము ఆదియందు కలదు. ఆకారాంతము. యణ్వర్ణమగు రేఫ మిందుఁ గలదు. కావున దీనికి పరమైన నిష్ఠాతకారము నకార మగును. ద్రా + క్త, ద్రా + త, 'ద్రా + న' అనియుండ 'అట్కుప్వాఙ్ నుమ్ వ్యవాయేఽపి' 8-4-2, (అట్ ప్రత్యాహారములోని వర్ణములు, క వర్గము, ప వర్గము ఆఙ్, నుమ్- ఇవి విడివిడిగాఁ గాని యథాసంభవముగా కలిసికాని నడుమ నున్నప్పటికి రేఫషకారములకు తరువాతనున్న నకారమునకు ణకారమాదేశమగును). అనుసూత్రముచే నకారమునకు ణత్వము. ద్రాణ + సు = ద్రాణః.

'గ్లై' హర్షక్షయే - ఇందలి ఐకారమునకు ఆకారమాదేశమగును. (ఆదేచ ఉపదేశేఽశితి) 'గ్లా' - ఇది సంయోగాది, ఆకారాంతము, యణ్వత్తు (లకారవత్తు). గ్లా + త - గ్లా + న - గ్లాన + సు = గ్లానః - వాడినది.

సూ : ల్వాదిభ్యః 8-2-44.

వృ : ఏకవింశతేః లూఞాదిభ్యః ప్రాగ్వత్. లూనః.

ప. వి : ల్వాదిభ్యః (5-3).

అను : నిష్ఠాతః (6-1) నః (1-1).

అర్థ : లూఞ్ మున్నగు నిరువదియొక్క ధాతువులకు పరముగ నున్న నిష్ఠా తకారమునకు నకారమగును. ఉదా : లూనః.

వివ : లూఞ్ మున్నగు నిరువదియొక్క ధాతువులకు చేరిన నిష్ఠాప్రత్యయము యొక్క తకారమునకు నకారమాదేశమగును.

ఉదా : 'లూఞ్' ఛేదనే. ఇందు ఞకారమిత్తు. 'నిష్ఠా' అను సూత్రముచే దీనికి 'క్త' ప్రత్యయము. లూ + క్త, ఇత్తునకు లోపము లూ + త, నకారాదేశము లూన + సు = లూనః = ఛేదింపఁబడినది.

ఈ గణములో నిదే యగు జ్యాధాతువునకు సంబంధించిన ప్రక్రియ వివరింపఁబడుచున్నది.

వృ : జ్యాధాతోః గ్రహిజ్యేతి సంప్రసారణమ్.

వివ : 'జ్యా' వయోహానౌ అనుధాతువునకు క్త ప్రత్యయము లేక క్తవతు ప్రత్యయము చేరునపుడు 'గ్రహిజ్యావయివ్యధి వష్టి విచతి వృశ్చతి భృజ్జతీనాం ఙితిచ' 6-1-16 అను సూత్రముచే సంప్రసారణమగును. (ఇందలిధాతువులకు కిత్తుగాని ఙిత్తుగాని పరమగునపుడు సంప్రసారణమగునని సూత్రార్థము). జ్యా + క్త, ఇచట ప్రత్యయము కిత్తు. కావున ధాతువులోని యకారమునకు సంప్రసారణమగును. సంప్రసారణమనగా య వ ర ల లకు ఇ ఉ ఋ ఌ క్రమముగా ఆదేశమగుట (ఇగ్యణః సంప్రసారణమ్ 1-1-45). జ్ + య్+ఆ, త-జ్ ఇ+ఆ, త - అనియుండ ఇకారఆకారములకు సంప్రసారణాచ్చ 6-1-108 (సంప్రసారణమునకు అచ్చు పరమగునపుడు పూర్వరూపమేకాదేశమగును) అనుసూత్రముచే పూర్వరూప మేకాదేశముకాఁగా జ్ + ఇ, త - జి + త, అగును. నకారాదేశము-'జి+న' అని యుండును

అవ : క్రిందిసూత్రముచే పై యుదాహరణములోని ఇకారమునకు దీర్ఘము విధింపఁబడుచున్నది.

సూ : హలః 6-4-2.

వృ : అఙ్గావయవాద్ధలః పరం యత్సంప్రసారణం తదన్తస్య దీర్ఘః. జీనః.

ప. వి : హలః (5-1).

అను : అఙ్గస్య (6-1) సంప్రసారణస్య (6-1) దీర్ఘః (1-1).

అర్థ : అంగావయవమైన హల్లునకు పరముగా నున్న సంప్రసారణము అంతమునఁ గల అంగమునకు దీర్ఘము వచ్చును. ఉదా : జీనః.

వివ : యస్మాత్ ప్రత్యయవిధి స్తదాది ప్రత్యయేఽఙ్గమ్ 1-4-13 ఏ ప్రత్యయము దేనికి విధింపఁబడునో అది ఆదిగాఁగల శబ్దస్వరూపము ఆ ప్రత్యయము పరమగునపుడు అంగసంజ్ఞ కలది యగును. అను సూత్రము 'అంగము' అను వ్యాకరణసంజ్ఞను విధించును. 6-4-1 మొదలుకొని అంగాధి కారము గలదు. ప్రస్తుతసూత్ర మందలిది. ఈ సూత్రములోని కధికృతమైన 'అంగస్య' అనుదానిని రెండుమారులు పఠించుకొనవలయును. అందొకటి అవయవ షష్ఠ్యంతమై హలః అనుదానితో నన్వయించును. కావున 'అంగముయొక్క అవ యవమైన హల్లునకు పరముగా' అనునర్థము కలుగును. రెండవది సంప్రసార ణస్య అను విశేషణమునకు విశేష్యమగును. కావున తదంత విధిచే సంప్రసార ణము అంతమునఁగల అంగమునకు (అంగముయొక్కస్థానమున) అనునర్థము కలు గును. ఇట్లు అంగముయొక్క అవయవమైన హల్లునకు పరముగానున్న సంప్ర సారణము అంతమునఁగల అంగమునకు దీర్ఘము వచ్చును అనునర్థము సిద్ధించినది.

ఉదా : జి + న - 'క్త' ప్రత్యయము 'జ్యా' ధాతువునకు విధింపఁబడినది. 'జ్యా' ధాతురూపమే 'జి' అనునది. క్త ప్రత్యయరూపమే 'న' అనునది.కావున 'జి' అనునదియిట అంగము. దాని యవయవమైన హల్లు జకారము (జ్). దానికి పరమైన సంప్రసారణము ఇకారము (జ్ + ఇ). అది అంతమునఁగల అంగమనగా 'జి'. దానికి దీర్ఘము వచ్చును. జీన + సు = జీనః. వృద్ధుఁడు.

'రదాభ్యాం నిష్ఠాతః' అనుసూత్రము మొదలుకొనిఉన్న సూత్రముల కీఁ బడిన యుదాహరణములన్నియు క్త ప్రత్యయాంతములే. అయినను క్తవతు ప్రత్య యాంతములకును ఈ కార్యము జరుగును. శీర్ణవాన్, భిన్నవాన్, లూనవాన్ మున్నగువిధముగా చూడనగును. ముందు కూడనట్లే అరయునది.

ల్వాదిగణము : లూ ఞ్ ఛేదనే, స్తృ ఞ్ ఆచ్ఛాదనే, కౄ ఞ్ హింసా యామ్, ధూ ఞ్ కమ్పనే, శౄహింసాయామ్, పౄపాలన పూరణయోః, వౄవరణే భరణఇత్యేకే, భౄ భర్త్సనే. భరణేఽప్యేకే, మౄహింసాయామ్, దౄవిదా రణే, జౄవయో హానౌ. ఝౄ ఇత్యేకే, ధౄ ఇత్యన్యే. నౄనయే, కౄ హింసాయామ్ ఋూ గతౌ, గౄశబ్దే, జ్యావయోహానౌ, రీ గతిరేషణయోః, లీశ్లేషణే, ల్లీ వరణే. ప్లీగతౌ.

సూ : ఓదితశ్చ 8-2-45.

వృ : భుజోభుగ్నః, టు ఓ శ్వి ఉచ్ఛూనః.

ప. వి : ఓదితః (5-1) చ (అవ్య).

అను : నిష్ఠాతః (6-1) నః (1-1) ధాతోః (5-1).

అర్థ : ఓ దిత్తగు ధాతువునకు పరముగానున్న నిష్ఠాత కారమునకును నకారమాదేశమగును. ఉదా : భుజో-భుగ్నః, టు ఓశ్వి ఉచ్ఛూనః.

వివ : ఓకారము ఇత్తుగాగల ధాతువునకు పరముగనున్న క్త క్తవతు ప్రత్యయముల మొదటితకారమునకు నకారమాదేశమగును.

ఉదా : 'భుజో' కౌటిల్యే. ఇందు ఓకారమునకు 'ఉపదేశేఽజనునాసిక ఇత్' అనుసూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును. కావున ఈధాతువు ఓదిత్తు. దీనికి పర మైన నిష్ఠాప్రత్యయతకారమునకు నకారమాదేశమగును. భుజ్ + క్త, 'భుజ్ + త' అనియుండ 'చోః కుః' 8-2-30 అనుసూత్రముచే చ వర్గాక్షరమగు జకార మునకు క వర్గాక్షరమైన గకారమాదేశమగును. ఝల్లు పరమగునపుడును, పదాంత మునను చ వర్గమునకు క వర్గమాదేశమగునని సూత్రార్థము. భుగ్ + త, ప్రకృత సూత్రముచే నకారాదేశము. భుగ్న + సు = భుగ్నః.

'టు ఓశ్వి' గతి వృద్ధ్యోః - ఇందు 'టు' అనునది ఆదిర్ఞిటుడవః = (1-3-5) (ఉపదేశమున ఆదివర్ణములగు ఞి, టు, డు అనునవి యిత్తులు) అను సూత్రముచే ఇత్తగును. ఓకారము 'ఉపదేశేఽజనునాసిక ఇత్' అనుసూత్రముచే ఇత్తగును. ధాతువు 'శ్వి' అనునది. దీనికి క్త ప్రత్యయము. శ్వి + క్త, శ్వి + త-వచిస్వపి యజాదీనాం కితి 6-1-15 (వచ్, స్వప్ అనుధాతువులకును, యజ్ మున్నగుధాతువులకును, కిత్తుపరమగునపుడు సంప్రసారణమగును) అను సూత్రముచే సంప్రసారణమగును. శ్ + వ్ + ఇ, త, శ్ + ఉ + ఇ, త, 'సంప్ర సారణాచ్చ' అనుసూత్రముచే ఉకార ఇకారములకు పూర్వరూపము శ్ + ఉ, త, 'హలః' అనుసూత్రముచే దీర్ఘము శూ + త, ప్రకృతసూత్రముచే నకారాదేశము శూన, ఉద్ + శూన, శశ్ఛోఽటి, స్తోః శ్చునాశ్చుః అనుసూత్రములచే ఛత్వశ్చుత్వ ములు, ఉద్ + ఛూన (ఛత్వము) ఉజ్ + ఛూన, ఖరిచ, చర్త్వము ఉచ్ఛూన + సు = ఉచ్ఛూనః.

అవ : ఇంతవఱకు ('రదాభ్యాం' మొదలుకొని) నిష్ఠాతకారమునకు నకార మగు సందర్భములు చెప్పఁబడినవి. మఱికొన్ని యాదేశములు ఇటనుండి చెప్పఁబడుచున్నవి.

సూ : శుషః కః 8-2-51.

వృ : నిష్ఠాతస్య. శుష్కః.

ప. వి : శుషః (5-1) కః (1-1).

అను : నిష్ఠాతః (6-1).

అర్థ : శుష్ ధాతువునకు పరముగానున్న నిష్ఠాతకారమునకు కకార మాదేశ మగును. ఉదా : శుష్కః.

వివ : 'శుష' శోషణే. శుష్ + క్త, శుష్ + త అనియుండ తకారమున కీసూత్రముచే కకా రాదేశము శుష్ + క = శుష్క + సు = శుష్కః - ఎండినది.

సూ : ప చో వః 8-2-52.

వృ : పక్వః

ప. వి : పచః (5-1) వః (1-1).

అను : నిష్ఠాతః (6-1).

అర్థ : పచ్ ధాతువునకు పరముగా నున్న నిష్ఠాతకారమునకు వకారమాదేశ మగును. ఉదా : పక్వః.

వివ : 'డు పచష్' పాకే. ఇందు డు, ష్ వర్ణము లిత్తులు. అకార ముచ్చారణార్థము. పచ్ + క్త, పచ్ + త అనియుండ 'చోః కుః' అనుసూత్రముచే చకారమునకు కుత్వము. పక్ + త. ప్రకృతసూత్రముచే తకారమునకు వకా రాదేశము. పక్ + వ - పక్వ+సు=పక్వః-పండినది, వండఁబడినది.

సూ : క్షాయో మః 8-2-53.

వృ : క్షామః.

ప. వి. క్షాయః (5-1) మః (1-1).

అను : నిష్ఠాతః (6-1).

అర్థ : 'క్షై' ధాతువునకు పరముగనున్న నిష్ఠాతకారమునకు మకార మాదేశ మగును. ఉదా : క్షామః.

వివ : 'క్షై' క్షయే. దీనికి 'ఆదేచ ఉపదేశేఽశితి'అను సూత్రముచే ఆకార మాదేశమగును. క్షా + క్త, క్షా + త-ప్రకృతసూత్రముచే తకారమునకు మకారా దేశము. క్షామ+సు=క్షామః.

అవ : నిష్ఠాతకారమునకు కొన్ని యాదేశములు పైసూత్రములచే విధింపఁబడినవి. ఇటుపై నిష్ఠాప్రత్యయము పరమగునపుడు ధాతువులకు కలుగుమార్పులు చెప్పఁబడుచున్నవి.

సూ : నిష్ఠాయాం సేటి 6-4-52.

వృ : ణేర్లోపః, భావితః భావితవాన్.

ప. వి : నిష్ఠాయామ్ (7-1) సేటి (7-1).

అను : ణేః (6-1) లోపః (1-1).

అర్థ : ఇడాగమసహితమైన నిష్ఠాప్రత్యయము పరమగునపుడు 'ణిచ్' ప్రత్యయమునకు లోపము వచ్చును. ఉదా : భావితః, భావితవాన్.

వివ : క్త క్తవతు ప్రత్యయములు వలాది ఆర్ధధాతుకములు. వానికి ఇడాగమము విధింపఁబడినది. (ఆర్ధధాతుకస్యేడ్వలాదేః) ఉపదేశమున ఏకాచ్చయి అనుదాత్తములయిన ధాతువులకు పరముగనున్న వలాద్యార్ధరాతుకమునకును, మఱి కొన్ని సందర్భములందును ఇడాగమము రాదని చెప్పఁబడినది. ప్రకృతమున, 'సేటి నిష్ఠాయామ్' అనగా ఇడాగమము వచ్చిన నిష్ఠాప్రత్యయము పరమగునపుడు' అని యర్థము. ధాతువునకు ప్రేరణార్థమున 'ణిచ్' ప్రత్యయము వచ్చును. ఇడాగమ సహితమైన నిష్ఠాప్రత్యయము పరముగునపుడు ధాతువుయొక్క అంతమున నున్న ఈణిచ్ ప్రత్యయమునకు ప్రకృతసూత్రము లోపమును విధించుచున్నది.

ఉదా : భూ సత్తాయామ్. దీనికి ప్రేరణార్థమున ణిచ్ ప్రత్యయము. (హేతుమతి చ 3-1-25 - ప్రయోజక వ్యాపారమగు ప్రేషణాదికము వాచ్యమగునపుడు ధాతువునకు ణిచ్ప్రత్యయము వచ్చును). భూ + ణిచ్, ణకారచకారము లిత్తులు, ప్రత్యయముణిత్తగుటచే ధాతువు చివరిఅచ్చునకు వృద్ధి వచ్చును. భౌ+ఇ, ఆవాదేశము, భావి - ఇది ణిచ్ ప్రత్యయాంతము. అదియును సనాద్యన్తాధాతవః (3-1-32) అనుసూత్రముచే ధాతువేయగును, సన్ మొదలగు ప్రత్యయములు అంతమునఁ గలవి ధాతువులగును. కావున 'భావి' అనుదానికి క్త ప్రత్యయము వచ్చును. భావి క్త+భావి+త, ఇచట 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' అను సూత్రముచే ప్రత్యయమునకు ఇడాగమమము వచ్చును. ఇది టిత్తుకావున ఆద్యవయవమగును. భావి + ఇత - ఇపుడు ఇడాగమముతో కూడిన నిష్ఠాప్రత్యయము పరమైనది కావున ణిచ్ ప్రత్యయమునకు (ఇకారమునకు) లోపము వచ్చును. భావ్ + ఇత=

భావిత + సు=భావితః. ఇష్ఠే, భావి + ఇతవత్, భావ్ + ఇతవత్ భావితవత్ + సు+భావితవాన్. [ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్' అని యొక పరిభాష కలదు. ప్రత్యయము లోపించినను దానివలన నైనకార్యము చెడదు. కావున ణిచ్ ప్రత్యయము లోపించినను దానివలననైన వృద్ధికి భంగమురాదు.]

సూ : దృఢః స్థూలబలయోః 7-2-70.

వృ : స్థూలే బలవతి చ నిపాత్యతే.

ప వి : దృఢః (1-1) స్థూలబలయోః 7-2.

అను : స్థూలము, బలముగలది యనునర్థములందు 'దృఢ' అనురూపము నిపతింపఁబడుచున్నది.

వివ : దృహ, దృహి వృద్ధౌ - వృద్ధియగుట అనునర్థముగల ఈ ధాతువులు రెంటికి క్త ప్రత్యయము చేరినపుడు, స్థూలమైనది, బలముగలదియను నర్థముల యందు 'దృఢః' అనురూపము ఈ సూత్రముచే నిపతింపఁబడుచున్నది. సామాన్య ప్రక్రియచే నొకరూపమేర్పడవలసియుండగా నట్లుగా దిట్లగునని ప్రక్రియ చెప్పఁ బడకయే రూపమును నిర్దేశించుటకు నిపాతమనిపేరు. ఇచట దృహధాతువునకు క్త ప్రత్యయము చేరినచో 'దృహితః' అని యగును. దృహిధాతువునకు చేరి నచో 'దృంహితః' అగును (ఇకారమిత్తుగాఁగల ధాతువులకు ను మాగమము వచ్చును. ఇదితో నుం ధాతోః 7-1-58) అట్టిరూపములు కావలసియుండగా 'దృఢః' అనునది స్థూలమైన, బలముగల, అనునర్థములందు నిపతింపఁబడినది. ఇచట 'దృహ, + త' అనియుండ ఇడాగమము రాకుండుట, తకారమునకు ఢకారా దేశము, హకారమునకు లోపము అనుకార్యములు నిపతింపఁ బడినవి. దృహిధాతువు విషయమున నుగాగమము రాకుండుటయు నిపతింపఁబడినది. స్థూలబలయోః అనుట వలన ఇతరమైనయర్థములందు దృహితః, దృంహితః అనురూపములగును.

సూ : దధాతేర్హిః 7-4-42.

వృ : తాదౌ కితి హితమ్.

ప. వి : దధాతేః (6-1) హిః (1-1).

అను : తి (7-1) కితి (7-1).

అర్థ : తకారాది కిత్ప్రత్యయము పరమగునపుడు 'ధా' ధాతువునకు 'హి' అనునాదేశమగును. ఉదా : హితమ్.

వివ : 'డుధాఞ్' ధారణపోషణయోః అనుధాతువునకు తకారము ఆదియందు కలదియు కకార మిత్తుగాఁగలదియు నగు ప్రత్యయము పరమగునపుడు 'హి' అను నాదేశము వచ్చును. ('తి, కితి' 'యస్మిన్విధి స్తదాదావల్గ్రహణే' అనుపరిభాషచే తి అనునది తాదౌ అయినది) ఈయాదేశము 'అనేకాల్' కావున సర్వమునకు వచ్చును. అనగా ధాతువునంతటిని తొలఁగించి 'హి' అనునది వచ్చును.

ఉదా : డుధాఞ్, ఇందు డు, ఞ్ అనునవి ఇత్తులు. ధా + క్త కకారమిత్తు ధా + త - ప్రత్యయము తకారాదియగుకిత్తు కావున నీ సూత్రముచే ధాతువగు 'ధా' అనుదానికి 'హి' అమనాదేశమగును హిత + సు = హితమ్ (నపుం). ఉంచఁబడినది.

సూ : దో దద్ ఘోః 7-4-46.

వృ : ఘుసంజ్ఞకస్య దా ఇత్యస్య దద్ తాదౌ కితి. చర్త్వమ్. దత్తః.

ప. వి : దః (6-1) దద్ (1-1) ఘోః (6-1).

అను : తి (7-1) కితి (7-1).

అర్థ : ఘుసంజ్ఞగల 'దా' ధాతువునకు, తకారాదికిత్తు పరమగునపుడు 'దద్' అనునాదేశము వచ్చును. చర్త్వము. ఉదా : దత్తమ్,

వివ : 'దాధాఘ్వదాప్' 1-1-20 అనుసూత్రము దా, ధా అను రూపముగల ధాతువులకు 'ఘు' అనుపేరు పెట్టెను. కాని 'దా' అను స్వరూపము పొందెడు దైప్, దాప్ అనుధాతువుల కీ ఘు సంజ్ఞలేదు. 'ఘు' సంజ్ఞగల 'దా' ధాతువునకు తకారమాదియందు గల కకారమిత్తుగాఁగల ప్రత్యయము పరపగునపుడు 'దద్' అనునాదేశము వచ్చును. అది అనేకవర్ణములు గల ఆదేశమగుటచే 'అనేకాల్ శిత్ సర్వస్య' అను పరిభాషచే సర్వాదేశమగును. 'ఘు సంజ్ఞ కల' యనుటచే అది లేని దాప్, దైప్ ధాతువుల కీకార్యము జరుగదు.

ఉదా : 'డుదాఞ్' దానే - ఇందు డు, ఞ్ అనునవి ఇత్తులు. దా + క్త (నిష్ఠా) దా + త-ఇది తకారాదియైన కిత్ప్రత్యయము. కావున ధాతువునకు 'దద్' అనునాదేశము వచ్చును. దద్ + త, ఖరిచ అనుసూత్రముచే రెండవదకారము నకు చర్త్వము, తకారము వచ్చును. దత్ + త = దత్త + సు = దత్తః (పుం) - ఈఁబడినవాఁడు.

క్తక్తవతూనిష్ఠా అనునది మొదలు ఇంతవఱకుఁగలభాగము నిష్ఠా ప్రకరణము. ఇందు నిష్ఠా ప్రత్యయము లేవో యవియే యర్థమున ధాతువునకు చేరునో,

వానిలోని తకారమున కేయేమార్పులెప్పుడెప్పుడు వచ్చును, అవి పరమగునపుడు ధాతువులలో వచ్చుమార్పు లెట్టివియో యిందు చెప్పఁబడినవి.

సూ : లిటః కానజ్వా 3-1-106.

సూ : క్వసు శ్చ 3-2-107.

వృ : లిటః కానచ్ క్వసూ వా స్తః. తఙానావాత్మనేపదమ్. చక్రాణః.

ప. వి : లిటః (6-1) కానచ్ (1-1) వా (అవ్య) క్వసుః (1-1) చ (అవ్య).

అను : ఛందసి (7-1) భూతే (7-1).

అర్థ : లిట్ ప్రత్యయమునకు కానచ్, క్వసు అను ప్రత్యయములు వేదమున వికల్పముగా నాదేశములగును. ఇందు 'కానచ్' ప్రత్యయము 'తఙానా వాత్మనే పదమ్' అనుసూత్రముచే ఆత్మనేపద సంజ్ఞకలది యగును. ఉదా : చక్రాణః.

వివ : అనద్యతన పరోక్షభూతకాలమున ధాతువునకు 'లిట్' అను ప్రత్యయము విధింపఁబడినది (పరోక్షేలిట్ 3-2-115) అద్యతన=నేటికి సంబంధించినది, అనద్యతన=నేటికి సంబంధించనిది, పరోక్ష = ప్రత్యక్షము కానిది. కావున ఎన్నడో మన ఇంద్రియములకు గోచరము కానికాలమున జరిగిన వ్యాపారమును, దెలుపు ధాతువునకు 'లిట్' ప్రత్యయము వచ్చును. మఱియు ఛన్దసిలిట్ (3-2-105) అనుసూత్రముచే భూత సామాన్యమున, ధాతువునకు, వేదభాషలో, లిట్ ప్రత్యయము వచ్చును. ఇట్లు రెండు విధములుగా.వచ్చిన లిట్ ప్రత్యయము యొక్కస్థానమునకానచ్, క్వసు అను ప్రత్యయములు వైకల్పికముగానగును. ఇందు కానచ్ ప్రత్యయమునకు అత్మనేపదమను సంజ్ఞకలదు. (తఙానావాత్మనేపదమ్ తఙ్ ప్రత్యయములు. శానచ్, కానచ్ ప్రత్యయములును ఆత్మనేపదములు) కావున ఈ కానచ్ ప్రత్యయము ఆత్మనే పదిధాతువులకుమాత్రమే వచ్చును. క్వసు ప్రత్యయము పరస్మై పదిధాతువులకు వచ్చును. (లఃపరస్మైపదమ్).

ఉదా : కృ + లిట్, కృ + కానచ్. ఇందు కకారచకారములిత్తులు. కృ + అన. ధాతువునకు లిట్టు పరమగునపుడు ద్విత్వము వచ్చును (లిటిధాతోరనభ్యాసస్య 6-1-8) కృ + కృ + అన, ఇందు మొదటిదానికి అభ్యాసమని పేరు (పూర్వోఽభ్యాసః 6-1-4) అభ్యాసమున ఋకారమునకు హ్రస్వ అకారమాదేశమగును. అది రపరముగా వచ్చును. (ఉరత్ (7-4-66) ఉరణ్ రపరః) కర్ + కృ+అన, అభ్యాసమున ఝల్లులకు ఆంతరతమ్యమునుబట్టి జశ్శులు, చర్రులు

వచ్చును (అభ్యాసేచర్చ 8-4-54) చర్ + కృ+అన - అభ్యాసమున మొదటి హల్లు మిగులును. తక్కిన హల్లులు లోపించును. (హలాదిః శేషః 7-4-60) యణాదేశసంధి - చక్ర్+అన = చక్రాన - నకారమునకు ణత్వము (అట్కు ప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి 8-4-2) చక్రాణ + సు=చక్రాణః - చేసినవాఁడు.

గత్యర్థకమగు గమ్ ధాతువులో ఌకారమిత్తు. దీనికి లిట్ ప్రత్యయము

గమ్ + లిట్ - లిట్టునకు 'క్వసు' ప్రత్యయ మాదేశమగును. గమ్ క్వసు, పూర్వోదాహరణమునందువలె ధాతువు ద్విరుక్తమగుట, గమ్, గమ్ + క్వసు. మొదటిదాని గకారమునకు జశ్త్వము జమ్ + గమ్ + క్వసు - మకారమునకు లోపము జగమ్ + క్వసు - ఈ ప్రత్యయమున కకార ఉకారము లిత్తులు. జగమ్+ వస్' అని యుండును.

అవ : పై స్థితిలో మకారమున కీక్రింది సూత్రముచే నకారమాదేశ మగును.

సూ : మ్వోశ్చ 8-2-65.

వృ : మాన్తస్య ధాతో ర్నత్వం మ్వోఃపరతః జగన్వాన్.

ప. వి : మ్వోః (7-2) చ (అవ్య).

అను : మః (6-1) నః (1-1) ధాతోః (6-1).

అర్థ : మకారాంతధాతువునకు, మకారవకారములు పరములగునపుడు నకార మాదేశమగును. ఉదా : జగన్వాన్.

వివ : 'మః' అనుషష్ఠ్యంతపదము. ధాతోః అనుదానికి విశేషణము. కావున తదంతవిధిచే 'మకారాంతధాతువునకు' అనునర్థము కలుగును. 'మ్వోః' అనునది సప్తమ్యంతము కాన 'మకారవకారములు పరములగునపుడు' అనునర్థము వచ్చును. ఇట్లు, మకారవకారములు పరములగునపుడు మకారాంతధాతువునకు నకారమాదేశమగును అనునర్థము వచ్చినది. 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే ధాతువు తుదిమకారమున కీయాదేశము వచ్చును.

ఉదా : జగమ్ + వస్ - జగన్ + వస్ = జగన్వస్ + సు = జగన్వాన్=వెళ్ళినవాఁడు.

వైకల్పికమగుటచే లిట్ ప్రత్యయరూపములు కూడనుండును.

సూ : లట శ్శతృశానచావప్రథమాసమానాధికరణే 3-2-124.

వృ : అప్రథమాన్తే సమానాధికరణే లటః ఏతౌ వా స్తః. శబాదిః. ఉదా : పచన్తం చైత్రం పశ్య.

ప. వి : లటః (6–1) శతృశానచౌ (1–2) అప్రథమాసమానాధికరణే (7–1).

అను : ధాతోః (5–1) ప్రత్యయః (1–1) కృత్ (1–1) విభాషా (1–1).

అర్థ : ప్రథమాంతము కానిది సమానాధికరణముగా నున్నపుడు 'లట్'ప్రత్యయమునకు శతృ, శానచ్ ప్రత్యయములు వైకల్పికముగా నగును. శబాదికార్యము. ఉదా : పచన్తం చైత్రం పశ్య.

వివ : అధికరణమనగా ద్రవ్యము. లేక పదముచేత వాచ్యమగు వ్యక్త్యాదికము. సమానమైన ఆధికరణము=వాచ్యము ఏరెండు పదములకు ఉండునో అవి సమానాధికరణములు. రామోదాశరథిః అనుచోట రామశబ్దముచే చెప్పఁబడెడు వ్యక్తియు, దాశరథిశబ్దముచే చెప్పఁబడు వ్యక్తియు నొక్కఁడే కావున నివి పరస్పరము సమానాధికరణములు. లట్ ప్రత్యయము వర్తమానక్రియావృత్తియగు ధాతువునకు విధింపఁబడినది, (వర్తమానేలట్ 3–2–123.) ఆ లట్ ప్రత్యయము అంతమునఁగలశబ్ద స్వరూపమునకు సమానాధికరణమైనపదము ప్రథమాంతము కానియపుడు, అనగాద్వితీయావిభక్త్యాదిరూపము అయినపుడు, ధాతువునకు విధింపఁబడిన లట్ ప్రత్యయము యొక్క స్థానమున శతృ, శానచ్ అను ప్రత్యయములు ఈః సూత్రముచే వైకల్పికముగా విధింపఁబడుచున్నవి. వర్తమానమనగా అప్పటికి ముగియకుండునది. ఈః ప్రత్యయములందు 'శానచ్' ప్రత్యయమునకు ఆత్మనే పదమను సంజ్ఞకలదు. (తఙానావాత్మనేపదమ్) కావుననిది ఆత్మనేపది ధాతువులకే వచ్చును. శతృప్రత్యయము పరస్మైపదిధాతువులకు పరముగా చేరును. శతృప్రత్యయమునందు శకారఋకారములును, శానచ్ ప్రత్యయమునందు శకారచకారములును ఇత్తులు (లశక్వతద్ధితే, ఉపదేశేఽజనునాసికఇత్, హలన్త్యమ్)కావున అత్, ఆన అనునవి మిగులును. ఇవి శిత్తులగుటచే సార్వధాతుకములు (తిఙ్ శిత్ సార్వధాతుకమ్). ఇవి పరములగునవుడు ధాతువునకు పరముగా ఆయాగణముల ననుసరించి శబాది ప్రత్యయములు వచ్చును. ధాతువులు మొత్తము పదిగణములుగా విభజింపఁబడినవి. (1) భ్వాది (2) అదాది )3) జుహోత్యాది (4) దివాది (5) స్వాది (6) తుదాది (7) రుధాధి (8) తనాది (9) క్ర్యాది (10) చురాది అనునవి. వీనికి వరుసగా (1) శప్ (2) లుక్ (3) శ్లు (4) శ్యన్ (5) శ్ను (6) శ (7) శ్నమ్ (8) ఉ (9) శ్నా (10) ణిచ్ అను ప్రత్యయ

ములు సార్వధాతుక ప్రత్యయములు పరములగునపుడు చేరును. వీనినే వికరణ ప్రత్యయము లందురు. ఇవియే శబాదులు.

ఉదా : 'డుపచష్' – పాకే – ఇందు డు, ష్ అనునవి ఇత్తులు. అకారము ఉచ్చారణార్థము. పచ్ + శతృ (ఈ ధాతువు ఉభయపది. కావున దీనికి పరస్మై పదిధాతువులకు చేరు శతృప్రత్యయమును, ఆత్మనేపదిధాతువులకు చేరు శానచ్ ప్రత్యయమును రెండును రావచ్చును.) ఇది భ్వాది గణధాతువు. కనుక శతృ ప్రత్యయము పరమగునపుడు ఈ ధాతువునకు పరముగా 'శప్' ప్రత్యయము వచ్చును (కర్తరిశప్ 3-1-68) పచ్+శప్ + శతృ - ఇందు ఇత్తులకు లోపము. శ్, ప్, శ్, ఋ లు ఇత్తులు. పచ్ + అ+అత్ – అతోగుణే అనుసూత్రముచే రెండు అకారములకు పరరూపమేకాదేశమగును. 'పచత్' ఇది ప్రాతిపదికము. ఇది అప్రథమాంతమునకు విశేషణము కావలయునని సూత్రమున నిర్దేశింపఁబడు టచే ద్వితీయాంతోదాహరణము చూపఁబడినది. పచత్ + అమ్=పచన్తమ్, పచ న్తం చైత్రం పశ్య – వండుచున్న చైత్రునిచూడుము.

ఈ పచ్ధాతువు ఉభయపది అని చెప్పఁబడినది. కావున ఆత్మనేపదసంజ్ఞ గల 'శానచ్' ప్రత్యయము కూడదీనికి చేరవచ్చును. పచ్ + శానచ్, పచ్+శప్ + శానచ్ – పచ్ + అ+ఆన, పచ+ఆన. అనియుండగా క్రిందిసూత్రముచే నిచట ముగాగమము విధింపఁబడుచున్నది.

సూ : ఆనే ముక్ 7-2-82.

వృ : ఆదన్తాఙ్గస్య. పచమానం చైత్రం పశ్య.

ప. వి : ఆనే (7-1) ముక్ (1-1).

అను : అతః (6-1) అఙ్గస్య.

అర్థ : అదంతమైన అంగమునకు 'ఆన' పరమగునపుడు ముగాగమమగును. ఉదా : పంచమానం చైత్రం పశ్య.

వివ : దేనికి ప్రత్యయము విధింతుమో అది ఆదిగాగలసముదాయమునకు ఆ ప్రత్యయము పరమగునపుడు 'అంగము' అనుసంజ్ఞ కలుగునని చెప్పఁబడినది (యస్మాత్ ప్రత్యయవిధిస్తదాది ప్రత్యయేఽఙ్గమ్ 1-4-13). అనువృత్తమైన 'అతః' అనునది అఙ్గస్య అనుదానికి విశేషణము. కావున తదంతవిధిచే 'అదంత మైన అంగమునకు' అనునర్థము కలుగును. 'ఆనే' అనునది సప్తమ్యంతము కావున తస్మిన్నిత్యాది పరిభాషచే 'ఆన' అనునది పరమగునపుడు' అనునర్థము

వచ్చును. కావున అదంతమైన అంగమునకు, అనపరమగునప్పుడు, 'ముక్' అనునాగమము వచ్చునను సూత్రార్థమేర్పడినది. ఇందు కకారమిత్తు, ఉకార ముచ్చారణార్థము. కిత్తగుటచే అదంతమైన అంగమునకు అంతావయవముగ వచ్చును (ఆద్యన్తౌటకితౌ.)

ఉదా : పచ + ఆన – ఇందు 'పచ' అనునది అదంతమైన అంగము. దానికి ఆన పరమైనది. కాన ముగాగమము రాఁగా పచ, ముక్ + ఆన – పచమ్ + ఆన = పచమాన + అమ్ = పచమానమ్, పచమానం చైత్రం పశ్య. వండుచున్న చైత్రుని చూడుము. సమానాధికరణమైన 'చైత్రమ్' అనునది యిచట ద్వితీయాంతము.

అవ : ఈ సూత్రమున 'అప్రథమా సమానాధికరణే' అనుపదమునకు సంబంధించిన విశేష మొకటి చెప్పఁబడుచున్నది.

వృ: లడిత్యనువర్తమానే పునర్లడ్గ్రహణాత్ ప్రథమాసామానాధికరణ్యేఽపి క్వచిత్. సన్ ద్విజః.

అర్థ : 'లట్' అనుపదము అను వర్తమానమగుచుండగా మరల సూత్రమున లట్ పదమును గ్రహించుటవలన ప్రథమాసామానాధికరణ్యమున్నపుడును అందందు ఈ ప్రత్యయములు రావచ్చును. ఉదా : సన్ ద్విజః.

వివ : లటశ్శతృ ఇత్యాది సూత్రమునకు పై సూత్రము 'వర్తమానేలట్' అనునది. అందునుండి యీ సూత్రమునకు 'లట్' అనుపదము ననువృత్తి చేసికొని దానిని షష్ఠ్యంతముగా మార్చికొనినచో యీ సూత్రమున మరల 'లటః' అను పదము ఉండనక్కరలేదు. అట్టియెడ నీసూత్రమునందు 'లటః' అను పదము యొక్క ప్రయోజనమేమి? అని ప్రశ్నించుకొని యొక విశేషార్థమును స్ఫురింపఁజేయుటకై యీ పదము సూత్రమున చేర్పఁబడినదని సమాధానము చెప్పఁబడినది. ఇట్లు 'లటః' అనుపదమును మరల గ్రహించుటచే నిందు విధింపఁబడిన శతృశానచ్ ప్రత్యయములు, ప్రథమాసామానాధికరణ్యమున్నపుడును క్వాచిత్కముగా రావచ్చుననునర్థ విశేషము తెలుపఁబడినది. అది సార్వత్రికము కాకుండుటకై యిట్టి సూచనద్వారమున తెలుపుట జరిగినది. కావున శతృశానచ్ ప్రత్యయములు. కొండొకచో ప్రథమాంతములకును విశేషణములు కావచ్చును.

ఉదా : సన్ ద్విజః – ఇచట సన్ అను శతృప్రత్యయాంతము 'ద్విజః' అను ప్రథమాంతమునకు విశేషణమైనది. 'అస' భువి అనునది ధాతువు. ఇందు అకార

ముచ్చారణార్థము. అస్ + లట్ = అస్ + శతృ. ఈధాతువు అదాదిగణము లోనిది. కావున దానికి కర్తరిశప్ అనుసూత్రముచే వచ్చినశప్ ప్రత్యయమునకు 'అది ప్రభృతిభ్యశ్శపః 7_2_72' అనుసూత్రముచే లుక్కు (అదర్శనము)వచ్చును. అస్ + శతృ - ఇత్తులకు లోపము, అస్ + అత్ - అనియుండ 'శ్నసోర ల్లోపః 6-4-111' (శ్నప్రత్యయము యొక్కయు అస్ధాతువుయొక్కయు అకారము నకు, కిత్తుగాని ఙిత్తుగానిపరమగునపుడు, లోపము వచ్చును) అనుసూత్రముచే అస్ ధాతువు యొక్క అకారమునకు లోపము వచ్చును (సార్వధాతుకమపిత్ 1-2-4. పిత్తు గాని సార్వధాతుకము ఙిత్తువంటిదగును-అనుసూత్రముచే 'శతృ' ప్రత్యయము ఙిత్తు వంటిదగును), స్+అత్ = సత్+సు=సన్ (పుం). సన్ద్విజః.

సూ : విదేశ్శతుర్వసుః 7-1-36.

వృ : వేత్తేః పరస్య శతుర్వసురాదేశో వా. విదన్, విద్వాన్.

ప. వి : విదేః (5-1) శతుః (6-1) వసుః (1-1).

అను : అన్యతరస్యామ్ (అవ్య).

అర్థ ; విద్ధాతువునకు పరముగా నున్న శతృప్రత్యయమునకు 'వసు' అను నాదేశము వైకల్పికముగా నగును. ఉదా : విదన్, విద్వాన్.

వివ ; 'విద' జ్ఞానే - అనుధాతువునకు చేరిన శతృప్రత్యయమునకు వైకల్పికముగా 'వసు' అనునాదేశము వచ్చును. ఇది అదాదిగణములోనిది విద్+లట్, విద్+శతృ, విద్ + శప్ + శతృ, అనియుండ 'శప్' ప్రత్యయమునకు లుక్కు. (అది ప్రభృతిభ్యశ్శపః) విద్ + శతృ - అనియుండ ప్రకృత సూత్రముచే 'వసు' ఆదేశము. ఇది అనేకవర్ణాదేశమగుటచే శతృప్రత్యయము నంతటిని తొలఁగించి వచ్చును (అనేకాల్శిత్సర్వస్య) విద్ + వసు - ఇందు ఉకారమిత్తు (ఉపదేశేఽజనునాసికఇత్) విద్ + వస్=విద్వస్ + సు=విద్వాన్. అగును.

ఈ వసు ఆదేశము వైకల్పికము కాన రానిచో విద్ + శతృ, విద్+అత్= విదత్+సు=విదన్ అగును.

అవ : శతృశానచ్ ప్రత్యయములకొక పేరుపెట్టఁబడుచున్నది.

సూ : తౌ సత్ 3-2-127.

వృ : తౌ శతృశానచౌ సత్సంజ్ఞౌ స్తః

ప. వి : తౌ (1.2) సత్ (1-1).

అర్థ : అవి (శతృశానచ్ ప్రత్యయములు) 'సత్' అను సంజ్ఞకలవియగును.

వివ : ఇది సంజ్ఞాసూత్రము. 'తౌ' అను సర్వనామము పూర్వము చెప్పఁబడినదానిని పరామర్శించును. కావున 'అవి' అనగా పూర్వసూత్రమునఁ జెప్పఁబడినవగు శతృశానచ్ ప్రత్యయములు. ఈ రెంటికిని 'సత్' అనుసంజ్ఞ యీ సూత్రముచే చేయఁబడినది. ఈ వ్యాకరణమున 'సత్' అని ప్రత్యయపరముగా నుపయోగింపఁబడినపుడు ఈరెండు ప్రత్యయములును గ్రహింపఁబడునని తాత్పర్యము.

సూ : లృట స్సద్వా 3-3-14.

వృ : కరిష్యన్తం కరిష్యమాణం పశ్య.

ప. వి : లృటః (6-1) సత్ (1-1) వా (అవ్య).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : ధాతువునకు విధింపఁబడిన లృట్ ప్రత్యయముయొక్క స్థానమున 'సత్' ప్రత్యయము వైకల్పికముగా నగును. ఉదా : కరిష్యన్తం, కరిష్యమాణం పశ్య.

వివ : లృట్ ప్రత్యయము ధాతువునకు భవిష్యదర్థమున వచ్చును. (లృట్ శేషేచ 3-3-13). అట్లు వచ్చిన లృట్ ప్రత్యయముయొక్క స్థానమున శతృశానచ్ ప్రత్యయములు వైకల్పికముగా నగునని సూత్రార్థము. ఇందు శతృప్రత్యయము పరస్మైపదిధాతువులకును, శానచ్ ప్రత్యయము ఆత్మనే పదిధాతువులకును అగుట పూర్వమువలెనే అని తెలియునది.

ఉదా : డుకృఞ్ కరణే - ఇది ఉభయపది. కావున నీరెండు ప్రత్యయములును పర్యాయముగా రావచ్చును. కృ + లృట్ - అనియుండ స్యతాసీల్లృలుటోః 3-1-33 (లృ, లుట్ ప్రత్యయములు పరములగునపుడు ధాతువునకు క్రమముగా స్య, తాసి అను ప్రత్యయములు వచ్చును) అనుసూత్రముచే 'స్య' ప్రత్యయము వచ్చును కృ + స్య + లృట్. స్యప్రత్యయము వలాది ఆర్థధాతుకము కావున ఇడాగమము వచ్చును. టిత్తగుటచే ఆద్యవయవమగును. (ఆద్యన్తౌటకితౌ) కృ+ ఇస్య + లృట్ ఆదేశప్రత్యయయోః 8-3-59 (ఇణ్ కవర్గములకు పరముగనున్న ఆదేశసంబంధి, ప్రత్యయసంబంధి యగు సకారమునకు షకారమగును) అనుసూత్రముచే సకారమునకు షత్వము. కృ + ఇష్య + లృట్-ఆర్థధాతుకము పరమగుటచే ధాతువులోని ఇగ్వర్ణమగు ఋకారమునకు గుణము (సార్వధాతు కార్థధాతుకయోః) అకారము రపరముగా వచ్చును. (ఉరణ్ రపరః) కర్ + ఇష్య + లృట్. ఇచట

శతృప్రత్యయము ల్రృట్టునకు అదేశమగును. కరిష్య + శతృ - కరిష్య + అత్- అతోగుణే పరరూపము-కరిష్యత్ + అమ్=కరిష్యన్తమ్ - కరిష్యన్తం చైత్రం పశ్య = చేయఁగల చైత్రుని చూడుము.

ఇట్లే కరిష్య + ల్రృట్ అనియుండ శానచ్ ప్రత్యయము వచ్చినచో కరిష్య+ శానచ్, కరిష్య + ఆన, ఆనేముక్, ముగాగమము, కరిష్యమ్ ఆన + నకారము, నకు 'అట్కు ప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి' అను సూత్రముచే ణత్వము కరిష్యమాణ + అమ్ = కరిష్యమాణమ్.

ఈ సూత్రమునందలి 'వా' పదమునకు వ్యవస్థచేసికొని కొన్నియర్థములలో నీ సత్ప్రత్యయాదేశము ల్రృట్టునకు నిత్యమని వ్యాఖ్యాతలు వివరించిరి.

సూ : ఆక్వే స్తచ్ఛీలతద్ధర్మ తత్సాధుకారిషు 3-2-134.

వృ : క్విపమభివ్యాప్య వక్ష్యమాణా స్తచ్ఛీలాదిషు కర్తృషుబోధ్యాః.

ప. వి : ఆక్వేః (5-1) తచ్ఛీలతద్ధర్మ తత్సాధుకారిషు (7-3).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : వక్ష్యమాణమగు క్విప్ ప్రత్యయమును కలుపుకొని అంతవఱకు విధింపఁబడు ప్రత్యయములు తచ్ఛీలుఁడు, తద్ధర్ముఁడు, తత్సాధుకారి యనునవి కర్త లైనపుడు అగునని తెలియఁదగును.

వివ : ఈ సూత్రము మొదలుకొని 'భ్రాజభాస – – –' (3-2-177) అను సూత్రమువఱకు విధింపఁబడు ప్రత్యయము లన్నియు తచ్ఛీలుఁడు, తద్ధర్ముఁడు, తత్సాధుకారి అను కర్తలు తెలియఁబడునపుడు ధాతువులకు చేరును. తచ్ఛీలుఁడు అది స్వభావముగా కలవాఁడు-ఫలము నపేక్షింపక స్వభావమునుబట్టి ప్రవర్తించు వాఁడని యర్థము. తద్ధర్ముఁడు ఇది నా ధర్మమని ప్రవర్తించువాఁడు. తత్సాధుకారి - ఆ పనిని నిపుణముగా చేయువాఁడు. ఈ మూఁడు లక్షణములలో నేదోయొకటి అభివ్యక్తమగునపుడు ఇది మొదలుకొని చెప్పఁబడు ప్రత్యయము లగునని తాత్పర్యము.

అవ : తత్సాధుకారి కర్తకొక యుదాహరణమును జూపుచు ప్రత్యయమొకటి విధింపఁబడుచున్నది

సూ : తృన్ 3-2-135.

వృ : కర్తా కటాన్.

ప. వి : తృన్ (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : ధాతువునకు 'తృన్' అను ప్రత్యయము తచ్ఛీలాది కర్తలను తెలుపుచు వచ్చును. ఉదా : కర్తా కటాన్.

వివ : కటాన్ కర్తా - చాపలను నేర్పుగా నల్లువాఁడు. ఇచట తత్సాధుకారిత - అపని నేర్పుగా చేయఁగలుగుట అనులక్షణముగల కర్త తెలియఁబడుచున్నది. కృ + తృన్ - ఇందునకారమిత్తు. సార్వధాతుకార్ధధాతుకయోః' గుణము అకారము ర పరముగా వచ్చును. కర్ + తృ = కర్తృ + సు = కర్తా (పుం).

సూ : జల్పభిక్షకుట్టలుణ్ట వృఙష్షాకన్ 3-2-155.

ప. వి : జల్ప, భిక్ష, కుట్ట, లుణ్ట, వృఙః (5-1) షాకన్ (1.1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : జల్ప, భిక్ష, కుట్ట, లుణ్ట, వృఙ్ అనుధాతువులకు తచ్ఛీలాద్యర్థములయందు 'షాకన్' అను ప్రత్యయము వచ్చును.

వివ : తచ్ఛీలము, తద్ధర్మము, తచ్ఛీలకారి అనునర్థములు వ్యక్తమగునపుడు జల్ప, భిక్ష, కుట్ట, లుణ్ట, వృఙ్ అనుధాతువులకు పరముగా 'షాకన్' అను కృత్ప్రత్యయము చేరును.

అవ : ఈ ప్రత్యయమున షకారమున క్రిందిసూత్రముచే ఇత్సంజ్ఞ విధింపఁబడుచున్నది.

సూ : షః ప్రత్యయస్య 1-3-6.

వృ : ప్రత్యయస్యాదిః ష ఇత్సంజ్ఞః స్యాత్.

ప. వి : షః (1-1) ప్రత్యయస్య (6-1).

అను : ఉపదేశే (7-1) ఆదిః (1-1) ఇత్ (1-1).

అర్థ : ఉపదేశమున ప్రత్యయముయొక్క ఆదివర్ణమగు షకారము ఇత్సంజ్ఞ కలది యగును.

వివ : 3,4,5 అధ్యాయములలో ధాతువులకు నామములకును విధింపఁబడినవి ప్రత్యయములు. అట్టి ప్రత్యయసంజ్ఞ కలవానియొక్క మొదటివర్ణమైన షకారము ఇత్తగును.

ఉదా : 'షాకన్' - ఇది ప్రత్యయము దీని తొలివర్ణము షకారము. అది ఇత్తగును. 'తస్యలోపః' అనుసూత్రముచే దానికి లోపము వచ్చును ష్+అకన్= అక - నకారమునకు 'హలన్త్యమ్' అనుసూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును.

అవ : జల్పభిక్షాదిధాతువులకు 'షాకన్' ప్రత్యయముచేరిన ఉదాహరణములు వృత్తిలో చూపఁబడుచున్నవి.

వృ : జల్పాకః, వరాకః.

వివ : 'జల్ప' వ్యక్తాయాం వాచి - జల్ప్ + షాకన్, షకారనకారము లిత్తులు. జల్ప్ + అక =జల్పాక + సు = జల్పాకః - మాటాడుట శీలముగా (స్వభావముగా) గలవాఁడు (వదరుబోతు).

వృఙ్ సంభక్తౌ - ఙకారమిత్తు - వృ + షాకన్ = వృ + అక, ఋకార మునకు గుణమగు అకారము. (సార్వధాతుకార్ధధాతుకయోః) రపరముగా వచ్చును. వర్ + అక = వరాక + సు = వరాకః = సేవించుట ధర్మముగా గలవాఁడు (బీదవాఁడు.)

ఇట్లే, భిక్ష్ + షాకన్=భిక్షాకః, (బిచ్చమెత్తువాఁడు), కుట్టు + షాకన్ కుట్టాకః (భేదించునది) లుణ్ట + షాకన్ = లుణ్టాకః (దొంగిలించువాఁడు) అనునవి యగును.

సూ : సనాశంసభిక్ష ఉః 3-2-168.

వృ : చికీర్షుః, ఆశంసుః, భిక్షుః.

ప. వి : సనాశంభిక్షః (5-1) ఉః (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : సన్నంతమగుధాతువునకు, ఆఙ్పూర్వకశంసుధాతువునకు, భిక్షధాతు వునకు తచ్ఛీలాద్యర్థములయందు 'ఉ' అను ప్రత్యయము వచ్చును. ఉదా : చికీర్షుః, ఆశంసుః, భిక్షుః.

వివ : 'సన్' అనునది యొక ప్రత్యయము. 'ఆ పనిని చేయఁగోరుట' అను నర్థమున నదిధాతువునకు చేరును. (ధాతోః కర్మణః సమానకర్తృకా దిచ్ఛాయాం వా 3-1-7) ఆ ప్రత్యయము చేరినరూపమునకును ధాతుత్వ ముండును (సనాద్యన్తా ధాతవః 3-1-32). అట్టిసన్ ప్రత్యయము అంతమందుగలధాతువునకును, 'ఆఙ్' అను ఉపసర్గముగల శంస్ ధాతువునకును, భిక్ష్ధాతువునకును, తచ్ఛీలాద్యర్థముల యందు 'ఉ' అను కృత్ప్రత్యయము చేరును.

ఉదా : కృ అనుధాతువునకు సన్ ప్రత్యయము చేసినరూపము 'చికీర్ష' అనునది దీనికి ఉ ప్రత్యయము చేరగా 'చికీర్ష + ఉ' అనియుండును. ఇట్టియెడ 'అతోలోపః' 6 4 48 (ఆర్ధధాతుకోపదేశకాలమున అదంతమైనదాని అత్తునకు ఆర్ధధాతుకము పరమగునపుడు లోపము వచ్చును) అనుసూత్రమునే చికీర్షలోని అకారమునకు లోపము వచ్చును. చికీర్ష్ + ఉ = చికీర్షుః = చేయునిచ్ఛ గలవాఁడు.

ఆ(ఙ్) శంస్ + ఉ = ఆశంసు + సు = ఆశంసుః (ఆశించుస్వభావము గలవాఁడు.

భిక్ష్ + ఉ = భిక్షు + సు = భిక్షుః (యాచించువాఁడు).

సూ : భ్రాజభాసధుర్వీద్యుతోర్జి పౄజు గ్రావస్తువః క్విప్ 3-2-177.

వృ : విభ్రాట్, భాః.

ప. వి : భ్రాజ— — —. స్తువః (5-1) క్విప్ (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : భ్రాజ, భాస, ధుర్వీ, ద్యుత, ఊర్జి, పౄ, జు, గ్రావస్తుధాతువులకు తచ్ఛీలాద్యర్థములయందు క్విప్ ప్రత్యయము వచ్చును. ఉదా : విభ్రాట్, భాః

వివ : ఇందు, గ్రావస్తు అనునది 'గ్రావ' అనునది యుపపదముగాగల స్తుధాతువు, క్విప్ ప్రత్యయమున కకారపకారము లిత్తులు (లశక్వతద్ధితే, హలన్త్యమ్) ఇకార ముచ్చారణార్థము. మిగిలిన వకారమునకు (వ్) వేరపృక్తస్య అనుసూత్రముచే లోపమువచ్చును. ఇట్టిది సర్వలోపి. అయినను ఇదిచేరినధాతువునకు ప్రాతిపదికత్వమగుట, గుణనిషేధాది కిత్కార్యములు, తుగాగమాది పిత్కార్యములు మున్నగునవి జరుగును.

ఉదా : భ్రాజృదీప్తౌ - ఈ ధాతువునకు 'వి' అనునుపసర్గము ఉపపదముగానున్నది. ఇందు ఋకారమిత్తు వి, భ్రాజ్ + క్విప్ (క్, వ్, ఇ ప్)-ప్రత్యయములోనివర్ణములన్నియు లోపించును. విభ్రాజ్+సు=(హలంతశబ్దములకు పరముగానున్న సుప్రత్యయము లోపించును) విభ్రాజ్ - ఇది పదము. ఇందు జకారమునకు షత్వము, దానికి జశ్త్వము, వైకల్పికముగా చర్త్వము రాఁగా విభ్రాట్ (ప్రకాశించువాఁడు) అగును.

'భాసృ' దీప్తౌ - ఇందు ఋకారమిత్తు. భాస్ + క్విప్ = భాస్ + సు = భాస్=సకారమునకు రుత్వవిసర్గములు (ససజుషోరుః, ఖరవసాన యోర్విసర్జనీయః) భాః=కాంతి.

'ధుర్వీ' హింసాయామ్-ఇందు ఈకారమిత్తు (ఉపదేశేఽజనునాసిక ఇత్) ధుర్వ్ + క్విప్.

అవ : ధుర్వ్ + క్విప్ అనియుండ నీక్రిందిసూత్రముచే ధాతువువకారమునకు లోపము విధింపఁబడుచున్నది.

సూ : రాల్లోపః 6-4-21.

వృ : రేఫాచ్ఛ్వోర్లోపః క్వౌ ఝలాదౌ క్ఙితి. ధూః

ప. వి : రాత్ (5-1) లోపః (1-1).

అను : ఛ్వోః (6-2) క్విఝలోః (7-2) క్ఙితి 7-1.

అర్థ : క్విప్ ప్రత్యయము పరమగునపుడును, ఝలాదికిత్తు లేక ఙిత్తుఅయిన ప్రత్యయము పరమగునపుడును, రేఫమునకు పరముగా నున్న ఛకారవకారములకు లోపము వచ్చును. ఉదా : ధూః.

వివ : ఝల్‌వర్ణము ఆదియందు కలదియై కకారములేక ఙకారము ఇత్తుగాఁ గల ప్రత్యయముగాని, క్విప్ ప్రత్యయము గాని పరమగునపుడు రేఫమునకు పరముగా నున్న ఛకారవకారములకు లోపము వచ్చును.

ఉదా : ధుర్వ్ + క్విప్ - ఇచట క్విప్ ప్రత్యయము పరమైనది. వకారము రేఫమునకు పరముగానున్నది. కావున నీసూత్రముచే వకారలోపము రాఁగా ధుర్ + క్విప్ అగును. క్విప్పు అంతయు లోపించును. ధుర్+సు = ధుర్- అనియుండ ర్వోరుపధాయా దీర్ఘ ఇకః 8-2-76 (రేఫాంతముగాని వకారాంతము గాని అయిన ధాతువుయొక్క ఉపధయగు ఇక్కునకు పదాంతమున దీర్ఘము వచ్చును) అనుసూత్రముచే ఉకారమునకు దీర్ఘమురాగా 'ధూర్' అగును. ఈరేఫ మునకు ఖరవసాన యోర్వి సర్జనీయః అనుసూత్రముచే విసర్గమాదేశమగును. ధూః.

అవ : భ్రాజభాసాది సూత్రమునందలి తక్కినధాతువుల కుదాహరణములు వృత్తిలో చూపఁబడుచున్నవి.

వృ : విద్యుత్, ఊర్క్, పూః, దృశిగ్రహణస్యాపకర్షజవతేర్దీర్ఘః. జూః, గ్రావస్తుత్.

వివ : వి అనునుపసర్గము పూర్వమునసున్న ద్యుతధాతువునకు క్విప్ ప్రత్యయము. విద్యుత్ + క్విప్, విద్యుత్ + సు = విద్యుత్ - మిక్కిలి ప్రకాశించునది. (ద్యుతదీప్తౌ).

'ఊర్జ' బలప్రాణనయోః - ఊర్జ్ + క్విప్ - ఊర్జ్ + సు=ఊర్జ్ చోః కుః అనుసూత్రముచే జకారమునకు గకారాదేశము ఊర్గ్, దానికి పాక్షికముగా చర్త్వము, ఊర్క్=బలము.

'పౄ' పాలనపూరణయోః - పౄ + క్విప్, అనియుండ 'ఉదోష్ఠ్యపూర్వస్య (7-2-102) అంగావయవమును, ఓష్ఠ్యపూర్వమును నైన ౠకారమునకు ఉత్తు వచ్చును) అనుసూత్రముచే ధాతువులోని ౠకారమునకు హ్రస్వఉకారము ర పరమై (ఉరణ్ ర పరః) వచ్చును. ప్ + ౠ ప్ + ఉర్=పుర్ + సు = పుర్, ర్వోరు పధాయాదీర్ఘ ఇకః అనుసూత్రముచే ఉపధాక్షరమగు ఉకారమునకు దీర్ఘము=పూర్, రేఫమునకు విసర్గము. పూః = పురము.

భ్రాజభాసాది సూత్రమునకు తర్వాతి సూత్రము అన్యేభ్యోఽపి దృశ్యతే (3-2-178) అనునది. అందలి 'దృశ్యతే' అనుక్రియవలన కొన్నియెడల విధింపని కార్యములగు దీర్ఘము, సంప్రసారణము, ద్విత్వము, హ్రస్వము మున్నగునవి క్విప్ ప్రత్యయము పరమగునపుడు అగును. ఆ సూత్రమునందలి 'దృశ్యతే' అను క్రియ నీ సూత్రములోనికి అపకర్షించుటవలన (పైకిలాగుటవలన) అట్లు దీర్ఘాది కార్యములు క్వాచిత్కముగా నీసూత్రమునందలి ధాతువులకును రావచ్చును. దానిచే 'జు' ధాతువునకు క్విప్ ప్రత్యయము పరమగునపుడు దీర్ఘము వచ్చును. ఈ యంశమునే 'దృశిగ్రహణ స్యాపకర్షజవతేర్దీర్ఘః' అను వృత్తి వాక్యము చెప్పుచున్నది.

జు + క్విప్ = జూ + సు=జూః=వడిగలది.

గ్రావశబ్దము ఉపపదముగా గల 'స్తు' ధాతువునకు క్విప్ ప్రత్యయము. గ్రావస్తు+క్విప్-హ్రస్వస్యపితికృతితుక్ అనుసూత్రముచేధాతువునకు తుగాగమము. గ్రావస్తుత్ + సు=గ్రావస్తుత్-గ్రావములను స్తుతించువాఁడు.

అవ : జుధాతు సందర్భమున చెప్పఁబడిన 'అన్యేభ్యోఽపిదృశ్యతే (3-2-178)అనుసూత్రమునందలి దృశ్యతే అనుపదమువలన తెలియనైన యంశము క్రింది వార్తికము వివరించుచున్నది.

వా : క్విబ్వచిప్రచ్ఛ్యాయతస్తు కటప్రు జు శ్రీణాం దీర్ఘోఽసంప్రసారణంచ.

వృ : వక్తీతివాక్ పృచ్ఛతీతి ప్రాట్, ఆయతంస్తౌతీత్యాయతస్తూః. కటం ప్రవతే కటప్రూః, జూరుక్తః, శ్రయతిహరిం శ్రీః.

ప. వి : క్విబ్వచి........శ్రీణామ్ (6-3) దీర్ఘః (1-1) అసంప్రసారణమ్ (1-1) చ (అవ్య).

అర్థ : క్విబంతములైన వచి, ప్రచ్ఛి, ఆయతస్తు, కటప్రు, జు, శ్రి అను వానికి దీర్ఘమును సంప్రసారణము లేకుండుటయు నగును. ఉదా : వక్తీతి వాక్ మొ॥వి.

వివ : క్విప్రత్యయము కిత్తుకావున నిందుపేర్కొనిన కొన్నిధాతువులకు సంప్రసారణము రావలసియున్నది. అది రాకుండుట కొన్నింటికిని, దీర్ఘమగుట అన్నింటికిని ఈ వార్తికముచే విధింపఁబడుచున్నది. ఇందు వచి, ప్రచ్ఛి, జు, శ్రి అనునవి కేవలధాతువులు, ఆయతస్తు, కటప్రు అనుచోట స్తు, ప్రు అనునవి ఆయత, కట అను ఉపపదములతో కూడినవి. దీర్ఘము అనుపదముచే 'ధాతువులోని అచ్చునకు' అనునర్థము సిద్ధించును. హ్రస్వదీర్ఘాది భేదములు అచ్చునకేయుండును కదా.

ఉదా : (i) వక్తీతి వాక్ – 'వచ' పరిభాషణే – వచ్ + క్విప్ – ఇచట ధాతువులోని వకారమునకు సంప్రసారణము రాకుండుట, అకారమునకు దీర్ఘమగుట. వాచ్ + సు = వాచ్ చోఃకుః అనుసూత్రముచే కుత్వము =వాక్.

ii) పృచ్ఛతీతి ప్రాట్ – ప్రచ్ఛ – జ్ఞీప్సాయామ్-ప్రచ్ఛ్ + క్విప్ = ప్రచ్ఛ్ – చ్ఛ్వోశ్శూడనునాసికేచ 6-4-19 (తుగాగమసహితమైన ఛకారమునకు, ('చ్ఛ్' అనుదానికి) వకారమునకును, క్విప్రత్యయముగాని ఝలాది కిత్ జిత్తులు గాని పరములగునపుడు, క్రమముగా శకారమును, ఊఠ్ అనునదియు వచ్చును) అను సూత్రముచే 'చ్ఛ్' అనుదానికి శకారమాదేశమగును. దానికి షత్వము (వ్రశ్చ భ్రశ్చ – -) దీర్ఘము, సంప్రసారణము లేకుండుటయు. ప్రాష్ + సు=ప్రాట్. (అడుగువాఁడు.)

iii) ఆయతం స్తౌతి – ఆయతస్తూః ఆయత + అమ్, స్తు + క్విప్, ఆయత + అమ్ + స్తు, సమాసము, విభక్తిలోపము ఆయతస్తు, ప్రస్తుత

వార్తికముచే దీర్ఘము - ఆయతస్తూ + సు = ఆయతస్తూః - శ్లాఘించు వాఁడు.

iv) కటం ప్రవతే - కటప్రూః - కట + అమ్ + ప్రు + క్విప్ (ప్రుఙ్ గతౌ అను ధాతువు), కటప్రు దీర్ఘము, కటప్రూ + సు =కటప్రూః= ఒక క్రిమి.

v) 'జూః' అనునది పై సూత్రమున చెప్పఁబడినది.

vi) శ్రయతి హరిం శ్రీః - శ్రిఞ్ సేవాయామ్-శ్రి + క్విప్-శ్రి దీర్ఘము శ్రీః - హరి నాశ్రయించి యుండునది.

సూ : దామ్నీశ స యు యుజస్తుతుదసిసిచ మిహపతదశనహః కరణే 3-2-182.

వృ : దాబాదేః ష్ట్రన్ స్యాత్, కరణేఽర్థే. దాత్యనేన దాత్రమ్, నేత్రమ్.

ప. వి : దామ్నీ...............నహః (5-1) కరణే (7-1).

అను : ధాతోః (5-1) ష్ట్రన్ (1-4) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : 'దాప్' మున్నగు ధాతువులకు కరణార్థమున 'ష్ట్రన్' అనుకృత్ ప్రత్యయము వచ్చును. ఉదా : దాత్యనేన దాత్రమ్. నేత్రమ్.

వివ : దాప్, నీ, శస యు, యుజ, స్తు, తుద, సి, సిచ, మిహ, పత, దశ, నహ అనునీధాతువులకు కరణార్థమున 'ష్ట్రన్' అనుప్రత్యయము వచ్చును. కరణ మనగా క్రియాసిద్ధికి ఉపకరించు ముఖ్యసాధనము. ఈ ప్రత్యయమున షకార నకారములిత్తులు (షః ప్రత్యయస్య, హలన్త్యమ్) ప్రత్యయస్వరూపము 'త్ర'అను నది. (షకారయోగమున ట్ర అయినది) ఇందు షకారమిత్తగుటచే ఈ ప్రత్య యాంతములకు స్త్రీలింగమున 'ఙీష్' అను ప్రత్యయము వచ్చును (షిద్గౌరాదిభ్యశ్చ).

ఉదా : 'దా' 'దాప్' లవనే (కోయు) పకారమిత్తు-దా+త్ర=దాత్ర + సు దాత్రమ్ (నపుం) కోయుసాధనము-(దీనితోకోయుదురు) కొడవలి.

(2) 'ణీఞ్' ప్రాపణే-(నడపు) ణోనః అనుసూత్రముచే ధాత్వాదిణకారము కారమగును. ఞకారమిత్తు. నీ + త్ర, సార్వధాతుకార్ధధాతుకయోః, గుణము, నేత్ర+సు=నేత్రమ్ (నడపునది) కన్ను.

ఈ పై రెండుధాతువులు అనిట్టులు (ఏకాచ్ ఉపదేశేఽనుదాత్తాత్ అను

సూత్రముచే వీనికి పరముగానున్న ప్రత్యయమునకు ఇడాగమము రాదని తాత్పర్యము).

అవ : శస ధాతువునకు పరమైన ష్ట్రన్ ప్రత్యయమునకు ఇడాగమము ప్రాప్తించుచుండగా నీక్రిందిసూత్రము నిషేధించుచున్నది.

సూ : తి తు త్ర త థ సి సు సర క సేషు చ 7-2-9.

వృ : ఏషాం దశానాం కృత్ప్రత్యయానామిణ్న. శస్త్రమ్.

ప. వి : తితు .... .... .... సేషు (7-3) చ (అవ్య).

అను : న (అవ్య) ఇట్ (1-1) కృతి (7-1).

అర్థ : తి, తు, త్ర, త, థ, సి, సు, సర, క, స అను నీ పది కృత్ప్రత్యయములకు ఇడాగమము లేదు. ఉదా : శస్త్రమ్ మొ॥వి.

వివ : ఇందు చెప్పఁబడి న వన్నియు వలాద్యార్ధధాతుకములు. 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' అనుసూత్రముచే వీనికన్నింటికి ఇడాగమము ప్రాప్తించుచుండగా నిషేధము చెప్పఁబడినది. ఇందు సప్తమ్యంతములను షష్ఠ్యంతములుగా మార్చుకొనవలయును)

ఉదా : (3) 'శసు' హింసాయామ్ - శస్+ష్ట్రన్=శస్ + త్ర - ఇడాగమము రావలసియుండఁగా నీసూత్రముచే నిషేధింపఁబడినది. శస్త్ర + సు=శస్త్రమ్. (దీనితో హింసింతురు) ఆయుధవిశేషము.

(4) 'యు' మిశ్రణేఅమిశ్రణేచ యు + ష్ట్రన్-యు+త్ర, సార్వధాతుకార్ధధాతుకయోః అను సూత్రముచే గుణము యోత్ర+సు+యోత్రమ్ (నపుం) కవ్వపుత్రాఁడు.

(5) యుజసమాధౌ యుజ్ + ష్ట్రన్ = యుజ్ + త్ర - పుగంతలఘూపధస్యచ - గుణము యోజ్ + త్ర - చోః కుః. కుత్వము యోగ్ + త్ర - ఖరిచ - చర్త్వము = యోక్త్ర + సు=యోక్త్రమ్-కవ్వపుత్రాడు.

(6) 'ష్టుఞ్' స్తుతౌ-ధాత్వాదిషకారమునకుసకారము. స్తు + త్ర, గుణము స్తోత్ర+సు=స్తోత్రమ్-స్తుతి.

(7) తుద వ్యథనే - తుద్ + త్ర = లఘూపధగుణము-తోద్ + త్ర-ఖరిచ, చర్త్వము. తోత్ + త్ర = తోత్త్ర + సు + తోత్త్రమ్ - అంకుశము

(8) షిఞ్ బంధనే–షకారమునకు సకారాదేశము. సి+త్ర,గుణము సే+త్ర=సేత్ర+సు=సేత్రమ్ (కాళ్ళకు కట్టుగొలుసు).

(9) 'షిచ' క్షరణే – సకారము – సిచ్ + త్ర, గుణము, సేచ్ + త్ర, కత్వము, సేక్ + త్ర=సేక్త్రి+సు=సేక్త్రిమ్ (మొక్కలను తడుపుట కుపయోగించు చిల్లులుగల పాత్రము.)

(10) మిహసేచనే–మిహ్ + త్ర-లఘూపధగుణము మేహ్ + త్ర-అనియుండ హోఢః (8-2-1) (ఝల్లుపరమగునపుడును, పదాంతమునను హకారమునకు ఢకారమాదేశమగును) అనుసూత్రముచే హకారమునకు ఢత్వము–మేఢ్ + త్ర, ఝష స్తథో ర్ధోఽధః (8-2-40) ఝష్వర్ణములకు పరముగా నున్న తథలకు ధకారమాదేశమగును. ధాతువునకు పరముగనున్న తథలకు కాదు) అనుసూత్రముచే ప్రత్యయములోని తకారమునకు ధత్వము–మేఢ్ + ధ ష్టునా ష్టుః, ష్టుత్వము, మేఢ్ + ఢ, ఢో ఢే లోపః )ఢకారమునకు ఢకారము పరమగునప్పుడు లోపము వచ్చును)మే + ఢ మేఢ్ర + సు=మేఢ్రమ్ (మగగుఱి )

11) 'పత్ల గతౌ – ఇకారమిత్తు పత్ + త్ర = పత్త్రి + సు =పత్త్రిమ్ (వాహనము.)

12) 'దంశ' దశనే–ఇందు నకారలోపము, దంశ్ + ష్ట్రన్–దశ్ + త్రన్ 'వ్రశ్చభ్రశ్చ – –' ఇత్యాదిసూత్రముచే షత్వము దంష్+త్ర-ష్టుత్వము–దంష్ + ట్ర–దంష్ట్ర స్త్రీలింగమున దీనికి టాప్ప్రత్యయము దంష్ట్ర+టా, దంష్ట్ర + అ=దంష్ట్రా + సు=దంష్ట్రా. (ఇచట షిద్గౌరాదిభ్యశ్చ అనుసూత్రముచే జీష్ప్రత్యయము రావలసియున్నది. అయినను షిదంతములకు జీష్ ప్రత్యయము అనిత్యము (అనిత్యః షితాంజీష్) – దంష్ట్రా=దంతము (దీనితో కొఱుకుదురు).

(13) 'ణహ' బన్ధనే–ణకారమునకు నకారాదేశము, ణోనః–నహ్+ష్ట్రన్ – నహ్+త్ర-నహోధః 8–2–34. నహ్ధాతువుయొక్క హకారమునకు ఝల్లుపరమగునపుడును, పదాంతమునను, ధకారమాదేశమగును (అనుసూత్రముచే హకారమునకు ధకారాదేశము. నధ్ + త్ర, ఝష స్తథోర్ధోఽధః ధత్వము నధ్ + ధ, ఝలాంజశ్ ఝశి, జశ్త్వము నద్ ధ–నద్ధ్ర, స్త్రీత్వమున జీష్ప్రత్యయము, (షి ద్గౌరాదిభ్యశ్చ) నద్ధ్ర+ఈ, యస్యేతిచ–అకారలోపము నద్ధ్రీ + సునద్ధ్రీ-దీనితో కట్టుదురు (చర్మపుత్రాడు.)

సూ : అర్తిలూధూ సూ ఖన సహ చర ఇత్రః 3-2-184.

వృ : అరిత్రమ్ లవిత్రమ్ ధువిత్రమ్, సవిత్రమ్, ఖనిత్రమ్, సహిత్రమ్, చరిత్రమ్.

ప. వి : అర్తి............ చరః (5-1) ఇత్రః (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1) కరణే (7-1).

అర్థ : ఋ, లూ, ధూ, సూ, ఖన, సహ, చర అనుధాతువులకు కరణార్థమున 'ఇత్ర' అను ప్రత్యయము వచ్చును. ఉదా : అరిత్రమ్ మొ॥వి.

వివ : 1) 'ఋ' గతౌ-ఋ+ఇత్ర, సార్వధాతుకార్ధధాతుకయోః, గుణము, అకారము రపరమై వచ్చును. అర్+ఇత్ర=అరిత్ర+సు=అరిత్రమ్ (నపుం), ఓడ నడుపు తెడ్డు (దీనితోపోవుదురు.)

2) 'లూఞ్' ఛేదనే, లూ+ఇత్ర, గుణము, లో+ఇత్ర, అవాదేశము లవ్+ఇత్ర+సు=లవిత్రమ్-కొడవలి (దీనితోకోయుదురు.)

3) 'ధూ' విధూననే-ధూ+ఇత్ర-ఇచట ఉకారమునకుగుణము రావలసి యున్నది. గాఙ్కుటాదిభ్యోఽఞ్ణిన్ ఙిత్ (1-2-1) ('గాఙ్' అను నాదేశమునకును, కుటాది ధాతువులకును పరముననున్న ఞిత్తుణిత్తునుగాని ప్రత్యయము ఙిత్తగును) అనుసూత్రముచే ప్రకృతధాతువు కుటాదులలోనిది కావున దానికి పరమైన ఇత్ర ప్రత్యయము ఙిత్తుఅగును. ఙిత్తుపరమగునపుడు గుణమురాదు (క్ఙితిచ) 'ధూ+ఇత్ర' అనియుండ 'అచిశ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ' అనుసూత్రముచే ఉవఙాదేశము ధ్+ఉవ్+ఇత్ర, ధువిత్ర+సు=ధువిత్రమ్ అగును. కొందఱిది, కుటాదులలోని 'ధూ' ధాతువుకాక క్ర్యాది గణములోని 'ధూఞ్' ధాతువుగా పేర్కొనిరి. అప్పుడు ఇత్రప్రత్యయము ఙిత్తుగాదు. కానిచో గుణము రావచ్చును. ధూ+ఇత్ర, ధో+ఇత్ర, అవాదేశము, ధవిత్ర+సు=ధవిత్రమ్, మృగచర్మముతో చేసినవీవన.

4) 'షూ' ప్రేరణే షకారమునకు సకారాదేము (ధాత్వాదేః షః సః) ఞకారమిత్తు. సూ+ఇత్ర, గుణము, సో+ఇత్ర, అవాదేశము, సవ్+ఇత్ర, సవిత్ర+సు= సవిత్రమ్-ప్రేరణసాధనము (దీనితోప్రేరణ చేయుదురు.)

5) 'ఖను' అవదారణే-ఉకారమిత్తు-ఖన్+ఇత్ర=ఖనిత్ర, ఖనిత్ర+సు = ఖనిత్రమ్, గునపము (దీనితోత్రవ్వుదురు)

6) 'షహ' మర్షణే, సకారాదేశము సహ్ + ఇత్ర = సహిత్ర + సు = సహిత్రమ్ ధైర్యము (దీనిచే సహింతురు.)

(7) చర - గతౌ, చర్ + ఇత్ర=చరిత్ర+సు=చరిత్రమ్, నడవడి (దీనిచే ప్రవర్తింతురు.)

సూ : పువః సంజ్ఞాయామ్ 3-2-185.

వృ : పవిత్రమ్.

ప. వి : పువః (5-1) సంజ్ఞాయామ్ (7-1).

**అను :** ధాతోః (5-1) ఇత్రః (1-1) ప్రత్యయః (1-1) కృత్(1-1) కరణే (7-1).

**అర్థ :** పూఙ్, పూఞ్ ధాతువులకు, సంజ్ఞ గమ్యమానమగునపుడు కరణార్థమున 'ఇత్ర' ప్రత్యయము వచ్చును. ఉదా : పవిత్రమ్.

వివ : పూయతే అనేన (దీనితో పవిత్రుఁడగును) అనునర్థమున 'పూ' ధాతువునకు ఇత్ర ప్రత్యయము. పూ + ఇత్ర, గుణము, పో+ఇత్ర, అవాదేశము, పవ్+ఇత్ర, పవిత్ర + సు=విత్రమ్ (దర్భముడి.)

### ఇది పూర్వ కృదంతప్రకరణము.

### ప్రకరణావలోకనము.

ధాతువులకు కర్తృ, కర్మ, భావ, కరణాద్యర్థములయందు చేరు ప్రత్యయములు కొన్ని యిందు విధింపఁబడినవి. ఇందు విధింపఁబడిన క్తప్రత్యయము కర్మార్థమున నగును. ష్ట్రన్, ఇత్ర ప్రత్యయములు కరణార్థమున వచ్చును. తక్కిన ప్రత్యయములు సాధారణముగా కర్త్రర్థమున వచ్చును. ఇందు విధింపఁబడిన క్త, క్తవతు ప్రత్యయముల తొలితకారము కొన్నికొన్ని ధాతువులకు పరమైన న, క, వ, మ మున్నగుమార్పులను పొందును.



# అథ ఉణాది ప్రకరణమ్

అవ : సంస్కృతమున శబ్దములన్నియు ప్రకృతి ప్రత్యయవిభాగము చేసి చూపుటకు వీలైన వ్యుత్పన్నప్రాతిపదికములని యొక అభిప్రాయము. అవ్యుత్పన్న ప్రాతిపదికములు కూడ కొన్నిలేకపోలేదు. కాని అత్యధికశాతములో శబ్దము లన్నియు ధాతుజన్యములని వైయాకరణులచే భావింపఁబడినవి. పాణిని మహర్షి కృదంతములుగా నిష్పన్న మొనర్చిన రూపములు కాక యింకననేకశబ్దములకు ఉణాది సూత్రజాలము గతి కల్పించినది. ఈ ఉణాది సూత్రజాలము శాకటాయన మహర్షి కృతమని ప్రసిద్ధి. కొందఱు వీనికర్త ఆపిశలియందురు. మొత్తమునకు వీని కర్తృత్వము సందేహాస్పదముగ నున్నను వీని ప్రామాణ్యమును మాత్రము భాష్య కారాదులు అంగీకరించినట్లే కనఁబడును.

లఘు కౌముదీకారుఁడు ఈ ఉణాదిపాఠమునందలి ఒక్కసూత్రమును సూచనా మాత్రముగ గ్రహించెను.

సూ : కృవాపాజిమిస్వది సాధ్యశూభ్య ఉణ్.

వృ : కరోతీతికారుః, వాతీతి వాయుః, పాయుర్గుదమ్ జాయురౌషధమ్, మాయుఃపిత్తమ్, స్వాదుః, సాధ్నోతి పరకార్యమితి సాధుః, ఆశు శీఘ్రమ్.

ప. వి : కృ........శూభ్యః (5-3) ఉణ్ (1-1).

అర్థ : కృ వా, పా, జి, మి, స్వది, సాధి అశు అనుధాతువులకు ఉణ్ ప్రత్యయమ్ము వచ్చును, ఇవ్వి వర్తమానార్థమున సంజ్ఞయందు బహుళము గానగును. ఉదా : కరోతీతి కారుః మొ॥వి.

వివ : సాధారణముగా ఈ ఉణాది ప్రత్యయాంతములన్నియు సంజ్ఞలయందు రూఢములు. కావున వ్యుత్పత్త్యర్థము చెప్పఁబడినను నేదోయొకదానిని మాత్రమే బోధించును. అట్టిఅర్థవిశేషము గలతక్కినవానిని తెలుపుట కుపయోగింపఁబడవు. ఉదా : కారుః అనగా చేయువాఁడు-ఇదిశిల్పి అనునర్థమున రూఢము. ఏదోయొక పనిని చేయువానిని కారుశబ్దముచే వ్యవహరింపరు.

ఈ సూత్రముచే కృ మొదలగుధాతువులకు 'ఉణ్' అను ప్రత్యయము విధిం పఁబడినది. ఇందుణకారనిత్తు. కావున ధాతువునందలి తుదివర్ణము అచ్చయినపు డును, ఉపధాక్షరము హ్రస్వఅకారమైనపుడు వానికి వృద్ధి వచ్చును. (అచోఞ్ణితి, అతఉపధాయాః.)

ఉదా : కరోతి ఇతికారుః కృ + ఉణ్-కృ + ఉ, వృద్ధి ఆరారపరముపరమై వచ్చును. కార్ + ఉ = కారు + సు = కారుః. శిల్పి (చేయువాఁడు అని వ్యుత్పత్తి.

2) వాతీతివాయుః - వీచునది కాన వాయువు-'వా'గతి గంధనయోః-వా + ఉణ్ - వా + ఉ, 'ఆతోయుక్ చిణ్కృతోః' అనుసూత్రముచే యుగాగమము, వాయ్ + ఉ=వాయు + సు=వాయుః (గాలి).

(3) పిబ న్త్యనేన ఇతిపాయుః-దీనితో తైలాదికము త్రావుదురు 'పా' పానే - పా + ఉణ్, పా + ఉ, యుగాగమము పాయ్ + ఉ=పాయు + సు = పాయుః - (గుదస్థానము.)

4) జయత్యభి భవతి రోగాన్ ఇతిజాయుః. రోగములను జయించునది. జి + ఉణ్, వృద్ధి, జై + ఉ, ఆయాదేశము, జాయ్+ఉ=జాయు + సు=జాయుః- ఔషధము.

5) మినోతి ప్రక్షిపతి దేహే ఊష్మాణమితి మాయుః-దేహము నందలి వేడిని తొలఁగించునది-'డుమిఞ్' ప్రక్షేపణే - డు, ఞ్ లు ఇత్తులు. మి + ఉణ్, అనియుండ మీనాతిమినోతి దీఙాంల్యపి (6-1-50) (మీఞ్ డుమిఞ్, దీఙ్ అను ధాతువులకు ల్యప్ ప్రత్యయము పరమగునపుడును ఏజ్నిమిత్తమైన అశిత్ప్రత్యయము పరమగునపుడును ఆకారమాదేశమగును.) అనుసూత్రముచే ఆకారమాదేశము కాఁగా మ్+అ + ఉ, యుగాగమము, మాయ్+ఉ, మాయు + సు = మాయుః పిత్తము. ఇచట ఆకారాదేశము వృద్ధికి బాధకముగా చెప్పఁబడినది.

6) స్వదతేరోచతే ఇదిస్వాదుః-రుచించునది-'ష్వద' ఆస్వాదనే షకారమునకు సత్వము, స్వద్ + ఉణ్, ఉపధావృద్ధి (అతఉపధాయాః) స్వాద్ + ఉ = స్వాదు + సు= స్వాదుః రుచికరమైనది

7) సాధ్నోతిపరకార్యమితి సాధుః పరునికార్యమును సాధించువాఁడు. 'సాధ,' సంసిద్ధౌ-సాధ్ + ఉ=సాధు+సు=సాధుః పరహిత మొనర్చువాఁడు.

8) అశ్నుతేవ్యాప్నోతీతి ఆశు, వ్యాపించునది, 'అశూ' వ్యాప్తౌ - ఊకారమిత్తు-అశ్ + ఉణ్, ఉపధావృద్ధి, ఆశ్+ఉ = ఆశు + సు = ఆశు, శీఘ్రమైనది (నపుం).

ఈ ఉణాదిపాఠమునకు పాణిని మహర్షియొక్క అంగీకృతి కలదనునంశమీ క్రిందిసూత్రము నిరూపించును.

సూ : ఉణాదయో బహుళమ్ 3-3-1.

వృ : ఏతే వర్తమానే సంజ్ఞాయాం చ బహుళం స్యుః. కేచిదవిహితా అప్యూహ్యాః.

శ్లో॥ సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతఃపరే ।
కార్యాద్విద్యాదనూ బంధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు॥

ప. వి : ఉణాదయః (1-3) బహుళమ్ (2-1).

అను : ధాతోః (5-1) వర్తమానే (7-1) సంజ్ఞాయామ్ (7-1).

అర్థ : ఈ ఉణాదిప్రత్యయములు వర్తమానార్థమున, సంజ్ఞగమ్యమానమగు నపుడు ధాతువునకు బహుళముగా నగును. బహుళగ్రహణముచే విధింపఁబడ నివియు నూహ్యములు.

ఈ ఉణాదులయందు ఆయాసంజ్ఞలయందు వర్తమానములగుధాతువులను వానికి పరములైన ప్రత్యయములను ఊహించుకొనవలయును. అయినకార్యమును బట్టి అనుబంధము తెలియఁదగును. ఇది ఉణాదులయందు శాస్త్రము.

వివ . ఉణాదిప్రత్యయాంతములైనశబ్దములు సాధారణముగ ఆయాసంజ్ఞల యందు రూఢములైనవి. వ్యుత్పత్తినిబట్టి రూఢములుకాని యర్థములయందు వీనిని ప్రయోగింపరాదు. ఇవి వర్తమానకాలధాతువ్యాపారమును సూచించును. 'క్వచిదన్య దేవ, అను అంశమునుబట్టి విధింపఁబడనికార్యములను కూడ ఊహించుకొనవలయు నని సూత్రమునందలి బహుళపదముచే తెలియనగును.

డిత్థ, డబిత్థ మున్నగు సంజ్ఞావాచకశబ్దములయందు, ఇది ధాతువు, ఇది ప్రత్యయము అనునంశము యథాయోగ్యముగ నూహించుకొనవలయును. ధాతుభాగములో కలిగెడు, గుణము, వృద్ధి, తన్నిషేధము, సంప్రసారణము మున్నగు కార్యవిశేషము లను బట్టి ప్రత్యయమునందలి అనుబంధమును=ఇత్తును, ఊహించుకొనవలయును. ఇది ఈ ఉణాది ప్రత్యయములందు పద్ధతి.

ఉణాదులకు సంబంధించి దిక్ప్రదర్శనముగ నీలఘుకౌముదియందింతమాత్రమే చెప్పఁబడినది. సిద్ధాంతకౌముదియందు సోదాహరణముగ ప్రక్రియానిరూపణ సహిత ముగ ఉణాదివిభాగమంతయు వ్యాఖ్యానింపఁబడినది. జిజ్ఞాసువు లందు చూడఁగలరు.

# అథ ఉత్తరకృదంత ప్రకరణమ్

అవ : సాధారణముగ కర్త్రర్థమున వచ్చు ప్రత్యయము లన్నియు పూర్వ కృదంత ప్రకరణమున చెప్పఁబడినవి. ఉణాదయో బహుళమ్ అనుసూత్రమునకు పూర్వమున నున్న సూత్రములు గలది పూర్వకృదంతప్రకరణము. తరువాతిసూత్ర ములు ఉత్తర కృదంత ప్రకరణమునకు సంబంధించినవి. ఉత్తరకృదంతప్రకరణ మున విధింపఁబడిన ప్రత్యయము లన్నియు సాధారణముగా భావార్థమునందును, కర్తృభిన్నకారకమునందును వచ్చును. ఈ భేదమును స్పష్టీకరించుటకై కృత్ప్రకర ణము పూర్వోత్తరభాగములుగా విధింపఁబడినది.

సూ : తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్ 3-3-10.

వృ : క్రియార్థాయాం క్రియాయాముపపదే భవిష్యత్యర్థే ధాతోరేతౌ స్తః. మాన్తత్వాదవ్యయత్వమ్. కృష్ణంద్రష్టుంయాతి. కృష్ణం దర్శకోయాతి.

ప. వి : తుమున్ణ్వులౌ (1-2) క్రియాయామ్ (7-1) క్రియార్థాయామ్ (7-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1) భవిష్యతి (7-1).

అర్థ : క్రియార్థక క్రియ ఉపపదముగా నున్నపుడు, భవిష్యదర్థమున, ధాతువునకు తుమున్, ణ్వుల్ అనుప్రత్యయములు చేరును. ఉదా : కృష్ణంద్రష్టుం యాతి, కృష్ణం దర్శకోయాతి.

వివ : ఉపపదమనగా ధాత్వధికారమున సప్తమ్యంతపదముచే వాచ్యమగు దానికి వాచకమైనది (తత్రోపపదం సప్తమీస్థమ్). అది ధాతువునకు సన్నిహిత ముగా పూర్వమునఁగాని పరమునఁగాని యుండవచ్చును. కుంభంకరోతి - కుంభ కారః మున్నగుచోటులందు పూర్వమున నుండుటను గమనించితిమి. ఇచట పర ముగా నుండుట చూడఁబడును, మఱియొకక్రియే ప్రయోజనముగాఁగల క్రియ ఈ సందర్భమున, ఉపపదముగా నుండవలయును ఉదాహరణమునకు, చూడఁ బోయెను అనగా చూచుట ప్రయోజనముగా పోయెను అనియర్థము. చూచుట ప్రయోజనము, అది ప్రయోజనముగాఁగల క్రియ పోవుట – అట్టిది ఉపపదముగా నున్నపుడు ప్రయోజనమును దెలుపు ధాత్వర్థము భవిష్యత్తునకు సంబంధించినపుడు ధాతువునకు, తుమున్, ణ్వుల్ అనుప్రత్యయములు పర్యాయముగా వచ్చును.

'భవిష్యదర్థమున' అనుదానిని పై ఉదాహరణమున స్పష్టము చేసికొననగును. చూడఁ బోయెను, అనగా పోవుట అనువ్యాపారము జరుగునప్పటికి 'చూచుట' అను వ్యాపారము ప్రారంభము కాలేదు. భవిష్యత్తనగా 'అప్పటికి ప్రారంభింపఁ బడనిది.'

ఉదా : 'దృశిర్' ప్రేక్షణే–ఇందు 'ఇర్' అనుభాగము ఇత్తు. దృశ్ + తుమున్ - ప్రత్యయమున నకారమిత్తు. ఉకార ముచ్చారణార్థము. తుమ్ (+ ఉ + న్) 'దృశ్ + తుమ్' అనియుండ సృజి దృశోర్ఝ్ల్యమకితి 6-1-58 (కకార మిత్తుగాలేని ఝలాది ప్రత్యయము పరమగునపుడు సృజి. దృశి ధాతువులకు 'అమ్' అనునాగమము వచ్చును) అనుసూత్రముచే 'అమ్' ఆగమము వచ్చును. ఇందు మకారమిత్తు. 'మిదచోఽన్త్యాత్పరః' అను పరిభాషచే ఈయాగమము సృజ్, దృశ్ ధాతువుల అంత్యాచ్చునకు పిదపవచ్చును. ద్, ఋ శ్ - ద్,ఋ + అశ్ ఋకారము నకు యణాదేశము (ఇకో యణచి) ద్ ర్ అశ్ = ద్రశ్+తుమ్. వ్రశ్చభ్రశ్చే త్యాదిసూత్రముచే శకారమునకు షత్వము. ద్రష్ + తుమ్, ష్టునాష్టుః, ష్టుత్వము, ద్రష్టుమ్ కృన్మేజన్తః 1-1-39- (కృత్ప్రత్యయసంబంధములైన మకారముఁ ఏచ్చును అంతమందుఁగల శబ్దములు అవ్యయములగును)అను సూత్రముచే 'తుమ్' ప్రత్యయాంతము అవ్యయము. కావున అవ్యయాదాప్సుపః 2-4-82 (అవ్యయము నకు పరముగా విధింపఁబడిన ఆప్, సుప్ ప్రత్యయములకు లుక్కువచ్చును) అను సూత్రముచే దీనికి విధింపఁబడిన సు మున్నగు ప్రత్యయములకు అదర్శన మగును. ద్రష్టుమ్+సు=ద్రష్టుమ్ కృష్ణంద్రష్టుం యాతి - కృష్ణుని చూడఁబోవు చున్నాఁడు. ఇందు 'చూచుట' అనుక్రియ ప్రయోజనము గాఁగల 'యాతి' అను క్రియ ఉపపదము – 'చూచుట' అను వ్యాపార మిచట భవిష్యత్కాలికము.

ఇదే యర్థమున ణ్వుల్ ప్రత్యయము కూడ ధాతువునకు చేరవచ్చును. ఉదా : దృశ్ + ణ్వుల్ - ఇందు ణకారలకారము లిత్తులు (చుటూ, హలన్త్యమ్) వు అనుదానికి 'యు వో రనాకౌ' అను సూత్రముచే 'అక' అను ఆదేశము వచ్చును. దృశ్ + అక, పుగంతలఘూపధస్యచ, గుణము, ఋకారస్థానమున వచ్చుగుణము అకారము ర పరముగా వచ్చును (ఉరణ్ ర పరః) ద్ అర్ శ్ = దర్శ్ + అక = దర్శక + సు = దర్శకః, కృష్ణందర్శకో యాతి - కృష్ణుని చూచుటకు పోవుచున్నాఁడు.

సూ : కాలసమయవేలాసు తుమున్. 3-3-167.

వృ : కాలార్థేషూపపదేషు తు మున్, కాలఃసమయోవేలా వాభోకుమ్.

ప. వి : కాలసమయవేలాసు (7-3) తుమున్ (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : కాలార్థక శబ్దములు ఉపపదములైనపుడు ధాతువునకు తుమున్ ప్రత్యయము వచ్చును. ఉదా : కాలఃసమయోవేలా వాభోక్తుమ్.

వివ : క్రియార్థక క్రియ కాలపర్యాయవాచకములు ఉపపదములుగా నున్నపుడును ధాతువునకు 'తుమున్' ప్రత్యయము వచ్చును. సూత్రమున సమానార్థకములైన కాల, సమయ, వేలాశబ్దములు గ్రహింపఁబడుటచే కాలము అనునర్థము గల ఏ శబ్దము ఉపపదముగా నున్నను ధాతువునకు 'తుమున్' ప్రత్యయము వచ్చునని చెప్పినట్లయినది. కాలః, భోక్తుమ్-తినుటకు కాలము-ఇచట కాలశబ్దము ఉపపదముగా నున్న భుజ్‌ధాతువునకు తుమున్ ప్రత్యయము.

ఉదా : 'భుజ' పాలనాభ్యవహారయోః - భుజ్ + తుమున్ భుజ్+తుమ్, ఉపధాగుణము భోజ్ + తుమ్, చోఃకుః కుత్వము, భోగ్+తుమ్, ఖరిచ, చర్త్వము భోక్తుమ్ + సు=భోక్తుమ్ అవ్యయమగుటచే సులోపము (కృన్మేజన్తః, అవ్యయాదాప్సుపః).

ఇట్లే సమయఃభోక్తుమ్, వేలాభోక్తుమ్, అనే హా భోక్తుమ్ మొ॥వి.

సూ : భావే 3-3-18.

వృ : సిద్ధావస్థాపన్నే ధాత్వర్థే వాచ్యే ధాతోర్ఘఞ్. పాకః.

ప. వి : భావే (7-1).

అను : ధాతోః (5-1) కృత్ (1-1) ప్రత్యయః (1-1) ఘ (1-1).

అర్థ : సిద్ధావస్థను పొందిన ధాత్వర్థము వాచ్యమగునపుడు ధాతువునకు ఘఞ్ ప్రత్యయము వచ్చును. ఉదా : పాకః.

వివ : భావమనగా ధాత్వర్థము. అది రెండువిధములు. (1) సిద్ధావస్థను పొందినది (2) సాధ్యావస్థలో నున్నది. వండెను అనగా వండుట అను పని చేసెనని యర్థము. ఇచట వండుట అనుదానిచే ధాత్వర్థము చెప్పఁబడుచున్నది. పొయ్యిమీద పాత్రమిడుట, పదార్థమునందుంచుట, అది పచనమగుట ఈ మున్నగు పనుల సమాహారమే వండుట - ఇది సాధ్యావస్థ. పచనము చేయఁబడిన పదార్థమును 'వంట' అందుము, అనగా పచనము అనునది పూర్తియైన పిదప సిద్ధమైన పదార్థమును 'వంట' అనుచున్నాము. ఇదియు ధాత్వర్థమునే చెప్పుచున్నది, సిద్ధా

వస్తును పొందిన ధాత్వర్థమును 'పంట' అనునది వ్యక్తము చేయుచున్నది. ఇట్టిది తెలియఁబడునపుడు ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము చేరునని సూత్రార్థము.

ఉదా : 'డుపచష్' పాకే - పచ్ + ఘఞ్. ఇందు ఘకారమునకు 'లశక్వతద్ధితే' అనుసూత్రముచేతను, ఞకారమునకు 'హలన్త్యమ్' అను సూత్రముచేతను ఇత్సంజ్ఞ కలిగి యవి లోపించును (ఘ్) + అ, (ఞ్) పచ్ + అ, ప్రత్యయము ఞిత్తగుటచే 'అతఉపధాయాః' అను సూత్రముచే ధాతువుయొక్క ఉపధాక్షరమగు హ్రస్వఅకారమునకు వృద్ధి వచ్చును. పాచ్ + అ, 'చజోః కుఘిణ్ణ్యతోః' అను సూత్రముచే చకారమునకు కకారాదేశము. పాక్ + అ = పాక.

'కృదభిహితోభావోద్రవ్యవత్ప్రకాశతే' - కృదంతముచే చెప్పఁబడుభావము ద్రవ్యమువలె భాసిల్లును-అనుభాష్యోక్తి ననుసరించి యిది లింగసంఖ్యాకారకాన్వితమగును. కావున దీనికి 'సుప్' మున్నగు ప్రత్యయములు చేరును. పాక + సః = పాకః. ఘఞ్ ప్రత్యయము చేరినశబ్దములు పుంలింగములగును.

సూ : అకర్తరి చ కారకే సంజ్ఞాయామ్ 3-3-19.

వృ : కర్తృభిన్నే కారకే ఘఞ్.

ప. వి : అకర్తరి (7-1) చ (అవ్య) కారకే (7-1) సంజ్ఞాయామ్ (7-1).

అను : ధాతోః (5-1) ఘఞ్ (1-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : కర్తృభిన్నకారకము వాచ్యమగునపుడు, సంజ్ఞ గమ్యమానమగునపుడు ధాతువునకు ఘఞ్ ప్రత్యయము చేరును.

వివ : క్రియతో నన్వయముగలది కారకము. వాక్యములోని ఆయాపదములు క్రియతో నాయాసంబంధములు గలిగియుండును. ఆ సంబంధములందలి భేదము లనుబట్టి కారకము ఆఱువిధములగును. (1) కర్మము (2) కర్త (3) కరణము (4) సంప్రదానము (5) అపాదానము (6) అధికరణము వీనియర్థములు సందర్భానుసారముగా వివరింపఁబడును. ఇందు కర్తకాక తక్కినకారకములు ధాతుప్రత్యయముల సముదాయముచే వాచ్యమగునపుడు, సంజ్ఞ తెలియఁబడిన యెడల, ధాతువునకు ఘఞ్ ప్రత్యయము చేరును.

ఉదా : రజ్యతే అనేన - దీనిచేత రంజింపఁబడును-అనునర్థమున ధాతుప్రత్యయములచేత కరణము = క్రియను నెరవేర్చు సాధనము వాచ్యమగుచున్నది. అది కర్తృభిన్నకారకము. కావున రంజ్ ధాతువునకు ఘఞ్ ప్రత్యయము 'రఞ్జ' రాగే-రఞ్జ్ + ఘఞ్.

అవ : ఈ క్రిందిసూత్రముచే ధాతువులోని ఇకారరూపనకారమునకు లోపము విధింపఁబడుచున్నది.

సూ : ఘఞిచ భావకరణయోః 6-4-27.

వృ : రఞ్జేః నలోపః స్యాత్. రాగః. అనయోః కిమ్? రజ్యత్యస్మిన్నితి రఙ్గః.

ప. వి : ఘఞి (7-1) చ (అవ్య) భావకరణయోః (7-2).

అను : రఞ్జేః (6-1) నలోపః (1-1).

అర్థ : భావకరణార్థములయందు వచ్చిన ఘఞ్ ప్రత్యయము పరమగునపుడు రఞ్జ్ధాతువుయొక్క నకారమునకు లోపము వచ్చును.

ఉదా : రాగః. భావకరణార్థములయందననేల? రఞ్జత్యస్మిన్నితి రఙ్గః.

వివ : 'భావే' అనుసూత్రముచేతను, 'అకర్తరికారకే సంజ్ఞాయామ్' అను సూత్రముచేతను, భావార్థమునను, కరణార్థమునను చేరిన ప్రత్యయము పరమగునపుడు రఞ్జధాతువులోని నకారమునకు లోపము వచ్చును. ఇచట నకారమనగా సంధివశమున మారిన ఞకారము.

ఉదా : రఞ్జ్ + ఘఞ్ - ఇచట ఘఞ్ ప్రత్యయము కరణార్థమున 'అకర్త రిచ.' అనుసూత్రముచే విధింపఁబడినది. కావున ధాతువులోని ఞకారము లోపించును. రజ్+అ (ఘకార ఞకారములిత్తులు) అత ఉపధాయాః, వృద్ధి, రాజ్ + అ, చజోః కుఘిణ్ణ్యతోః, కుత్వము రాగ్+అ = రాగ + సు=రాగః - (భావార్థమునందును రూపమిట్లే యుండును )

సూత్రమున 'భావకరణయోః' అనుపదముండుటవలన నితరార్థములయందు వచ్చిన ఘఞ్ ప్రత్యయము పరమగునపుడు ఈ నలోపము రాదు. ఉదా : రఞ్జత్యస్మిన్ - దీనియందు రంజిల్లును - ఇచట వాచ్యమగునది అధికరణము-రంజనమునకు ఆధారమైన స్థలము-కావున నలోపము రాదు. రఞ్జ్ + ఘఞ్, రఞ్జ్ + అ, కుత్వము, రన్ గ్ + అ, నకారమునకు నశ్చాపదాన్తస్యఝలి అను సూత్రముచే అనుస్వారము,-అనుస్వారస్యయయి పరసవర్ణః అనుసూత్రముచే అనుస్వారమునకు పరసవర్ణమును రాగా రఙ్గ్ + అ = రఙ్గ + సు = రఙ్గః అగును. (ఇచట ఉపధ అకారము కాదు (ర ఞ్ జ్ -) ఞకారము. కావున వృద్ధికి ప్రసక్తిలేదు.)

సూ : నివాసచితి శరీరోపసమాధానేష్వాదేశ్చ కః 3-3-41.

వృ : ఏషు చినోతేర్ఘఞ్ ఆదేశ్చకః. ఉపసమాధానం రాశీకరణమ్. నికాయః, కాయః, గోమయనికాయః.

ప. వి : నివాస.........ధానేషు (7-3) ఆదేః (6-1) చ (అవ్య) కః (1-1).

అను ; చేః (5-1) ధాతోః (5-1) ఘఞ్ (1-1) అకర్తరి (7-1) కారకే (7-1).

అర్థ : నివాసము, చితి, శరీరము, ఉపసమాధానము అను కర్తృభిన్నకారకములు వాచ్యములైనపుడు 'చి' ధాతువునకు ఘఞ్ ప్రత్యయమును, ఆదివర్ణమునకు కకారాదేశము నగును. ఉపసమాధానమనగా రాశీకరణము. ఉదా : నికాయః, కాయః, గోమయనికాయః.

వివ : 'చిఞ్' చయనే (ప్రోగుచేయుట) అనుధాతువునకు ఘఞ్ ప్రత్యయమును కొన్నియర్థవిశేషములలో నీసూత్రము విధించుచున్నది. నివాసము, చితి, శరీరము, రాశిగా చేయుట అనుఅర్థములందీప్రత్యయము వచ్చును. అవి కర్తృభిన్నభిన్నకారకములు కావలయును. ఇట్టి యర్థములందు ఈ ప్రత్యయము చేరినపుడు ధాతువు తొలివర్ణమగు చకారమునకు కకారమాదేశమగును.

ఉదా : చి + ఘఞ్ = చి + అ, వృద్ధి (అచోఞ్ణితి) చై + అ, ఆయాదేశము (ఏచోఽయవాయావః) చాయ, కకారాదేశము, కాయ + సు = కాయః.

1) నివాసము : కాశీ నికాయః నిచీయతే మోక్షోఽత్ర-మోక్షమిచటకూడఁబెట్టఁబడును-ఇది అధికరణము.

2) చితి - ఆకాయమగ్నించిన్వీత-చితి వఱకు అగ్నిని రక్షింపవలయును. ఆచీయన్తేఽస్మిన్నిష్టకాః ఇష్టకములిందు కూర్పఁబడును అధికరణము.

3) శరీరము : కాయః - చీయతేఽస్మిన్నస్థ్యాదికమ్-ఎముకలు మున్నగునవి యిందు కూర్పఁబడును. అధికరణము.

4) ఉపసమాధానము-గోమయనికాయః-చీయతేగోమయమస్మిన్-దీనియందు గోమయము రాశిగా చేయఁబడును-అధికరణము.

సూ : ఏరచ్ 3-3-53.

వృ : ఇవర్ణాన్తాదచ్. చయః, జయః.

ప. వి : ఏః (5-1) అచ్ (1-1).

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : ఇవర్ణాంతధాతువునకు భావము, కర్తృభిన్నకారకమును వాచ్యము లగునపుడు 'అచ్' ప్రత్యయము వచ్చును. ఉదా : చయః, జయః,

వివ : ఏః అనునది 'ఇ' అనుదాని పంచమ్యంతరూపము-(హరి - హరేః, ఇ - ఏః). ఇది ధాతోః అనుదానికి విశేషణము. తదంతవిధిచే 'ఇవర్ణాంతమైన ధాతువునకు అనునర్థము వచ్చును. భావముగాని కర్తృభిన్నకారకము గాని వాచ్యమగునపుడు ('ధాతుప్రత్యయముల సముదాయముచే తెలియఁబడునపుడు) ఇవర్ణాంత ధాతువులకు 'అచ్' అను కృత్ప్రత్యయము చేరును. ఇందు చకారమిత్తు.

ఉదా : 'చిఞ్' చయనే - చి + అచ్ + చి + అ, సార్వధాతుకార్ధధాతుకయోః, గుణము, చే + అ, అయాదేశము, చయ్ + అ=చయ + సు = చయః = ప్రోగుచేయుట,

'జి' జయే జి + అచ్ - జి+అ, జే+అ, జయ్+అ=జయ + సు = జయః జయించుట.

ఇది ఘఞ్ ప్రత్యయమునకు అపవాదము. ఈ రెండు ప్రత్యయములును సరూపములు (ఘ + అ, ఞ్, అచ్.) కావున నిది సామాన్యమైన ఘఞ్ ప్రత్యయమును నిత్యముగనే బాధించును (వాసరూపోఽస్త్రియామ్).

సూ : ఋ దోరప్ 3-3-57.

వృ : ఋవర్ణాన్తా దువర్ణాంతాదప్ స్యాత్. కరః, గరః, యవః, లవః, స్తవః, పవః,

ప. వి : ఋదోః (5-1) అప్ (1-1).

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : ఋ వర్ణాంత, ఉవర్ణాంతధాతువులకు, భావము, కర్తృభిన్నకారక మును వాచ్యములగునపుడు 'అప్' ప్రత్యయము వచ్చును. ఉదా : కరః, యవః ఇత్యాదులు.

వివ : ఇందు ఋకారమునకు తపరకరణము చేయఁబడినది. కావున దీర్ఘ ఋకారము గ్రాహ్యము. ఉవర్ణము సామాన్యముగా గ్రహింపఁ బడుటచే హ్రస్వ దీర్ఘములలో నేదైనను కావచ్చును. ఋదోః అనునది ధాతోః అనుపదమునకు విశేషణమగుటచే తదంతవిధిచే 'ఋవర్ణాంత, ఉవర్ణాంతధాతువులకు పరముగా' నను నర్థము వచ్చును. భావముగాని కర్తృభిన్నకారకముగాని వాచ్యమగునపుడు ఈః ధాతు వులకు 'అప్' ప్రత్యయము వచ్చును. ఇందు పవర్ణమిత్తు. ఇది ఘఞ్ ప్రత్యయ మున కపవాదము.

1) ఉదా : 'కౄ' విక్షేపే, కౄ + అప్, సార్వధాతుకార్ధధాతుకయోః, గుణము - రపరమైన అకారము, కర్ + అ=కర+సు=కరః, చల్లుట.

2) గౄ, నిగరణే - గౄ+అప్, గర్+అ=గర+సు=గరః. మ్రింగుట, విషము.

ఉకారాంతములు : 3) 'యు' మిశ్రణేఽమిశ్రణేచ యు + అప్, గుణము, యో + అ, అవాదేశము యవ్ + అ = యవ + సు = యవః ధాన్యవిశేషము (కలియునది,)

4) 'లూఞ్' ఛేదనే, లూ + అప్, లో + అ, లవ్ + అ=లవ + సు లవః = ముక్క (ఖండింపఁబడినది.)

5) 'ష్టుఞ్' స్తుతౌ - స్తు+అప్, స్తో+అ, స్తవ్+అ = స్తవ + సు = స్తవః (స్తుతి.)

6) 'పూఞ్' పవనే - పూ + అప్, పో+అ=పవ్+అ=పవ + సు = పవః - పవిత్రమగుట.

[ఈ సూత్రమునందలి 'ఋద్' అనుచోటిది దకారముకాని తకారము కాదనియు, నది ఉచ్చారణసుఖమునకై చేర్పఁబడినదికాని తపరకరణము కాదనియు 'ఋ' అని దీర్ఘమును గ్రహించుటవలన ఋకారదీర్ఘమెట్లును గ్రహింపఁబడు ననియు కొందఱు వ్యాఖ్యాతలు వివరించిరి.]

వా : ఘఞర్థే కవిధానమ్.

వృ : ప్రస్థః, విఘ్నః.

ప. వి : ఘఞర్థే (7-1) కవిధానమ్ (1-1).

అర్థ : ఘఞర్థమున క ప్రత్యయము విధింపనగును. ఉదా : ప్రస్థః, విఘ్నః.

వివ : భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును ఘఞ్ ప్రత్యయము విధింపఁబడినది. ఆ యర్థములందు కొన్నిధాతువులకు కప్రత్యయము చేరునని యీ వార్తికము చెప్పుచున్నది.

ఉదా : ప్రతిష్ఠన్తే అస్మిన్ ధాన్యాదికమ్-దీనియందు ధాన్యాదికము నిలిచి యుండును. ప్రస్థః, ప్రపూర్వకమైన స్థాధాతువునకు అధికరణార్థమున 'క' ప్రత్యయము. ప్ర, స్థా+క (ష్ఠా గతినివృత్తౌ) ఇందు కకారమిత్తు. ప్రస్థా+అ, ప్రత్యయము కిత్తగుటచే "ఆతోలోప ఇటిచ" అనుసూత్రముచే ధాతువుయొక్క ఆకారమునకు లోపము ప్రస్థ్ + అ=ప్రస్థ+సు=ప్రస్థః (ధాన్యమును కొలుచు శేరు వంటి పాత్ర.)

విహన్యన్త్యస్మిన్మనాంసి ఇతివిఘ్నః. మనస్సులను దీనియందు హింసించును-విపూర్వకమైన 'హన' హింసాగత్యోః అనుధాతువునకు ఈ వార్తికముచే క ప్రత్యయము వి, హన్+క, 'వి, హన్ + అ' అనియుండ 'గమ హన జనఖన ఘ సాం లోపః క్ఙిత్యనఙి' 6-4-98 (గమ్, హన్, జన్, ఖన్, ఘస్ అనుధాతువుల ఉపధాక్షరమునకు అజాదియైన కిత్, గిత్, ఙిత్ప్రత్యయములు పరములగునపుడు, లోపము వచ్చును. అఙ్ అనునది పరమగునపుడు లోపమురాదు) అను సూత్రముచే ఇచట అజాదియై కిత్తైన ప్రత్యయము పరమైనది కావున 'హన్' ధాతువులోని ఉపధయగు అకారములోపించును. విహ్+న్+అ-పిదవ హోహన్తేర్ఞ్ణిన్నేషు (7-3-54) (ఞిత్తుగాని ణిత్తుగాని అయిన ప్రత్యయము పరమగునపుడును, నకారము పరమగునపుడును హనధాతువుయొక్క హకారమునకు కుత్వము వచ్చును) అను సూత్రముచే హకారమునకు కుత్వము, ఆంతరతమ్యముచే ఘకారము వచ్చును. విఘ్న + అ = విఘ్న + సు + విఘ్నః - ఆతంకము - అధి కరణార్థము.

సూ : ద్వితః క్త్రిః 3-3-88.

ప. వి : ద్వితః (5-1) క్త్రిః (1-1).

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : ద్విత్త్వయనధాతువునకు, భావార్థమునందును కర్తృభిన్నకారకార్థము లందును 'క్త్రి' అను ప్రత్యయము చేరును.

వివ : 'డు' అనునక్షరము కొన్నిధాతువులకు ముందుండును. ఆదిర్ఞిటుడవః (1-3-5) అనుసూత్రముచే దానికి ఇత్సంజ్ఞ కలుగును, (ఉపదేశమున అద్యక్షర ములయిన 'ఞి, టు, డు అనునవి ఇత్తులు.) డు అనునది ఇత్తుగాగలధాతువు డ్విత్తు. అట్టిధాతువునకు భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును 'క్త్రి' అను ప్రత్యయము చేరును.

ఉదా : 'డు ప చష్' పాకే - ఇందు డు, ష్ వర్ణము లిత్తులు. చకారము లోని అకారము ఉచ్చారణార్థము. పచ్ - ఇది డ్విత్తుకావున ఈ సూత్రముచే 'క్త్రి' ప్రత్యయము వచ్చును. అందు కకారమిత్తు. పచ్ + క్త్రి = 'పచ్ + త్రి' అనియుండ చోః కుః అను సూత్రముచే చకారమునకు కుత్వము, పక్ + త్రి = పక్త్రి.

అవ ; ఈ 'క్త్రి' ప్రత్యయాంతమునకు నిత్యముగా 'మప్' అను తద్ధిత ప్రత్యయము చేరునని క్రిందిసూత్రము తెలుపుచున్నది.

సూ : క్త్రేర్మమ్నిత్యమ్ 4-4-20.

వృ : క్త్రి ప్రత్యయాన్తాన్మమ్ నిర్వృత్తేఽర్థే. పాకేన నిర్వృత్తం పక్త్రిమమ్, డువప్ ఉప్త్రిమమ్.

ప. వి : క్త్రేః (5-1) మప్ (1-1) నిత్యమ్ (2-1).

అను : ప్రాతిపదికాత్ (5-1) తద్ధితాః (1-1) నిర్వృత్తే (7-1).

అర్థ : క్త్రిప్రత్యయాంత ప్రాతిపదికములకు 'నిర్వృత్తమైనది' అనునర్థ మున 'మప్' అనుతద్ధిత ప్రత్యయము నిత్యముగా వచ్చును.

ఉదా : పాకముచేత నిర్వృత్తమైనది పక్త్రిమమ్, డువప్, ఉప్త్రిమమ్.

వివ : పైసూత్రముచే విధింపఁబడిన 'క్త్రి' అను ప్రత్యయము (కృత్తు) అంతమునగల ప్రాతిపదికమునకు, 'దానిచేత సిద్ధించినది' అనునర్థమును తెలుపుచు 'మప్' అను తద్ధితప్రత్యయము నిత్యముగా చేరును. 'కృత్తద్ధితసమాసాశ్చ' అను సూత్రముచే కృత్, తద్ధితప్రత్యయాంతములును సమాసములును ప్రాతిపదికసంజ్ఞ 'నిత్యమ్' అనుటచే 'మప్ ప్రత్యయముచేరని 'క్త్రి' ప్రత్యయాంత ముండదని భావము.

ఉదా : పక్త్రి + మప్-పవర్గమిత్తు. పక్త్రిమ + సు = పక్త్రిమమ్. (పాకము చేత సిద్ధించినది-పంట.)

'డుపవ్' బీజసంతానే - విత్తుట అనునర్థము గల 'డుపవ్' అనుధాతువు డ్విత్తు. దీనికిని 'క్త్రి' ప్రత్యయము చేరును. వప్ + క్త్రి, కకారము ఇత్తు. వప్ + త్రి - ఈ ధాతువు యజాదులలోనిది కావున 'వచి స్వపియజాదీనాం కితి' 6-4-15 అనుసూత్రముచే దీనికి సంప్రసారణము వచ్చును. (వచ్, స్వప్ ధాతువులకును, యజ్‌మున్నగుధాతువులకును, కిత్తుపరమగునపుడు సంప్రసారణమగును) వ్ + అప్ + త్రి, ఉ + అప్ + త్రి ఉకారఅకారములకు 'సంప్రసారణాచ్చ' అనుసూత్రముచే పూర్వరూపమేకాదేశమగును. ఉప్ + త్రి, 'ఉప్త్రి' - దీనికి మప్ ప్రత్యయము. ఉప్త్రిమ + సు = ఉప్త్రిమమ్. విత్తుటచే సిద్ధించినది.

సూ : ట్వితోఽథుచ్ 3-3-89.

వృ : టు వేపృ కమ్పనే. వేపథుః.

ప. వి : ట్వితః (5-1) అథుచ్ (1-1).

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1).

అర్థ : ట్విత్తగుధాతువునకు భావార్థ, కర్తృభిన్నకారకార్థములందు 'అథుచ్' అనుప్రత్యయము చేరును. ఉదా : టు వేపృకమ్పనే, వేపథుః.

వివ : 'ఆదిర్ఞిటుడవః' అనుసూత్రముచే ధాతువులకు ముందున్న 'టు' అనునది యిత్తగును. అట్టిధాతువులు ట్విత్తులు. వానికి, భావము, కర్తృభిన్న కారకము వాచ్యమగునపుడు 'అథుచ్' అను కృత్ప్రత్యయము చేరును.

ఉదా : 'టు వే పృ' క మ్పనే-టు, ఋ అనునవి ఇత్తులు వేప్ + అథుచ్ - చకారమిత్తు, వేవథు + సు = వేపథుః-కంపము.

సూ : యజయాచ యత విచ్ఛప్రచ్ఛరక్షో నఙ్ 3-3-90.

వృ ; యజ్ఞః, యాచ్ఞా, యత్నః, విశ్నః, ప్రశ్నః, రక్ష్ణః.

ప. వి : యజ............రక్షః (5-1) నఙ్ (1-1).

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1).

అర్థ : యజ్, యాచ్, యత్, విచ్ఛ్, ప్రచ్ఛ్, రక్ష అనుధాతువులకు పర ముగా భావ, కర్తృభిన్నకారకార్థములందు 'నఙ్' అను ప్రత్యయము వచ్చును. ఉదా : యజ్ఞః మొ॥వి.

వివ : ఈః ప్రత్యయమునందు ఙకారమిత్తు. అది లోపించును. ప్రత్యయ స్వరూపము 'న' అనునది.

ఉదా : 'యజ' దేవపూజాసంగతి కరణదానేషు, యజ్ + నఙ్ యజ్ + న, 'స్తోః శ్చునాశ్చుః' అనుసూత్రముచే నకారమునకు శ్చుత్వము (ఞకారము) యజ్ + ఞ = యజ్ఞ + సు = యజ్ఞః.

'టు యాచృ' యాచ్ఞాయామ్ - టు ఋ లు ఇత్తులు. యాచ్ + నఙ్ యాచ్ + న, శ్చుత్వము యాచ్ఞ, ఇది స్త్రీలింగమగుటచే స్త్రీత్వమున టాప్ ప్రత్యయము, యాచ్ఞ + ఆ (ట్, ప్ లు ఇత్తులు) స వర్ణదీర్ఘము, యాచ్ఞా + సు - యాచ్ఞా (యాచనము.)

'యతీ' ప్రయత్నే-ఇందు ఈకారమిత్తు, యత్ + నఙ్, యత్ + న = యత్న + సు = యత్నః.

'విచ్ఛ' భాషాయాం దీప్తౌ-విచ్ఛ్ + నఙ్, 'చ్ఛ్వోః శూడనునాసికే చ' అనుసూత్రముచే 'చ్ఛ్' అనుదానికి శకారాదేశము, విశ్ + న, ఇట్టియెడ నకారమునకు శ్చుత్వము ప్రాప్తించుచుండగా 'శాత్' అనుసూత్రముచే నిషేధింపఁబడినది. విశ్న + సు = విశ్నః-కాంతి.

'ప్రచ్ఛ' జ్ఞీప్సాయామ్-ప్రచ్ఛ్ + నఙ్ = పై ఉదాహరణము నందువలె 'చ్ఛ'కారమునకు శకారాదేశము ప్రశ్ + న-ఇచట 'గ్రహిజ్యా....' ఇత్యాది సూత్రముచే సంప్రసారణము రావలసియున్నది. కాని పాణిని మహర్షి 'ప్రశ్నేచాసన్నకాలే' అనుసూత్రమున సంప్రసారణ రహితముగా ప్రయోగించుటవలన సంప్రసారణమిట రాదనువిషయము జ్ఞాపితమైనది. ప్రశ్ + న, శాత్-శ్చుత్వనిషేధము, ప్రశ్న + సు = ప్రశ్నః,

'రక్ష' పాలనే-రక్ష్ + నఙ్ = రక్ష్ + న, షకారయోగముచే నకారమునకు ణత్వము, రక్ష్ణ + సు = రక్ష్ణః-రక్షణము.

సూ : స్వపో నన్ 3-3-91.

వృ : స్వప్నః.

ప. వి : స్వపః (5-1) నన్ (1-1)

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1).

అర్థ : స్వప్ ధాతువునకు భావాద్యర్థమున 'నన్' అను ప్రత్యయమువచ్చును ఉదా : స్వప్నః.

వివ : 'ఞిష్వప్' శయే అనుధాతువున ఞి అనునది యిత్తు (ఆదిర్ఞిటుడవః) షకారమునకు సకారాదేశము. 'స్వప్' దీనికి భావాద్యర్థమున 'నన్' ప్రత్యయము. ఇందు తుది నకారము ఇత్తు.

ఉదా : స్వప్ + నన్=స్వప్న + సు=స్వప్నః-కల.

సూ : ఉపసర్గే ఘోః కిః 3-3-92.

వృ : ప్రధిః, ఉపధిః.

ప. వి : ఉపసర్గే (7-1) ఘోః (5-1) కిః (1-1).

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1).

అర్థ : ఉపసర్గ ముపపదముగా నున్నపుడు ఘుసంజ్ఞగలధాతువునకు భావాద్యర్థములు వాచ్యము లగునపుడు 'కి' అను ప్రత్యయము వచ్చును. ఉదా : ప్రధిః, ఉపధిః.

వివ : ఉపసర్గములనగా క్రియాయోగముగల ప్రాదులు, 'ఘు'అనునది దా, ధా అనురూపములతో నుండు ధాతువులకు సంజ్ఞ. అట్టివేయగు దాప్, దైప్ధాతువుల కీసంజ్ఞలేదు. (దాధాఘ్వదాప్) ఉపసర్గము ఉపపదముగా నున్నపుడు దారూప ధారూపధాతువులకు 'కి' అను ప్రత్యయము వచ్చును. ఘుసంజ్ఞలేని దాప్, దైప్ అను వాని కిదిరాదు. ఇందు కకారమిత్తు. ప్రత్యయస్వరూపము-'ఇ'.

ఉదా : డుధాఞ్ ధారణపోషణయోః, ఇందు డు, ఞ్ అనునవి ఇత్తులు. ధా-ఇది ఘుసంజ్ఞకము. ప్ర, ధా + కి, ప్రధా + ఇ, 'ఆతోలోప ఇటిచ' అను సూత్రముచే అకారమునకు లోపము, ప్రధ్+ఇ=ప్రధి + సు=ప్రధిః (చక్రపుపట్టా) (దీనిచే చక్రము ధరింపఁబడును.)

ఉప, ధా + కి, ఉపధా + ఇ, ఉపధ్ + ఇ, ఉపధి + సు = ఉపధిః (కపటము.)

అవ : ఇంతవఱకు పుంలింగమున భావాద్యర్థములయం దేర్పడినరూపములు చెప్పఁబడినవి. ఇటుపై స్త్రీలింగమున నాయర్థములందేర్పడు రూపములు చెప్పఁబడుచున్నవి.

సూ : స్త్రియాం క్తిన్ 3-3-94.

వృ : స్త్రీలింగేభావేక్తిన్ స్యాత్ : ఘఞోఽపవాదః. కృతిః, స్తుతిః.

ప. వి : స్త్రియామ్ (7-1) క్తిన్ (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) అకర్తరి (7-1) కారకే (7-1).

అర్థ : స్త్రీత్వ విశిష్టమైన భావమునందును, కర్తృభిన్నకారకమునందును 'ధాతువునకు 'క్తిన్' అను ప్రత్యయము చేరును. ఇది ఘఞ్ ప్రత్యయమునకు అపవాదము. ఉదా : కృతిః, స్తుతిః.

వివ : ధాతుసామాన్యమునకు భావార్థమునందును, కర్తృభిన్నకారకము నందును 'క్తిన్' అను ప్రత్యయము వచ్చును. ఇది స్త్రీలింగమునందు మాత్రమే వచ్చును. అనగా ఈప్రత్యయము చేరినరూపములు స్త్రీలింగములని తాత్పర్యము. పుంలింగవివక్షయున్నపుడు ఘఞ్ ప్రత్యయమును, స్త్రీలింగవివక్షయున్నపుడు 'క్తిన్' ప్రత్యయమును ధాతువునకు భావాద్యర్థములందగునని సూత్రతాత్పర్యము 'వాస రూపోఽస్త్రియామ్' అను పరిభాష యీ సూత్రముయొక్క అధికారము మేరలో వర్తింపదని 'అస్త్రియామ్' అనుపదము చెప్పుచున్నది. కావున ఇచట అసరూపము లగు అపవాదప్రత్యయములు సామాన్యప్రత్యయములకు నిత్యముగనే బాధకము లగును. 'కృత్యల్యుటో బహులమ్ 3-3-113' అనుసూత్రము వఱకు ఈ సూత్రమునందలి 'స్త్రియామ్' అనుపదము అధికారమగును. కావున ఈ పరిధిలో విధింపఁబడిన ప్రత్యయము లంతమునఁగల శబ్దములన్నియు స్త్రీలింగములని తాత్పర్యము.

ఉదా : (డు) కృ (ఞ్) - క్తిన్ - ఇందు కకారనకారము లిత్తులు. కృ+తి ప్రత్యయము కిత్తగుటచే ధాతువులోని అచ్చునకు గుణమురాదు (క్ఙితిచ) కృతి + సు=కృతిః- (కార్యము).

స్తు + క్తిన్ = స్తు+తి-స్తుతి + సు=స్తుతిః-స్తోత్రము.

వా : ఋూల్వాదిభ్యః క్తిన్నిష్ఠావద్వాచ్యః

వృ : తేన నత్వమ్. కీర్ణిః, లూనిః, ధూనిః, పూనిః.

ప. వి : ఋల్వాదిభ్యః (5-3) క్తిన్ (1-1) నిష్ఠావత్ (అవ్య) వాచ్యః (1-1).

అర్థ : ఋధాతువునకు ల్వాదులకును పరముగానున్న 'క్తిన్' ప్రత్యయము నిష్ఠాప్రత్యయమువంటిదని చెప్పవలయును. అందుచే నత్వము. ఉదా : కీర్ణిః, లూనిః మొ॥వి.

వివ : ఋకారాంతధాతువులకు, లూఞ్ ఛేదనేమున్నగు నిరువదిమొక్క ధాతువులకును పరముగానున్న క్తిన్ ప్రత్యయము నిష్ఠాప్రత్యయము వంటిదని చెప్పవలయును. క్త, క్తవతు అనునవి నిష్ఠాప్రత్యయములు. ఇట్లు చెప్పుటవలన ఋకారాంతధాతువులకు పరముగనున్న క్తిన్ ప్రత్యయ తకారమునకు 'రదాభ్యాం నిష్ఠాతోనః పూర్వస్యచదః' అను సూత్రముచేతను, ల్వాదులకు పరమైన దాని తకారమునకు 'ల్వాదిభ్యః' అనుసూత్రముచేతను నకారమాదేశమగును.

ఉదా : కౄ విక్షేపే, కౄ + క్తిన్, కౄ + తి, ఋత ఇద్ధాతోః, ఇత్వము (ర పరమైవచ్చును) కిర్ + తి, 'హలి' అనుసూత్రముచే 'కి'లోని ఇకారమునకు దీర్ఘము కీర్ + తి, నత్వము, కీర్ + ని, ణత్వము కీర్ణి + సు = కీర్ణిః - చల్లుట, (ఇందలి సూత్రములకు 'రదాభ్యాం' సూత్రము నొద్ద అర్థాదికము వ్రాయఁబడినది.)

లూఞ్ ఛేదనే - లూ + క్తిన్ లూ + తి, నత్వము లూని + సు = లూనిః - కోఁత.

ధూఞ్ కమ్పనే, ధూ + క్తిన్, ధూ + తి నత్వము ధూని + సు = ధూనిః.

పూఞ్, పవనే, పూ + క్తిన్, పూ + తి, నత్వము, పూని + సు = పూనిః (ఈధాతువుల్వాదులలో లేదు. దీని నిందు ఉదాహరించుట చింత్యము.)

వా : సంపదాదిభ్యః క్విప్.

వృ : సంపత్, విపత్, ఆపత్, క్తిన్నపేష్యతే. సంపత్తిః, విపత్తిః, ఆపత్తిః.

ప. వి : సంపదాదిభ్యః (5-3) క్విప్ (1-1),

అర్థ : సంపదాదులకు భావాద్యర్థములందు క్విప్ప్రత్యయము వచ్చును. ఉదా : సంపత్, విపత్, ఆపత్, ఇచట క్తిన్ ప్రత్యయము వచ్చుటయు నిష్టము. సంపత్తిః, విపత్తిః, ఆపత్తిః.

వివ : సమ్, ఇత్యాది ఉపసర్గములు ఉపపదములుగానున్న 'పద్' ధాతువునకును, మఱికొన్నిధాతువులకును, భావాద్యర్థములయందు స్త్రీత్వము వాచ్యమగునపుడు క్విప్ ప్రత్యయము వచ్చును.

ఉదా : సంపద్ + క్విప్-ఇది సర్వలోపి, సంపద్ + సు = సంపద్ వైకల్పికముగా చర్త్వము సంపత్, ఇట్లే విపత్, ఆపత్ మొ॥వి.

వాసరూపవిధి 'స్త్రియామ్' అనునధికారమున లేదు. కావున ఈ క్విప్ ప్రత్యయము క్తిన్ ప్రత్యయమును నిత్యముగనే బాధించును. అట్టియెడ క్తిన్నంతములైన సంపదాదులుండుటకు వీలులేదు. కాని యవియుండుట భాష్యకారులకు సమ్మతమగుటచే క్తిన్నపీష్యతే - క్తిన్ ప్రత్యయమగుటయు నిష్టము - అని చెప్పఁబడినది.

సంపద్ + క్తిన్ - సంపద్+తి, చర్త్వము సంపత్తి + సు = సంపత్తిః ఇట్లే విపత్తిః, ఆపత్తిః.

సూ : ఊతియూతి జూతి సాతి హేతి కీర్తయశ్చ 3-3-97.

వృ : ఏతే నిపాత్యన్తే.

ప. వి : ఊతి ... ... ... కీర్తయః (1-3) చ (అవ్య).

అర్థ : ఊతి, యూతి, జూతి, సాతి, హేతి, కీర్తి అనునవి క్తిన్నంతములుగా నిపతింపఁబడుచున్నవి.

వివ : సాధారణప్రక్రియచే నొకవిధమగురూపమేర్పడవలసియుండ ఇది యిట్లని ప్రక్రియతో పనిలేకుండ రూపనిర్దేశము చేయుటను నిపాతమందురు (అన్యథాప్రాప్తస్య అన్యథోచ్చారణం నిపాతనమ్). ప్రకృతమున అవ, యు, జు, షో, హన, కౄత అను ధాతువులకు 'క్తిన్' ప్రత్యయము చేరునపుడు క్రమముగా ఊతి, యూతి, జూతి, సాతి, హేతి, కీర్తి అనురూపములగునని నిర్దేశింపఁబడినది. ఈ రూపములందు నిపతింపఁబడిన కార్యవిశేషము లేవో యరయుదము.

ఉదా : 'అవ' రక్షణగతి కాన్తిప్రీతి తృప్త్యవగమ ప్రవేశ శ్రవణస్వామ్యర్థ యాచన క్రియేచ్ఛాదీప్త్యవాప్త్యాలింగన హింసాదాన భావవృద్ధిషు-

అవ్ + క్తిన్ - ఇచట ధాతువునకు ఊకారాదేశము. ఊతి + సు ఊతిః (ఇది సాధారణప్రక్రియచే కూడ నేర్పడును కాని స్వరభేదమునకై ఇచటని పతింపఁబడినది) = రక్షణము.

యు + క్తిన్ - ఇచటధాతువుయొక్క అచ్చునకు దీర్ఘము నిపతింపఁబడి వది. యూతి+సు=యూతిః=కలియుట-

జు+క్తిన్=ధాతువునకు దీర్ఘము జూతి + సు = జూతిః - వేగము

'షోఽన్త కర్మణి - ధాత్వాదిషకారమునకు సకారాదేశము 'సో'+క్తిన్ అని యుండ ద్యతి స్యతి మాస్థామి త్తికితి 7-4-40 (దో, సో, మా, స్థాధాతువులకు తకారాది కిత్ప్రత్యయము పరమగునపుడు హ్రస్వ ఇకారమాదేశమగును) అను సూత్రముచే ఇత్త్వము రావలసియుండగా అదిరాకుండుట నిపతింపఁబడినది. 'ఆదేచ ఉపదేశేఽశితి' అనుసూత్రముచే ఆకారమాదేశమగును. సాతి + సు = సాతిః - నాశనము

'షణు' దానే అనుధాతువునుండియు 'సాతిః' అనురూపము కావచ్చును. సన్ + క్తిన్ - 'జనసన ఖనాం సఞ్ఝలోః' అను సూత్రముచే నిచట నకారమునకు అత్వము వచ్చును స+అ+తి='సాతిః' అగును. స్వరముకొఱకు ఇచట నిపతింపఁబడెను. సాతిః-బహుమానము.

'హన' హింసాగత్యోః హన్ + క్తిన్ - ఇచట ధాతువులోని నకారమునకు 'అను దాత్తోపదేశవనతి తనోత్యాదీనా మనునాసికలో పోఝలి క్ఙితి 6-4-37 - అను సూత్రముచే లోపమురాగా అకారమున కేకారదేశము నిపతింపఁబడినది-హేతి+సు= హేతిః - ఖడ్గము. (అనునాసికాంతములగు అనుదాత్తోపదేశధాతువులకును, వనధాతువునకును, తనుమున్నగుధాతువులకును, ఝలాదియై కిత్తుగాని ఙిత్తుగాని అయిన ప్రత్యయము పరమగునపుడు లోపమువచ్చును-ఈలోపము 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే అంత్యాక్షరమున కగును)

కృాత సంశబ్దనే - దీనిణి జంతరూపము కీర్తి అనునది. అట్టిదానికి 'ణ్యాస శ్రన్థోయుచ్' అను వక్ష్యమాణసూత్రముచే యుచ్ ప్రత్యయము రావలసియుండగా అపవాదముగా 'క్తిన్' ప్రత్యయము నిపతింపఁబడినది............కీర్తిః.

సూ : జ్వరత్వర స్రివ్యవిమవా ముపధాయాశ్చ 6-4-20.

వృ : ఏషాము పధావకారయో రూఠ్ అనునాసికే క్వౌ ఝలాదౌ క్ఙితిచ, అతః క్విప్, జూః తూః, స్రూః, ఊః, మూః.

ప. వి : జ్వర............మవామ్ (6-3) ఉపధాయాః (6-1) చ (అవ్య)

అను : వః (6-1) ఊఠ్ (1-1) అనునాసికే (7-1) క్విఝలోః (7-3) క్ఙితి (7-1).

అర్థ : జ్వర, త్వర, స్రివి, అవి, మవి అనుధాతువుల ఉపధాక్షరమునకు వకారమునకును, అనునాసికమును క్విప్ ప్రత్యయమును, ఝలాదియగు కిత్తు గిత్తులును పరములగునపుడు ఊఠ్ ఆదేశము వచ్చును. ఈ సూత్రము చేతనే క్విప్రత్యయ విధి జ్ఞాపితమగును. ఉదా : జూః మొ॥వి.

వివ : జ్వర, త్వర మున్నగు ధాతువులకు క్విప్ ప్రత్యయము ఏ సూత్రము చేతను క్విప్ ప్రత్యయము విధింపఁబడలేదు. కాని యీ సూత్రమున ఆ ప్రత్యయము పరమగునపుడు 'ఊఠ్' అనుకార్యవిశేషము విధింపఁబడుటచే వీనికి 'క్విప్' ప్రత్యయము వచ్చుట పాణిని మహర్షికి సమ్మతమని తెలియనైనది. అట్లు క్విప్ ప్రత్యయము గాని, అనునాసికముగాని, ఝల్ వర్ణమాదియందుగల కిత్తులేక జిత్తుఅయిన ప్రత్యయముగాని పరములగునపుడు ఈ ధాతువులలోని ఉపధాక్షరముతో కూడిన వకారమునకు 'ఊఠ్' అనునాదేశము వచ్చును. అందు ఠకారమిత్తు.

1) 'జ్వర' రోగే. జ్వర్+క్విప్, క్విప్పు సర్వలోపి (కకారపకారములిత్తులు, ఇకారముచ్చారణార్థము, వకారమునకు 'వేరపృక్తస్య' అనుసూత్రముచే లోపము) జ్వర్-ఇందు వకారము దాని పిదపనున్న అకారము - ఈ రెంటికి కలిపి ఊఠ్ ఆదేశము జ్ + ఊర్ = జూర్ + సు = జూర్, రేఫమునకు విసర్గము (ఖరవసానయోర్విసర్జనీయః) జూః-రోగము.

2) 'ఞిత్వరా' సంభ్రమే - ఇందు ఞికార ఆకారము లిత్తులు. త్వర్ + క్విప్, త్వర్, ఇందలి వకారఅకారములకు ఊఠ్ ఆదేశము. ఆదేశము, త్ + ఊర్ = తూర్ + సు = తూర్-తూః- వేగము.

3) 'స్రివు' గతిశోషణయోః - ఉకారమిత్తు. స్రివ్ + క్విప్ = స్రివ్ ఇందు ఇకారవకారములకు ఊఠ్ ఆదేశము స్ర్ + ఊ, స్రూ + సు = రుత్వవిసర్గములు = స్రూః (యజ్ఞములలో ఆజ్యమువేయుటకుపయోగించు పాత్ర.)

4) 'అవ' రక్షణాదిషు-అవ్ + క్విప్-అకారములకు ఊఠాదేశము ఊ + సు = ఊః (రక్షకుఁడు)

5) 'మవ' బంధనే-మవ్ + క్విప్, మవ్, అకారవకారములకు ఊఠమ్ ఊ = మూ + సు = మూః (బంధనము)

సూ : ఇచ్ఛా 3-3-101.

వృ : ఇషేర్నిపాతో౽యమ్.

ప. వి : ఇచ్ఛా (1-1)

అను : ధాతోః (5-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) స్త్రియామ్ (7-1).

అర్థ 'ఇషు' ధాతువునకు స్త్రీలింగమున భావార్థ, కర్తృభిన్నకారకార్థముల యందు 'ఇచ్ఛా' అనురూపము నిపతింపఁబడినది. ఇచ్ఛా.

వివ : 'ఇషు' ఇచ్ఛాయామ్ అనుధాతువు శప్రత్యయాంతముగ నిచట నిపతింపఁబడినది. ఆ ప్రత్యయము పరమగునపుడు రావలసిన యక్ ప్రత్యయము రాకుండుటయు నిపతింపఁబడినది. ఇష్+శ, శకారమిత్తు, ఇష్ + అ, ఇషుగమియమాంఛః (7-3-77) ఇష్, గమ్, యమ్ అనుధాతువులకు శిత్తగు ప్రత్యయము పరమగునపుడు ఛకారమాదేశమగును) అనుసూత్రముచే షకారమునకు ఛకారాదేశము ఇఛ్ + అ, ఛేచ, తుగాగమము,ఇత్ ఛ్ + అ,శ్చుత్వము, ఇచ్ఛ్+అ-ఇచ్ఛ, దీనికి స్త్రీలింగమున టాప్ ప్రత్యయము ఇచ్ఛ + ఆ = ఇచ్ఛా + సు = ఇచ్ఛా - కోరిక.

సూ : అ ప్రత్యయాత్ 3-3-102.

వృ : ప్రత్యయాన్తేభ్యః స్త్రియా మకారః ప్రత్యయఃస్యాత్, చికీర్షా, పుత్రకామ్యా.

ప వి ; అ (ప్రథమావిభక్తిలోపించినపదము) ప్రత్యయాత్ (5-1).

అను : ధాతోః (5-1) స్త్రియామ్ (7-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) ప్రత్యయః (1-1).

అర్థ : ప్రత్యయాంతములైన ధాతువులకు పరముగా స్త్రీలింగమున భావాద్యర్థమున 'అ' అను ప్రత్యయము వచ్చును. ఉదా: చికీర్షా. పుత్రకామ్యా.

వివ : ధాతువునకు కొన్నియర్థవిశేషములలో సన్, క్యజ్, కామ్యచ్, ణిచ్ మున్నగు ప్రత్యయము విధింపఁబడినవి. అవి చేరినరూపములకు కూడ ధాతుత్వము విధింపఁబడినది. సనాద్యన్తాధాతవః (3-1-32) సన్ మొదలగు ప్రత్యయములు అంతమునఁగల విధాతువులగును. ప్రకృతసూత్రమునందలి 'ప్రత్యయాత్' అనుపదము ధాతోః అనుపదమునకు విశేషణము. తదంతవిధిచే ప్రత్యయాంతమైన ధాతువునకు పరముగా ననునర్థము వచ్చినది. అట్లు ప్రత్యయాంతములై, ధాతుత్వము కలిగినవి సన్నంతము, యజంతము, కామ్యజంతము మొ॥వి. వానికి స్త్రీలింగమున భావార్థమునందును, కర్తృభిన్న కారకార్థమునందును 'అ' అను ప్రత్యయము చేరును.

ఉదా : చికీర్ష - ఇది కృధాతువునకు సన్ ప్రత్యయము చేరిన రూపము. ఇదియు ధాతువేయగును. దీనికి ప్రకృతసూత్రముచే 'అ' ప్రత్యయము చేరగా 'చికీర్ష్ + అ' అనియుండ 'అతోలోపః' అను సూత్రముచే ధాతువులోని అకారమునకు లోపము (ఆర్ధధాతు కోపదేశకాలమున అదంతమైనదానికి, ఆర్ధధాతుకము పరమగునపుడు లోపము వచ్చును) చికీర్ష్ + అ = చికీర్ష. స్త్రీలింగమున దీనికి టాప్ ప్రత్యయము చేరును. అందు టకారపకారము లిత్తులు. చికీర్ష + ఆ, సవర్ణదీర్ఘము చికీర్షా + సు = చికీర్షా-(చేయునిచ్ఛ) (హలంతములకు, ఙీ, ఆప్ ప్రత్యయము లంతమునగల దీర్ఘాంతములకు పరముగానున్న సు, తి, సి అను ప్రత్యయముల అపృక్త హల్లునకు లోపము వచ్చుననునర్థముగల హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాత్సుతిస్యపృక్తం హల్ (6-1-68) అనుసూత్రముచే హలంతములకును, ఈకార ఆకారాంతములైన (ఙీ, ఆప్ ప్రత్యయము చేరిన)శబ్దములకు పరముగా నున్న సుప్రత్యయ సకారము లోపించును.)

2) పుత్రకామ్య - పుత్రమాత్మనః ఇచ్ఛతి, పుత్రుని తనకు కోరునది అనునర్థమున పుత్రశబ్దమునకు 'కామ్యచ్' ప్రత్యయము విధింపఁబడినది పుత్ర కామ్యచ్ - చకారమిత్తు - పుత్రకామ్య, దీనికి 'అ' ప్రత్యయము పుత్రకామ్య + అ, ధాతువులోని అకారమునకు లోపము (అతోలోపః) పుత్రకామ్య్ + అ పుత్ర కామ్య, టాప్ ప్రత్యయము, పుత్రకామ్యా + సు = పుత్రకామ్యా.

సూ : గురోశ్చ హలః 3-3-103.

వృ : గురుమతో హలన్తాత్ స్త్రియామ ప్రత్యయః స్యాత్. ఈహా.

ప. వి : గురోః (5-1) చ (అవ్య) హలః (5-1).

అను : ధాతోః (5-1) అ (లు. ప్ర. ప) ప్రత్యయః (1-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1).

అర్థ : గురుమంతమై హలంతమైన ధాతువునకు స్త్రీలింగమున భావాద్యర్థమున 'అ' అను ప్రత్యయము వచ్చును. ఉదా : ఈహా.

వివ : ఈ సూత్రమునందలి గురోః, హలః అనునవి ధాతోః అనుదానికి విశేషణములు. హలః అనుదానికి తదంతవిధిచేత, 'హలంతమైన' అనునర్థము వచ్చును. గురులఘు సంజ్ఞలు అచ్చునకు సంబంధించినవి కావున హలంతమైనది అజంతమగుట అసంభవము కావున గురువుధాతువులో నుండవలయునను వర్థమే గ్రాహ్యముకాని గుర్వంతము అనునర్థము గ్రాహ్యముకాదు, కావున గురువు

కలిగినదియు, హలంతమైనదియు నగుధాతువునకు స్త్రీలింగమున,భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును 'అ' అనుప్రత్యయము వచ్చును.

ఉదా : 'ఈహ' చేష్టాయామ్ – ఈహ్–ఇది హలంతము, ఈకారము గురువు కాన గురుమంతము. దీనికి అప్రత్యయము వచ్చును ఈహ్ + అ = ఈహ స్త్రీలింగమున టాప్ ప్రత్యయము, ఈహ + ఆ, సవర్ణదీర్ఘము, ఈహా + సు = ఈహా–కోరిక, చేష్ట.

సూ : ణ్యాసశ్రన్థోయుచ్ 3–3–107.

వృ : అకారస్యా పవాదః. కారణా, హారణా.

ప. వి : ణ్యాసశ్రన్థః (5-1) యుచ్ (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1) భావే (7-1) అకర్తరి (7-1) కారకే (7-1) స్త్రియామ్ (7-1).

అర్థ : ణిజంతధాతువునకును, ఆస, శ్రన్థధాతువులకును యుచ్ ప్రత్య ప్రత్యయము, స్త్రీలింగమున, భావాద్యర్థమున నగును. ఉదా : కారణా, హారణా. అప్రత్యయమున కపవాదము.

వివ : ప్రేరణాద్యర్థములందు ధాతువునకు ణిచ్ ప్రత్యయము విధింపఁబడినది. అది అంతమునఁగలధాతువులకు అప్రత్యయాత్ అనుసూత్రముచే 'అ' ప్రత్యయము ప్రాప్తించుచున్నది. ఆస, శ్రన్థధాతువులకు 'గురోశ్చహలః' అను సూత్రముచే 'అ' ప్రత్యయము ప్రాప్తించుచున్నది. ఈ రెండుసూత్రములకు నపవాదముగా ణిజంతములకు, ఆస, శ్రన్థధాతువులకును 'యుచ్' అనుప్రత్యయము స్త్రీలింగమున, భావాద్యర్థమున విధింపఁబడినది. ఇందు చకారమిత్తు. 'యు' అను దానికి 'అన' అదేశము (యువోరనాకౌ)

ఉదా : కృధాతువునకు ణిచ్ ప్రత్యయము చేరి 'కారి' అగును. కారి + యుచ్ - కారి + అన, ణేరనిటి, ణిచ్ప్రత్యయమునకు లోపము, కార్ + అన, రేఫయోగమువలన నకారమునకు ణత్వము (అట్కు ప్వాఙ్నుమ్వ్యవాయేఽపి) కారణ - స్త్రీత్వమున టాప్ ప్రత్యయము కారణా + సు=కారణా - చేయించుట.

ఇట్లే, హారి (హృధాతువుయొక్క ణిజంతము) హారి + యుచ్, హారి + అన, హార్ + అన, ణత్వము, హారణ, హారణా + సు = హారణా–హరింపఁజేయుట.

'ఆస' ఉపవేశనే - ఆస్ + యుచ్, ఆస్ + అన-ఆసన, టాప్ ప్రత్యయము ఆసనా + సు = ఆసనా-కూర్చుండుట.

'శ్రన్థ' విమోచన ప్రతిహర్షయోః-శ్రన్థ్ + యుచ్-శ్రన్థ్ + అన = శ్రన్థన, శ్రన్థనా + సు = శ్రన్థనా = విమోచనము.

అవ : ఇంతవఱకు స్త్ర్యధికారము. భావార్థకశబ్దము నపుంసకమగునపుడు ధాతువునకు చేరు ప్రత్యయములు క్రిందచెప్పఁబడుచున్నవి.

సూ : నపుంసకే భావే క్తః 3-3-114.

సూ : ల్యుట్ చ 3-3-115.

వృ : హసితమ్, హసనమ్.

ప వి : నపుంసకే (7-1) భావే (7-1) క్తః (1-1) ల్యుట్ (1 1) చ (అవ్య).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1)

అర్థ : నపుంసకత్వ విశిష్టమైన భావార్థమున ధాతువునకు 'క్త' ల్యుట్ అను ప్రత్యయములు చేరును. ఉదా : హసితమ్, హసనమ్,

వివ : ధాతు ప్రత్యయముల సముదాయముచే నేర్పడిన భావార్థకశబ్దము నపుంసకమైనపుడు ధాతువునకు 'క్త' 'ల్యుట్' అను ప్రత్యయములు చేరును. 'భావార్థమున' అనుటవలన నిది అకర్మధాతువులకేవచ్చుననుట స్పష్టమైనది.

ఉదా : 'హసే' హసనే - ఏకారమిత్తు, హస్ + క్త, కకారమిత్తు హస్ + త, ఆర్ధధాతుకస్వేడ్వలాదేః, ఇడాగమము, హస్ + ఇత = హసిత + సు = హసితమ్-నవ్వు

హస్+ల్యుట్, లకారటకారము లిత్తులు, హస్ + యు, అన ఆదేశము (యువోరనాకౌ) హస్+అన = హసన+సు = హసనమ్ - నవ్వు.

సూ : పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణ 3-3-118.

ప. వి : పుంసి (7-1) సంజ్ఞాయామ్ (7-1) ఘః (1-1) ప్రాయేణ.

అను - ధాతోః (5-1) కరణాధికరణయోః (7-2) ప్రత్యయః (1-1).

అర్థ : పుంలింగములైన కరణాధికరణములు వాచ్యములగునపుడు, సంజ్ఞ గమ్యమానమగునపుడు, తఱచుగా 'ఘ' అను ప్రత్యయము వచ్చును.

వివ : కరణవాచకముగాని, అధికరణవాచకముగాని ధాతుప్రత్యయముల సముదాయముచే చెప్పఁబడునప్పుడు, సముదాయరూపమొకసంజ్ఞయైనప్పుడు కొన్ని ధాతువులకు 'ఘ' అను ప్రత్యయము వచ్చును. ప్రాయేణ అనుటచే ఈ ప్రత్యయము అన్నిధాతువులకును చేరదు కరణాధికరణవాచకములు పుంలింగములైనప్పుడే యీ ప్రత్యయము వచ్చును. ఇందు 'ఘ' ఇత్తు. ప్రత్యయస్వరూపము—అ.

ఉదా : దన్తాశ్ఛాద్యన్తే అనేన. దీనిచేత దంతములు కప్పఁబడును. అనునర్థమున 'ఛాది' అనుధాతువునకు (ఛద్‌ధాతువుయొక్క ణిజంతమునకు.) ఘ ప్రత్యయము 'దన్త ఛాది + ఘ' అనియుండగా నీక్రిందిసూత్రముచే ధాతువులోని అకారమునకు హ్రస్వము విధింపఁబడుచున్నది.

సూ : ఛాదేర్ఘే ఽద్వ్యుపసర్గస్య 6-4-96.

వృ : ద్వి ప్రభృత్యుపసర్గహీనస్యఛాదేర్హ్రస్వో ఘేపరే. దన్తాశ్ఛాద్యన్తే ఽనేన దన్తచ్ఛదః.

ప. వి : ఛాదేః (6-1) ఘే (7-1) అద్వ్యుపసర్గస్య (6-1).

అను : ఉపధాయాః (6-1) హ్రస్వః (1-1).

అర్థ : ఘ ప్రత్యయము పరమగునపుడు, రెండుగాని, అంతకు ఎక్కువగాని ఉపసర్గలు లేని ఛాదిధాతువుయొక్క ఉపధకు హ్రస్వమగును. దన్తచ్ఛదః.

వివ : ఈ సూత్రమునందలి 'అద్వ్యుపసర్గస్య' అనుపదమునందలి ద్వి శబ్దము సూచనార్థము. కావున 'రెండుగాని యంతకుమించిన సంఖ్యలోగాని ఉపసర్గములు లేని 'ఛాది'ధాతువుయొక్క' అనునర్థము వచ్చినది—అట్టిదానియుపధాక్షరమునకు, ఘ ప్రత్యయము పరమగునపుడు, హ్రస్వము వచ్చును

ఉదా : దన్త, ఛాది + ఘ—హ్రస్వము దన్త, ఛది + అ, ణేరనిటి అనుసూత్రముచే ణిచ్ ప్రత్యయమునకు లోపము (ఇకారములోపించును) దన్త, ఛద్ + అ - దన్త + ఛద, ఛేచ, తుగాగమము, దన్తత్ + ఛద, శ్చుత్వము, దన్తచ్ఛద + సు = దంతచ్ఛదః - పెదవి. ఇచట ఘ ప్రత్యయము కరణార్థమున వచ్చినది (కరణము=సాధనము.)

అధికరణార్థమున నుదాహరింపఁబడుచున్నది.

వృ : ఆకుర్వన్త్యస్మిన్నాకరః.

వివ : దీనియందు పనిచేయుదురు అనునర్థమున ఆఙ్‌పూర్వకమగు కృధాతువునకు 'ఘ' ప్రత్యయము. ఆ + కృ ఘ, ఆ+కృ + అ 'సార్వధాతుకార్ధ

ధాతుకయోః' అనుసూత్రముచే గుణము, రపరమైన అకారము, అక్ + అర్ + ఉకర + సు=అకరః = గని - ఇది అధికరణవాచకము - (అధికరణము - అధారము)

సూ : అపే తౄస్త్రోర్ఘఞ్ 3-3-120.

వృ : అవతారః కూపాదేః. అవస్తారో జవనికా.

ప. వి : అవే (7-1) తౄస్త్రోః (6-2) ఘఞ్ (1-1)

అను : పుంసి (7-1) సంజ్ఞాయామ్ (7-1) కరణాధికరణయోః (7-2) ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : 'అవ' అనునది ఉపపదముగా నున్నపుడు, పుంలింగమున, సంజ్ఞయందు, కరణాధికరణములు వాచ్యములగునపుడు, తౄ, స్తౄధాతువులకు ఘఞ్ ప్రత్యయము వచ్చును ఉదా : అవతారఃకూపాదేః, అవస్తారః-జవనికా.

వివ : 'అవ' అను ఉపసర్గము ఉపపదముగా నున్నపుడు, తౄ, స్తౄ అనుధాతువులకు పై సూత్రముచే 'ఘ' ప్రత్యయము ప్రాప్తించుచుండగా అపవాదముగా ఘఞ్ ప్రత్యయము విధింపఁబడినది. ఇది కరణాధికరణములు వాచ్యములగునపుడు ఈ ధాతువులకు వచ్చును. 'ప్రాయేణ' అనుపదము ననువర్తించుట వలన సంజ్ఞ గమ్యమానము కానియపుడును ఈ ప్రత్యయము రావచ్చును

ఉదా : 'తౄ' ప్లవనతరణయోః - అవ, తౄ+ఘఞ్, ఘకార ఞకారము లిత్తులు - అవ, తౄ + అ, వృద్ధి (అచోఞ్ణితి) అకారము రపరమై వచ్చును. అవ, త్ + అర్ + అ = అవతార + సు = అవతారః దీనిచే బావిలోనికి దిగుదురు అనియిట కరణార్థమున నీ ప్రత్యయము వచ్చినది (బావిలోనికి దిగు మెట్లవరుస.)

'స్తౄఞ్' ఆచ్ఛాదనే - అవ, స్తౄ+ఘఞ్, వృద్ధి, అవ, స్తార్+అ=అవస్తార+సు=అవస్తారః - తెర.

సూ : హలశ్చ 3-3-121.

వృ : హలన్తాద్ఘఞ్. ఘాపవాదః, రమన్తే యోగినోఽస్మిన్నితి రామః. అపమృజ్యతేఽనేన వ్యాధ్యాదిరితి అపామార్గః.

ప. వి : హలః (5-1) చ (అవ్య).

అను : పుంసి (7-1) సంజ్ఞాయామ్ (7-1) కరణాధికర్ణయోః (7-2) ధాతోః (5-1) ప్రత్యయః (1-1) ఘఞ్ (1-1).

అర్థ : హలంతధాతువునకు పుంలింగమును, కరణాధికరణములు వాచ్యములగునపుడు, సంజ్ఞ తెలియఁ బడునపుడు ఘఞ్ ప్రత్యయము వచ్చును. ఇది ఘ ప్రత్యయమున కపవాదము. ఉదా : ఇతనియందు యోగులు రమింతురు – రామః, వ్యాధ్యాదులు దీనిచేత తుడిచివేయఁబడును – అపామార్గః.

వివ : హలః అనుపదము ధాతోః అనుదానికి విశేషణమగుటచే తదంత విధిచే హలంత ధాతువునకు అను నర్థము వచ్చును. అట్టిదానికి కరణ అధికరణములు వాచ్యములగునపుడు ఘఞ్ ప్రత్యయము వచ్చును, ఈ ప్రత్యయాంత రూపము పులింగమగును. మఱియు నది యొకదానికి సంజ్ఞ (పేరు) అగును. ఇది 'పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణ' అను సూత్రముచే ప్రాప్తమగు 'ఘ' ప్రత్యయమున కపవాదము. ధాతువుయొక్క ఉపధాభూత హ్రస్వ అకారమునకు, మృజ్ ధాతువులోని ఋకారమునకును వృద్ధియగుట ఞిత్ప్రయోజనము.

ఉదా : 'రము' క్రీడాయామ్ – ఉకారమిత్తు. రమ్ + ఘఞ్ రమ్ + అ, ఉపధావృద్ధి (అత ఉపధాయాః) (అకారమునకు అంతరతమమైన వృద్ధి ఆకారము – స్థానేఽన్తరతమః) రామ్ + అ = రామ + సు = రామః-ఇతనియందు యోగులు రమింతురు – ఇది అధికరణార్థమునకు ఉదాహరణము.

'మృజూష్' శుద్ధౌ – ఇందు ఊకార షకారములు ఇత్తులు. 'అప' ఉపసర్గము అప, మృజ్ + ఘఞ్, అప, మృజ్ + అ, మృజేర్వృద్ధిః అను సూత్రముచే ఇందలి ఋకారమునకు వృద్ధి – ఆర్ – అపమార్జ్ + అ, 'చజోః కు ఘిణ్ణ్యతోః' అను సూత్రముచే జకారమునకు కుత్వము గకారము. అపమార్గ్ + అ = అప + మార్గ, 'ఉపసర్గస్య ఘ ఞ్య మనుష్యే బహుళమ్' అను సూత్రముచే ఇచ్చట ఉపసర్గము యొక్క తుది అచ్చునకు దీర్ఘము వచ్చును. అపామార్గ + సు = అపామార్గః – దీనిచేత వ్యాధి మున్నగు నవి తుడిచివేయఁబడును. ఒకమూలిక – ఇచ్చట కరణార్థమున ప్రత్యయము.

సూ : ఈషద్దుఃసు షు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్ 3-3-126.

వృ : కరణాధికరణయోరితినివృత్తమ్. ఏ షు దుఃఖ సుఖార్థేషు ఉపపదేషు ఖల్. తయోరేవేతిభావే కర్మణిచ. కృచ్ఛ్రే, దుష్కరఃకటోభవతా. అకృచ్ఛ్రే ఈషత్కరః, సుకరః.

ప. వి. : ఈషద్దుఃసుషు (7-3) కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు (7-3) ఖల్ (1-1)

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1)

అర్థ : కరణాధి కరణయోః అనుపదము నివృత్తమైనది, దుఃఖసుఖార్థము లైన ఈషత్, దుస్, సు అనుపదము లుపపదములుగా నున్నపుడు ధాతువునకు ఖల్ ప్రత్యయము వచ్చును. 'తయోరేవ' అను సూత్రముచే నిది భావ కర్మార్థము లందగును. ఉదా, కృచ్ఛ్రే, దుష్కరః కటో భవతా. అకృచ్ఛ్రే. ఈషత్కరః సుకరః.

వివ : పై సూత్రములలో అనువృత్తిగా వచ్చుచున్న కరణాధికరణయోః అను పదమిచటికి ప్రవర్తింపదు. కృచ్ఛ్రమనగా దుఃఖము అదికానిది అకృచ్ఛ్రము – సుఖము ఈ యర్థములు గల ఈషత్, దుస్, సు అనుపదములు (అవ్యయములు) ఉపపదములుగా నున్నపుడు ధాతువునకు పరముగా 'ఖల్' అను ప్రత్యయము వచ్చును. 'తయోరేవ కృత్యక్త ఖలర్థాః' అను సూత్రమునందు కృత్యక్త ప్రత్యయములతోపాటు ఖలర్థప్రత్యయములుకూడా భావ కర్మార్థములందు వచ్చునని చెప్పఁబడి యుండుటచే ఖల్ ప్రత్యయమును, ఈ యర్థమున విధింపఁబడు వక్ష్యమాణ ప్రత్యయములును సకర్మక ధాతువులకు కర్మార్థము నందును, అకర్మక ధాతువులకు భావార్థమునందును వచ్చును. ఈ ప్రత్యయమున ఖకారలకారములిత్తులు. (ఖ్) + అ + (ల్).

ఉదా : దుఃఖార్థమగు 'దుస్' శబ్దము ఉపపదముగా నున్నపుడు, కృధాతువునకు కర్మార్థమున నుదాహరణము దుస్- కృ + ఖల్, దుస్, కృ + అ, గుణము (సార్వధాతుకార్ధధాతుకయోః) దుస్, కర్ + అ = దుస్ + కర, సకారమునకు రుత్వము, దానికి విసర్గము రాఁగా (ఇదుదుపధస్యచా ప్రత్యయస్య 8-3-41 హ్రస్వ ఇకార ఉకారము లుపధలుగానున్న అప్రత్యయమైన విసర్గమునకు కవర్గపవర్గములు పరములగునపుడు షత్వము వచ్చును) అను సూత్రముచే విసర్గమునకు షత్వము - దుష్కర + సు = దుష్కరః – దుష్కరః కటో భవతా - (నీ చేత చాప చేయఁబడుట కష్టము.)

సుఖార్థకములగు ఈషత్, సు అను నవ్యయములు ఉపపదములుగా నుండునపుడు ఉదాహరణము. ఈషత్ + కృ + ఖల్, ఈషత్, కృ + అ, ఈషత్, కర్ + అ, ఈషత్కర + సు = ఈషత్కరః – సుఖముగా చేయఁబడునది.

అట్లే సు, కృ + ఖల్, సు, కర్ + అ = సుకర + సు = సుకరః.

ఇచ్చట ప్రత్యయము ఖిత్తు కావున ఖిదంతము (కార) పరమగునపుడు 'అరుర్ద్విషదజన్తస్యముమ్' అను సూత్రముచే 'సు' అను దానికి ముమాగమము ప్రాప్త

పగుచున్నది కాని 'సు' అనునది అవ్యయ మగుటచే సుమాగమము అవ్యయ మునకు రాదని చెప్పఁబడుటచే ఇచట ముమాగమము లేదు.

అవ : దీనికొక అపవాదము చెప్పఁబడుచున్నది.

సూ : ఆతో యుచ్ 3-3-128.

వృ : ఖలోఽపవాదః. ఈషత్పానః సోమో భవతా. దుష్పానః, సుపానః

ప వి: ఆతః (5-1) యుచ్

అను : ఈషద్దుఃసుషు (7-3) కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు (7-3) ధాతోః(5-1) ప్రత్యయః (1-1).

అర్థ : ఆదంతమైన ధాతువునకు దుఃఖము సుఖము అను నర్థములు గల ఈషత్, దుస్, సు అనునవి యుపపదములైనపుడు యుచ్ ప్రత్యయము వచ్చును ఖల్ ప్రత్యయమున కపవాదము.

ఉదా : ఈషత్పానః సోమో భవతా, దుష్పానః. సుపానః

వి వ : ఆతః అనుపదము ధాతోః అనుదానికి విశేషణము. కావున ఆదంత మునకు అనునర్థము వచ్చినది. (తపరకరణము) దీర్ఘ అకారమంతమునఁగల ధాతువునకు దుఃఖము, సుఖము అనునర్థములుగల ఈషత్, దుస్, సు అనునవ్య యములు ఉపపదములుగా నుండగా 'యుచ్' అను ప్రత్యయము వచ్చును. ఇదియు ఖల్ ప్రత్యయము యెక్క అర్థమునందే వచ్చును. 'తయోరేవ' అను సూత్రమున 'ఖలర్థ' అను పదముచే నిదియు భావ కర్మార్థముల యందే వచ్చును. ఇందు చకార మిత్తు 'యు' అనుదానికి 'యు వోరనాకౌ' అనుసూత్రముచే 'అన' ఆదేశమువచ్చును.

ఉదా : 'పా' పానే, ఈషత్ + పా + యుచ్, ఈషత్, పా + యు, ఈషత్ + పా + అన, సవర్ణదీర్ఘము, ఈషత్పాన + సు = ఈషత్పానః ఈషత్పానఃసోమోభవతా - నీచేత సోమము ఈషత్పానము = సుఖముగా తాగఁబడునది.

దుస్, పా + యుచ్ దుస్, పా + అన = దుస్ + పాన, షత్వము, దుష్పాన + సు దుష్పానః - కష్టముగా త్రాగఁబడునది,

సు, పా + యుచ్, సు పా + అన = సుపాన + సు = సుపానః, సుఖముగా త్రాగఁబడునది.

సూ : అలంఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాం క్త్వా 3-4-18.

వృ : ప్రతిషేధార్థయోః అలంఖల్వో రుపపదయోః క్త్వాస్యాత్. ప్రాచాః గ్రహణం పూజార్థమ్. అమైవావ్యయేనేతి నియమాన్నోప సదసమాసః. దోదద్ఘోః అలందత్త్వా. ఘుమాస్థేతీత్వమ్, పీత్వాఖలు అలంఖల్వోః కిమ్? మాకార్షీత్ ప్రతిషేధయోః కిమ్? అలంకారః.

ప వి : అలంఖల్వోః (7-2) ప్రతిషేధయోః (7-2) ప్రాచామ్ (6-3) క్త్వా (1-1).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : నిషేధార్థములయిన అలమ్, ఖలు అనునవి ఉపపదములుగానుండ ధాతువునకు పరముగా క్త్వా అను ప్రత్యయము వచ్చును. 'ప్రాచామ్' పదమును గ్రహించుట గౌరవము కొఱకు. అమైవావ్యయేన అను నియమముచే ఉప పద సమాసము కాదు. దోదద్ఘోః అను సూత్రముచే దదాదేశము అలందత్త్వా 'ఘుమాస్థా' —— —— ' సూత్రముచే ఈత్వము పీత్వాఖలు. అలంఖల్వోః అననేల? మాకార్షీత్. ప్రతిషేధయోః అననేల? అలంకారః.

వివ : నిషేధము - ప్రవర్తింప నీకుండుట - అర్థము గాంగల అలమ్, ఖలు అనుఅవ్యయములు ఉపపదములైనపుడు ధాతువునకు పరముగా 'క్త్వా' ప్రత్యయము వచ్చును. ఇది ప్రాచీనాచార్యులు చెప్పినమాట (ప్రాచామ్ = ప్రాచీనుల మతమున). అయినచో నిది వైకల్పికముగా – అనగా పాణిని మతమున రాదా ? అనగా కాదు ఇది నిత్యము. మఱి సూత్రమున 'ప్రాచామ్' అను పదమేల ? అది వారియందు పాణిని మహర్షి కిగల గౌరవమును వ్యక్తముచేయుటకు. ఈ ప్రత్యయము చేరిన పదములతో అలమ్, ఖలు అను పదములు సమసింపవు. ఏల యన అమైవావ్యయేన 2 2-20 అను నియమముగలదు. అవ్యయములతో ఉపపదము సమసించుట జరిగినయెడల అమ్ (ణముల్ప్రత్యయము) అనుదానితో తుల్యవిధానము గల ఉపపదమే సమసించును అని నియమము. ప్రకృతమున నట్టిది లేదు కావున సమాసముకాదు. సమాసమైనయెడల నీక్త్వా ప్రత్యయమునకు 'ల్యప్' అను నాదేశము రావలసియుండును (సమాసేఽన ఞ్ పూర్వేక్త్వోల్యప్) ఈ ప్రత్యయమున కకారమిత్తు లశక్వతద్ధితే.

ఉదా : అలమ్, దా + క్త్వా (డుదాఞ్ దానే) దాధాతువునకు ఘు సంజ్ఞ కలదు. కావున 'దోదద్ఘోః' అను సూత్రముచే 'దద్' అనునాదేశము వచ్చును అలమ్, దద్ + త్వా - ఖరిచ. చర్త్వము, అలమ్, దత్వా. మోఽను స్వారః అలందత్త్వా క్త్వా ప్రత్యయాంతము లవ్యయములు. (క్త్వాతోసున్ కసున.

1-1-40 క్త్వా, తోసున్, కసున్ ప్రత్యయములంతమందుఁ గలవి అవ్యయములు అగుటచే 'అవ్యయాదాప్సుపః' అను సూత్రముచే వీనికి చేరిన సుప్ప్రత్యయములు లోపించును. అలందత్వా — ఈవలదు.

ఆప్లే 'ఖలు' అనునది ఉపపదముగానున్న 'పా' ధాతువునకు క్త్వా ప్రత్యయము. పా + క్త్వా, ఘుమాస్థాగాపాజహాతిసాం హలి' అను సూత్రముచే ధాతువులోని ఆకారమునకు ఈకారాదేశము విధింపఁబడినది పీత్వా ఖలు=త్రాగవలదు ఈ సూత్రమునందలి కొన్నిపదముల సార్థక్యము పరీక్షింపఁ బడుచున్నది.

'అలంఖల్వోః' అనుపదము సూత్రమున లేనియెడల ప్రతిషేధార్థకమయిన యే యితరపదము ఉపపదముగానున్నను ధాతువునకు క్త్వా ప్రత్యయము ప్రాప్తమగును దానిని కాదనుటకై యీ పదము సూత్రములో నుంచఁబడినది. ఉదా : మార్షీత్ - ఇచట 'మా' అనునది నిషేధార్థకమైన అవ్యయము. కృధాతువునకు క్త్వా ప్రత్యయమురాలేదు.

అలమ్, ఖలు అనునవి యితరార్థములలో ఉపపదములుగా నున్నపుడు ఈ క్త్వా ప్రత్యయము రాకుండుటకై 'ప్రతిషేధయోః' అనుపదము సూత్రములోనుంచఁ బడినది. ఉదా : అలంకారః - ఇచట 'అలమ్' భూషణార్థకము.

సూ: సమానకర్తృకయోః పూర్వకాలే 3-4-21

వృ : సమానకర్తృక యోర్ధాత్వర్థయో పూర్వకాలే విద్యమానాద్ధాతో క్త్వా స్యాత్. భుక్త్వా వ్రజతి. దిత్వమతంత్రమ్. భుక్త్వా పీత్వా వ్రజతి

ప. వి : సమానకర్తృకయోః (6-2) పూర్వకాలే (7-1).

అను . ధాతోః (5-1) ప్రత్యయః (1-1) కృత్ (1-1).

అర్థ : సమానకర్తృకములైన ధాత్వర్థములలో పూర్వకాలమున నున్న ధాతువునకు క్త్వా ప్రత్యయము వచ్చును. ఉదా : భుక్త్వావ్రజతి, ద్విత్వము వివక్షితము కాదు. భుక్త్వా పీత్వా వ్రజతి.

వివ : రెండు వ్యాపారములకు కర్త ఒకఁడే అయినపుడు అందు పూర్వమున నైన వ్యాపారమును తెలుపు ధాతువునకు క్త్వా ప్రత్యయము వచ్చును. ఉదాహరణమునకు వాఁడు తినివెళ్ళుచున్నాఁడు, అను వాక్యమునందు తినుట, వెళ్ళుట అను రెండు వ్యాపారములు కలవు. ఇందు తినుట అనునది, వెళ్ళుట అనుపనికి పూర్వకాలమున జరిగినది. తినుటకును, వెళ్ళుటకును కర్త ఒకఁడే (వాఁడు)

కావున 'తిను' అనునర్థము గల సంస్కృత ధాతువున కిట్టి పరిస్థితిలో క్త్వా ప్రత్యయము వచ్చును.

ఉదా : భుక్త్వా ప్రజతి. (తినివెళ్ళుచున్నాఁడు) ఇందు పూర్వకాలికమైన వ్యాపారమును తెలుపు భుజ్ ధాతువునకు క్త్వా ప్రత్యయము. భుజ్ + క్త్వా ককారమిత్తు. భుజ్+త్వా, చోః కుః, కుత్వము భుగ్+త్వా, ఖరిచ, చర్త్వము, భుక్త్వా + సు - క్త్వాంతము అవ్యయము. (క్త్వాతోసున్ కసునః) కావున సుప్పునకు లుక్కు వచ్చును. భుక్త్వా + సు = భుక్త్వా (అవ్యయాదాప్సుపః).

ఇందు 'సమానకర్తృకయోః' అని ద్వివచనాంతపదము గలదు. కావున రెండు వ్యాపారములు జరుగునపుడే యీ ప్రత్యయము వచ్చునను నర్థము కలుగును. కాని యిచట ద్వివచనము ఉపలక్షణము. ఒకటికంటె నెక్కువ వ్యాపారములు జరిగినపుడు పూర్వకాలమున జరిగిన వ్యాపారములను (పనులను) తెలుపు ధాతువు లన్నింటికిని ఈ వ ప్రత్యయము వచ్చును. ఈ యర్థమునే ద్విత్వమతంత్రమ్ అను వాక్యము తెలిపినది. కావున మూఁడు వ్యాపారములు సమాన కర్తృకములైనప్పుడు అందు మొదటి రెంటిని తెలుపు ధాతువులకు క్త్వా ప్రత్యయము వచ్చును. ఇట్లే నాలుగు, ఐదు వ్యాపారములు జరిగినపుడు చివరిదికాక తక్కిన వానికి క్త్వా ప్రత్యయము వచ్చునని ఫలితార్థము.

ఉదా : భుక్త్వా పీత్వా ప్రజతి – తిని, త్రాగి వెళ్ళుచున్నాడు 'పా పానే' పా + క్త్వా, ఆకారమునకు ఈకారాదేశము 'ఘుమాస్థాగాపాజహాతిసాం (6–4–66) (ఘుసంజ్ఞ గల ధాతువులకు, మా, స్థా, గా, పా, హా, సా (షో) ధాతువుల ఆకారమునకు హలాదియై కిత్తుగాని జిత్తుగాని అయిన అర్ధధాతుకము పరమగునపుడు ఈకారమాదేశమగును) అను సూత్రముచే కలుగును. పీ + త్వా–పీత్వా ప్రత్యయము కిత్తగుటచే గుణము రాదు. ఇడాగమము రాఁదగిన వానిని సేట్టు లందురు. (స + ఇట్ = సేట్) రాఁదగనివానిని అనిట్టు లందురు. ఇది అనిట్టగుటచే దీనికి పరమైన క్త్వా ప్రత్యయమునకు ఇడాగమము రాలేదు.

అవ : ఈ క్త్వా ప్రత్యయమునకు కొన్నియెడల కిత్త్వలక్షణములేదని యీ క్రింది సూత్రము చెప్పుచున్నది.

సూ : నక్త్వా సేట్ 1-2-18.

వృ : సేట్ క్త్వా కిన్నస్యాత్. శయిత్వా. సేట్ కిమ్ ? కృత్వా.

ప. వి. : న (అవ్య) క్త్వా (1-1) సేట్ (1-1)

అను : కిత్ (1-1)

అర్థ : సేట్టయిన క్త్వా ప్రత్యయము కిత్తు కాదు. ఉదా : శయిత్వా, సేటనేల ? కృత్వా.

వి వ : కొన్ని ధాతువులకు పరముగనున్న వలాది ఆర్ధధాతుకములకు ఇడాగమము వచ్చును. (ఆర్ధధాతుకస్యేడ్వలాదేః) కొన్ని ధాతువులకు పరముగ నున్నవానికి రాదు (ఏకాచ ఉపదేశే ఽ నుదాత్తాత్). ఇడాగమము వచ్చు ప్రత్యయములు గల ధాతువులు సేట్టులు. రానివి అనిట్టులు అని ఇంతకు ముందు చెప్పఁబడినది. ఇచట 'సేట్' అనునది క్త్వా ప్రత్యయమునకు విశేషణము. ఇడాగమ సహితమైన క్త్వా ప్రత్యయము అనియర్థము. అది కిత్తు కాదు. అనగా కిత్తు పరమగు నపుడు విధింపఁబడు కార్యములు రావని తాత్పర్యము.

ఉదా : 'శీఙ్' స్వప్నే - ఇందు ఙకారమిత్తు శీ + క్త్వా, ఇడాగమము శీ, ఇత్వా, ఆగమములు దేనికి విధింపఁబడునో యవయవములై, వానిని గ్రహించినపు డివియు గ్రహింపఁబడును (యదాగమా స్తద్గుణీ భూతా స్తద్గ్రహణేనగృహ్యన్తే) అనున్యాయము ననుసరించి ఇచట 'ఇత్వా' అనునది మొత్తము ఆర్ధధాతుక ప్రత్యయమగును. క్త్వా ప్రత్యయమునకు సంబంధించిన కిత్త్వలక్షణము (కకారమిత్తుగాం గల లక్షణము) దీనికిని ఉండును. అది ప్రకృత సూత్రముచే లేదని చెప్పఁబడినది కావున కిత్తు పరమగునపుడగు గుణనిషేధాదు లిచట ప్రవర్తింపవు. కావున గుణమువచ్చును. శే + ఇత్వా, అయాదేశము (ఏచోఽయవాయావః) శయ్ + ఇత్వా — శయిత్వా + సు శయిత్వా = నిద్రించి.

'ఇడాగమసహితమైన క్త్వా ప్రత్యయమునకు మాత్రమే కిత్త్వ నిషేధము. ఇడాగమములేనిది కిత్తేయగును. ఉదా : కృ + క్త్వా, ఇచట ధాతువు అనిట్టు కావున ఇడాగమమురాదు. ఇది (క్త్వా) కిత్తేయగును. కావున గుణమురాదు - కృత్వా,

అవ : పై సూత్రమునకొక అపవాదము చెప్పఁబడుచున్నది.

సూ : రలో వ్యుపధా ద్ధలాదేః సంశ్చ 1-2-26.

వృ : ఇవర్ణో వర్ణోపధాద్ధలాదే రలన్తాత్పరౌ క్త్వాసనౌ సేటౌ వాకితౌ స్తః, ద్యుతిత్వా, ద్యోతిత్వా, లిఖిత్వా లేఖిత్వా, వ్యుపధాత్కిమ్ ? వర్తిత్వా, రలఃకిమ్ ? సేవిత్వా, హలాదేఃకిమ్? ఏషిత్వా సేట్‌కిమ్? భుక్త్వా.

ప. వి : రలః (5-1) వ్యుపధాత్ (5-1) హలాదేః (5-1) సన్ (1-1) చ (అవ్య).

అను : వా (అవ్య) సేట్ (1-1) కిత్ (1-1).

అర్థ : ఇవర్ణముగాని ఉవర్ణముగాని ఉపధగాగలదియు, హలాదియు రలంత మును అయిన ధాతువునకు పరముగనున్న సేట్టులగు క్త్వా సన్ ప్రత్యయములు వైకల్పికముగా కిత్తు లగును, ఉదా : ద్యుతిత్వా, ద్యోతిత్వా లిఖిత్వా, లేఖిత్వా. వ్యుపధాత్ అననేల ? వర్తిత్వా, రలః అననేల ? సేవిత్వా హలాదేః అననేల ? ఏషిత్వా, సేట్ అననేల ? భుక్త్వా.

వివ : రలః, వ్యుపధాత్, హలాదేః అను మూఁడును 'ధాతోః' అను దానికి విశేషణములు. ప్రత్యయములనుబట్టి 'ధాతోః' అనుపదము ఆకర్షింపఁబడును. ఇందు 'రలః' అనుదానికి తదంతవిధిచే రలంతమైన అనునర్థము కలుగును. రల్ - ప్రత్యాహారము - య, వ లుకాక తక్కిన హల్లులన్నియు నిందుకలవు. వ్యుపధాత్ - ఉ + ఇ = యణాదేశముచే 'వి' అగును. వి + ఉపధగాగలది వ్యుపధము - ఉకార ఇకారములు ఉపధగాగల ధాతువనియర్థము. ఇట్లు' రలంతమై, ఇకారముగాని ఉకారముగాని, ఉపధగాఁగలిగి, హల్లు ఆదియందుఁ గలధాతువునకు పరముగనున్న ఇడాగమ సహితములగు క్త్వా, సన్ ప్రత్యయములు వైకల్పికముగా కిత్తు లగును. అనగా కిత్తు పరమగునపుడు విధింపఁబడిన కార్యములు వైకల్పికముగానగునని ఫలితార్థము.

ఉదా : 'ద్యుత - దీప్తౌ - ద్యుత్ + త్వా - ధాతువు హలాది (ద్) ఉకారోపధము, తకారాంతము (రలంతము). ఇది సేట్టుకావున ఇడాగమము, ద్యోత్ + ఇత్వా, కిత్తు కానిచో గుణమువచ్చును (పుగంతలఘూ పధస్యచ) ద్యోత్ + ఇత్వా = ద్యోతిత్వా + సు = ద్యోతిత్వా, కిత్తయినచో గుణమురాదు (క్ఙితిచ) ద్యుత్ + ఇత్వా = ద్యుతిత్వా + సు = ద్యుతిత్వా (ప్రకాశించి).

ఇట్లే : 'లిఖ' అక్షరవిన్యాసే - లిఖ్ + క్త్వా, లిఖ్ + ఇత్వా, కిత్తుకానిచో గుణము లేఖ్ + ఇత్వా- లేఖిత్వా, కిత్తయినచో గుణమురాదు లిఖిత్వా + సు= లిఖిత్వా (వ్రాసి) (గుణము - పుగంతలఘూపధస్యచ)

సూత్రములందలి దళములకు సార్థక్యము చర్చింపఁబడుచున్నది. (1) వ్యుప ధాత్కిమ్? 'ఇకారోకారోపధములకు పరమైన' అననిచో ఋకారోపధమైన వృత్ధాతువునకు ఈ కార్యము (వైకల్పికముగా కిత్తగుట) ప్రాప్తించును. అది యిష్టముకాదు. వృత్ + ఇత్వా, నక్త్వా సేట్ అనుసూత్రముచే నిది నిత్యముగా అకిత్తగును. కావున గుణము. వర్తిత్వా (వర్తిల్లి).

(2) రలఃకిమ్ ? — ధాతువు రలంతమ్ము కావలయుననినచో యకార వకారాంత ధాతువులకు పరముగానున్న క్త్వా సన్ ప్రత్యయములును వైకల్పికముగా

క్త్వ అగును. అదికూడదు. ఉదా : 'షివు' తన్తు సంతానే ఇది వకారాంతము— కావున రలంతముకాదు. దీనికీకార్యము వర్తింపదు సివ్ + ఇత్వా = 'నక్త్వా సేట్' సూత్రముచే కిత్త్వనిషేధము కావున లఘూపధ గుణముదాఁగా 'సేవిత్వా' అగును. (సేవించి).

(3) హలాదేః కిమ్? — హలాది ధాతువునకు పరముగనున్నవానికే యీ కార్యమనుటచే అజాదిధాతువులకిది వర్తింపదు. ఇషు -ఇచ్ఛాయామ్ ఇష్ + ఇత్వా -ఇది అజాది ధాతువు. కాన ఇచట 'ఇత్వా' అనునది ప్రకృత సూత్రము నకు లక్ష్యముకాదు. నక్త్వాసేట్ - లఘూపధ గుణము ఏషిత్వా - (కోరి)

(4) సేట్ అననేల ? క్త్వాప్రత్యయము ఇడాగమ సహితమైనప్పుడే యీ కార్యము వర్తించును. భుజ్ - ఇది, రలంతము, హలాది, ఉకారోపధము. కాని దీనికి చేరిన క్త్వాప్రత్యయమునకు ఇడాగమమురాదు. కావున ఇచటి క్త్వాప్రత్య యము అనిట్టు అగుటచే ఈ కార్యము వర్తింపదు. అది కిత్తేయగును. కావున గుణమురాదు, భుక్త్వా - భుజించి.

సూ : ఉదితో వా 7-2-56

వృ : ఉదితః పరస్య క్త్వ ఇడ్వా. శమిత్వా శాన్త్వా దేవిత్వా ద్యూత్వా.

ప. వి : ఉదితః (5-1) వా (అవ్య)

అను : ఇట్ (1-1) క్త్వి (7-1)

అర్థ : ఉదిత్తయిన ధాతువునకు పరముగనున్న క్త్వాప్రత్యయమునకు ఇడా గమము వైకల్పికముగానగును ఉదా : శమిత్వా, శాన్త్వా, దేవిత్వా, ద్యూత్వా.

వి వ: ఉత్ ఇత్ యస్యసః ఉదిత్ - హ్రస్వఉకారము-ఇత్తు గాగలది. అను వృత్తి గావచ్చిన క్త్వి అనుసప్తమ్యంతమును షష్ఠ్యంతముగామార్చు కొనవలయును. ఉదిత్తయిన ధాతువునకు పరముగానున్న క్త్వాప్రత్యయమునకు ఇడాగమము వైక ల్పికముగానగును.

ఉదా : 'శము' ఉపశమే - ఇందు ఉకారము ఇత్తు. కావున ఇది ఉదిత్తు శమ్ క్త్వా. ఇడాగమము రాఁగా, శమ్ + ఇత్వా = శమిత్వా + సు=శమిత్వా ఇడాగమమురానిచో, శమ్ + క్త్వా, శమ్ + త్వా, అను నాసికస్యక్వి ఝలోః కితి (6-4-15) అనుసూత్రముచే ధాతువులోని ఉపధయగు అకారమునకు దీర్ఘము వచ్చును. (అను నాసికాంతమైన ధాతువు యొక్క ఉపధకు, క్విప్ ప్రత్యయము ముగాని, ఝలాదియగు కిత్తు లేక జిత్తుగాని పరమగునపుడు దీర్ఘము వచ్చును.)

శామ్ + త్వా, 'నశ్చాపదాన్తస్యఝలి' అను సూత్రముచే మకారమునకు అనుస్వారము శాం + త్వా, 'అనుస్వారస్య యయి పరసవర్ణః' శాన్ త్వా=శాన్త్వా + సు = శాన్త్వా-(శమించి.)

'దివు' క్రీడావిజిగీషాదిషు- ఇదియు ఉదిత్తు. దివ్ + క్త్వా, దివ్ + త్వా, ఇడాగమము రాఁగా దివ్ + ఇత్వా, న క్త్వాసేట్ అనుసూత్రముచే ఇచట క్త్వాప్రత్యయము కిత్తుకాదు కావున లఘూపధగుణమురాఁగా దేవ్ + ఇత్వా-దేవిత్వా+సు = దేవిత్వా, (క్రీడించి)

ఇడాగమము రానిచో దివ్+త్వా, 'చ్ఛ్వోఃశూడనునాసికేచ' అనుసూత్రముచే వకారమునకు ఊఠ్ ఆదేశము, ఠకారమిత్తు, ది+ఊ+త్వా, యణాదేశము (ఇకోయణచి) ద్యూ + త్వా = ద్యూత్వా + సు=ద్యూత్వా.

అవ : ధాధా కు క్త్వాంతరూపము నిర్దేశింపఁబడుచున్నది.

వృ : దధాతేర్హిః – హిత్వా.

వివ : 'డుధాఞ్' ధారణపోషణయోః అనుధాతువునకు క్త్వా, ప్రత్యయము చేరినపుడు, దధాతేర్హిః 7-4-42, (తకారాదికిత్ప్రత్యయము పరమగునపుడు 'ధా' ధాతువునకు 'హి' అనునాదేశమగును) అనుసూత్రముచే 'హి' అను ఆదేశము వచ్చును. ఇది అనేకవర్ణములు గలదియగుటచే 'అనేకాల్ శిత్ సర్వస్య' అను పరిభాషచే సర్వాదేశమగు, హి + త్వా = హిత్వా + సు = హిత్వా (ఉంచి).

సూ : **జహాతేశ్చ క్త్వి** 7-4-43.

వృ : హిత్వా, హజస్తు హాత్వా.

ప. వి : **జహాతేః** (6-1) చ (అవ్య) క్త్వి (1-1).

అను : **హిః** (1-1).

అర్థ : 'ఓహాక్' త్యాగే అనుధాతువునకు క్త్వాప్రత్యయము పరమగునపుడు 'హి' ఆదేశమగును. ఉదా : హిత్వా, ఓహాఙ్ గతౌ అనుదానికి మాత్రము హాత్వా అగును.

వివ : 'ఓహాక్' అనుధాతువు త్యాగము అనునర్థము కలది. ఇందు ఓకార క కారము లిత్తులు. హా – దీనికి క్త్వా ప్రత్యయము పరమగునపుడు 'హి' అనునాదేశము వచ్చును. హా+క్త్వా, హా+త్వా, హి+త్వా, హిత్వా + సు= హిత్వా - వదలి, త్యజించి.

ఓహాజ్ గతౌ అను మతియొకధాతువు కలదు. సూత్రమున 'జహాతి' అను దానిని గ్రహించుటవలన ఆత్మనే పదియగు ఈ ధాతువు గ్రహింపఁబడదు. అనగా గత్యర్థకమగు 'హా' ధాతువునకు క్త్వా ప్రత్యయము పరమగునప్పుడు 'హి' ఆదేశము రాదని ఫలితార్థము (ఓ) హా (జ్) + క్త్వా, హాత్వా, (పోయి).

అవ : క్త్వా ప్రత్యయమునకు సమాసమున 'ల్యప్' అనునాదేశము విధింపఁబడుచున్నది.

సూ : సమాసేఽనఞ్పూర్వే క్త్వో ల్యప్ 7-1-37.

వృ : అవ్యయపూర్వపదేఽనఞ్ సమాసే క్త్వోల్య బాదేశః స్యాత్. తుక్, ప్రకృత్య. అనఞ్ కిమ్, అకృత్వా.

ప. వి : సమాసే (7-1) అనఞ్ పూర్వే (7-1) క్త్వః (6-1) ల్యప్ (1-1).

అర్థ : అవ్యయపూర్వపదమగు అనఞ్ సమాసమున క్త్వా ప్రత్యయమునకు ల్యప్ అనునాదేశము వచ్చును. తుగాగమము. ప్రకృత్య. అనఞ్ అననేల? అకృత్వా.

వివ : నఞ్ పూర్వమనగా 'నఞ్' అను వ్యతిరేకార్థక-అవ్యయము పూర్వ పదముగాఁగలది, అదికానిది అనఞ్పూర్వపదము. అట్టి సమాసమునందు, అనగా నఞ్ భిన్నమైన అవ్యయము పూర్వపదముగా నున్న సమాసమునందు క్త్వాప్రత్యయమునకు 'ల్యప్' అనునాదేశము వచ్చును. ఇందులకారపకారము లిత్తులు. ప్రత్యయ స్వరూపము - య - ఇది అనేకాలాదేశము (య్ + అ) కావున క్త్వా ప్రత్యయమును మొత్తము తొలగించి వచ్చును.

ఉదా : ప్ర + కృత్వా, కుగతిప్రాదయః అనుసూత్రముచే సమాసము. ప్రకృ + ల్యప్, 'హ్రస్వస్య పితికృతి తుక్' అనుసూత్రముచే తుగాగమము, ప్రకృత్ + య = ప్రకృత్య + సు = ప్రకృత్య.

'అనఞ్ సమాసే' అనుటవలన నఞ్ పూర్వపదమగు సమాసమున ఈ యాదేశము రాదు. నఞ్ + కృత్వా, ఞకారమిత్తు, న + కృత్వా, 'నలోపోనఞః' అను సూత్రముచే నకారలోపము. అకృత్వా + సు = అకృత్వా.

సూ : ఆభీక్ష్ణ్యే ణముల్ చ 3-4-22.

వృ : ఆభీక్ష్ణ్యే ద్యోత్యే పూర్వవిషయేణముల్ స్యాత్, క్త్వాచ.

ప. వి : ఆభీక్ష్ణ్యే (7-1) ణముల్ (1-1) చ (అవ్య).

అను : ధాతోః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : ఆభీక్ష్ణ్యము ద్యోత్యమగునపుడు పూర్వవిషయమున ణముల్ ప్రత్యయము కూడ నగును. 'కూడ' అనుటచే క్త్వా ప్రత్యయము.

వివ : ఆభీక్ష్ణ్యమనగా నైరంతర్యము. లేకపౌనః పున్యము ఎడతెరపిలేకుండ లేక మాటిమాటికి ఒకపని జరుగుట. అది తెలియఁబడినపుడు క్త్వా ప్రత్యయము వచ్చు సందర్భమునందు 'ణముల్' అను ప్రత్యయము కూడ వచ్చును. అనగా క్త్వా ప్రత్యయము కూడ రావచ్చునని తాత్పర్యము. ఒకపని మాటిమాటికి జరిగిన దనునంశము వ్యక్తమగునపుడు సమాన కర్తృకములైనధాతువులలో పూర్వకాలమున నుండుదానికి ణముల్ ప్రత్యయముగాని క్త్వా ప్రత్యయముగాని వచ్చునని ఫలితార్థము. ఇందు ణ కారలకారము లిత్తులు. ఉకార ముచ్చారణార్థము 'అమ్ ప్రత్యయము.

ఉదా : 'స్మృ' ఆధ్యానే + స్మృ-ణముల్-స్మృ+అమ్, అచోఞ్ణితి, వృద్ధిః అకారము రపరముగా వచ్చును. స్మార్+అమ్=స్మారమ్. కృన్మేజన్తః 1-1-39 అను సూత్రముచే నిది అవ్యయమగును. స్మారమ్ + సు, స్మారమ్.

అవ : దీనికి ద్విత్వమీక్రింది సూత్రముచే విధింపఁబడుచున్నది.

సూ : నిత్య వీప్సయోః 8-1-4,

వృ : ఆభీక్ష్ణ్యే వీప్సాయాంచ ద్యోత్యే పదస్య ద్విత్వం స్యాత్. ఆభీక్ష్ణ్యం తిఙన్తే ష్వవ్యయసంజ్ఞకేషు కృదన్తేషు, స్మారం స్మారం నమతి శివమ్. స్మృత్వా స్మృత్వా. పాయం పాయమ్, భోజం భోజమ్.

ప. వి : నిత్యవీప్సయోః (7-2)

అను : పదస్య (6-1) ద్వే (1-2)

అర్థ : ఆభీక్ష్ణ్యము, వీప్స అనునవి తెలియఁబడునపుడు పదమునకు ద్విత్వము వచ్చును. ఆభీక్ష్ణ్యము తిఙంతముల విషయమునను అవ్యయసంజ్ఞకల కృదంతముల విషయముననను చెప్పవీలగును. ఉదా : స్మారం స్మారం నమతి శివమ్-శివుని స్మరించి స్మరించినమస్కరించుచున్నాఁడు. స్మృత్వా స్మృత్వా అనియు నగును ఇట్లే పాయం పాయమ్, భోజం భోజమ్, శ్రావం శ్రావమ్. మొ॥వి

వివ : నిత్యమనగా నిత్యత్వము అనగా ఒకపని నిరంతరము మాటిమాటికి జరుగుట – దానినే ఆభీక్ష్ణ్యమనియు నందురు. వీప్సయనగా అన్నిటిని వ్యాపించు

నిప్పు. ఈ ఆభీక్ష్ణ్యము గాని వీప్సగాని తెలియఁబడునపుడు పదము రెండుమాఱులు ఉచ్చరింపఁబడును, ఆభీక్ష్ణ్యము అనునది తిఙంతములవిషయమున అనగా సమాపక క్రియలచే తెలుపఁబడు వ్యాపారముల విషయమునను, అవ్యయము అను సంజ్ఞను పొందు కృదంతములచే తెలుపఁబడు క్రియలవిషయమునను సాధ్యమగును.

ఉదా : స్మారం స్మారం నమతి శివమ్ – స్మరించి స్మరించి శివునికి నమస్కరించుచున్నాఁడు. ఇందు 'స్మారమ్' అనునది అవ్యయసంజ్ఞకల కృదంతము. ఇచట స్మరణక్రియ నిరంతరముగా జరిగినది కనుక స్మృధాతువునకు ణముల్ ప్రత్యయము వచ్చినది. నైరంతర్యము వ్యక్తమగుటచే స్మారమ్ అనుపదము ద్విరుక్తమైనది. ఇందు స్మరణము నమస్కరించుట అను క్రియకు పూర్వకాలికము, సమాన కర్తృకము.

ఈ యర్థమున క్త్వాప్రత్యయము కూడరానగును. స్మృ + క్త్వా, స్మృ + త్వా స్మృత్వా స్మృత్వా-తలఁచితలఁచి.

ఇట్లే పా + ణముల్, పా+అమ్, ఆతో యుక్ చిణ్ కృతోః యుగాగమము, పాయ్ + అమ్+ పాయమ్+సు=పాయమ్, ద్విరుక్తి పాయంపాయమ్ - త్రాగి త్రాగి, లేక పాలించి పాలించి.

భుజ్ +ణముల్, భుజ్+అమ్, లఘూపధగుణము భోజ్+అమ్, భోజమ్, ద్విరుక్తి భోజం భోజమ్ =తినితిని.

శ్రు + ణముల్, శ్రు=అమ్, వృద్ధి, శ్రౌ+అమ్, ఆవాదేశము, శ్రావమ్, ద్విరుక్తి, శ్రావం శ్రావమ్ – విని విని.

ఈ యన్నింటియందును మొదటిదానిచివరి మకారమునకు మోఽను స్వారః' అనుసూత్రముచే అనుస్వారాదేశము.

సూ : అన్యథైవం కథమిత్థంసు సిద్ధా ప్రయోగశ్చేత్ 3-4-27.

వృ : ఏషు కృఞో ణముల్ స్యాత్ సిద్ధోఽప్రయోగోఽస్య ఏవంభూతశ్చేత్ కృఞ్. వ్యర్థత్వాత్ప్రయోగానర్హ ఇత్యర్థః. అన్యథాకారమ్, ఏవంకారమ్, కథఙ్కారమ్ ఇత్థంకారం భుఙ్క్తే. సిద్ధేతికిమ్? శిరోఽన్యథాకృత్వాభుఙ్క్తే.

ఇతి కృదంత ప్రక్రియా

ప. వి : అన్యథైవం కథమిత్థంసు (7-3) సిద్ధాప్రయోగః (1-1) చేత్ (1-1)

అను : ధాతోః (5-1) కృఞః (5-1).

అర్థ : అన్యథా, ఏవమ్, కథమ్, ఇత్థమ్ అనునవ్యయములు ఉపపదముగా నున్నపుడు కృఞ్ ధాత్వర్థము సిద్ధాప్రయోగమైనయెడల, కృఞ్ ధాతువునకు పరముగా 'ణముల్' ప్రత్యయము వచ్చును, ఉదా : అన్యథాకారమ్, ఏవఙ్కారమ్, కథఙ్కారమ్, ఇత్థఙ్కారం భుఙ్క్తే. సిద్ధాప్రయోగమననేల? శిరోఽన్యథా కృత్వా భుఙ్క్తే.

వివ : సిద్ధమైన అప్రయోగము గలది సిద్ధాప్రయోగము. అప్రయోగమనగా ప్రయోగము లేకుండుట. అనగా ఏది ప్రయోగింపబడకున్నను అర్థమునకు భంగము కలుగదో అది సిద్ధాప్రయోగము. 'కృఞ్' ధాతువు అట్టిదైనపుడు, అన్యథా, ఏవమ్, కథమ్, ఇత్థమ్ అనునవి ఉపపదములుగా నున్న ఆకృఞ్ ధాతువునకు పరముగా ణముల్ ప్రత్యయము వచ్చును.

ఉదా : అన్యథా, కృ(ఞ్) + ణముల్, కృ + అమ్, వృద్ధి, కార్ + అమ్, అన్యథాకారమ్ (ఇది అవ్యయము) భుఙ్క్తే-అనగా మఱియొకవిధముగా భుజించుచున్నాఁడు అని యర్థము-ఇచట అన్యథా భుఙ్క్తే అనుచో నేమియర్థమో అన్యథాకారంభుఙ్క్తే అనుదానికి కూడనంతేయర్థము. అనగా 'కారమ్' అనుదానికి ప్రత్యేకార్థము లేదని తాత్పర్యము. కావుననే దాని అప్రయోగము సిద్ధమైనది.

ఇట్లే ఏవఙ్కారం భుఙ్క్తే - ఇట్లు భుజించుచున్నాఁడు కథఙ్కారం భుఙ్క్తే-ఎట్లు భుజించుచున్నాఁడు, ఇత్థంకారం భుఙ్క్తే ఇట్లు భుజించుచున్నాఁడు - అనువాని యందును కృఞ్ధాతువునకు ప్రత్యేకార్థమేమియులేదు.

సిద్ధాప్రయోగమనని యెడల కృఞ్ధాత్వర్థము ప్రయోజన సహితమైనపుడును ఈణముల్ ప్రత్యయము ప్రాప్తించును. అది యిష్టముకాదు. శిరోఽన్యథాకృత్వా భుఙ్క్తే-శిరస్సును మఱియొకవిధముగా చేసి భుజించుచున్నాఁడు. ఇచట 'చేసి' అనునర్థము వివక్షితమే. అది లేనిచో వాక్యార్థము పొసగదు. కావున నట్టియెడ ఈణముల్ ప్రత్యయము రాకుండుటకై 'సిద్ధాప్రయోగశ్చేత్' అనుపదము లావశ్యకములైనవి. ఇచట 'సమానకర్తృకయోః పూర్వకాలే' అనుసూత్రముచే క్త్వా ప్రత్యయము కృఞ్ధాతువునకు పరముగా వచ్చినది.

ఇది ఉత్తర కృదంతప్రకరణము.

## ప్రకరణావలోకనము.

క్రియావాచక పదములయొక్క మూలరూపములను ధాతువులందురు. వీని నుండి యేర్పడు శబ్దములు రెండువిధములు (1) తిజంతములు (2) కృదంతములు. తిజంతములు సమాపకక్రియలు. ఆ ప్రక్రియ యీ వ్యాఖ్యయందు ప్రస్తుతమునకు గ్రహింపఁబడలేదు. ఇంక కృదంతములు నాలుగు తెఱగులుగా విభజింపఁబడినవి. (1) కృత్యప్రత్యయములు (2) పూర్వకృత్తులు (3) ఉణాదులు (4) ఉత్తరకృత్తులు - ఇందు కృత్యప్రత్యయములు ధాతువులకు భావకర్మార్థములందు వచ్చును. క్వాచిత్కముగా అన్యార్థములయందును రావచ్చును. పూర్వకృత్తులు సాధారణముగ ధాతువునకు కర్త్రర్థమున చేరును. ఉణాదులు పాణినీయమున చెప్పఁబడని ధాతునిష్పన్నములైన అనేకరూపములను ప్రతిపాదించినవి. ఈ లఘుకౌముదిలో నది సూచనామాత్రముగ చెప్పఁబడినది. ఇంక ఉత్తరకృత్తులు కేవలము భావార్థమునను, కర్తృభిన్నకారకార్థమునను ధాతువునకు పరముగ విధింపఁబడినవి. పుంస్త్వ స్త్రీత్వ, నపుంసకత్వ విశిష్టభావార్థములందు వచ్చెడు ప్రత్యయములు క్రమముగా ఈఉత్తరకృదంతప్రకరణమున వింగడించి చూపఁబడినవి. ఖలర్థప్రత్యయములు, క్త్వాణముల్ ప్రత్యయాంతములగు నవ్యయములు నిందు వివరింపఁబడినవి. ఆయాప్రత్యయముల చేరికచే ధాతువునకగు మార్పులు, ఆయాధాతువుల సంయోగమువలన ప్రత్యయములలో వచ్చు మార్పులు ఈ కృదంతప్రక్రియలో అత్యధికముగాఁగలవు. అవి కొంతవఱకు ఈ కృదంతప్రకరణమున నిరూపింపఁబడినవి. ప్రత్యయసంనియోగముచే ధాతువునకు, ధాతుసంయోగమువలన ప్రత్యయమునకు నగు ముమ్, ఇట్ మున్నగు నాగమములు తెలుపఁబడినవి. ఈ ప్రకరణమున (నాలుగువిధములైన కృత్తులను జెప్పు మొత్తము ప్రకరణమందు) అర్థమునకు సంబంధించిన యనేకవిషయములు గలవు. కావున శబ్దముయొక్క అర్థనిర్ణయమునకు ఈ ప్రకరణము బాగుగా సహకరించును.

# అథ విభక్త్యర్థ ప్రకరణమ్

అవ : వాక్యములోని పదములకన్నింటికి ఒకవిధమైన సంబంధ ముండును. సంబంధములేని కేవలపదముల సముదాయము వాక్యము కాఁజాలదు. సాధారణముగా వాక్యములోని పదములన్నియు క్రియతో నన్వయించును. ఒకటి రెండువిధములైన పదములు క్రియతో సాక్షాత్తుగా అన్వయింపక పోవుటయుఁ గలదు. ఇట్లన్వయించుటలో అన్నిపదములు క్రియతో నొకేవిధమైన సంబంధమును గలిగియుండవు. కొన్ని క్రియాపదమునకు కర్తలగును. కొన్ని కర్మవాచకములు కొన్ని క్రియాసిద్ధిలో నుపయుక్తములగు సాధనములను తెలుపును. మఱికొన్ని దానాది క్రియల యొక్క గ్రహీతలను తెలుపును. కొన్ని దేనివలన అపాయాదులు జరుగునో దానిని తెలుపును. కొన్ని ఆధారములను దెలియఁజేయును. ఇట్లు క్రియలతో నన్వయించుటలో అనేకభేదములు గలవు. విభక్తులు ఆయాభేదములను విభజించి చూపును. కావున నేయే విభక్తు లేయే అర్థములందు వర్తించునో యెఱుఁగుట చాల ముఖ్యము విభక్తుల యర్థములను నిరూపించు ప్రకరణము కావున దీనిని విభక్త్యర్థప్రకరణ మందురు. ఆయావిభక్తులాయాకారకములందు వచ్చును. కారకములనగా క్రియను చేయునవి=క్రియతో నన్వయము కలవియనియర్థము. కారకములేవో వాని స్వరూప మేదో తెలియక విభక్తిని, తదర్థమును నిర్ణయించుట కుదురదు. కావున నిందు కారకములు కూడ వివరింపఁబడును. కావున దీనిని కారక ప్రకరణమనియు నందురు.

క్రమముగా విభక్తులు, తదర్థములు నిందు వివరింపఁబడుచున్నవి.
క్తులు, ప్రాతిపదికమనుసంజ్ఞకలవానికి పరముగా చేరును. ప్రాతిపదికమనగా అర్థవంతము, ధాతుభిన్నము, ప్రత్యయభిన్నము, ప్రత్యయాంతభిన్నము నైనశబ్దస్వరూపము (అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్ (1-2-45) - ప్రత్యయాంతములైనను కృదంతములును, తద్ధితాంతములును సమాసములును ప్రాతిపదికసంజ్ఞకములగును (కృత్తద్ధితసమాసాశ్చ (1-2-46). విభక్తులు ఏడు - (1) ప్రథమా (2) ద్వితీయా (3) తృతీయా (4) చతుర్థీ (5) పంచమీ (6) షష్ఠీ (7) సప్తమీ విభక్తులు. సంబోధనము ప్రథమావిభక్తిలో భాగమే. వీని యర్థము లీప్రకరణమున వివరింపఁబడుచున్నవి.

(1) ప్రథమా విభక్తి.

సూ : ప్రాతిపదికార్థలింగపరిమాణవచనమాత్రే ప్రథమా 2-3-46.

వృ : నియతోపస్థితికః ప్రాతిపదికార్థః. మాత్రశబ్దస్య ప్రత్యేకంయోగః. ప్రాతిపదికార్థమాత్రే లింగమాత్రాద్యాధిక్యే పరిమాణమాత్రే సంఖ్యామాత్రే చ ప్రథమాస్యాత్. ప్రాతిపదికార్థమాత్రే – ఉచ్చైః, నీచైః, కృష్ణః, శ్రీః, జ్ఞానమ్; లింగమాత్రే – తటః, తటీ, తటమ్; పరిమాణమాత్రే – ద్రోణో వ్రీహిః; వచనం సంఖ్యా – ఏకః, ద్వౌ, బహవః.

ప. వి : ప్రాతిపదికార్థ.........మాత్రే (7-1) ప్రథమా (1-1).

అర్థ : నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. మాత్రశబ్ద మొక్కొక్కదానితో సంబంధించును. ప్రాతికార్థమాత్రమునను, లింగమున్నగువాని ఆధిక్యమునను, పరిమాణమాత్రమునను, సంఖ్యామాత్రమునను ప్రథమావిభక్తి యగును. ఉదా : ప్రాతిపదికార్థమాత్రమున ఉచ్చైః, నీచైః, కృష్ణః; శ్రీః, జ్ఞానమ్; లింగమాత్రమున – తటః, తటీ, తటమ్; పరిమాణమాత్రమున ద్రోణో వ్రీహిః; వచనమనగా సంఖ్య – ఏకః, ద్వౌ, బహవః.

వివ : ప్రథమావిభక్తి యేయేయర్థములందు వచ్చునో యీ సూత్రము తెలుపుచున్నది. ప్రాతిపదికార్థ, లింగ, పరిమాణ, వచన అను నాలుగింటికి ద్వంద్వము. దీనియంతమునఁ గల మాత్రశబ్దము ఈ నాల్గింటితో ప్రత్యేకముగా సంబంధించును. (ద్వంద్వాన్తే శ్రూయమాణం పదం ప్రత్యేకం సంబధ్యతే = ద్వంద్వసమాసముతుదిని వినఁబడుపదము ద్వంద్వమునందలి ఒక్కొక్కదానితో నన్వయించును అని న్యాయము) దీనినిబట్టి ప్రాతిపదికార్థమాత్రే, లింగమాత్రే, పరిమాణమాత్రే, వచనమాత్రే అనువిధముగా నర్థము చెప్పఁబడినది. మాత్రశబ్దమిట అవధారణార్థకము. అనగా 'అదికాక వేఱొకటికాదు' అనునర్థము గలది. 'ప్రాతిపదికార్థమాత్రే' అనగా 'ప్రాతిపదికార్థముకాక మఱియొకటికాని యపుడు' అని యర్థము. నియతోపస్థితికము ప్రాతిపదికార్థమని చెప్పఁబడినది. నియతమైన ఉపస్థితి కలది ప్రాతిపదికార్థము. ఏ శబ్దమును వినుటతోడనే యేయర్థము నియతముగా స్మరింపఁబడునో యాయర్థము ఆశబ్దముయొక్క ప్రాతిపదికార్థమని తాత్పర్యము. రామః అనుపదమును వినుటతోడనే దశరథుని పుత్త్రుఁడగు నొకవ్యక్తి మనస్సున స్మరింపఁబడును. కావున దశరథపుత్త్రుఁడు అనునది రామశబ్దముయొక్క ప్రాతిపదికార్థము. ఈ యర్థమును చెప్పుటకు ప్రథమాంతపద ముపయోగింపఁబడును. ఉదా : ఉచ్చైః – నీచైః, ఇవి రెండును అవ్యయములు. వానికిఁ గలనియతమైన ఎత్తు, పల్లము అనునర్థములను జెప్పుటకు ప్రథమాంతములుగా నిటగ్రహింపఁ బడినవి. కృష్ణః – వసుదేవుని కుమారుఁడు, శ్రీః = లక్ష్మి, జ్ఞానమ్ = తెలివి. ఇచట

ప్రథమావిభక్తిని వానికి నియతమైన అర్థమునుజెప్పుటకు ఉపయోగించితిమి. అనగా వాక్యములో ఇతరపదములతో నెట్టిసంబంధమును వ్యక్తము చేయక యిచట వాని ని యతార్థమును మాత్రమే చెప్పితిమని తాత్పర్యము. ఇట్లు కేవల ప్రాతిపదికార్థ మును జెప్పుటకు ద్వితీయాది విభక్త్యులుపయోగింపరాదని భావము. కావుననే నిఘంటువులలో పదములన్నియు ప్రథమా విభక్త్యంతములుగా చూపఁబడును.

అట్లే అయాశబ్దములకుఁ గల లింగమును వివక్షించునపుడును ప్రథమావిభక్తి వచ్చును. ఇందొక విశేషము గలదు. ప్రాతిపదికార్థము వివక్షింపక కేవలలింగము నకు పరిమాణమునకును ప్రతీతియుండదు. అవిప్రాతిపదికార్థ వివక్ష ఉన్న తరు వాతనే యుండును. కావున ప్రాతిపదికార్థముతోపాటు అధికముగా లింగము, పరి మాణము వివక్షించునపుడు శబ్దము ప్రథమాంతమగును. ఉదా : తటః, తటీ, తటమ్ – తటశబ్దము అనియతలింగము. కొన్నిశబ్దములు నియతలింగములు. అనగా అవి యేదో ఒకే లింగములో నుండును. కొన్నిశబ్దము లట్లుగాక యథాసంభవముగ రెండులింగములలోగాని, మూఁడులింగములలోఁ గాని యుండవచ్చును. ఇది (తట శబ్దము) అట్టిది. ఇచట ప్రథమావిభక్తి ః శబ్దముయొక్క ప్రాతిపదికార్థముతో పాటు వీనికిఁగల లింగమును గూడ తెలుపుచున్నది. తటః-పుంలింగము, తటీ – స్త్రీలింగము, తటమ్–నపుంసకలింగము.

పరిమాణమనగా కొలఁతలేక ప్రమాణము. దానినభివ్యక్తము చేయవలసి నప్పుడును ప్రథమావిభక్తి వచ్చును ప్రాతిపదికార్థముతోపాటు అధికముగా పరి మాణార్థము చెప్పవలసివచ్చినపుడును ప్రథమావిభక్తి వచ్చును. ఉదా : ద్రోణో వ్రీహిః – ద్రోణమనునది ఒకకొలపాత్ర వంటిది (సేరుమున్నగుదానివంటిది) – ఇది యొకానొక వస్తువుయొక్క ప్రమాణమును తెలుపును కావున 'ద్రోణః'అను ప్రథమాంతపదము ద్రోణప్రమాణముగల వ్రీహి (ధాన్యము)ని వ్యక్తము చేయు చున్నది. ఇచట ప్రాతిపదికార్థము మాత్రమేకాక అధికముగా పరిమాణము కూడ ప్రథమా విభక్తిచే తెలుపఁబడినది.

వచనమనగాసంఖ్య. కేవలసంఖ్యను తెలుపునపుడుకూడ ప్రథమావిభక్తి చేరును. ఏకః. ద్వౌ, బహవః – ఇచట, ఏక, ద్వి, బహు అను ప్రకృతులవల ననే తెలుపఁబడు సంఖ్య వానికి పదత్వమును కూర్చుటకై చేరిన ప్రథమావిభక్తి ప్రత్యయముచే అనువదింపఁబడుచున్నది. అనగా నిచట ఏక, ద్వి, అనువానిసంఖ్యా త్వము ఏక ఇత్యాది విభక్తిరహితరూపముల వలననే వ్యక్తమగుచున్నది. కాని

అప్పుడది పదము కాఁజాలదు. కేవల ప్రకృతిని గాని (ప్రాతిపదికమునుగాని), కేవల ప్రత్యయమును గాని ప్రయోగింపరాదు. కాపున నిపట వానికి పదత్వ మును కల్పించుటకై చేరిన ప్రథమావిభక్తి ప్రత్యయము వానికిగలసంఖ్యాత్వమును మరల చెప్పుచున్నది. ఏకః=ఒకఁడు, ఒకటి. ద్వౌ=రెండు, ఇద్దఱు. బహవః–చాల, చాలమంది.

సూ : సంబోధనే చ 2-3-47.

వృ : ప్రథమా. హేరామ.

ప వి : సంబోధనే (7-1) చ (అవ్య).

అను : ప్రథమా (1-1).

అర్థ : సంబోధనమునందును ప్రథమావిభక్తి అగును. ఉదా : హేరామ.

వివ : సంబోధనమనగా అభిముఖముగాలేనివానిని అభిముఖునిగా చేసికొని వానికి తెలియని వ్యాపారమును దెలియఁజెప్పి దానియందనుకూలతను గలుగఁ జేయుట. అట్టిదానిని వ్యక్తము చేయునపుడును ప్రాతిపదికమునకు ప్రథమావిభక్తి వచ్చును.

ఉదా : హేరామ – ఇచట సంబోధనచేయు వ్యక్తి సంబోధింపఁబడెడు రామనామక వ్యక్తిని తన కభిముఖునిగా చేసికొనుటకు 'రామ' అను దానిని ప్రథ మాంతముగ నుచ్చరించెనని తాత్పర్యము. ఇది సంబోధనమని స్పష్టము చేయు టకై 'హే' అనునది ముందు చేర్పఁబడెను. అది లేకయు సంబోధ్యవాచకము (పిలువఁబడు వ్యక్తిని తెలుపుపదము) ఉండవచ్చును. ఉదా : రామ. (రాముఁడా!)

(2) ద్వితీయా విభక్తి.

అవ : ద్వితీయావిభక్తి కర్మవాచకమునకు వచ్చునని ముందుఁ జెప్పఁబడు చున్నది కావున కర్మమనగా నేమియో వివరింపఁబడుచున్నది.

సూ : కర్తు రీప్సితతమం కర్మ 1-4-49.

వృ : కర్తుః క్రియయా ఆప్తు మిష్టతమం కారకం కర్మసంజ్ఞంస్యాత్.

ప. వి : కర్తుః (6-1) ఈప్సితతమమ్ (1-1) కర్మ 1-1.

అను : కారకే (7-1).

అర్థ : కర్తకు, క్రియచేత పొందుటకు మిక్కిలి యిష్టమైన కారకము 'కర్మము' అనుసంజ్ఞ కలది యగును.

వివ : 'ఈప్స' అనగా పొందవలెననుకోరిక (ఆప్తుమిచ్ఛా ఈప్సా) ఈప్సితము - కోరఁబడినది - ఈప్సితతమము - మిక్కిలిగా కోరఁబడినది కారకమనగా క్రియను పుట్టించునది - (కరోతి క్రియాం నిర్వర్తయతీతి కారకమ్) - కర్త, తాను చేయుక్రియచేత దేనిని పొందవలెనని మిక్కిలిగా కోరునో దానిని కర్మము అందురు. ఉదాహరణమునకు మోదకాన్ అత్తి-మోదకములను తినుచున్నాఁడు అనువాక్యము నందు అత్తి అనుక్రియద్వారమున కర్త మిక్కిలిగా పొందవలయునని అభిలషించిన పదార్థము మోదకములు - అవి కర్మసంజ్ఞకలవి యగును.

అవ : పై సూత్రముచే కర్మమను సంజ్ఞ నిర్వచింపఁబడిన తరువాత కర్మవాచకమున కేవిభక్తి వచ్చునో యీ క్రిందిసూత్రము తెలుపుచున్నది.

సూ : కర్మణి ద్వితీయా 2-3-2.

వృ : అనుక్తే కర్మణి ద్వితీయా స్యాత్. హరింభజతి. అభిహితేతు కర్మాదౌ ప్రథమా. హరిః సేవ్యతే. లక్ష్మ్యా సేవితః.

అను : అనభిహితే (7-1).

అర్థ : అనభిహితమైన కర్మమునందు వర్తమానమగు ప్రాతిపదికమునకు ద్వితీయవచ్చును ఉదా : హరింభజతి. కర్మాదికము అభిహితమైనపుడు ప్రథమయే వచ్చును. ఉదా : హరిఃసేవ్యతే, లక్ష్మ్యా సేవితః.

వివ : అభిహితము - ఉక్తము అనగా చెప్పఁబడినది. దేనిచే చెప్పఁబడినది అను ఆకాంక్ష కలుగగా 'తిఙ్మున్నగు వానిచే' అనునర్థము సిద్ధమగును. అనభిహితమనగా అనుక్తము - చెప్పఁబడనిది. కర్మవాచకము తిఙ్ మున్నగు వానిచేత చెప్పఁబడని సందర్భమున దానికి (కర్మవాచక ప్రాతిపదికమునకు) ద్వితీయా విభక్తి వచ్చును.

ఉదా : హరిం భజతి - ఇచట భజతి అనుక్రియలోని 'తిప్' ప్రత్యయము కర్త్రర్థమున విధింపఁబడినది. కావున నదిచేరిన పదము భజతి అనునది కర్తను బోధించును గాని కర్మను బోధింపదు. కావున నిచట కర్మవాచకమగు 'హరి'అనునది అనభిహితము. అట్టిదానికి ద్వితీయావిభక్తి వచ్చును. హరింభజతి - హరిని భజించుచున్నాఁడు.

అనభిహితే అనుటవలన కర్మవాచకము తిఙాదులచే అభిహితములైనపుడు ద్వితీయరాదు. అచట పై సూత్రముచే ప్రథమయే వచ్చును ఉదా : హరిఃసేవ్యతే-

ఇచట లిజ్ (క్రియావిభక్తి) ప్రత్యయము కర్మార్థమున విధింపఁబడినది. కావున నది కర్మమునే చెప్పుచున్నది. కాననిట కర్మము అభిహితము. దానికి ప్రాతిపదికార్థమున ప్రథమావిభక్తి వచ్చినది. హరిః సేవ్యతే - హరి సేవింపఁబడు చున్నాఁడు — ఇచట హరి – కర్మము, సేవించువాఁడు కర్త. అట్లే లక్ష్మ్యా సేవితః - ఇచట 'క్త' ప్రత్యయము కర్మార్థమున విధింపఁబడినది. అనగా నది చేరినపదము కర్మమును బోధించునని తాత్పర్యము. కావున ఇచట కర్మము కృత్ప్రత్యయముచే ఉక్తమైనది. అగుటచే కర్మవాచకమునకు ద్వితీయరాదు, ప్రథమ వచ్చినది. లక్ష్మ్యా సేవితః లక్ష్మిచే సేవింపఁబడినవాఁడు.

సూ : అకథితం చ 1-4-51,

వృ : అపాదానాది విశేషై రవివక్షితం కారకం కర్మసంజ్ఞం స్యాత్.

శ్లో॥ దుహ్యాచ్ పచ్ దణ్డ్ రుధిప్రచ్ఛి చిఞ్ బ్రూఞ్ శాసుజిమథ్ ముషామ్
కర్మయుక్స్యాదకథితం తథాస్యా న్నీహృ కృష్వహామ్.

గాం దోగ్ధి పయః బలిం యాచతే వసుధామ్. తణ్డులానోదనం పచతి. గర్గాన్ శతం దణ్డయతి. వ్రజమవరుణద్ధి గామ్. మాణవకం పన్థానం పృచ్ఛతి. వృక్షమవచినోతి ఫలాని. మాణవకం ధర్మం బ్రూతే శాస్తి వా. శతం జయతి దేవదత్తమ్. సుధాం క్షీరనిధిం మథ్నాతి. దేవదత్తం శతం ముష్ణాతి గ్రామ మజాం నయతి హరతి కర్షతి వహతి వా. అర్థనిబన్ధనేయం సంజ్ఞా. బలిం భిక్షతే వసుధామ్. మాణవకం ధర్మం భాషతే, అభిధత్తే, వక్తీత్యాది.

ప. వి : అకథితమ్ (1-1) చ (అవ్య).

అను : కారకే (7-1) కర్మ (1-1).

అర్థ : అపాదానాది విశేషములచేత వివక్షితము కాని కారకము కూడ కర్మ మనఁబడును. దుహ్, యాచ్, పచ్, దణ్డ్, రుధ్, ప్రచ్ఛ్, చి, బ్రూ, శాస్, జి, మథ్, ముష్ అనువానియొక్కయు, నీ, హృ, కృష్, వహ్ అను ధాతువుల యొక్కయు ప్రధానకర్మముతో సంబద్ధమైన దానినే యిట అకథితశబ్దముచే గ్రహింపవలయును. ఉదా : గాందోగ్ధి పయః – గోవును పాలను పిదుకుచున్నాఁడు, మొ॥వి. ఇట్టి కర్మసంజ్ఞను నిర్ణయించుటలో ఈ ధాతువులకే కాక వీనితో సమానార్థముగల వానికి కూడ గ్రహణముండును. ఉదా : బలిం భిక్షతే వసుధామ్ మొ॥వి.

వివ : పూర్వము 'కర్తురీప్సితతమం కర్మ' అనుసూత్రముచే కర్మసంజ్ఞ విధింపఁబడినది. అది మాత్రమేకాక వేఱువిధమైన కర్మమును గలదు. అది

యీ సూత్రముచే చెప్పఁబడుచున్నది. కథితమనగా చెప్పఁబడినది. చెప్పఁబడనిది అకథితము. చెప్పఁబడనిదేది? అను ఆకాంక్షవలన నీ సందర్భమున చెప్పఁబడినవి కాక తక్కినది అని యర్థమగును. ఈకారక ప్రకరణమున కర్మము, కరణము, కర్త, సంప్రదానము, అపాదానము, అధికరణము అను ఆఱు సంజ్ఞలు ఆయా నిర్వచనములతో చెప్పఁబడినవి. వీనిలోనికి రానిది ఇట అకథితము. దానికి కూడ కర్మసంజ్ఞను ఈ సూత్రము విధించుచున్నది. ఉదా : గాందోగ్ధిపయః - ఇచట దోగ్ధి - పిదుకుచున్నాఁడు అను క్రియచే కర్తకు ఈప్సితతమమైనది పయస్సు-పాలు. అది కర్మము. ఈవాక్యమునందలి 'గామ్' అనుపదము కర్త కీప్సితతమమైనదికాదు. కావున నా సూత్రముచే దీనికి కర్మసంజ్ఞ సిద్ధింపదు. కాక కరణము, కర్త, సంప్రదానము, అపాదానము, అధికరణము అనుసంజ్ఞలలో నేదియు దీనికి కలుగదు. కావున నిది అకథితమైనది. అగుటచే నీ సూత్రముచే దానికి కర్మసంజ్ఞ కలుగును కర్మవాచకమునకు ద్వితీయావిభక్తి వచ్చును గావున దీనికి ద్వితీయావిభక్తి వచ్చినది.

కాని దీనికి ఇంతస్థూలముగా నర్థము చెప్పుకొనుటలో ఒకచిక్కుగలదు. 'నటస్యగాథాం శృణోతి' - నటుని గాథను వినుచున్నాఁడు-అనువాక్యమున 'నటస్య' అనుపదముకూడ కరణాదులచే అకథితమే యగును. కావున నదికూడ కర్మవాచకము కావలసి వచ్చును. అది యిష్టముకాదు. కావున కొన్ని కొన్ని ధాతువులయొక్క ప్రధాన కర్మముతో సంబంధము గలిగి, కరణాది విశేషసంజ్ఞ చెప్పఁబడనిదానికే యీ కర్మసంజ్ఞ కలుగునని శ్లోకములో నాధాతువుల నిర్దేశము చేయుటవలన చెప్పఁబడినది. ఆ ధాతువు లియ్యవి - దుహ్ = పిదుకు, యాచ్ - అడుగుకొను, పచ్ = వండు, దణ్డ్ = దండించు, రుధ్ = నిరోధించు, ప్రచ్ఛ్ = ప్రశ్నించు, చి = కూడఁబెట్టు బ్రూ = చెప్పు, శాస్ = శాసించు, జి = జయించు, మథ్ = చిలుకు, ముష్ = దొంగిలించు అను పండ్రెండుధాతువులయొక్కయు; నీ-నడపు, హృ = హరించు, కృష్ = లాగు; వహ్ = మోయు, వహించు అను నీ నాలుగుధాతువులయొక్కయు ప్రధాన కర్మముతో సంబంధము గలదియై కరణాదివిశేషసంజ్ఞలు పొందుటకు వీలు లేనిది ఇచట అకథితమైనదిగా పరిగణింపఁబడి కర్మవాచకమై ద్వితీయా విభక్తిని పొందునని శ్లోకముయొక్క తాత్పర్యము. అనగా నీధాతువులు ద్వికర్మకములని తాత్పర్యము. అందు కర్తకు క్రియచే ఈప్సితతమమైనది ముఖ్యకర్మము లేక ప్రధానకర్మమనియు, దానికి సంబంధించిన రెండవకర్మము అముఖ్యకర్మమనియు (Indirect Object) నందురు. వీనికి క్రమముగా నుదాహరణములు చూపఁబడుచున్నవి.

(1) గాందోగ్ధిపయః - ఆవునుండి పాలుపిదుకుచున్నాఁడు. ఇందు ముఖ్య కర్మము పాలు, అముఖ్యకర్మము గోవు.

(2) బలిం యాచతే వసుధామ్=బలిని భూమిని యాచించుచున్నాఁడు. ఇచట భూమి ముఖ్యకర్మము, 'బలి' అముఖ్యకర్మము.

(3) తణ్డులానోదనం పచతి - బియ్యముతో నన్నమును వండుచున్నాఁడు. ఇందు ఓదనము ముఖ్యకర్మము - తండులము లముఖ్యకర్మములు.

(4) గర్గాన్ శతం దణ్డయతి - గర్గులను నూరురూప్యములను (గొనుట మూలమున) దండించుచున్నాఁడు - ఇందు శతము ముఖ్యకర్మము, గర్గులు - అ ముఖ్యకర్మము

(5) వ్రజమవరుణద్ధిగామ్-వ్రజమునందు గోవు నడ్డగించుచున్నాఁడు. ఇందు గోవు ముఖ్యకర్మము, వ్రజము అముఖ్యకర్మము.

(6) మాణవకం పన్థానం పృచ్ఛతి-బ్రహ్మచారిని దారి నడుగుచున్నాఁడు ఇందు 'దారి' ముఖ్యకర్మము, మాణవకుఁడు అముఖ్యకర్మము.

(7) వృక్షమవచినోతి ఫలాని - చెట్టునుండి పండ్లను కోయుచున్నాఁడు. ఇందు ఫలములు ముఖ్యకర్మము, వృక్ష మముఖ్యకర్మము.

(8), (9) మాణవకం ధర్మం బ్రూతే శాస్తివా - వటువునకు ధర్మమును జెప్పుచున్నాఁడు లేక శాసించుచున్నాఁడు - ఇందు ధర్మము ముఖ్యకర్మము, మాణవ కుఁడు అముఖ్యకర్మము.

(10) శతం జయతి దేవదత్తమ్ - దేవదత్తునివలన నూరురూప్యములు జయించుచున్నాఁడు-ఇందు శతము ముఖ్యకర్మము, దేవదత్తు డముఖ్యకర్మము.

(11) సుధాం క్షీరనిధిం మథ్నాతి - క్షీరనిధినుండి సుధను మథించు చున్నాడు. ఇందుసుధ ముఖ్యకర్మము. క్షీరనిధి అముఖ్యకర్మము.

(12) దేవదత్తం శతం ముష్ణాతి - దేవదత్తునినుండి నూరురూప్యములను దొంగిలించుచున్నాఁడు - ఇందు శతము ముఖ్యకర్మము. దేవదత్తుఁడముఖ్య కర్మము.

13 నుండి 16 - గ్రామమజాం నయతి హరతి కర్షతి వహతి వా-గ్రామము నందు మేకను తీసికొనిపోవుచున్నాఁడు, హరించుచున్నాఁడు, లాగుచున్నాఁడు, మోయుచున్నాఁడు (చేర్చుచున్నాఁడని తాత్పర్యము-ఇందు 'అజము' ముఖ్యకర్మము, గ్రామము అముఖ్యకర్మము.

పైని పేర్కొనిన అముఖ్యకర్మములన్నియు నీ సూత్రముచే కర్మసంజ్ఞ పొందినవై ద్వితీయాంతములయినవి. ఇందు అపాదానాదులు వివక్షితములైనచో పంచమీ విభక్త్యాదులు వచ్చును. ఉదా : గోః దోగ్ధిపయః-గోవునుండిపాలను పిదుకుచున్నాఁడు మొ॥వి.

ఈ కారికయందు పేర్కొనిన ధాతువులు మాత్రమే కాక ఆ యర్థముగల యితరధాతువులయొక్క అముఖ్యకర్మములకును ఈ విధి వర్తించునని 'అర్థనిబన్ధ నేయం సంజ్ఞా' అను వాక్యము తెలుపుచున్నది. ఈ సంజ్ఞ అర్థము కారణముగాఁ గలది అని యర్థము కావున 'యాచ్' ధాతువుయొక్క అర్థమే కల భిక్షధాతువు యొక్క కర్మముతో సంబంధముగలదియు కర్మమే యగును. బలింభిక్షతే వసుధామ్-బలిని భూమి నడుగుకొనుచున్నాఁడు; ఇట్లే 'బ్రూతే' అనుదాని అర్థముగలభాషతే, అభిధత్తే, వక్తిమున్నగు క్రియల ముఖ్యకర్మముతో సంబంధముగలదియు కర్మమే యగును. మాణవకం ధర్మం భాషతే, అభిధత్తే వక్తి, మాణవకునికి ధర్మము చెప్పుచున్నాఁడు మొ॥వి ఇందు మాణవకుఁడు అముఖ్యకర్మము.

(3) తృతీయావిభక్తి.

అవ : 'కర్తృకరణయోస్తృతీయా' అను వక్ష్యమాణసూత్రములోఁగల కర్త, కరణము అను సంజ్ఞలు క్రింది రెండుసూత్రములచే నిర్వచింపఁబడు చున్నవి.

సూ : స్వతంత్రః కర్తా 1-4-54.

వృ : క్రియాయాం స్వాతంత్ర్యేణ వివక్షితోఽర్థః కర్తా స్యాత్.

ప. వి : స్వతంత్రః (1-1) కర్తా (1-1).

అను : కారకే.

అర్థ : క్రియయందు స్వాతంత్ర్యముతో వివక్షింపఁబడు నర్థము కర్త అనఁబడును.

వివ : క్రియను నెరవేర్చుటలో ప్రధానభూతమైనది కర్తయనఁబడును. ప్రధానభూతమనగా మఱియొకదానిపై ఆధారపడక ప్రవర్తించునది అనియర్థము. 'సూదః అన్నంపచతి' (వంటవాఁడు అన్నమును వండుచున్నాఁడు) అనుచోట పచనముచేయుట అను క్రియను నిర్వహించుటలో, అనగా ప్రొయ్యిలో మంట నేర్పరచుట, గిన్నె దానిపైని పెట్టుట, బియ్యమును పోయుట మున్నగుపనిని చేయుటలో సూదకునకు స్వాతంత్ర్యము గలదు. (స్వాతంత్ర్యమనగా ప్రాధాన్యము)

గిన్నె, బియ్యము, పొయ్యిమున్నగువాని కట్టి స్వాతంత్ర్యము లేదు. కావున సూదకుడిట స్వతంత్రుఁడు కావున కర్త. కొందొకయెడ స్వాతంత్ర్యము లేకపోయినను ఉన్నట్లు భావించుట జరుగును. కావున స్వాతంత్ర్యముచేత వివక్షితమైన అర్థము అని చెప్పఁబడినది. ఉదా : స్థాలీ పచతి-గిన్నెవండుచున్నది. ఇచట వస్తుతః గిన్నెకు వండుటలో స్వాతంత్ర్యము లేదు గాని అది యిచట వివక్షింపఁబడినది (వివక్షయనగా వక్తకుఁగల చెప్పవలయునను కోరిక.)

అవ : కరణమన నేమో వివరింపఁబడుచున్నది.

సూ : సాధకతమం కరణమ్ 1-4-42.

వృ : క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కరణసంజ్ఞం స్యాత్.

ప. వి : సాధకతమమ్ (1-1) కరణమ్ (1-1).

అను : కారకే.

అర్థ : క్రియాసిద్ధియందు ప్రకృష్టోపకారకము కరణము.

వివ : అధికారరూపమున వచ్చిన 'కారకే' అనుపదమును బట్టి 'క్రియాసిద్ధియందు' అనునర్థము సిద్ధించును, క్రియాసిద్ధి యనగా ఒకపని అగుట. సాధకమనగా సాధించుటకు ఉపయోగింపఁబడు వస్తువు. సాధకతమమనగా మిక్కిలిగా సాధించునది. అనగా దేనితో ఫలముయొక్క ప్రాప్తియగునో అది సాధకతమము. అట్టిదానికి కరణమని పేరు. ఖడ్గముచేత ఖండించుచున్నాఁడు అనునపుడు ఖండించుట అనుపని నెరవేరవలయునన్న సాధనములు అనేకములుండవలయును. (చేయి, శక్తి, ఖడ్గము మొ॥వి) అందు ముఖ్యసాధనము ఖడ్గము. అది కరణము,

అవ : అనభిహితములగు కర్తృకరణములకు తృతీయా విభక్తి విధింపఁబడుచున్నది.

సూ : కర్తృకరణయో స్తృతీయా 2-3-18.

వృ : అనభిహితే కర్తరి కరణే చ తృతీయాస్యాత్. రామేణ బాణేన హతో వాలీ.

ప. వి : కర్తృకరణయోః (7-2) తృతీయా (1-1).

అను : అనభిహితే (7-1).

అర్థ : అనభిహితములైన కర్తృకరణములకు తృతీయ వచ్చును. ఉదా : రామేణ బాణేన హతో వాలీ - రామునిచే బాణముతో వాలి హతుఁడయ్యెను.

వివ : క్రియాసిద్ధియందు స్వాతంత్ర్యము గలది కర్తయనియు, ప్రకర్షముగా నుపకరించు సాధనము కరణమనియు తెలుపఁబడినది. అవి రెండును తిజాదులచే తెలుపఁబడనియపుడు వానిని తెలుపు పదములు తృతీయాంతములగునని సూత్ర తాత్పర్యము. ఉదా : రామేణ బాణేన హతో వాలీ. ఇచట 'హతః' అనుకృదంతము కర్మవాచకమగు 'వాలి'ని చెప్పుచున్నది. కర్తయగు రాముఁడు గాని, కరణమగు బాణము గాని అభిహితము లగుటలేదు. చంపుట అను వ్యాపారములో స్వాతంత్ర్యము గలవాఁడగుటచే రాముఁడు కర్త. చంపుటకు మిక్కిలిగా ఉపకరించినసాధనమగుటచే బాణము కరణము. ఇవి రెండు నిట ధాతువునకు చేరిన ప్రత్యయముచే అనభిహితములగుటచే అవితృతీయను పొందినవి-రామేణ-తృతీయాంతము - కర్త, బాణేన-తృతీయాంతము-కరణము.

అనభిహితే అనుటవలన కర్తృకరణములు అభిహితము లైనచో ప్రథమా విభక్తియే వచ్చును. ఉదా : రామో వాలినంహతవాన్ రాముఁడు వాలిని చంపినవాఁడు. ఇచటి క్తవతు ప్రత్యయము కర్తను జెప్పును. కావున కర్త యిట అభిహితము - ఉక్తము - చెప్పఁబడినది.

(4) చతుర్థీవిభక్తి.

అవ : సంప్రదానార్థమున చతుర్థి యగునని చెప్పఁబడుచున్నది. కాన సంప్రదానమన నేమో వివరింపఁబడుచున్నది.

సూ : కర్మణా యమభిప్రైతి స సంప్రదానమ్ 1-4-32.

వృ : దానస్య కర్మణా యమభి ప్రైతి స సంప్రదానసంజ్ఞః స్యాత్.

అను : కారకే (7-1).

అర్థ : దానముయొక్క కర్మముచేత నెవనిని అభిప్రీతుని గావించునో నుతఁడు సంప్రదానమనఁబడును.

వివ : సంప్రదీయతే అస్మైఇతి సంప్రదానమ్-ఈతనికి (ఒకవస్తువు) ఈఁబడును. అనునర్థమున నిది యన్వర్థమగు సంజ్ఞ. కర్మణా అనుటలో దేని ర్మము అను ఆకాంక్షచే దానముయొక్క కర్మముచేత అనునర్థము సిద్ధించును. ఇచ్చుట అను వ్యాపారములో ఫలమైన కర్మసంజ్ఞ కలదానిచే కర్త ఎవనిని అభిముఖముగా వచ్చునట్లు చేసికొనునో యాతఁడు లేక అది సంప్రదానమనఁబడును. అనగా త్యాగమునకు ఉద్దేశ్యమైన వ్యక్తి యని తాత్పర్యము. ఇచ్చుట అను వ్యాపారములో ఇచ్చువాఁడు కర్త, ఈఁబడువస్తువు కర్మము, పుచ్చుకొనువాఁడు సంప్రదానసంజ్ఞుఁడు అని ఫలితార్థము.

అవ : సంప్రదానవాచకమునకు చతుర్థి విధింపఁబడుచున్నది.

సూ : చతుర్థీ సంప్రదానే 2-3-13.

వృ : విప్రాయ గాం దదాతి.

ప. వి : చతుర్థీ (1-1) సంప్రదానే (7-1).

అను : అనభిహితే.

అర్థ : అనభిహితమైన సంప్రదానమున చతుర్థి యగును. ఉదా : విప్రాయ గాం దదాతి.

వివ : సంప్రదానసంజ్ఞగల వ్యక్తిని తెలుపుపదము క్రియావిభక్త్యాదులచే చెప్పఁబడనియెడల, అది చతుర్థ్యంతమగును. సంప్రదాన మనగా త్యాగోద్దేశ్యమని పై సూత్రమున వివరింపఁబడినది. ఉదా : విప్రాయ గాం దదాతి, విప్రునికొఱకు గోవునిచ్చుచున్నాఁడు - ఇచట 'దదాతి' అను క్రియ ఇచ్చెడు వ్యక్తిని చెప్పు చున్నది. ఇందు త్యాగము చేయఁబడుగోవు కర్మము. దానిచే అభిప్రేతుఁడగు వ్యక్తి విప్రుఁడు, త్యాగమునకు లక్ష్యమతఁడు. కావున సంప్రదానసంజ్ఞకలుగుటచే విప్రశబ్దమునకు చతుర్థి వచ్చినది (విప్రాయ.)

అవ : చతుర్థి మఱికొన్ని సందర్భములందును వచ్చుట నీక్రిందిసూత్రము చెప్పుచున్నది.

సూ : నమః స్వస్తి స్వాహాస్వధాలం వషడ్యోగాచ్చ 2-3-16.

వృ : ఏభిర్యోగే చతుర్థీ. హరయే నమః. ప్రజాభ్యః స్వస్తి. అగ్నయేస్వాహా. పితృభ్యఃస్వధా. అలమితి పర్యాప్త్యర్థగ్రహణమ్. దైత్యేభ్యోహరిరలమ్,ప్రభుః, సమర్థః, శక్తః ఇత్యాది.

ప. వి : నమః స్వస్తి .. యోగాత్ (5-1) చ (అవ్య).

అర్థ : నమః స్వస్తి, స్వాహా, స్వధా, అలమ్, వషట్ అనుపదములతో యోగమున్న శబ్దమునకు చతుర్థీ విభక్తిచేరును. ఉదా : హరయే నమః మొ॥వి. ఇచట 'అలమ్' అనునది పర్యాప్త్యర్థకము. దానిచే దైత్యేభ్యో హరిరలమ్-ప్రభుః, సమర్థః, శక్తః ఇత్యాద్యర్థ మిట గ్రాహ్యము.

వివ : నమః మున్నగుపదములతో యోగము - సంబంధముగల శబ్దములకు చతుర్థీవిభక్తి వచ్చునని సూత్రార్థము. 'నమః' అనుటతోడనే 'ఎవరికి?' అను నాకాంక్ష పుట్టును. ఎవరో వ్యక్తి చెప్పఁబడును. ఆ వ్యక్తిని తెలుపుశబ్దమునకు

చతుర్థీ విభక్తి చేరును. ఇచట సంప్రదానార్థము లేకుండుటచే పూర్వసూత్రముచే చతుర్థి సిద్ధింపకపోవుటవలన మరల విధింపఁబడినది.

ఉదా : హరయే నమః - ఇచట 'నమః' అనుశబ్దముతో యోగముగల హరి శబ్దమునకు చతుర్థి వచ్చినది.(హరయే చతుర్థ్యంతము) ప్రజాభ్యః స్వస్తి - స్వస్తి అనుశబ్దముతో యోగముగల 'ప్రజా' శబ్దమునకు చతుర్థి - అగ్నయేస్వాహా - స్వాహాశబ్దముతో యోగముగల అగ్నిశబ్దమునకు చతుర్థి. పితృభ్యః స్వధా - స్వధా శబ్దముతో యోగముగల పితృశబ్దమునకు చతుర్థి. 'అలమ్' అనునవ్యయము అనేక ములగు నర్థములలో నుండును. ఇచట పర్యాప్తి అనునర్థము గ్రహింపఁబడినది. పర్యాప్తి అనగా చాలినతనము. కావున 'అలమ్' అనుశబ్దముతోపాటు ఆ అర్థము గల ఇతరశబ్దములతో యోగమున్నపుడును చతుర్థి వచ్చును. ఉదా : దేవేభ్యో హరిరలమ్ = దేవతలకొఱకు హరిచాలినవాఁడు-ఇట్లే దేవేభ్యో హరిఃప్రభుః, దేవే భ్యో హరిః సమర్థః, దేవేభ్యో హరిఃశక్తః మున్నగుస్థలములందును చతుర్థి వచ్చినది.

ఇది ఉపపద విభక్తి-అనగా క్రియాసిద్ధికొఱ కేర్పడినది కాక సన్నిహితముగా నున్న పదమునుబట్టి యేర్పడిన విభక్తి. 'ఉపపదవిభక్తేః కారక విభక్తిర్బలీయసీ'- ఉపపద విభక్తికంటె కారక విభక్తి బలీయసి అనున్యాయము ననుసరించి క్రియా న్వయమున్నపుడు నమః మున్నగు పదములతో యోగమున్నను చతుర్థికాక యోగ్య తనుబట్టి యితరవిభక్తి వచ్చుట సంభవించును. ఉదా : రామం నమస్కరోతి - ఇచట 'రామమ్' అనునది 'కరోతి' అను క్రియాపదము ననుసరించి కర్మవాచకము కాన ద్వితీయాంతమైనది.

(5) పంచమీవిభక్తి.

అవ : పంచమీ విభక్తి చెప్పఁబడుచున్నది. దానికి సంబంధించిన అపాదాన సంజ్ఞ వివరింపఁబడుచున్నది.

సూ : ధ్రువమపాయేఽపాదానమ్ 1-4-24.

వృ : అపాయో విశ్లేష స్తస్మిన్ సాధ్యే యద్ ధ్రువమవధిభూతం కారకం తదపాదానం స్యాత్.

ప. వి : ధ్రువమ్ (1-1) అపాయే (7-1) అపాదానమ్ (1-1).

అను : కారకే (7-1).

అర్థ : అపాయమనగా విశ్లేషము. అదియగునపుడు ధ్రువము, అనగా అవధి భూతమైన కారకము అపాదానమనఁబడును.

వివ ; అపాయమనగా ఒకటి ఒకదానినుండి తొలఁగిపోవుట కలసియున్నస్థితి నశించి వేరుగానగుస్థితికి వచ్చుటఅని తాత్పర్యము. అట్టిది కలుగునపుడు ఏది ధ్రువమో అనగా అవధిభూతమో అనగా దేనినుండి వస్తువు దూరమగుచున్నదో దానికి అపాదాన మనిపేరు ఈయవధిభూతమైన వస్తువు స్థిరము కావచ్చును. చలము కావచ్చును చెట్టు నుండి ఆకు పడుచున్నది. అనుచోట చెట్టునకును ఆకునకును కల సంశ్లేషస్థితి (కూడియుండుస్థితి) పోయి విశ్లేషము కలిగినది. అందు ధ్రువముగా నుండునది చెట్టు. కావున దానిని చెప్పుపదము అపాదానసంజ్ఞ కలది యగును.

అవ : అపాదానమునకు పంచమీవిభక్తి నీ క్రింది సూత్రము విధించు చున్నది.

సూ ; అపాదానే పఞ్చమీ 2-3-28.

వృ : గ్రామాదాయాతి. ధావతోఽశ్వాత్పతతి.

ప. వి : అపాదానే (7-1) పఞ్చమీ (1-1).

అను : అనభిహితే (7-1).

అర్థ : అపాదాన వాచకము అనభిహితమైనపుడు పంచమీవిభక్తి అగును. ఉదా : గ్రామాదాయాతి, ధావతోఽశ్వాత్పతతి.

వివ : విశ్లేషము జరిగినపుడు (రెండువస్తువులకు లేకవ్యక్తులకులేక వస్తువు నకు వ్యక్తికి వేరుపాటు అను వ్యాపారము కలిగినపుడు) ధ్రువముగా నుండునది అపాదానమని చెప్పఁబడినది. తిఙాదులచే చెప్పఁబడని అపాదానవాచకమునకు పంచమీ విభక్తి వచ్చును.

ఉదా : గ్రామాత్ ఆయాతి-గ్రామమునుండి వచ్చుచున్నాఁడు-ఇచట వచ్చు వ్యక్తికి గ్రామముతో విశ్లేషము కలిగినది. అందు ధ్రువముగా నున్నది గ్రామము. అది అపాదానసంజ్ఞకలది యగును. కావున పంచమీవిభక్తి వచ్చినది (గ్రామాత్).

ధ్రువము అనగా అవధిభూతము-విశ్లేషము దేనివలన నయినదో అది అనియే యర్థము కాని కదలకుండునది అనియర్థముకాదు. దీనిని స్పష్టముచేయుటకై మఱి యొక ఉదాహరణము చూపఁబడుచున్నది.

ధావతోఽశ్వాత్పతతి - పరుగెత్తుచున్న గుఱ్ఱమునుండి పడుచున్నాఁడు. ఇచట పతనక్రియ దేనినుండి జరిగినదో యది ధ్రువము. అది అశ్వము. ఆ

యశ్వము కదలికలేనిది కాదు పరుగిడుచున్నది. కావున ధ్రువమనగా విశ్లేషములో నొక అవధి-(మేర) అనియే కాని కదలికలేనిది అని అర్థము కాదు. ఇచట అశ్వము అపాదానము. కావున పంచమి వచ్చినది. సంస్కృతమున విశేషణవిశేష్యములకు లింగ విభక్తి వచనములు సమానముగా నుండవలయునను నియమముచే 'అశ్వాత్' అనుదానికి విశేషణమగు 'ధావతః' అనునదియు పంచమ్యన్తమే అయినది (యల్లిఙ్గం యద్వచనం యాచ విభక్తిర్విశేష్యస్య, తల్లిఙ్గం తద్వచనం సాచ విభక్తిర్విశేషణస్యాపి).

6. షష్ఠీ విభక్తి.

అవ : షష్ఠీ విభక్తి చెప్పఁబడుచున్నది.

సూ : షష్ఠీ శేషే 2-3-50.

వృ : కారక ప్రాతిపదికార్థవ్యతిరిక్తః స్వస్వామిభావాదిః సంబంధః శేష స్తత్ర షష్ఠీ. రాజ్ఞః పురుషః. కర్మాదీనామపి సంబంధమాత్ర వివక్షాయాం షష్ఠ్యేవ. సతాం గతమ్. సర్పిషో జానీతే, మాతుఃస్మరతి, ఏధోదకస్యోపస్కురుతే. భజే శంభోశ్చరణయోః.

ప. వి : షష్ఠీ (1-1) శేషే (7-1).

అర్థ : కారకము, ప్రాతిపదికార్థము అనువానికంటె వేరైనదియు, స్వస్వామి భావము మున్నగునదియు నగు సంబంధము శేషము. దానియందు షష్ఠియగును. ఉదా : రాజ్ఞః పురుషః — కర్మాదులకును సంబంధమాత్ర వివక్షయందు షష్ఠియే యగును. ఉదా : సతాం గతమ్. సర్పిషో జానీతే మొ॥వి.

వివ : శేషమనగా మిగిలినది అని యర్థము. ప్రథమా, ద్వితీయా, చతుర్థీ, పంచమీ, సప్తమీ విభక్తులు క్రమముగా ప్రాతిపదికార్థాదులయందును, కర్మమునను, కర్తృకరణములందును, సంప్రదానమునను, అపాదానమునను, అధికరణమునను విధింపఁబడినవి. కావున కర్మాదికారకములందును, ప్రాతిపదికార్థమునందును చేరనియర్థ మిటశేషపదముచే చెప్పఁబడును. ఆ మిగిలినయర్థము సంబంధము - అది స్వస్వామి సంబంధము, (వస్తువునకు దానిని కలిగియున్న వ్యక్తికిఁగలసంబంధము - స్వమ్=ధనము, స్వామి - అధికలవాఁడు) అవయవావయవి సంబంధము (అవయవములకు, అవయవములు కలదానికి కలసంబంధము) జన్యజనక సంబంధము (పుట్టినవానికి పుట్టించినవానికిఁగల సంబంధము) మున్నగు పేరులతో అనేక విధములుగాఁ గలదు. ఆ సంబంధార్థమును తెలుపుటయందు షష్ఠీ విభక్తి ప్రయోగింపఁబడు నని సూత్రార్థము. ఇది కారకముకాదు. అనగా నీ షష్ఠ్యంతపదము సూటిగా క్రియతో నన్వయింపదు.

ఉదా : రాజ్ఞః పురుషః - రాజుయొక్క పురుషుఁడు - ఇచట రాజు స్వామి లేక సేవింపఁబడువాఁడు (సేవ్యుఁడు) పురుషుఁడు ఆతనికి సంబంధించిన వ్యక్తి. సేవకుఁడు - ఇచట సేవ్యసేవకభావరూపసంబంధము గలదు. స్వస్వామి సంబంధమనియుఁజెప్పనగును. ఈ సంబంధమును దెలియఁజేయుటకై ఇచట రాజ శబ్దమునకు షష్ఠీ విభక్తి వచ్చినది - (రాజ్ఞః) రాజసంబంధముగల పురుషుఁడని యర్థము.

'వివక్షాతః కారకాణి భవన్తి' అనియొక న్యాయముకలదు. వక్తయొక్క యిచ్ఛననుసరించి కారకములగును అనిదానియర్థము. కావున కర్మాదులకు కూడ సంబంధార్థమునే వక్త చెప్పఁగోరినయెడల కర్మాదులకు ద్వితీయాది విభక్తులు కాక షష్ఠియే వచ్చును. కర్మాది వివక్ష యున్నచో ద్వితీయాది విభక్తులు వచ్చును.

ఉదా : సతాంగతమ్ - గతమనగా గమనము అని యిచట భావార్థమున 'గమ్' ధాతువునకు క్త ప్రత్యయము వచ్చినది. సత్పురుషులయొక్క గమనము- ఇచట గమనక్రియలో కర్తలు (స్వాతంత్ర్యము కలవారు) సత్పురుషులు. తద్వాచక శబ్దమైన 'సత్' అనుదానికి 'కర్తృకరణయోస్తృతీయా' అనుసూత్రముచే తృతీయ రావలసియున్నది. కాని యిచట సంబంధము వివక్షితమైనది. కావున షష్ఠి వచ్చినది-(సతాం-షష్ఠీబహువచనము).

సర్పిషో జానీతే=నేతితో ప్రవర్తించుచున్నాఁడు - ఇచట నెయ్యి అను నర్థముగల 'సర్పిస్' శబ్దము సాధనమును దెలుపును. కావున కరణము. కరణార్థమున తృతీయ రావలసియుండగా నేతికి ప్రవర్తనమునకు కల సంబంధము వివక్షింపఁబడుటచే షష్ఠి వచ్చినది (సర్పిషః షష్ఠీ ఏకవచనము). కరణార్థమే వివక్షింపఁబడిన యెడల సర్పిషాజానీతే అని తృతీయవచ్చును.

మాతుః స్మరతి - తల్లిని స్మరించుచున్నాఁడు. ఇచట స్మరణక్రియలో మాత కర్మము - కాని మాతకును స్మరణక్రియకునుగల సంబంధమునే వక్త వివక్షించుటచే (చెప్పఁగోరుటచే) మాతృశబ్దమునకు షష్ఠి వచ్చినది (మాతుః - షష్ఠ్యేకవచనము) సంబంధవివక్ష లేనియెడల 'మాతరం స్మరతి' అని ద్వితీయ వచ్చును.

ఏధోదకస్యోపస్కురుతే=ఏధోదకములను సంస్కరించుచున్నాఁడు - ఇచట ఏధోదకములు కర్మవాచకములు. కర్మత్వమును వివక్షింపక వానికి ఉపస్కరణముతోగల సంబంధమును వివక్షించుటచే నిచట షష్ఠి వచ్చినది (ఏధోదకస్య=షష్ఠీ ఏకవచనము) ఇచట ఏధశబ్దము అకారాంత పుంలింగము.

భజే శమ్భోశ్చరణయోః – శంభునిచరణములను సేవించుచున్నాను. ఇచట భజనక్రియలో కర్మములైన చరణములకు కర్మత్వవివక్షచేయక చరణములకు భజనమునకు గల సంబంధమును వివక్షించుటచే చరణశబ్దమునకు షష్ఠీవిభక్తి వచ్చినది. (చరణయోః–షష్ఠీద్వివచనము). కర్మత్వమే వివక్షించినచో 'భజేశంభోశ్చరణౌ' అని ద్వితీయవచ్చును.

(7) సప్తమీవిభక్తి

అవ : సప్తమీ విభక్తి అధికరణవాచకమునకు వచ్చునని చెప్పఁబోవుచు అధికరణమనమేమో ముందు వివరించుచున్నారు.

సూ : ఆధారోఽధికరణమ్ 1-4-45.

వృ : కర్తృకర్మద్వారా తన్నిష్ఠక్రియాయా ఆధారః కారక మధికరణం స్యాత్.

ప. వి : ఆధారః (1-1) అధికరణమ్ (1-1).

అను : కారకే (7-1).

అర్థ : కర్తృకర్మములద్వారమున వానియందున్న క్రియకు ఆధారమైన కారకము అధికరణమనఁబడును.

వివ : అనువృత్తమైన 'కారకే' అనుపదమును ప్రథమాంతముగా మార్చికొనవలయును. ఆధారః అనుపదము దానితో విశేషణరూపమున నన్వయించును. 'ఆధ్రియతేఽస్మిన్ క్రియా' దీనియందు క్రియ మిక్కిలిగా ధరింపఁబడును అని ఆధారశబ్దమున కర్థము. దేనికాధారము అను అకాంక్షకు సమాధానముగా 'క్రియకు' అని సిద్ధించినది. సాక్షాత్తుగా క్రియకాధారమైనదానికి అధికరణసంజ్ఞ కలుగదు. ఆ క్రియకు దానినిచేయు కర్త, ఏర్పడుఫలమగు కర్మము అనుదాని మూలమున, ఏది ఆధారమగునో అది అధికరణమనఁబడును. అనగా 'పాత్రయందు వండుచున్నాఁడు' అనునపుడు పాత్ర + వండుట అను క్రియకు ఆధారము. వండు వ్యక్తిగాని (కర్తగాని) వండఁబడు పదార్థముగాని (కర్మము) లేనియెడల వండుట అను వ్యాపారమునకు పాత్ర ఆధారము కాఁజాలదు. కావున కర్త, కర్మ అనువానిమూలముననే క్రియ యొకదాని యందుండును. అట్లు క్రియకాధారమైన కారకమును అధికరణ మందురు.

అవ : సప్తమీవిభక్తి ఏ యర్థమున వచ్చునో చెప్పఁబడుచున్నది.

సూ : సప్తమ్యధికరణే చ 2-3-36.

వృ : అధికరణే సప్తమీ స్యాత్. చకారాద్దూరాన్తికార్థేభ్యః. ఔపశ్లేషికో వైషయికోఽభివ్యాపక శ్చేత్యాధారస్త్రిధా. కటే ఆస్తే. స్థాల్యాం పచతి. మోక్షే ఇచ్ఛాస్తి. సర్వస్మి న్నాత్మాస్తి. వనస్య దూరే అన్తికే వా.

ఇతి విభక్త్యర్థాః.

ప. వి : సప్తమీ (1-1) అధికరణే (7-1) చ (అవ్య)

అర్థ : అధికరణమునందు సప్తమి వచ్చును. చకారమువలన దూరాంతికార్థశబ్దములకును సప్తమి వచ్చును. ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకమని ఆధారము మూడువిధములు. ఉదా : కటే ఆస్తే, స్థాల్యాం పచతి, మోక్షే ఇచ్ఛాస్తి, సర్వస్మిన్నాత్మాస్తి. వనస్య దూరే అన్తికేవా.

వివ : కర్తృకర్మములద్వారమున కర్తృకర్మములచే నగుచున్న క్రియకు ఆధారమైనది అధికరణమని పూర్వసూత్రముచే తెలుపఁబడినది. అట్టి అధికరణార్థమునందు వర్తమానమగు శబ్దమునకు సప్తమీవిభక్తి వచ్చును. సూత్రములోని సముచ్చయార్థకమగు 'చ' శబ్దమువలన పూర్వసూత్రమునందలి (2-3-35) 'దూరాన్తికార్థేభ్యః' అనుపదమాకర్షింపఁబడును. కావున దూరము, అంతికము అను శబ్దములకు, ఆ అర్థముగల యితరశబ్దములకును సప్తమి వచ్చునను నర్థము సిద్ధించును.

ఆధారము మూఁడు విధములుగా నుండును. (1) ఔపశ్లేషికము. ఉపశ్లేష మనగా సంయోగము - రెండు వస్తువులొకదానినొకటి అంటియుండుట-దానివలన నేర్పడినది ఔపశ్లేషికము, ఉదా : కటే ఆస్తే-చాపయందున్నాఁడు-ఇచట చాపకును, దానిపైనున్న వ్యక్తికిని సంయోగము భౌతికముగా కలదు. ఇందు ఉండుట అను క్రియ, ఉన్న వ్యక్తిమూలమున 'కటము' అనిదానియందు కలదు కావున కటము ఆధారమగుటచే అధికరణవాచకము. దానికి సప్తమీవిభక్తి వచ్చినది. (కటే (7-1))- ఇది యౌపశ్లేషికాధారమున కుదాహరణము.

అట్లే స్థాల్యాంపచతి-పాత్రయందు వండుచున్నాఁడు-ఇదియు ఔపశ్లేషికమే. పచనక్రియ స్థాలిని అంటిపెట్టికొని స్థాలి (పాత్ర) యందున్నది. కావున స్థాలి పచన క్రియకు ఆధారము. కావున అధికరణవాచకమైన సప్తమీవిభక్తిని పొందినది (స్థాల్యామ్ - స్త్రీలిం, సప్తమీ, ఏకవచనము).

(2) వైషయికాధారము - విషయముచే నయినది వైషయికము. సంయోగాది సంబంధము కంటె భిన్నమైన సంబంధముతో ఆధారమైనది వైషయికాధారము. ఉదా : మోక్షే ఇచ్ఛాస్తి - మోక్షము నందిచ్ఛగలదు. ఇచట మోక్షమునకు, ఇచ్ఛకును సంయోగసంబంధము లేదు. అనగా భౌతికమైన స్పర్శాదికము లేదని తాత్పర్యము. సమవాయసంబంధము కూడలేదు. సమవాయ సంబధమనగా వస్త్రమునకు దారమునకునున్న సంబంధము వంటిది. దారములనే నిలువుగా అడ్డముగా నేయుటచే వస్త్ర మేర్పడినది. దారములు తీసివేసినచో వస్త్రముండదు. మోక్షమునకు, ఇచ్ఛకును అట్టి సంబంధము కూడలేదు. కావున నిచట ఔపశ్లేషికాధారము లేదు. మోక్షవిషయక మైన = మోక్షము లక్ష్యముగాఁగల ఇచ్ఛయున్నదని తాత్పర్యము. కావున దీనిని వైషయి కాధారము అందురు. అట్లు ఆధారమగుటచే అధికరణ వాచకమైన మోక్షశబ్దమునకు సప్తమీవిభక్తి వచ్చినది. (మోక్షే. స. ఏ)

(3) అభివ్యాపకము : ఆధేయము (వస్తువు) ఆధారముయొక్క అన్ని అవయవములయందును వ్యాపించి యున్నచో అట్టి ఆధారమును అభివ్యాపకాధారమందురు. ఉదా : సర్వస్మిన్నాత్మాస్తి. ఆత్మ అన్నిటియందును గలదు. ఇచట ఆత్మకు ఆధారముగా చెప్పఁబడిన సర్వము అనునది ఆత్మలేని పదార్థము లేదను విషయమును దెలుపును అనగా చరాచరప్రపంచమంతయు అణుమాత్రమైనను వదలుటకు వీలులేక ఆత్మయనుదానిచే అంతటను వ్యాపింపఁబడియున్నదని తాత్పర్యము. ఇది అభివ్యాపకాధారమున కుదాహరణము.

దూరము, దగ్గఱ, అనునర్థములు గలశబ్దములకు సప్తమీ విభక్తి వచ్చును ఉదా : వనస్యదూరే - వనమునకు దూరమునందు, వనస్య అన్తికే - వనముయొక్క సమీపమునందు మొ॥వి. ఇవి అధికరణవాచకములు కాకపోవుటచే వేఱుగా చెప్పఁబడినవి. ఈ శబ్దములకు దూరమ్, దూరాత్, దూరేణ ఇత్యాదివిధముగా ద్వితీయా, పంచమీ, తృతీయా విభక్తులు కూడ రావచ్చును.

ఇది విభక్త్యర్థ ప్రకరణము.

ప్రకరణావలోకనము.

ఆయా ప్రాతిపదికములకు సు ఆది విభక్తిప్రత్యయములు చేరునపుడు పదముల ప్రక్రియ శబ్దాధికారమునఁ జెప్పఁబడినది. ఆ విభక్తి ప్రత్యయములు ప్రాతిపదికమునకు ఏ యర్థములందు చేరునో యీ ప్రకరణమునఁ జెప్పఁబడినది. ఇందు (1) కర్తురీప్సితతమం కర్మ, అకథితంచ (2) స్వతంత్రః కర్తా (3) సాధకతమం కరణమ్ (4) కర్మణా యమభిప్రైతి స సంప్రదానమ్ (5) ధ్రువ మపాయేఽపాదానమ్ (6) ఆధారోఽధికరణమ్ అనునవి సంజ్ఞాసూత్రములు. కర్మాది సంజ్ఞల నివి నిర్వచించినవి. తక్కినవి యాయాయర్థములందు ఆయా విభక్తులను విధించు సూత్రములు. ఒక్కొక్క కారకమునం దొక్కొక్కవిభక్తి వచ్చును. షష్ఠీవిభక్తి మాత్రము కారకముకాదు. అది క్రియతో సూటిగా నన్వయింపదు. ఇట్లు కారకము లాఱు విభక్తు లేడును అయినవి. సంబోధనయందు ప్రథమావిభక్తియే వచ్చును.

# అథ సమాస ప్రకరణమ్

వివ : పదమనగా విభక్త్యంతము. అట్టి విభక్త్యంతములు రెండుగాని అంతకు మించిగాని కూడి యర్థమునందలి పొసగుదలనుబట్టి ఒక్క విభక్త్యంతముగా నేర్పడు నవకాశము కలదు. ఇట్లు అనేకపదములు ఏకపదమగుటకు సమాసమని పేరు. అవి ముఖ్యముగా నైదువిధములుగా విభజింపఁబడినవి. ఆ విభజనము సాధారణముగా నందలి పదములకు గల అర్థప్రాధాన్యమునుబట్టి యేర్పడినది. ఆ వివరములన్నియు నిందు వివరింపఁబడుచున్నవి.

సమాస నిర్వచనము, భేదములు, లక్షణములు మున్నగు నంశములీక్రింది వృత్తికారుని వచనములచే తెలుపఁబడుచున్నవి.

## అథ కేవలసమాస ప్రకరణమ్.

వృత్తి : సమాసః పఞ్చధా. తత్ర సమసనం సమాసః. సచ విశేషసంజ్ఞా వినిర్ముక్తః కేవలసమాసః ప్రథమః. ప్రాయేణ పూర్వపదార్థ ప్రధానోఽవ్యయీభావో ద్వితీయః. ప్రాయేణోత్తర పదార్థ ప్రధాన స్తత్పురుష స్తృతీయః. [తత్పురుష భేదః కర్మధారయః, కర్మధారయభేదో ద్విగుః] ప్రాయేణాన్యపదార్థప్రధానో బహువ్రీహిశ్చతుర్థః. ప్రాయేణోభయపదార్థప్రధానో ద్వంద్వః పంచమః.

అర్థ : సమాసమైదువిధములు. సమాసమనగా కలయిక. అదియు విశేష సంజ్ఞలేని కేవలసమాసము మొదటిది. ప్రాయికముగా పూర్వపదార్థప్రధానమైన అవ్యయీభావము రెండవది. ప్రాయికముగా ఉత్తరపదార్థ ప్రధానమైన తత్పురుషము మూఁడవది [తత్పురుషభేదమే కర్మధారయము. కర్మధారయభేదమే ద్విగువు]. ప్రాయికముగా అన్యపదార్థ ప్రధానమైన బహువ్రీహి నాల్గవది. ప్రాయికముగా ఉభయపదార్థప్రధానమైన ద్వంద్వమైదవది.

వివ : ఇందు సమాసనిర్వచనము, సమాసభేదములు స్థూలముగా వివరింపఁబడినవి. ఆ భేదముల ప్రధానలక్షణములు వివరింపఁబడినవి. సమాసమనగా పదముల సంక్షేపరూపము. అనగా రెండుమూఁడు పదము లొక్కపదముగా నై ఒక యర్థమును జెప్పును. అందు అవ్యయీభావము మున్నగు విశేషసంజ్ఞలేని సమాసములు కేవలసమాసము లనఁబడును. అవి అవ్యయీభావాది సమాసముల పరిధిలో చేరవని తాత్పర్యము. ఇది మొదటిది. రెండవది పూర్వపదార్థ ప్రధానమైన అవ్యయీభావము. సమాసమనగా కనీసము రెండుపదములు ఉండవలయును.

అందు మొదటిపదమునకు పూర్వపదమనియు, రెండవదానికి ఉత్తరపదమనియు వ్యవహారము. ఏసమాసములో పూర్వపదముయొక్క అర్థము ప్రధానమై యుండునో అది అవ్యయీభావమనఁబడును. ఉదా : అధిహరి. ఇందు సప్తమీ విభక్త్యర్థమును తెలుపు 'అధి' అనునవ్యయము హరి అను సుబంతముతో సమసించి నది. 'హరియందు' అని యీ సమాసమున కర్థము. ఇచట అధి అనుపదము యొక్క అర్థమునకు ప్రాధాన్యము గలదు. క్రియతో సాక్షాత్తుగా అన్వయించు లక్ష ణము గలదానిని ప్రధానమైనదిగా స్థూలముగా భావింపవచ్చును. ప్రాయికముగా అనుటవలన పూర్వపదార్థప్రధానము కాని అవ్యయీభావముకూడ ఉండవచ్చును. ఉదా : సూపప్రతి. (సూపమునుగూర్చి) ఇది ఉత్తరపదార్థప్రధానమే యైనను అవ్యయీభావమే.

మూఁడవది తత్పురుషము. ఇది ఉత్తరపదార్థ ప్రధానము. అనగా నిందు ఉత్తరపదముయొక్క అర్థమునకు ప్రాధాన్యముండును. ఉదా : రామాజ్ఞ. ఇందు పూర్వపదము 'రామస్య' అనునది. ఉత్తరపదము ఆజ్ఞా రామాజ్ఞను నిర్వహించెను అనగా ఆజ్ఞను నిర్వహించె ననియేకాని రాముని నిర్వహించెనని యర్థముకాదు. ఇట్లు ఉత్తరపదముయొక్క అర్థమిచట ప్రధానము కావున నిది తత్పురుషము. ఉత్తర పదార్థము ప్రధానమగుట అనులక్షణము గలిగి మఱియొక విశేషలక్షణము గలిగిన కర్మధారయము తత్పురుషములోనే యొకభేదము. కర్మధారయములో ఒక ప్రత్యేక లక్షణముగల 'ద్విగువు' అనునది యొకటి కలదు. కావున కర్మధారయము, ద్విగువు అనునవి ప్రధానభేదములు కావు. వీనిలక్షణములు ముందు వివరింపఁ బడును. 'ప్రాయికముగా' అనుటవలన ఉత్తరపదార్థప్రధానము కాని తత్పురుష ములు కూడ క్వాచిత్కముగాఁ గలవు. ఉదా : అతిమాలః – మాల నతిక్రమిం చినవాఁడు–ఇది అన్యపదార్థప్రధానమైనను తత్పురుషమే.

అన్యపదార్థప్రధానమైన బహువ్రీహి నాలుగవది. సమాసములోని రెండు పదముల యర్థమును, వేఱొకపదముయొక్క అర్థమును జెప్పుటలో పర్యవసించుట అనులక్షణముగల సమాసము బహువ్రీహి. అట్లు అన్యపదముయొక్క అర్థప్రాధా న్యము బహువ్రీహి సమాసమున నుండును. ఉదా : పీతాంబరుఁడు–పీతమైన అంబ రము గలవాఁడు అని దీనికి అర్థము. ఇందు 'పీతమ్' అనునది పూర్వపదము, 'అంబరమ్' అనునది ఉత్తరపదము ఈ సమాసముచే పీతమును చెప్పుటగాని, అంబ రమును జెప్పుట కాని వక్తయొక్క ఉద్దేశము కాదు. అనగా పీతాంబరుఁడు వచ్చు చున్నాఁడనగా పీతము వచ్చుచున్నదనిగాని, అంబరము వచ్చుచున్నదని కాని చెప్పుట

లేదు. పచ్చని వస్త్రము ధరించు విష్ణువు వచ్చుచున్నాఁడనిభావము. విష్ణుపదము సమాసమున లేదు కావున అన్యము. ఆపదముయొక్క అర్థమునకు ప్రాధాన్య ముండుటచే ఇది అన్యపదార్థప్రధానము. కావున దీనికి బహువ్రీహి యనిపేరు.

ప్రాయికముగా అనుటచే అన్యపదార్థ ప్రధానముకాని బహువ్రీహిసమాస ములును తక్కువసంఖ్యలో కలవు. ద్విత్రాః (ఇద్దఱులేక ముగ్గురు) ఇది అన్య పదార్థప్రధానము కానిదయ్యును బహువ్రీహియే.

(5) అయిదవదియగు ద్వంద్వసమాసము ఉభయపదార్థప్రధానము. ఉదా : రామలక్ష్మణులు. ఇందు పూర్వపదమగు 'రామ' అనుదానియొక్కయు, ఉత్తరపద మగు 'లక్ష్మణ' అనుదానియొక్కయు నర్థమునకు ప్రాధాన్యము గలదు. రామ లక్ష్మణులు వచ్చుచున్నారనగా రాముఁడు వచ్చుచున్నాఁడు, లక్ష్మణుఁడును వచ్చు చున్నాఁడని భావము. ఇట్లిందు రెండుపదముల యర్థములకును ప్రాధాన్యముండు టచే దీనిని ద్వంద్వమందురు.

ప్రాయికముగా అనుటవలన 'దంతోష్ఠమ్' మున్నగువానిలో ఉభయపదార్థ ప్రాధాన్యము లేకున్నను అవి ద్వంద్వములే యగును. ఇందు దంతములయొక్కయు ఓష్ఠములయొక్కయు సమాహారము సమూహము అనునర్థము ప్రధానము.

అవ : ఇట్లు సమాసముల స్థూలనిర్వచనము చేయఁబడినది. రెండుపదము లేకపదమగు ననుటలో ఏరెండు పదములైనను విచక్షణలేక ఒక పదముగా నగునా ? అనుశంక కలుగును. దానిని నివారించుటకై యీ క్రిందిసూత్రము చెప్పఁబడుచున్నది.

సూ : సమర్థః పదవిధిః 2-1-1.

వృ : పదసంబన్ధీ యోవిధి స్ససమర్థాశ్రితో బోధ్యః.

ప వి : సమర్థః (1-1) పదవిధిః (1-1).

అర్థ : పదములకు సంబంధించిన విధి సమర్థాశ్రితమని తెలియఁదగును.

వివ : పదములకు సంబంధించి వ్యాకరణశాస్త్రమున చెప్పఁబడు విధు లైదు విధములుగాఁ గలవు. (1) సమాసవిధి (2) తద్ధితవిధి (3) కృద్విధి (4) ఏకశేషవిధి (5) సనాద్యంతధాతువిధి. వీనికే వృత్తులనియుపేరు. ఇవి ముందు వివరింపఁ బడును. ఈ పదములకు సంబంధించిన విధులు సమర్థముల నాశ్రయించి యుండునని సూత్రార్థము. సమర్థమనగా నేమియో విచారింతము. ఈ పదమునకు రెండర్థములు

సంభావ్యములు. (1) సంప్రేక్షితమైన అర్థము కలది-ఆకాంక్షితమైన అర్థముగలది యని తాత్పర్యము. వాక్యమునఁ గలపదములు పరస్పరమాకాంక్షాయుక్తములై యుండును. రాముఁడు రావణుని సంహరించెను అనువాక్యమున ఎవఁడు సంహరించెను? ఎవనిని సంహరించెను? మున్నగువిధముగా వాక్యార్థము ప్రశ్నల మూలమున రాఁబట్టుటకే ఆకాంక్ష అనిపేరు వాక్యములోని పదములన్నియు నిట్టి ఆకాంక్షతో కూడియే యుండవలయును. అట్లాకాంక్షాయుక్తమైనపదములనే సమర్థము లందురు. సమర్థముయొక్క భావము సామర్థ్యము. ఇట్లు వాక్యములో పదములకు పరస్పరముగల సామర్థ్యమును వ్యపేక్షారూప సామర్థ్యమందురు. అపేక్ష అనగా కోరిక, వి + అపేక్ష, వ్యపేక్ష – ఒకపదమునుబట్టి మఱియొకపదముయొక్క యర్థమును దెలియఁగోరుటచే సిద్ధమైన సామర్థ్యము అని దీనిభావము. ఇది వాక్యములలో పరస్పరమన్వయముగల పదములకు సంబంధించినది.

(2) సంబంధమైన అర్థముగలది సమర్థమని రెండవ నిర్వచనము. అనగా ఒకపదము ఒక అర్థమునందు రూఢమై యుండును అట్లు భిన్న భిన్నములగు అర్థము లందు రూఢమైనపదములు రెండును కలసి ఒక అర్థమును జెప్పగలిగియుండుట అందందు సంభవించును ఇట్లు వేర్వేఱు అర్థములు గలిగిన పదములు సముదాయముగా నేర్పడి నందువలన విశిష్టమైన ఏకార్థమును బోధింపఁగలిగి యుండుటయు దృష్టమగుచున్నది. అట్టిపదములనుకూడ సమర్థము లందురు. వానిభావము సామర్థ్యము. ఒకటిగానై ఒక అర్థమును జెప్పఁగలుగుట అనులక్షణమునుబట్టి యిట్టి సామర్థ్యమును ఏకార్థీభావరూపసామర్థ్యమందురు. ఉదాహరణమునకు రాజ్ఞః (రాజుయొక్క) పురుషః (పురుషుఁడు) అను రెండుపదములు భిన్నార్థములందు రూఢములైనవి. ఇవిరెండును కూడి ఒక్కటియై సముదాయశక్తిచేత (ఒక్కటిగా నగుటచే కలిగినశక్తిచేత) రక్షకభటుఁడు, లేక రాజోద్యోగి అను నొకఅర్థము నీఁగలిగినవి. కావున నీరెండుపదములు సమర్థములని చెప్పుదుము. వీనికి ఏకార్థీభావరూపసామర్థ్యము గలదు. ఇట్టి సామర్థ్యము కలిగిననే కాని పదవిధి ప్రవర్తింపదని సూత్రతాత్పర్యము. కావున నేరెండు పదములకు సమాసము చేయఁదలఁచితిమో యవి సమర్థములగునా? కాదా? యని విచారించుట ప్రథమ కర్తవ్యము. ఇది యొక్క సమాసములోనే కాదు. పదములకు సంబంధించిన తద్ధితాదివృత్తులన్నింటను వర్తించు లక్షణము. తద్ధితాదులలో ఒక్కపదమే యుండవచ్చును. అందుకొఱకు పదవిధి అనుదానికి పదస్యవిధిః (పదమునకు సంబంధించిన విధి) పదయోః విధిః (రెండుపదములకు సంబంధించిన విధి. పదానాం విధిః

(అనేకపదములకు సంబంధించిన విధి) అని మూఁడు విధములుగా నర్థమును భావింప వలయును.

సామర్థ్యము లేనిచో సమాసమేర్పడదు. ఉదా : పశ్య కృష్ణం, (శ్రితో రామ మిత్రమ్ )కృష్ణుని చూడుము; రామమిత్రుని ఆశ్రయించినవాఁడు) ఇచట కృష్ణమ్ అను ద్వితీయాంతపదమునకు 'శ్రితః' అను దానితో సామర్థ్యము లేదు కావున సమాసము కాదు.

అవ : సమాసమనునది యొక వ్యాకరణసంజ్ఞ. ఆసంజ్ఞ అష్టాధ్యాయి సూత్రములలో ఎంతవఱకు వర్తించునో యీ క్రింది సూత్రము చెప్పుచున్నది.

సూ : ప్రాక్కడారాత్ సమాసః 2-1-3.

వృ : 'కడారాః కర్మధారయ' ఇత్యతః ప్రాక్ సమాస ఇత్యధి క్రియతే.

ప. వి : ప్రాక్ (1-1) కడారాత్ (5-1) సమాసః (1-1).

అర్థ : 'కడారాః కర్మధారయే' అనుసూత్రమునకు పూర్వసూత్రమువఱకు 'సమాసః' అనుపదము అధికారరూపమున ప్రవర్తించును.

వివ : ఈ సూత్రమున 'కడారాత్' అనుపదమునకు కడారశబ్దఘటితసూత్రము వఱకు అనియర్థము. అట్టిసూత్రము 2.2-38 సంఖ్యగల 'కడారాః కర్మధారయే' అనునది ఈ సూత్రము మొదలుకొని 2-2-37 వఱకుఁగల సూత్రములన్నింటి లోనికి 'సమాసః' అనుపదము అధికారరూపమునఁ జేరి యందు విధింపఁబడినవానికి సమాససంజ్ఞను కలిగించును. అష్టాధ్యాయిలో 2-1-3 నుండి 2-2-37 వఱకు సమాస పరిచ్ఛేదమని తెలియనైనది.

అవ : సమాసవిధాయక సూత్ర మొకటి చెప్పఁబడుచున్నది.

సూ : సహసుపా 2-1-4.

వృ : సుప్ సుపా సహ వా సమస్యతే. సమాసత్వాత్ ప్రాతిపదికత్వేన సుపోలుక్.

ప. వి : సహ (అవ్య) సుపా (3-1).

అను : సుప్ (1-1) సమాసః (1-1).

అర్థ : సుబంతము సుబంతముతో వైకల్పికముగా సమసించును. సమాస మగుటవలన ప్రాతిపదికమై సుప్పునకు లుక్కువచ్చును.

ఇవి 'సుప్' అనునది నామవిభక్తి ప్రత్యయములను తెలుపు ప్రత్యాహారము. ప్రత్యయమును గ్రహించునపుడు తదంతమునకు గ్రహణము గలదని తెలుపు పరిభాష యొకటి కలదు. "ప్రత్యయగ్రహణే తదంతస్యాపిగ్రహణమ్" దీనినిబట్టి 'సుప్' అనుపదమునకు సుబంతమనియు, 'సుపా' అను తృతీయాంతపదమునకు 'సుబంతముతో' అనియు అర్థమేర్పడును. 'వైకల్పికముగా' అనునది జ్ఞాపకము వలన సిద్ధించును. ప్రకృతసూత్రమే అన్నియెడలను సమాసమును సిద్ధింపఁ జేయుచుండగా మఱల అవ్యయం విభక్త్యాది వక్ష్యమాణసూత్రములచే సమాసః సంజ్ఞను సూత్రకారుఁడు విధించుట వ్యర్థమగును. అట్లు వ్యర్థమగుచు 'సాధారణముగా సమాసము వైకల్పికముగా నగును' అనునర్థమును జ్ఞాపన చేయును (తెలుపును).

ఇట్లు ఒక సుబంతముతో మఱియొక సుబంతము కూడి సమాసమను సంజ్ఞను పొందును. అప్పుడా సముదాయమున కంతటికి ప్రాతిపదికమను సంజ్ఞ యేర్పడును. (కృత్తద్ధిత సమాసాశ్చ – కృదంతములును తద్ధితాంతములును సమాసములును ప్రాతిపదికములగును) ప్రాతిపదికసంజ్ఞ కలదాని అవయవములగు సుప్పులకు లుక్కు వచ్చును. 'సుపోధాతుప్రాతిపదికయోః' 2-4-71 –'ధాతువుయొక్క అవయవమైన సుప్పునకును, ప్రాతిపదికముయొక్క అవయవమైన సుప్పునకును లుక్కువచ్చును' అని సూత్రార్థము. ప్రత్యయముయొక్క అదర్శనమును తెలుపుటకు లుక్, శ్లు, లుప్ అను మూఁడు సంజ్ఞలను వాడుదురు (ప్రత్యయస్య లుక్శ్లులుపః). ఈ విషయము ఉదాహరణసమన్వయపూర్వకముగ ముందు వివరింపఁబడును.

అవ : సమాససిద్ధిని విశదీకరించు కొన్నివిషయము లిట వృత్తికారునిచే వివరింపఁబడుచున్నవి.

వృ : కృత్తద్ధిత సమాసైకశేష సనాద్యన్త ధాతురూపా పఞ్చ వృత్తయః పరార్థాభిధానం వృత్తిః. వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః. సచ లౌకికోఽలౌకికశ్చేతి ద్విధా. తత్ర పూర్వం భూత ఇతి లౌకికః. 'పూర్వ అమ్, భూత+సు' ఇత్యలౌకికః.

అర్థ : కృత్తు, తద్ధితము, సమాసము, ఏకశేషము, సనాద్యంతధాతువు అను రూపములతో వృత్తులైదువిధములు. పరార్థాభిధానము వృత్తి. వృత్తియొక్క అర్థమును తెలుపు వాక్యము విగ్రహము. అది లౌకికము, అలౌకికము అని రెండు

విధములు. 'పూర్వంభూతః' అనునది లౌకికము. 'పూర్వ అమ్, భూత సు' అనునది అలౌకికము.

వివ : వృత్తి యనగా పరార్థాభిధానమని చెప్పఁబడినది. పరపదముయొక్క సంబంధమువలనఁ గాని ప్రత్యయముయొక్క సంబంధమువలనగాని తనకుఁగల యర్థముకంటె భిన్నమైన అర్థమును జెప్పునది వృత్తి యని దానికర్థము. ఉదాహరణమునకు దశరథశబ్దమునకు ఇఞ్ అను ప్రత్యయము చేర్పగానేర్పడిన 'దాశరథి'అనునది దశరథునియొక్క కుమారుఁడు అనునర్థము నిచ్చినది. దశరథశబ్దార్థము (అజుని కుమారుఁడు అనురూపమున నుండినది) ఇచటలేదు. ఇదియే పరార్థమును జెప్పుట. ఇట్లు పరార్థమును జెప్పు విధానము లైదుగలవు. కావున నైదువృత్తు లేర్పడినవి.

(1) కృద్వృత్తి. ధాతువునకు చేరు తిఙ్భిన్నప్రత్యయమును కృత్తు అందురు. (తిఙ్=క్రియావిభక్తి). అది చేరినపదము కృదంతము. దానికే 'కృద్వృత్తి' అనిపేరు. ఉదా : కుంభం కరోతీతి = కుమ్భకారః రామః మొ॥వి. కృద్వృత్తి ఈ గ్రంథమున వ్యాఖ్యానింపఁబడినది. విశేషములందు జూడనగును.

(2) తద్ధితవృత్తి. అర్థవిశేషమును దెలియఁజేయుచు సుబంతములకు చేరు ప్రత్యయములను తద్ధితములందురు. అవి చేరినవి తద్ధితాంతములు వానికి తద్ధిత వృత్తి యనిపేరు, ఉదా ; దాశరథిః (దశరథస్య అపత్యంపుమాన్ - దశరథుని పుత్త్రుఁడు) వైనతేయః (వినతాయాః అపత్యం పుమాన్ – వినత కొడుకు – గరుత్మంతుఁడు) మొ॥వి. తద్ధితాంతములు ముందు వ్యాఖ్యానింపఁబడును.

(3) సమాసవృత్తి : సమర్థములగు పదము లేకపదమగుట సమాసము. రాజపురుషః, రామలక్ష్మణౌ మొ॥వి. ప్రకృతపరిచ్ఛేదము వానిని వివరించుచున్నది.

(4) ఏకశేషవృత్తి : రెండుపదము లొకపదమగునపుడు కొన్నియెడల అందొక పదము మాత్రమే మిగులును. అట్టిదాని ఏకశేషవృత్తి యందురు. ఉదా : మాతాచపితాచ=పితరౌ=తల్లిదండ్రులు. సంగ్రహముగా నిదియు నీ సమాస ప్రకరణమున చెప్పఁబడును.

(5) సనాద్యంతధాతువృత్తి : సన్, క్యఙ్, క్యచ్ మున్నగు ప్రత్యయములు ధాత్వాదులకు చేరి అవి ధాతువులగును. ఆప్రత్యయములును ధాతువులకు విశేషార్థములలో చేరును. అట్టివానిని సనాద్యంతధాతువు లందురు. ఉదా : పిపఠిషా

=పఠితుమిచ్ఛా - చదువవలయుననుకోరిక, పఠ్ ధాతువునకు సన్ ప్రత్యయము చేరిన రూపము. దానిపై 'అ' ప్రత్యయము చేరినది. ఇట్టివానిని సనాద్యంతధాతు వృత్తులందురు.

ఈ ఐదు విధములయిన వృత్తులకును అర్థమును వివరించి చెప్పు వాక్యమును విగ్రహమందురు. అది లౌకికమనియు అలౌకికమనియు రెండువిధములు. లౌకికమనగా వ్యవహారభాషలో ప్రయోగించుటకు అర్హమైనది. అలౌకికమనగా శాస్త్రములో ప్రక్రియకు అనుకూలముగా ప్రకృతి ప్రత్యయ విభజనపూర్వకముగా చూపఁబడునది.

ఉదా : భూతపూర్వః అనుసమాసమునకు 'పూర్వం భూతః' అనునది లౌకిక విగ్రహము. ఇందలి పదములకే ప్రాతిపదికమిది ప్రత్యయమిది అని వింగడించి చూపగా నేర్పడినది అలౌకిక విగ్రహవాక్యము. పూర్వ + అమ్, భూత + సు - పూర్వ భూత అనునవి ప్రాతిపదికములు, అమ్, సు అనునవి ప్రత్యయములు అని విభజించి యిందు చూపఁబడినవి. ఇది లౌకికవాక్యమున ప్రయోగింపఁబడఁజాలదు. కావున అలౌకికవిగ్రహ మనఁబడినది. వృత్తుల ప్రక్రియలో విభక్తి ప్రత్యయములకు లుక్కు రావలసియుండును. కావున నిట్లు విభజించి చూపుట అవసరమగును. అలౌకిక విగ్రహస్వరూపమును లౌకికవిగ్రహము నిరూపించును.

అవ : ఇట్లు వృత్తి, విగ్రహము మున్నగువాని నిర్వచనములను నిరూపించిన పిదప 'సహ సుపా' అనుసూత్రమున కొక ఉదాహరణమును వృత్తికారుఁడు చూపుచున్నాఁడు. రెండుపదము లొకటియైనపుడు అందేది ముందుండవలయుననునది ముందు ముందు సూత్రములతో చెప్పఁబడుచున్నది. ప్రకృతోదాహరణమున మాత్రము పాణిని ప్రయోగము దీనిని (పూర్వపదమును) నిర్ణయించుచున్నదని క్రింది వృత్తి వాక్యముచే చెప్పఁబడుచున్నది.

వృత్తి : భూతపూర్వేచర డితి నిర్దేశాద్భూతస్య పూర్వనిపాతః. భూతపూర్వః.

అర్థ : పాణిని మహర్షి 'భూతపూర్వే చరట్' అనుసూత్రమున భూతశబ్దము పూర్వపదముగా ప్రయోగించుటచే భూతశబ్దము పూర్వపదమగును. ఉదా : భూతపూర్వః

వివ : 'పూర్వం భూతః' అనులౌకిక విగ్రహము కలదానికి 'పూర్వ + అమ్, భూత + సు' అనునది అలౌకిక విగ్రహవాక్యము. ఈ సముదాయము నకు 'స హ సు పా' అనుసూత్రముచే సమాససంజ్ఞ కలుగును ఇందు 'పూర్వ + అమ్' అనునది ఒక సుబంతము. 'భూత + సు' అనునది ఒక సుబంతము. సమాససంజ్ఞ కలది ప్రాతిపదికసంజ్ఞ కలది యగును. 'సుపో ధాతుప్రాతిపది కయోః' అనుసూత్రముచే దీని అవయవములైన సుప్పులకు (విభక్తులకు) లుక్కు వచ్చును. పూర్వ (అమ్) భూత (సు). ఇవుడు 'పూర్వభూత' అని కావలసియుండగా పాణిని మహర్షి యొకసూత్రమున భూతశబ్దమును ముందు ప్రయోగించెను. (భూతపూర్వే చరట్) దానినిబట్టి ఈ సమాసమున భూతశబ్దము ముందుండవలయునని చెప్పినట్లయినది. ఇది యొక సంప్రదాయము. సూత్ర ములచేత సాక్షాత్తుగా విధింపఁబడిన కార్యములే కాక మహర్షి ప్రయోగములను బట్టియు నితరవిధానములనుబట్టియు ననేకకార్యము లీ వ్యాకరణమున గ్రహిం పఁబడినవి. అందుచే ప్రకృతసమాసము 'భూతపూర్వ' అను రూపమును పొంది నది. ఇది ప్రాతిపదికమగుటచే పదత్వసిద్ధికి మరల సుప్పులు చేరును. ప్రాతి పదికార్థమున 'సు' చేరగా భూత పూర్వ + సు = భూత పూర్వః అగును. [సమాసమున నేపదము ముందుండ వలయునను విషయమున ననేక నియ మములు గలవు. అవి ముందు ముందు సందర్భానుసారముగా చెప్పఁబడు చున్నవి]

వా॥ ఇవేన సహ సమాసో విభక్త్యలోపశ్చ.

వృ : వాగర్థౌ ఇవ – వాగర్థావివ.

ప. వి : ఇవేన (3-1) సహ (అవ్య) సమాసః (1-1) విభక్త్యలోపః (1-1) చ (అవ్య).

అర్థ : సుబంతము 'ఇవ' అను నవ్యయముతో కూడి సమాసమగును. విభక్తికి లోపము కలుగకుండుటయు నగును. ఉదా : వాగర్థౌ ఇవ – వాగర్థావివ.

వివ : ఇవ అనునది 'వలె' అనునర్థముగల అవ్యయము. దానితో సుబం తము సమసించును. కాని తక్కిన సమాసములకు వలె నిందు విభక్తి లోపము రాదు. ఉదా : వాగర్థౌ + ఇవ = లౌకిక విగ్రహము. 'వాగర్థ, ఔ, ఇవ' అలౌకిక

విగ్రహము. 'ఔ' అనుదానికి లోపము ప్రాప్తించుచుండగా నిషేధింపఁబడి నది. వాగర్థౌ+ఇవ=వాగర్థావివ.

విభక్తిలోపము రానిచో సమాససంజ్ఞవలన ప్రయోజనమేమి? యను శంక కలుగును. ఏకపదముగా నగుట, విభక్తులు లోపించుట, స్వరము అనునవి సమాసమునకు ప్రయోజనములు కదా. ఇచట ఈ వార్తికముచే సమాసము విధింపఁబడుటచే 'స హ సు పా' అను సూత్రముచే సమాసము కాదని తెలుపఁబడినది. దానిచే సమాసమైనచో విభక్తిలోపము, ఇవశబ్దమునకు పూర్వప్రయోగముండుట మున్నగు పద్ధతులచే అనిష్టరూపములు సిద్ధించును. వానిని వారించుటకై యీ వార్తికము అవసరమగుచున్నది.

ఇది కేవలసమాసప్రకరణము.

# అథ అవ్యయీభావ సమాస ప్రకరణమ్

అవ : సాధారణముగా పూర్వపదార్థప్రధానమైన సమాసము అవ్యయీభావ మనఁబడునని చెప్పఁబడినది. ఆ అవ్యయీభావమేర్పడు పద్ధతులను, అందుజరుగు నితరకార్యములను తెలియఁజేయు ప్రకరణము కావున నిది అవ్యయీభావ సమాస ప్రకరణమనఁబడును.

సూ : అవ్యయీభావః 2-1-5.

వృ : అధికారోఽయం ప్రాక్తత్పురుషాత్.

ప. వి : అవ్యయీభావః (1-1).

అర్థ : 'అవ్యయీభావః' అనునది 'తత్పురుషః' అనుసూత్రమువఱకు నధికారము.

వివ : ఈ సూత్రము మొదలుకొని 'తత్పురుషః, 2-1 22 అనుసూత్రమునకు పూర్వసూత్రమువఱకు 'అవ్యయీభావః' అనుపదము అధికారరూపమున ప్రవర్తించును. అనగా 2-1-5 నుండి 2-1-21 వఱకుఁగలసూత్రములచే నేర్పడు సమాసములకు అవ్యయీభావమను విశేషసంజ్ఞ కలుగుననిభావము.

అవ : అవ్యయీభావసమాసమును విధించుసూత్రము చెప్పఁబడుచున్నది.

సూ : అవ్యయం విభక్తి సమీపసమృద్ధి వ్యృద్ధ్యర్థాభావాత్యయాసంప్రతి శబ్దప్రాదుర్భావ పశ్చాద్యథానుపూర్వ్యయౌగపద్య సాదృశ్య సంపత్తి సాకల్యాన్తవచనేషు 2-1-6.

వృ : విభక్త్యర్థాదిషు వర్తమాన మవ్యయం సుబన్తేన సహ నిత్యం సమస్యతే

ప. వి : అవ్యయమ్ (1-1) విభక్తి .... వచనేషు (7-3).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) అవ్యయీభావః (1-1).

అర్థ : విభక్తి మున్నగు నర్థములయందు వర్తమానమగు నవ్యయము సుబంతముతో నిత్యముగా సమసించును.

వివ : 'విభక్తి' మొదలుకొని 'అన్తవచనేషు' అన్నంతవఱకు నున్న దీర్ఘ సమాసమున గలపదముల ఆయాయర్థములను పేర్కొనుచున్నవి. విభక్తిమున్నగు

నర్థమున వర్తమానమగు అవ్యయ మనగా, విభక్త్యర్థము, సమీపార్థము మున్నగు వానిని చెప్పు అవ్యయమని అర్థము. ఈ సమాసమునందలి యితరార్థములు ముందు ముందు వివరింపఁబడును. అవ్యయమనగా వ్యయముకానిది. ఎట్టిరూప భేదములను పొందక ఒకేవిధముగా నుండునది యనియర్థము.

సదృశం త్రిషు లిఙ్గేషు సర్వాసు చ విభక్తిషు ।
వచనేషు చ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయమ్॥

మూఁడులింగములయందును, విభక్తులన్నింటియందును వచనములన్నింటి యందును నొకేవిధముగ నుండి యేది వ్యయము కాదో యదియవ్యయమని యీ కారిక కర్థము. అనగా లింగమునుబట్టిగాని, విభక్తినిబట్టిగాని, వచనమును బట్టిగాని స్వరూపములో ఏమియు భేదము లేకుండ నుండునది అవ్యయమని ఫలితార్థము. "స్వరాది నిపాతమవ్యయమ్" ఇత్యాదిసూత్రములచే ఏవి యవ్యయములో పాణిని మహర్షి తెలిపెను. స్వర్ మున్నగునవియు, నిపాతసంజ్ఞకములును అవ్యయము లగును. అవ్యయము సుబంతముతో సమాసమగుట నిత్యము. నిత్యసమాసలక్షణ మును వృత్తికారుఁడు వివరించుచున్నాఁడు.

వృ : ప్రాయేణా విగ్రహో వా అస్వపద విగ్రహో వా నిత్యసమాసః.

అర్థ : సాధారణముగా విగ్రహములేనిదికాని, స్వపదములతో విగ్రహము లేనిది కాని నిత్యసమాసమనఁబడును.

వివ : విగ్రహమనగా వృత్తియొక్క యర్థమును బోధించు వాక్యమని పూర్వము చెప్పఁబడినది. ప్రాయికముగా విగ్రహము చెప్పుటకు వీలులేనిదియు, ఒకవేళ వీలున్నను సమాసములోనున్న పదముల నుపయోగించి విగ్రహము చెప్పు టకు వీలులేనిదియునగు సమాసమును నిత్యసమాస మందురు. 'రాజపురుషః' అను సమాసమునకు రాజ్ఞఃపురుషః (రాజుయొక్కపురుషుఁడు) అని విగ్రహమును స్వపద ములతో చెప్పఁగలము. 'ఉపకృష్ణమ్' అనుదానికి 'కృష్ణస్యసమీపమ్' అనునది విగ్రహము. ఇందు 'సమీపమ్' అనునది సమాసమునలేనిపదము. కావున నిది అస్వపదవిగ్రహము. ఇట్టి సమాసములను నిత్యసమాసములందురు. స్వపదము లతో విగ్రహము చెప్పుటకు వీలైన సమాసములు వైకల్పికసమాసములు (రాజ పురుషః వంటివి). ఈ సందర్భమున విగ్రహమనగా లౌకికవిగ్రహమే గ్రాహ్యము.

అవ : సూత్రమున 'విభక్తి' మున్నగువానికి క్రమముగా నుదాహరణములు ప్రదర్శింపఁబడుచున్నవి.

వృ : విభక్తౌ-'హరి + ఙి, అధి' ఇతిస్థితే.

అర్థ : విభక్త్యర్థమున వర్తమానమగు నవ్యయము సుబంతముతో సమసించుట కుదాహరణము. హరి+ఙి, అధి అనియుండఁగా.

వివ : 'విభక్తౌ' అనగా విభక్త్యర్థముగల అవ్యయము సుబంతముతో సమసించుట కుదాహరణము చూపఁబడుచున్నదని తాత్పర్యము. ఉదా : హరౌ - హరి యందు ననునర్థమున 'హరి + ఙి, అధి' - ఇందు 'అధి' అను నవ్యయము సప్తమీవిభక్త్యర్థమునందు వర్తమానమగుచున్నది. 'హరి + ఙి' అనునది సుబంతము. హరి+ఙి + అధి' అనునది అలౌకిక విగ్రహవాక్యము. దీనికి ప్రకృతసూత్రముచే సమాససంజ్ఞయు, అవ్యయీభావమను విశేష సంజ్ఞయు కలుగును. (ఙి అనునది సప్తమ్యేక వచనప్రత్యయము).

అవ : రెండుపదములొకపదమగునపుడు వానిలో నేది ఎచట నుండవలయును అను శంక కలుగును. ప్రకృతమున 'హరి + ఙి' అనునది ముందుండవలయునా? 'అధి' అనునది ముందుండవలయునా? అనుసంశయము రాఁగా నిర్ణయము చేయుటకై ఉపసర్జన సంజ్ఞ నిర్వచింపఁబడుచున్నది.

సూ : ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్ 1-2-43.

వృ : సమాసశాస్త్రే ప్రథమానిర్దిష్ట ముపసర్జనం స్యాత్.

ప. వి : ప్రథమానిర్దిష్టమ్ (1-1) సమాసే (7-1) ఉపసర్జనమ్ (1-1).

అర్థ : సమాసశాస్త్రమున ప్రథమానిర్దిష్ట ముపసర్జనమగును.

వివ : సమాసశాస్త్రమనగా సమాసమను సంజ్ఞను విధించు సూత్రము (లేక వార్తికము). అందు ప్రథమావిభక్తితో నిర్దేశింపఁబడినది ఉపసర్జనమగును. ప్రకృతసమాసవిధాయకసూత్రమున అవ్యయము సుబంతముతో సమసించుననునర్థము కలదు. ఇందు ప్రథమాంతపదము అవ్యయము, తృతీయాంతపదము 'సుబంతముతో' అనునది. కావున అవ్యయము ప్రథమాంతముగా సూత్రమున చెప్పఁబడుటచే దానిచే చెప్పఁబడు 'అధి' మున్నగువానికి ఉపసర్జన మనుసంజ్ఞ కలుగును, 'సుబంతముతో' అనుపదముచే నిర్దిష్టములగు 'హరి+ఙి' మున్నగువాని కిచట ఈ సంజ యుండదని ఫలితారము.

అవ : ఉపసర్జనసంజ్ఞయొక్క ప్రయోజనములలో నొకటి చెప్పఁబడు చున్నది.

సూ : ఉపసర్జనం పూర్వమ్ 2-2-30.

వృ : సమాసే ఉపసర్జనం ప్రాక్ప్రయోజ్యమ్. ఇత్యధేః ప్రాక్ప్రయోగః.

అను : సమాసే (7-1).

అర్థ : సమాసమున ఉపసర్జనము పూర్వమున ప్రయోగింపఁబడవలయును ఇట్లు 'అధి'కి పూర్వప్రయోగము.

వివ : పూర్వసూత్రముచే ఉపసర్జనమన నేమో తెలుపఁబడినది. ఉపసర్జన సంజ్ఞకలది సమాసమున పూర్వపదముగా నుండవలయునని యీ సూత్రముచేఁ జెప్పఁబడినది. ఉపసర్జనసంజ్ఞ కిది యొకప్రయోజనము. మఱికొన్ని ప్రయోజనములు. ముందు చెప్పఁబడును. సాధారణముగా ద్వంద్వబహువ్రీహులయందు తప్ప తక్కిన సమాసముల యందిదియే పూర్వపదనిర్ణయము చేయును.

ప్రకృతమున అవ్యయము ఉపసర్జనము కావున నదిఅవ్యయసంజ్ఞకలది ఈ సమాసమున పూర్వపదము కావలయును. 'అధి' అనునది యవ్యయము - 'అధి, హరి + ఙి'.

అవ : అనంతరప్రక్రియ వివరింప ఐడుచున్నది.

వృ : సమాసత్వేన ప్రాతిపదికసంజ్ఞాయాం ఙేర్లుక్. తతస్సము దాయాత్ స్వాద్యుత్పత్తిః. అవ్యయీభావశ్చేత్యవ్యయత్వాత్తస్య సుపోలుక్. అధిహరి.

అర్థ : సమాసత్వముచే ప్రాతిపదికసంజ్ఞ కలుగగా 'ఙి' ప్రత్యయమునకు లుక్కు. పిమ్మట సముదాయమునకు పరముగా స్వాదులు చేరును. 'అవ్యయీభావశ్చ' అను సూత్రముచే నవ్యయమగుటవలన దాని సుప్పునకు లుక్కు. అధిహరి.

వివ : 'కృత్తద్ధితసమాసాశ్చ' అనుసూత్రముచే సమాససంజ్ఞకలదానికి ప్రాతిపదికసంజ్ఞ కలుగును. సుపోధాతుప్రాతిపదికయోః (ధాతుప్రాతిపదికముల అవయవమైన సుప్పునకు లుక్కువచ్చును) అనుసూత్రముచే 'అధి, హరి+ఙి అను దాని యవయవమైన (అందులో ఒకభాగమైన) 'ఙి' అను సుప్పునకు లుక్కు (అదర్శనము) వచ్చును. 'అధిహరి' అగును. పదముకానిదానికి ప్రయోగార్హత

యుండదు. కావున దీనికి మఱల సుప్పులు చేరును. ప్రాతిపదికార్థమున ప్రథమైక వచనప్రత్యయము 'సు' చేరఁగా దానికి 'అవ్యయాదాప్సుపః' అనుసూత్రముచే లుక్కు వచ్చును. 'అవ్యయీభావశ్చ' అనియొకసూత్రము గలదు. దానిచే అవ్యయీభావమనువిశేషసంజ్ఞకలదానికి అవ్యయమను సంజ్ఞ కలుగునని చెప్పఁబడినది. దానిచే అవ్యయీభావసమాసమునకు పరముగా చేరిన సుప్పునకు సాధారణముగా లుక్కువచ్చును. 'అధిహరి' - పదత్వమును సిద్ధింపఁజేయుటకై చేర్చిన విభక్తి ప్రత్యయము లోపించినచో పదత్వ మెట్లు కలుగునని శంకింపరాదు. ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్-ప్రత్యయము లోపించినను ప్రత్యయలక్షణముండును - అనున్యాయముచే సుప్పునకు లుక్కువచ్చినతరువాత 'అధిహరి' మున్నగునవి పదములే యగును.

సమాసప్రక్రియలోని అంశముల క్రమ మిట్లుండును. 1. లౌకికవిగ్రహము (2) అలౌకిక విగ్రహము (3) సమాసవిధానము (4) అవ్యయీభావాదివిశేష సంజ్ఞ (5) ఉపసర్జనసంజ్ఞ-పూర్వపదనిర్ణయము (6) ప్రాతిపదికసంజ్ఞ (7) సమాసరూప ప్రాతిపదికావయవములగు సుప్పులకు లుక్కు (8) మరల సుప్పు చేరుట - పదత్వము. ఇవియేకాక సమాసలింగనిర్ణయము, సమాసాంతకార్యములు మున్నగునవియు ముందుఁ జెప్పఁబడును.

అవ : విభక్త్యర్థముననే మఱికొంత ప్రక్రియా విశేషమును తెలుపుటకై మఱియొక యుదాహరణ మొసగఁబడుచున్నది. దానికి సంబంధించిననపుంసక సంజ్ఞ అవ్యయీభావమునకు విధింపఁబడుచున్నది.

సూ : అవ్యయీభావశ్చ 2-4-18.

వృ: అయం నపుంసకం స్యాత్.

ప. వి: అవ్యయీభావః (1-1) చ (అవ్య).

అను : నపుంసకమ్ (1-1).

అర్థ : అవ్యయీభావము నపుంసకమగును.

వివ : అవ్యయీభావసంజ్ఞకలిగిన సమాసము నపుంసకమగును. అనగా నపుంసకలింగములకు విధింప బడుకార్యములు అవ్యయీభావసమాసమున కగునని భావము. [అవ్యయీభావశ్చ' అని 1-1-41 సంఖ్యగల మఱియొక సూత్రము గలదు. అది అవ్యయీభావసమాసమునకు అవ్యయసంజ్ఞను విధించును. ఇవిరెండును

వేర్వేఱుసూత్రములు. ఇట్లు అవ్యయీభావసమాసమునకు అవ్యయసంజ్ఞయు, నపుంసక సంజ్ఞయు రెండును గలుగును.]

అవ : అవ్యయీభావము నపుంసకమగుటచే కలుగు ప్రయోజనమును సూచించు నుదాహరణము చూపఁబడుచున్నది.

వృ : గాః పాతీతి గోపాః, తస్మిన్నిత్యధిగోపమ్.

వివ: 'అధి గోపమ్' అను సమాసమునకు లౌకికవిగ్రహవాక్యమువృత్తివాక్యమున ప్రదర్శింపఁబడినది గాః = గోవులను, పాతి = పాలించును; ఇతి = అను వర్థమున 'గోపాః' అను పదమేర్పడును. అతనియందు అనునర్థమున 'అధి గోపమ్' అనుసమాస మేర్పడునని పైవృత్త్యర్థము. అలౌకిక విగ్రహము - 'గోపా + ఙి, అధి' - ఇచట 'అధి' అనునది పూర్వమువలెనే సప్తమ్యర్థకమగు నవ్యయము, 'గోపా + ఙి' అనునది సుబంతము. అవ్యయం విభక్త్యాదిసూత్రముచే సమాససంజ్ఞ. 'అవ్యయీభావః' అను నధికారములోనిదగుటచే అవ్యయీభావమను విశేషసంజ్ఞయు కలుగును. 'అధి' ఉపసర్జనము. అది పూర్వపదమగును. అధి గోపా + ఙి. ప్రాతిపదికసంజ్ఞ, సుప్పునకు లుక్కు 'అధిగోపా'- ఈ దశలో ప్రకృతసూత్రముచే నిది నపుంసకమగుటచే హ్రస్వోనపుంసకేప్రాతిపదికస్య (1-2-47) (నపుంసకలింగమున అజంతమగు ప్రాతిపదికమునకు హ్రస్వము వచ్చును). అనుసూత్రముచే అంత్యదీర్ఘమునకు (అలోఽన్త్యస్య) హ్రస్వము వచ్చును. 'అధిగోప'-దీనికి సుప్పుచేరి 'అవ్యయాదాప్సుపః' అను సూత్రముచే లుక్కు రావలసియున్నది. దాని నిక్రిందిసూత్రము వారించుచున్నది.

అవ : అవ్యయాదాప్సుపః' అనుసూత్రమున కొక యపవాదము చెప్పఁబడుచున్నది.

సూ : నావ్యయీభావాదతోఽమ్ త్వపంచమ్యాః 2-4-83.

వృ : అదన్తాదవ్యయీభావా త్సుపో న లుక్. తస్యపంచమీం వినా అమాదేశః.

ప. వి : న (అవ్య) అవ్యయీభావాత్ (5-1) అతః (5-1) అమ్ (1-1) తు (అవ్య) అ ప ఞ్చమ్యాః (6-1).

అను : సుపః (6-1) లుక్ (1-1).

అర్థ : అదంతమైన అవ్యయీభావమునకు పరముగ నున్న సుప్పునకు లుక్కురాదు. కాని పంచమికాక తక్కినదానికి 'అమ్' అనునాదేశము వచ్చును.

వివ : అవ్యయీభావసమాసము అవ్యయమగుటచే దానికి పరముగ వచ్చిన సుప్పునకు 'అవ్యయాదాప్సుపః' అనుసూత్రముచే లుక్కు రావలసియున్నది. కాని ఆ అవ్యయీభావము అదంతమైనచో దానికి పరముగ నున్న సుప్పునకు లుక్కు రాదనియు, కాని పంచమీవిభక్తి ప్రత్యయములు కాక తక్కిన సుప్పులకు 'అమ్' అనునాదేశము వచ్చుననియు నీ సూత్రము చెప్పుచున్నది. 'అధిహరి' అనునది అదంతము (హ్రస్వ అకారాంతము) కాకపోవుటచే నచట నీసూత్రము చెప్పఁబడ లేదు. ప్రకృతమున 'అధిగోప' అనునది అదంతమైన అవ్యయీభావము. దానికి పరమైన పంచమీతర సుప్పునకు 'అమ్' అనునాదేశము ఈ సూత్రముచే వచ్చును. ఉదా ; అధిగోప + సు - అధిగోప + అమ్. అనియుండ 'అమి పూర్వః' 6-1-107 (అక్వర్ణములకు 'అమ్' అనునది పరమగునపుడు పూర్వపరములస్థానమున పూర్వరూప మేకాదేశమగును) అనుసూత్రముచే పూర్వరూప మేకాదేశము కాఁగా 'అధిగోపమ్' అనియగును. (గోపునియందు).

(2) సమీపార్థకమగు నవ్యయము సుబంతముతో సమసించుట కుదాహరణము చూపఁబడుచున్నది. 'కృష్ణస్యసమీపేన'-కృష్ణుని సమీపముచేత అనునర్థమున నేర్పడు సమాసస్వరూపము ప్రదర్శింపఁబడుచున్నది. కృష్ణ + ఙస్, ఉప. ఇది అలౌకిక విగ్రహము. కృష్ణ+ఙస్ షష్ఠ్యంతము, ఉప అనునది సమీపము అనునర్థముగల అవ్యయము. అవ్యయం విభక్త్యాది సూత్రముచే సమాసము. 'ఉప' అనునది ఉపసర్జనమై పూర్వపదమగును. ఉప, కృష్ణ + ఙస్, విభక్తి లోపము (సుపో ధాతు ప్రాతిపదికయోః) ఉపకృష్ణ, దీనికి తృతీయైకవచనప్రత్యయము 'టా' అనునది చేరి 'ఉపకృష్ణ+టా'అనియుండగా ప్రకృతసూత్రముచే 'టా' ప్రత్యయమునకు అమాదేశము నిత్యముగా ప్రాప్తమగుచుండగా క్రింది సూత్రముచే బహుళముగా నగునని చెప్పఁబడుచున్నది.

సూ ; తృతీయా సప్తమ్యో ర్బహుళమ్ 2-4-84.

వృ ; అదన్తాదవ్యయీ భావాత్ తృతీయాసప్తమ్యోర్బహులమమ్భావః. ఉపకృష్ణమ్, ఉపకృష్ణేన.

ప. వి ః తృతీయాసప్తమ్యోః (6-2), బహులమ్ (1-1).

అను : అతః (5-1) అవ్యయీభావాత్ (5-1).

అర్థ : అదంతమైన అవ్యయీభావమునకు పరముగా నున్న తృతీయాసప్తమీ ప్రత్యయములకు అమాదేశము బహుళముగా నగును.

ఉదా : ఉపకృష్ణమ్, ఉపకృష్ణేన.

వివ : పూర్వసూత్రమున అదంతమైన అవ్యయీభావమునకు పరముగా నున్న పంచమికాక తక్కిన సుప్పునకు అమాదేశము విధింపఁ బడినది. ఆ అమాదేశము తృతీయాసప్తమీ విభక్తులకు బహుళముగా నగునని యీ సూత్రముచే చెప్పఁబడుచున్నది. బహుళమనగా విధింపఁబడినకార్యము కొన్నియెడల నిత్యముగా ప్రవర్తించుట, కొన్నియెడల వైకల్పికముగా ప్రవర్తించుట, కొన్నియెడల ప్రవర్తింపకుండుట, కొన్నియెడల విధింపఁబడని కార్యములును అగుట.

ప్రకృతమున 'ఉపకృష్ణ' అనునది అదంతమైన అవ్యయీభావము. దానికి పరముగనున్న తృతీయైక వచన ప్రత్యయమగు 'టా' అనుదానికి అమాదేశము వచ్చినచో ఉపకృష్ణ + అమ్, పూర్వరూపసంధి అయి, 'ఉపకృష్ణమ్' అగును. అమాదేశమురానిచో ఉపకృష్ణ + టా = 'ఉపకృష్ణేన' అగును. [అదంతప్రాతిపదికమునకు పరముగనున్న టాప్రత్యయమునకు 'ఇన' అనునాదేశము వచ్చును. అందలి ఇకారమునకు, పూర్వమున నున్న అకారమునకును గుణమేకాదేశమగును].

అవ్యయీభావసమాసమునకు చేరిన సుప్పులకు వర్తించుకార్యముల స్వరూపమిట్లుండును.

(1) అది హ్రస్వాకారాంతమైనచో పరముగనున్న ప్రథమా, ద్వితీయా చతుర్థీ, షష్ఠీవిభక్తులకు నిత్యముగా అమాదేశము వచ్చును. (నావ్యయీభావాత్ ....)

(2) తృతీయాసప్తములకు అమాదేశము బహుళము (తృతీయాసప్తమ్యోః)

(3) పంచమికి అమాదేశమురాదు. (నావ్యయీభావాత్ . )

(4) అదంతములు కాని వానికి పరముగనున్న సుప్పునకు లుక్కువచ్చును. (అవ్యయాదాప్సుపః).

వక్ష్యమాణోదాహరణము లన్నింటియందును ఈ నాలుగంశములను జాగ్రతగా పరిశీలింపఁదగును.

(3) సమృద్ధ్యర్థమున వర్తమానమగునవ్యయము సుబంతముతో సమసించుట కుదాహరణము.

వృ మద్రాణాం సమృద్ధిః సు మద్రమ్.

వివ : సమృద్ధి అనగా ఐశ్వర్యము. 'మద్రాణాం సమృద్ధిః' - మద్రదేశము వారియొక్క ఐశ్వర్యము - మద్ర + ఆమ్, సు - సమృద్ధ్యర్థకమగు సు అను నవ్యయము మద్ర + ఆమ్ (షష్ఠీ బహువచనము) అను సుబంతముతో అవ్యయం విభక్త్యాది సూత్రముచే సమసించును. మద్ర + ఆమ్, సు - ఇందు ఉపసర్జనము 'సు'. అది పూర్వపదమగును. ప్రాతిపదికసంజ్ఞ కలిగి విభక్తి లోపించును. సుమద్ర. దీనికి ప్రథమైక వచనమున 'సు' ప్రత్యయము నావ్యయీభావాత్ ఇత్యాదిసూత్రముచే అమాదేశము. పూర్వరూపసంధి సుమద్ర+సు = సుమద్ర + అమ్-సు మద్రమ్.

(4) వ్యృద్ధ్యర్థమున వర్తమానమగు అవ్యయము సుబంతముతో సమసించుట కుదాహరణము.

వృ : యవనానాం వ్యృద్ధిః దుర్యవనమ్.

వివ : వ్యృద్ధి అనగా సంపదలేకపోవుట. విగతాఋద్ధిః = వ్యృద్ధిః. ఆ అర్థమున వర్తమానమగు 'దుర్' అమనవ్యయము 'యవనానామ్' అను షష్ఠ్యంత పదముతో సమసించును. యవన + ఆమ్, దుర్. 'దుర్' అనునది ఉపసర్జనమై పూర్వపదమగును. దుర్, యవన + ఆమ్, విభక్తిలోపము దుర్యవన + సు - అమాదేశము, పూర్వరూపసంధి, దుర్యవనమ్ - యవనుల సంపదలేకపోవుట.

(5) అర్థాభావమున నుదాహరణము.

వృ : మక్షికాణామభావో నిర్మక్షికమ్.

వివ : అర్థాభావమనగా ఒకవస్తువు లేకుండుట. పేర్కొనఁబడిన వస్తువు లేదు అనునర్థమున వర్తమానమగు నిర్ అను అవ్యయము 'మక్షికాణామ్' (ఈగలయొక్క) అను సుబంతముతో అవ్యయం విభక్త్యాది సూత్రముచే సమసించును. 'మక్షికా + ఆమ్, నిర్' - నిర్ అనునది ఉపసర్జనమైన పూర్వపదమగును. విభక్తిలోపము నిర్, మక్షికా, హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య అను

సూత్రముచే హ్రస్వము నిర్మక్షిక + సు, అమాదేశము, పూర్వరూపసంధి, నిర్మక్షికమ్ – (ఈగలు(కూడ) లేకుండ).

(6) అత్యయార్థమున నుదాహరణము.

వృ : హిమస్య అత్యయోఽతిహిమమ్.

వివ : అత్యయమనగా అదృశ్యమగుట, లేక వెడలిపోవుట. ఆయర్థమున వర్తమానమగు 'అతి' అను నవ్యయము 'హిమస్య' అను షష్ఠ్యంతముతో సమసించును. (అవ్యయం విభక్తిత్యాదిసూత్రముచే). హిమ + ఙస్, అతి. అతి ఉపసర్జనము. అతి హిమ + ఙస్, విభక్తిలోపము, అతిహిమ, సుబుత్పత్తి (సువ్వు చేరుట) అతిహిమ + సు, అమాదేశము, పూర్వరూపసంధి. అతిహిమమ్ (మంచు యొక్క పోకడ).

(7) అసంప్రత్యర్థమున నుదాహరణము.

వృ : నిద్రాసంప్రతి న యుజ్యత ఇత్యతినిద్రమ్.

వివ : అసంప్రతి – సంప్రతి అనగా 'ఇప్పుడు'. అసంప్రతి అనగా 'ఇప్పుడు కూడదు' అని యర్థము. ఆ యర్థమున వర్తమానమగు 'అతి' అను నవ్యయము 'నిద్రా' అనుప్రథమాంతముతో అవ్యయం విభక్తిత్యాదిసూత్రముచే సమసించును. నిద్రా + సు, అతి, 'అతి' ఉపసర్జనస్యైః పూర్వపదమగును. అతినిద్రా + సు, విభక్తిలోపము. అతినిద్రా, నపుంసకత్వము (అవ్యయీభావశ్చ) హ్రస్వము (హ్రస్వోనపుంసకే....) అతినిద్ర + సు, అతినిద్ర + అమ్, అతినిద్రమ్ (నిద్రకిది సమయముకాదు).

(8) శబ్దప్రాదుర్భావార్థమున నుదాహరణము

వృ : హరిశబ్దస్య ప్రకాశ ఇతిహరి.

వివ : శబ్దప్రాదుర్భావముగా నొకశబ్దములోకమున వెల్లడియగుట, ఆ అర్థమును జెప్పు 'ఇతి' అనునవ్యయము 'హరిః' అనుసుబంతముతో సమసించును హరి + సు, ఇతి, 'ఇతి' ఉపసర్జనము. ఇతి హరి + సు, విభక్తిలోపము. ఇతి హరి + సు = ఇతిహరి (హరిశబ్దములోకమున ప్రసిద్ధికెక్కినదనిభావము). ఇది అదంతము కాకపోవుటచే అమాదేశమగుటకు ప్రసక్తిలేదు 'అవ్యయాదాప్సుపః' అను సూత్రముచే లుక్కు.

(9) 'పశ్చాత్' అనునర్థమున నుదాహరణము:

వృ : విష్ణోః పశ్చాదనువిష్ణు.

వివ : 'పశ్చాత్' అనగా వెనుక, తరువాత అనిఅర్థము. ఆ యర్థమున వర్తమానమగు 'అను' అనునవ్యయము 'విష్ణు + ఙస్' అనుసుబంతముతో సమసించుచున్నది. విష్ణు+ఙస్ + అను, అవ్యయం విభక్తీత్యాదిసూత్రముచే సమాససంజ్ఞ, 'అను' ఉపసర్జనమగును. పూర్వపదమగును. విభక్తిలోపము అనువిష్ణు + సు, అవ్యయాదాప్సుపః, సులోపము, అనువిష్ణుః. విష్ణునకు తరువాత.

(10) 'యథా' అనునర్థమున నుదాహరణములు. ఈ యథా అనునవ్యయమునకే యే అర్థములుగలవో తెలుపుచున్నారు.

వృ : యోగ్యతా వీప్సా పదార్థానతివృత్తి సాదృశ్యాని యథార్థాః. రూపస్య యోగ్యమనురూపమ్. అర్థమర్థం ప్రతి ప్రత్యర్థమ్. శక్తిమనతిక్రమ్య యథాశక్తి.

వివ : 'యథా' అనునవ్యయమునకు నాలుగర్థములు గలవు (1) యోగ్యత. తగియుండుట (2) వీప్స – విశేషించి అన్నిటిని పొందవలయు ననుకోరిక (3) ఒకపదార్థము నతిక్రమింపకుండుట (4) సాదృశ్యము. ఈ నాలుగర్థములలో వర్తమానములగు నవ్యయములు సుబంతముతో అవ్యయమిత్యాది సూత్రముచే సమసించును

(i) యోగ్యత – రూపస్యయోగ్యమ్ – రూపమునకు యోగ్యమైనది. రూప + ఙస్, అను, సమాసము, అనుశబ్దమున కుపసర్జనత్వము, పూర్వప్రయోగము, విభక్తిలోపము. అనురూప + సు, 'నావ్యయీభావాదతోఽమ్ త్వపఞ్చమ్యాః' అనుసూత్రముచే 'అమ్' ఆదేశము, పూర్వరూపసంధి, అనురూపమ్.

(ii) వీప్సార్థమున వర్తించు 'ప్రతి' అనునవ్యయము సుబంతముతో అవ్యయ మిత్యాది సూత్రముచే సమసించును. 'అర్థమర్థం ప్రతి'–వీప్స యున్నపుడు పదము ద్విరుక్తమగును (నిత్యవీప్సయోః) అర్థ + అమ్, ప్రతి, సమాసము, ఉపసర్జనత్వము, పూర్వ ప్రయోగము, విభక్తిలోపము, ప్రతి+అర్థ, యణాదేశ సంధి, ప్రత్యర్థ+సు, అమాదేశము, ప్రత్యర్థమ్.

(iii) పదార్థము నతిక్రమింపకుండుట యనునర్థమున వర్తమానమగు 'యథా' అనునవ్యయము సుబంతముతో అవ్యయమిత్యాదిసూత్రముచే సమసించును. శక్తిమ్ అనతిక్రమ్య – శక్తి నతిక్రమింపక–, శక్తి+అమ్, యథా, యథాశక్తి + సు–అవ్యయాదాప్సుపః యథాశక్తి.

(iv) సాదృశ్యార్థమున వర్తమానమగు 'సహ' అనునవ్యయము 'హరేః' అను సుబంతముతో 'అవ్యయం విభక్తీ'త్యాది సూత్రముచే సమసించును. హరేః సాదృశ్యమ్ - హరియొక్క పోలిక, హరి + ఙస్, సహ, సమాసము, ఉపసర్జన సంజ్ఞ, పూర్వపదప్రయోగము, ప్రాతిపదికత్వము, విభక్తిలోపము కలిగి, 'సహ + హరి' అనియుండును.

అవ : పై యుదాహరణమువంటివానిలో 'సహ' అనునవ్యయమునకు 'స' అనునాదేశము నీక్రిందిసూత్రము విధించుచున్నది.

సూ : అవ్యయీభావే చాకాలే 6-3-81.

వృ : సహస్య సః స్యాదవ్యయీభావే నతు కాలే. హరేః సాదృశ్యం సహరి.

ప వి : అవ్యయీభావే (7-1) చ (అవ్య) అకాలే (7-1).

అను : సహస్య (6-1) సః (1-1).

అర్థ : అవ్యయీభావసమాసమున 'సహ' అనునవ్యయమునకు 'స' అనునాదేశము వచ్చును. కాలవాచకశబ్దము పరమగునపు డీయాదేశమురాదు. ఉదా : సహరి.

వివ : అవ్యయీభావసమాసమున 'సహ' అనునవ్యయముయొక్క స్థానమున 'స' అను ఆదేశము వచ్చును. ఇది అనేకవర్ణములు కల ఆదేశమగుటచే (స్+అ= రెండువర్ణములు) 'సహ' అనుదానిని పూర్తిగా తొలగించి వచ్చును. కాలవాచక శబ్దములగు 'పూర్వాహ్ణమ్' మున్నగునవి పరములగునపుడు ఈయాదేశము రాదని 'అకాలే' అనుపదము తెలుపుచున్నది. సహ+హరి-సహరి+సు, 'అవ్యయాదాప్సుపః' అనుసూత్రముచే విభక్తిలోపము-సహరి.

యథాశబ్దమునకుఁగల నాలుగర్థములయందు నుదాహరణములు చూపఁబడినవి.

(11) ఆనుపూర్వ్యము అనునర్థమున నుదాహరణము.

వృ : జ్యేష్ఠస్య అనుపూర్వ్యేణ ఇత్యనుజ్యేష్ఠమ్.

వివ : ఆనుపూర్వ్యమనగా పూర్వుని అనుసరించుట అనగా పెద్దవానినుండి చిన్నవానివఱకు నొక క్రమమును పాటించుట అనిభావము. ఆ అర్థమున వర్తమానమగు 'అను' అను నవ్యయము జ్యేష్ఠస్య అను షష్ఠ్యంతపదముతో సమసిం

చును. జ్యేష్ఠ+ఙస్, అను, అనుశబ్ద ముపసర్జనము. అది పూర్వపదమగును (సమాసము అవ్యయం విభక్తీత్యాది సూత్రముచే) అనుజ్యేష్ఠ+సు=అనుజ్యేష్ఠమ్ (అమాదేశము, పూర్వరూపసంధి). పెద్దవానిక్రమము ననుసరించుట.

(12) యౌగపద్యార్థమున ◌ నుదాహ రణము.

వృ : చక్రేణ యుగపత్ స చక్రమ్.

వివ : యౌగపద్యమనగా రెండుకార్యము లేకకాలమున జరుగుట. ఆ యర్థమున వర్తమానమగు 'సహ' అనునవ్యయము 'చక్రేణ' అనుపదముతో అవ్యయం విభక్తీత్యాది సూత్రముచే సమాసమగును. చక్ర + టా, సహ, సహ, చక్ర+టా, విభక్తిలోపము, సహశబ్దమునకు సాదేశము, సచక్ర + సు సచక్రమ్ (చక్రముతోపాటు).

(13) సాదృశ్యార్థమున నుదాహరణము.

వృ : సదృశస్సఖ్యా ససఖి - యథార్థత్వేనైవసిద్ధేపునస్సాదృశ్యగ్రహణాద్గుణభూతేఽపిసాదృశ్యే సమాసః.

అర్థ : సదృశః సఖ్యాససఖి - యథాశబ్దముయొక్క అర్థమగుటవలననే యీ సమాసము సిద్ధించుచుండగా మఱల సాదృశ్యపదమును సూత్రమున గ్రహించుట వలన సాదృశ్యము గుణభూతమైనపుడును సమాసమగునని తెలుపఁబడినది.

వివ : సదృశుఁడు అనగా సమానుఁడు, అతనిభావము సాదృశ్యము. ఆ యర్థమున వర్తమానమగు 'సహ' అనునవ్యయము 'సఖ్యా అను తృతీయాంతపదముతో నవ్యయమిత్యాది సూత్రముచే సమసించును. సదృశఃసఖ్యా, సహ, సఖి +టా, విభక్తిలోపము, సహసఖి, సహశబ్దమునకు సాదేశము, ససఖి + సు=ససఖి- మిత్రునితో సదృశుఁడు

ఇంతకుముందు యథాశబ్దమునకు సాదృశ్యమనునర్థముగలదని చెప్పఁబడినది. అట్టియెడ 'యథా' అనుశబ్దమును గ్రహించుటవలననే సాదృశ్యార్థమున సమాసము సిద్ధించుచుండగా మఱల సూత్రమున సాదృశ్యపదమును గ్రహింపనేల? అనగా సాదృశ్యము సూటిగాఁగాక మఱియొక విధముగా తెలుపఁబడునపుడును సమాసమగుట కొఱకని సమాధానము చెప్పఁబడినది. ఇచట 'సదృశుఁడు' అనునర్థమున సమాసము చేసితిమి. సాదృశ్యము తెలియఁబడుచున్నది కాని సూటిగా వాక్యమునలేదు. హరేః సాదృశ్యమ్-హరియొక్క పోలిక అన్నట్లులేదని తాత్పర్యము.

(14) సంపత్త్యర్థమున నుదాహరణము.

వృ : క్షత్రాణాం సంపత్తిః సక్షత్త్రమ్.

వివ : సంపత్తి యనగా తనకు అనురూపమైన కర్మము అనునర్థమిట గ్రహింపవలయును. ఆ యర్థమున వర్తమానమగు నవ్యయము 'సహ' అనునవ్యయము క్షత్రాణామ్ అను షష్ఠ్యంతపదముతో అవ్యయం విభక్తీత్యాదిసూత్రముచే సమసించును. క్షత్ర + ఆమ్, సహ, సమాసము, ఉపసర్జనత్వము (సహ అను దానికి), పూర్వపదమగుట, సహ, క్షత్ర+ఆమ్, విభక్తిలోపము (సుపోధాతు....) సహక్షత్త్ర, సాదేశము, సక్షత్త్ర + సు, అమాదేశము, పూర్వరూపసంధి. సక్షత్త్రమ్. క్షత్త్రియుల కనుగుణమగు కర్మము (ఇచట సంపత్తి అనగా ఐశ్వర్యమనునర్థము గ్రహింపరాదు. ఆ అర్థము 'సమృద్ధి' అనుపదముతో గతార్థమగును).

(15) సాకల్యము అనునర్థమున ఉదాహరణము.

వృ : తృణమప్యరిత్యజ్య సతృణమత్తి.

వివ : సకలముయొక్క భావము సాకల్యము. ఏకొంచెమును వదలిపెట్టక అని భావము. తృణమప్యరిత్యజ్య అత్తి-గడ్డిపఱకనుకూడ వదలక తినుచున్నాఁడు అనునర్థమున సాకల్యార్థకమగు 'సహ' అను నవ్యయము 'తృణేన' అను తృతీయాంతముతో సమసించును. తృణ + టా, సహ, అవ్యయమిత్యాది సూత్రముచే సమాసము, సహాశబ్దమునకు పూర్వప్రయోగము. విభక్తిలోపము, సాదేశము సతృణ + సు = సతృణమ్.

(16) అంతవచనార్థమున నుదాహరణము.

వృ : అగ్ని గ్రన్థ పర్యంత మధీతే సాగ్ని.

వివ : అంతమనగా 'చివఱ' ఆ అర్థమున వర్తమానమగు 'సహ' అను నవ్యయము 'అగ్నిమ్' అను ద్వితీయాంతపదముతో అవ్యయమిత్యాదిసూత్రముచే సమసించును. (అగ్నిగ్రన్థపర్యంత మధీతే = అగ్ని అనునదియొక గ్రంథము - ఆ గ్రంథమువఱకు చదువుచున్నాఁడు). అగ్ని + అమ్ + సహ, సమాసము, సహ శబ్దమునకు ఉపసర్జనత్వము పూర్వప్రయోగము, సాదేశము(అవ్యయీ భావేచాకాలే) స + అగ్ని + అమ్ విభక్తిలోపము, స + అగ్ని, సవర్ణదీర్ఘ సంధి, సాగ్ని + సు, అవ్యయాదాప్సుః, సులోపము సాగ్ని.

అవ్యయం విభక్తిఇత్యాది సూత్రములోని వివిధములైన అర్థములకు ఉదాహరణములు చూపఁబడినవి. 'అధిహరి' మొదలుకొని 'సాగ్ని' వఱకు చెప్పఁబడిన

ఈ యుదాహరణములన్నింటియందును సమాసవిధాయక సూత్రము అదియొక్కటియే. తక్కిన సూత్రములన్నియు నాయాకార్యవిశేషములను తెలుపునవి. ఈయన్నియుదాహరణములందును ప్రక్రియాదర్శనమునకై పరినిష్ఠితసమాసరూపములకు ప్రథమావిభక్త్యేకవచనప్రత్యయము చేర్చి, దానికి లోపమో, అమాదేశమో చేయఁబడినది. ప్రకరణమునుబట్టి తదితరవిభక్తులును చేరవచ్చును.

వృ : విభాషేత్యధికృత్య.

వివ : ఇటుపై చెప్పఁబడు సూత్రములందు 'విభాషా' అను పదమధికారరూపమునఁ జేరును. అనగా నిటుపై విధింపఁబడుసమాసములన్నియు వైకల్పికసమాసములని భావము.

సూ : నదీభిశ్చ 2-1-20.

వృ : నదీభి స్సహ సంఖ్యావా సమస్యతే. సమాహారే చాయమిష్యతే. పఞ్చగఙ్గమ్, ద్వియమునమ్.

ప. వి : నదీభిః (3-3) చ (అవ్య).

అను : సమాసః (1-1) అవ్యయీభావః (1-1) విభాషా (1-1) సంఖ్యా (1-1).

అర్థ : సంఖ్యావాచకము నదీవాచకములతోఁ గూడి వైకల్పికముగా అవ్యయీభావసమాసమగును. ఇదిసమాహారార్థమున నగుటయు నిష్టము. ఉదా : పంచగంగమ్, ద్వియమునమ్.

వివ : 'నదీభిః' అని బహువచనాంతమగుటవలన నదులను తెలుపు పదములతో నీ సమాస మేర్పడునను నర్థమేర్పడును గాని 'నదీ' అను పదముతో సమాసమగునని యర్థముకాదు. సంఖ్యావాచకపదము, నదీవిశేషవాచకములగు గంగాయున్నగుపదములతో కూడి అవ్యయీభావసమాస మగును. ఇట్లు సమాసమగుట వైకల్పికము. సమాహారము = సముదాయము అనునర్థమునందును నిది అవ్యయీభావమే యగును గాని వక్ష్యమాణలక్షణముచే ద్విగువుకాదు. ఇందు సంఖ్యా అనునది ప్రథమానిర్దిష్టము. కావున సంఖ్యావాచకపద మీ సమాసమున పూర్వపదమగును.

ఉదా : పఞ్చానాం గఙ్గానాం సమాహారః (అయిదుగంగలసమూహము). లౌకికవిగ్రహము. పఞ్చన్ + ఆమ్, గఙ్గా+ఆమ్, ఈ సూత్రముచే సమాససంజ్ఞ,

ప్రాతిపదికత్వము, సుప్పులగు, అమ్, అమ్ అనువానికి లుక్కు. 'పఞ్చన్,గంగా' అనియుండ నలోపః ప్రాతిపదికాన్తస్య (8-2-7) (ప్రాతిపదికసంజ్ఞగల పదము యొక్క అంతమున నున్న నకారమునకు లోపము వచ్చును.) అనుసూత్రముచే 'పఞ్చన్' శబ్దములోని నకారమునకు లోపము. 'పఞ్చగఙ్గా' - ఈ సూత్రము అవ్యయీభావాధికారములోనిది గావున అవ్యయీభావమగుటచే నపుంసకమగును. అపుడు 'హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య' అనుసూత్రముచే హ్రస్వము. పఞ్చ గంగ + సు, నావ్యయీభావాదతోఽమ్త్వపఞ్చమ్యాః అనుసూత్రముచే అమా దేశము. పంచ గంగ + అమ్, పంచగంగమ్-ఇచట శబ్దము సమూహమును జెప్పు చున్నది కావున ఏకవచనము.

ఇట్లే ద్వయోర్యమునయోస్సమాహారః-రెండుయమునలసమాహారము. ద్వి + ఓస్, యమునా + ఓస్, సమాసము, ప్రాతిపదికత్వము, విభక్తిలోపము ద్వి యమునా, హ్రస్వము, ద్వియమున + సు=ద్వియమున + అమ్=ద్వియమునమ్. (ఇవిరెండును పూర్వపదార్థప్రధానములు కాని అవ్యయీభావములు).

అవ : కొన్ని సమాసములకు అంతభాగమున కొన్ని ప్రత్యయములు చేరును. వానిని సమాసాంతప్రత్యయము లందురు. అవ్యయీభావసమాసములకు చేరఁదగిన సమాసాంతప్రత్యయములు చెప్పఁబడుచున్నవి. ఈ సమాసాంతప్రత్యయములు తద్ధితాధికారములోనివి. కావున తద్ధితాధికారసూత్ర మిట చెప్పఁబడు చున్నది.

సూ : తద్ధితాః 4-1-76.

వృ : ఆపఞ్చమసమాప్తే రధికారోఽయమ్.

ప. వి : తద్ధితాః (1-3).

అర్థ : పంచమాధ్యాయము తుదివఱకు నిది యధికారము.

వివ : 4-1-77 నుండి అయిదవ అధ్యాయము తుదివఱకుగల సూత్రము లందు 'తద్ధితాః' అనుపదము అధికారరూపమున చేరును. అనగా నీ సూత్రము నుండి అయిదవ అధ్యాయము తుదివఱకు విధింపఁబడిన ప్రత్యయములు తద్ధితము లని భావము.

అవ : సమాసాంత ప్రత్యయములు విధింపఁబడుచున్నవి.

సూ : అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః 5-4-107.

వృ : శరదాదిభ్యష్టచ్ స్యాత్సమాసాన్తోఽవ్యయీభావే. శరద స్సమీప ముపశరదమ్, ప్రతివిపాశమ్, 'జరాయాజరస్ చ'. ఉపజరసమ్, ఇత్యాది.

ప. వి : అవ్యయీభావే (7-1) శరత్ప్రభృతిభ్యః (5-3).

అను: తద్ధితాః (1-3) సమాసాన్తాః (1-3) టచ్. (1-1). ప్రత్యయః (1-1)

అర్థ : అవ్యయీభావమున శరద్ మున్నగుపదములకు 'టచ్' అను సమాసాంత తద్ధిత ప్రత్యయము చేరును. ఉదా : శరదస్సమీపము శరదమ్, ప్రతివిపాశమ్, జరాశబ్దమునకు 'జరస్' అను నాదేశముకూడ వచ్చును. ఉపజరసమ్ మొ॥వి.

వివ : ఈ సూత్రములోనికి అనువృత్తములైన సమాసాంతాః, తద్ధితా అనునవి ఏకవచనాంతములుగా మాఱి 'టచ్' అనుప్రత్యయమునకు విశేషణములై 'సమాసముయొక్క అంతమున చేరు తద్ధితసంజ్ఞగల 'టచ్' ప్రత్యయముః అనునర్థము నిచ్చును. అవ్యయీభావమను పేరుగల సమాసమున ఉత్తరపదములగు 'శరద్' మున్నగు పదములకు అంతభాగమున 'టచ్' అను తద్ధితప్రత్యయము చేరునని సూత్రతాత్పర్యము. ఇందు టకారచకారము లిత్తులు. (చుటూ, హలన్త్యమ్) వానికి లోపమగును. ప్రత్యయస్వరూపము-'అ'.

ఉదా : శరదః సమీపమ్. (శరత్తుయొక్క సమీపము), శరద్ + జస్ ఉప, ఉప అనునది సమీపార్థకమగు అవ్యయము. 'అవ్యయం విభక్తి' ఇత్యాది సూత్రముచే సమాససంజ్ఞ, అది అవ్యయీభావాధికారములోనిది కాన అవ్యయీభావసంజ్ఞయు కలుగును. 'ఉప' ఉపసర్జనము, పూర్వపదమగును, ఉప, శరద్ + జస్, సమాసము ప్రాతిపదికమగును, సుప్పునకు (జస్ అను షష్ఠ్యేక వచన ప్రత్యయమునకు) లుక్కు. 'ఉపశరద్' ఇది అవ్యయీభావమగుటచే దీనియందు 'శరద్' అను పదముండుటచే ప్రకృతసూత్రముచే 'టచ్' ప్రత్యయము. ఉపశరద్ + టచ్, ఉపశరద్ + అ = ఉపశరద + సు = ఉపశరద + అమ్ = ఉపశరదమ్.

ఇట్లే, విపాశః అభిముఖమ్ (విపాశయనునదికి ఎదురుగా) అను నర్థమున విపాశ్ + జస్, ప్రతి, ప్రక్రియపూర్వమువలెనే, ప్రతి విపాశ్ + టచ్, టకారచకారములిత్తులు. ప్రతివిపాశ్ + అ = ప్రతివిపాశ + సు = ప్రతివిపాశ + అమ్ = ప్రతివిపాశమ్.

'జరాయాజరస్ చ' అనునది గణసూత్రము. కొన్నిశబ్దముల సముదాయమును పేర్కొనుచు అందు ఏదేనొకశబ్దమునకు ఒక ప్రత్యేకమైన కార్యమును విధించు సూత్రమును గణసూత్రమందురు. (గణమునందలి సూత్రము). ప్రకృత గణసూత్రము అవ్యయీభావమున 'జరా' శబ్దమునకు 'టచ్' అనుసమాసాంతతద్ధిత ప్రత్యయము చేరునపుడు 'జరస్' అనునాదేశము కూడ వచ్చునని తెలుపుచున్నది. 'జరాయాః సమీపమ్' ముదిమికి దగ్గఱ, జరా + ఙస్, ఉప, ఉపజరా, జరస్ ఆదేశము, ఉపజరస్ + టచ్ = ఉపజరస్ + అ = ఉపజరస+సు, ఉపజరస + అమ్ (నావ్యయీభావాదతోఽమ్త్వపఞ్చమ్యాః) ఉపజరసమ్.

శరదాదిగణము : శరద్ విపాశ్ అనస్ మనస్ ఉపానహ్ అనడుహ్ దివ్ః హిమవత్ హిరుక్ విద్ సద్ దిశ్ దృశ్ విశ్ చతుర్ త్యద్ తద్ యద్ కియత్. 'జరాయాజరస్ చ' 'ప్రతిపరసమనుభ్యోఽక్ష్ణః' పథిన్ ఇతి శరదాదిః.

సూ : అనశ్చ 5-4-108

వృ : అన్నన్తా దవ్యయీభావాట్టచ్.

ప. వి. : అనః (5-1) చ (అవ్య)

అను : అవ్యయీభావే (7-1) తద్ధితాః (1-3) సమాసాన్తాః (1-3) ప్రత్యయః (1-1) టచ్ (1-1).

అర్థ : అన్నంతమైన అవ్యయీభావమునకు 'టచ్' ప్రత్యయముచేరును.

వివ ; ఇందు 'అనః' అనునది 'అన్' అనుదాని పంచమ్యేకవచనరూపము. అనువృత్తమైన 'అవ్యయీభావే' అనుసప్తమ్యంతమును 'అవ్యయీభావాత్' అని పంచమ్యంతముగా మార్చుకొనవలయును. 'అనః' అనునది విశేషణమగుటచే తదంత విధిచే 'అన్నంతాత్' అనునర్థమువచ్చును. 'అన్' అనునది అంతమునఁగలఅవ్యయీభావసమాసమునకు 'టచ్' అను తద్ధిత ప్రత్యయము చేరును.

ఉదా : రాజ్ఞః సమీపమ్-రాజుయొక్క సమీపము అనునర్థమున సమీపార్థకమగు 'ఉప' అనునవ్యయము 'రాజన్ + ఙస్' అనుషష్ఠ్యంతముతో అవ్యయం విభక్త్యాదిసూత్రముచే సమసించును. రాజన్ + ఙస్, ఉప, ఉపరాజన్ ... చివరిభాగమున 'అన్' అనునదికలదు కావున ప్రకృతసూత్రముచే దీనికి 'టచ్' అను సమాసాంత తద్ధితప్రత్యయము చేరును ఉపరాజన్ + టచ్ ... టకారచకారము లిత్తులు. 'ఉపరాజన్ + అ'. ఇట్లే ఆత్మని = ఆత్మయందు అనునర్థమున విభక్త్యర్థకమగు 'అధి' అనునవ్యయము 'ఆత్మన్ + ఙి' అనుసుబంతముతో సమసించును. ఆత్మన్ + ఙి, అధి, అధ్యాత్మన్ + టచ్, అధ్యాత్మన్ + అ. అనిక్ాఁగా....

అవ : పైదశలో నగుకార్యవిశేషమొకటి చెప్పఁబడుచున్నది.

సూ : నస్తద్ధితే 6-4-144.

వృ : నాన్తస్య భస్య టేర్లోపః తద్ధితే. ఉపరాజమ్, అధ్యాత్మమ్.

ప. వి : నః (6 1) తద్ధితే (7-1).

అను : భస్య (6-1) లోపః (1-1) టేః (6-1).

అర్థ : నకారాంతమగు భముయొక్క టి భాగమునకు, తద్ధితప్రత్యయము పరమగునపుడు, లోపము వచ్చును. ఉదా : ఉపరాజమ్, అధ్యాత్మమ్.

వివ : నః అను షష్ఠ్యంతపదము అనువృత్తమైన 'భస్య' అనుదానికి విశేషణము. తదంతవిధిచే 'నకారాంతమైన భసంజ్ఞకముయొక్క' అనునర్థమేర్పడును. యకారాదిగాని అజాదిగాని అయిన స్వాదిప్రత్యయములు పరములగునపుడు పూర్వమున నున్నదానికి భసంజ్ఞ కలుగును (యచిభమ్ 1-4-18)టి అనగా శబ్దస్వరూపము యొక్క తుదిఅచ్చు మొదలుగాఁగలవర్ణములసముదాయము. నకారము అంతమునగల భసంజ్ఞకముయొక్క టిభాగమునకు తద్ధితప్రత్యయము పరమైనయెడల, లోపము కలుగును.

ఉదా : ఉపరాజన్ + అ, అధ్యాత్మన్ + అ-ఇందు 'అ' అనునది తద్ధితప్రత్యయము. 'తద్ధితాః' అనునధికారములోనిది ఉపరాజన్, అధ్యాత్మన్ అనునవి నాంతములైన భసంజ్ఞకములు. అందలి టి భాగమునకు (అన్) లోపము వచ్చును. ఉపరాజ్ + అ = ఉపరాజ, అధ్యాత్మ్ + అ = అధ్యాత్మ, వీనికి చేరిన సువ్వునకు అమాదేశమగును. పూర్వరూపసంధిచే ఉపరాజమ్, అధ్యాత్మమ్ అనురూపము లగును.

అవ : అనశ్చ అను సూత్రమునకొక సవరణము చేయఁబడుచున్నది.

సూ : నపుంసకాదన్యతరస్యామ్ 5-4-109.

వృ : అన్నంతం యత్ క్లీబం తదన్తాదవ్యయీభావాత్ టజ్వా. ఉపచర్మమ్, ఉపచర్మ.

ప. వి : నపుంసకాత్ (5-1) అన్యతరస్యామ్ (అవ్య).

అను : అనః (5-1) అవ్యయీభావే (7-1) టచ్ (1-1) సమాసాంతాః (1-3) తద్ధితాః (1-3).

అర్థ : అన్నంతమగు నపుంసకలింగశబ్దమంతమునఁగల అవ్యయీభావము నకు అంతమున 'టచ్' అను తద్ధితప్రత్యయము వైకల్పికముగా నగును. ఉదా : ఉపచర్మమ్, ఉపచర్మ.

వివ : అనః అనునది 'నపుంసకాత్' అనుపదమునకు విశేషణము. తదంత విధిచే 'అన్నంతమైన నపుంసకలింగమునకు' అనునర్థము కలుగును. నపుంసకాత్ అనునది పంచమిగా మార్చుకొనుటచే నయిన 'అవ్యయీభావాత్' అనుదానికి విశేష ణము. కావున 'అన్నంతమైన నపుంసకలింగశబ్దము అంతమునఁగల అవ్యయీభావ మునకు' అనునర్థము తదంత విధిచే సిద్ధించును. అట్టిదానికి 'టచ్' అను ప్రత్య యము వైకల్పికముగా చేరును.

ఉదా : చర్మణః సమీపమ్-చర్మమునకుదగ్గఱ, 'ఉప' అనునది సమీపార్థక మగు నవ్యయము. అది 'చర్మన్+ఙస్' అనుషష్ఠ్యంతపదముతో సమసించును. చర్మన్, ఙస్, ఉప సమాసము, (అవ్యయం విభక్తి ) 'ఉప' అనునది ఉపసర్జ నమై పూర్వపదమగును. 'ఉపచర్మన్ ఙస్, ప్రాతిపదికసంజ్ఞకలిగి సుప్పునకు లుక్కువచ్చును. ఉపచర్మన్ ఇందు 'చర్మన్' శబ్దము అన్నంతమైన నపుంసక లింగము. కావున నీ అవ్యయీభావమునకు 'టచ్' ప్రత్యయము వచ్చినచో ఉప చర్మన్ + టచ్, ఉపచర్మన్ + అ, నస్తద్ధితే-టిలోపము, ఉపచర్మ్ + అ=ఉపచర్మ + సు, అమాదేశము, ఉపచర్మమ్ అగును.

రానిపక్షమున ఉపచర్మన్ + సు 'అవ్యయాదాప్సుపః' అనుసూత్రముచే సులోపము. ఉపచర్మన్, 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే నకార లోపము. ఉపచర్మ.

సూ : ఝయః 5-4 111.

వృ : ఝయన్తాదవ్యయీభావాట్టజ్వాస్యాత్. ఉపసమిధమ్, ఉపసమిత్.

ప. వి : ఝయః (5-1).

అను : అవ్యయీభావే (7-1) టచ్ (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3) అన్యతరస్యామ్ (అవ్య).

అర్థ : ఝయంతమగు అవ్యయీభావమునకు 'టచ్' ప్రత్యయము వైకల్పిక ముగా వచ్చును. ఉదా : ఉపసమిధమ్, ఉపసమిత్.

వివ : 'ఝయ్' ప్రత్యాహారముచే అనునాసికములు కాకతక్కిన వర్గాక్షరములు చెప్పఁబడును. అవి యంతమునఁ గల అవ్యయీభావసమాసమునకు 'టచ్' అను తద్ధిత ప్రత్యయము వైకల్పికముగా చేరును.

ఉదా : సమిధః సమీపమ్, 'సమిధయొక్క సమీపము' అనునర్థమున సమీపార్థకమగు 'ఉప' అనునవ్యయము 'సమిధః' అనుషష్ఠ్యంతముతో సమసించును. సమిధ్ + జస్, ఉప, ఉపసమిధ్ + జస్, ప్రాతిపదికత్వము. సుప్పునకు లుక్కు. 'ఉపసమిధ్'- ఇది ఝయ్వర్ణమంతమునఁగల అవ్యయీభావము.కావున 'టచ్' ప్రత్యయము వచ్చినచో ఉపసమిధ్ + టచ్, ఉపసమిధ్ + అ = ఉపసమిధ + సు, అమాదేశము, ఉపసమిధమ్.

టచ్ ప్రత్యయము రానిచో ఉపసమిధ్ + సు- 'అవ్యయాదాప్సుపః' అనుసూత్రముచే విభక్తిప్రత్యయమునకు లుక్కువచ్చును. ధకారమునకు 'ఝలాంజశోఽన్తే' అనుసూత్రముచే జశ్త్వము దానికి 'వావసానే' అనుసూత్రముచే వైకల్పికముగా చర్త్వము ఉపసమిత్. (వావసానే 8-4-56 అవసానమున ఝల్లులకు చర్రులు వైకల్పికముగా నగును).

ఇది యవ్యయీభావసమాస ప్రకరణము.

## ప్రకరణావలోకనము.

ఇందు సమాసమును విధించుసూత్రములు రెండుసూత్రమే చెప్పఁబడినని. (1) అవ్యయం విభక్తి (2)నదీభిశ్చ- అవ్యయీభావః అనునది అధికారసూత్రము అది యీప్రకరణమునందలి సమాసములకు అవ్యయీభావసంజ్ఞను గలుగఁజేయును. ప్రథమానిర్దిష్టం సమాసఉపసర్జనమ్, ఉపసర్జనం పూర్వమ్అనుసూత్రములు రెండును పూర్వపదనిర్ణయమునుజేయును. నావ్యయీభావాత్ , తృతీయాసప్తమ్యోర్బహుళమ్ అనుసూత్రములు అవ్యయీభావమునకు పరముగా చేరినవిభక్తి ప్రత్యయములకు కలుగు కార్యవిశేషములను దెలుపును. అవ్యయీభావేచాకాలే అనునది 'సహ' అనునవ్యయమునకు సాదేశమును విధించినది అవ్యయీభావేశరత్ప్రభృతిభ్యః, అనశ్చ, నపుంసకాదన్యతరస్యామ్, ఝయః అనుసూత్రములు సమాసాంతప్రత్యయములను విధించును. 'తద్ధితాః' అనునది వానికి సంబంధించిన యధికారసూత్రము. 'నస్తద్ధితే' అనునది అన్నంతములకు తద్ధితప్రత్యయములు పరములగునపుడగు కార్యవిశేషమును తెలుపును.

# అథ తత్పురుష సమాస ప్రకరణమ్

అవ : అయిదువిధములైన ప్రధానసమాసభేదములలో తత్పురుషము మూడవది. ఇందు సాధారణముగా ఉత్తరపదముయొక్క అర్థమునకు ప్రాధాన్యముండును. ఇందనేక అవాంతరవిభాగములు కలవు. ఈ ప్రకరణమున నవియన్నియు చెప్పఁబడుచున్నవి. అవ్యయీభావసమాసము అవ్యయమగుటచే పరివిష్ఠితరూపమే లింగమగునను విచారణకు తావులేదు. ఇందదియు (లింగవిచారణమును) నావశ్యకమగును. సమాసాంతప్రత్యయవిధానము దీనికిని యథాసంభవముగ కలదు. ఈ విషయములన్నియు నిందు చర్చింపఁబడుచున్నవి. తత్పురుషసమాసమునకు సంబంధించిన విషయములను నిరూపించు ప్రకరణమగుటచే నిది తత్పురుషసమాసప్రకరణమనఁబడుచున్నది.

అవ : ఒక అధికారసూత్రము చెప్పఁబడుచున్నది.

సూ : తత్పురుషః 2-1-22.

వృ : అధికారోఽయమ్. ప్రాగ్బహువ్రీహేః.

ప. వి : తత్పురుషః (1-1).

అర్థ : 'తత్పురుషః' అను నీపదము బహువ్రీహికి పూర్వమువఱకు అధికారము.

వివ : ఈ సూత్రమునకు పూర్వసూత్రమువఱకు 'అవ్యయీభావః' అనునది అధికారము. ఇటనుండి 'శేషోబహువ్రీహిః' 2-2-23 అనుసూత్రమునకు పూర్వమువఱకు 'తత్పురుషః' అనుపదమధికారమగును. అనగా 2-1-22 నుండి 2-2-22 వఱకు నున్న సూత్రములచే నేర్పడు సమాసములకు తత్పురుషమను విశేషసంజ్ఞ కలుగునని సూత్రతాత్పర్యము.

సూ : ద్విగుశ్చ 2-1-23.

వృ : తత్పురుషసంజ్ఞకః.

ప. వి : ద్విగుః (1-1) చ (అవ్య).

అర్థ : ద్విగువుకూడ తత్పురుషసంజ్ఞకమే.

వివ : 2-1-53 వ సూత్రము 'సంఖ్యాపూర్వోద్విగుః' అనునది ఒకలక్షణముగల సమాసమునకు ద్విగువను పేరుపెట్టుచున్నది. అది విశేషసంజ్ఞ యగుటచే

త్పురుషసంజ్ఞను తొలగించును. కావున ద్విగువను సంజ్ఞకలసమాసమునకు తత్పురుషసంజ్ఞ లేకుండుట సంభవించును. అది యిష్టము కాదు. కావున నీ సూత్రముచే ద్విగువను విశేషసంజ్ఞకల సమాసము కూడ తత్పురుషసంజ్ఞక మగునని చెప్పఁబడినది.

అవ : అందు మొదట వ్యధికరణసమాసము చెప్పఁబడుచున్నది. వ్యధికరణ సమాసమనగా ద్వితీయాంతాదిపదములు మీఁది పదములతో సమసించుట. ద్వితీయా సమాసము ఈ క్రింది సూత్రముచే విధింపఁబడుచున్నది.

సూ : ద్వితీయా శ్రితాతీత పతితగతాత్యస్తప్రాప్తాపన్నైః 2-1-24.

వృ : ద్వితీయాన్తం శ్రితాది ప్రకృతికైః సుబన్తైస్సహ వా సమస్యతే. కృష్ణం శ్రితః, కృష్ణశ్రితః ఇత్యాది.

ప. వి : ద్వితీయా (1-1) శ్రితా.... పన్నైః (3-3).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : ద్వితీయాంతపదము శ్రితమున్నగునవి ప్రకృతులుగా గల సుబంతము లతో వైకల్పికముగా సమసించును. అది తత్పురుషమగును.

వివ : 'ద్వితీయా' అనునది ప్రత్యయమును బోధించునది కావున ప్రత్యయ మును గ్రహించునపుడు తదంతముకూడ గ్రహింపబడునను న్యాయము ననుసరించి 'ద్వితీయాంతపదము' అనునర్థ మేర్పడును. అది, శ్రిత, అతీత, పతిత, గత, అత్యస్త, ప్రాప్త, అపన్న అనునవి ప్రాతిపదికములుగాఁ గల సుబంతములతోకూడి వైకల్పిక ముగా సమాసమగును. ఆ సమాసమునకు తత్పురుషమను విశేషసంజ్ఞ కలుగునని సూత్రార్థము. ఇందు ప్రథమాంతపదముచే నిర్దేశింపఁబడునది ద్వితీయాంత పద మైన 'కృష్ణమ్' మొదలగునది. కావున నది ఉపసర్జనమై పూర్వపదమగును. (ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్, ఉపసర్జనం పూర్వమ్) కావున నీ సూత్ర ముచే నేర్పడుసమాసమున ద్వితీయాంతపదము పూర్వపదమగునని తాత్పర్యము.

ఉదా : 'కృష్ణం శ్రితః' – కృష్ణుని ఆశ్రయించినవాఁడు. లౌకికవిగ్రహము. కృష్ణ + అమ్, శ్రిత + సు – అలౌకిక విగ్రహము. ఈ సూత్రముచే సమాస సంజ్ఞ కలుగుటచే ప్రాతిపదికసంజ్ఞ కలుగును. (కృత్తద్ధితసమాసాశ్చ) అందువలన సుప్పులగు అమ్, సు లకు లుక్కు (సుపోధాతు ప్రాతిపదికయోః) 'కృష్ణ శ్రిత' – ఇది ప్రాతిపదికసంజ్ఞకమగుటచే దీనికి పదత్వసిద్ధికై విభక్తి ప్రత్యయములు అర్థాను

గుణముగ చేరును ప్రాతిపదికార్థమున సుప్రత్యయము చేరఁగా కృష్ణశ్రిత+సు= కృష్ణశ్రితః అగును. ఇందు ద్వితీయాంతపదము 'కృష్ణమ్' అనునది ఉపసర్జనము (సమాసవిధాయక సూత్రమున ప్రథమా నిర్దిష్టము) కావున నదియే పూర్వపదముగా నుండును.

ద్వితీయాంతపదము సమర్థమగు సుబంతముతో సమసింపగా నేర్పడిన తత్పురుష సమాసమగుటచే దీనిని ద్వితీయాతత్పురుషసమాస మందురు.

అవ : తృతీయాతత్పురుషము చెప్పఁబడుచున్నది.

సూ : తృతీయా తత్కృతార్థేన గుణవచనేన 2-1-30.

వృ : తృతీయాన్తం తృతీయాన్తార్థకృత గుణవచనేనార్థేనచ సహ వా ప్రాగ్వత్. శఙ్కులయా ఖణ్డః, శఙ్కులాఖణ్డః. ధాన్యే నార్థో ధాన్యార్థః. తత్కృతేతి కిమ్? అక్ష్ణాకాణః.

ప. వి : తృతీయా (1-1) తత్కృత-(తృతీయావిభక్తిలోపించిన పదము) అర్థేన (3-1) గుణవచనేన (3-1).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : తృతీయాంతపదము, తృతీయాంతముయొక్క అర్థముచేనైన గుణవచనముతోఁడను, అర్థశబ్దముతోఁడను వైకల్పికముగా సమసించును, ఉదా: శఙ్కులయాఖణ్డః – శఙ్కులాఖణ్డః, ధాన్యేనార్థో ధాన్యార్థః, 'తత్కృత' అననేల ? అక్ష్ణా కాణః.

వివ : ప్రత్యయము గ్రహించినపుడు తదంతమును గ్రహింపవలయు నను న్యాయము ననుసరించి 'తృతీయా' అనగా తృతీయాంతమైన పదమను నర్థము కలుగును. 'తత్కృత' అనునది తృతీయా విభక్తి లోపించినపదము. 'తత్కృతేన' అని గ్రహింపవలయును. ఋషివాక్కు కావున విభక్తి లోపించుట యిట దోషము కాదు తత్కృతేన అనగా 'దానిచేత చేయఁబడిన' అని యర్థము – 'దానిచేత' అను సర్వనామము పూర్వమునఁ జెప్పఁబడిన దానిని పరామర్శించును. కావున 'తృతీయాంతముచేత చేయఁబడిన' అను నర్థము కలుగును. దీనినిబట్టి 'తృతీయాంతపదమే వస్తువును జెప్పునో ఆ వస్తువుచేత నేర్పడిన' అనునర్థము సిద్ధించును. ఇది 'గుణవచనేన' అనుదానికి విశేషణము. గుణవచన మనగా గుణమును జెప్పునది (గుణం వక్తీతి గుణవచనమ్) గుణమును ఆగుణముగల వస్తువును దెలుపు పదమే యిట గుణవచనేన అనుదానిచే గ్రహింపఁబడును. తృతీయాంత

పదముచే వాచ్యమగు వస్తువుచే నేర్పడిన గుణము కలిగి, ఒకవస్తువును దెలుపు పద ముతో, తృతీయాంతపదము సమసించును. అట్లే అది అర్థశబ్దప్రకృతిక సుబంత ముతో కూడ సమసించును.

ఉదా : శఙ్కులయా ఖణ్డః - శఙ్కుల (కత్తెర)చేత ఖండము (ఖండమైన వస్తువులేక వ్యక్తి) ఇచట 'శఙ్కులయా' అనునది తృతీయాంతపదము. 'ఖణ్డః' అనునది ఆ కత్తెరచే చేయఁబడిన ఖండత్వము (ముక్కలగుట) అను గుణమును జెప్పుపదము. అట్టిపదముతో 'శఙ్కులయా' అను తృతీయాంతపదము వైకల్పిక ముగా సమసించును. శఙ్కులా+టా, ఖణ్డ + సు. అలౌ. విగ్ర. ప్రకృత సూత్రముచే సమాససంజ్ఞ. ప్రాతిపదికసంజ్ఞ కలుగుటచే సుప్పులకు (టా, సులకు) లుక్కు. శఙ్కులా ఖణ్డ, మఱల పదత్వమునకై సుప్పు చేరును. ప్రాతిపదికార్థ మున సు, శఙ్కులాఖణ్డ+సు=శఙ్కులా ఖణ్డః. సమాసము వైకల్పిక మగుటచే 'శఙ్కులయాఖణ్డః' అనువాక్యము కూడ నుండవచ్చును.

అర్థశబ్దము గుణవచనము కాకుండుటచే ప్రత్యేకించి చెప్పవలసి వచ్చెను. ధాన్యేన అర్థః ధాన్యముచేత (నయిన) ధనము – లౌ – వి. ధాన్య+టా, అర్థ+ సు, సమాసమగుటచే ప్రాతిపదికత్వము. సుప్పులకు లుక్కు ధాన్య + అర్థ, సవర్ణదీర్ఘసంధి, ధాన్యార్థ + సు=ధాన్యార్థః.

సూత్రమున గుణవచనము తృతీయాంతకృతమైనపుడే యీ సమాసమగునని చెప్పుటచే 'అక్ష్ణాకాణః' మున్నగుతావులందు సమాససంజ్ఞ కలుగదు. 'కాణః'అనగా గ్రుడ్డివాఁడు, కాణత్వము గుణమేకాని అది తృతీయాంతపదమగు 'అక్ష్ణా' అనుదానిచే వాచ్యమగు కంటిచే చేయఁబడినది కాదు. అనగా గ్రుడ్డితనమగుటలో కన్ను కార ణము కాదు. రోగవిశేషము కారణము. కావున కాణత్వము రోగకృతము. అందు వలన నిచట 'తత్కృత' లక్షణము సరిపడదు కావున సమాస మేర్పడదు. 'అక్ష్ణా కాణః' అను వాక్యమే యుండును. 'అక్ష్ణా కాణః'=ఒకకన్ను కనపడనివాఁడు. ఇది సమాసము కాదు.

అవ : మఱియొకవిధమగు తృతీయా తత్పురుషము చెప్పఁబడుచున్నది

సూ . కర్తృకరణే కృతా బహులమ్ 2-1-132.

వృ : కర్తరి కరణేచ తృతీయా కృదన్తేన బహులం ప్రాగ్వత్. హరిణా త్రాతో హరిత్రాతః, నఖైర్భిన్నో నఖభిన్నః.

ప. వి : కర్తృకరణే (7-1) కృతా (3-1) బహులమ్ (2 1).

అను : సమాసః (1-1) తత్పురుషః (1-1) తృతీయా (1-1).

అర్థ : కర్తృకరణార్థములందు వచ్చిన తృతీయఅంతమునఁ గలపదము కృదంతముతో బహుళముగా సమసించి తత్పురుషమగును. ఉదా : హరిణా త్రాతః, హరిత్రాతఃన ఖై ర్భిన్నః. నఖభిన్నః.

వివ : కర్త అనగా ధాత్వర్థమైన వ్యాపారమున కాశ్రయమైనవాఁడు కరణ మనగా క్రియాసిద్ధియందు ప్రకృష్టోపకారకమైన సాధనము. క్రియావిభక్త్యాదులచే చెప్పఁబడని కర్తృవాచకమునకును, కర్మవాచకమునకును తృతీయావిభక్తి వచ్చునని కారక ప్రకరణమునఁ జెప్పఁబడినది (కర్తృకరణయో స్తృతీయా) అట్టి తృతీయా విభక్తి అంతమందుగలపదము కృదంతము ప్రాతిపదికముగాఁగల సుబంతముతో వైకల్పికముగా సమసించి తత్పురుషసమాస మగును. కృదంతమనగా ధాతువుల నుండి యేర్పడిన ప్రాతిపదికము. దానినుండి యేర్పడిన సుబంతముతో నీ సమాస మగును.

ఉదా : హరిణా త్రాతః. హరిచే రక్షింపఁబడినవాఁడు, ఇందు రక్షించుట అను పనిలో కర్త హరి, అది ఇచటి 'క్త' ప్రత్యయముచే అనుక్తమైనదగుటచే తృతీయ వచ్చినది. కావున 'హరిణా' అనునది కర్త్రర్థమున వచ్చిన తృతీయా విభక్తి అంతమునఁగలపదము. 'త్రాతః' అనునది 'త్రా' ధాతువునకు క్తప్రత్య యము చేరిన కృదంతము. కావున నివి ప్రకృతసూత్రముచే సమసించును. హరి + టా, త్రాత + సు, సమాసమగుటవలన ప్రాతిపదికమగును. సుప్పులకు (టా, సు లకు) లుక్కు వచ్చును. హరిత్రాత + సు = హరిత్రాతః. బహుళపదమువలన సమాసముకానిచో 'హరిణా త్రాతః' అనువాక్యముకూడ ప్రయోగింపనగును.

నఖైఃభిన్నః — నఖములచే చీల్పఁబడినవాఁడు. ఇచట చీల్చుట అను పనిలో నఖములు కరణములు (సాధనములు). కావున నిచటితృతీయ కరణార్థమున వచ్చినది. 'భిన్నః' అనునది కృదంతము. భిద్ + క్త = భిన్న, నఖ + భిస్, భిన్న + సు, నఖభిన్న + సు=నఖభిన్నః.

పూర్వమునందువలె నిచట ఉత్తరపదము తత్కృతార్థగుణవచనము కాక కృదంతము కావలయుట విశేషము. ఇందును, పూర్వసూత్రమునను 'తృతీయా' అనునది ప్రథమాంతపదము. కావున దానిచే నిర్దేశింపఁబడిన తృతీయాంత పదములగు శఙ్కులా, హరిణా, నఖైః అనునవి యుపసర్జనములై పూర్వపదము లైనవి.

అవ : ఈ సూత్రమునకు సంబంధించిన యొక పరిభాష యిటఁ జెప్పఁబడు చున్నది.

(పరి) కృద్గ్రహణే గతికారక పూర్వస్యాపి గ్రహణమ్.

వృ : నఖనిర్భిన్నః.

అర్థ : కృదంతమును గ్రహించునపుడు గతికారక పూర్వమునకును గ్రహణ ముండును. ఉదా : నఖనిర్భిన్నః.

వివ : కృదంతమునకు విధింపఁబడిన కార్యము, గతిపూర్వకమైన కృదంతము నకును, కారకపూర్వకమైన కృదంతమునకును కలుగునని యీ పరిభాషకు అర్థము. గతియనగా క్రియాయోగముగల ప్రాదులును, ఊర్యాదులును. కారకములనగా కర్మము మొ॥వి. పూర్వసూత్రమున చెప్పఁబడిన కర్తృకరణార్థక తృతీయాంత పదము గతికారకపూర్వమైన కృదంతముతోడను సమసించునని యర్థము.

ఉదా : నఖైః నిర్భిన్నః నఖములచేత నిర్భిన్నుఁడు ఇందు 'నిర్భిన్నః' అను నది గతిపూర్వకమైన (నిర్)కృదంతము. దీనితోకూడ తృతీయాంతపదమగు 'నఖైః' అనునది సమసించును. నఖ + భిస్, నిర్భిన్న + సు, విభక్తిలోపము, నఖ నిర్భిన్న + సు = నఖనిర్భిన్నః

'తృతీయాతత్కృత....' అనుసూత్రము మొదలుకొని యింతవఱకు తృతీ యాంతపదము మీఁదిపదముతో సమసించుటను జెప్పుటచే ఇవి తృతీయాతత్పురుష సమాసములనఁబడును.

అవ : చతుర్థీ తత్పురుషము చెప్పఁబడుచున్నది

సూ : చతుర్థీ తదర్థార్థబలిహితసుఖరక్షితైః 2.1-36.

వృ:చతుర్థ్యన్తాయ యత్ తద్వాచినా అర్థాదిభిశ్చ చతుర్థ్యన్తంవా ప్రాగ్వత్. యూపాయదారుయూపదారు. తదర్థేన ప్రకృతి వికృతిభావ ఏవేష్టః. తేనే హ న, రన్ధనాయస్థాలీ

ప. వి : చతుర్థీ (1-1) తదర్థార్థ .....రక్షితైః (3-3).

అను : సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : చతుర్థ్యంతముకొఱకైనదానిని తెలుపు సుబంతముతోడను, అర్థాదుల తోడను, చతుర్థ్యంతము వైకల్పికముగా సమసించును. అది తత్పురుషమగును. ఉదా : యూపాయదారు, యూపదారు. తదర్థముచే ప్రకృతివికృతిభావమే యిట గ్రహించుట యిష్టము. అందుచే రన్ధనాయస్థాలీఅనుచోట సమాసములేదు.

వివ : 'చతుర్థీ' అనుదానికి ప్రత్యయగ్రహణన్యాయముచే చతుర్థీ విభక్తి అంతమునఁగల పదమని యర్థము. తదర్థమనగా చతుర్థ్యంతార్థము. అర్థశబ్ద మిట ప్రయోజనము అనునర్థమున వాడఁబడినది చతుర్థ్యంతపదముచే వాచ్యమగు వస్తువు ప్రయోజనముగాఁగలది యేదియో యది చతుర్థ్యంతార్థము. చతుర్థ్యంతపదము, చతుర్థ్యంతార్థమగు సుబంతముతోడను, అర్థ, బలి, సుఖ, హిత, రక్షిత అను వానితోడను వైకల్పికముగా సమసించి తత్పురుషమగును. ఉదా : యూపాయదారు - యూపముకొఱకు కొయ్య. ఇందు 'యూపాయ' అనునది చతుర్థ్యంతపదము. యూపమనగా యజ్ఞపశువును కట్టెడు కొయ్య. యూపాయ దారు అనగా యూపమును జేయుటకు తెచ్చినకొయ్య. ఒకదారు ఖండమును తెచ్చిదానిని చెక్కి సరిచేసి, ఒక ఆకారమును గలిగింపగా నది యూపమగును. కనుక దారువిట యూపార్థమైనది అనగా 'దారు' అను సుబంతము 'యూపాయ' అను చతుర్థ్యంతపదముచే చెప్పఁబడు యూపము ప్రయోజనముగాఁ గల వస్తువును జెప్పుచున్నది. కనుక 'దారు'అనునది చతుర్థ్యాంతార్థమును జెప్పు సుబంతము. దానితో చతుర్థ్యంతము వైకల్పికముగా సమసించును.

ఉదా : యూపాయ+దారు, యూప+ఙే, దారు + సు, సమాసమగుటచే విభక్తిలోపము. యూపదారు + సు = యూపదారు (దారుశబ్దము నపుంసకలింగమగుటచే 'స్వమోర్నపుంసకాత్' అనుసూత్రముచే సు ప్రత్యయమునకు లుక్కు వచ్చును). ఇందు 'చతుర్థీ' అనునది ప్రథమాంతము. దానిచే నిర్దేశింపఁబడిన 'యూపాయ' మున్నగునవి ఉపసర్జనములయి పూర్వపదములగును.

ఈ సూత్రమున 'తదర్థ' అని చెప్పినపిదప బలి, హిత, సుఖ రక్షితమున్నగునవి గ్రహింపఁబడ నక్కరలేదు ఏలయనగా నవియు చతుర్థ్యంతార్థములే యగును. ఉదాహరణమునకు భూతేభ్యోబలిః-భూతములకొఱకు బలి అనగా బలిచతుర్థ్యంతార్థమగు భూతములకొఱకేకదా ! అట్టియెడ వానితోడను చతుర్థ్యంతమునకు 'తదర్థ' శబ్దముచేతనే సమాసమగుచుండగా మఱలనాపదములేల? ఇట్లు అవి వ్యర్థములై యొకవిషయమును తెలుపుచున్నవి. 'తదర్థశబ్దముచే ప్రకృతి వికృతిభావమే గ్రహింపబడవలయును' అనువిషయమిచట జ్ఞాపితమగుచున్నది. ప్రకృతియనగా ఒక ముడిపదార్థము, వికృతి అనగా దానినుండి మార్పుచెంది యేర్పడిన వస్తువు. చెట్టునుండి కోసికొనివచ్చిన కొయ్య ప్రకృతి. దానిని చెక్కి చిత్రికపట్టి, రూపుదిద్ది ఏర్పఱచిన యూపము వికృతి. తదర్థశబ్దముచే నిట్టిభావమున్నవానినే గ్రహింపవల

యును. భూతములకు బలికి అట్టిభావములేదు గావున బలిమున్నగునవి యీజ్ఞాపిత మైన విషయమునుబట్టి సూత్రమున మఱల నవసరములగుచున్నవి. ఈజ్ఞాపకమును బట్టి 'రన్ధనాయస్థాలీ'-'వంటకొఱకు పాత్ర' అనుచోట ప్రకృతివికృతిభావములేదు కావున సమాసమేర్పడదు. వంట, పాత్రయొక్క వికృతికాదుకదా!

అవ : చతుర్థ్యంత మర్థశబ్దముతో సమసించుటలో నొక విశేషము కలదని యీ క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా॥ అర్థేనసహ నిత్యసమాసో విశేష్యలింగతా చేతి వక్తవ్యమ్.

వృ : ద్విజాయాయం ద్విజార్థః సూపః, ద్విజార్థా యవాగూః, ద్విజార్థం పయః.

ప. వి : అర్థేన (3-1) సహ (అవ్య) నిత్యసమాసః (1-1) విశేష్యలిఙ్గతా (1-1) చ (అవ్య) ఇతి (అవ్య) వక్తవ్యమ్ (1-1).

అర్థ : చతుర్థ్యంతపదము అర్థశబ్దముతో కూడి నిత్యసమాసమగును. ఆ సమాసమునకు విశేష్యలింగతయు నగును.

వివ : 'చతుర్థీ తదర్థార్థ ' అనుసూత్రమునందలి 'అర్థ' శబ్దమునకుకూడ తక్కినవానికివలె వైకల్పికముగా సమాసము ప్రాప్తించుచుండగా నిత్యసమాసమగు నని యీ వార్తికము చెప్పుచున్నది. అనగా దీనికి స్వపదములతో విగ్రహముండదు. మఱియు ద్వంద్వతత్పురుషసమాసములలో పరపదముయొక్క లింగము సమాసము నకును లింగమగును. ఇచటమాత్రము విశేష్యమునుబట్టి ఈ అర్థశబ్దాంత సమాస మునకు లింగమగును అదియు నీవార్తికముచే విధింపబడుచున్నది

ఉదా : ద్విజాయ అయమ్ సూపః' - ద్విజునికొఱకైన సూపము. ద్విజ + ఙే + అర్థ + సు, సమాసమగుటచే విభక్తిలోపము. ద్విజ + అర్థ, సవర్ణదీర్ఘ సంధి, 'ద్విజార్థ' ఇది 'సూపః' అను పుంలింగశబ్దమునకు విశేషణము కావున పుంలింగ మగును. ద్విజార్థ + సు = ద్విజార్థః. ద్విజాయ ఇయం యవాగూః - 'ద్విజుని కొఱకైన గంజి' - ద్విజ + ఙే, అర్థ + సు, విభక్తిలోపము. ద్విజార్థ. ఇది స్త్రీ లింగమైన 'యవాగూ' శబ్దమునకు విశేషణము కావున స్త్రీత్వమున దీనికి టాప్ ప్రత్యయము వచ్చును. ద్విజార్థా + సు = ద్విజార్థా. 'ద్విజాయ ఇదం పయః ద్విజుని కొఱకైన యీ క్షీరము. ద్విజ + ఙే, అర్థ + సు, ద్విజార్థ, ఇది 'పయః' అను నపుంసకలింగశబ్దమునకు విశేషణమగుటచే నపుంసకలింగమగును. ద్విజార్థ + సు = ద్విజార్థమ్. (నపుంసకలింగశబ్దము అదంతమైనచో

దానికి పరముగనున్న సు, అమ్ ప్రత్యయములకు 'అమ్' అనునాదేశము వచ్చును).

అవ : "చతుర్థీతదర్థార్థ...." సూత్రములోని బలిహితసుఖరక్షితశబ్దముల కుదాహరణములు చూపఁబడుచున్నవి.

వృ : భూతబలిః, గోహితమ్, గోసుఖమ్, గోరక్షితమ్.

వివ : (i)భూతేభ్యోబలిః (లౌ.వి), భూత + భ్యస్, బలి + సు (అలౌ. వి) విభక్తిలోపము. భూతబలి + సు = భూతబలిః - భూతములకొఱకు బలి.

(ii) గోభ్యః హితమ్ (లౌ. వి) గో+భ్యస్, హిత+సు, గోహిత+సు= గోహితమ్ (గోవులకొఱకు హితము).

(iii) గోభ్యః సుఖమ్ (లౌ. వి) గో + భ్యస్, సుఖ + సు, గోసుఖ+సు= గోసుఖమ్ - గోవులకొఱకు సుఖము.

(iv) గోభ్యః రక్షితమ్ (లౌ. వి)గో+భ్యస్, రక్షిత + సు=గోరక్షిత+సు =గోరక్షితమ్ (గోవులకొఱకు రక్షింపఁబడినది).

ఈ నాలుగు ఉదాహరణములకును సమాసవిధానము 'చతుర్థీతదర్థార్థ బలిహిత సుఖరక్షితైః' అనుసూత్రముచేతనే అగును. అందు చతుర్థ్యంతము ఉపసర్జన మగుటయు నదిపూర్వపదమగుటయు పూర్వమువలెనే యరయునది.

చతుర్థ్యంతము మీది పదముతో సమసించుటచే నేర్పడిన సమాసమగుటచే దీనిని చతుర్థీ తత్పురుషసమాసమందురు.

అవ : పంచమీతత్పురుషము చెప్పఁబడుచున్నది.

సూ : పఞ్చమీ భయేన 2 1-37.

వృ : చోరాద్భయం చోరభయమ్.

ప. వి : పఞ్చమీ (1-1) భయేన (3-1).

అను : సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : పంచమ్యంతపదము భయశబ్దప్రకృతిక సుబంతముతో వైకల్పిక ముగా సమసించును. అది తత్పురుషమగును. ఉదా : చోరాద్ భయమ్ - చోర భయమ్.

వివ : పంచమీవిభక్తి అంతమందుఁగల పదము 'భయ' అనునది ప్రాతిపదిక ముగాఁ గల సుబంతముతో సమసించును. ఆసమాసమునకు తత్పురుషమని పేరు,

ఉదా : చోరాత్, భయమ్ = చోరునివలన భయము. చోర + ఙసి, భయ + సు, విభక్తి లోపము, చోరభయ + సు = చోరభయమ్ ఇందు 'పంచమీ' అనునది ప్రథమాంత పదము. కావున దానిచేత నిర్దేశింపఁబడిన పంచమ్యంతమగు 'చోరాత్' వంటివి ఉపసర్జనములై పూర్వపదములగును.

అవ : పంచమ్యంతపదమొక్క భయశబ్దముతో మాత్రమేకాక మఱికొన్ని శబ్దములతో కూడ సమసించునని యీ క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా॥ భయభీతభీతిభీభిరితి వాచ్యమ్.

వృ: వృకభీత ఇత్యాది.

ప. వి : భయభీతభీతిభీభిః (3-3) ఇతి (అవ్య) వాచ్యమ్ (1-1).

అర్థ : పంచమ్యంతము భయ, భీత, భీతి భీ అనువానితో సమసించునని చెప్పనగును. ఉదా : వృకభీతః మొ॥వి.

వివ : సూత్రమున పంచమ్యంతపదము భయశబ్దముతో మాత్రమే సమసించునని చెప్పఁబడగా దానితోపాటు, భీత, భీతి, భీ అనువానితోఁగూడ సమసించునని వార్తికము సవరించినది.

ఉదా : వృకాత్, భీతః - తోడేలువలన భయపడినవాఁడు. వృక + ఙసి, భీత + సు, విభక్తిలోపము, వృకభీత + సు = వృకభీతః. ఇట్లే వృకభీతిః. వృకభీః (తోడేలు వలనభయము) అనునవియు నేర్పడును.

సూ : స్తోకాన్తికదూరార్థ కృచ్ఛ్రాణి క్తేన 2-1-39.

ప. వి : స్తోకాన్తిక దూరార్థకృచ్ఛ్రాణి (1-3) క్తేన (3-1).

అను : పంచమీ (1-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : పంచమ్యంతములగు స్తోక, అంతిక, దూరశబ్దములును, తదర్థక శబ్దములును, 'కృచ్ఛ్ర' అనునదియు 'క్త' ప్రత్యయాంత సుబంతముతో వైకల్పికముగా సమసించును.

వివ : అనువృత్తిగా వచ్చిన పంచమీశబ్ద మిట బహువచనాంతముగా మారి స్తోకాంతిక - ఇత్యాదిపదమునకు విశేషణమగును. తదంత విధిచే 'పంచమ్యంతములగు' ననునర్థము వచ్చును. 'క్తేన' క్త ప్రత్యయముతో అనుదానికి ప్రత్యయ గ్రహణపరిభాషచే క్త ప్రత్యయాంతముతో అనునర్థము కలుగును. పంచమీ

విభక్త్యంతములగు స్తోక (స్వల్పము) అంతిక (సమీపము) దూర (దూరము) అను నవియు, ఆ అర్థము గలవియును, దుఃఖము అనునర్థముగల కృచ్ఛ్రశబ్దమును 'క్త' అను కృత్ప్రత్యయ మంతమునఁగల సుబంతముతో వైకల్పికముగా సమ సించును.

ఉదా : స్తోకాత్ ముక్తః కొంచెములో విడువఁబడినవాఁడు. స్తోకాత్ అనునది పంచమ్యంతపదము. 'ముక్తః' అనునది క్త ప్రత్యయాంతము (ముచ్ + క్త - ముక్త). వీనికి ప్రకృతసూత్రముచే సమాససంజ్ఞ కలుగును. 'స్తోక + జసి, ముక్త + సు' అనియుండ 'సుపో ధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే 'జసి', కి 'సు'తోపాటు లుక్కు ప్రాప్తించుచున్నది. కాని యీ సమాసములందు పంచమీ విభక్తిలోపమును ఈ క్రిందిసూత్రము నిషేధించుచున్నది.

సూ : పఞ్చమ్యాః స్తోకాదిభ్యః 6-3-2.

వృ : అలుక్ స్యాదుత్తరపదే. స్తోకాన్ముక్తః, అన్తికాదాగతః అభ్యాశాదా గతః, దూరాదాగతః, కృచ్ఛ్రాదాగతః.

ప. వి : పఞ్చమ్యాః (6-1) స్తో కాదిభ్యః (5-3).

అను : అలుక్ (1-1) ఉత్తరపదే (7-1).

అర్థ : స్తోకాదులకు పరముగనున్న పంచమీవిభక్తి ప్రత్యయమునకు, ఉత్తర పదము పరమగునపుడు అలుక్కగును. ఉదా : స్తోకాన్ముక్తః మొ॥వి.

వివ : ఉత్తరపదమనగా సమాసమున రెండవపదము. దీనినిబట్టి యీ కార్యము సమాసములకు సంబంధించినదని తెలియును. ఉత్తరపదము పరమగు నపుడు 'స్తోక' మున్నగుశబ్దములకు పరముగానున్న పంచమీ విభక్తి ప్రత్యయము నకు లుక్కురాదు. 'సుపో ధాతుప్రాతిపదికయోః' అనుదాని కిది అపవాదము.

ఉదా : 'స్తోక+జసి, ముక్త + సు' అనుచోట 'జసి' కి లోపమురాదు. 'సు' లోపించును. అదంత ప్రాతిపదికమునకు పరముగానున్న 'జసి'కి 'అత్' అనునా దేశము వచ్చును (టాజసిఙసామినాత్స్యాః) స్తోక + అత్ సవర్ణదీర్ఘముస్తో కాత్ ముక్త, అనునాసికసంధి, స్తోకాన్ముక్త + సు=స్తో కాన్ముక్తః.

అన్తికాత్ అగతః, సమీపమునుండి వచ్చినవాఁడు. అన్తిక+జసి, అగత + సు, అన్తిక + జసి, ఆగత, అన్తికాత్ అగత, జశ్త్వము, అన్తికా దాగత+సు =అన్తికాదాగతః.

'అంతిక' అనుదానియర్థమున అభ్యాశశబ్దముగలదు. అభ్యాశాత్ ఆగతః, అభ్యాశ + ఙసి, ఆగత + సు, అభ్యాశాదాగత + సు = అభ్యాశాదాగతః - సమీపము నుండి వచ్చినవాఁడు.

దూరాత్, ఆగతః - దూరాదాగతః - దూరమునుండి వచ్చినవాఁడు.

కృచ్ఛ్రాత్, ఆగతః, కృచ్ఛ్ర + ఙసి, ఆగత + సు = కృచ్ఛ్రాదాగతః. (కష్టమువలనవచ్చినవాఁడు, కష్టముతో వచ్చినవాఁడు)

ఈ పై నాల్గింటియందును 'స్తోకాన్తికదూరార్థకృచ్ఛ్రాణి' అనునది సమాసమును విధించు సూత్రము 'ఆగతః' అనునది ముక్తః వలె క్తప్రత్యయాంతము. వీనియందు లౌకిక విగ్రహవాక్యము, సమాసస్వరూపము నొకేవిధముగనున్నవి అట్టియెడ సమాసమైనందువలన ప్రయోజనమేమి? అను శంక కలుగును. స్వరము మున్నగునవి యిట ప్రయోజనములు.

పంచమ్యంతపదము మీఁది సుబంతముతో సమసించుటచే నగు తత్పురుషము కావున నిది పంచమీతత్పురుషమనఁబడును.

అవ : షష్ఠీ తత్పురుషము చెప్పఁబడుచున్నది

సూ : షష్ఠీ 2-2-8.

వృ : సుబన్తేన ప్రాగ్వత్. రాజపురుషః.

ప. వి : షష్ఠీ (1-1).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : షష్ఠ్యంతము సుబంతముతోఁ గూడి వైకల్పికముగా సమసించును. దానికి తత్పురుషసంజ్ఞ కలుగును. ఉదా : రాజపురుషః.

వివ : షష్ఠీ అనుదానికి తదంత విధిచే షష్ఠ్యంతపద మనునర్థము కలుగును. 'సుపా' అనుదానికి తదంత విధిచే 'సుబంతముతో' అనునర్థము గలుగును. కావున షష్ఠ్యంతపదము మఱియొక సమర్థమగు సుబంతముతోఁ గూడి సమాసమగును. అది తత్పురుషమగును.

ఉదా : రాజ్ఞః పురుషః రాజుయొక్క-పురుషుఁడు. రాజన్ + ఙస్ పురుష + సు - ఇందు 'రాజన్ + ఙస్' అనునది షష్ఠ్యంతము, 'పురుష + సు' ప్రథమాంతము.

దీనికి ప్రకృతసూత్రముచే సమాససంజ్ఞ కలుగును. విభక్తిలోపము, రాజన్ పురుష 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అనుసూత్రముచే నకారలోపము, రాజపురుష+సు=రాజపురుషః.

అవ : దీనికొక అపవాదము చెప్పఁబడుచున్నది.

సూ : పూర్వాపరాధరోత్తరమేకదేశినైకాధికరణే 2-2-1.

వృ : అవయవినా సహ పూర్వాదయ స్సమస్యన్తే ఏకత్వసంఖ్యావిశిష్టశ్చేద వయవీ షష్ఠీసమాసాపవాదః. పూర్వం కాయస్య పూర్వకాయః, అపరకాయః. ఏకాధికరణేకిమ్? పూర్వః ఛాత్రాణామ్.

ప. వి : పూర్వాపరాధరోత్తరమ్ (1-1) ఏకదేశినా (3-1) ఏకాధికరణే (7-1).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : ఏకత్వసంఖ్యావిశిష్టమైయున్న అవయవివాచకముతో పూర్వాదిప్రకృతిక సుబంతములు వైకల్పికముగా సమసించును. ఇది షష్ఠీసమాసమున కపవాదము. ఉదా : పూర్వం కాయస్య - పూర్వకాయః, అపరకాయః. ఏకాధికరణే అననేల? పూర్వశ్ఛాత్రాణామ్.

వివ : 'పూర్వాపరాధరోత్తరమ్' అనునది సమాహారద్వంద్వము. ఏకదేశ మనగా నొకభాగము-అవయవము. ఏకదేశములు గలది ఏకదేశి-అనగా (అవయవములుగలది) అవయవి అధికరణము=ద్రవ్యము. ఏకమైన అధికరణము ఏకాధికరణము. అవయవి ఏకాధికరణమయినచో అనగా ఒకవస్తువును జెప్పునదియయినచో=ఏకవచనాంతమైనచో అట్టి అవయవిని వచించు సుబంతముతో పూర్వ, అపర, అధర, ఉత్తర అనుపదములు వైకల్పికముగా సమసించును. ఇచట పూర్వాది పదములకు అవయవితోఁ గలసంబంధమును దెలియఁజేయుచు అవయవివాచకమునకు షష్ఠి వచ్చును. (షష్ఠీ శేషే) ఆషష్ఠ్యంతపదమునకు పూర్వాదులతో పూర్వసూత్రముచే సమాసము కలుగవలసియుండగా ఈ సూత్రము దాని కపవాదముగా చెప్పఁబడినది.

ఉదా : పూర్వం కాయస్య కాయముయొక్క పూర్వము. ఇందు కాయము అవయవి - (అవయవములు గలది) అది ఏకాధికరణము. (ఒకవస్తువు అనియర్థము) కావున దానితో 'పూర్వమ్' అను సుబంతమునకు సమాసమగును.

'పూర్వ + సు, కాయ + జస్', విభక్తిలోపము పూర్వకాయ+సు=పూర్వకాయః, శరీరముయొక్క పూర్వభాగము. ఇట్లే అపరం కాయస్య, అపర + సు, కాయ + జస్, అపరకాయ + సు=అపరకాయః-శరీరముయొక్క అపరభాగము.

ఇచట షష్ఠీ అను సూత్రముచే సమాసమయినయెడల 'కాయపూర్వమ్' 'కాయాపరమ్' వంటి అనిష్టరూపము లేర్పడును. ఆ సూత్రముచే సమాసమయినచో అందు షష్ఠ్యంతమున ఉపసర్జన సంజ్ఞ కలిగి యది పూర్వపదము కావలయును గదా :

ఇందు అవయవివాచకము ఏకాధికరణమే (ఒక్కద్రవ్యమే) కావలయు ననుటచే 'పూర్వః ఛాత్రాణామ్' 'ఛాత్రులలో పూర్వుడు' అనుచోట ఈ సమాస మేర్పడదు. ఇట 'ఛాత్రాణామ్' అను అవయవివాచకము బహుత్వసంఖ్యావిశిష్టము. కావున 'పూర్వశ్ఛాత్రాణామ్' వంటి వాక్యమే యుండును.

ఈ సూత్రమున ప్రథమానిర్దిష్టములు, పూర్వ, అపర, అధర, ఉత్తర అనునవి కావున అవియే యీ సమాసమున పూర్వపదములగును. ఇది వైకల్పికమగుటచే సమాసము కానియెడల 'పూర్వం కాయస్య' ఇత్యాది వాక్యమే యుండునుగాని 'షష్ఠీ' అనుసూత్రముచే సమాసమేర్పడదు. తత్పురుషము ప్రాయికముగా ఉత్తర పదార్థప్రధానమనుటవలన పూర్వపదార్థప్రధానములగు 'పూర్వకాయః' వంటి సమాసములు ప్రాయికగ్రహణముచే రక్షితములగును.

సూ : అర్ధం నపుంసకమ్ 2 2-2.

వృ : సమాంశవాచ్యర్ధశబ్దో నిత్యం క్లీబే ప్రాగ్వత్. అర్ధంపిప్పల్యా అర్ధపిప్పలీ.

ప వి : అర్ధమ్ (1-1) నపుంసకమ్ (1-1).

అను : ఏకదేశినా (3-1) ఏకాధికరణే (7-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1)

అర్థ : సమాంశవాచకమై నిత్యనపుంసకమైన అర్ధశబ్దము ఏకాధికరణమగు నవయవివాచకముతో వైకల్పికముగా సమసించును. ఉదా : అర్ధం పిప్పల్యాః, అర్ధపిప్పలీ.

వివ : అర్ధ శబ్దము ముక్క అనునర్థమున పుంలింగము, సమానమైనభాగము (సగము) అనునర్థమున నపుంసకలింగము. సూత్రమున నపుంసకలింగము గ్రహింపబడినది. కావున సగము అనునర్థముగల నిత్యనపుంసకమగు 'అర్ధశబ్దము ఏక

ద్రవ్యవాచకమగు అవయవితో సమసించును. ఉదా : అర్ధం పిప్పల్యాః (పిప్పలి యొక్క సగము). అర్ధ + సు, పిప్పలీ + ఙస్, సమాసము, విభక్తిలోపము. అర్ధ పిప్పలీ + సు = అర్ధపిప్పలీ. ఇందు అర్ధశబ్దము ప్రథమానిర్దిష్టము కావున నుప సర్జనమై పూర్వపదమగును. ఇదియు 'షష్ఠీ' అనుదానికపవాదము.

'షష్ఠీ' అనుసూత్రముచే నేర్పడిన సమాసములను షష్ఠీతత్పురుష సమాసము లందురు. పూర్వాపరాధర , అర్ధం నపుంసకమ్ అనుసూత్రములచే నేర్పడు వానిని ప్రథమాతత్పురుషములని కొందఱు వ్యవహరింతురు.

అవ : సప్తమీతత్పురుషము చెప్పఁబడుచున్నది.

సూ : సప్తమీ శౌణ్డైః 2-1-40.

వృ : సప్తమ్యన్తం శౌణ్డాదిభిః ప్రాగ్వత్. అక్షేషుశౌణ్డః అక్షశౌణ్డ ఇత్యాది.

ప. వి : సప్తమీ (1-1) శౌణ్డైః (3-3).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : సప్తమ్యంతపదము శౌండాది పదములతో వైకల్పికముగా సమసించును. ఉదా : అక్షేషుశౌణ్డః, అక్షశౌణ్డః. మొ॥వి.

వివ : 'శౌణ్డైః' అనగా శౌణ్డాదిగణపఠితశబ్దములతో ననియర్థము. బహువచనము వలన నీయర్థము సిద్ధించును. 'సప్తమీ' అనగా సప్తమ్యంతపదము సప్తమ్యంతపదము 'శౌణ్డ' మున్నగునవి ప్రకృతులుగాఁ గలసుబంతములతో వైకల్పికముగా సమసించి తత్పురుషమగును.

ఉదా : అక్షేషు శౌణ్డః (పాచికలయందు నిపుణుఁడు). (లౌ. వి) అక్ష + సుప్, శౌణ్డ + సు (అ లౌ. వి) సమాసము, ప్రాతిపదికత్వము, సుబ్లుక్కు. అక్ష శౌణ్డ+సు=అక్షశౌణ్డః. మొ॥వి.

శౌణ్డాదిగణము : శౌణ్డ ధూర్త కితవ వ్యాడ ప్రవీణ సంవీత అంతర అధి పటు పణ్డిత కుశల చపల నిపుణ-ఇతి శౌణ్డాదయః.

సప్తమ్యంతపదముతో సుబంతము సమసించుటచే నేర్పడిన తత్పురుషమగుటచే దీనిని సప్తమీ తత్పురుషసమాసమందురు.

అవ : ద్వితీయాది విభక్త్యంతపదములు శ్రితమున్నగుపదములతోడనే సమసించునని ఆయాసూత్రములందు కొన్నిపదములు మాత్రమే పేర్కొనఁబడినవి అవికాక తక్కినపదములతో కూడ ద్వితీయాది విభక్త్యంతములు సమసించుట కొక మార్గమును వృత్తికారులు సూచించుచున్నారు.

వృ : ద్వితీయా తృతీయేత్యాది యోగవిభాగాదన్యత్రాపి ద్వితీయాది విభక్తీనాం ప్రయోగవశాత్ సమాసో జ్ఞేయః.

అర్థ : ద్వితీయా, తృతీయా అను విధముగా యోగవిభాగము చేయుటవలన ద్వితీయాది విభక్త్యంతపదముల కితరస్థలములందును ప్రయోగముల ననుసరించి సమాసము చేయనగునని తెలియునది.

వివ : ప్రయోగసిద్ధికొఱకు సూత్రములో కొంతభాగమును వేఱుచేసి ప్రత్యేకసూత్రముగా భావించుట ఈ వ్యాకరణమున అందందు కన్పట్టును. అట్లు విభజించి సూత్రములోని ఏకదేశమును ప్రత్యేకసూత్రముగా భావించువిధానమును యోగవిభాగము అందురు ఈ పద్ధతినిబట్టి 'ద్వితీయాశ్రితాతీత 'తృతీయా తత్కృతార్థ', 'చతుర్థీ తదర్థార్థ,' 'పంచమీభయేన,' 'సప్తమీ శౌణ్డైః' అనుసూత్రములలోని 'ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ, సప్తమీ అను వానిని వేఱుగా విభజించి ప్రత్యేకసూత్రములుగా భావించినచో అనువృత్తమైన 'సహసుపా' అను దాని సాహయ్యమున ద్వితీయాదిపదములు సుబంతములతో సమసించునని యొక యర్థమును, పూర్తిసూత్రముగా, ద్వితీయాదులు శ్రితాదిసుబంతములతో సమసించునని రెండవయర్థమును సిద్ధించును. ఇట్లు యోగవిభాగముచేసి ద్వితీయాదులకు ఏ సుబంతముతోనైన సమాసమేర్పడునని సామాన్యముగా చెప్పినచో శ్రితాదిపదములను పేర్కొననేల? పేర్కొనకపోయినను సమాసము వానితో సిద్ధించునుగదా? అన్నచో శ్రితాది పదములతో సమాసమగుట సార్వత్రికముగా దృష్టమగును. శ్రితాదులకంటె వేఱైన పదములతో (సూత్రములందు పేర్కొననివానితో) సమాసము అగుట క్వాచిత్కమనియు నదియు ప్రయోగముల ననుసరించి మాత్రమే భావింపనగుననియు సమాధానము. ఇట్లు చెప్పుటవలన ఆసనబద్ధధీరః, నగేంద్రసక్తామ్ మున్నగు సమాసములు రక్షితములగును. కొందఱు ఇట్టివానిని 'సహసుపా' అను సూత్రముచేత గాని, 'కర్తృకరణే కృతా బహుళమ్' అనుసూత్రమునందలి బహుళపదమునుబట్టి గాని సాధింపనగు నని చెప్పుదురు.

ఇంతవఱకు వ్యధికరణతత్పురుషము చెప్పఁబడినది. సమాసములోనిపదము లొక్కద్రవ్యమును జెప్పునవికాని యెడల నట్టిదానిని వ్యధికరణమందురు. ఉదాహరణ

మునకు రాజపురుష అను సమాసములోని రాజశబ్దము రాజును, పురుషశబ్దము పురుషుని (భటుడు మున్నగువానిని) బోధించును. కావున నివివ్యధికరణములు. ఇట్టి వానికి సంబంధించిన సమాసమును వ్యధికరణసమాసమందురు

అవ : ఇటుపై సమానాధికరణ తత్పురుషము చెప్పఁబడుచున్నది.

సూ : దిక్సంఖ్యే సంజ్ఞాయామ్ 2-1-50.

వృ : సంజ్ఞాయామేవేతి నియమార్థం సూత్రమ్. పూర్వేషుకామశమీ, సప్తఋషయః సప్తర్షయః. నియమాన్నేహ, ఉత్తరావృక్షాః, పఞ్చ బ్రాహ్మణాః

ప. వి : దిక్సంఖ్యే (1 2) సంజ్ఞాయామ్ (7-1).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) సమానాధికరణేన (3-1).

అర్థ : దిగ్వాచక సంఖ్యావాచకములు సమానాధికరణమగు సుబంతముతో, సంజ్ఞ తెలియఁబడునపుడు, సమసించును. సంజ్ఞయందే యను నియమముకొఱకీ సూత్రము. ఉదా : పూర్వేషుకామశమీ, సప్తర్షయః. నియమమువలన ఉత్తరావృక్షాః, పంచబ్రాహ్మణాః మొదలగు వానియందు సమాసములేదు.

వివ : పూర్వా, అపరా, దక్షిణా, ఉత్తరా ఇత్యాదులు దిగ్వాచకపదములు, ఏకమున్నగునవి సంఖ్యావాచకపదములు. ఇవి సమానాధికరణమైన సుబంతముతో, సముదాయముచే సంజ్ఞ తెలియఁబడునపుడు, సమసించును. సమానాధికరణమనగా సమానమైన అధికరణము=ద్రవ్యము కలది. రెండుపదములు ఒకేదానిని బోధించిన యెడల అవి రెండును పరస్పరము సమానాధికరణము లనితాత్పర్యము. తెల్ల కలువ అనుచోట 'తెల్ల' అనుపదమును, కలువ అనుపదమును ఒక పుష్పవిశేషమును తెలుపుచున్నవి. ఈ రెండును ఒకదానికొకటి సమానాధికరణములు. 'సమానాధికరణేన' అనుపదము 'సుపా' అనుపదమునకు విశేషణము కావున 'సమానాధికరణమైన సుబంతముతో' అనునర్థము కలుగును.

'విశేషణం విశేష్యేణ బహుళమ్' అని ముందొకసూత్రము చెప్పఁబడుచున్నది. విశేషణము, విశేష్యముతో బహుళముగా సమసించునని ఆ సూత్రమున కర్థము. దిగ్వాచక సంఖ్యావాచకపదములు. సమానాధికరణమైన పదమునకు విశేషణము లగును. అట్టియెడ ఆ సూత్రముచేతనే యిచటను సమాసము కలుగుచుండగా మఱల నీ సూత్రమేల? అన్నచో నియమముకొఱకు అని సమాధానము. 'సిద్ధేసత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి' అని యొకన్యాయము గలదు.

సూత్రాంతరముచే నొకకార్యము సిద్ధించుచుండగా మఱల నదేకార్యముకొఱకు ప్రారంభింపఁబడు విధి నియమముకొఱకు అగును. దిక్సంఖ్యలకు సమానాధికరణ మగు నుత్తరపదముతో 'విశేషణం విశేష్యేణ బహులమ్' అను సూత్రముచే సమాసము సిద్ధించుచుండగా మఱల దానినే విధించుటకై ప్రారంభింపఁబడిన ప్రకృత సూత్రము ఒకనియమమును చేయును. 'దిక్సంఖ్యలు సమానాధికరణ సుబంతముతో సమసించుట సంజ్ఞ తెలియఁబడునపుడే' అనునది యిచట నియమము. కావున నీ సూత్రముచేత నేర్పడిన సమాసములు సంజ్ఞలే కావలయును. సామాన్యమగు వ్యుత్పత్త్యర్థమున ప్రయోగింపఁబడవని తాత్పర్యము.

ఉదా : పూర్వాబ్రాహ్మా ఇషుకామశమీచ - (లౌ. వి) - ఇది దిగ్వాచకమున కుదాహరణము. ఇందు 'పూర్వ' అనునది దిక్కును తెలుపుపదము. ఇషుకామశమీ అనునది ఆదిక్కునగల దేశవిశేషమును దెలుపుపదము. కావున నది సమానాధికరణమైన యుత్తరపదము. పూర్వా + సు, ఇషుకామశమీ + సు ఈ సూత్రముచే సమాససంజ్ఞ, ప్రాతిపదికమగుట, సుబ్లుక్కు, సంధి (గుణము) పూర్వేషు కామశమీ. ఇదియొకదేశమునకు పేరు (West Bengal అన్నట్టిది.)

సంఖ్యావాచకమున కుదాహరణము. సప్తచ తేఋషయశ్చ (లౌ. వి) ఇందు 'సప్త' సంఖ్యావాచకపదము. 'ఋషయః' అనునదిదానికి సమానాధికరణము. సప్త+జస్, ఋషి + జస్, విభక్తిలోపము, సప్త + ఋషి, గుణసంధి, సప్తర్షి+ జస్=సప్తర్షయః—అత్రి, మరీచి మున్నగు నేడుగురుగల ఋషిగణమునకుమాత్రమే యిది సంజ్ఞ. ఎవరో ఏడుగురు ఋషులైనచో వారిని సప్తర్షులనరు. అనగా సమాసముకాదు.

'సంజ్ఞ యగునపుడే' అనినియమముచేయుటవలన కేవలము అవయవార్థమును భావించునపుడు 'విశేషణం విశేష్యేణబహులమ్' అనుసూత్రముచేతను దిక్సంఖ్యావాచకములు సమానాధికరణసుబంతముతో సమసింపవు. ఉదా : ఉత్తరాః వృక్షాః— ఉత్తరమున నున్నచెట్లు. ఇదిసంజ్ఞకాదు. కావున సమాససంజ్ఞ ఈపదములకు కలుగదు. అట్లే 'పఞ్చ, బ్రాహ్మణాః' అనునదియు సంజ్ఞకాదు. సమాసముకాదు.

సంజ్ఞయందే యీసమాసమేర్పడుననుటచే నిది నిత్యసమాసమనియు నర్థము. సంజ్ఞ విగ్రహవాక్యరూపమున నుండదు.

సూ : తద్ధితార్థోత్తరపదసమాహారే చ 2-1-51.

వృ : తద్ధితార్థే విషయే ఉత్తరపదేచ పరతః సమాహారే చ వాచ్యే దిక్సంఖ్యే ప్రాగ్వద్వా. పూర్వస్యాం శాలాయాంభవః పూర్వశాలా ఇతిసమాసేజాతే—

ప వి : తద్ధితార్థోత్తర పదసమాహారే (7-1) చ (అవ్య)

అను : దిక్సంఖ్యే (1-2) సహ (అవ్య) సుపా (1-1) సమానాధికరణేన (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : తద్ధితార్థము విషయమైనపుడును, ఉత్తరపదము పరమగునపుడును, సమాహారము వాచ్యమగునపుడును దిగ్వాచకసంఖ్యావాచకములు సమానాధికరణమగు సుబంతముతో వైకల్పికముగా సమసించును. 'పూర్వస్యాం శాలాయాం భవః' అను నరమున సమాసముకాఁగా.

వివ : 'తద్ధితార్థోత్తరపదసమాహారే' అను పదముయొక్క సప్తమి ద్వంద్వమునందలి మూఁడుఅంశముల విషయభేదమునుబట్టి మూఁడు అర్థములలో ప్రయోగింపఁబడినది. తద్ధితార్థే = తద్ధితార్థము విషయమగుచుండగా = అర్థవిశేషమున తద్ధిత ప్రత్యయము చేయఁబడునపుడు-అని యర్థము; ఉత్తరపదే = ఉత్తరపదము పరమగుచుండఁగా, ఇచట ఉత్తరపదమనగా ఈ సూత్రముచే నేర్పడుసమాసముతో సమసించు వేఱొకపదమనియర్థము. సమాహారమనగా సమూహము. సమాహారే=సమాహారము వాచ్యమగునపుడు, ఏర్పడెడుసమాసముచే ఒక సమూహము చెప్పఁబడునపుడు, ఇట్లు ఈ మూఁడు సందర్భములలో దిగ్వాచకపదములును, సంఖ్యావాచకపదములును సమానాధికరణమగు సుత్తరపదముతో వైకల్పికముగా సమసించునని సూత్రతాత్పర్యము.

(1) అందు తద్ధితార్థము విషయమగునపుడు సమాసమగుట కుదాహరణము. 'పూర్వస్యాం శాలాయాం భవః' - తూర్పుననున్న శాలయందున్నవాఁడు. ఇచట 'తత్ర' 'భవః.' అనునర్థమున 'పూర్వస్యాం శాలాయామ్' అనువానికి తద్ధిత ప్రత్యయము చేయఁబడుచున్నది. కావున నిచట తద్ధితార్థము విషయమైనది. 'పూర్వస్యామ్' దిగ్వాచకపదము. 'శాలాయామ్' అనునది దానికి సమానాధికరణమైనపదము. ఇవిరెండును విశేషణ విశేష్యములని తాత్పర్యము. 'పూర్వా + ఙి, శాలా + ఙి' అని యుండ, సమాససంజ్ఞ యీ సూత్రముచే కలుగును. ప్రాతిపదికమగును. సుప్పులకు లుక్కు వచ్చును. 'పూర్వా, శాలా' అని యుండును.

అవ : ఇట్టి స్థితిలో నొకకార్యవిశేషము నీక్రింది వార్తికము విధించుచున్నది.

వా॥ సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః.

ప. వి : సర్వనామ్నః (6-1) వృత్తిమాత్రే (7-1) పుంవద్భావః (1-1).

అర్థ : సర్వనామమునకు వృత్తిమాత్రమున పుంవద్భావమగును.

వివ : సర్వనామము విగ్రహమున నేలింగమైనను, తద్ధితము, సమాసము. మున్నగు వృత్తులలో దానికి పుంవద్భావము కలుగును. పుంలింగములోనిరూపము వంటిరూపము కలుగుననితాత్పర్యము.

ప్రకృతోదాహరణమున 'పూర్వా' అను సర్వనామము స్త్రీలింగము. దాని పుంలింగరూపము 'పూర్వ' అనునది. కాన పుంవద్భావము రాఁగా 'పూర్వశాలా' అని యుండును.

అవ : తద్ధిత ప్రత్యయము చేయునిబంధనముపై నీ సమాసమేర్పడినది కావున దీని కీ క్రిందిసూత్రముచే తద్ధిత ప్రత్యయము విధింపఁబడుచున్నది.

సూ : దిక్పూర్వపదాదసంజ్ఞాయాం ఞః 4-2-107.

వృ : అస్మాద్భవాద్యర్థే ఞః స్యాదసంజ్ఞాయామ్.

ప. వి : దిక్పూర్వపదాత్ (5-1) అసంజ్ఞాయామ్ (7-1) ఞః (1-1).

అను : జ్యాప్ప్రాతిపదికాత్ (5-1) ప్రత్యయః (1-1) తద్ధితాః (1-3) తత్ర (అవ్య) భవః (1-1).

అర్థ : దిగ్వాచకము పూర్వపదముగాఁ గల ప్రాతిపదికమునకు పరముగా 'అందున్నవాఁడు' మున్నగునర్థములందు, సంజ్ఞగమ్యమానము కాని యపుడు, 'ఞ' ప్రత్యయము వచ్చును.

వివ : దిక్కును తెలుపుపదము పూర్వపదముగా నున్న ప్రాతిపదికమునకు పరముగా 'అందు ఉన్నవాఁడు' మున్నగునర్థములను వ్యక్తముచేయుచు 'ఞ' అను తద్ధితప్రత్యయము చేరును. ఈ తద్ధితప్రత్యయము చేరినరూపము సంజ్ఞ కారాదు.

ఉదా : 'పూర్వశాలా' - ఇందు 'పూర్వ' అను దిగ్వాచకము పూర్వపదము. సమాసమగుటచే దీనికి ప్రాతిపదికసంజ్ఞయుండును (కృత్తద్ధితసమాసాశ్చ). పూర్వ శాలా + ఞ, ఈ ప్రత్యయమున 'ఞ్' అనుదానికి 'చుటూ'అనుసూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును. 'తస్యలోపః' అనుసూత్రముచే నదిలోపింప 'పూర్వశాలా + అ' అని యుండును.

అవ : పైదశలో నగుకార్యవిశేషము నీ క్రిందిసూత్రము చెప్పుచున్నది.

సూ : తద్ధితేష్వచామాదేః 7-2-117.

వృ : ఞితి ణితి చ తద్ధితేఽచామాదేరచో వృద్ధిః స్యాత్. 'యస్యేతిచ' పౌర్వశాలః.

ప. వి : తద్ధితేషు (7-3) అచామ్ (6-3) ఆదేః (6-1).

అను : ఞ్ణితి (7-1) వృద్ధిః (1-1).

అ॥ ఞిత్తుగాని ణిత్తుగాని అయిన తద్ధితము పరమగునపుడు అచ్చులలో మొదటిదానికి వృద్ధివచ్చును. 'యస్యేతిచ' అనుసూత్రముచే అకారలోపము - పౌర్వశాలః.

వివ : ఞకారముగాని ణకారముగాని ఇత్తుగా గల తద్ధిత ప్రత్యయము పరమైనపుడు పూర్వమున నున్న శబ్దస్వరూపముయొక్క అచ్చులలో మొదటి అచ్చునకు వృద్ధివచ్చును. అనగా ఆ, ఐ, ఔలలో అంతరతమమైనది ఆదేశమగును.

ప్రకృతమున 'పూర్వశాలా + అ' అనుచోట అ అనునది ఞిత్తయిన తద్ధిత ప్రత్యయము. (ఞ). అది పరముగా నున్నది కావున 'పూర్వశాలా' అనుదానిలో తొలి అచ్చగు ఊకారమునకు వృద్ధిసంజ్ఞగల ఔకారము (స్థానేఽన్తరతమః) వచ్చును 'పౌర్వశాలా + అ' అనియుండ 'యస్యేతిచ' (6-4-148) (భసంజ్ఞ కల దానియొక్క ఇవర్ణ, అవర్ణములకు, తద్ధిత ప్రత్యయము గాని ఈకారముగాని పరమగునపుడు లోపము వచ్చును) అనుసూత్రముచే 'పౌర్వశాలా' లోని తుది అకారమునకు లోపము రాఁగా పౌర్వశాల్ + అ = పౌర్వశాల + సు = 'పౌర్వశాలః' అగును.

(2) ఉత్తరపదము పరమగునపు డుదాహరణము.

వృ : పంచగావో ధనం యస్యేతి త్రిపదే బహువ్రీహౌ.

వివ : 'పంచగావో ధనంయస్య - 'అయిదుగోవులు ధనముగాగలవాఁడు' అనునర్థమున 'ధనమ్' అనునుత్తరపదము పరమగునపుడు 'పంచ' అనుసంఖ్యావాచకపదము 'గావః' అనుసమానాధికరణసుబంతముతో సమసించును. (తద్ధితార్థోత్తరపద సమాహారేచ) ఈ సూత్రము విభాషాధికారములోనిదగుటచే నీ సమాసము వైకల్పికముగా రావలసియుండ నీ క్రిందివార్తికము ఇట్టియెడ నిత్యసమాసమును చెప్పుచున్నది.

వా॥ ద్వంద్వ తత్పురుషయో రుత్తరపదే నిత్యసమాసవచనమ్.

ప వి : ద్వంద్వతత్పురుషయోః (6-2) ఉత్తరపదే (7-1) నిత్యసమాసవచనమ్ (1-1).

అర్థ : ద్వంద్వ తత్పురుషములకు ఉత్తరపదము పరమగునపుడు నిత్యసమాసమగు నని చెప్పనగును.

వివ : ఏవేని రెండుపదములు ద్వంద్వముగా గాని తత్పురుషముగాగాని సమసించునపుడు, వానికి మూడవపదముతో సమాసము కావలసియున్నచో, అవి నిత్యసమాసములగును. ప్రకృతమున 'పంచగావః' అనుపదములు సమసించుచున్నవి. పిదప నీ సమాసమునకు 'ధనమ్' అనుపదముతో సమాసమగును. అట్లగునపుడు 'పంచ, గావః' అనుపదములకు నిత్యసమాసత కలుగును. పఞ్చన్ + జస్, గో + జస్, సమాసము, విభక్తిలోపము. 'పంచగోః' అనియుండగా క్రిందిసూత్రము సమాసాంతప్రత్యయమును విధించుచున్నది.

సూ : గోరతద్ధితలుకి 5-4-92.

వృ : గోఽన్తాత్తత్పురుషాట్టచ్ స్యాత్ సమాసాన్తో నతుతద్ధితలుకి. పఞ్చగవధనః.

ప. వి. గోః (5-1) అతద్ధితలుకి (7-1).

అను : తత్పురుషస్య (6-1) టచ్ (1-1) సమాసాన్తాః (1 1) తద్ధితాః (1-1)

అర్థ : గోశబ్దాంతమగు తత్పురుషమునకు 'టచ్' అను సమాసాంతతద్ధిత ప్రత్యయము చేరును. తద్ధితమునకు లుక్కు వచ్చునపుడీప్రత్యయము రాదు. ఉదా : పఞ్చగవధనః.

వివ : అనువృత్తిగా వచ్చిన 'తత్పురుషస్య' అనుదానిని పంచమిగా మార్చుకొనవలయును. 'గోః' అనునది దానికి విశేషణము. తదంతవిధిచే 'గోశబ్దాంతమైన తత్పురుషమునకు' అనునర్థము వచ్చును. అట్టిదానికి 'టచ్' అనుసమాసాంత ప్రత్యయము, తద్ధితసంజ్ఞ కలిగినది, వచ్చును. ఈ ప్రత్యయమున టకారచకారము లిత్తులు (ట్) + అ, (చ్),

ఉదా : పఞ్చగో + అ, అవాదేశము (ఏచోఽయవాయావః) పఞ్చగవ్ + అ, పఞ్చగవ, దీనికి 'ధనమ్' అనుదానితో సమాసముకాఁగా పఞ్చగవధనః'అగును. అయిదుగోవులు ధనముగాఁగలవాఁడు.

గోశబ్దాంత తత్పురుషమునకు విధింపఁబడిన తద్ధితప్రత్యయమునకు లుక్కు వచ్చునపుడు మాత్రము ఈటచ్ ప్రత్యయమురాదని 'అతద్ధితలుకి' అనుపదముచే చెప్పఁబడినది. ఉదా : పఞ్చభిఃగోభిః క్రీతః అనుచోట 'పఞ్చగు' అను దానికి విధింపఁబడిన తద్ధితప్రత్యయమునకు లుక్కు విధింపఁబడినది. కావున 'పఞ్చగు' అనుదానికి ఈటచ్ ప్రత్యయమురాదు.

అవ : (3) సమాహారము వాచ్యమగునపుడు సంఖ్యావాచకపదమునకు సమానాధికరణమగు సుబంతముతో సమాసమగుట కుదాహరణమును ప్రదర్శించు టకై క్రిందినాలుగుసూత్రములు చెప్పఁబడుచున్నవి.

సూ : తత్పురుషః సమానాధికరణః కర్మధారయః 1-2-42.

ప. వి : తత్పురుషః (1-1) సమానాధికరణః (1-1) కర్మధారయః (1-1).

అర్థ : సమానాధికరణమైన తత్పురుషము కర్మధారయ మనఁబడును.

వివ : సమానమైన అధికరణములు – ద్రవ్యములు కలవి సమానాధికరణ ములు. అవి కలది సమానాధికరణము. ఏరెండుపదములు ఒకద్రవ్యమును తెలు పునో యవి సమానాధికరణములనియు నట్టి సమానాధికరణములు గల సమాసము సమానాధికరణమనియు నర్థము నిట గ్రహింపవలయును. ఏతత్పురుషసమాసము సమానాధికరణమగునో దానికి కర్మధారయమనుసంజ్ఞ కలుగును. ఉదాహరణము : శ్వేతాశ్వః, శ్వేతః అశ్వః అను రెండుపదములచేతను వాచ్యమగునది గుఱ్ఱ మొకటియే. కావున నివి రెండును ఒకదాని కొకటి సమానాధికరణములు. ఇట్టి సమానాధికరణములు గల 'శ్వేతాశ్వః' అనుసమాసముకూడ సమానాధికరణసంజ్ఞక మగును. ఇది తత్పురుషము కావున దీనికి కర్మధారయమను విశేషసంజ్ఞను ఈ సూత్రము విధించుచున్నది. ఈ సూత్రమును బట్టియే 'తత్పురుషభేదః కర్మ ధారయః' అని కేవల సమాసప్రకరణమున సమాస పరిచయ ప్రసంగమున చెప్పఁ బడినది.

సూ : సంఖ్యాపూర్వో ద్విగుః 2-1-52.

వృ : తద్ధితార్థేత్యత్రోక్తస్త్రివిధ స్సంఖ్యాపూర్వోద్విగుసంజ్ఞస్స్యాత్.

ప. వి : సంఖ్యాపూర్వ (1-1) ద్విగుః (1-1).

అర్థ : తద్ధితార్థేత్యాదిసూత్రముచే మూఁడు విధములుగా నేర్పడు సమాసము సంఖ్యాపూర్వమైనచో ద్విగువనఁబడును.

వివ : తద్ధితార్థము విషయమైనపుడు, ఉత్తరపదము పరమగునపుడు, సమా హారము వాచ్యమగునపుడును దిగ్వాచకసంఖ్యావాచకపదములు సమానాధికరణసుబంత ముతో సమసించును. అట్లు సమసించు వానిలో సంఖ్యావాచకము పూర్వపదముగా నున్న సమాసమునకు ద్విగువనువిశేషసంజ్ఞ కలుగును. దీనినిబట్టి కేవలసంఖ్యా వాచకపూర్వములగు సమాసములన్నియు ద్విగువులు కావు. తద్ధితార్థేత్యాదిసూత్ర

ముచే నేర్పడు సంఖ్యాపూర్వములే ద్విగువులగునని స్పష్టమైనది. ద్విగువు కర్మధారయములో ఒకభాగము. ఏలయన నిదియు సమానాధికరణమే యగును. దీనిని బట్టి ద్విగువు తత్పురుషముకూడ నగును.

అవ : ద్విగువునకు వచననిర్ణయము చేయఁబడుచున్నది.

సూ : ద్విగురేకవచనమ్ 2-4-1.

వృ : ద్విగ్వర్థ స్సమాహార ఏకవత్ స్యాత్.

ప. వి : ద్విగుః (1-1) ఏకవచనమ్ (1-1).

అర్థ : ద్విగ్వర్థమగు సమాహారము ఒకటి వంటిది.

వివ : ఈ సూత్రమున కనుబంధముగా 'సమాహారగ్రహణం కర్తవ్యమ్' అనునొక వార్తికము గలదు. కావున ద్విగుసమాసముయొక్క అర్థమైన సమాహారము ఒకటివంటిదగును. అనగా అట్టి సమూహమును బోధించు శబ్దమునకు ఏకవచన ప్రత్యయమగునని తాత్పర్యము. ఉదాహరణము ముందు చూపఁబడును.

అవ : ద్విగువునకు లింగనిర్ణయము చేయఁబడుచున్నది.

సూ : సనపుంసకమ్ 2-4-17.

వృ : సమాహారే ద్విగుర్ద్వంద్వశ్చ నపుంసకంస్యాత్.

ప. వి : సః (1-1) నపుంసకమ్ (1-1).

అర్థ : సమాహారార్థమున ద్విగుద్వంద్వములు నపుంసకములగును.

వివ : ఇందు 'సః' - అది అనుతచ్ఛబ్దరూపము పూర్వమున అష్టాధ్యాయిలో చెప్పఁబడిన సమాహారార్థకద్విగుద్వంద్వములను పరామర్శించును. కావున సమాహారార్థముగల ద్విగువు, ద్వంద్వమును నపుంసకలింగములగునని సూత్రార్థము.

అవ : ఇట్లు ద్విగుసంజ్ఞయు, దానిలింగవచనకార్యములు వివరింపఁబడిన పిదప తద్ధితార్థేత్యాదిసూత్రమునందలి 'సమాహారేవాచ్యే' అనుదాని కుదాహరణము చూపఁబడుచున్నది.

వృ : పఞ్చానాం గవాం సమాహారః పఞ్చగవమ్.

వివ ; 'పఞ్చానాం గవాం సమాహారః'-అయిదుగోవుల సమూహము (లౌ.వి) పఞ్చన్ + ఆమ్, గో + ఆమ్. (అలౌ. వి) - ఇందు 'పఞ్చన్ + ఆమ్' అనునది సంఖ్యావాచకపదము. 'గో + ఆమ్' అనునది దానికి సమానాధికరణమైన

పదము. ఈరెండుపదములు గోవులనే తెలుపుచున్నవని తాత్పర్యము. 'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' అనుసూత్రముచే సమాససంజ్ఞ, సమాసమగుటచే ప్రాతిపదికమగును. 'సుపోధాతుప్రాతిపదికయోః' అనుసూత్రముచే సుప్పులకు లుక్కు, 'పఞ్చగో.' 'గోరతద్ధితలుకి' అనుసూత్రముచే 'టచ్' ప్రత్యయము. పఞ్చగో + అ (టచ్) అవాదేశము, 'పఞ్చగవ' ఇది నపుంసకలింగమగును. ఏకవచన ప్రత్యయము చేరును. పఞ్చగవ + సు=పఞ్చగవమ్.

ద్వంద్వతత్పురుషములకు పరపదముయొక్క లింగమగును అను వక్ష్యమాణ లక్షణమున కిది యపవాదము. పఞ్చగవమ్ అనునది ద్విగురూపకర్మధారయము. కర్మధారయరూప తత్పురుషము అగును.

సూ : విశేషణం విశేష్యేణ బహుళమ్ 2-1-57.

వృ : భేదకం భేద్యేన సమానాధికరణేన బహుళం ప్రాగ్వత్. నీలముత్పలం నీలోత్పలమ్. బహుళగ్రహణాత్ క్వచిన్నిత్యమ్. కృష్ణసర్పః, క్వచిన్న, రామో జామదగ్న్యః

ప. వి : విశేషణమ్ (1-1) విశేష్యేణ (3-1) బహుళమ్ (2-1).

అను : సమానాధికరణేన (3-1) సమాసః (1-1)సహ (అవ్య) సుపా(3-1) తత్పురుషః (1-1).

అర్థ : భేదకము, సమానాధికరణమైన భేద్యముతో (విశేష్యముతో) బహుళముగా సమసించును. అది తత్పురుష మగును. ఉదా : నీలముత్పలం నీలోత్పలమ్. బహుళపదగ్రహణమువలన కొన్నియెడల నీసమాసము నిత్యము. కృష్ణసర్పః. కొన్నియెడల సమాసములేదు. రామోజామదగ్న్యః.

వివ : విశేషణము ='దీనిచే నొకవస్తువు విశేషింపఁబడును. ఏ లక్షణము చేత ఒకవ్యక్తియో లేక వస్తువో తనకు సమానమైన జాతినుండి ప్రత్యేకముగా భాసిల్లునో ఆ లక్షణము విశేషమనఁబడును. అట్టి విశేషమును జెప్పునది విశేషణము. ఆ విశేషము కలది విశేష్యము. ఒకజాతియందలి ప్రత్యేకలక్షణమును భిన్నముగా చూపునదియగుటచే విశేషణమును భేదకమనియు నందురు. దానిచే భిన్నముగా తోఁచుపదార్థము లేక వ్యక్తిని తెలుపుపదము భేద్యమనఁబడును. 'తెల్లని గుఱ్ఱము' అనుచోట' 'తెల్లని అనుపదము తక్కినగుఱ్ఱములజాతిలో సాధారణముగా లేని 'తెల్లఁదనము' అనువిశేషమును చెప్పుచున్నది. అనగా నది అశ్వజాతినుండి ఒకవిధమగు గుఱ్ఱమును భేదించుచున్నది. కావున 'తెల్లని' అనునది విశేషణము

లేక భేదకము. గుణము విశేషింపఁబడుచున్నది లేక భేదింపఁబడుచున్నది కావున అది విశేష్యము లేక భేద్యము.

విశేషణవాచకపదము సమానాధికరణమైన విశేష్యవాచకసుబంతముతో బహుళముగా సమసించును.

ఉదా : నీలమ్ ఉత్పలమ్ – నల్లని కలువ-ఇందు 'నీలమ్' అనునది విశేషణము. 'ఉత్పలమ్' విశేష్యము. నీల + సు, ఉత్పల + సు. సమాసమగుటచే ప్రాతిపదికమయి దాని అవయవములగు సుప్పులకు లుక్కు వచ్చును. గుణసంధి, నీలోత్పల + సు = నీలోత్పలమ్. (నపుంసకలింగము). ఇవి రెండును సమానాధికరణములగుటచే దీనికి కర్మధారయమనియు పేరు. (తత్పురుషః సమానాధికరణః కర్మధారయః)

బహుళపదము సూత్రమున నిబద్ధమగుటచే ఈ సమాసము కొన్నియెడల నిత్యము. ఉదా : కృష్ణః లేలిహానః (పాము) కృష్ణ+సు, సర్ప + సు = కృష్ణ సర్ప + సు=కృష్ణసర్పః నిత్యసమాసమగుటచే, 'కృష్ణః సర్పః' అని వాక్యమున వ్యవహరింపరాదు (ఇందు కృష్ణపదము విశేషణము–నల్లపాము అనిఅర్థము).

కొన్నియెడల నీ సమాసముకాదు. ఉదా : రామో జామదగ్న్యః (జమదగ్ని పుత్త్రుఁడైనరాముఁడు)-ఇచట సమాసము కాలేదు. బహుళగ్రహణమిట్టి ప్రయోజనముల నిట సాధించినది.

ఈ సూత్రమున ప్రథమాంతపదము 'విశేషణమ్' అనునది. కాన దానిచే నిర్దిష్టములగు విశేషణవాచకము లుపసర్జనములై పూర్వపదములగును.

సూ : ఉపమానాని సామాన్యవచనైః 2-1-55.

వృ : ఘనశ్యామః.

ప. వి : ఉపమానాని (1-3) సామాన్య వచనైః (3-3).

అను : సమానాధికరణేన (3-1) సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : ఉపసమామనగా ఒకవస్తువును సాదృశ్యముచేత గుర్తింపఁజేయునది. గుర్తింపఁబడునది ఉపమేయము. ముఖము చంద్రునివలె కాంతివంతముగానున్నది అనుచోట చంద్రునితో పోలిక గలముఖముయొక్క జ్ఞానమును చంద్రపదము కలిగించుచున్నది. కావున చంద్రశబ్ద ముపమానము. ముఖము ఉపమేయము. ఉపమానోపమేయముల కొక సమానధర్మ ముండవలయును. చంద్రునిలో గల వర్తు

లత్వ, ఆహ్లాదకత్వాదులు ముఖమునందును గలవు. వీనిని సమానధర్మములందురు. సూత్రములోని సామాన్యపదము ఈ సమానధర్మమునే బోధించును. 'సామాన్యం. వక్తీతి సామాన్యవచనమ్' – సామాన్యమును జెప్పునది సామాన్యవచనము. ఉపమానవాచక సుబంతములు సామాన్యవచనముతో (సమానధర్మమును జెప్పు పదముతో) వైకల్పికముగా సమసించును. సామాన్యవచనము ఉపమానవాచకము నకు సమానాధికరణము కావలయును.

ఉదా : ఘనఇవశ్యామః (కృష్ణః) మేఘమువలె శ్యామవర్ణముగల కృష్ణుఁడు ఇందు 'ఘనః' ఉపమానవాచకము, 'శ్యామః', సమానధర్మవాచకము. (కృష్ణః– ఉపమేయము.) ఘన+సు, శ్యామ+సు, విభక్తిలోపము. ఘనశ్యామ + సు = ఘనశ్యామః

ఈ సూత్రమున ప్రథమాంతపదము 'ఉపమానాని' అనునది. కావున దానిచే నిర్దేశింపఁబడిన ఉపమానవాచకములగు ఘనమున్నగునవి ఉపసర్జనసంజ్ఞకములై పూర్వపదములగును. ఇది సమానాధికరణమైన తత్పురుషమగుటచే కర్మధారయ మగును.

వా॥ శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపదలోపో వక్తవ్యః.

వృ॥ శాకప్రియః పార్థివః శాకపార్థివః. దేవబ్రాహ్మణః.

ప వి. శాకపార్థివాదీనామ్ (6–3) సిద్ధయే (4-1) ఉత్తరపదలోపః (1–1) వక్తవ్యః (1–1).

అర్థ : శాకపార్థివాది సమాసముల సిద్ధికొఱకు ఉత్తరపదలోపము చెప్పఁ దగును. ఉదా : శాకప్రియఃపార్థివః – శాకపార్థివః, దేవబ్రాహ్మణః.

వివ : శాకపార్థివః' అనుసమాసమునకు శాకప్రియః పార్థివః శాకమునిష్ట పడురాజు అనియర్థము. ఇందు 'శాకప్రియః' అను బహువ్రీహిసమాసరూప విశేషణము 'పార్థివః' అను విశేష్యవాచకముతో 'విశేషణం విశేష్యేణబహులమ్' అనుసూత్రముచే సమసించునపుడు పూర్వపదముగా నున్న బహువ్రీహిసమాసము యొక్క ఉత్తరపదమగు 'ప్రియ' శబ్దము లోపించునని యీ వార్తికముయొక్క తాత్పర్యము. ఇక్లే తక్కినవియు చూచునది.

శాకప్రియః పార్థివః–శాకప్రియ + సు, పార్థివ+సు, విభక్తిలోపము,ఉత్తర పదలోపము (పూర్వపదముగానున్న సమాసముయొక్క ఉత్తరపదమునకు లోపము) శాక (ప్రియ) పార్థివ+సు=శాకపార్థివః.

దేవంపూజయతీతి=దేవపూజకః, దేవపూజకః బ్రాహ్మణః - దేవునిపూజించు వాఁడు దేవపూజకుఁడు. దేవపూజకుఁడైన బ్రాహ్మణుఁడు - దేవపూజక + సు, బ్రాహ్మణ+సు, విభక్తిలోపము, ఉత్తరపదలోపము, దేవ(పూజక) బ్రాహ్మణ + సు=దేవబ్రాహ్మణః.

ఇట్టివానిలో ఉత్తరపదలోపము చెప్పఁబడుటచే పూర్వపదమొక సమాసమై యుండవలయుననుట స్పష్టము. ఇట్టి సమాసములు తెలుఁగునను గలవు. గజుల సెట్టి - గాజులమ్ము సెట్టి. ఇందు 'అమ్ము' అను ఉత్తరపదము లోపించినది. లెక్కలపంతులు=లెక్కలుబోధించుపంతులు. ఇట్టివానిని మధ్యమపదలోపసమాసము అనుటయుఁ గలదు.

శాకపార్థివాదిగణము : శాకపార్థివ కుతుపసౌశ్రుత అజాతౌల్వలి - ఆకృతి గణోఽయమ్. కృతాపకృత భుక్తవిభుక్త పీతవిపీత గతప్రత్యాగత యాతానుయాత క్రయాక్రయికా పుటాపుటికా ఫలాఫలికా [మానోన్మానికా] ఇతి శాకపార్థి వాదయః.

అవ : నఞ్ తత్పురుషము చెప్పఁబడుచున్నది.

సూ : నఞ్ 2-2-6.

వృ : నఞ్ సుపా ప్రాగ్వత్.

ప. వి : నఞ్ (1-1),

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1) విభాషా (1-1).

అర్థ : 'నఞ్' అనునది సుబంతముతోఁ గలిసి తత్పురుషసమాసమగును.

వివ : 'నఞ్' అనునది వ్యతిరేకార్థకమైన అవ్యయము. ఇది సాదృశ్యము, అభావము, అన్యత్వము, అల్పత్వము, అప్రాశస్త్యము, విరోధము అనునాఱర్థము లందు వ్యవహరింపఁబడును. ఈ పదము తనతో సమానాధికరణమైన పదముచే వాచ్యమగు దానియొక్క సాదృశ్యము(పోలిక) అభావము(లేకుండుట) అన్యత్వము వేఱువస్తువగుట, అల్పత్వము (తక్కువతనము) అప్రాశస్త్యము, (దానికంటె హైన్యము)విరోధము అనువానిని వ్యక్తము చేయును.

తత్సాదృశ్యమభావశ్చ తదల్పత్వం తదన్యతా,
అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ ప్రకీర్తితాః.

ఇట్టి 'నఞ్' అనునవ్యయము సమర్థమగు సుబంతముతో వైకల్పికముగా సమసించును. ఆ సమాసము తత్పురుషమగును. 'నఞ్' అను దానిలో ఞకార మిత్తు.

ఉదా : న(ఞ్) బ్రాహ్మణః - బ్రాహ్మణుఁడుకానివాఁడు (బ్రాహ్మణసాదృశ్యము గలవాఁడు, బ్రాహ్మణత్వము లేనివాఁడు మున్నగునర్థము లిట సందర్భానుగుణముగ సంభావ్యములు).

న, బ్రాహ్మణ + సు - ఈ సూత్రముచే సమాసము, విభక్తిలోపము 'న+బ్రాహ్మణ' అనియుండును.

అవ : ఇందొక కార్యవిశేషమును ఈ క్రిందిసూత్రము విధించుచున్నది.

సూ : నలోపో నఞః 6-3-73.

వృ : నఞో నస్యలోప ఉత్తరపదే. అబ్రాహ్మణః.

ప. వి : న (లుప్తషష్ఠీకపదము) లోపః (1-1) నఞః (6-1).

అను: ఉత్తరపదే (7-1).

అర్థ : ఉత్తరపదము పరమగునపుడు 'నఞ్' అను అవ్యయముయొక్క నకారమునకు లోపమగును. ఉదా : అబ్రాహ్మణః.

వివ : ఉత్తరపదమనగా సమాసములో చివరనున్నపదము. అది పరమగు నపుడు పూర్వపదమైన 'నఞ్' అనునవ్యయముయొక్క నకారమునకు (న్) లోపము కలుగును.

ఉదా : న + బ్రాహ్మణ, (న్) అబ్రాహ్మణ + సు = అబ్రాహ్మణః.

అవ : 'న + అశ్వ + 'సు' అనుచో 'నఞ్' అనుసూత్రముచే సమాస సంజ్ఞ కలుగగా 'సు' లోపించును. 'నలోపోనఞః' అను సూత్రముచే నకారమునకు లోపము వచ్చి 'అ+అశ్వ' అనియుండును. ఈ క్రింది సూత్రముచే ఇచట నుడాగమము విధింపఁబడుచున్నది.

సూ : తస్మాన్నుడచి 6-3-77.

వృ : లుప్తనకారాన్నఞః ఉత్తరపదస్యాజాదే ర్నుట్. అనశ్వః.

ప. వి : తస్మాత్ (5-1) నుట్ (1-1) అచి (7-1).

అను : ఉత్తరపదే 1).

అర్థ : లోపించిన నకారము గల 'నఞ్' అనుదానికి పరముగనున్న అజాది ఉత్తరపదమునకు 'నుట్' అనునాగమము వచ్చును. ఉదా : అనశ్వః.

వివ : 'తస్మాత్' అనుపదమునకు పూర్వపరామర్శచే లోపించిన నకారము గల నఞ్ శబ్దమునకు పరముగా అనునర్థము కలుగును. 'అచి' అనువర్ణములను గ్రహించు సప్తమ్యంతపదము 'ఉత్తరపదే' అనుదానికి విశేషణము. 'యస్మిన్విధి స్తదాదా వల్గ్రహణే' అనుపరిభాష ననుసరించి 'అజాదౌ ఉత్తరపదే'-'అచ్చు ఆది యందుఁగల ఉత్తరపదము పరమగునపుడు' అనునర్థము వచ్చును. ఇచట తస్మా దిత్యుత్తరస్య అనుపరిభాషనుబట్టి యీ నుడాగమము 'నఞ్' అనుదానికి పరముగా నున్నదానికి రావలయును. ఇచట సప్తమీనిర్దేశముకూడ కలదు గాన నుడాగమము 'నఞ్' శబ్దమునకు ప్రాప్తమగును. ఇట్లిచట విప్రతిషేధము గలదు. 'విప్రతిషేధే పరంకార్యమ్' అను పరిభాష ననుసరించి పంచమీనిర్దేశమే బలీయమై సప్తమిని షష్ఠిగా మార్చును. కావున లోపించిన నకారముగల నఞ్ శబ్దమునకు పరముగా నున్న అజాది ఉత్తరపదమునకు నుడాగమము వచ్చునను ఫలితార్థము సిద్ధించినది. ఇది టిత్తగుటచే అజాది ఉత్తరపదమునకు ఆద్యవయవముగా వచ్చును (ఆద్యన్తౌ టకితౌ).

ఉదా : అ + అశ్వ, లుప్త నకారమగు నఞ్ శబ్దము 'అ' అనునది. దానికి అజాది ఉత్తరపదమగు 'అశ్వ' అనునది పరమైనది కావున నుట్ ఆగమము. అ + నుట్ అశ్వ - ఇందు టకారమిత్తు, ఉకారముచ్చారణార్థము. అ + నశ్వ, అనశ్వ + సు = అనశ్వః = అశ్వముకానిది (అశ్వముకంటె అన్యమైనజంతువు అనియర్థము).

అవ : ఈపైరెండుసూత్రములు ప్రవర్తింపని 'నైకధా' మున్నగువాని సాధుత్వము వృత్తికారునిచే నిరూపింపఁబడుచున్నది.

వృ : నైకధేత్యాదౌతు నశబ్దేన సహ సుప్సుపేతి సమాసః.

అర్థ : నైకధా మున్నగువాని యందన్నవో న శబ్దముతో సుప్సుపా అను దానిచే సమాసము.

వివ : న + ఏకధా, న + ఏకః మొదలగువానియందు 'నలోపో నఞః' అనుసూత్రముచే నకారములోపమును, 'తస్మాన్నుడచి' అను సూత్రముచే నుడాగమమును రాకపోవుటకు కారణమేమో పరిశీలింపఁబడుచున్నది. (అవి వచ్చినచో అనేకధా, అనేకః అనురూపము లుండవలయును). ఇచట వ్యతిరేకార్థక శబ్దము

'నఞ్' అనునదికాదు. 'న' ఇది 'నఞ్' కంటె వేఱైన మఱియొక అవ్యయము. నకారలోపము 'నఞ్' అనుదానికే విధింపఁబడినది కాని 'న' అనుదానికి విధింపఁబడలేదు. కావున నకారలోపము రాదు. నకారలోపమువచ్చిన 'నఞ్'శబ్దమునకు పరమునన్నున్న అజాది ఉత్తరపదమునకే నుడాగమము. కావున నదియు నిట ప్రవర్తింపదు అయినచో సమాసముకూడ 'నఞ్' శబ్దమునకేకదాః విధింపఁబడినది. ఇచట సమాసమగుట యెట్లు? అనుశంక కలుగును. ఇచట సమాసమును విధించుసూత్రము 'సహసుపా' అనునది అని భావించినచో సరిపడును. సమాసమగుటకు, నలోప నుడాగమములు రాకుండుటకు అట్టియెడ అభ్యంతరము లేదు. కావున నైకధా, నైకః మున్నగు సమాసములు సమ్మతములే. ఇందలిది ఇకారమిత్తుగాలేని 'న' అను అవ్యయము. నఞ్ శబ్దముతో సమాసమైన అనేకదా, అనేకః మున్నగునవియును సాధువులే.

'నఞ్' అనునది సమర్థసుబంతముతో సమసించు తత్పురుషమగుటచే దీనికి నఞ్ తత్పురుష సమాసమని వ్యవహారము.

అవ : ఇటుపై గతిప్రాదిసమాసములు చెప్పఁబడుచున్నవి. ఇవి నిత్యసమాసములగుట నీ క్రింది వృత్తివాక్యము సూచించుచున్నది.

వృ : నిత్యం క్రీడేత్యతో నిత్యమిత్యను వర్తమానే.

అర్థ : 'నిత్యంక్రీడా' ఇత్యాదిసూత్రమునుండి 'నిత్యమ్' అనుపదము అనువర్తమానమగుచుండగా....

వివ : సమాసాధికారమున 'విభాషా' అనుపదము సాధారణముగాఁగలదు దానినిబట్టి సమాసములన్నియు వైకల్పికములు కావలసియుండగా వక్ష్యమాణములగు కొన్ని సమాసములు నిత్యసమాసములగుటకై 'నిత్యమ్' అనుపదము 'నిత్యం క్రీడాజీవికయోః' అనుసూత్రమునుండి అనువర్తింపఁజేయవలయును దీనినిబట్టి యిపుడు చెప్పఁబోవు కొన్నిసమాసములు నిత్యముగా నగును.

సూ : కుగతిప్రాదయః 2-2-18.

వృ : ఏతే సమర్థేన నిత్యం సమస్యన్తే. కుత్సితః పురుషః కుపురుషః.

ప. వి : కు, గతి, ప్రాదయః (1-3).

అను : సహ (అవ్య) సుపా (3-1) సమాసః (1-1) తత్పురుషః (1-1).

అర్థ : కుశబ్దము, గతిసంజ్ఞకములును, ప్రాదులును, సమర్థములగు సుబంతముతో నిత్యముగా సమసించును. ఉదా : కుత్సితః పురుషః కుపురుషః.

వివ : 'కు' అనునవ్యయమును, 'గతి' అనుసంజ్ఞగలశబ్దములును, ప్రమున్నగునవియును సమర్థములగు సుబంతములతో కూడిసమాసములగును. ఈ సూత్రములోనికి నిత్యపద మనువృత్తమగుటవలన నివి నిత్యసమాసములగును. వీనికి స్వపదములతో విగ్రహముండదని తాత్పర్యము. ప్రాదులకు క్రియతో కలయిక యున్నపుడు గతిసంజ్ఞకలదు. అవికాక గతిసంజ్ఞకములు ముందు వివరింపఁబడుచున్నవి. క్రియతో యోగములేనివానికి సమాససిద్ధికై ప్రాదులు పఠల సూత్రమున గ్రహింపఁబడినవి.

ఉదా : కుత్సితః పురుషః - కుత్సితుఁడైన పురుషుఁడు-కుత్సితుఁడు అనునర్థముగల 'కు' అనునవ్యయము, 'పురుషః' అను ప్రథమాంతముతో సమసించును. కు, పురుష + సు, విభక్తిలోపము, కుపురుష + సు = కుపురుషః, కేవల 'కు' శబ్దముతో విగ్రహము చూపుటకు వీలులేదు కావున నిది నిత్యసమాసము.

అవ : పైసూత్రమునందలి గతిసంజ్ఞ వివరింపఁబడుచున్నది.

సూ : ఊర్యాది చ్విడాశ్చ 1-4-61.

వృ : ఊర్యాదయశ్చ్వ్యన్తా డాజన్తాశ్చ క్రియాయోగే గతిసంజ్ఞాస్స్యుః.

ప. వి : ఊర్యాదిచ్విడాచః (1-3) చ (అవ్య).

అను : గతిః (1-1) క్రియాయోగే (7-1).

అర్థ : ఊరీమొదలగునవియును, చ్విప్రత్యయాంతములును, డాచ్ ప్రత్యయాంతములును క్రియాయోగమున్నపుడు గతిసంజ్ఞకములగును.

వివ : ఊరీమొదలగు కొన్నిశబ్దములొకగణమున పఠింపఁబడినవి. 'చ్వి డాచ్ అనునవి ప్రత్యయములు కావున ప్రత్యయగ్రహణ పరిభాషచే చ్వి ప్రత్యయాంతములు, డాచ్ ప్రత్యయాంతములును అనిఅర్థము కలిగినది. అభూతతద్భావార్థమున, అనగా పూర్వముట్లులేనిదటగుటఅనునర్థమున కృ, భూ, అస్ధాతువుల యోగమున నామములకు 'చ్వి' ప్రత్యయము వచ్చును. (సూ. 'కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః') కనీసము రెండచ్చులు కలిగిన అర్థభాగముగల అవ్యక్తధ్వని ననుకరించు శబ్దమునకు 'ఇతి' శబ్దము పరముగా లేనియపుడు, కృ, భూ, అస్ ధాతువులయోగమున్నపుడు డాచ్ ప్రత్యయము వచ్చును. క్రియావాచకముతో యోగమున్న ఊరీ మున్నగువానికిని, చ్విప్రత్యయాంతములకును, డాచ్

ప్రత్యయాంతములకును గతిసంజ్ఞ కలుగును. సమాసముల కుదాహరణములు క్రమ. ముగా చూపఁబడుచున్నవి.

వృ : ఊరీకృత్య, శుక్లీకృత్య, పటపటాకృత్య.

వివ : ఇవి మూఁడును క్రమముగా ఊర్యాదులకు, చ్విప్రత్యయాంతము లకు, డాచ్ ప్రత్యయాంతములకును, 'కృత్వా' అనుపదముతో సమాసమగుట కుదాహరణములు.

(i) ఊరీకృత్య : అంగీకరించి 'ఊరీ' అనునది అంగీకారము అను నర్థముగల అవ్యయము. ''కృత్వా' అను అసమాపకక్రియా రూపముతో యోగముండుటచే గతిసంజ్ఞ కలుగును. అది కృత్వా అనుపదముతో 'కుగతిప్రాదయః' అనుసూత్రముచే సమసించును. ఊరీ మా + క్త్వా, సమాససంజ్ఞము రాఁగా 'సమాసేఽనఞ్ పూర్వేక్త్వోల్యప్' అను సూత్రముచే క్త్వా ప్రత్యయమునకు 'ల్యప్' అనునాదేశము వచ్చును. ఊరీ, కృ + త్వా, ఊరీ కృ + య (లకారపకారములిత్తులు) 'హ్రస్వస్యపితి కృతితుక్' అనుసూత్రముచే తుగాగమమురాఁగా 'ఊరీకృత్య' అగును.

(ii) శుక్లీకృత్య – అశుక్లం శుక్లంకృత్వా – తెల్లగాలేనిదానిని తెల్లగాచేసి అనునర్థమున కృధాతువుతో యోగమున్న శుక్లశబ్దమునకు 'చ్వి' ప్రత్యయము. శుక్ల + చ్వి – ఇందు చకారమిత్తు. ఇకారముచ్చారణార్థము, వకారమునకు 'వేరపృ క్తస్య' అనుసూత్రముచే లోపము. శుక్ల – దీనికి 'అస్యచ్వౌ' అను వక్ష్యమాణ సూత్రముచే ఈకారము అంతాదేశమగును. ఇదిగతి సంజ్ఞకము.శుక్లీ + కృత్వా, 'కుగతిప్రాదయః' అనుసూత్రముచే సమాసంజ్ఞ, ల్యబాదేశము, శుక్లీకృత్య.

(iii) పటపటా కృత్య : ఇందుపటత్ అనునది అవ్యక్తధ్వని ననుకరించు శబ్దము ఇందు రెండచ్చులుగలవు. 'డాచ్' ప్రత్యయముచేయఁగోరునపుడు శబ్దము ద్విరుక్తమగును. 'పటత్ పటత్ + కృత్వా' అనియుండగా 'అవ్యక్తాను కరణాద్ ద్వ్యజవరార్థాదనితౌ డాచ్ 5-4-57' అనుసూత్రముచే 'డాచ్' ప్రత్య యము వచ్చును. పటపటా, కృత్వా (పటపటా అనుదాని ప్రక్రియ తద్ధిత ప్రక రణమున చూడఁదగును. ఇందు 'పటపటా' అనునది డాజంతము కావున గతిసంజ్ఞక మగును. కావున సమాసముకాఁగా (కుగతిప్రాదయః) క్త్వా ప్రత్యయమునకు 'ల్యప్' ఆదేశము వచ్చి 'పటపటాకృత్య' అగును. (పటత్ పటత్ అని) క్త్వాప్రత్యయాంతము అవ్యయములగుటచే వీనికి చేరుసుప్ ప్రత్యయములకు లుక్కు వచ్చును.

ఊర్యాదిగణము : ఊరీ ఉరరీ తన్థీ తాలీ ఆతాలీ వేతాలీ ధూలీ ధూసీ శకలా సంశకలాధ్వంసకలా భ్రంసకలా గులుగుధా సజూస్ ఫలఫలీ విక్లీఆక్లీ ఆలోష్టీ కేవాలీ కేవాసీ సేవాసీ (పర్యాలీ) శేవాలీ వర్షాలీ అత్యూమశా వశ్మశా (మస్మసా) మసమసా ఔషట్ (శ్రౌషట్) వౌషట్ వషట్ స్వాహా స్వధా బన్ధా ప్రాదుస్ అత్ ఆవిస్ – ఇత్యూర్యాదయః.

అవ : ప్రాదులలోనిదగు 'సు' అనునది సుబంతముతో సమసించుట కుదా హరణము చూపఁబడుచున్నది.

వృ : శోభనః పురుషః సుపురుషః.

మంచిగుణములుగలపురుషుఁడు. సు, పురుష + సు, కుగతిప్రాదయః- సమాసము, విభక్తిలోపము, సుపురుష + సు = సుపురుషః. ఇచట 'సు' అను దానికి క్రియాయోగములేదు గావున దీనికి గతిసంజ్ఞలేదు. కావుననే మరల ప్రాదులు సూత్రమున విడిగా గ్రహింపఁబడినవి.

అవ : 'కుగతిప్రాదయః' అనుసూత్రమునందలిప్రాదయః అను పదమునకు సంబంధించిన వార్తికములు కొన్ని యిట చెప్పఁబడుచున్నవి.

(1) వా॥ ప్రాదయో గతాద్యర్థే ప్రథమయా 1335.

వృ : ప్రగత ఆచార్యః ప్రాచార్యః.

ప. వి : ప్రాదయః (1-3) గతాద్యర్థే (7-1) ప్రథమయా. (3-1).

అర్థ : ప్రాదులు గతాద్యర్థమున ప్రథమాంతముతో సమసించును. ఉదా : ప్రగతః ఆచార్యః ప్రాచార్యః.

వివ : ఈ వార్తికములు ప్రాదులయొక్క అర్థమును ఉత్తరపదముయొక్క విభక్తిని నిర్ణయించుచున్నవి. వెళ్ళినవాఁడు మున్నగునర్థములందు వర్తించు 'ప్ర' మున్నగునవి ప్రథమాంతపదముతో సమసించును ఉదా ; ప్రగతః ఆచార్యః - ఇచట ప్ర అనునది 'గతః' అనునర్థమున నున్నది. ప్ర, ఆచార్య + సు, సమాసము, విభక్తిలోపము, సంధి, ప్రాచార్య + సు = ప్రాచార్యః-వెడలిన ఆచార్యుఁడు.

(2) వా॥ అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా 1336.

వృ॥ అతిక్రాన్తోమాలామితి విగ్రహే.

ప. వి : అత్యాదయః (1-3) క్రాన్తాద్యర్థే (7-1) ద్వితీయయా (3-1).

అర్థ : దాటినవాఁడు దాటినది మున్నగునర్థములందున్న 'అతి' మున్నగునవి ద్వితీయాంతముతో సమసించును. 'అతిక్రాన్తః మాలామ్' - మాలను దాటిన వాఁడు లేక దాటినది అను విగ్రహమున (అగు కార్యము ముందు సూత్రములచే తెలుపఁబడుచున్నది).

వివ : అతిక్రమించినది లేక అతిక్రమించినవాఁడు మున్నగు నర్థములుగల 'అతి' మున్నగునవి (ప్రాదిగణములోనివి) ద్వితీయాంతమగు సమర్థసుబంతముతో సమసించును.

ఉదా : అతిక్రాన్తః మాలామ్-అను లౌకికవిగ్రహమున అతి అనునది 'మాలామ్' అనుద్వితీయాంతపదముతో సమసించుచున్నది. అతి, మాలా + అమ్ సమాససంజ్ఞ, విభక్తిలోపము కలిగి 'అతిమాలా' అనియుండును.

అవ: పై ఉదాహరణమున 'మాలా' శబ్దమునకు కూడ ఈ క్రిందిసూత్రముచే ఉపసర్జన సంజ్ఞ చేయఁబడుచున్నది.

సూ : ఏక విభక్తి చా పూర్వనిపాతే 1-2-44.

వృ : విగ్రహే యన్నియతవిభక్తికం తదుపసర్జనసంజ్ఞం స్యాన్నతుతస్య పూర్వనిపాతః.

ప వి : ఏకవిభక్తి (1-1) చ (అవ్య) అపూర్వనిపాతే (7-1).

అను : ఉపసర్జనమ్ (1-1).

అర్థ : విగ్రహవాక్యమున నియతమైన విభక్తిగలపదమునకు నుపసర్జనసంజ్ఞ కలుగును. కాని దానికి పూర్వనిపాతము లేదు.

వివ : సమాసవిధాయక సూత్రమున ప్రథమానిర్దిష్టమైనది ఉపసర్జనమగునని పూర్వము చెప్పఁబడినది. ప్రథమానిర్దిష్టములు కానివియు కొండొకయెడల నుప సర్జనములగుట నీ సూత్రము చెప్పుచున్నది. 'ఏకవిభక్తి' అనగా ఒకేవిభక్తి నియత ముగాఁ గలది. సమాససంజ్ఞ పొంది పదమైనదానికి ఈ సంజ్ఞతో అవసరములేదు. కావున విగ్రహవాక్యమున నేది నియతవిభక్తికమో అదియు నుపసర్జన మగునను నర్థమీ సూత్రమునకు కలిగినది. విగ్రహములో ఏ పదముయొక్క విభక్తిని మార్చి నచో సమాసమగుటకు వీలుండదో అట్టిది నియతవిభక్తికము.దానికిని ఉపసర్జన సంజ్ఞ యుండును. 'ఉపసర్జనం పూర్వమ్' అనుసూత్రమునుబట్టి ఉపసర్జనము సమాస మున పూర్వపదము కావలయును. కాని యీ సూత్రముచే నుపసర్జనమైనదానికి

పూర్వప్రయోగము (పూర్వపదమగుట) లేదని 'అపూర్వనిపాతే' అను దళముచే చెప్పఁబడినది. కావున పూర్వపదప్రయోగము కాక తక్కిన ఉపసర్జన కార్యములు దీని కగునని తాత్పర్యము.

ఉదా : 'అతిక్రాన్తో మాలామ్' అనునది 'అతిమాలః' అను సమాసముయొక్క విగ్రహము. ఇందు 'అతిక్రాన్త' అనుదాని కేవిభక్తియైనను చేర్పవచ్చును. చేర్చినచో సమాససంజ్ఞాసిద్ధికి భంగము రాదు. అతిక్రాన్తః మాలామ్, అతిక్రాన్తం మాలామ్, అతిక్రాన్తేన మాలామ్ ఇత్యాదిగా నుండవచ్చును. మాలాశబ్దమునకు మాత్రము ద్వితీయను మార్చినచో సమాసమే యేర్పడదు. అత్యాదులు ద్వితీయాంతముతో మాత్రమేకదా సమసించును? కావున 'మాలా' శబ్దమిట నియత విభక్తికము. దాని కీసూత్రముచే ఉపసర్జనసంజ్ఞ కలుగును. 'అతి' అనునది 'ప్రథమానిర్దిష్టమ్' ఇత్యాదిసూత్రముచే ఉపసర్జనమై పూర్వపదమగును.

అవ : పై సూత్రముచే ఉపసర్జనమైనచో నగు ప్రయోజనము నీక్రింది సూత్రము వివరించుచున్నది.

సూ : గోస్త్రియో రుపసర్జనస్య 1-2-48.

వృ : ఉపసర్జనం యో గోశబ్దః, స్త్రీప్రత్యయాన్తంచ తదన్తస్య ప్రాతిపదికస్య హ్రస్వః స్యాత్. అతిమాలః.

ప. వి : గోస్త్రియోః (6-2) ఉపసర్జనస్య (6-1).

అను : హ్రస్వః (1-1) ప్రాతిపదికస్య (6-1).

వివ : 'ఉపసర్జనస్య' అనుపదము 'గోస్త్రియోః' అనుదానికి విశేషణము. అది అద్వంద్వములో ఒక్కొక్కదానితో నన్వయించుటచే ఉపసర్జనమైన గోశబ్దము, ఉపసర్జనమైన స్త్రీప్రత్యయాంతము అనునర్థమేర్పడును. ఇవి ప్రాతిపదికస్య అను దానికి విశేషణములు. తదంతవిధిచే ఉపసర్జనమగు గోశబ్దము, స్త్రీప్రత్యయాంతము అంతమునగల ప్రాతిపదికమునకు' అని అగును. అట్టిదానికి హ్రస్వము నీసూత్రము విధించుచున్నది

ఉదా : 'అతిమాలా' అనునది సమాసమగుటచే ప్రాతిపదికమగును. ఇందు 'మాలా' శబ్దము స్త్రీప్రత్యయాంతము. (మాల + టాప్ = మాలా) దానికి 'ఏకవిభక్తిచాపూర్వనిపాతే' అనుసూత్రముచే ఉపసర్జనసంజ్ఞ కలుగును. కావున ఉపసర్జన సంజ్ఞగల స్త్రీప్రత్యయాంతమగు 'మాలా' శబ్దముఅంతమునగల ప్రాతిపదికమగు 'అతిమాలా' అనుదానికి హ్రస్వము అగును. 'అలోఽన్త్యస్య' అనుపరిభాషచే తుదివర్ణమగు ఆకారమునకు హ్రస్వము. అతిమాల+సు=అతిమాలః.

(3) వా॥ అవాదయః క్రుష్టాద్యర్థే తృతీయయా 1337.

వృ॥ అవక్రుష్ట కోకిలయా – అవకోకిలః.

ప. వి : అవాదయః (1-3) క్రుష్టాద్యర్థే (7-1) తృతీయయా (3.1).

అర్థ : క్రుష్ట - పిలువఁబడిన – మున్నగు నర్థములందు వ్యవహరింపఁబడు 'అవ' మున్నగునవి తృతీయాంతపదముతో సమసించును. ఉదా : అవక్రుష్టః కోకిలయా – అవకోకిలః

వివ : 'అవ' మున్నగుప్రాదులు 'పిలువఁబడిన' మున్నగునర్థములలో వర్తమానములై తృతీయాంతపదముతొ సమసించును.

ఉదా : అవక్రుష్టః కోకిలయా – కోకిలచేత పిలువఁబడినవాఁడు అవ, కోకిలా + టా, సమాససంజ్ఞ, విభక్తిలోపము, అవకోకిలా ఇందలి రెండుపదములును ఉపసర్జనములగును. కోకిలాశబ్దమున కుపసర్జనసంజ్ఞ ఏకవిభక్తి చాపూర్వనిపాతే అనుసూత్రముచేఁ గలుగును. 'గోస్త్రియోరుపసర్జనస్య' అనుసూత్రముచే తుదిదీర్ఘమునకు హ్రస్వము. అవకోకిల + సు = అవకోకిలః.

(4) వా॥ పర్యాదయో గ్లానాద్యర్థే చతుర్థ్యా 1338.

వృ॥ పరిగ్లానోఽధ్యయనాయ పర్యధ్యయనః.

ప. వి : పర్యాదయః (1-3) గ్లానాద్యర్థే (7-1) చతుర్థ్యా (3-1).

అర్థ : పరిమున్నగునవి గ్లానమున్నగునర్థములందు చతుర్థ్యంతముతో సమసించును. ఉదా : పరిగ్లానోఽధ్యయనాయ పర్యధ్యయనః.

వివ : గ్లానః = అలసినవాఁడు మున్నగు నర్థములందు 'పరి' మున్నగు ప్రాదులు చతుర్థ్యంతపదముతో సమసించును.

ఉదా : పరిగ్లానోఽధ్యయనాయ-అధ్యయనముకొఱకు అలసినవాఁడు - పరి అధ్యయన + ఙే, విభక్తిలోపము. పరి + అధ్యయన, యణాదేశము, పర్యధ్యయన + సు+పర్యధ్యయనః.

(5) వా॥ నిరాదయః క్రాన్తాద్యర్థే పఞ్చమ్యా 1339.

వృ : నిష్క్రాన్తః కౌశామ్బ్యా నిష్కౌశామ్బిః.

ప. వి: నిరాదయః (1-3) క్రాన్తాద్యర్థే (7-1) పఞ్చమ్యా (3-1).

అర్థ : క్రాన్త = వెడలినవాఁడు, మున్నగునర్థములందు వర్తమానములగు

'నిర్' మున్నగునవి పంచమ్యంతముతో సమసించును ఉదా : నిష్క్రాన్తః కౌశామ్బ్యాః - నిష్కౌశామ్బిః

వివ : నిర్ మున్నగు ప్రాదులు, వెళ్ళినవాఁడు మున్నగునర్థములు గలవియై పంచమ్యంతపదముతో సమసించును. ఉదా : నిష్క్రాన్తః కౌశామ్బ్యాః-కౌశామ్బీ నగరమునుండి వెడలినవాఁడు.

నిర్ + కౌశామ్బీ + ఙసి, సమాసము, ప్రాతిపదికసంజ్ఞ, విభక్తిలోపము నిర్ + కౌశామ్బీ, రేఫమునకు విసర్గము, దానికి 'ఇదుదుపధస్య చాప్రత్యయస్య' అనుసూత్రముచే షకారాదేశము, నిష్కౌశామ్బీ ఇందు కౌశామ్బీ అనునది ఉపసర్జన సంజ్ఞగల స్త్రీ ప్రత్యయాంతము. (ఏకవిభక్తి చాపూర్వనిపాతే). కావున దీని తుదిదీర్ఘమునకు గోస్త్రియోరిత్యాది సూత్రముచే హ్రస్వము రాగా నిష్కౌశామ్బి అగును. నిష్కౌశామ్బి + సు = నిష్కౌశామ్బిః.

ఈ యైదువార్తికములు 'కుగతిప్రాదయః' అనుసూత్రములోని 'ప్రాదయః' అనుభాగమునకు వ్యాఖ్యాప్రాయములు. కుగతిప్రాదయః అనుసూత్రముచే నేర్పడిన సమాసములను గతిసమాసములు లేక ప్రాది సమాసములని వ్యవహరింతురు. ఇవి తత్పురుషములో ఒకభాగము.

అవ : ఉపపదసమాసమును విధింపఁబోవుచు ఉపపదమననేమో వివరించుచున్నారు.

సూ : తత్రోపపదం సప్తమీస్థమ్ 3-1-92.

వృ : సప్తమ్యన్తేపదే కర్మణీత్యాదౌ వాచ్యత్వేనస్థితం కుమ్భాది తద్వాచకం పదముపపదసంజ్ఞం స్యాత్.

ప. వి : తత్ర (అవ్య) ఉపపదమ్ (1-1) సప్తమీస్థమ్ (1-1).

అర్థ : ధాత్వధికారమున సప్తమ్యంతపదములగు కర్మణి మున్నగువాని యందు వాచ్యరూపముననున్న కుండమొదలగు వస్తువులను తెలుపు 'కుమ్భ' మున్నగు పదములకు ఉపపదమనిపేరు.

వివ : దీనికి పూర్వసూత్రము 'ధాతోః' అనునధికారసూత్రము. (3-1-91) అది తృతీయాధ్యాయము కడవఱకు అధికారము. కావున అనంతరసూత్రమయిన దీనియందలి తత్ర = అందు అనుపదమునకు 'ధాత్వధికారమునందు' అను నర్థము కలుగును. సప్తమీస్థమ్ అనగా సప్తమియందున్నది. అని స్థూలమైన

యర్థము. 'సప్తమీ' అనుదానికి ప్రత్యయగ్రహణపరిభాషచే సప్తమ్యంతపదము అర్థమగును. కాన 'సప్తమీస్థమ్' అనగా సప్తమ్యంత పదస్థము-సప్తమ్యంత పదము నందున్నది అనియర్థము. పదమనగా అక్షరసముదాయస్వరూపము అది ఒక వస్తువునో ఒకవ్యక్తినో ఒకభావాదికమునో తెలియఁ జేయును. ఆ వస్తువు మున్నగునవి పదవాచ్యములు. పదముచేత తెలుపఁబడునవి. పదమనగా వాచ్యములగు వస్తువులకు వాచకము (వచించునది). ప్రకృతసూత్రమున సప్తమ్యంతపదస్థమనగా సప్తమ్యంత పదముచేత వాచ్యమగు వస్త్వాదికము. శబ్దశాస్త్రమున శబ్దములే గ్రాహ్యములు కాని వస్తువులు కాదు. కావున ఆయావస్తువులను తెలుపుపదము లిట గ్రాహ్యములు. అట్టిపదములు ఉపపదసంజ్ఞకములని సూత్రభావము. ధాతువునకు సమీపమున నుండుపదమని స్థూలమైనయర్థము.

ఉదా : 'కర్మణ్యణ్' అనుసూత్రము ధాత్వధికారములోనిది. (3-2-1) ఇందు సప్తమ్యంతపదము 'కర్మణి' అనునది. దానిచేత వాచ్యములగునవి కర్మవాచకములగు కుండ మున్నగు వస్తువులు. (కుంభంకరోతి-కుండనుజేయుచున్నాఁడు) వానిని తెలుపుపదములగు 'కుంభమ్' మున్నగునవి 'కుంభమ్ కృ + అణ్' మున్నగుస్థలములలో ఉపపదములు.

అవ : ఉపపదమననేమో వివరింపఁబడిన పిదప దానికి సమర్థమైన దానితో సమాసము నీ క్రిందిసూత్రము విధించుచున్నది.

సూ : **ఉపపదమతిఙ్ 2-2-19.**

వృ : ఉపపదం సుబన్తం సమర్థేన నిత్యం సమస్యతే. అతిఙన్తశ్చాయం సమాసః. కుమ్భం కరోతీతి కుమ్భకారః.

ప వి : ఉపపదమ్ (1-1) అతిఙ్ (1 1).

అను : సమాసః (1-1) తత్పురుషః (1-1) నిత్యమ్ (2-1).

అర్థ : ఉపపదము సమర్థమైన దానితో నిత్యముగా సమసించును. ఇది అతిఙన్తము కావలయును. ఉదా : 'కుమ్భంకరోతి' అనునర్థమున 'కుంభకారః' అగును.

వివ : ఉపపదము పూర్వసూత్రమున నిర్వచింపఁబడినది. సమర్థమనగా మఱియొకపదముతోఁ గూడి ఒకేయర్థము నొసఁగుశక్తిగలపదము. (చూ. సమర్థః పదవిధిః). ఉపపదము సమర్థమగు శబ్దస్వరూపముతో నిత్యముగా సమసించును. ఆ సమాసమునకు తత్పురుషమని పేరు.

అధికారరూపమున వచ్చు 'సమాసః' అనుదానికి 'అతిఙ్' అనునది విశేషణము. తదంతవిధిచే 'అతిఙన్తమైనసమాసము' అనునర్థము కలుగును. అనగా నీ సూత్రముచే నేర్పడుసమాసము అతిఙన్తమగునని భావము. 'తిఙ్' అనగా క్రియా విభక్తి. అదికానిది 'అతిఙ్.' తిఙ్ అంతమునఁ లేనిది 'అతిఙన్తము'. అనగా ఉపపదము 'కరోతి' మున్నగు క్రియావాచకపదములతో సమసింపదని తాత్పర్యము.

ఉదా : 'కుంభం కరోతి' అనునర్థమున కర్మవాచకమగు కుంభశబ్దము ఉపపదముగా నుండగా కృధాతువునకు 'అణ్' ప్రత్యయము వచ్చును. (కర్మణ్యణ్) కుంభ+అమ్, కృ + అణ్, కృలోని ఋకారమునకు వృద్ధివచ్చి 'కార' అగును. (అచోఞ్ణితి) ఈదశలో సమాసము (ప్రకృతసూత్రముచే) కుంభ+అమ్, కార, విభక్తి లోపము. కుంభకార + సు = కుంభకారః. కుండలుచేయువాఁడు, కుమ్మరి.

అవ : సూత్రమునందలి 'అతిఙ్' పదముయొక్క సార్థక్యము పరీక్షింపఁబడుచున్నది.

వృ : అతిఙ్ కిమ్? మాభవాన్ భూత్. మాఙిలుఙితి సప్తమీనిర్దేశాన్మాఙుపపదమ్.

అర్థ : అతిఙ్ పదమేల? మాభవాన్ భూత్. 'మాఙిలుఙ్' అనుసూత్రమున సప్తమీనిర్దేశమువలన 'మాఙ్' ఉపపదమగును.

వివ . సూత్రమున అతిఙ్ పదము లేనిచో నష్టమేమి? లేనిచో 'మా' అను నిషేధార్థక అవ్యయమునకు 'భూత్' అనుతిఙంతముతో సమాసము ప్రాప్తమగును. 'మాఙ్' అనునవ్యయము 'మాఙిలుఙ్' అనుసూత్రమున సప్తమ్యంతపదముచే నిర్దేశింపఁబడినది కావున 'తత్రోపపదమ్' ఇత్యాది సూత్రముచే దానికి ఉపపదసంజ్ఞ కలుగును సూత్రమున 'అతిఙ్' పదములేనియెడల నది 'భూత్' అనుతిఙన్తముతో సమసింపవలసివచ్చును. అది సమ్మతము కాదు. దానిని వారించుటకై 'అతిఙ్' పదము సూత్రమున నిబద్ధమాయెను. 'మాభూత్' అనునది సమాసము కాదని తెలుపుటకై రెండుపదములకు నడుమ 'భవాన్' అను సుబంతము చేర్పఁబడినది. లేనిచో 'మాభూత్' అనునది సమాసమను భ్రాంతికలుగును.

అవ : నిజమునకీ సూత్రమున 'అతిఙ్' పద ముండ నక్కరలేదు. ఏలయన 'సహ సుపా' అనునది యిచటికి అనువృత్తమగును. అపుడు ఉపపదము సమర్థమగు సుబంతముతో సమసించునని అర్థమేర్పడును. సుబంత మీసమాసమున

నుత్తరపదమగును. ఉత్తరపదము సుబంతమైన సమాసము తిఙన్తమగుట అసంభవము కదా ! ఇఁక 'అతిఙ్' అనుపదము సూత్రమునవేల? ఇట్లీసూత్రమున 'అతిఙ్' పదము వ్యర్థమై యీ క్రిందిపరిభాషను జ్ఞాపకము చేయుచున్నది (సూత్రకర్త ఒకవిషయమును సూచింపఁగోరి వ్యర్థమనిపించుపదములను కొన్నింటిని సూత్రములందుంచుట యీ వ్యాకరణమున నందందు కన్పట్టును. సూచింపఁబడిన విషయమునుబట్టి యాపదము లెట్లును వ్యర్థములుకావు కనుక నిది దోషముగా సంభావింపఁబడదు ఇట్టిపద్ధతిని 'జ్ఞాపకము' అని వ్యవహరింతురు). మఱియు 'సుపా' అనుపదమిందనువృత్తికాదనియు 'అతిఙ్' పదముచేఁ దెలుపఁబడినది.

(ప) గతికారకోపపదానాం కృద్భిస్సహ సమాసవచనం ప్రాక్ సుబుత్పత్తేః.

వృ : వ్యాఘ్రీ, అశ్వక్రీతీ, కచ్ఛపీ

ప వి : గతి....పదానామ్ (6-3) కృద్భిః (3-3) సహ (అవ్య) సమాసవచనమ్ (1-1) ప్రాక్ (1-1) సుబుత్పత్తేః (5-1).

అర్థ : గతులకు. కారకములకు, ఉపపదములకును కృదంతములతో సుబుత్పత్తికి పూర్వము సమాసము చెప్పవలయును. ఉదా : వ్యాఘ్రీ, అశ్వక్రీతీ, కచ్ఛపీ.

వివ : గతులనగా క్రియాయోగముగలప్రాదులును, ఊర్యాదులును, చ్విడాచ్ ప్రత్యయాంతములును. కారకములనగా కర్మాదులు. ఉపపదములనగా ధాత్వధికారమున సప్తమ్యంతపదవాచ్యములకు వాచకములు. కృత్తులనగా ధాతువులకుఁ జేరు తిఙ్భిన్న ప్రత్యయములు. ప్రత్యయగ్రహణపరిభాషచే 'కృదంతములతో' ననునర్థము వచ్చును. కృదంతములు ప్రాతిపదికములగుటచే వానికి పదత్వసిద్ధికై సుప్ ప్రత్యయములు చేరును కాని యీ పరిభాషచే సుప్పులు చేరని కృదంతములతోడనే గత్యాదులు సమసించునని చెప్పఁబడినది. ఈ యర్థము 'ఉపపదమతిఙ్' సూత్రమునందలి 'అతిఙ్' పదము వ్యర్థమగుటవలన సిద్ధించినదని యీ పరిభాష యొక్క అవతారికలో చెప్పఁబడినది. సుప్పులు చేరనికృత్తులు, సుబంతములును గావు, తిఙంతములును కావు. సమాసమైనపిదప సముదాయమునకు సుప్పు చేరును. ఇట్లు చెప్పనిచో ఈ క్రింది ఉదాహరణములందు ఇష్టరూపములు సిద్ధింపవు.

(1) వ్యాఘ్రీ : అడుపులి. ఇది గతిసంజ్ఞకము కృదంతముతో సుబుత్ప

_త్తికి పూర్వము సమసించుట కుదాహరణము. వ్యాజిఘ్రతీతి వ్యాఘ్రీ. (మిక్కిలిగా ఆఘ్రాణించునది) 'అజ్' పూర్వకఘ్రాధాతువునకు 'ఆతశ్చోపసర్గే' అను సూత్రముచే 'క' అను కృత్ప్రత్యయము చేరును. ఇందు కకారమిత్తు. ఆఘ్రా+క, ఆఘ్రా + అ, 'ఆతోలోప ఇటిచ' అనుసూత్రముచే ధాతువులోని ఆకారముకు లోపము వచ్చును. ఆఘ్+ అ = ఆఘ్ర. ఇప్పుడు సుప్పుచేరని ఆఘ్ర అను కృదంతరూపప్రాతిపదికముతో 'వి' అను నుపసర్గము కుగతిప్రాదయః అనుసూత్రముచే సమసింపఁగా వి+ఆఘ్ర='వ్యాఘ్ర' అగును. దీనికి స్త్రీత్వమును వివక్షించినపుడు ఇది జాతివాచకము గావున 'జాతేరస్త్రీ విషయాదయోపధాత్' అను వక్ష్యమాణసూత్రమునుబట్టి 'ఙీష్' ప్రత్యయము వచ్చును. వ్యాఘ్ర + ఙీష్, వ్యాఘ్ర + ఈ (ఙకారషకారము లిత్తులు) యస్యేతిచ అనుసూత్రముచే అకార లోపము, వ్యాఘ్రీ + సు=వ్యాఘ్రీ అగును.

'ఆఘ్ర' అనుదానికి సుప్పుచేర్చిన తర్వాతనే సమాసము చేయుదమన్నచో 'వ్యాఘ్రా' అనునినిష్టరూపమేర్పడును. ఎట్లన, 'ఆఘ్ర' అనుదానితో 'వి' అనుగతి సమసింపక ముందు 'సుప్పు' చేరవలయునన్నచో "స్వార్థద్రవ్యలింగసంఖ్యాకారకాణి క్రమేణభవంతి" – స్వార్థద్రవ్యలింగసంఖ్యాకారకములు క్రమముగా నగును – అనున్యాయముననుసరించి విభక్తికార్యమునకు ముందు లింగకార్యము జరుగవలసి యుండును. 'ఆఘ్ర' అనునదిజాతివాచకము కాదు (పులి ఇత్యాదిజాతిని బోధించునదికాదు) కావున దీనికి 'టాప్' అను స్త్రీప్రత్యయము వచ్చును. ఆఘ్రా అగును పిదప 'సు' చేరి 'ఆఘ్రా' అగును ఇప్పుడు 'వి' అనునది దీనితో సమసించినయెడల 'వ్యాఘ్రా' అనురూపమేర్పడును ఇదిజాతివాచకమే యయ్యును, జాతేః ఇత్యాదిసూత్రముచే విధింపఁబడిన ఙీష్ ప్రత్యయము అదంతములకే యగుటచే ఙీష్ ప్రత్యయము రా వీలులేదు. 'వ్యాఘ్రా' అనుదుష్టరూపము ప్రాప్తమగును. దీనిని వారించుటకై 'గతికారక ....' ఇత్యాది పరిభాష ఆవశ్యకమైనది.

(2) ఇక్కడ కారకమున కుదాహరణమును జూతము. అశ్వేన క్రీతా – అశ్వముతో కొనఁబడినది అనునర్థమున కరణవాచకము పూర్వమునఁగల 'క్రీత' అను కృదంతమునకు స్త్రీత్వమున 'క్రీతాత్ కరణ పూర్వాత్' అనుసూత్రముచే ఙీష్ ప్రత్యయము విధింపఁబడినది. ఇచట అశ్వము కొనుట అను వ్యాపారములో

మిక్కిలిగా ఉపకరించిన సాధనమగుటచే కరణము. అది కారకములలో నొకటి. దీనికి 'క్రీత' అను సుప్పుచేరని కృదంతముతో సమాసమగును 'అశ్వ + టా, క్రీత,' విభక్తిలోపము. 'అశ్వక్రీత' దీనికి స్త్రీత్వమున 'క్రీతాత్ కరణపూర్వాత్' అనుసూత్రముచే జీష్ ప్రత్యయము అశ్వక్రీత + ఈ, యస్యేతిచ అకారలోపము, అశ్వక్రీతీ + సు = అశ్వక్రీతీ అగును

'క్రీత' అనుదానికి సుప్పుచేరినపిమ్మటనే సమాసము చేయవలయునన్నచో ముందు లింగకార్యమగు స్త్రీప్రత్యయము చేయవలసియున్నది. ఇది కరణపూర్వము కాదు కావున 'జీష్' ప్రత్యయము రాదు టాప్ ప్రత్యయము వచ్చును క్రీత + టాప్ - క్రీతా + సు = క్రీతా. ఇప్పుడిది 'అశ్వేన' అనుదానితో సమసించినచో అశ్వ + టా, క్రీతా + సు = అశ్వక్రీతా + సు = అశ్వక్రీతా అనురూపము ప్రాప్తించును. అది సమ్మతము కాదు. దానిని వారించుటకై ప్రకృత పరిభాషార్థ మవసరమైనది.

(3) ఇఁక ఉపపదోదాహరణము నరయుదము. 'కచ్ఛపీ' కచ్ఛేన, కచ్ఛే వాపి బతి - 'తీరమునఁ ద్రాగునది' అనునర్థమున కచ్ఛశబ్దముపపదముగా నున్న 'పా' పానే అనుధాతువునకు క ప్రత్యయము. పా + క, పా + అ, ఆకారలోపము, ప. సుప్పుచేరని ఈ 'ప' అను కృదంతముతో 'కచ్ఛేన' అను ఉపపదము సమసించును. కచ్ఛ + టా + ప, విభక్తిలోపము. 'కచ్ఛప', జాతిలక్షణ జీష్ ప్రత్యయము రాఁగా కచ్ఛప + జీష్, కచ్ఛప + ఈ, యస్యేతిచ, అకారలోపము, కచ్ఛపీ అగును.

అట్లుగాక 'ప' అనుకృదంతమునకు సమాసవిధికి ముందే సుప్పుచేరినచో 'కచ్ఛపా' అను అనిష్టరూపమేర్పడును. 'ప' అనుదానికి విభక్తి చేర్చుటకు ముందు లింగకార్యమగు స్త్రీ ప్రత్యయము చేరవలయును. కేవల 'ప' శబ్దము జాతివాచకము కాదుకనుక దానికి టాప్ ప్రత్యయముచేరి 'పా' + సు = 'పా' అగును. దీనితో 'కచ్ఛేన' అనుశబ్దము సమసించినయెడల కచ్ఛ + టా, పా + సు, 'కచ్ఛపా' అగును. ఇది జాతివాచకమే యైనను అదంతముకాదు కనుక జీష్ ప్రత్యయము (జాతిలక్షణమైనది) రాదు. ఇట్టి అపరూపమును వారించుటకు ప్రకృత పరిభాష అవసరమగును.

ఇట్లీ పరిభాష యిష్టరూపములను సాధించుచు దుష్టరూపములను వారించుచున్నది. 'ఉపపదమతిఙ్' సూత్రమునందలి 'అతిఙ్' పదమును బట్టి 'సహసుపా' అనునది నివృత్తమగును కావున ఘ, క్రీత, ప' అనునవి సుబంతములు కాకపోయి

నను సమాసమేర్పడుటకు వీలయినది. (ఇందలి స్త్రీప్రత్యయప్రక్రియయొక్క పూర్తి స్వరూపమును ఆప్రకరణమునఁ జూడఁదగును).

ఉపపదములు సమర్థములతో సమసింపగా నేర్పడు తత్పురుషమగుటచే దీనిని ఉపపదతత్పురుషమని వ్యవహరింపవచ్చును.

అవ : ఇంతటితో తత్పురుషమున సమాసవిధానము పూర్తి అయినది. ఇటు పై తత్పురుషములకు చేరు సమాసాంతప్రత్యయములు విధింపఁబడు చున్నవి.

సూ : తత్పురుషస్యాఙ్గుళే స్సంఖ్యావ్యయాదేః 5-4-86.

వృ : సంఖ్యావ్యయాదే రఙ్గుళ్యన్తస్య తత్పురుషస్య సమాసాన్తోఽచ్ స్యాత్. ద్వే అఙ్గుళీ ప్రమాణమస్య ద్వ్యఙ్గుళమ్. నిర్గతమఙ్గుళిభ్యో నిరఙ్గుళమ్.

ప. వి : తత్పురుషస్య (6-1) అఙ్గుళేః (6-1) సంఖ్యావ్యయాదేః (6-1).

అను : సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3) ప్రత్యయః (1-1) అచ్ (1-1).

అర్థ ; సంఖ్యావాచకముగాని అవ్యయముగాని పూర్వపదముగాఁగల అఙ్గుళ్యంత తత్పురుషమునకు 'అచ్' అనుసమాసాంత తద్ధిత ప్రత్యయము చేరును. ఉదా : ద్వే అఙ్గుళీప్రమాణమస్య ద్వ్యఙ్గుళమ్. నిర్గతమఙ్గుళిభ్యో నిరఙ్గుళమ్.

వివ : సంఖ్యావాచకము లనగా ఏక, ద్విమున్నగునవి ప్రసిద్ధములు అవ్యయములనగా 'స్వర్' మున్నగునవి (స్వరాదినిపాత మవ్యయమ్). 'అఙ్గుళేః' అనునది 'తత్పురుషస్య' అనుదానికి విశేషణము కావున తదంతవిధిచే 'అంగుళ్యంతమగు తత్పురుషమునకు' అనునర్థము కలుగును. సంఖ్యావాచకముగాని, అవ్యయముగాని పూర్వపదముగా నున్నదియు, అంగుళిశబ్దము ఉత్తరపదముగాఁ గలదియు నగు తత్పురుష సమాసమునకు పరముగా 'అచ్' అనుసమాసాంత తద్ధితప్రత్యయము వచ్చును.

(1) సంఖ్యాపూర్వమున కుదాహరణము, 'ద్వే అఙ్గుళీప్రమాణమస్య - రెండువ్రేళ్ళ కొలఁతగలది. ద్వే, అఙ్గుళీ అనువానికి ప్రమాణార్థమున తద్ధిత ప్రత్యయము చేరనుండగా 'తద్ధితార్థోత్తరపదసమాహారే చ' అనుసూత్రముచే సమాసమగును. ద్వి+ఔ, అఙ్గుళి+ఔ, విభక్తిలోపము, యణాదేశసంధి, 'ద్వ్యఙ్గుళి' దీనికి ప్రమాణార్థమున 'ప్రమాణేద్వయసజ్దఘ్నఞ్ మాత్రచః' అనుసూత్రముచే మాత్రచ్ ప్రత్యయము వచ్చును ద్వ్యఙ్గుళి + మాత్రచ్. ఈ ప్రత్యయమునకు

ప్రమాణేలః, ద్విగోర్నిత్యమ్ అనువార్తికములచే లుక్కు వచ్చును. ద్వ్యఙ్గుళి - ప్రత్యయములోపించినను ప్రత్యయార్థముపోదు). ఇది సంఖ్యాపూర్వకమును, అంగుళ్యంతమును అగు తత్పురుషము. దీనికి ప్రకృతసూత్రముచే 'అచ్' ప్రత్యయము. ద్వ్యఙ్గుళి + అచ్, చకారమిత్తు. 'యస్యేతిచ' అనుసూత్రముచే ఇకారలోపము. ద్వ్యఙ్గుళ్ + అ=ద్వ్యఙ్గుళ + సు=ద్వ్యఙ్గుళమ్.

(ii) అవ్యయపూర్వమున కుదాహరణము. నిర్గతమఙ్గుళిభ్యః =వ్రేళ్ళనుండి జారిపోయినది. 'నిరాదయః క్రాన్తాద్యర్థే పఞ్చమ్యా' అనువార్తికముచే సమాసము నిర్, అఙ్గుళి + భ్యస్, విభక్తిలోపము. 'నిరఙ్గుళి' ఇది అవ్యయ పూర్వకమై, అఙ్గుళిశబ్దాంతమైన తత్పురుషము. దీనికి అచ్ ప్రత్యయమగును. నిరఙ్గుళి + అచ్, నిరఙ్గుళ్ + అ = నిరఙ్గుళ + సు = నిరఙ్గుళమ్.

అచ్ ప్రత్యయము చేరుటచే ఇకారాంతమైన అఙ్గుళిశబ్దాంతప్రాతిపదికము అకారాంతమైనది.

సూ : అహస్సర్వైకదేశ సంఖ్యాత పుణ్యాచ్చరాత్రేః 5-4-87.

వృ : ఏభ్యో రాత్రే రచ్ స్యాత్. చాత్సంఖ్యావ్యయాదేః. అహర్గ్రహణం ద్వంద్వార్థమ్.

ప. వి : అహస్సర్వైకదేశ సంఖ్యాత పుణ్యాత్ (5-1) చ (అవ్య) రాత్రేః (5-1).

అను : తత్పురుషస్య (6-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3) ప్రత్యయః (1-1) అచ్ (1-1).

అర్థ : అహన్, సర్వ, ఏకదేశవాచక, సంఖ్యాత పుణ్య అనువానికి పరమైన, రాత్రిశబ్దమునకు తత్పురుషమున అచ్ అను సమాసాంత తద్ధిత ప్రత్యయము వచ్చును. చకారమువలన సంఖ్యావ్యయాది రాత్రిశబ్దమునకును వచ్చును. ఇందు 'అహన్' పదము గ్రహించుట ద్వంద్వముకొఱకు.

వివ : అహన్ సర్వ అనుశబ్దములును ఏకదేశవాచకమును (ఒకభాగమును జెప్పుపదమును) సంఖ్యాత పుణ్యశబ్దములును, సూత్రములోని 'చ' అను అవ్యయము వలన ఆకృష్టములగు సంఖ్యావాచకపదములును, అవ్యయములును పూర్వపదములుగా గల 'రాత్రి' శబ్దాంత తత్పురుషములకు 'అచ్' అను సమాసాంతతద్ధిత ప్రత్యయము చేరును.

ఇందు 'అహన్' శబ్దమును గూర్చి పరిశీలింపఁదగినయంశ మొకటిగలదు. ఇది రాత్రిశబ్దముతోఁ గూడి తత్పురుషమగుట కవకాశములేదు అహస్సుయొక్క రాత్రి, అని షష్ఠీ సమాసార్థముగాని, అహస్సైనరాత్రి అని కర్మధారయార్థముగాని పొసఁగదుకదా: (అహస్సు=పగలు) అందువలన నిందు 'అహన్' పదమును గ్రహించుట ద్వంద్వసమాసముకొఱకని వక్కాణింపఁబడినది.

ఉదాహరణములు ముందు సూత్రమునఁ జూపఁబడుచున్నవి.

అవ : రాత్రి శబ్దాంతసమాసముయొక్క లింగనిర్ణయ మీక్రిందిసూత్రముచే చేయఁబడుచున్నది.

సూ : రాత్రాహ్నాహాః పుంసి 2-4-29.

వృ : ఏతదన్తౌ ద్వన్ద్వతత్పురుషౌ పుంస్యేవ. అహశ్చ రాత్రిశ్చ అహో రాత్రః, సర్వరాత్రః, సంఖ్యాతరాత్రః.

ప. వి : రాత్రాహ్నాహాః (1-3) పుంసి (7-1).

అను : ద్వన్ద్వ తత్పురుషయోః (6-2).

అర్థ : రాత్ర, అహ్న, అహన్ శబ్దములంతమునఁ గలద్వంద్వ తత్పురుషములు పుంలింగముననే యుండును. ఉదా: అహోరాత్రః, సర్వరాత్రః, సంఖ్యాతరాత్రః.

వివ : సమాసమున రెండుపదములుండును గావున నందేపదముయొక్క లింగము సమాసమున కగునను సందియము వారించుటకు కొన్నిసూత్రములు చెప్పఁబడినవి. అందు ద్వంద్వతత్పురుషములకు పరపదముయొక్క లింగమే యగునని 'పరవల్లిఙ్గం ద్వన్ద్వ తత్పురుషయోః' అను వక్ష్యమాణసూత్రము చెప్పుచున్నది. దానిచే పూర్వసూత్రమున పేర్కొనఁబడిన సమాసములన్నియు ఉత్తరపదమగు రాత్రిశబ్దమునుబట్టి స్త్రీలింగములు కావలసియున్నది అవి పుంలింగములగుట యిష్టము. కావున పరవల్లింగనియమమునకు అపవాదముగా ఈ సూత్రము చెప్పబడినది. 'రాత్ర,' అహ్న, అహన్ శబ్దములంతమునఁగల ద్వంద్వ తత్పురుషములు పుంలింగమున నుండునని సూత్రార్థము. ఇందు 'రాత్ర' అనునది సమాసాంత ప్రత్యయము చేరినరూపము.

ఉదా : అహశ్చరాత్రిశ్చ తయోఃసమాహారః పగలును రాత్రియును, వీని సమాహారము. చార్థేద్వంద్వః అను వక్ష్యమాణసూత్రముచే ఇట సమాససంజ్ఞ.

అహన్+సుః రాత్రి + సు, విభక్తిలోపము నకారమునకు రుత్వము (అహన్) దానికి 'హశిచ' అనుసూత్రముచే ఉత్వము. పిదప గుణసంధి అహోరాత్రి, దీనికి అహస్సర్వైకదేశేత్యాదిసూత్రముచే 'అచ్' ప్రత్యయము. అహోరాత్రి+అ(చ్) ఇకారమునకు 'యస్యేతిచ అనుసూత్రముచే లోపము. అహోరాత్ + అ = అహోరాత్ర. ఇది రాత్రశబ్దాంత ద్వంద్వము. 'జాతిరప్రాణినామ్' 2-4-6 (ప్రాణులు కానట్టి జాతి వాచకముల ద్వంద్వమేకవచనమగును) అనుసూత్రముచే ఏకవద్భావము. 'స నపుంసకమ్' అను సూత్రముచే ఇది నపుంసకలింగము కావలసియుండగా నపవాదముగా ప్రకృతసూత్రముచే పుంస్త్వము చెప్పఁబడినది. అహోరాత్ర + సు=అహోరాత్రః.

సర్వారాత్రిః=రాత్రిఅంతయు, సర్వా+సు, రాత్రి+సు, పూర్వకాలైక సర్వ జరత్ పురాణనవకేవలాః సమానాధికరణేన' (2-1-49) అనుసూత్రముచే ఇట సమాసము. విభక్తిలోపము. సర్వారాత్రి. 'పుంవత్కర్మధారయ జాతీయ దేశీయేషు' అనుసూత్రముచే నిచట 'సర్వా' శబ్దమునకు పుంవద్భావము 'సర్వరాత్రి', అచ్ ప్రత్యయము (అహస్సర్వైకదేశ....) సర్వరాత్రి + అచ్, సర్వరాత్రి + అ, ఇకారలోపము, సర్వరాత్ర, ప్రకృతసూత్రముచే పుంలింగము, సర్వరాత్ర + సు= సర్వరాత్రః.

సంఖ్యాతారాత్రిః = గణింపఁబడినరాత్రి, సంఖ్యాతా + సు, రాత్రి + సు, 'విశేషణం విశేష్యేణ బహుళమ్' అనుసూత్రముచే సమాసము, విభక్తిలోపము సంఖ్యాతరాత్రి, పుంవద్భావము. సంఖ్యాతరాత్రి + అచ్, ఇకారలోపము (యస్యేతిచ) సంఖ్యాతరాత్రి + అ, సంఖ్యాతరాత్ర+సు =సంఖ్యాతరాత్రః (పుంలింగము).

అవ : పైసూత్రమునకొక అపవాదము చెప్పఁబడుచున్నది.

వా॥ సంఖ్యాపూర్వం రాత్రం క్లీబమ్. (137).

వృ : ద్విరాత్రమ్, త్రిరాత్రమ్.

ప. వి : సంఖ్యాపూర్వమ్ (1-1) రాత్రమ్ (1-1) క్లీబమ్ (1-1).

అర్థ : సంఖ్యావాచకము పూర్వమునఁ గలరాత్రశబ్దము నపుంసకమగును. ఉదా : ద్విరాత్రమ్, త్రిరాత్రమ్.

వివ : పూర్వసూత్రమున రాత్రశబ్దాంతమగు తత్పురుషము పుంలింగమగునని చెప్పఁబడినది. దానికిది అపవాదము. రాత్రశబ్దము సంఖ్యావాచకము పూర్వమునఁ గలదియైనచో నట్టిరాత్రశబ్దాంతసమాసము నపుంసకమగును.

ఉదా : ద్వయో రాత్ర్యోః సమాహారః - రెండురాత్రుల సమూహము. ద్వి + ఓస్, రాత్రి+ఓస్ 'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' అను సూత్రముచే సమాసము, ప్రాతిపదికత్వము, సుబ్లుక్కు, ద్విరాత్రి, 'అహస్సర్వైకదేశ ' సూత్రముచే 'అచ్' ప్రత్యయము, ద్విరాత్రి + అచ్, ఇకారలోపము, ద్విరాత్ర, ప్రకృతసూత్రముచే నిది నపుంసకమగును. ద్విరాత్ర + సు=ద్విరాత్ర+అమ్= ద్విరాత్రమ్ (అదంతనపుంసకములకు పరముగనున్న సు, అమ్ ప్రత్యయములకు అమాదేశము వచ్చును. అతోఽమ్).

ఇట్లే తిసృణాం రాత్రీణాం సమాహారః, మూడురాత్రుల సముదాయము, త్రి + ఆమ్, రాత్రి + ఆమ్, త్రిరాత్రి, + అచ్, త్రిరాత్ర + సు = త్రిరాత్రమ్.

సూ : రాజాహస్సఖిభ్యష్టచ్ 5-4-91.

వృ : ఏతదన్తాత్తత్పురుషాట్టచ్. పరమరాజః.

ప. వి : రాజాహస్సఖిభ్యః (5-3) టచ్ (1-1).

అను :తత్పురుషస్య (6-1) సమాసాన్తాః (1-3)తద్ధితాః (1-3) ప్రత్యయః (1-1)

అర్థ : రాజన్, అహన్, సఖి అనుశబ్దములంతమునఁ గల తత్పురుషమునకు, 'టచ్' అను సమాసాంత తద్ధితప్రత్యయము చేరును. ఉదా : పరమరాజః.

వివ : అనువృత్తమైన తత్పురుషస్య అనుదానిని పంచమ్యంతముగా మార్చుకొనవలయును. 'రాజాహస్సఖిభ్యః' అనుపంచమ్యంతపదము దానికి విశేషణమగును. విశేషణము తదంతమునకు సంజ్ఞయగును. రాజన్, అహన్, సఖిశబ్దములు ఉత్తరపదముగాఁగల తత్పురుషమునకు పరముగా 'టచ్' అను సమాసాంత తద్ధిత ప్రత్యయము చేరును. ఇందుటకార చకారములిత్తులు.

ఉదా : 'పరమశ్చాసౌరాజాచ' గొప్పరాజు. 'పరమ+సు, రాజన్ + సు' 'విశేషణం విశేష్యేణబహులమ్' అనుసూత్రముచే సమాసము, విభక్తిలోపము 'పరమరాజన్' - ఇది రాజన్‌శబ్దమంతమునఁ గల తత్పురుషము. ప్రకృతసూత్రముచే టచ్ ప్రత్యయము, పరమరాజన్+టచ్, పరమరాజన్+అ, నస్తద్ధితే అను సూత్రముచే టిలోపము, పరమరాజ్ +అ=పరమరాజ+సు=పరమరాజః.

ఈ ప్రత్యయముయొక్క చేరికచే నకారాంతమైన 'రాజన్' శబ్దమిట అకారాంతమైనది.

అవ : మహాంశ్చాసౌరాజాచ - 'గొప్పవాఁడైనరాజు' అనునర్థమున మహత్ సు, రాజన్ + సు, 'విశేషణం విశేష్యేణ బహుళమ్' అనుసూత్రముచే సమసించి విభక్తులు లోపింపఁగా 'మహత్ + రాజన్' అనియుండ క్రిందిసూత్రముచే 'మహత్' శబ్దమునకు ఆత్త్వము విధింపఁబడుచున్నది.

సూ : ఆన్మహతస్సమానాధికరణజాతీయయోః 6-3-46.

వృ : మహారాజః.

ప. వి : ఆత్ (1-1) మహతః (6-1) సమానాధికరణజాతీయయోః (7-2.)

అను : ఉత్తరపదే (7-1).

అర్థ : సమానాధికరణమైన ఉత్తరపదము గాని 'జాతీయర్' అను ప్రత్యయముగాని పరమగునపుడు మహత్‌శబ్దమునకు ఆకారము అంతాదేశమగును. ఉదా : మహారాజః.

వివ : అనువృత్తమైన 'ఉత్తరపదే' అనునది 'సమానాధికరణజాతీయయోః' అను పదములోని 'సమానాధికరణ' అనుదానితో సంబంధించును. 'జాతీయర్' అనునది ఒక తద్ధితప్రత్యయము. అది స్వతంత్రమైన పదముకాదు. సమానాధికరణమైన ఉత్తరపదము పరమగునపుడు, 'జాతీయర్' అనుతద్ధిత ప్రత్యయము పరమగునపుడును 'మహత్' అనుశబ్దమునకు ఆ కారము ఆదేశమగును. (ఆత్-తపరకరణము) 'అలోఽన్త్యస్య' పరిభాషచే 'మహత్' శబ్దముయొక్క తకారస్థానమున నీ ఆదేశము వచ్చును.

దీనిచే పైని చూపఁబడిన ఉదాహరణమున ఆకారమంతాదేశ మగును. మహత్ + రాజన్, ఇందు 'రాజన్'అనునది మహత్ అనుదానికి సమానాధికరణమైన ఉత్తరపదము. (మహత్, రాజన్ పదములు ఏకద్రవ్యమును బోధించుచున్నవని తాత్పర్యము) ఆకారాదేశము, మహ + ఆ, రాజన్, సవర్ణదీర్ఘసంధి మహారాజన్, టచ్ ప్రత్యయము (రాజాహస్సఖిభ్యష్టచ్) మహారాజన్ + అ, టిలోపము, మహారాజ్ + అ=మహారాజ+సు=మహారాజః.

[సాధారణముగ నీ మహచ్ఛబ్దవిషయమున కొందఱు పొరపడుచుందురు. ఈ కార్యము కర్మధారయమునందే యగును. అందుచే మహదాశీర్వచనము మున్నగునవి షష్ఠీసమాసములని తెలియఁదగును. 'గొప్పవారి యొక్క ఆశీస్సు' అని దానికర్థము. మహత్కష్టము – గొప్పవారియొక్కకష్టము. గొప్పది యగు

కష్టము అనునపుడు 'మహాకష్టము' అగును. ఈ భేదము నర్థమునుబట్టి గుర్తింప వలయును).

అవ : పై సూత్రమునందలి 'జాతీయర్' ప్రత్యయపరకత్వమున ఆత్వము నకు నుదాహరణము చూపనెంచి యా ప్రత్యయమును విధించు సూత్రము నిట వ్యాఖ్యానించుచున్నారు

సూ : ప్రకారవచనే జాతీయర్ 5.3-46.

వృ : మహాప్రకారో మహాజాతీయః

ప. వి : ప్రకారవచనే (7-1) జాతీయర్ (1-1).

అను : ఙ్యాప్ప్రాతి పదికాత్ (5-1) ప్రత్యయః (1-1) తద్ధితాః (1-3)

అర్థ : ప్రకారమును వచించునపుడు ప్రాతిపదికమునకు 'జాతీయర్' అను తద్ధిత. ప్రత్యయము వచ్చును. ఉదా : మహాప్రకారః—మహాజాతీయః.

వివ : ప్రకారమనగా సాదృశ్యమని స్థూలమైన అర్థము. ఈ సూత్రము నందలి ప్రకారశబ్దమునకు సాదృశ్యముకలవాఁడని యర్థము ఆ యర్థము తెలియఁ బడునపుడు ప్రాతిపదికమునకు 'జాతీయర్' అనుప్రత్యయము వచ్చును. ఇందు రేఫము ఇత్తు. మహాప్రకారః – గొప్పవారివంటివాఁడు అనునర్థమున 'మహత్' శబ్దమునకు జాతీయర్ ప్రత్యయము. మహత్+జాతీయ(ర్), 'ఆన్మహతః' ఇత్యాది సూత్రముచే తకారమునకు ఆకారాదేశము, మహ + ఆ, జాతీయ, సవర్ణదీర్ఘ సంధి, మహాజాతీయ+సు=మహాజాతీయః.

సూ : ద్వ్యష్టనః సంఖ్యాయా మబహువ్రీహ్యశీత్యోః 6.3-47.

వృ : ఆత్స్యాత్. ద్వాదశ, అష్టావింశతిః.

ప.వి: ద్వ్యష్టనః (6-1) సంఖ్యాయామ్ (7-1) అబహువ్రీహ్యశీత్యోః. (7-2)

అను : ఆత్ (1-1) ఉత్తరపదే (7-1).

అర్థ : ద్వి, అష్టన్ శబ్దములకు సంఖ్యావాచకమైన ఉత్తరపదము పరమగు నప్పుడు, ఆకారమంతాదేశమగును. బహువ్రీహియందును, అశీతిశబ్దము పరమగు నప్పుడును ఈ ఆదేశమురాదు. ఉదా : ద్వాదశ, అష్టావింశతిః.

వివ : ఆకారాదేశము, ద్వి, అష్టన్ శబ్దములకు, సంఖ్యావాచకమైన ఉత్తర పదము పరమగునపుడు, వచ్చును. ఉత్తరపదము సంఖ్యావాచకమే అయినను బహు

వ్రీహి సమాసమున వీని కీ యాదేశమురాదు. బహువ్రీహి కాకున్నను అశీతి (ఎను బది) శబ్దము పరపదమగునపు డీయాదేశమురాదు.

ఉదా : ద్వౌచ దశచ ఏతేషాం సమాహారః' రెంటి యొక్కయు పది యొక్కయు సమాహారము అనుద్వంద్వార్థమునఁ గాని ద్వ్యధికాదశ, 'రెండు అధిక ముగా గలపది' అను ఉత్తరపదములోపించిన (శాకపార్థివాదులవంటి) తత్పురుషార్థ మునఁ గాని 'ద్వాదశ' అను సమాసరూప మేర్పడుచున్నది. ద్వి + ఔ, దశ+ జస్, విభక్తిలోపము, ద్వి + దశ, ఆకారాదేశము ద్వ్+ఆ+దశ=ద్వాదశ= పంద్రెండు

'అష్టౌ చ వింశతిశ్చ' - ఎనిమిదియు ఇరువదియు (ఇరువదియెనిమిది) ఇదియు పూర్వమువలెనే ద్వంద్వముగాఁ గాని తత్పురుషముగాఁగాని భావింపఁబడ వచ్చును. సమాసము, విభక్తిలోపము, అష్టన్ + వింశతి అనియుండ నకార మునకు ఆకారాదేశము, అష్ట + అ, వింశతి సవర్ణదీర్ఘము, అష్టావింశతి+సు= అష్టావింశతిః.

అవ : ఇంతవఱకు తత్పురుషమునకు సంబంధించిన సమాసాంతప్రత్యయ ములును, ప్రసంగము ననుసరించి అత్వము మున్నగునవియుఁ జెప్పఁబడినవి (తత్పు రుష స్యాఙ్గుళేస్సంఖ్యావ్యయాదేః మొదలుకొని ఇంతవఱకు) ఇటుపై తత్పురుష సమాసమునకు సంబంధించిన లింగవిధానము తెలుపఁబడుచున్నది.

సూ : పరవల్లిఙ్గం ద్వంద్వతత్పురుషయోః 2-4-26.

వృ : కుక్కుట మయూర్యా విమే. మయూరీ కుక్కుటావిమౌ. అర్ధ పిప్పలీ

ప. వి : పరవత్ (అవ్య) లిఙ్గమ్ (1-1) ద్వన్ద్వ తత్పురుషయోః (6-2).

అర్థ : ద్వంద్వతత్పురుషములకు పరపదమునకువలె లింగమగును. ఉదా : కుక్కుట మయూర్యౌ ఇమే, మయూరీ కుక్కుటౌ ఇమౌ, అర్ధపిప్పలీ.

వివ : సమాసమున రెండుపదము లుండవలయునుగదాః అవి రెండును భిన్న లింగము లనుకొందము. అప్పుడు సమాస మేలింగము కావలయును? అనుశంక కలుగును. ఈ శంక అవ్యయీభావమున నుదయింపదు. అవ్యయీభావము అవ్యయ మగును గావున అవ్యయములు లింగవిభక్తి వచనశూన్యములు కావున నచట

ఈ ప్రశ్నపుట్టలేదు. ఈ శంకకు సమాధానముగా నీ సూత్రము చెప్పఁబడినది. ద్వంద్వతత్పురుషములలో ఉత్తరపదము ఏలింగమో సమాసమునకు ఆలింగమే యగును.

ఉదా : 'కుక్కుటశ్చ మయూరీచ' కోడియును ఆడునెమలియును - ఈ రెండును సమసించి ద్వంద్వమైనచో ఇందు పరపదమగు 'మయూరీ' అనునది స్త్రీ లింగము కావున నీ సమాసము స్త్రీ లింగమగును. కుక్కుటమయూర్యౌ - ప్రథమాద్వివచనము స్త్రీలింగమని స్పష్టముచేయుటకై ఇదంశబ్దముయొక్క స్త్రీ లింగప్రథమాద్వివచనరూపము 'ఇమే' అనునది చూపఁబడినది. అట్లే ఇందు 'మయూరీ' శబ్దము ముందు ప్రయోగింపఁబడినచో కుక్కుటపదము పరపదమగును. అది పుంలింగము కావున సమాసము పుంలింగమగును. మయూరీ కుక్కుటౌ ఇమౌ. ఇచటను పుంలింగమను విషయమును స్పష్టము చేయుటకై 'ఇవి' అను నర్థముగల ఇదంశబ్దముయొక్క పుంలింగ ప్రథమాద్వివచనాంతరూపము చూపఁ బడినది. (ఇవి ద్వంద్వమునకుదాహరణములు).

తత్పురుషమున కుదాహరణము. అర్ధం పిప్పల్యాః, అర్ధపిప్పలీ. ఇది తత్పురుషాధికారములోని 'అర్ధంనపుంసకమ్' అనుసూత్రముచే నేర్పడిన సమాస మగుటచే తత్పురుషము ఇందు పరపదమగు 'పిప్పలీ' శబ్దము స్త్రీలింగము గాన నీసమాసము స్త్రీలింగమగును. అర్ధ పిప్పలీ

విశే : సంస్కృతమున లింగము శబ్దము నాశ్రయించియుండును గాని దానిచే వాచ్యములగు వ్యక్త్యాదులనుబట్టి యుండదు. 'భార్య' అనునర్థముగల 'కళత్ర' శబ్దము నపుంసకలింగమగుటయు, అదేయర్థముగల దారశబ్దము పుంలింగమగుటయు దీనిని నిరూపించును. శబ్దముల లింగమునుబట్టియు విభక్తి ప్రత్యయములకు సంబం ధించిన ప్రక్రియలో భేదముండును.

అవ : పై సూత్రమున కపవాదమగు నొకవార్తిక మిటచెప్పఁబడుచున్నది.

వా॥ ద్విగుప్రాప్తాపన్నాలం పూర్వగతి సమాసేషు న 2545.

వృ : పఞ్చకపాలః పురోడాశః, ప్రాప్తోజీవికాం ప్రాప్తజీవికః, ఆపన్నజీవికః అలంకుమార్యై అలంకుమారిః, అత ఏవజ్ఞాపకాత్ సమాసః, నిష్కౌశామ్బిః.

ప. వి : ద్విగు........సమాసేషు (7 3) న (అవ్య).

అర్థ : ద్విగు సమాసమునందును, ప్రాప్త, ఆపన్న, 'అలమ్' అనుశబ్దములు పూర్వమున నున్న సమాసములందును, గతిసమాసములందును పరవల్లింగనియమము లేదు. ఉదా : పఞ్చకపాలః పురోడాశః, ప్రాప్తోజీవికాం ప్రాప్తజీవికః, ఆపన్నజీవికః, అలంకుమార్యై అలంకుమారిః. ఈ జ్ఞాపకముచేతనే సమాసము. నిష్కౌశామ్బిః.

వివ : ఈ వార్తికము పైసూత్రమున కపవాదముగా చెప్పఁబడినది. ఇందలి సమాసములన్నియు తత్పురుషములు. కావున వీనికి ఉత్తరపదముయొక్క లింగము కావలసియుండగా నీ వార్తికముచే నది నిషేధింపఁబడినది. ఇందుఁజెప్పఁబడిన సమాసము లన్నియు సాధారణముగా విశేషణములగును గావున విశేష్యముయొక్క లింగమే వీనికిని వచ్చును. ద్విగుసమాసము సమాహారార్థకమైనచో నపుంసకలింగము అగును. (స నపుంసకమ్) కానిచో విశేష్యమునుబట్టి దానికి లింగమేర్పడును.

(i) ద్విగూదాహరణము : 'పఞ్చసు కపాలేషు సంస్కృతః పురోడాశః' (అయిదుకపాలములయందు సంస్కరింపఁబడిన పురోడాశము). అనువర్థమున పఞ్చను, కపాలేషు అనుపదములకు 'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' అనుసూత్రముచే సమాససంజ్ఞ కలుగును (ఇచట తద్ధితార్థము విషయమైనది). పఞ్చన్ + సుప్, కపాల + సుప్, విభక్తిలోపము 'పఞ్చకపాల' దీనికి 'సంస్కృతంభక్షాః' అను సూత్రముచే వచ్చు అణ్ప్రత్యయము 'ద్విగోర్లుగనపత్యే' అనుసూత్రముచే లోపించును. ఇప్పుడిందు కపాలశబ్దము నపుంసకమగుటచే నీ సమాసము నపుంసకలింగము కావలసియుండగా ప్రకృతవార్తిక మట్లగుటను నిషేధించినది. ఇది పురోడాశః అను పుంలింగమునకు విశేషణమగుటచే పుంలింగమగును. పంచకపాల + సు= పఞ్చకపాలః.

(ii) ప్రాప్తః జీవికామ్. ఆపన్నః జీవికామ్ – బ్రదుకుతెరువును పొందినవాఁడు అనునర్థమున ద్వితీయాశ్రితేత్యాది సూత్రమున కపవాదముగా చెప్పఁబడిన ప్రాప్తాపన్నే చ ద్వితీయయా 2-2-4 (ప్రాప్తాపన్నశబ్దములు ద్వితీయాంతముతో సమసించును) అనుసూత్రముచే ప్రాప్త, ఆపన్నప్రకృతికసుబంతములు ద్వితీయాంత పదముతో సమసించును. ప్రాప్త + సు, జీవికా + అమ్, ఆపన్న + సు, జీవికా+ అమ్, విభక్తిలోపము, ప్రాప్తజీవికా, ఆపన్నజీవికా. ఇందు జీవికాశబ్దమునకు 'ఏకవిభక్తి చా పూర్వనిపాతే' అనుసూత్రముచే ఉపసర్జనసంజ్ఞ కలుగును. 'గోస్త్రియోరుప

సర్జనస్య' అనుసూత్రముచే హ్రస్వము. ప్రాప్తజీవిక, అపన్నజీవిక. జీవికా శబ్దము స్త్రీలింగమగుటచే పరవల్లింగనియమముచే నివి స్త్రీలింగములు కావలసి యుండగా ప్రకృతవార్తికముచే నది వారింపఁబడినది. విశేష్యమునుబట్టి దీనికి లింగ మేర్పడును. ప్రాప్తజీవిక + సు = ప్రాప్తజీవికః, అపన్నజీవికః (పుం).

(iii) అలంకుమార్యై (కుమారికి తగినవరుఁడు) అనునర్థమున 'అలమ్' అనునవ్యయము 'కుమార్యై' అను చతుర్థ్యంతపదముతో సమసించును. వార్తికము నందు 'అలమ్' పదమును గ్రహించుటచేతనే యిట 'అలమ్' అనునవ్యయము సమర్థసుబంతముతో సమసించుట తెలుపఁబడినది. దీనికి వేఱువిధిలేదు. విధిలేనిచో సమాసము కానిచో అలంపూర్వమునకు పరవల్లింగనియమము వర్తింపదని చెప్పుట వ్యర్థము. కావున నది 'అలమ్ పదమునకు సమర్థ సుబంతముతో సమాసమగునను టను జ్ఞాపకము చేసినది. అలమ్, కుమారీ + ఙే, విభక్తిలోపము, అలంకుమారీ, గోస్త్రియోరుపసర్జనస్య, హ్రస్వము అలంకుమారి + సు అలంకుమారిః. (కుమారీ శబ్దము స్త్రీలింగము కావున నిట చెప్పనియెడల నిది స్త్రీలింగమగును).

(iv) గతిసమాసమున కుదాహరణము. 'నిష్క్రాన్తః కౌశామ్బ్యాః'-కౌశాంబీ నగరమునుండి వెడలినవాఁడు నిర్, కౌశామ్బీ + ఙసి, 'నిరాదయః క్రాన్తాద్యర్థే పంచమ్యా' అనువార్తికముచే సమాసము. నిష్కౌశామ్బీ. 'గోస్త్రియోరుపసర్జనస్య,' హ్రస్వము, నిష్కౌశామ్బి, ఇందు కౌశామ్బీశబ్దము స్త్రీలింగమగుటచే సమాసము స్త్రీలింగము కావలసియుండగా నీ వార్తికముచే నది వారింపఁబడినది. విశేష్య మును బట్టి ఇది యిచట పుంలింగమగును. నిష్కౌశామ్బి + సు = నిష్కౌశామ్బిః.

సూ : అర్ధర్చాః పుంసి చ 2-4-31.

వృ : అర్ధర్చాదయః పుంసి క్లీబేచస్యుః. అర్ధర్చః, అర్ధర్చమ్, ఏవం ధ్వజ తీర్థశరీర మణ్డపీయూషదేహాంకుశ కలశపాత్ర సూత్రాదయః.

ప. వి : అర్ధర్చాః (1-3) పుంసి (7-1) చ (అవ్య).
అను : నపుంసకమ్ (1-1).

అర్థ : అర్ధర్చ మున్నగుశబ్దములు పుంలింగమునను, నపుంసకలింగము నను ఉండును ఉదా : అర్ధర్చః, అర్ధర్చమ్. ఇట్లే ధ్వజ, తీర్థ, శరీర, మణ్డ, పీయూష, దేహ, అంకుశ, కలశ, పాత్ర, సూత్ర మున్నగు శబ్దములును.

వివ : ఈ సూత్రము కేవలముసమాస పరిచ్ఛేదమునకు పరిమితమైనదికాదు. ఇందు సమస్త (సమసించిన) పదములు కానివియు అనేకములు గలవు. ఇందలి 'అర్ధర్చ' మున్నగు సమస్తపదములకు ప్రకరణానుసారముగ లింగనిర్ణయమునకై యీ సూత్రమిచట చెప్పఁబడినది.

అర్ధం ఋచః - ఋక్కుయొక్కసగము - అర్ధ + సు, ఋచ్ + జస్, 'అర్ధంనపుంసకమ్' అనుసూత్రముచే సమాసము, విభక్తిలోపము, అర్ధ + ఋచ్, గుణసంధి, అర్ధర్చ్. దీనికి ఋ క్పూరబ్ధూరిత్యాది వక్ష్యమాణ సూత్రముచే 'అ' అను సమాసాంత ప్రత్యయము చేరును. 'అర్ధర్చ' - ఇది తత్పురుషమగుటచే ఉత్తరపదమైన ఋక్ అనుదానినిబట్టి సమాసము స్త్రీలింగము కావలసియుండగా అపవాదముగా పుంనపుంసకలింగములు విధింపఁబడినవి. అర్ధర్చ + సు, పుంలింగమైనచో రుత్వ విసర్గములు, నపుంసకలింగమైనచో 'అమ్'ఆదేశము నగును. అర్ధర్చః, అర్ధర్చమ్.

వృత్తిలో పేర్కొనిన తక్కినశబ్దములన్నియు సమాసములు కావు వానికిని పుంలింగనపుంసకలింగరూపము లుండును ఉదా : ధ్వజః (పుం) ధ్వజమ్ (నపుం), తీర్థః (పుం) తీర్థమ్ (నపుం) మొ॥వి.

అర్ధర్చాదిగణము : అర్ధర్చ గోమయ కషాయ కార్షాపణ కుతప కుసప (కుణప) కపాట శఙ్ఖ గూథ యూథ ధ్వజ కబన్ధ పద్మ గృహ సరక కంస దివస యూష అన్ధకార దణ్డ కమణ్డలు మణ్డ భూత ద్వీప ద్యూత చక్ర ధర్మ కర్మన్ మోదక శతమాన యాన నఖ నఖర చరణ పుచ్ఛ దాడిమ హిమ రజత సక్తు పిధాన సార పాత్ర ఘృత సైన్ధవ ఔషధ ఆఢక చషక ద్రోణ ఖలీన పాత్రీవ షష్టిక వారబాణ (వారవారణ) ప్రోథ, కపిత్థ (శుష్క) శాల శీల శుల్క (శుల్క) శీధు కవచ రేణు (ఋణ) కపట శీకర ముసల సువర్ణ వర్ణ పూర్వ చమస క్షీర కర్ష ఆకాశ అష్టాపద మఙ్గళ నిధన నిర్యాస జృమ్భ వృత్త పుస్త బుస్త క్ష్వేడిత శృఙ్గ నిగడ (ఖల) మూలక మధుమూల స్థూల శరావ నాల వప్ర విమాన ముఖ ప్రగ్రీవ శూల వజ్ర కటక కణ్టక (కర్పట) శిఖర కల్క (వల్కల) నటమక (నాటమస్తక) వలయ కుసుమ తృణ పఙ్క కుణ్డల కిరీట (కుముద) అర్బుర అఙ్కుశ తిమిర ఆశ్రయ భూషణ ఇక్కస (ఇష్వాస) ముకుల వసన్త తటాక (తడాగ) పిటక విటఙ్క విడఙ్గ పిణ్యాక మాష కోశ ఫలక దిన దైవత పినాక సమర స్థాణు అనీక ఉపవాస శాక కార్పాస (విశాల) చషాల (చఖాల) ఖణ్డ దర విటప (రణ బల మక) మృణాల హస్త ఆర్ద్ర హల (సూత్ర) తాణ్డవ గాణ్డీవ మణ్డప పటహ సౌధ యోధ పార్శ్వ

శరీర ఫళ (ఛల) పుర (పురా) రాష్ట్రి అమ్బర బిమ్బ కుట్టిమ మణ్డల (కుక్కుట) కుడప కకుద ఖణ్డల తోమర తోరణ మఞ్చక పఞ్చక పుఙ్ఖ మధ్య (బాల) ఛాల వల్మీక వర్ష వస్త్ర వసు దేహ ఉద్యాన ఉద్యోగ స్నేహ స్తేన (స్తన స్వర) సంగమ నిష్క క్షేమ శూక క్షత్ర పవిత్ర (యౌవన కలహ) మాలక (పాలక) మూషిక (మణ్డల వల్కల) కుజ (కుఞ్జ) విహార లోహిత విషాణ భవన అరణ్య పులిన దృఢ ఆసన ఐరావత శూర్ప తీర్థ లోమన (లోమశ) తమాల లోహ దణ్డక శపథ ప్రతిసర దారు ధనుస్ మాన వర్చస్క కూర్చ తణ్డక మఠ సహస్ర ఓదన ప్రవాల శకట అపరాహ్ణ నీడ శకల తణ్డుల - ఇత్యర్ధర్చాదిః

అవ : ప్రసంగము ననుసరించి లింగమునకు సంబధించిన ఒకవార్తికమిట చెప్పఁబడుచున్నది. ఇది సమాసమునకు సంబంధించినది కాదు.

వా॥ సామాన్యే నపుంసకమ్ 5043.

వృ॥ మృదు పచతి, ప్రాతః కమనీయమ్.

ప వి : సామాన్యే (7-1) నపుంసకమ్ (1-1).

అర్థ : సామాన్యార్థమున శబ్దము నపుంసకమగును. ఉదా : మృదు పచతి, ప్రాతః కమనీయమ్.

వివ : ఏశబ్దములు ఏలింగములో తెలియుటకు కొన్ని నియమములు గలవు. సాధారణముగ విశేషణములకు విశేష్యముల లింగమే యగును కొన్ని యెడలవిశేష్య విశేషణభావమును బట్టికాని, తదితరమార్గములను బట్టిగాని, స్త్రీత్వము, పుంస్త్వము అనునవి నిర్ణయింపఁజాలని పరిస్థితిలో శబ్దము నపుంసకలింగ మగునని యీ వార్తికముయొక్క తాత్పర్యము.

ఉదా : మృదు పచతి (మెత్తగా వండుచున్నాఁడు). ఇందు మృదుత్వము పచనక్రియకు సంబంధించినది క్రియకు లింగవివక్షలేదు. కావున క్రియావిశేషణమైన 'మృదు' శబ్దము నిచట పుంలింగమని గాని స్త్రీలింగమని కాని చెప్పఁజాలము. కావున నీవార్తికము ననుసరించి యిట నిది నపుంసకలింగమైనది.

ప్రాతః కమనీయమ్ - ఇందు కమనీయశబ్దము 'ప్రాతర్' అను నవ్యయమునకు విశేషణము. అవ్యయమునకు లింగవచన విభక్తులుండవు. కావున దానికి విశేషణమైన కమనీయశబ్దమునకు స్త్రీత్వమునుగాని పుంస్త్వమునుగాని చెప్పఁజాలము. కావున నిచట కమనీయశబ్దము నపుంసకమైనది.

మృదుః బాలః, కమనీయా కాన్తా మున్నగునవి వానిలో పై పేర్కొనిన శబ్దములు విశేష్యములనుబట్టి పుంలింగ స్త్రీలింగములైనవి.

అవ : స్త్రీలింగశబ్దము లంతమునఁగల కొన్ని తత్పురుష సమాసములు నపుంకలింగములగుటను ఈ క్రింది కొన్నిసూత్రములు తెలుపుచున్నవి. (ఇవి పర వల్లింగసూత్రమున కపవాదములు).

సూ : తత్పురుషోఽనఞ్ కర్మధారయః 2-4-19.

వృ : ఇత్యధికృత్య.

ప. వి : తత్పురుషః (1-1) అనఞ్ కర్మధారయః (1-1).

అర్థ : ఇది అధికారసూత్రము

వివ : ముందు చెప్పఁబోవుకొన్నిసూత్రములలో 'నఞ్ భిన్నము, కర్మధారయ భిన్నము నైన తత్పురుషము' అనునది సంబంధించునని సూత్రము యొక్క భావము. ముందు విధింపఁబోవుకార్యము అట్టితత్పురుషమున కగునని తాత్పర్యము.

సూ : ఛాయా బాహుళ్యే 2-4-22.

వృ : ఛాయాన్తస్తత్పురుషో నపుంసకంస్యాత్ పూర్వపదార్థబాహుళ్యే. ఇక్షూణాం ఛాయా ఇక్షుచ్ఛాయమ్ వక్ష్యమాణస్య వికల్పస్యాయమపవాదః.

ప వి : ఛాయా (1-1) బాహుళ్యే (7-1).

అను : తత్పురుషః (1-1) అనఞ్ కర్మధారయః (1 1) నపుంసకమ్ (1-1).

అర్థ : ఛాయాశబ్దాంతతత్పురుషము, పూర్వపదార్థము బహువచనమైనపుడు, నపుంసక మగును. ఉదా : ఇక్షూణాం ఛాయా - ఇక్షుచ్ఛాయమ్. ముందు చెప్పఁబోవు వికల్పమున కిది అపవాదము.

వివ : 'ఛాయా' అనుపదము తత్పురుషః అనుదానికి విశేషణము. తదంత విధిచే 'ఛాయాంతమైన తత్పురుషము' అనునర్థము వచ్చును. ఈ తత్పురుషము నఞ్ భిన్నము, కర్మధారయ భిన్నము నగును. బాహుళ్య మనగా అనేకత్వము. ఈ అనేకత్వము దేనిది? అను ఆకాంక్ష కలుగగా ఛాయదేనిదో దానిది అనునర్థము కలుగును. దేని ఛాయ చెప్పఁబడునో దానిని పూర్వపదము చెప్పును. కావున పూర్వపదముయొక్క అర్థము బహుత్వ సంఖ్యావిశిష్టమైనపుడు అనునర్థము బాహుళ్యే

అనుపదమునకు కలిగినది. ఇట్లు బహువచనాంతమగు పూర్వపదముకలిగిన ఛాయా శబ్దాంతమగు తత్పురుషసమాసము నపుంసకమగునను నర్థము సిద్ధించును. "విభాషా సేనా సురాచ్ఛాయా...." ఇత్యాదియగు ముందుఁ జెప్పఁబడు సూత్రమున దీనికి నపుంసకత్వము వైకల్పికముగా చెప్పఁబడుటచే దాని కపవాదముగా నిత్యముగా నగు నని యీ సూత్రము చెప్పుచున్నది. పూర్వపదార్థబాహుళ్యములేని యపుడు దానిచే నపుంసకత్వము వైకల్పికముగా నగును.

ఉదా : ఇక్షూణాం ఛాయా-చెఱకులనీడ, ఇక్షు + ఆమ్, ఛాయా + సు, 'షష్ఠీ' అనుసూత్రముచే సమాసము, విభక్తిలోపము, ఇక్షు + ఛాయా. ఛేచ, తుగాగమము, శ్చుత్వము 'ఇక్షుచ్ఛాయా' - ఇది ఛాయాంతమైన తత్పురుషము. ఇందు పూర్వపదము బహువచనాంతము (ఇక్షూణామ్ - షష్ఠీ బహువచనము) కావున నీ సమాసము నపుంసకము కాఁగా, 'హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య' అనుసూత్రముచే హ్రస్వము వచ్చును, ఇక్షుచ్ఛాయ + సు=ఇక్షుచ్ఛాయమ్.

సూ : సభారాజాఽమనుష్యపూర్వా 2-4-23.

వృ : రాజపర్యాయ పూర్వోఽమనుష్యపూర్వశ్చ సభాన్తస్తత్పురుషోనపుంసకం స్యాత్. ఇనసభమ్, ఈశ్వరసభమ్.

ప. వి : సభా (1-1) రాజాఽమనుష్యపూర్వా (1-1).

అను : తత్పురుషః (1-1) అనఞ్ కర్మధారయః (1-1) నపుంసకమ్ (1-1).

అర్థ : రాజపర్యాయవాచకమును, అమనుష్యవాచకమును పూర్వపదముగాఁ గల సభాంతతత్పురుషము నపుంసకమగును. ఉదా : ఇనసభమ్, ఈశ్వరసభమ్.

వివ : 'రాజాఽమనుష్యపూర్వా' అనుపదము 'సభా' అనుదానికి విశేషణము. 'సభా' అనునది 'తత్పురుషః' అనుదానికి విశేషణము. తదంతవిధిచే సభాశబ్దాంత తత్పురుషము అగును సూత్రములోని రాజశబ్దముచే ఇచట ఆ అర్థముగల ఇతర శబ్దములను గ్రహింపవలయునని ముందువార్తికము చెప్పుచున్నది. కావున రాజపర్యాయవాచకములును, అమనుష్యవాచకశబ్దములును పూర్వపదముగాఁ గల సభాంత తత్పురుషము నపుంసకమగు నను నర్థము సిద్ధించినది.

ఉదా : ఇనస్య సభా. 'ఇనునిసభ' - ఇనుఁడనగారాజు-ఇన+ఙస్, సభా + సు, షష్ఠీసమాసము, విభక్తిలోపము ఇనసభా - ఇది రాజపర్యాయవాచకమగు ఇన

శబ్దము పూర్వమునఁ గల సభాంతతత్పురుషము. కావున ప్రకృతసూత్రముచే నపుంసకము కాఁగా, హ్రస్వము వచ్చును (హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య) ఇన సభ + సు=ఇనసభమ్. ఇట్లే ఈశ్వరస్య సభా, ఈశ్వర + ఙస్, సభా + సు = ఈశ్వరసభా, హ్రస్వము. ఈశ్వరసభ + సు=ఈశ్వరసభమ్.

అవ : పై సూత్రమునకు సంబంధించిన వార్తిక మొకటి చెప్పఁబడుచున్నది.

వా॥ పర్యాయస్యైవేష్యతే.

వృ : నేహ, రాజసభా, చంద్రగుప్తసభా.

ప వి : పర్యాయస్య (6-1) ఏవ (అవ్య) ఇష్యతే (క్రియాపదము)

వివ : 'సభారాజా....'ఇత్యాదిసూత్రమునందలి రాజశబ్దముచే రాజపర్యాయ వాచకమునే గ్రహించుట యిష్టమని యీ వార్తికముచే తెలుపఁ బడినది. పర్యాయ వాచకమనగా సమానార్థకమైన ఇతరశబ్దము. కేవల రాజశబ్దము గాని రాజుల నామములను దెలుపు శబ్దములుగాని పూర్వపదముగానున్న సభాంతతత్పురుషము నపుంసకము కాదని, దీనినిబట్టి, తెలియనగును. కావున రాజ్ఞఃసభా - రాజసభా, చంద్రగుప్తస్య సభా, చంద్రగుప్తసభా మున్నగు నుదాహరణములలో సభాంత తత్పురుషము నపుంసకముకాదు. పరవల్లింగనియమముచే స్త్రీలింగమే యగును.

అవ : అమనుష్యశబ్దమునుగూర్చి వృత్తికారుఁడిట్లు చెప్పుచున్నాఁడు.

వృ : అమనుష్యశబ్దోరూఢ్యా రక్షఃపిశాచాదీనాహ, రక్షస్సభమ్, పిశాచ సభమ్.

అర్థ : అమనుష్యశబ్దము రూఢిచే రక్షస్సులు, పిశాచములు మొదలగువానిని చెప్పును. ఉదా : రక్షస్సభమ్ చసభమ్.

వివ : అమనుష్యశబ్దముచే మనుష్యులుకాని దేవతలు మున్నగువారును, రాక్షసులు మున్నగువారును చెప్పఁబడుదురు. కాని యిది రూఢ్యర్థమున రక్షస్సులు పిశాచములు మున్నగువానినే బోధించును. రూఢియనగా లోకవ్యవహారమున నొక శబ్దము ఒక అర్థముననే వాడఁబడుట. వేగముగా పోవునది అనునర్థముగల తురంగ పదము గుఱ్ఱమునేకాని తదన్యమును, వేగముగా పోవుదానిని, బోధింపదు. ఇట్టిస్థితిని రూఢియందురు. కావున సభారాజేత్యాది సూత్రమునందలి అమనుష్యశబ్దమునకు రూఢిచే రక్షస్సులు పిశాచములు మున్నగునవియే యర్థములు. అవిపూర్వపదముగా నున్నపుడే సభాంతతత్పురుషము నపుంసకమగును.

ఉదా : రక్షసాం సభా - రక్షస్సులసభ - రక్షస్ + అమ్, సభా + సు, 'షష్ఠీ' సూత్రముచే సమాసము, విభక్తిలోపము రక్షస్సభా, నపుంసకత్వము, హ్రస్వము రక్షస్సభ + సు = రక్షస్సభమ్. అట్లే పిశాచానాం సభా, పిశాచసభమ్ అగును. ఈ యర్థమును గైకొనుటవలన దేవానాంసభా - 'దేవసభా' అని స్త్రీలింగమే యగును. "స్యాత్సుధర్మా దేవసభా" అమరము.

సూ : విభాషా సేనాసురాచ్ఛాయాశాలానిశానామ్ 2-4-25.

వృ : ఏతదన్త స్తత్పురుషో నపుంసకం వా స్యాత్. బ్రాహ్మణసేనమ్-బ్రాహ్మణసేనా, యవసురమ్ యవసురా, కుడ్యచ్ఛాయమ్ - కుడ్యచ్ఛాయా; గోశాలమ్ గోశాలా; శ్వనిశమ్-శ్వనిశా.

ప. వి : విభాషా (1-1) సేనా.... నిశానామ్ (6-3).

అను : తత్పురుషః (1-1) అనఞ్ కర్మధారయః(1-1) నపుంసకమ్(1-1)

అర్థ : సేనా, సురా, ఛాయా, శాలా, నిశాశబ్దములంతమందుఁగల తత్పురుషము వైకల్పికముగా నపుంసకమగును. ఉదా : బ్రాహ్మణసేనమ్-బ్రాహ్మణసేనా ఇత్యా

వివ సేనాదిశబ్దములు స్త్రీలింగములు. పరవల్లింగనియమముచే ఇవి యంతమునఁగల తత్పురుషములు నిత్యముగా స్త్రీలింగములు కావలసియుండగా వానికి వైకల్పికముగా నపుంసకత్వము నీ సూత్రము విధించుచున్నది. నపుంసకలింగరూపమును స్త్రీలింగరూపమును వీనికుండునని తాత్పర్యము. ఈ సూత్రమున 'నిశానామ్' అనుషష్ఠి ప్రథమార్థమున వాడఁబడినది.

ఉదా : బ్రాహ్మణస్యసేనా, బ్రాహ్మణ + ఙస్, సేనా + సు 'షష్ఠీ' అను సూత్రముచే సమాసము, విభక్తిలోపము, బ్రాహ్మణసేనా, నపుంసకమైనచో 'హ్రస్వోనపుంసకేప్రాతిపదికస్య' సూత్రముచే హ్రస్వము. బ్రాహ్మణసేన + సు = బ్రాహ్మణసేనమ్, కానిచో బ్రాహ్మణసేనా (స్త్రీలింగము).

(2) యవానాంసురా - యవ + ఆమ్. సురా + సు = యవసురా, యవసుర + అమ్, యవసురమ్ (నపుం) యవసురా + సు = యవసురా (స్త్రీ).

(3) కుడ్యస్య ఛాయా, కుడ్య + ఙస్, ఛాయా + సు = కుడ్యచ్ఛాయా కుడ్యచ్ఛాయ + సు = కుడ్యచ్ఛాయమ్ (నపుం) కుడ్యచ్ఛాయా + సు = కుడ్యచ్ఛాయా (స్త్రీ). పూర్వపదము బహువచనాంతమైనచో 'ఛాయాబాహుళ్యే' అనుసూత్రముచే నిత్యముగా నపుంసకమగును.

(4) గవాంశాలా : గోవులశాల. గో + ఆమ్, శాలా + సు, విభక్తిలోపము. గోశాలా, నపుంసకత్వమున గోశాలమ్, కానిచో గోశాలా.

(5) శునః నిశా-కుక్కయొక్కరాత్రి' - శ్వన్ + జస్, నిశా + సు, విభక్తిలోపము. శ్వన్ + నిశా. 'నలోపః ప్రాతిపదికాన్తస్య' నకారలోపము, శ్వనిశా, నపుంసకమైనచో హ్రస్వము వచ్చి శ్వనిశ + సు = 'శ్వనిశమ్' అగును. లేనిచో శ్వనిశా + సు = శ్వనిశా.

అవ : 'తత్పురుషోఽనఞ్ కర్మధారయః' అనునధికారమునందలి 'అనఞ్ కర్మధారయః' అనుపదముయొక్క ప్రయోజనము చూపఁబడుచున్నది.

వృ : అనఞ్కర్మధారయ ఇత్యుక్తేర్నేహ. దృఢసేనో రాజా, అసేనా, పరమసేనా.

అర్థ : 'అనఞ్కర్మధారయః' అనుటవలన దృఢసేనో రాజా, అసేనా, పరమసేనా అనువానికి నపుంసకత్వము లేదు.

వివ : 'ఛాయాబాహుళ్యే' అనుసూత్రము మొదలుకొని 'విభాషాసేనాసురాచ్ఛాయా' ఇత్యాదిసూత్రమువఱకు విధింపఁబడిన నపుంసకత్వము తత్పురుషసమాసమునకు మాత్రమే యగును. అందును తత్పురుషసంజ్ఞకములే యగు నఞ్ సమాసమునందును, కర్మధారయమునందును ఈ నపుంసకత్వము రాదు.

ఉదా : దృఢా సేనా యస్య సః దృఢమైన సేనగలవాఁడు. అనునర్థమున నేర్పడిన 'దృఢసేన' అను సమాసము బహువ్రీహి కనుక నిది నపుంసకముకాదు. విశేష్యమగు 'రాజా' అను పుంలింగశబ్దమునుబట్టి యిదియు పుంలింగమే యగును. దృఢసేనః.

న(ఞ్) + సేనా, అసేనా-ఇదినఞ్ సమాసమగుటచే ఇదియు నపుంసకము కాదు. అసేనా పరవల్లింగనియమముచే నిది స్త్రీలింగమగును.

పరమా సేనా - గొప్పదియగుసేన-అనునర్థమున 'పరమసేనా' అనునది కర్మధారయమగుటచే నిదియు నపుంసకముకాదు. పరమసేనా. పరవల్లింగనియమముచే స్త్రీలింగమగును.

ఇది తత్పురుషసమాస ప్రకరణము

## ప్రకరణాలోకనము.

ఉత్తరపదముయొక్క అర్థము ప్రధానమగుట అను సాధారణలక్షణముగల తత్పురుషసమాసమునకు సంబంధించిన అనేకవిషయము లిందు చర్చింపఁబడినవి. దీనిని ప్రధానముగా మూఁడువిభాగములు చేయవచ్చును. (1) వ్యధికరణము – ద్వితీయాశ్రితాతీత మొదలుకొని 'సప్తమీశౌణ్డైః' వఱకు (2) సమానాధికరణము – దిక్సంఖ్యే సంజ్ఞాయామ్ మొదలుకొని నఞ్ తత్పురుషమువఱకు (3) గత్యాదికము. కుగతిప్రాదయః మొదలుకొని గతికారకోపపదానామ్ – ఇత్యాది పరిభాషవఱకు. వీనిలో మఱల ద్వితీయాతత్పురుషము, తృతీయాతత్పురుషము మున్నగునవి మొదటి విభాగమునందును, కర్మధారయము, ద్విగువు, నఞ్ తత్పురుషము మొదలగునవి రెండవవిభాగమునందును, గతిసమాసము ప్రాదిసమాసము, ఉపపదసమాసము మున్నగునవి మూఁడవదానియందును అవాంతరవిభాగములు. "తత్పురుషస్యాంగుళేః" ఇత్యాదిసూత్రము మొదలుకొని "ద్వ్యష్టనస్సంఖ్యాయామ్" అనునంతవఱకు సమాసాంత కార్యములును, సమాసమధ్యకార్యములును చెప్పఁబడినవి. అటుతర్వాత ప్రకరణాంతమువఱకు తత్పురుషసమాసమునకు సంబంధించిన లింగనిర్ణయము చేయఁబడినది.

ఈ ప్రకరణమున కర్మధారయము, ద్విగువు, గతి, ఉపసర్జనము (ఏకవిభక్తి చా పూర్వనిపాతే) ఉపపదము అనుసంజ్ఞలు నిర్వచింపఁబడినవి. "కృద్గ్రహణేగతికారక పూర్వస్యాపిగ్రహణమ్" "గతికారకోపపదానాం కృద్భిస్సహసమాసవచనం ప్రాక్సు బుత్పత్తేః" అను పరిభాషలిందు ప్రదర్శింపఁబడినవి.



# అథ బహువ్రీహిసమాస ప్రకరణమ్.

అవ : ఇది ప్రధానసమాసవిభాగములలో నాల్గవది. సాధారణముగ ఇందు అన్యపదముయొక్క అర్థమునకు ప్రాధాన్యముండును. అనగా సమసించిన రెండు పదముల యర్థములును మఱియొకపదముయొక్క అర్థమును జెప్పుటయందు పర్యవసించును. ఈ సమాసమేర్పడు విధానము, సమాసాంతప్రత్యయములు మున్నగునవి యీ ప్రకరణమునందు వివరింపఁబడును.

సూ : శేషో బహువ్రీహిః 2-2-23.

వృ : అధికారోఽయం ప్రాగ్ద్వంద్వాత్.

ప వి : శేషః (1-1) బహువ్రీహిః (1-1).

అను : సమాసః (1-1).

అర్థ : శేషమైనసమాసము బహువ్రీహి యగును. ఈ పదము 'చార్థే ద్వన్ద్వః' అనుసూత్రమువఱకు (2-2-29 వఱకు) అధికారమగును. ఈ సూత్రము మొదలుకొని 28 వ సూత్రమువఱకు బహువ్రీహి సమాసము విధింపఁ బడినదని యర్థము.

వివ : శేషమనఁగా చెప్పగా మిగిలినదని యర్థము. తత్పురుషసమాసప్రకరణమున ద్వితీయా, తృతీయా ఇత్యాదిగా అన్నివిభక్తులను పేర్కొని సమాసములు విధింపఁబడినవి. అందు మిగిలినది ప్రథమావిభక్తి. అది యిందు శేషపదముచే గ్రహింపఁబడును. 'విశేషణం విశేష్యేణ బహులమ్' అనుసూత్రముచే ప్రథమాంతములే సమసించుచున్నవికదా! ప్రథమాంతము శేషమగుట యెట్లని శంకింపరాదు. ఆ సూత్రముచే ప్రథమాంతములే సమసించుచున్నను అందు 'ప్రథమా' పదము పేర్కొనఁబడలేదు. కావున 'ప్రథమా' అనునది శేషమే యగును. కావున నట్టి ప్రథమాంతములతో వక్ష్యమాణసూత్రములచే నేర్పడు సమాసమునకు 'బహువ్రీహి' యను విశేషసంజ్ఞ కలుగునని యీ యధికారసూత్రముయొక్క భావము.

తెవ : సమాసవిధాయకసూత్రము చెప్పఁబడుచున్నది.

సూ : అనేకమన్యపదార్థే 2-2-24.

వృ : అనేకం ప్రథమాన్త మన్యస్య పదస్యార్థే వర్తమానం వా సమస్యతే, స బహువ్రీహిః.

ప. వి : అనేకమ్ (1-1) అన్యపదార్థే (7-1).

అను : సమాసః (1-1) శేషః (1-1) బహువ్రీహిః (1-1) విభాషా (1-1).

అర్థ : అన్యస్యపదముయొక్క అర్థమున వర్తమానములగు అనేకప్రథమాంతములు వైకల్పికముగా సమసించును. అది బహువ్రీహియగును.

వివ : 'అనేకమ్' అనగా ఒకటికంటె అధికము. రెండు, అంతకెక్కువయు కావచ్చును. 'శేషః' పదముచే ప్రథమాంతమనునర్థము వచ్చిన విధానము పూర్వసూత్ర వివరణమునఁ జెప్పఁబడినది. అన్యపదముయొక్క అర్థమున వర్తమానములగు అనేక ప్రథమాంతములు వైకల్పికముగా సమసించి బహువ్రీహియను పేరు గలదియగును. అన్యపదముయొక్క అర్థమున వర్తమానమగుట యననేమో పరిశీలింతము. ముక్కంటి=శివుఁడు, ఈ సమాసపదమున నున్నపదములు మూఁడు, కన్నులు అనునవి. వీనియర్థము లిటప్రధానములు కావు. అనగా ముక్కంటి వచ్చుచున్నాడనగా మూఁడు వచ్చుచున్నవనిగాని, కన్నులు వచ్చుచున్నవనిగాని అర్థమును సంభావింపము. శివుఁడు వచ్చుచున్నాఁడని యర్థము. శివుఁడు అన్యపదము. మూఁడు, కన్నులు అనుపదములు శివుఁడు అనునర్థము నిచ్చుటకు ఇచట కూడియున్నవి. బహువ్రీహిసమాస మిట్లు అన్యపదార్థప్రధానము.

అవ : బహువ్రీహిసమాసమున పూర్వపదనిర్ణయము నీక్రింది సూత్రము చేయుచున్నది.

సూ : సప్తమీ విశేషణే బహువ్రీహౌ 2-2-35.

వృ : సప్తమ్యన్తం విశేషణం చ బహువ్రీహౌ పూర్వం స్యాత్. కణ్ఠేకాలః. అతఏవజ్ఞాపకాద్వ్యధికరణోబహువ్రీహిః.

ప. వి : సప్తమీవిశేషణే (1-2) బహువ్రీహౌ (7-1).

అను : పూర్వమ్ (1-1).

అర్థ : బహువ్రీహియందు సప్తమ్యంతపదమును, విశేషణమును పూర్వపదముగా నుండవలయును. ఉదా : కణ్ఠేకాలః. ఈ జ్ఞాపకముచేత నే వ్యధికరణపదబహువ్రీహియు నుండవచ్చును.

వివ : సమాసమున ఉపసర్జన సంజ్ఞకలది పూర్వపదమగునని 'ఉపసర్జనం పూర్వమ్' అనుసూత్రముచేఁ దెలుపఁబడినది. సమాసవిధానసూత్రమున ప్రథమానిర్దిష్టమైనది ఉపసర్జనము. బహువ్రీహియందు ఈ విధానము పనిచేయదు. ఏలయన నిందు సమసించు రెండుపదములును ప్రథమానిర్దిష్టములే యగును. 'అనేక

మన్య పదార్థే' అనుసూత్రమున ప్రథమాంతపదము 'అనేకమ్' అనునది. సమసించు రెండుపదములును దానిచేతనే నిర్దేశింపఁబడును. కావున రెంటికిని ఉపసర్జనసంజ్ఞ కలుగును. రెండును పూర్వపదములుగా నుండుట సంభవింపదుగదా! కావున నిందు పూర్వపదనిర్ణయమునకై ప్రకృతసూత్ర మవసరమగుచున్నది. సప్తమ్యంతపదము, విశేషణవాచకమును బహువ్రీహి సమాసమున పూర్వపదముగా నుండవలయునని సూత్రార్థము.

ఇందొక విశేషము గలదు బహువ్రీహిసమాసమున రెండుపదములును ప్రథమాంతములే కావలయునని 'అనేకమన్యపదార్థే' అనుసూత్రమునఁ జెప్పఁబడినది. అట్టియెడ సప్తమ్యంతపదమునకు ఈసమాసమున స్థానమేది? సమాసమున సప్తమ్యంతపదమే యుండుటకు వీలులేనియెడల నది పూర్వపదమగుట యెట్లు సంభవమగును? కావున నీ సూత్రమునందలి 'సప్తమీ' అనుభాగము వ్యర్థమగుచున్నది. సూత్రకర్త అయిన మహర్షి ఏకాగ్రచిత్తముతో రూపొందించుసూత్రములలో ఒక్క అక్షరమేనియు వ్యర్థమగునా? ఒక అర్థవిశేషమును వెల్లడించుటకే వ్యర్థమనిపించు ఈ పదభాగమును సూత్రమున నాతఁడు నిక్షేపించెను. క్వాచిత్కముగా వ్యధికరణ పదముల బహువ్రీహియు నుండవచ్చునను విషయము నీ 'సప్తమీ' అనునది వ్యక్తము చేయును. సాధారణముగా బహువ్రీహిలోని రెండుపదములును విశేషణ విశేష్యములగుటచే నవి సమానాధికరణములు (ఏకద్రవ్యబోధకములు) కావున సమానాధికరణములతో నేర్పడు బహువ్రీహి సార్వత్రికమే. వేఱు వేఱుద్రవ్యములను బోధించు పదములుకూడ సమసించి బహువ్రీహి అగుట అందందు మిక్కిలి తక్కువగా కన్పట్టుచున్నదని యీ సూత్రమునందలి సప్తమీపదము జ్ఞాపకము చేయుచున్నది. అట్టియెడ బహువ్రీహులలో సప్తమ్యంతపదముండుటయు సంభవించును. కావున సూత్రములోని 'సప్తమీ' అనునది యిట్లు సార్థకమగుచున్నది. అట్టివానిలో సప్తమ్యంతపదము పూర్వపదము కావలయును. ఇట్టివానిని వ్యధికరణ బహువ్రీహులందురు.

ఉదా : కణ్ఠేకాలః యస్యసః-కంఠమున నలుపుగలవాఁడు. ఇచట కంఠపదము 'మెడ' అనుద్రవ్యమును కాలపదము నలుపును తెలుపుచున్నవి గావున నివి వ్యధికరణములు. ఈ సూత్రమునందలి 'సప్తమీ' పదసామర్థ్యముచే ఇచట సమాససంజ్ఞ. కంఠ + ఙి, కాల + సు, ప్రాతిపదికసంజ్ఞ కలిగి ఙి, సు అను విభక్తిప్రత్యయములకు లోపము రావలసియున్నది. కాని క్రిందిసూత్రముచే 'ఙి' ప్రత్యయమునకు లోపమురాకుండుట విధింపఁబడుచున్నది.

సూ : హలదన్తాత్సప్తమ్యాస్సంజ్ఞాయామ్ 6-3-9.

వృ : హలన్తా దదన్తాచ్చ సప్తమ్యా అలుక్. త్వచిసారః.

ప వి : హలదన్తాత్ (5-1) సప్తమ్యాః (6-1) సంజ్ఞాయామ్ (7-1).

అను : అలుక్ (1-1) ఉత్తరపదే (7-1).

అర్థము : హలంతము, అదంతమునైనదానికి పరముగా నున్న సప్తమీ విభక్తికి, ఉత్తరపదము పరమగునపుడు, సంజ్ఞ తెలుపఁబడునపుడు, లుక్కు రాదు. ఉదా : త్వచిసారః.

వివ : ఇది 'సుపోధాతుప్రాతిపదికయోః' అనుసూత్రమున కపవాదము. ఉత్తరపదమనగా సమాసమున చివరిపదము. అది పరమగునపుడు, సముదాయము చేత సంజ్ఞ తెలియునపుడు, హలంతప్రాతిపదికమునకు, అదంత ప్రాతిపదికమునకును పరముగానున్న సప్తమీవిభక్తి ప్రత్యయమునకు లుక్కు రాదు. లుక్కనగా ప్రత్యయముయొక్క అదర్శనము.

ఉదా : కణ్ఠ+ఙి, కాల + సు-ఇందు కంఠఅనునది అదంత ప్రాతిపదికము. దానికి పరముగానున్న 'ఙి' అను సప్తమ్యేకవచనప్రత్యయమునకు లుక్కు రాదు. కణ్ఠ+ఙి, కాల, ఙకారమిత్తు, కంఠ+ఇ, కాల, గుణసంధి. కంఠేకాల+సు=కంఠేకాలః. ఇది శివుడు అనునర్థమున సంజ్ఞ. 'సంజ్ఞాయామ్' అనుటవలన ఏ ఇతరునికైనను కంఠమున నలుపు ఉన్నయెడల నతనిని చెప్పునపుడు 'కంఠేకాలః' అని ప్రయోగింపరాదు.

త్వచి సారః యస్య సః - చర్మమున సారముగలది. త్వచ్ + ఙి సార + సు, సమాసము (జ్ఞాపకముచే) ఇందు సప్తమీప్రత్యయము హలంతమునకు పరముగా నున్నది. కావున ప్రకృతసూత్రముచే లుక్కు రాదు. త్వచ్ + ఇ సార, త్వచిసార+సు = త్వచిసారః - ఇది వెదురు అను వృక్షవిశేషమునకు సంజ్ఞ.

అవ : సమానాధికరణబహువ్రీహులను వృత్తికారుఁ డుదాహరించుచున్నాఁడు. ఇవి యాఱువిధములుగా నుండవచ్చును. అనగా అన్యపదార్థము ద్వితీయాదిసప్తమ్యంత విభక్తుల యర్థములలో నుండవచ్చును గావున నీ యాఱుభేదము లేర్పడుచున్నవి. ప్రథమావిభక్తిలో నుండుటమాత్రము అసంభవము.

వృ : ప్రాప్తముదకం యం ప్రాప్తోదకో గ్రామః, ఊఢరథో ఽనడ్వాన్, ఉపహృత పశూరుద్రః, ఉద్ధృతౌదనాస్థాలీ. పీతామ్బరో హరిః, వీరపురుషకో గ్రామః.

వివ : ఇవి యాఱును క్రమముగా ద్వితీయాద్యర్థబహువ్రీహుల కుదాహరణములు. ఇందలి రెండు ప్రథమాంతములును క్రమముగా విశేషణ విశేష్యములగును. అందు విశేషణము పూర్వపదముగా నుండవలయుట 'సప్తమీవిశేషణే' ఇత్యాది సూత్రముచే విధింపఁబడినది.

(1) ప్రాప్తమ్ఉదకం యం ప్రాప్తోదకః, గ్రామః – ఏ గ్రామమును నీరు పొందినదో ఆగ్రామము – (నీటినిపొందిన గ్రామము). ప్రాప్త + సు, ఉదక + సు, 'అనేకమన్యపదార్థే' అనుసూత్రముచే సమాసము, ప్రాతిపదికత్వము, విభక్తులకు లుక్కు, ప్రాప్త + ఉదక, గుణసంధి, ప్రాప్తోదక–సాధారణముగా బహువ్రీహి సమాసములు విశేషణములగును. కావున విశేష్యమైన అన్యపదమునుబట్టి వీనికి లింగ విభక్తివచనము లేర్పడును. ప్రకృతమున 'ప్రాప్తోదక' అనునది 'గ్రామః' అను పుంలింగశబ్దమునకు విశేషణము కావున నిద్దియు పుంలింగమగును. ఇట్లే మీఁది యుదాహరణములందును తెలియునది. ప్రాప్తోదక + సు = ప్రాప్తోదకః. గ్రామః. ఇందు ప్రాప్తమ్, ఉదకమ్ అనురెండుపదములును 'గ్రామః' అను అన్యపదము యొక్క యర్థమున వర్తమానములగుచున్నవి. ఇట్లే మీఁది ఉదాహరణములందు నరయునది.

(2) ఊఢః రథః యేన – దేనిచే రథము వహింపఁబడినదో అది (రథమును వహించినది ఎద్దు). ఊఢ + సు, రథ + సు, సమాసము, విభక్తిలోపము ఊఢరథ + సు = ఊఢరథః, అనడ్వాన్, రథమును వహించిన యెద్దు. ఇందు 'ఊఢః' విశేషణము కావున పూర్వపదమైనది.

(3) ఉపహృతః పశుః యస్మై – ఎవనికొఱకు పశువు తేఁబడినదో అతఁడు (రుద్రుఁడు) : ఉపహృత + సు, పశు + సు, సమాసము విభక్తిలోపము. ఉపహృత పశు + సు = ఉపహృతపశుః. ఇందు ఉపహృతశబ్దము 'పశు' అనుదానికి విశేషణము, కావున పూర్వపదమైనది. ఉపహృతపశుర్ రుద్రః, రోరి, ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః సూత్రములచే ఉపహృతపశూరుద్రః అయినది.

(4) ఉద్ధృతమ్ ఓదనం యస్యాః – ఏగిన్నెనుండి అన్నము తీయఁబడినదో అది. ఉద్ధృత + సు, ఓదన + సు, విభక్తిలోపము, వృద్ధిసంధి 'ఉద్ధృతౌదనస్థా

ఇది స్థాలీ అను స్త్రీలింగశబ్దమునకు విశేషణమగుటచే స్త్రీలింగమగును. స్త్రీలింగమున దీనికి 'టాప్' ప్రత్యయము రాఁగా 'ఉద్ధృతౌదనా' అగును. ఉద్ధృతౌదనా+సు= ఉద్ధృతౌదనా. ఇందు 'ఉద్ధృతమ్' విశేషణము పూర్వపదము.

(5) పీత మమ్బరం యస్య - పీతమైన అంబరము ఎవనికిఁగలదో అతఁడు (హరి) పీత+సు, అమ్బర+సు, విభక్తిలోపము, సవర్ణదీర్ఘ సంధి, పీతామ్బర+సు= పీతామ్బరః. ఇందు పీతశబ్దము విశేషణము. పూర్వపదము.

(6) వీరాః పురుషాః యస్మిన్ - వీరులైన పురుషులెందుగలరో అది (గ్రామము) - వీర + జస్, పురుష + జస్, విభక్తిలోపము, వీరపురుష, సమాసాంత ప్రత్యయమగు 'కప్' చేరగా వీరపురుషక + సు=వీరపురుషకః. ఇందు వీరశబ్దము విశేషణము. అది పూర్వపదము.

ఈ పై యుదాహరణములన్నింటియందును, 'అనేకమన్యపదార్థే' అను నదియే సమాసమును విధించుసూత్రము. సప్తమీవిశేషణే బహువ్రీహౌ అను నదియే పూర్వపదనిర్ణయము చేయుసూత్రము. తక్కినప్రక్రియ సాధారణమే.

వా॥ ప్రాదిభ్యోధాతుజస్యవాచ్యో వాచోత్తరపదలోపః 1360.

వృ॥ ప్రపతిత పర్ణః, ప్రపర్ణః.

ప. వి : ప్రాదిభ్యః (5-3) ధాతుజస్య (6-1) వాచ్యః (1-1) వా (అవ్య) చ (అవ్య) ఉత్తరపదలోపః 1360.

అర్థ : ప్రాదులకు పరముగా నున్న ధాతుజమైన పదమునకు సమర్థసుబంతముతో బహువ్రీహి సమాసమగును. అట్లగునపుడు వైకల్పికముగా ఉత్తరపదలోపము నగును. ఉదా : ప్రపతితపర్ణః, ప్రపర్ణః.

వివ : ప్రమున్నగునవి కృదంతములతో సమసింపగా నేర్పడిన పదమునకు మఱియొక సమర్థసుబంతముతో బహువ్రీహి సమాసమగును. అట్లు సమాసమగు నపుడు సమాసేర్పావమైన పూర్వపదముయొక్క ఉత్తరపదమునకు లోపమువచ్చును. ఈ లోపమును విధించుటకే యీ వార్తికము. సమాసమునకు 'అనేకమన్యపదార్థే' అనుసూత్రమే చాలును.

ఉదా : ప్రపతితాని పర్ణాని యస్మాత్ - దేనినుండి ఆకులు అధికముగా రాలినవో అది. (చెట్టు) 'ప్ర' అనునది 'పతిత' అనుధాతునిష్పన్నమైనరూపముతో 'ప్రాదయోగతాద్యర్థే ప్రథమయా' అను వార్తికముచే సమసింపఁగా 'ప్రపతితమ్' అగును. ప్రకృష్టం పతితమ్ = ప్రపతితమ్ (పతితమ్ అనునది పతౌ

ధాతువునకు 'క్త' ప్రత్యయము చేరినరూపము) ప్రపతిత + జస్, పర్ణ + జస్, సమాసము, విభక్తిలోపము 'ప్రపతితపర్ణ' అని యుండ నిందు పూర్వపదమైన 'ప్రపతిత' అనుదాని ఉత్తరపదమగు 'పతిత' అనుదానికి వైకల్పికముగా లోపము ప్రపర్ణ + సు = ప్రపర్ణః. లోపము రానిచో 'ప్రపతిత పర్ణః' అని యుండును.

వా॥ నఞోఽస్త్యర్థానాం వాచ్యో వా చోత్తరపదలోపః 1361.

వృ॥ అవిద్యమానపుత్రోఽపుత్రః.

వ. వి : నఞః (5-1) అస్త్యర్థానామ్ (6-3) వాచ్యః (1-1) వా (అవ్య) చ (అవ్య) ఉత్తరపదలోపః (1-1).

అర్థ : నఞ్ శబ్దమునకు పరముగానున్న అస్త్యర్థకశబ్దములకు సమర్థసుబంతములతో బహువ్రీహిసమాసమగును. పూర్వపదరూపసమాసముయొక్క ఉత్తరపదమునకు లోపమును వైకల్పికముగానగును.

వివ : అస్త్యర్థకధాతువునుండి ఏర్పడిన కృదంతరూపముతో నఞ్ శబ్దము సమసింపఁగా నేర్పడినపదము మఱియొకసుబంతముతో సమసించి బహువ్రీహి యగును. అట్లగునపుడు పూర్వసమాసముయొక్క ఉత్తరపదమునకు లోపమగును. ఇది వైకల్పికముగా నగును. ఇందును సమాసవిధానమునకు ఈ వార్తిక మక్కఱ లేదు. లోపవిధానముతోపాటు ప్రాస్తావికముగా సమాసవిధానముకూడ ఇందు చెప్పఁబడినది.

ఉదా : అవిద్యమానః పుత్రః యస్య - ఎవనికి పుత్త్రుఁడు లేఁడో అతఁడు. ఇందు 'న + విద్యమానః' అనునది నఞ్ సమాసలక్షణముచే 'అవిద్యమానః' అగును. 'విద్యమాన' అనునది అస్త్యర్థకధాతువునుండి నిష్పన్నమైన కృదన్తరూపము. 'విద' సత్తాయామ్ అనుధాతువునకు 'శానచ్' ప్రత్యయము చేయగా నేర్పడినరూపము. అస్‌ధాతువునకు 'ఉండు' అనియర్థము. విద్‌ధాతువుకూడ ఆ యర్థము నందే వర్తిల్లును. 'అవిద్యమానః' అనునది 'పుత్త్రః' అను దానితో కూడి బహువ్రీహి యైనపుడు దాని ఉత్తరపదమగు విద్యమాన అనునది వైకల్పికముగా లోపించును. అవిద్యమాన + సు, పుత్త్ర + సు, విభక్తిలోపము, అవిద్యమాన పుత్త్ర, పూర్వపదముయొక్క ఉత్తరపదమునకు లోపమురాఁగా అ (విద్యమాన) పుత్త్ర, అపుత్త్ర + సు= అపుత్త్రః. లోపమురానిచో అవిద్యమానపుత్త్రః అనియుండును.

అవ : ఈ క్రిందిసూత్రము కొన్నిసమాసములలో స్త్రీప్రత్యయాంతరూపమగు పూర్వపదమునకు పుంవద్భావమును విధించుచున్నది.

సూ : స్త్రియాః పుంవద్ భాషిత పుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియా మపూరణీ ప్రియాదిషు 6-3-34.

వృ : ఉక్తపుంస్కాదనూఙ్ ఊఙో౽భావో యత్ర తథాభూతస్య స్త్రీవాచక శబ్దస్య పుంవాచకస్యేవరూపం సమానాధికరణే స్త్రీలింగే నతుపూరణ్యాం ప్రియాదిషు. గోస్త్రియోరితి హ్రస్వః. చిత్రగుః, రూపవద్భార్యః అనూఙ్ కిమ్ ? వామోరూ భార్యః.

ప. వి : స్త్రియాః (6-1) పుంవత్ (అవ్య) భాషిత పుంస్కాదనూఙ్ (షష్ఠిలోపించినపదము) సమానాధికరణే (7-1) స్త్రియామ్ (7-1)అపూరణీ ప్రియా దిషు (7-3).

అర్థ : భాషిత పుంస్కమై ఊఙ్ ప్రత్యయాంతము కాని స్త్రీప్రత్యయాంత రూపమునకు, సమానాధికరణమైన స్త్రీలింగరూపము పరమగునపుడు, పుంలింగ రూపమువంటి రూపము వచ్చును. కాని పూరణార్థకప్రత్యయాంతముకాని, ప్రియాది పదములుగాని పరమగునపుడు ఈకార్యము జరుగదు. ఉదా : చిత్రగుః రూప వద్భార్యః. 'గోస్త్రియోః' అనుసూత్రముచే హ్రస్వము వచ్చినది. అనూఙ్ అనుటచే వామోరూభార్యః అనుచోట పుంవద్భావము రాలేదు.

వివ : సమాసములో పూర్వపదము స్త్రీప్రత్యయాంతమైనచో దానికి, సమా నాధికరణమైన యుత్తరపదము పరమగునపుడు, పుంలింగములో నేరూపముండునో యట్టిరూపము ఆదేశమగును. ఇట్లగుటలో కొన్నినియమములు గలవు. దేనికి పుం వద్భావము వచ్చునో అది భాషితపుంస్కము కావలయును. భాషిత పుంస్కమనగా భాషింపఁబడిన పుంలింగము గలది=పుంలింగమునరూపముగలది. అనగా నిత్యస్త్రీ లింగము కారాదనిభావము. మఱియు 'ఊఙ్' అను స్త్రీప్రత్యయము చేరినరూపము కారాదు. ఇట్టి లక్షణములు గలస్త్రీప్రత్యయాంతరూపమునకు, సమానాధికరణమై స్త్రీలింగమైన ఉత్తరపదము పరమున నుండవలయును. అప్పుడు దానికి (పూర్వ పదమునకు) పుంలింగములో ఎట్టిరూప ముండునో యట్టిరూప మాదేశమగును. దీనికి పుంవద్భావమని వ్యవహారము.

ఈ లక్షణములన్నియు సరిపడినను పూరణార్థక ప్రత్యయాంతమైన స్త్రీ లింగరూపముగాని, ప్రియా మున్నగుపదములుగాని పరములయినపుడు ఈ పుం వద్భావము రాదు.

ఉదా : చిత్రాః గావః యస్మిన్ సః-చిత్రమైన గోవులుగలదేశము. చిత్రా + జస్, గో + జస్ అనేకమన్యపదార్థే-సమాసము, విభక్తిలోపము. 'చిత్రా + గో' అనియుండ ప్రకృతసూత్రముచే 'చిత్రా' అనుదానికి పుంవద్భావము. ఇది స్త్రీ ప్రత్యయాంతము (చిత్ర + టాప్) దీనికి పుంలింగములో రూపము కలదు గావున భాషితపుంస్కము (చిత్రః) (పు). ఊఙ్ ప్రత్యయముచేరిన రూపము కాదు. దీనికి పరముగనున్న గోశబ్దము స్త్రీలింగము. సమానాధికరణము (చిత్రమైనది ఏదో అదియేగోవు). పూరణార్థకప్రత్యయాంతముకాదు. (రెండవ, మూఁడవ ఇత్యాదిరూపమున తెలుగుసంఖ్యావాచకములకు 'అవ' ఆగమము చేరిన విధముగా మట్ మున్నగునవిచేరిన పఞ్చమీ (అయిదవది) షష్ఠీ (ఆఱవది) మున్నగునవి పూరణార్థక ప్రత్యయాంతములు) ప్రియాదులలోనిది కాదు. కావున చిత్రాశబ్దమునకు పుంవద్భావము రాఁగా 'చిత్రగో' అగును. గోస్త్రియోరుపసర్జనస్య అనుసూత్రముచే దీనికి హ్రస్వము. సంస్కృతమున ఏ ఓ ఐ ఔ లకు హ్రస్వములేదు. ఇచట ఓకారమునకు హ్రస్వము విధింపఁబడినది. పొసఁగదు కదా యన్నచో 'ఏచఇగ్ఘ్రస్వాదేశే' అను పరిభాష పొసఁగించును. ఏచ్చులకు (ఏ ఓ ఐ ఔ లకు) హ్రస్వాదేశము విధింపఁబడినపుడు ఇక్కులు వచ్చునని సూత్రార్థము. అంతరతమ్యముచే ఏఐలకు ఇకారము,ఓఔలకు ఉకారమును వచ్చును. 'చిత్రగు' అగును. చిత్రగు + సు = చిత్రగుః.

రూపవతీభార్యా యస్య సః-రూపవతి యగుభార్యగలవాఁడు. రూపవతీ + సు, భార్యా + సు, అనేకమన్యపదార్థే, సమాసము, విభక్తిలోపము. రూపవతీ + భార్యా, పుంవద్భావము, రూపవత్ + భార్యా, జశ్త్వము రూపవద్భార్యా, గోస్త్రియోరుపసర్జనస్య' హ్రస్వము రూపవద్భార్య + సు = రూపవద్భార్యః.

పూర్వోదాహరణమునుబట్టి హ్రస్వమును విధించినఁ జాలునేమోయను శంక కలుగునేమోయని యట్టిశంకను తొలఁగించుటకై యీ యుదాహరణము చూపఁబడినదని భావింపవచ్చును

సూత్రమున 'అనూఙ్' పదమువలన ఊఙంతముల కీ పుంవద్భావమురాదు. ఉదా : వామోరూఃభార్యాయస్య సః - వామోరువైన భార్యగలవాడు. వామోరూ + సు, భార్యా + సు, సమాసము, విభక్తిలోపము, వామోరూభార్యా ఇందు 'వామోరూ' అనునది ఊఙంతము కావున తక్కినలక్షణము లన్నియు సరిపడినను పుంవద్భావమురాదు. 'గోస్త్రియోః' హ్రస్వము, వామోరూభార్య + సు = వామోరూభార్యః.

అవ : 'అపూరణీప్రియాదిషు' అనుదళముయొక్క ప్రయోజనము పరిశీలింపఁబడుచున్నది. దానికొఱకై పూరణార్థకప్రత్యయాంత బహువ్రీహికి వచ్చు సమాసాంత ప్రత్యయమును విధించుసూత్రము చెప్పఁబడుచున్నది.

సూ : అప్ పూరణీప్రమాణ్యోః 5-4-116.

వృ : పూరణార్థ ప్రత్యయాన్తం యత్ స్త్రీలిఙ్గం తదన్తాత్ ప్రమాణ్యన్తాచ్చ బహువ్రీహేరప్స్యాత్. కల్యాణీపఞ్చమీ యాసాం రాత్రీణాంతాః కల్యాణీపఞ్చమా రాత్రయః, స్త్రీప్రమాణీయస్యసః స్త్రీప్రమాణః.

ప వి : అప్ (1-1) పూరణీప్రమాణ్యోః (7-2).

అను : ప్రత్యయః (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3) బహువ్రీహౌ (7-1).

అర్థ : పూరణార్థప్రత్యయాంతస్త్రీలింగము అంతమునగల బహువ్రీహికిని, ప్రమాణీశబ్దమంతమునఁగల బహువ్రీహికిని 'అప్' అనుసమాసాంతతద్ధిత ప్రత్యయము చేరును. ఉదా : కల్యాణీ పఞ్చమీ యాసాం రాత్రీణాం తాః. కల్యాణీ పఞ్చమా రాత్రయ స్త్రీప్రమాణీ యస్య సః స్త్రీప్రమాణః.

వివ : అనువృత్తమైన బహువ్రీహౌ అను సప్తమ్యంతపదమును, సూత్రములోని పూరణీప్రమాణ్యోః అను సప్తమ్యంతపదమును పంచమ్యంతముగా మార్చుకొనవలయును 'పూరణీ' అని స్త్రీప్రత్యయ ంతరూపమును సూత్రమున గ్రహించుటచే పూరణార్థక ప్రత్యయాంతము స్త్రీలింగమే కావలయు ననుట తెలుపఁబడినది. ఇట్లు పూరణార్థక ప్రత్యయాంతమైన స్త్రీలింగరూపము కాని, ప్రమాణీశబ్దముగాని అంతమునఁ గల బహువ్రీహికి 'అప్' అను సమాసాంత తద్ధితప్రత్యయము చేరునను నర్థము సిద్ధించినది. సంఖ్యావాచకశబ్దములకు, ఆ సంఖ్యను పూరించునది లేక పూరించువాఁడు అనునర్థమున చేరు తద్ధిత ప్రత్యయమును పూరణార్థక ప్రత్యయ మందురు. అది అంతమునఁగల శబ్దస్వరూపము పూరణార్థక ప్రత్యయాంతము. ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మొదలగునవి. వీనికి స్త్రీలింగరూపములు ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ మున్నగు రీతిగా నుండును.

ఉదా : కల్యాణీ పఞ్చమీ యాసాం రాత్రీణాం తాః - ఏరాత్రులకు కల్యాణి అయిదవదియో ఆరాత్రులు. కల్యాణీ + సు, పఞ్చమీ + సు, అనేకమన్యపదార్థే అనుసూత్రముచే సమాసము, విభక్తిలోపము. కల్యాణీ+పఞ్చమీ. ఇందు కల్యాణీ శబ్దమునకు 'స్త్రియాఃపుంవత్' సూత్రముచే ప్రాప్తమగు పుంవద్భావము 'అపూరణీ

ప్రియాదిషు' అనుదళముచే వారింపఁబడును. ఇందు 'పంచమీ' అనునది పూర ణార్థక ప్రత్యయాంతము అట్టిది పరమగునపుడు పుంవద్భావమురాదు. 'కల్యాణీ పఞ్చమీ' అనునది పూరణార్థకప్రత్యయాంతము అంతమునఁగల బహువ్రీహి. కాన ప్రకృతసూత్రముచే 'అప్' ప్రత్యయము. కల్యాణీపఞ్చమీ + అప్, పవర్ణమిత్తు, పఞ్చమీలోని ఈకారమునకు 'యస్యేతిచ' అనుసూత్రముచే లోపము. కల్యాణీ పఞ్చమ, ఇది 'రాత్రయః' అనుస్త్రీలింగశబ్దమునకు విశేషణమగుటచే స్త్రీలింగము కావలయును. దీనికి స్త్రీత్వమున 'టాప్' అనుప్రత్యయము చేరును. కల్యాణీ పఞ్చమ + టాప్, కల్యాణీ పఞ్చమ+ఆ, సవర్ణదీర్ఘము కల్యాణీపఞ్చమా + జస్ (ప్రథమాబహువచనప్రత్యయము) కల్యాణీపఞ్చమాః.

ఈ 'అప్' ప్రత్యయము ప్రమాణీశబ్దాంతబహువ్రీహికిని అగును. స్త్రీప్రమాణీ యస్యసః, స్త్రీ ప్రమాణురాలుగాగలవాఁడు–స్త్రీ+సు, ప్రమాణీ + సు, సమాసము, విభక్తిలోపము, స్త్రీప్రమాణీ + అప్, యస్యేతిచ ఈకారలోపము, స్త్రీప్రమాణ+ సు=స్త్రీప్రమాణః.

అవ : పైసూత్రము స్త్రియాః పుంవత్ సూత్రములోని 'అపూరణీ' అనుదాని ప్రయోజనము సూచించు నుదాహరణమునందలి సమాసాంత కార్యమును జెప్పుటకై యిట చెప్పఁబడినది. అందలి 'అప్రియాదిషు' అనుదాని ప్రయోజనము వృత్తి యందు చెప్పఁబడుచున్నది.

వృ : అప్రియాదిషుకిమ్? కల్యాణీప్రియః ఇత్యాది.

అర్థ : అప్రియాది షు అనుటచే ప్రియా మున్నగుశబ్దములు పరమునఁగల స్త్రీలింగములకు పుంవద్భావము రాదు. ఉదా : కల్యాణీప్రియః మొ॥వి.

వివ : ప్రియాదిగణములో పఠింపఁబడిన స్త్రీలింగరూపములు పరములగు నపుడు భాషితపుంస్కమైనదియు, ఊజంతముకానిదియు నగుస్త్రీప్రత్యయాంతరూప మునకు పుంవద్భావము రాదు.

ఉదా : కల్యాణీప్రియాయస్య సః – కల్యాణిప్రియ గాఁగలవాఁడు కల్యాణీ +సు, ప్రియా + సు, అనేకమన్య పదార్థే, సమాసము. విభక్తిలోపము కల్యాణీ ప్రియా, గోస్త్రియోరుపసర్జనస్య, హ్రస్వము కల్యాణీప్రియ + సు = కల్యాణీ ప్రియః. (పుంవద్భావము వచ్చినచో 'కల్యాణప్రియః' అను దుష్టరూపము ప్రాప్తమగును.)

ప్రియాదిగణము : ప్రియా మనోజ్ఞా కల్యాణీ సుభగా దుర్భగా భక్తిః సచివా స్వసా (స్వా) కాన్తా (క్షాన్తా) సమా చపలా దుహితా వామనా తనయా॥ ఇతి ప్రియాదిః.

అవ : బహువ్రీహి సమాసములకు చేరు సమాసాంత ప్రత్యయములు చెప్పఁబడుచున్నవి. (అప్ పూరణీ ప్రమాణ్యోః అనునదియు సమాసాంత విధాయక సూత్రమే.)

సూ : బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్ 5-4-113.

వృ : స్వాఙ్గవాచి సక్థ్యక్ష్యన్తా ద్బహువ్రీహేః షచ్, దీర్ఘసక్థః, జలజాక్షీ. స్వాఙ్గాత్కిమ్? దీర్ఘసక్థి శకటమ్, స్థూలాక్షా వేణుయష్టిః 'అక్ష్ణోఽదర్శనా'త్తిది వక్ష్యమాణోఽచ్.

ప. వి : బహువ్రీహౌ (7-1) సక్థ్యక్ష్ణోః (7-2) స్వాఙ్గాత్ (5-1) షచ్ (1-1).

అను : ప్రత్యయః (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3).

అర్థ : 'స్వాంగవాచకమైన సక్థి, అక్షి శబ్దము అంతమందుఁగల బహువ్రీహికి 'షచ్' అనుసమాసాంత తద్ధిత ప్రత్యయము చేరును. ఉదా : దీర్ఘసక్థః, జలజాక్షీ, స్వాఙ్గాత్ అనుపదమేల? దీర్ఘసక్థి శకటమ్, స్థూలాక్షా వేణుయష్టిః ఇత్యాదులందు షచ్ రాకుండుటకు ఇట రెండవదానియందు 'అక్ష్ణోఽదర్శనాత్' అను వక్ష్యమాణసూత్రముచే 'అచ్ ప్రత్యయము వచ్చును.

వివ : స్వాంగమనగా శరీరావయవము. దానికి చెప్పునది స్వాంగవాచకము. స్వాంగవాచకముయొక్క నిర్వచన మీ క్రింది శ్లోకముచే చేయఁబడినది.

అద్రవం మూర్తిమత్ స్వాంగం ప్రాణిస్థ మవికారజమ్.
అతత్స్థం తత్రదృష్టంచ తేన చేత్తత్తథాయుతమ్॥

ఈ శ్లోకముచే మూఁడువిధములుగా స్వాంగము నిర్వచింపఁబడినది (1) ద్రవ్యముకానిది, ఆకారముగలదియు, ప్రాణియందున్నదియు, రోగాదివికారములవలన నేర్పడనిదియు స్వాంగమగును. కన్నుముక్కుకాలు మున్నగునవి. (2) ఒకప్పుడు ప్రాణియందుండి తర్వాత నచటలేకున్నను అది స్వాంగమగును. ఊడిన నఖములు, కేశములు, దంతములు మొ॥వి. (3) ప్రతిమలు మున్నగువానిలో ప్రాణియందెట్లుండునో అదేరీతిగా నుండు అవయవవాచకములు స్వాంగములేయగును.

ఇట్టి స్వాంగవాచకములగు సక్థి (తొడ) అక్షి (కన్ను) అనుశబ్దములు అంతమున గల బహువ్రీహికి 'షచ్' అనుసమాసాంతతద్ధిత ప్రత్యయము చేరును. ఈ ప్రత్యయమున షకారచకారములు ఇత్తులు (షః ప్రత్యయస్య, హలన్త్యమ్) ప్రత్యయస్వరూపము 'అ'

ఉదా : దీర్ఘే సక్థినీ యస్యసః - పొడవైన తొడలు గలవాఁడు. దీర్ఘ + ఔ, సక్థి + ఔ, 'అనేకమన్యపదార్థే' - సమాసము, విభక్తిలోపము దీర్ఘసక్థి + షచ్ దీర్ఘసక్థి + అ = యస్యేతిచ, ఇకారలోపము, దీర్ఘసక్థ్ + అ = దీర్ఘసక్థ + సు = దీర్ఘసక్థః.

జలజే ఇవ అక్షిణీ యస్యాః సా - జలజములవంటి కనులు గలది జలజ + ఔ, అక్షి + ఔ, సమాసము (అనేకమన్యపదార్థే) విభక్తిలోపము (సుపోధాతు ప్రాతిపదికయోః) జలజ + అక్షి = సవరదీర్ఘము = జలజాక్షి + షచ్, జలజాక్షి + అ, ఇకారలోపము (యస్యేతిచ) 'జలజాక్ష' - ఇటనిది స్త్రీని చెప్పునది యగుటచే స్త్రీ ప్రత్యయము జీష్ చేరును (షిద్గౌరాదిభ్యశ్చ) జలజాక్ష + జీష్, జలజాక్ష + ఈ, యస్యేతి చ-అకారలోపము, జలజాక్షీ + సు = జలజాక్షీ.

'షచ్' ప్రత్యయము షిత్తగుటకు స్త్రీత్వమున జీష్ ప్రత్యయము వచ్చుటయే ప్రయోజనము.

ఈ సూత్రమున 'స్వాంగాత్' అనుపదముండుటవలన స్వాంగవాచకములు కాని సక్థి, అక్షిశబ్దము లంతమునఁగల బహువ్రీహికి 'షచ్' ప్రత్యయము రాదు

ఉదా : దీర్ఘే సక్థినీ యస్యతత్ (పొడవైన తొడలవంటి పోలుకఱ్ఱలుగలది-బండి) 'దీర్ఘ + ఔ, సక్థి + ఔ, దీర్ఘసక్థి. ఇందు 'సక్థి' అనునది ప్రాణి అవయవము కాదు కనుక స్వాంగము కాదు. అందువలన షచ్ ప్రత్యయము రాదు. దీర్ఘసక్థి + సు = దీర్ఘ సక్థి (నపుం).

స్థూలాని అక్షీణి యస్యాః సా స్థూలములైన కణుపులుగల వెదురుకఱ్ఱ) స్థూల + జస్, అక్షి + జస్, స్థూలాక్షి, ఇందు అక్షిశబ్దము ప్రాణ్యవయముకాదు. కావున దానికి స్వాంగసంజ్ఞకలుగదు. అందుచే నీ సూత్రముచే 'షచ్' ప్రత్యయమురాదు. ముందుఁ జెప్పఁబోవు 'అక్ష్ణోఽదర్శనాత్' అనుసూత్రముచే 'అచ్' ప్రత్యయము వచ్చును. స్థూలాక్షి + అ(చ్), యస్యేతిచఇకారలోపము స్థూలాక్ష, ఇది 'వేణుయష్టిః' అను స్త్రీలింగశబ్దమునకు విశేషణమగుటచే స్త్రీలింగము

కావలయును. అదంతమగుటచే టాప్ప్రత్యయము. స్థూలాక్ష + సు = స్థూలాక్షా.

ఈ రెండుదాహరణములందలి సక్థి, అక్షిశబ్దములు స్వాంగవాచకములు కావని తెలుపుటకై, శకటమ్ (బండి), వేణుయష్టిః (వెదురుకఱ్ఱ) అను విశేష్యములు చూపఁబడినది.

'షచ్, అచ్' ప్రత్యయములలో మిగులునది అకారమేయైనను, మొదటిది చేరినచో స్త్రీలింగమున జీష్ప్రత్యయము వచ్చును. రెండవది అయినచో టాప్ ప్రత్యయము వచ్చును.

సూ : ద్విత్రిభ్యాం ష మూర్ధ్నః 5-4-115.

వృ : ద్విమూర్ధః, త్రిమూర్ధః.

ప. వి : ద్విత్రిభ్యామ్ (5-2) ష. (విభక్తిలోపించినపదము) మూర్ధ్నః (5-1).

అను : బహువ్రీహౌ (7-1) ప్రత్యయః (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3).

అర్థ : ద్విత్రిశబ్దములకు పరముగ నున్న 'మూర్ధన్' శబ్దమునకు బహువ్రీహి సమాసమున 'ష' అను సమాసాంతతద్ధితప్రత్యయము చేరును. ఉదా : ద్విమూర్ధః, త్రిమూర్ధః.

వివ : ద్వి, త్రి అను సంఖ్యావాచకములు పూర్వపదములుగను, 'మూర్ధన్' శబ్దము ఉత్తరపదముగను గల బహువ్రీహిసమాసమునకు అంతను 'ష' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఇందు షకారమునకు 'షః ప్రత్యయస్య' అను సూత్రముచే ఇత్సంజ్ఞ. ఈ ప్రత్యయము షిత్తగుటచే స్త్రీలింగమున 'జీష్' ప్రత్యయము వచ్చును.

ఉదా : ద్వౌమూర్ధానౌ యస్యసః - రెండుతలలుగలవాఁడు. ద్వి + ఔ, మూర్ధన్ + ఔ, అనేకమన్యపదార్థే - సమాసము, విభక్తిలోపము, ద్విమూర్ధన్ + ష, ద్విమూర్ధన్+అ, నస్తద్ధితే - టిలోపము. ద్విమూర్ధ్ + అ = ద్విమూర్ధ + సు = ద్విమూర్ధః.

త్రయో మూర్ధానో యస్యసః - మూఁడుతలలుగలవాఁడు. త్రి + జస్, మూర్ధన్ + జస్, త్రిమూర్ధన్ + ష, త్రిమూర్ధన్ + అ, టిలోపము - నస్తద్ధితే = త్రిమూర్ధ్ + అ = త్రిమూర్ధ + సు = త్రిమూర్ధః.

సూ : అన్తర్బహిర్భ్యాం చ లోమ్నః 5-4-117.

వృ : అప్ స్యాత్. అన్తర్లోమః, బహిర్లోమః.

ప. వి : అన్తర్బహిర్భ్యామ్ (5-2) చ (అవ్య) లోమ్నః (5-1).

అను : బహువ్రీహౌ (7-1) అప్ (1-1) ప్రత్యయః (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3).

అర్థ : అంతర్, బహిర్ అను అవ్యయములకు పరముగానున్న 'లోమన్' శబ్దమునకు బహువ్రీహియందు 'అప్' అనుసమాసాంత తద్ధిత ప్రత్యయము చేరును. ఉదా : అన్తర్లోమః బహిర్లోమః.

వివ : అన్తర్, బహిర్ అనునవి లోపల, బయట అనునర్థములుగల అవ్యయములు. ఇవిపూర్వపదములుగాఁ గలదియు, లోమన్ శబ్దము త్తరపదముగాఁ గలదియు నగుబహువ్రీహిసమాసమునకు అంతమున 'అప్' అను తద్ధితప్రత్యయము చేరును.

ఉదా : అన్తర్లోమాని యస్యసః (లోపల రోమములు = వెంట్రుకలు, కల వాఁడు) అన్తర్ + లోమన్ + జస్, అనేక మన్య పదార్థే = సమాసము, విభక్తిలోపము - అన్తర్లోమన్ + 'అప్' పవర్గమిత్తు, నస్తద్ధితే అను సూత్రముచే టిలోపము, అన్తర్లోమ్ + అ = అన్తర్లోమ + సు = అన్తర్లోమః.

ఇట్లే బహిర్లోమానియస్యసః - బహిర్లో మః బయట వెంట్రుకలు గలవాఁడు.

సూ : పాదస్యలోపో ఽ హస్త్యాదిభ్యః 5-4-138.

వృ : హస్త్యాది వర్జితాదుపమానాత్పరస్య పాదస్యలోపః. వ్యాఘ్రస్యేవ పాదా వస్యవ్యాఘ్రపాత్. అహస్త్యాదిభ్యః కిమ్? హస్తిపాదః, కుసూలపాదః.

ప. వి : పాదస్య (6-1) లోపః (1-1) అహస్త్యాదిభ్యః (5-3)

అను : సమాసాన్తాః (1-3) ఉపమానాత్ (5-1) బహువ్రీహౌ (7-1)

అర్థ : హస్త్యాదులు కాని ఉపమానవాచకమునకు పరముగా నున్న పాదశబ్దమునకు బహువ్రీహియందు లోపమువచ్చును. ఉదా : వ్యాఘ్రస్యేవ పాదావస్య వ్యాఘ్రపాత్, అహస్త్యాదిభ్యః అననేల? హస్తిపాదః, కుసూలపాదః, ఇత్యాదులందులోపము రాకుండుటకు.

వివ : హస్తిమున్నగునవికాక తక్కిన ఉపమానవాచకము పూర్వపదమును పాదశబ్దము ఉత్తరపదము అయిన బహువ్రీహి సమాసమునకు సమాసాంత కార్య

ముగా లోపమువచ్చును. 'అలో ఽ న్త్యస్య' అనుపరిభాషచే ఈ లోపము తుది వర్ణమున కగును.

ఉదా : వ్యాఘ్రస్యపాదౌ ఇవపాదౌ యస్యసః - పులికాళ్ళవంటి కాళ్ళు కల వాఁడు- 'వ్యాఘ్ర పాద+ఔ, పాద+ఔ' అని అలౌకిక విగ్రహము 'సప్తమ్యుప మాన పూర్వపదస్యోత్తరపదలోపశ్చ' (సప్తమ్యంతముగాని, ఉపమానవాచకముగాని అయిన పూర్వపదము మఱియొకపదముతో సమసించును. అట్లు సమసించునపుడు పూర్వపధముయొక్క ఉత్తరపదమునకు లోపమును అగును) అనువార్తికముచే నిచట సమాసమగును. విభక్తులు లోపించును ఉపమానరూప 'వ్యాఘ్రపాద' అను పూర్వపదముయొక్క ఉత్తరపదమైన పాదశబ్దము లోపించును. 'వ్యాఘ్రపాద' అని యుండ ప్రకృతసూత్రముచే 'ద' లోని అకారమునకు లోపము. వ్యాఘ్రపాద్ + సు = వ్యాఘ్రపాద్, వైకల్పికముగా దకారమునకు చర్త్వము (వావసానే) వ్యాఘ్రపాత్.

'అహస్త్యాదిభ్యః' అనుపదమువలన పూర్వపదమైన ఉపమానవాచకము హస్త్యాదిగణములోనిదైనచో దానికి పరముగానున్న పాదశబ్దము తుదివర్ణము లోపింపదు. ఉదా : హస్తిపాదౌ ఇవపాదౌ యస్యసః - ఏనుగుకాళ్ళవంటి కాళ్ళు గలవాఁడు. హస్తిపాద + ఔ, పాద+ఔ, హస్తిపాద + సు = హస్తిపాదః. (సమాసము, పూర్వపదమునందలి పాదశబ్దమునకు లోపమగుటయు పూర్వోదాహరణమునకు వలెనే).

ఇట్లే కుసూలౌ ఇవపాదౌ యస్యసః - కుసూలపాదః గాదెవంటికాళ్ళు గలవాఁడు.

హస్త్యాదిగణము : హస్తిన్ (కుద్దాల అశ్వ కశిక కురుత) కటోల కటోలక గండోల గండోలక కణ్డోల కణ్డోలక అజ కపోత జాల గణ మహేలా దాసీ గణికా కుసూల ఇతి హస్త్యాదిః.

సూ : సంఖ్యా సుపూర్వస్య 5-4-140.

వృ : లోపః స్యాత్. ద్విపాత్, సుపాత్.

ప వి : సంఖ్యాసు పూర్వస్య (6-1).

అను : పాదస్య (6-1) లోపః (1-1) సమాసాన్తాః (1-3) బహువ్రీహౌ

అర్థ : సంఖ్యావాచకము గాని 'సు' శబ్దముగాని పూర్వమునఁ గలపాదశబ్దము నకు బహువ్రీహియందు సమాసాంతముగా లోపము వచ్చును. ఉదా : ద్విపాత్, సుపాత్.

వివ : సంఖ్యావాచకమును, 'సు' అను నవ్యయమును పూర్వపదముగాఁగల, పాదశబ్దము అంతమునఁ గల బహువ్రీహిసమాసమునకు అంతమున లోపము వచ్చును. అనగా పాదశబ్దముయొక్క తుదిఅకారమునకు లోపము వచ్చును.

ఉదా : ద్వౌ పాదౌ యస్యసః - రెండుకాళ్ళుగలవాఁడు, ద్వి+ఔ, పాద + ఔ, అనేకమన్యపదార్థే - సమాసము, విభక్తిలోపము-ద్విపాద, అకారలోపము. ద్విపాద్ + సు = ద్విపాద్, అవసానమున వైకల్పికముగా చర్త్వము ద్విపాత్.

శోభనౌ పాదౌ యస్యసః శోభనములైనపాదములు గలవాఁడు అనునర్థమున సు, పాద + ఔ, సమాసము, విభక్తిలోపము. సుపాద, అకారలోపము, సుపాద్+ సు= సుపాద్, సుపాత్.

సూ : ఉద్విభ్యాం కాకుదస్య 5-4-148.

వృ: లోపః స్యాత్. ఉత్కాకుత్, వికాకుత్.

ప. వి : ఉద్విభ్యామ్ (5-2) కాకుదస్య (6-1).

అను : లోపః (1-1) బహువ్రీహౌ (7-1) సమాసాన్తాః (1-3).

అర్థ : ఉద్, వి అనునుపసర్గములకు పరముగా నున్న కాకుదశబ్దమునకు బహువ్రీహియందు సమాసాంతకార్యముగా లోపము వచ్చును. ఉదా : ఉత్కాకుత్, వికాకుత్.

వివ : ఉద్, వి అనునుపసర్గములు పూర్వపదములుగా నున్న బహువ్రీహి సమాసముయొక్క ఉత్తరపదమగు 'కాకుద' శబ్దముయొక్క తుదివర్ణమునకు సమాసాంత కార్యముగ లోపము వచ్చును.

ఉదా : ఉన్నతం కాకుదంయస్య - ఎత్తైన తాలువుగలవాఁడు, ఉద్ నత + సు, కాకుద + సు, 'ప్రాదిభ్యోధాతుజస్య వాచ్యోవాచోత్తరపదలోపః' అను వార్తికముచే సమాసము, ఉత్తరపదమగు 'నత' అనుదానికి లోపము, విభక్తి లోపము, చర్త్వము ఉత్కాకుద, ప్రకృత సూత్రముచే తుది అకారమునకు లోపము-ఉత్కాకుద్ + సు=ఉత్కాకుద్, వైకల్పికముగా చర్త్వము (వావసానే)

అస్మే విగతం కాకుదం యస్య - పోయిన తాలువు కలవాడు వి + గత + సు, కాకుద + సు = వికాకుద (ప్రక్రియపూర్వమువలెనే) వికాకుద్+సు= వికాకుద్, వికాకుత్.

సూ : పూర్ణాద్విభాషా 5-4-149.

వృ : పూర్ణకాకుత్, పూర్ణకాకుదః.

ప. వి : పూర్ణాత్ (5-1) విభాషా (1-1).

అను : బహువ్రీహౌ (7-1) కాకుదస్య (6-1) లోపః (1-1) సమాసాన్తాః (1-3).

అర్థ : పూర్ణశబ్దమునకు పరముగానున్న కాకుదశబ్దమునకు బహువ్రీహియందు సమాసాంతకార్యముగా లోపము వైకల్పికముగా నగును.

వివ : పూర్ణశబ్దము పూర్వమునఁ గల కాకుదశబ్దముయొక్క తుదివర్ణమునకు బహువ్రీహియందు సమాసాంత కార్యముగా లోపము వైకల్పికముగా వచ్చును.

ఉదా : పూర్ణం కాకుదం యస్య సః - నిండైన తాలువుకలవాఁడు పూర్ణ+సు. కాకుద+సు, 'అనేకమన్యపదార్థే, అను సూత్రముచే సమాసము, విభక్తి లోపము (సుపోధాతు ప్రాతిపదికయోః) పూర్ణకాకుద, అకారలోపము వచ్చినచో పూర్ణకాకుద్ + సు = పూర్ణకాకుద్. పూర్ణకాకుత్, రానిచో పూర్ణకాకుద + సు= పూర్ణకాకుదదః.

సూ : సుహృద్దుర్హృదౌ మిత్రామిత్రయోః 5-4-150.

వృ : సు హృన్మిత్రమ్, దుర్హృదమిత్రః.

ప వి : సుహృద్దుర్హృదౌ (1-2) మిత్రా మిత్రయోః (7-2)

అను : బహువ్రీహౌ (7-1).

అర్థ : 'మిత్రుఁడు' అనునర్థమున 'సుహృత్' అనియు, అమిత్రుఁడు అనునర్థమున 'దుర్హృత్' అనియు నగును.

వివ : సు, దుర్ అనునవ్యయములకు పరముగానున్న హృదయశబ్దమునకు బహువ్రీహియందు 'హృద్' అనునాదేశము ఈసూత్రముచే నివతింపఁబడినది.

ఉదా : శోభనం హృదయంయస్యసః. మంచిహృదయముగలవాఁడు సు , హృదయ + సు హృదయ - సుహృద్ + సు = సుహృద్, సుహృత్

(మిత్రుఁడు) దుష్టం హృదయం యస్యసః - చెడ్డహృదయముగలవాఁడు. దుర్, హృదయ + సు = దుర్ హృదయ - దుర్హృద్ + సు, దుర్హృద్, దుర్హృత్- (అమిత్రుఁడు).

సూ : ఉరః ప్రభృతిభ్యః కప్ 5-4-151.

ప. వి : ఉరః ప్రభృతిభ్యః (5-1) కప్ (1-1).

అను : బహువ్రీహౌ (7-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3)

అర్థ : ఉరస్ మున్నగుశబ్దము లంతమునఁగల బహువ్రీహిసమాసములకు అంతమున 'కప్' అను తద్ధితప్రత్యయము చేరును.

వివ : ఉరస్ మున్నగుశబ్దములు బహువ్రీహిసమాసాంతమునయున్నయెడల వానికి పరముగా 'కప్' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఇందు పవర్ణమిత్తు ఇది తద్ధితమగుటచే 'లశక్వతద్ధితే' అనుసూత్రమిందు వర్తింపదు. కావున కకార మితుకాదు.

ఉదా : వ్యూఢమ్, ఉరః యస్యసః-(విశాలమైనఱొమ్ము కలవాఁడు) అనేక మన్యపదార్థే-సమాసము, విభక్తిలోపము వ్యూఢ + ఉరస్, గుణసంధి, వ్యూఢోరస్, ప్రకృతసూత్రముచే 'కప్' ప్రత్యయము, వ్యూఢోరస్ + క, అట్లే ప్రియంసర్పిః యస్యసః (ప్రియమైననేయికలవాఁడు) ప్రియ + సు, సర్పిస్ + సు, ప్రియసర్పిస్ + క ఈ రెంటియందు సకారమునకు రుత్వము (ససజుషోరుః) విసర్గమును (ఖర వసాన యోర్విసర్జనీయః) రాఁగా వ్యూఢోరః + క, ప్రియసర్పిః + క అనియుండ క్రిందిసూత్రముచే సత్త్వములు క్రమముగా విసర్గమునకు విధింపఁబడుచున్నవి.

సూ : కస్కాదిషు చ 8-3-4

వృ : ఏష్విణ ఉత్తరస్య విసర్గస్య షోఽన్యస్యతుసః, ఇతిసః వ్యూఢోరస్కః. షః, ప్రియసర్పిష్కః.

ప. వి : కస్కాదిషు (7-3) చ (అవ్య).

అను : ఇణః (5-1) షః (1-1) సః (1-1) విసర్జనీయస్య (6-1).

అర్థ : కస్కాదులయందు ఇణ్వర్ణమునకు పరముగనున్న విసర్గమునకు షత్వమును, తక్కినదానికి సకారమును ఆదేశమగును. ఉదా : వ్యూఢోరస్కః, ప్రియసర్పిష్కః.

వివ : కస్కాదిగణములో పఠింపఁబడినవానిలో ఇణ్ప్రత్యాహారములోని వర్ణమునకు పరముగనున్న విసర్గమునకు షకారమాదేశమగును. తక్కిన వర్ణమునకు

పరముగనున్న విసర్గమునకు సకారమాదేశమగును. ఇది 'కుప్వోః ౫ క ౫ పౌచ' అనుసూత్రమున కపవాదము.

ఉదా : వ్యాఘ్రోరః + క, ఇందు విసర్గమునకు పూర్వమున అకారమున్నది కావున సకారాదేశము రాఁగా వ్యాఘ్రోరస్క=వ్యాఘ్రో రస్క+సు=వ్యాఘ్రోరస్కః, ప్రియసర్పిః + క, ఇచట విసర్గమునకు పూర్వమున ఇణ్వర్ణమగు ఇకార మున్నది కావున విసర్గమునకు షకారమాదేశమగును. ప్రియసర్పిష్+క, ప్రియసర్పిష్క + సు=ప్రియసర్పిష్కః.

[విశే : వ్యాఘ్రోరః+క అనుచోట 'సోఽపదాదౌ' అనుసూత్రముచే విసర్గమునకు సకారాదేశమును, ప్రియసర్పిః + క అనుచోట ఇణః షః అనుసూత్రముచే షకారాదేశమును ఆగునుగావున నీసూత్రమునిచట నుపన్యసించుట ప్రామాదికమని కొందఱు వ్యాఖ్యాతలు వివరించిరి].

కస్కాదిగణము : కస్కః కౌతస్కుతః భ్రాతుష్పుత్రః శునస్కర్ణః సద్యస్కాలః సద్యస్క్రీః సాద్యస్క్రః కాంస్కాన్ సర్పిష్కుణ్డికా ధనుష్కపాలమ్ బర్హిష్పలమ్ (బర్హిష్పలమ్) యజుష్పాత్రమ్ అయస్కాన్తః తమస్కాణ్డః అయస్కాణ్డః మేదస్పిణ్డః భాస్కరః అహస్కరః॥ ఇతికస్కాదిః॥ ఆకృతిగణః.

'ఉరః ప్రభృతిభ్యఃకప్' అనుసూత్రమునందలి ఉరఃప్రభృతిగణము. ఉరస్ సర్పిస్ ఉపానహ్ పుమాన్ అనడ్వాన్ పయః నౌః లక్ష్మీః దధి మధు శాలీ(శాలి.) (అర్థాన్నఞః). ఇత్యురః ప్రభృతయః.

అవ : ఈ క్రిందిసూత్రము బహువ్రీహిసమాసమునందలి పూర్వపదనిర్ణయమునకు సంబంధించినది.

సూ : నిష్ఠా 2-2-36.

వృ : నిష్ఠాన్తం బహువ్రీహౌ పూర్వంస్యాత్. యుక్తయోగః.

ప. వి : నిష్ఠా (1-1).

అను : బహువ్రీహౌ (7-1) పూర్వమ్ (1-1).

అర్థ : బహువ్రీహిసమాసమున నిష్ఠాన్తము పూర్వపదము కావలయును. ఉదా : యుక్తయోగః.

వివ : క్త, క్తవతు అనురెండు కృత్ప్రత్యయములకు నిష్ఠాసంజ్ఞగలదు. ప్రత్యయగ్రహణ పరిభాషచే నిష్ఠాపదమునకు నిష్ఠాంతమనునర్థము గలుగును. బహువ్రీహిసమాసమున నిష్ఠాంతము ఉన్నయెడల నదిపూర్వపదము కావలయును.

ఉదా : యుక్తః యోగః యేనసః - ఎవనిచేత యోగము యుక్తమైనదో అతఁడు-యుక్త + సు, యోగ+సు, సమాసము-అనేకమన్యపదార్థే, విభక్తిలోపము యుక్తయోగ, ఇందు యుక్త అనునది నిష్ఠాంతము (యుజ్ + క్త)=యుక్తఅదియే పూర్వపద మయినది. యుక్తయోగ + సు=యుక్తయోగః.

ఇచట నొకవిశేషము. నిష్ఠాంతము విశేషణమే యగును. అపుడు "సప్తమీ విశేషణే బహువ్రీహౌ" అనుసూత్రముచేతనే దానకి పూర్వపదత్వము సిద్ధించును. మఱల నీసూత్రమేల? అనగా కొన్నిసందర్భములలో విశేషణవిశేష్యభావము వక్త యొక్క ఇచ్ఛాధీనమగుటచే నిష్ఠాంతము విశేష్యము కూడకావచ్చును. అప్పుడు కూడ నిది పూర్వపదమే యగుటకై యీ సూత్రము చెప్పఁబడినది.

[ఈ సూత్రమున కిచట సందర్భశుద్ధిలేదు. సామాసాంతప్రత్యయములను పేర్కొనుసందర్భమున మధ్యలో నిదియుండుట పొసఁగదు. సప్తమీ విశేషణే బహువ్రీహౌ అనుసూత్రముకడనే దీనిని పేర్కొనుట సముచితము].

అవ : పూర్వసూత్రమున విధింపఁబడిన కప్‌ప్రత్యయమునకు కొన్నియెడల వైభాషికత్వము చెప్పఁబడుచున్నది.

సూ : శేషాద్విభాషా 5-4-154.

వృ : అనుక్త సమాసాంతాద్బహువ్రీహేః కబ్వా. మహాయశస్కః, మహాయశాః.

ప. వి : శేషాత్ (5-1) విభాషా (1-1).

అను : బహువ్రీహౌ (7-1) కప్ (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3).

అర్థ : సమాసాంతప్రత్యయము చెప్పఁబడని బహువ్రీహికి 'కప్' అను సమాసాంతతద్ధిత ప్రత్యయము విభాషనగును. ఉదా : మహాయశస్కః, మహాయశాః.

వివ : పైని కొన్నిసూత్రములచే కొన్నిబహువ్రీహిసమాసములకు కొన్ని సమాసాంతప్రత్యయములు విధింపఁబడినవి. అట్లు విధింపఁబడనిశబ్దములకు 'కప్' ప్రత్యయము విభాషగా నగును. విభాషయనునది నిషేధ వికల్పములకు సంజ్ఞ(నవేతి విభాషా) కావున బహువ్రీహిసమాసములందన్నిటికిని కప్‌ప్రత్యయము రావలయునని నియమములేదు. ఇతరసమాసాంతప్రత్యయములు విధింపఁబడని బహువ్రీహులకు 'కప్' ప్రత్యయము సాధారణముగా వికల్పము. కొన్నియెడల రాకపోవుటయు సంభవమేయని తాత్పర్యము.

ఉదా : మహద్యశః యస్యసః గొప్పకీర్తికలవాఁడు. మహత్ + సు, యశస్ + సు, అనేకమన్యపదార్థే-సమాసము, విభక్తిలోపము మహత్ + యశస్, 'ఆన్మహతస్సమానాధికరణజాతీయయోః' అనుసూత్రముచే తకారమునకు ఆకారాదేశము, మహ+ఆ, యశస్, సవర్ణదీర్ఘసంధి, మహాయశస్, దీనికి ఇతరసమాసాంత ప్రత్యయము విధింపఁబడలేదు కావున ప్రకృతసూత్రముచే కప్‌ప్రత్యయము వచ్చినచో, మహాయశస్+కప్ (పపర్ణమిత్తు) సకారమునకు రుత్వము, దానికివిసర్గము, దానికి మరల సకారాదేశమ మహాయశస్క + సు=మహాయశస్కః. కప్ప్రత్యయము రానిచో మహాయశస్+సు=మహాయశాః' అగును.

ఇదిబహువ్రీహి సమాస ప్రకరణము

ప్రకరణావలోకనము.

అన్యపదార్థప్రధానమను సామాన్యలక్షణము గల బహువ్రీహిసమాసము యొక్క సిద్ధి యీ ప్రకరణమున విశదీకరింపఁబడినది. ఇందు 'శేషో బహువ్రీహిః' అధికారసూత్రము. 'అనేకమన్యపదార్థే' అనుసూత్రము ('ప్రాదిభ్యోధాతుజస్య', 'నఞోఽస్త్యర్థానామ్' అనువార్తికములును) సమాసమును విధించును. సప్తమీ విశేషణే బహువ్రీహౌ, నిష్ఠా అనుసూత్రములు బహువ్రీహియందు పూర్వపదమును నిర్ణయించునవి. 'స్త్రియాః పుంవదిత్యాదిసూత్రము కొన్నికర్మధారయములందును, బహువ్రీహులందును పూర్వపదముగా నున్న స్త్రీప్రత్యయాంతరూపములకు కొన్ని పరిస్థితులలో పుంవద్భావమును విధించును. తక్కినసూత్రములన్నియు సమాసాంత ప్రత్యయములను విధించునవి. 'కస్కాదిషుచ' అనుసంధిసూత్రమొకటియిందు ప్రసక్తి ననుసరించి చెప్పఁబడినది.

# అథ ద్వన్ద్వ సమాస ప్రకరణమ్.

అవ : ప్రధానసమాసభేదములలో ద్వంద్వము అయిదవది. ఇందు సాధారణముగా ఉభయపదముల యర్థములకు ప్రాధాన్యముండును. ద్వంద్వసమాసవిధానము, పూర్వపదనిర్ణయము, వచననిర్ణయము, సమాసాంతప్రత్యయము అనునంశములిందు క్రమముగా చెప్పఁబడుచున్నవి.

సూ : చార్థే ద్వంద్వః 2-2-29.

వృ : అనేకం సుబన్తం చార్థే వర్తమానం వాసమస్యతే, సద్వన్ద్వః· సముచ్చయాన్వాచయేతరేతరయోగ సమాహారాశ్చార్థాః. పరస్పర నిరపేక్షస్యానేకస్యైకస్మిన్నన్వయః సముచ్చయః; అన్యతరస్యానుషఙ్గికత్వేనాన్వయోఽన్వాచయః; మిళితానామన్వయఇతరేతరయోగః; సమూహస్సమాహారః. తత్ర 'ఈశ్వరం గురుం చ భజస్వే'తి సముచ్చయే, 'భిక్షామటగాంచాన' యేత్యన్వాచయే చ నసమాసః; అసామర్థ్యాత్. ధవఖదిరౌ, సంజ్ఞాపరిభాషమ్.

వ వి : చార్థే (7-1) ద్వన్ద్వః (1-1).

అను : సమాసః (1-1) విభాషా (1-1) అనేకమ్ (1-1) సుప్ (1-1).

అర్థ : 'చ' అనునవ్యయముయొక్క అర్థమున వర్తమానములగు అనేక సుబంతములు వైకల్పికముగా సమసించును. అది ద్వంద్వమగును. సముచ్చయము, అన్వాచయము, ఇతరేతరయోగము, సమాహారము అనునవి 'చ' అనునవ్యయము యొక్క అర్థములు. పరస్పరమపేక్షలేని యనేకవిషయములకు ఒకదానియందన్వయము సముచ్చయమనఁబడును. అనేకము నందొకదానికానుషంగికత్వమున నన్వయముండుట అన్వాచయము. మిశితములైనవాని కన్వయము ఇతరేతరయోగము. సమూహము సమాహారము. అందు 'ఈశ్వరం గురుంచ భజస్వ' – 'ఈశ్వరుని గురువును భజింపుము' అనుసముచ్చయార్థమునందును, భిక్షామటగాంచానయ – భిక్షమునకు తిరుగుము – గోవును దెమ్ము అనునన్వాచయార్థమునందును, సామర్థ్యములేని కారణమున సమాసమేర్పడదు. ధవఖదిరౌ (ఇతరేతర యోగము) సంజ్ఞాపరిభాషమ్ (సమాహారము)–

వివ : 'చ' అను అవ్యయమునకు నాలుగర్థములు గలవు. (1) సముచ్చయము : ఒకదానికొకటి అపేక్షలేని స్వతంత్రములైన అనేకవిషయములకు ఒక

క్రియయందు అన్వయ ముండుటకు సముచ్చయమని పేరు. ఉదా : ఈశ్వరం. గురుం చ భజస్వ – ఈశ్వరుని, గురువును భజింపుము. ఇచట ఈశ్వరుఁడు, గురువు అను వ్యక్తులకు పరస్పరసంబంధము లేదు. కాని యీ వాక్యమునందలి చకారము భజనక్రియలో వీరిరువురిని కలిపినది. ఈశ్వరంభజస్వ, గురుంచ భజస్వ అని దీని కర్థము. ఇందు రెండవవాక్యమున 'గురుంచ' అనుచోట చకారము గురువును కూడ అనునర్థము నిచ్చునదియై మఱియొకవ్యక్తికి కూడ భజస్వ అనుక్రియతో నన్వయము కలదని తెలుపుచున్నది. ఈశ్వరశబ్దముమాత్రము గురుశబ్దముయొక్క అర్థము సపేక్షింపకయే క్రియతో నన్వయించుచున్నది. ఇట్లు ఈశ్వరశబ్దమునకు గురుశబ్దముతో అపేక్షలేదు కనుక ఇవి రెండును పరస్పర నిరపేక్షములు. ఇవిభజస్వ అను క్రియయం దన్వయించుచున్నవి. ఈ రెండును 'భజస్వ' అనుక్రియయందు కలిసి అన్వయించుటను 'చ' అనునవ్యయము బోధించుచున్నది. కావున నిచట 'చ' అనుదానికి సముచ్చయమర్థము.

(2) అన్వాచయము : ఒకవిషయము ప్రధానముగా రెండవది అప్రధానము అన్వయించుటకు అన్వాచయమని పేరు. గురువు శిష్యునికి 'భిక్షామట గాంచానయ' అని ఆదేశించెను. బిచ్చమున కరుగుము. గోవునుకూడ తెమ్ము. ఇందు బిచ్చమెత్తుట ప్రధానము. ఇట్లు బిచ్చమునకై తిరుగునపుడు కనఁబడినచో తప్పిపోయిన గోవును తోలుకొని వచ్చుటయుఁ జేయువలయును. ఇట్లు ప్రధాన, అప్రధాన విషయములు 'చ' అనుపదముతో కలసి చెప్పఁబడుట అన్వాచయము.

(3) ఇతరేతరయోగము : పరస్పరసంబంధము గలిగినవి యొక క్రియ యందన్వయించుటకు ఇతరేతర యోగమని వ్యవహారము. ఉదా : 'ధవంచ ఖదిరం చ ఛిన్ధి' – ధవమును ఖదిరమును గూడ ఛేదింపుము. ఇచట ధవము, ఖదిరము అను రెండు (వృక్షవిశేషములు) పరస్పరసంబంధము గలవి. (యజ్ఞక్రియలో వీనికి సంబంధము గలదు) ఇవి రెండును ఛేదనక్రియయందు అన్వయించుచున్నవి. ఇట్టి అన్వయమును వాక్యమునందు ఆవృతమైన చ అను అవ్యయము చెప్పుచున్నది ఇట్టిది ఇతరేతరయోగము అనఁబడును.

(4) సమాహారమనగా సమూహము. అనేకము లొక్కటిగా భావింపఁబడుట అనియర్థము.

సమాసమగుట సమర్థములగు పదములకే (సమర్థః పదవిధిః). సముచ్చయాన్వాచయార్థములలో ఏకార్థీభావరూప సామర్థ్యము ఉండదు కనుక నచట సమాస

మేర్పడదు. పరస్పరనిరపేక్షములకు ఏకార్థీభావము పొసఁగదు. అట్లే ప్రధానము, అప్రధానమునైన రెంటికి ఏకార్థీభావము పొసఁగదు. పరస్పరసంబంధము గలిగి అన్వయించుట (ఇతరేతర యోగము), అన్నియు కలిసి ఒకటిగా భావింపఁబడుట (సమాహారము) అనునర్థములలో ఏకార్థీభావము సాధ్యమే కావున ఇతరేతరయోగ సమాహారార్థములలో ద్వంద్వసమాస మేర్పడవచ్చును. వానికి క్రమముగా నుదాహరణములు చూపఁబడుచున్నవి.

(1) ధవశ్చఖదిరశ్చ - ధవ + సు, ఖదిర + సు, చార్థేద్వన్ద్వః అను సూత్రముచే సమాససంజ్ఞ, దానిచేతనే ద్వంద్వమను విశేషసంజ్ఞయు కలుగును. సమాసమగుటచే ప్రాతిపదికమై దాని సుప్పులకు లుక్కు వచ్చును. ధవఖదిర ఇది ఉభయపదార్థ ప్రధానమగుటచే సమాసగత పదములచే వాచ్యములగు వస్తువులనుబట్టి వచన మేర్పడును. 'పరవల్లిఙ్గంద్వన్ద్వతత్పురుషయోః' అనుసూత్రమునుబట్టి పర పదముయొక్క లింగమే సమాసలింగమగును. కావున ప్రకృతమున పుంలింగము, ద్వివచనాంతము నగును. ధవఖదిర + ఔ = ధవ ఖదిరౌ.

ద్వంద్వసమాసమున పూర్వపదనిర్ణయమునకు ముందు సూత్రములు చెప్పఁబడుచున్నవి. ఇందు రెండును, లేక అన్నియును ఉపసర్జనములే యగును. కావున 'ఉపసర్జనం పూర్వమ్' అనుసూత్ర మిందు పనిచేయదు.

(2) సమాహారార్థమున నుదాహరణము సంజ్ఞానాం పరిభాషాణాం చ సమాహారః (సంజ్ఞలయొక్కయు, పరిభాషలయొక్కయుసమూహము). సంజ్ఞా + ఆమ్, పరిభాషా + ఆమ్ చార్థేద్వంద్వః సమాసము, విభక్తిలోపము. 'సంజ్ఞా పరిభాషా' - సమూహమెన్నివస్తువులు గలదియైనను, సమూహరూపమున నొక్కటియే కావున ఇది ఏకవచనమగును. అనగా ఏకవచనప్రత్యయమును బొందును. 'సనపుంసకమ్' అనుసూత్రముచే నిది నపుంసకమును అగును. నపుంసకమగుటచే 'హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య' అను సూత్రముచే హ్రస్వము సంజ్ఞాపరిభాష + సు = సంజ్ఞా పరిభాషమ్.

అవ : ద్వంద్వసమాసములోని పదములన్నియు ప్రథమానిర్దిష్టములే యగుటచే నన్నియు నుపసర్జనములే యగును. కావున నిందు పూర్వపదనిర్ణయమునకు 'ఉపసర్జనం పూర్వమ్' అనుసూత్రము సహకరింపదని చెప్పఁబడినది. కావున నిందు పూర్వపద నిర్ణయము చేయుకొన్ని సూత్రము లిటచెప్పఁబడుచున్నవి. అన్నివిధములగు సమాసములకు వర్తించుసూత్రమొకటి యిట చెప్పఁబడుచున్నది. అందును కొన్ని ద్వంద్వము లుండుటచేనదియిచట చెప్పఁబడుట సముచితమే యగును.

సూ : రాజదన్తాదిషు పరమ్ 2-2-31.

వృ : ఏషుపూర్వ ప్రయోగార్హంపరంస్యాత్. దన్తానాం రాజా రాజదన్తః.

ప వి : రాజదన్తాదిషు (7-3) పరమ్ (1-1).

అను : పూర్వమ్ (1-1).

అర్థ : రాజదన్త మున్నగుసమాసములలో పూర్వము ప్రయోగింపఁబడవలసినది పరపదమగును. ఉదా : దన్తానాం రాజా, రాజదన్తః.

వివ : 'ఉపసర్జనం పూర్వమ్' మున్నగు సూత్రముల కిది యపవాదము. 'రాజదన్త' మున్నగుసమాసములలో నేది పూర్వపదముగా నుండవలయునని తక్కినసూత్రములచే నియమింపఁబడినదో యది పరపదముగా నుండవలయునని యీ సూత్రము చెప్పుచున్నది.

ఉదా : దన్తానాం రాజా - (దంతములలో శ్రేష్ఠమైనది) దన్త + ఆమ్, రాజన్ + సు, ఇచట 'షష్ఠీ' అనుసూత్రముచే సమాసము, విభక్తిలోపము. దన్త + రాజన్. ఇట ప్రథమానిర్దిష్టము షష్ఠ్యంతము కావున షష్ఠ్యంతపదమగు 'దన్త' అనునది పూర్వమున నుండుట 'ఉపసర్జనం పూర్వమ్' అనుసూత్రముచే తెలుపఁబడినది. అది యీ సూత్రముచే ఉత్తరపదమగును. రాజన్ + దన్త, నలోపః ప్రాతిపదికాన్తస్యేత్యాది సూత్రముచే నకారలోపము. రాజదన్త + సు = రాజదన్తః. ఇది షష్ఠీ తత్పురుషము.

రాజదన్తాదిగణము : రాజదన్తః అగ్రేవణమ్ లిప్తవాసితమ్ నగ్నముషితమ్ సిక్తసంమృష్టమ్ మృష్టలుఞ్చితమ్ అవక్లిన్నపక్వమ్ అర్పితోప్తమ్ ఉప్తగాఢమ్ ఉలూఖలముసలమ్ తణ్డులకిణ్వమ్ దృషదుపలమ్ ఆరద్వాయని (ఆరగ్వాయనబన్ధకీ) చిత్రరథ బాహ్లీకమ్ అవన్త్యశ్మకమ్ శూద్రార్యమ్ స్నాతకరాజానౌ విష్వక్సేనార్జునౌ అక్షిభ్రువమ్ దారగవమ్ శబ్దార్థౌ ధర్మార్థౌ కామార్థౌ అర్థశబ్దౌ అర్థధర్మౌ అర్థకామౌ వైకారిమతమ్ గాజవాజమ్ (గోజవాజమ్) గోపాలిధానపూలాసమ్ (గోపాలధానీపూలాసమ్) పూలాసకారణ్డమ్ (పూలాసకకురణ్డమ్) స్థూలాసమ్ (స్థూలపూలాసమ్) ఉశీరబీజమ్ [జిజ్ఞాసి] సిఞ్జాస్థమ్ (సిఞ్జాశ్వత్థమ్) చిత్రాస్వాతీ(చిత్రస్వాతీ) భార్యాపతీ దమ్పతీ దమ్పతీ జాయాపతీ పుత్రపతీ పుత్రపశూ కేశశ్మశ్రూ శిరోబీజా (శిరోబీజమ్) శిరోజాను సర్పిర్మధునీ మధుసర్పిషీ [ఆదన్తౌ] అన్తాదీ గుణవృద్ధీ వృద్ధిగుణౌ- ఇతిరాజదన్తాదయః.

ఈగణమునం దనేకములు ద్వంద్వములుండుటచే నీ సూత్ర మిచట చెప్పఁ బడినది.

అవ॥ పై గణములోని కొన్నిటియందు పూర్వోత్తరపదములకు నియమము లేదని యీ క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా॥ ధర్మాదిష్వనియమః 1418.

వృ॥ అర్థధర్మౌ, ధర్మార్థౌ ఇత్యాది.

ప. వి : ధర్మాది షు (7-3) అనియమః (1-1).

అర్థ : ధర్మాదులయందు పూర్వోత్తరపదములనియమములేదు. ఉదా : ధర్మార్థౌ, అర్థధర్మౌ ఇత్యాదులు.

వివ : సమాసములలో (ముఖ్యముగాద్వంద్వమున)ధర్మమున్నగుశబ్దములలో నేదైన పూర్వపదముగా నుండవచ్చును. ఉదా : ధర్మశ్చ, అర్థశ్చ, ధర్మ + సు, అర్థ + సు, సమాసము (చార్థేద్వన్ద్వః) విభక్తిలోపము ధర్మార్థ, ఇందేపదమైనను పూర్వపదము కావచ్చును. ధర్మార్థ + ఔ ధర్మార్థౌ, అర్థధర్మ + ఔ = అర్థధర్మౌ.

ఇట్టివి పై రాజదంతాదిగణములో చూపఁబడినవి. ఉదా : కామార్థౌ, అర్థకామౌ, గుణవృద్ధీ, వృద్ధిగుణౌ ము॥వి.

సూ : ద్వన్ద్వే ఘి 2-2 32.

వృ : పూర్వంస్యాత్ హరిహరౌ.

ప. వి : ద్వన్ద్వే (7-1) ఘి (1-1).

అను : పూర్వమ్ (1-1).

అర్థ : ద్వంద్వసమాసమున ఘిసంజ్ఞము పూర్వపద మగును. ఉదా : హరిహరౌ.

వివ : 'ఘి' అనునదియొక సంజ్ఞ. శేషోఘ్యసఖి - (నదీసంజ్ఞలేని ఇకారాంత ఉకారాంతశబ్దములకు 'ఘి' అనిపేరు. సఖిశబ్దమునకు ఘి సంజ్ఞలేదు.) అను సూత్రముచే 'ఘి' సంజ్ఞ తెలుపఁబడినది. ద్వంద్వసమాసములోని పదములలో 'ఘి' సంజ్ఞ కలది యున్నయెడల నది పూర్వపదమగును.

ఉదా : హరిశ్చ హరశ్చ హరియును హరుఁడును, హరి + సు, హర + సు చార్థేద్వన్ద్వః, సమాసము, విభక్తిలోపము హరిహర-ఇందు 'హరి'శబ్దము ఘి సంజ్ఞ

కము గాన నదిపూర్వమున నుండవలయును. హరిహర + ఔ = హరిహరౌ.

సూ : అజాద్యదన్త్యమ్ 2-2-33.

వృ : ఈశకృష్ణౌ.

ప. వి : అజాద్యదన్తమ్ (1-

అను : ద్వంద్వే (7-1) పూర్వమ్ (1-1).

అర్థ : ద్వంద్వసమాసమున అజాదియై అదంతమైనపదము పూర్వమున నుండవలయును. ఉదా : ఈశ కృష్ణౌ.

వివ : అదివర్ణము అచ్చును, అంతవర్ణము హ్రస్వఅకారమును అయినపదము ద్వంద్వములో నున్నయెడల నదిపూర్వపదమగును.

ఉదా : ఈశశ్చ కృష్ణశ్చ, ఈశ + సు, కృష్ణ + సు, సమాసము, విభక్తిలోపము ఈశ + కృష్ణ ఇందు అజాదియు నదంతమునైనశబ్దము 'ఈశ' అనునది. అదియే పూర్వముననుండును. ఈశకృష్ణ + ఔ = ఈశకృష్ణౌ. (కృష్ణేశౌ కాదు).

సూ : అల్పాచ్తరమ్ 2-2-34.

వృ : శివకేశవౌ.

ప. వి : అల్పాచ్తరమ్ (1-1).

అను : ద్వన్ద్వే (7-1) పూర్వమ్ (1-1).

అర్థ : ద్వంద్వమున రెంటిలో తక్కువ అచ్చులు గలది పూర్వపదమగును. ఉదా : శివకేశవౌ.

వివ 'అల్పాచ్చు' అనగా తక్కువ అచ్చులుగలది. 'తరప్' ప్రత్యయము రెంటిలో ఒకదానియొక్క ఆధిక్యమును తెలియఁబఱచును. కావున ద్వంద్వములో నున్న రెంటిలో తక్కువ అచ్చులుగలపదము పూర్వమున నుండవలయు ననునర్థము సిద్ధించినది.

ఉదా : శివశ్చ, కేశవశ్చ - శివుఁడును, కేశవుఁడును. శివ + సు, కేశవ + సు, ద్వన్ద్వసమాసము, విభక్తిలోపము శివ, కేశవ. ఇందు 'శివ' అనుదానిలో రెండచ్చులు గలవు. కేశవ అనుదానిలో మూఁడు అచ్చులుగలవు. కావున సామ్యమును బట్టి శివశబ్దము అల్పాచ్తరము. అదియే పూర్వపదమగును. శివకేశవ + ఔ = శివకేశవౌ.

ఇట్లు ద్వంద్వసమాసమున నెట్టిపదములు పూర్వమున నుండవలయునో వివరింపఁబడినది.

అవ : ఇచట నొక ఏకశేషము చెప్పఁబడుచున్నది.

సూ : పితామాత్రా 1-2-70.

వృ : మాత్రాసహోక్తౌ పితా వా శిష్యతే. పితరౌ, మాతాపితరౌ.

ప. వి : పితా (1-1) మాత్రా (3-1).

అను : ఏకశేషః (1-1) అన్యతరస్యామ్ (అవ్య)

అర్థ : మాతృశబ్దముతో కలిపిచెప్పఁబడునపుడు పితృశబ్దము వైకల్పికముగా శేషించును. ఉదా : పితరౌ, మాతాపితరౌ.

వివ : రెండుపదములలో ఒకటియే మిగిలి రెంటియర్థమును జెప్పువిధానముగల దానిని ఏకశేషవృత్తి యందురు. అయిదువిధములయిన వృత్తులలో నిదియొకటి అట్టిది యొకటి యీ సూత్రమున చెప్పఁబడుచున్నది. మాతృశబ్దముతోఁగూడిన పితృశబ్దము శేషించును అనగా మాతృశబ్దములేకపోయినను ఆయర్థమునుగూడ శేషించిన పితృ శబ్దమే చెప్పునని తాత్పర్యము. ఈ కార్యమిట వైకల్పికము.

ఉదా : మాతా చ పితాచ, మాతృ + సు, పితృ + సు, చార్థేద్వన్ద్వః అను సూత్రముచే సమాసమగును. మాతృశబ్దము లోపించును. పితృ, ఇపుడిది ఉభయ వాచకము గావున ద్వివచనప్రత్యయము చేరును. పితృ + ఔ = పితరౌ-ఇట్టితావులందు శేషించినశబ్దమే లోపించుదానియర్థమునుకూడ బోధించును. ఇది వైకల్పికము కావున కానిచో 'మాతృ + పితృ' అనియుండ 'ఆనఙ్ఋతోద్వన్ద్వే' 6-3-25, (విద్యాసంబంధమును లేక యోనిసంబంధమును దెలుపు ఋకారాంతపదములు ద్వంద్వమునందు ఉత్తరపదము పరమగునపుడు ఆనఙాదేశము వచ్చును) అనుసూత్రముచే మాతృశబ్దమునకు ఆనఙాదేశము రాఁగా (ఙి త్తగుటచే ఙిచ్చ అనుసూత్రముచే అంత్యాక్షరమునకు వచ్చును) మాతాన్ పితృఅగును. ('ఆనఙ్' అనుదానిలో ఙకార మిత్తు. అకారముచ్చారణార్థము. 'ఆన్ అనునది ఆదేశస్వరూపము) నకారము 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అనుసూత్రముచే లోపించును. మాతాపితృ+ఔ = మాతాపితరౌ. ఇందు పూజనీయవ్యక్తిని తెలుపుపదము ద్వంద్వమునఁ బూర్వపద మగునని తెలుపు 'అభ్యర్హితంచ' అనుసూత్రముచే 'మాతృ' శబ్దమునకు పూర్వ ప్రయోగము. తల్లి తండ్రికంటె మిక్కిలి పూజ్యురాలని స్మృతికథితము.

అవ : ద్వంద్వమున వచన విశేషమున నొకదాని నీ క్రిందిసూత్రము చెప్పు చున్నది.

సూ : ద్వన్ద్వశ్చ ప్రాణి తూర్యసేనాఙ్గానామ్ 2-4-2.

వృ : ఏషాం ద్వన్ద్వ ఏకవత్. పాణిపాదమ్, మార్దఙ్గిక పాణవికమ్, రథికాశ్వారోహమ్.

ప. వి : ద్వన్ద్వః (1-1) చ (అవ్య) ప్రాణి....నామ్ (6-3).

అను ; ఏకవచనమ్ (1-1).

అర్థ : ప్రాణులయొక్కయు, తూర్యములయొక్కయు, సేనలయొక్కయు, అంగములకు సంబంధించిన ద్వంద్వము ఏకవచనమగును. ఉదా : పాణిపాదమ్, మార్దఙ్గికపాణవికమ్, రథికాశ్వారోహమ్.

వివ : ప్రాణులయొక్క అంగములనగా చేతులు, కాళ్ళు మున్నగునవి. తూర్యములనగా వాద్యవిశేషములు. ఇచట తూర్యశబ్దముచే వాద్యవిశేషముల యందు నేర్పుగలవారిని చెప్పుపదములు గ్రహింపఁబడినవి, సేనయొక్క అంగములనగా రథికులు, అశ్వికులు మున్నగునవి దీనికి అనుబంధముగా సమాహార గ్రహణం కర్తవ్యమ్' అనునది యిట గ్రహింపఁబడుటచే సమాహారార్థము గల ప్రాణ్యంగములయు, తూర్యాంగములయు, సేనాంగములయు ద్వంద్వము ఏకవచనమగును అనునర్థము సిద్ధించును. ఏకవచనమనగా ఏకమును (ఒకటిని) చెప్పునది. అనగా నిట్టి సమాసరూప ప్రాతిపదికములకు ఏకవచన ప్రత్యయమే చేరునని భావము. 'స నపుంసకమ్' అనుసూత్రముచే నివి నపుంసకలింగములు న గును.

ఉదా : పాణీ చ పాదౌచ, తేషాం సమాహారః_కాళ్ళయు చేతులయు సమూహము, పాణి + ఔ, పాద + ఔ, చార్థే ద్వన్ద్వః_సమాసము, విభక్తిలోపము పాణి పాద + సు=పాణిపాదమ్ (నపుం) ఇది ప్రాణ్యంగముల ద్వంద్వము).

మార్దఙ్గికాశ్చ, పాణవికాశ్చ, ఏతేషాం సమాహారః_మద్దెలవాయించువారి యొక్కయు, పణవము మ్రోగించువారియొక్కయు సమూహము. మార్దఙ్గిక + జస్ పాణవిక+జస్, సమాసము చార్థేద్వన్ద్వః, విభక్తిలోపము, మార్దఙ్గిక పాణవిక + సు=మార్దఙ్గిక పాణవికమ్ (తూర్యాంగముల ద్వంద్వము.)

రథికాశ్చ అశ్వారోహాశ్చ-ఏతేషాం సమాహారః, రథిక + జస్, అశ్వారోహ + జస్, సమాసము, విభక్తిలోపము రథిక + అశ్వారోహ, సంధి, రథికాశ్వారోహ + సు=రథికాశ్వారోహమ్.

ఈమూఁడుదాహరణములయందును ఏకవద్భావము, నపుంసకత్వమువచ్చినవి

అవ: కొన్నిద్వంద్వములకు సంబంధించిన సమాసాంతప్రత్యయము నీక్రింది సూత్రము విధించుచున్నది.

సూ : ద్వన్ద్వాచ్చుదషహాన్తాత్సమాహారే 5-4-109.

వృ : చవర్గాన్తాద్దషహాన్తాచ్చ ద్వన్ద్వా ట్టచ్స్యాత్; సమాహారే. వాక్త్వచమ్, త్వక్స్రజమ్, శమీదృషదమ్, ఛత్రోపానహమ్, సమాహారేకిమ్? ప్రావృట్శరదౌ.

ప. వి : ద్వన్ద్వాత్ (5-1) చుదషహాన్తాత్ (5-1) సమాహారే (7-1).

అను : సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3)టచ్(1-1) ప్రత్యయః (1-1)

అర్థ : చవర్గము, ద, ష, హ-ఇవి యంతమునఁగల ద్వంద్వమునకు అంతమున 'టచ్' అను తద్ధితప్రత్యయము చేరును. ఉదా : వాక్త్వచమ్ మొ॥వి. సమాహారే అనుటవలన 'ప్రావృట్శరదౌ' అనునెడ నీ ప్రత్యయము రాదు.

వివ : 'చు' అనునది ఉదిత్తు కావున తన సవర్ణములను గ్రహించును. (చ ఛ జ ఝ ఞ లు) (అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః) చ వర్గము, దకారము, షకారము, హకారము అనునవి అంతమునఁగల ద్వంద్వసమాసమునకు అంతమున 'టచ్' అను తద్ధితప్రత్యయము చేరును. ఇందు టకారచకారములు ఇత్తులు. ప్రత్యయము 'అ' అనునది. ఈకార్యము సమాహారద్వంద్వమునకే యగును.

ఉదా : వాక్ చ త్వక్ చ, అనయోస్సమాహారః (మాట, చర్మము అనువాని సమాహారము) వాచ్ + సు, త్వచ్ + సు, చార్థేద్వన్ద్వః-సమాసము, విభక్తిలోపము వాచ్, త్వచ్, ఇది చ వర్ణాంత ద్వంద్వము, 'వాచ్'యొక్క-చకారమునకు చోఃకుః అనుసూత్రముచేకుత్వము వచ్చును) వాక్త్వచ్ + టచ్, వాక్త్వచ్ + అ = వాక్త్వచ, ఇది సమాహారద్వంద్వము కావున ఏకవద్భావము, నపుంసకత్వమును కాఁగా వాక్త్వచ + సు = వాక్త్వచమ్.

ఇట్లే త్వక్ చస్రక్చ అనయోస్సమాహారః చర్మము, మాల అనువాని సమాహారము. త్వచ్ + సు, స్రజ్ + సు, త్వక్ స్రజ్ + టచ్, త్వక్స్రజ్ + అ = త్వక్స్రజ + సు = త్వక్స్రజమ్ (ఏకవద్భావము, నపుంసకత్వము). ఇవి చవర్గాంత ద్వంద్వములు.

శమీచ దృషచ్చ అనయోస్సమాహారః, శమీవృక్షము తాయి అనువాని సమాహము, శమీ + సు, దృషద్ + సు, శమీదృషద్, ఇది దకారాంతద్వంద్వము, శమీ దృషద్ + టచ్, శమీదృషద్ + అ = శమీదృషద + సు = శమీదృషదమ్.

వాక్ చ త్విట్ చ అనయోః సమాహారః వాక్కు-కాంతి అనువాని సమాహారము, వాచ్ + సు, త్విష్ + సు, సమాసము, విభక్తిలోపము 'వాచ్' లోని చకారమునకు కుత్వము (చోఃకుః) 'వాక్త్విష్'-ఇది షకారాంతద్వంద్వము. వాక్త్విష్ + టచ్, వాక్త్విష్ + అ = వాక్త్విష + సు = వాక్త్విషమ్.

ఛత్రంచ ఉపానత్ చ అనయోః సమాహారః గొడుగు చెప్పులు అనువాని సమాహారము ఛత్ర+సు, ఉపానహ్ + సు, సమాసము, విభక్తిలోపము గుణసంధి ఛత్రోపానహ్, ఇదిహకారాంతద్వంద్వము, ఛత్రోపానహ్ + టచ్ ఛత్రోపానహ్ + అ = ఛత్రోపానహ + సు = ఛత్రోపానహమ్.

ఈ ప్రత్యయయోగముచే పై హలంత ప్రాతిపదికము లన్నియు నజంతములైనవి.

సమాహారార్థముననే యనుటవలన ఇతరేతరయోగమున నేర్పడిన చుదషహాన్తద్వంద్వమునకు టచ్ ప్రత్యయము రాదు ఉదా : ప్రావృట్, చ శరచ్చ - వర్షకాలమును, శరత్కాలమును. ప్రావృష్+సు, శరద్ + సు సమాసము, (చార్థేద్వన్ద్వః) విభక్తిలోపము షకారమునకు జశ్త్వము చర్త్వము (ఝలాంజశోఽన్తే, ఖరిచ) ప్రావృట్శరద్ + ఔ = ప్రావృట్శరదౌ (సమాహారమై టచ్ ప్రత్యయము చేరినచో 'ప్రావృట్శరదమ్' అని కావలసియుండును.)

## ఇది ద్వంద్వసమాస ప్రకరణము

## ప్రకరణావలోకనము.

ఇందు ద్వంద్వసమాసమును విధించుసూత్రము 'చార్థేద్వన్ద్వః' అనునది. రాజదన్తాదిషుపరమ్, ధర్మాదిష్వనియమః, ద్వన్ద్వేఘి, అజాద్యదన్తమ్, అల్పాచ్తరమ్ అనునవి సమాసమున పూర్వోత్తరపదములను నిర్ణయించునవి. 'పితామాత్రా' అనుసూత్రము పితృశబ్దము ద్వంద్వమున శేషించుటను జెప్పును. 'ద్వన్ద్వశ్చప్రాణితూర్యసేనాఙ్గానామ్' అనునది వచనమునకు సంబంధించినది. తుదిసూత్రము సమాసాంత ప్రత్యయమును విధించును. ఈ సమాసమున ప్రాయికముగా ఉభయపదముల అర్థములకును ప్రాధాన్యముండును. సమాహారద్వంద్వమున సమాహారము ప్రధానము.

# అథ సమాసాంత ప్రకరణమ్.

అవ : అవ్యయీభావాది ప్రకరణములలో నా విశేషసంజ్ఞగల సమాసములకు మాత్రమే చేరు సమాసాంతప్రత్యయములు చెప్పఁబడినవి. ఈ ప్రకరణమున సాధారణముగా అన్నివిధములైన సమాసములకు నాయాసందర్భములలో రాఁగల సమాసాంతప్రత్యయములు చెప్పఁబడుచున్నవి.

సూ : ఋక్పూరబ్ధూః పథామానక్షే 5 4-74.

వృ : అ అనక్ష ఇతిచ్ఛేదః. ఋగాద్యన్తస్య సమాసస్య అప్రత్యయోఽన్తావయవః, అక్షేయా ధూస్తదన్తస్య న అర్ధర్చః, విష్ణుపురమ్, విమలాపం సరః, రాజధురా. అక్షేతు అక్షధూః. దృఢధూరక్షః, సఖిపథః, రమ్యపథో దేశః.

ప. వి : ఋక్పూరబ్ధూఃపథామ్ (6-3 )అ. (విభక్తిలోపించినపదము)అనక్షే (7-1).

అను : సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3) ప్రత్యయాః (1-1).

అర్థ : అ అనక్షే అని పదవిభాగము 'ఋక్' మున్నగుపదము లంతమునఁగల సమాసమునకు అంతావయవముగా 'అ' అను తద్ధితప్రత్యయమువచ్చును. అక్షమను నర్థమున ధూశ్శబ్దాంతసమాసమున కీప్రత్యయమురాదు. ఉదా : అర్ధర్చః, విష్ణుపురమ్, విమలావం సరః. రాజధురా అక్షార్థమున మాత్రము అక్షధూః, దృఢధూరక్షః. సఖిపథః, రమ్యపథో దేశః.

వివ : ఋచ్, పుర్, అప్, ధూర్, పథిన్ అనునీహలంతశబ్దము లంతమునఁగల సమాసమునకు 'అ' అనుతద్ధితప్రత్యయము అంతావయవముగా చేరును. సూత్రమునందలి అనక్షేఅనుశబ్దము యోగ్యత ననుసరించి ధూశ్శబ్దమునకు మాత్రమే సంబంధించును అక్షము=బండియొక్క ఇరుసు అనునర్థమున వర్తించు 'ధుర్' శబ్దము అంతమునఁగల సమాసమునకు ఈ ప్రత్యయము రాదు. ఇతరార్థమున వచ్చును. ఈ ప్రత్యయము ఈ శబ్దములంతమునఁ గలఏసమాసమునకైనను రావచ్చును.

ఉదా : అర్ధర్చః - ఋచః అర్ధమ్ - ఋక్కుయొక్కసగము, అర్ధ + సు, ఋక్ + ఙస్, అర్ధంనపుంసకమ్ - సమాసము, విభక్తిలోపము,గుణసంధి, అర్ధర్చ్, ప్రకృతసూత్రముచే 'అ' ప్రత్యయము అర్ధర్చ్+అ = అర్ధర్చ+సు + అర్ధర్చః (అర్ధర్చాః పుంసిచ).

విష్ణుపురమ్ : విష్ణోఃపూః, విష్ణువుయొక్క-పురము, విష్ణు+జస్, పుర్ + సు షష్ఠీ - సమాసము, విష్ణుపుర్+అ=విష్ణుపుర + సు=విష్ణుపురమ్. 'పుర్' శబ్దము స్త్రీ లింగము. పరవల్లింగనియమముచే ఈ సమాసము స్త్రీలింగము కావలసియున్నది. కాని లోకవ్యవహారమునుబట్టి నపుంసకమైనది. 'పుర' అనునపుంసకలింగశబ్దమొకటి గలదు. దానితో సమాసముచేయగా విష్ణుపురమ్వంటి రూపము లేర్పడును. అట్టి యెడ నీ సూత్రమున 'పుర్' శబ్దమును గ్రహింపనేల ? అను శంక కలుగును. అదిలేనియెడల 'పుర్' శబ్దముతో సమాసమైనపుడు 'విష్ణుపూః' వంటి అనిష్ట రూపములు ప్రాప్తమగును. అవి యిందలి 'పుర్' శబ్దగ్రహణముచే వారింపఁబడి నవి. (ఈ రెండును తత్పురుషములు).

విమలాపంసరః : విమలాః అపః యస్మిన్ తత్ - స్వచ్ఛమైన నీరుగలది. విమలా + జస్, అప్+జస్, అనేకమన్యపదార్థే, సమాసము, విభక్తిలోపము విమలా + అప్, స్త్రియాః పుంవత్ సూత్రముచే విమలాశబ్దమునకు పుంవద్భావము, విమల + అప్, సవర్ణదీర్ఘసంధి, విమలాప్, దీనికి ప్రకృతసూత్ర ముచే అప్రత్యయము విమలాప+సు=విమలాపమ్ (సరః అను నపుంసకలింగశబ్దము నకు విశేషణము కావున నపుంసకమైనది). (ఇదిబహువ్రీహి.)

రాజధురా రాజ్ఞః ధూః - రాజుయొక్క-భారము, రాజన్+జస్, ధుర్ + సు, షష్ఠీ సమాసము, విభక్తిలోపము, నలోపః ప్రాతిపదికాన్తస్య నకారలోపము, రాజ ధుర్, అప్రత్యయము రాజధుర్+అ=రాజధుర, ధుర్‌శబ్దము స్త్రీలింగముః 'పరవల్లిఙ్గ ద్వంద్వతత్పురుషయోః అను సూత్రముచే ఈ సమాసము స్త్రీలింగమగును. స్త్రీత్వ మున దీనికి 'అజాద్యత ష్టాప్' అనుసూత్రముచే టాప్ ప్రత్యయము చేరగా 'రాజ ధురా' అగును. రాజధురా+సు=రాజధురా (తత్పురుషము).

అక్షము (బండి ఇరుసు) అనునర్థము గల 'ధుర్'శబ్దమున కే ప్రత్యయము రాదు. అక్షస్యధూః, అక్ష + జస్, ధుర్ + సు, షష్ఠీసమాసము, అక్ష ధుర్, ఇచట ఈ ప్రత్యయమురాదు. అక్షధుర్ + సు = అక్షధూః (తత్పు రుషము).

దీనికే మఱియొక ఉదాహరణము - దృఢా, ధూః యస్యసః, గట్టి ఇరుసు గలది. దృఢా + సు, ధుర్ + సు, అనేకమన్య పదార్థే అనుసూత్రముచే సమా సము, దృఢాశబ్దమునకు పుంవద్భావము, దృఢధుర్+సు=దృఢధూః - ఇచటను అక్షార్థమున వర్తమానమగు ధుర్‌శబ్దమునకు అప్రత్యయము రాలేదు. (ఇది బహువ్రీహి).

సఖిపథః - సఖ్యుఃపన్థాః (మిత్రునిమార్గము), సఖి + ఙస్, పథిన్ + సు షష్ఠీ అనుసూత్రముచే సమాసము, విభక్తిలోపము సఖిపథిన్, ప్రకృతసూత్రముచే అప్రత్యయము, సఖిపథిన్+అ, 'నస్తద్ధితే' అనుసూత్రముచే టిలోపము, సఖిపథ్ +అ=సఖిపథ + సు=సఖిపథః. (తత్పురుషము).

పథిశబ్దమునకే బహువ్రీహ్యుదాహరణము చూపబడుచున్నది. రమ్యపథో దేశః. రమ్యాః పన్థానః యస్మిన్ సః, రమ్యములగు బాటలు గలది. రమ్య + జస్, పథిన్ + జస్, అనేకమన్యపదార్థే, రమ్యపథిన్ + అ, టిలోపము రమ్య పథ్ + అ = రమ్యపథ + సు = రమ్యపథః.

సూ : అక్ష్ణోఽదర్శనాత్ 5-4-76.

వృ : అచక్షుః పర్యాయాదక్ష్ణోఽచ్ స్యాత్. గవామక్షీవ, గవాక్షః.

వ వి : అక్ష్ణః (5-1) అదర్శనాత్ (5-1).

అను : అచ్ (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3) ప్రత్యయః (1-1).

అర్థ : నేత్రపర్యాయముకాని అక్షిశబ్దమునకు సమాసాంతముగా 'అచ్' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఉదా : గవామక్షీవ గవాక్షః.

వ్య : ఈః సూత్రమున దర్శనశబ్దమునకు దేనితోదర్శింతుమో అది అని యర్థము. అనగా కన్ను అది కానిది అదర్శనము. కావున 'అదర్శనాత్ అక్ష్ణః' అనగా కన్ను అనుదానికి సమానార్థకము కాని'అక్షి'శబ్దమునకు అనునర్థము గలుగును. అట్టిది అంతమునఁ గల సమాసమునకు 'అచ్' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఇందు చకారమిత్తు.

ఉదా : గవామ్ అక్షి (ఇవ) గోవులకన్నువంటిది. అనగా ఆ ఆకారముగా నుండు కిటికీ. ఇచట అక్షిశబ్దము చూచునది అనునర్థము కలదికాదు. గో + ఆమ్, అక్షి+సు, సమాసము, విభక్తిలోపము, అవజాదేశము గవాక్షి+అ(చ్), యస్యేతిచ ఇకారలోపము గవాక్ష్ + అ=గవాక్ష + సు=గవాక్షః.

సూ : ఉపసర్గా దధ్వనః 5-4-85.

వృ : ప్రగతోఽధ్వానం ప్రాధ్వోరథః.

వ. వి : ఉపసర్గాత్ (5-1) అధ్వనః (5-1).

అను : అచ్ (1-1) ప్రత్యయః (1-1) సమాసాన్తాః (1-3) తద్ధితాః (1-3).

అర్థ : ఉపసర్గమునకు పరముగానున్న 'అధ్వన్' శబ్దమునకు 'అచ్' అను సమాసాంత తద్ధితప్రత్యయము చేరును. ఉదా : ప్రగతోఽధ్వానం ప్రాధ్వోరథః.

వివ : పూర్వపదము ఉపసర్గమును, ఉత్తరపదము అధ్వన్‌శబ్దమును అయిన సమాసమునకు 'అచ్' అను తద్ధితప్రత్యయము అంతావయవముగా చేరును.

ఉదా : ప్రగతః అధ్వానమ్ - బాటను కడచినది, ప్ర + అధ్వన్ + అమ్, అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా అను వార్తికముచే సమాసము, ప్ర + అధ్వన్, సంధి, ప్రాధ్వన్, ప్రకృతసూత్రముచే అచ్ ప్రత్యయము ప్రాధ్వన్ + అ(చ్), నస్తద్ధితే-టిలోపము = ప్రాధ్వ్ + అ=ప్రాధ్వ + సు=ప్రాధ్వః రథః (దారినికడచిన రథము).

సూ : న పూజనాత్ 5-4-69.

వృ : పూజనార్థాత్పరేభ్యః సమాసాన్తా నస్యుః, సురాజా, అతిరాజా.

ప. వి : న (అవ్య) పూజనాత్ (5-1).

అను : సమాసాన్తాః (1-3)

అర్థ : పూజనార్థశబ్దమునకు పరముగా నున్నశబ్దములకు సమాసాంత ప్రత్యయములు రావు. ఉదా : సురాజా, అతిరాజా.

వివ : పూర్వము విధింపఁబడిన సమాసాంతప్రత్యయము లన్నియు పూజనార్థకశబ్దములకు పరముగానున్న శబ్దములకు రావని యీ సూత్రము చెప్పుచున్నది. కాని యీ సూత్రమున కీ క్రిందివార్తికము అపవాదము.

వా॥ స్వతిభ్యామేవ (3346).

వృ॥ సురాజా, అతిరాజా.

ప. వి : స్వతిభ్యామ్ (5-2) ఏవ (అవ్య)

అర్థ ; పూజనార్థకములైన 'సు,' 'అతి' అనువానికి మాత్రమే పరముగా నున్న శబ్దములకు సమాసాంతప్రత్యయములు రావు. ఉ॥సురాజా, అతిరాజా.

వివ : సూత్రములోని 'పూజనాత్' అనుశబ్దము కీవార్తికము పరిమితి చెప్పఁబడుచున్నది, పూజనార్థకములైన సు, అతి అనునవి పూర్వపదములుగా

మన్న సమాసములకే యా యా విధింపఁబడిన ప్రత్యయములు రావు అని వార్తిక భావము.

ఉదా : శోభనోరాజా మంచిరాజు సు, రాజన్ + సు, కుగతిప్రాదయః అను సూత్రముచే సమాసము, 'సురాజన్' దీనికి 'రాజాహస్సఖిభ్యష్టచ్' అను సూత్రముచే ప్రాప్తమగు 'టచ్' అనుసమాసాంతప్రత్యయ మిట నిషేధింపఁబడినది. సురాజన్+సు=సురాజా.

పూజ్యోరాజా-పూజ్యుఁడగురాజు, పూజ్యుఁడు అనునర్థముగల 'అతి' అను నది రాజన్ శబ్దముతో కుగతిప్రాదయః అనుసూత్రముచే సమసించును. అతి, రాజన్ + సు, అతిరాజన్ + సు = అతిరాజా, ఇచటను టచ్ ప్రత్యయము రాలేదు.

ఇది సమాసాంత ప్రకరణము.

## ప్రకరణావలోకనము.

ఈ ప్రకరణమున సమాసములకు సాధారణముగా రాఁదగిన కొన్ని సమాసాంత తద్ధితప్రత్యయములు విధింపఁబడినవి. అవ్యయీభావాదులకు ప్రత్యేకముగా వచ్చు ప్రత్యయము లాయాప్రకరణములందే చెప్పఁబడినవి. ఇవి, పేర్కొనఁబడిన ఋగాదిశబ్దములంతమునఁగల ఏ సమాసమునకైనను రానగును. ఇందు అ, అచ్ అను ప్రత్యయములు చెప్పఁబడినవి. 'నపూజనాత్' అనునిషేధసూత్రమొకటి చెప్పఁబడినది

## సమాసప్రక్రియ–సాధారణ విషయములు.

సమాసప్రక్రియలో సాధారణముగ పరిశీలింపవలసిన అంశముల నిట క్రోడీకరించుకొందము. ఏపదములకు సమాసమునువిధించుకొనఁదలఁతుమో యవి ఏకార్థీభావరూపసామర్థ్యము గలవియైయుండవలయును. కావున నేరెండుపదములకైనను సమాసము చేయవచ్చునని తలపరాదు. సాధారణముగా అవ్యయీభావతత్పురుషాది విశేషసంజ్ఞలు అర్థప్రాధాన్యమునుబట్టి నిర్ణయింపవచ్చును గాని యిది సార్వత్రికము కాదు. అష్టాధ్యాయిసూత్రపాదములో అవ్యయీభావః మున్నగు నధికారములలో చెప్పఁబడినవానికి ఆయావిశేషసంజ్ఞలు కలుగును. కేవల అర్థప్రాధాన్యమునుబట్టి 'అతిమాలః' మున్నగువానిని బహువ్రీహ్యాదులుగా భావింపరాదు.

ప్రక్రియలో లౌకిక విగ్రహమును ముందు పరిశీలింపవలయును. దానినిబట్టి అలౌకిక విగ్రహము నిర్ణీతమగును. తరువాత సమాసవిధాయక సూత్రమేదో చూడవలయును. ఉపసర్జనసంజ్ఞనుబట్టి. లేక వేర్వేఱు విధానములనుబట్టియు పూర్వపదనిర్ణయము చేసికొనవలయును. విభక్తులకు లోపము చేయవలయును. విభక్తి లోపమున కపవాదములేవైన కలవేమో యరయవలయును. తరువాత ఈ దశలో సమాసాంత ప్రత్యయముల విధానము కలదేమో చూచుకొని తత్కార్యము ననుసంధింపవలయును. సంధికార్యాదులు యథాసంభవముగ నిర్వహింపవలయును.

సమాసరూప ప్రాతిపదికము ఏ లింగమో చూడవలయును. అట్లే వచనమును కూడ పరికింపవలయును. తదనుగుణమైన స్త్రీప్రత్యయాది విధాన మవసరమైనచో చేసికొని పిదప విభక్తి ప్రత్యయములు చేర్పవలయును. ఇట్లే ప్రక్రియలో ఈ క్రమమును పాటించి రూపసాధనము నెఱుగనగును.

# సూత్రసూచి



# లఘుకౌముది మార్గదర్శిని.

ద్వితీయ భాగము

ఆనందవల్లీ గ్రంథమాల
శ్రీ వేంకటేశ్వరపురం - అనంతపురం.

శ్రీమద్వరదరాజకృత

మార్గదర్శినీ నామకాంధ్రవ్యాఖ్యా సముపేత.

# లఘు సిద్ధాంత కౌముది

## ద్వితీయ భాగము



వ్యాఖ్యాత :

భాషాప్రవీణ : డా॥ శలాక రఘునాథశర్మ ఎం ఏ, పిహెచ్.డి,

రీడరు, తెలుగుశాఖ - స్నాతకోత్తర విద్యాకేంద్రము, అనంతపురం.

ప్రథమ ముద్రణ
ప్రతులు వేయి :
ఫిబ్రవరి 1981.


మూల్యము : పది రూపాయలు.

ప్రతులకు :
శ్రీమతి శలాక రాజేశ్వరి,
B-4 పి. టి. సెంటర్ క్వార్టర్స్
శ్రీ వేంకటేశ్వరపురం (P. O.)
అనంతపురం - 515 003.



# అక్షరాంజలి



కలియుగదైవము శ్రీ అలమేలుమంగాంబా సహిత శ్రీనివాసస్వామి కృపా వీక్షణము ఈ గ్రంథప్రకాశమునకు నిదానము.

'రచయితలకు ఆర్థిక సాహాయ్యము' అను పథకములో తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ గ్రంథ ముద్రణమునకు రు 4480/- లు విరాళముగా నొసంగియున్నారు. స్వామిధనమును సత్కార్యములకు సదుద్దేశములో వినియోగించుచున్న దేవాలయ ధర్మకర్తృ సంఘ సభ్యులకు, ముఖ్యముగా కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, I. A. S. గారికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

మరియు నీ విషయమున తగువిధముగా తోడ్పడిన 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కె. సుబ్బారావు M. A., గారికి నమస్సులు.

# సౌజన్య సంభావనము

పరబ్రహ్మస్వరూపులైన గురువర్యులు కీ॥ శే॥ బ్రహ్మశ్రీ పేరిలంక వేంకటేశ్వర శాస్త్రిగారికి, బ్రహ్మశ్రీ రామచంద్రులకోటేశ్వరశర్మగారికి, డా॥ దివాకర్ల వేంకటావధానిగారికి, కీ॥ శే॥ డా॥ పాటిబండ మాధవశర్మగారికిని—

అధ్యయన కాలమున అయిదేండ్లు వాత్సల్యరసమును కురిపించిన కీ॥ శే॥ బ్రహ్మశ్రీ గరికపాటి పట్టాభిరామశాస్త్రిగారికిని, రామమూర్తిగారికిని, స్వర్లోకవాసిని సుబ్బమ్మగారికిని, గురుపత్ని శ్రీమతి వరలక్ష్మమ్మగారికిని—

నిరంతరము ప్రేమాదరముల ననుగ్రహించు శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్ర గురువర్యులకును—

గ్రంథముద్రణమునకు యథాశక్తి ఆర్థికసాహాయ్యము నందించిన కుమారి సంధ్యావందనం గోదావరీబాయి M. A., బ్రహ్మశ్రీ గణపవరపు వేంకటసాంబమూర్తి శాస్త్రి, పూజ్యశ్రీ జూటూరు రమణయ్య, పూజ్యశ్రీ శతావధాని సి. వి. సుబ్బన్న, చిరంజీవి సి సత్యనారాయణ. M. A., గార్లకును—

గ్రంథముద్రణమున కవసరమగు ధనమును రు 10,000 లను ఋణరూపమున అందించిన ఆంధ్రబ్యాంకువారికి, ముఖ్యముగా సి టి సెంటరు బ్రాంచిమేనేజరు శ్రీ సులేమాన్ బాషా M. Com., గారికిని, వారి ఉద్యోగిబృందమునకు—

ఈ సర్వకార్యమును స్వకార్యముగా నిర్వహించిన మా అక్కబావలు లక్ష్మీ సౌభాగ్యవతి ఆంజనేయశాస్త్రి దంపతులకు

అతిస్వల్పకాలములో గ్రంథమును సుందరముగా నిర్దుష్టముగా ముద్రించి యిచ్చిన వెరైటీ ప్రెస్ అధిపతి శ్రీ దుగ్గిరాలసూర్యప్రకాశరావుగారికి, ప్రెస్ కార్మికులు, శ్రీ గొరిపర్తి వీరాస్వామి, శ్రీ పప్పు కృష్ణ, శ్రీ గెద్దం వీరభద్రరావు శ్రీ పడాల నాగేశ్వరరావు గార్లకును—
కృతజ్ఞతాపూర్వక నమఃకుసుమాంజలి.

ఈ పనిలో నా కెంతయో సహకరించిన తమ్ముడు చి॥ నాగేంద్రశర్మకును, మేనల్లుడు చి॥ వేంకటనాగేంద్రకుమారునకును, చి॥ వెలిచేటి రాజేశ్వరరావు, దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారికుమారులు చి॥ వేంకటరామలక్ష్మీనారాయణరావు, చి॥ వేంకటేశ్వరరావులకు—శుభాశీస్సులు.

సారస్వత వ్యాసంగమున మునిగితేలు నాకు సంపూర్ణ సహకారమిచ్చి సంసార నిర్వహణభారమును సమర్థముగా వహించు నాయిల్లాలు చి॥ సౌ॥ రాజేశ్వరి సహన సౌజన్యములను గూర్చియే ఈ సందర్భమున ఏదో చెప్పవలయుననియే యున్నది.

రౌద్రిమాఘశుద్ధత్రయోదశి
18-2-1981 శ. ర. శ.
తెనాలి.



# అంకితము

అస్మద్గురు వర్యులు

కళాప్రపూర్ణ, వ్యాకరణస్థాపకేత్యాది బిరుదవిరాజితులు

కీర్తిశేషులు బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రి

శ్రీచరణులకు



# విషయసూచిక



ఇది మార్గదర్శినిలో రెండవభాగము. వ్యాఖ్యానములో ప్రథమ భాగమున అవలంబించిన పద్ధతులే యిందును అవలంబింపబడినవి. తద్ధితప్రత్యయములు స్త్రీప్రత్యయప్రకరణమును ఈ భాగమున వ్యాఖ్యాతములైనవి.

శ. ర. శ.

౬ ౫

# అథ తద్ధితాధికార ప్రకరణము.

అవ : ఐదు విధములుగా వృత్తులు కలవనియు నందు తద్ధితవృత్తి యొకటియనియు సమాసపరిచ్ఛేదమునం దెప్పబడినది ఙీ, ఆప్ అను స్వరూపము గల స్త్రీ ప్రత్యయాంతములకును, ప్రాతిపదికసంజ్ఞకలవానికిని అర్థవిశేషములలో చేరు ప్రత్యయములను తద్ధితములందురు అష్టాధ్యాయియందు 4-1-76 మొదలుకొని ఐదవ అధ్యాయము తుదివఱకు గల సూత్రములచే ఈ ప్రత్యయములు విధింపబడినవి. ఈ తద్ధితవిధానము సంస్కృతభాషలో అతివిశాలమైనది దీనిని దిఙ్మాత్రదర్శనముగ ఈ గ్రంథభాగమున తెలిసికొందము

ఈ తద్ధితప్రక్రియకు సాధారణమైన ఒకసూత్రము సమాసపరిచ్ఛేదమునం దెప్పబడినది 'తద్ధితేష్వచామాదేః' - ఞ కారముగాని ణ కారముగాని ఇత్తయిన తద్ధిత ప్రత్యయము పరమగునపుడు పూర్వమునందున్న శబ్దస్వరూపముయొక్క అచ్చులలో మొదటిదానికి వృద్ధివచ్చును ఈ సూత్రము విశేషమైన యెల్లభాగములందును అనుసంధించుకొనవలయును

ఇందు కొన్ని ప్రత్యయములు కేవల మొక్కొక్క అర్థమునందో లేక రెండు మూడర్థములందో విధింపబడును వానికి ప్రత్యేకముగా అపత్యాధికారము, చాతురర్థికము మున్నగువిశేషనామములతో ప్రకరణ విభాగము చేయబడినది దానికి ముందు సాధారణప్రత్యయములు కొన్ని చెప్పబడుచున్నవి

## సాధారణ ప్రత్యయ ప్రకరణమ్

సూ : సమర్థానాం ప్రథమాద్వా 4-1-82

వృ : ఇద మధిక్రియతే ప్రాగ్దిశ ఇతి యావత్.

ప వి : సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య)

అర్థ : ఇది ప్రాగ్దిశోవిభక్తిః అనుసూత్రమువఱకు అధికారము

వివ : సమర్థానామ్, ప్రథమాత్, వా అను మూడుపదములు గల ఈ సూత్రము అధికారరూపమున ప్రాగ్దిశోవిభక్తిః (5-3-1) అను అవధివఱకు గల సూత్రములలో ప్రవేశించి 'లక్ష్యసంస్కారము' చేయును. ఇందు 'సమర్థానామ్' అను పదము

నిర్ధారణషష్ఠ్యంతము. జాతినిబట్టిగాని, గుణమునుబట్టిగాని, క్రియనుబట్టిగాని, సంజ్ఞను బట్టిగాని సముదాయమునుండి ఒకభాగమును వేఱుచేయుటకు నిర్ధారణమని పేరు. కావున సమర్థానామ్ అనగా సమర్థములలోనెల్ల అని అర్థము. ఇచట సమర్థమనగా పరినిష్ఠితము. అనగా సంధికార్యాదులన్నియు పూర్తియయి అర్థమును ఒసఁగఁగలశక్తి కలిగి యున్నది అని తాత్పర్యము 'ప్రథమాత్' అనగా మొదటిదానికి పరముగా నని అర్థము. మొదటి దనగా ముందు చెప్పఁబడుసూత్రములలో మొదటిపదము. దానిచేత వాచ్యములగు పదములని తాత్పర్యము. ఇది యధికారసూత్రము కావున ముందుఁ జెప్పబడుసూత్రములలో విధింపఁబడు ప్రత్యయములు సమర్థములగు పదములలో మొదటిదానికి పరముగా వైకల్పికముగా వచ్చునను నర్థమును సమకూర్చును ఈ యర్థము నొక ఉదాహరణములో పరిశీలింపుము తస్యాపత్యమ్ - అతనియొక్క సంతానము ఇందు అర్థసమర్పణశక్తి గల రెండుపదములలో మొదటిది తస్య' అనునది దానిచేత వాచ్యమగు దశరథస్య' మున్నగువానికి, విధింపఁబడిన 'ఇఞ్' మున్నగు ప్రత్యయములు వచ్చునని సూత్రతాత్పర్యము

**సూ. ప్రాగ్దీవ్యతోఽణ్ 4-1-83**

**వృ : తేన దీవ్యతీత్యతః ప్రాగణధిక్రియతే**

ప వి ప్రాక్ (1-1) దీవ్యతః (5-1) అణ్ (1-1)

అర్థ : తేన దీవ్యతీత్యాదిసూత్రమునకు పూర్వమువఱకు 'అణ్' అనునది అధికారింపగును

వివ 4-4-2 వ సంఖ్య గల సూత్రము తేనదీవ్యతి ఖనతి జయతి జితమ్' అనునది ఇందలి దీవ్యతి' అనుపద మీ సూత్రమున దీవ్యతః అను పదముచే ననుకరింపఁబడినది దీవ్యతః అనగా 'దీవ్యతి శబ్దముగల సూత్రమువఱకు' అని భావము అంతవఱకు అణ్' అను పదము అధికారపడును అనగా 4-1-84 మొదలు 4-4-2 వఱకుఁగల సూత్రములలో 'అణ్' అను పదమును కలుపుకొనవలయు నని తాత్పర్యము

అవ . ఇట్లు ప్రకరణమున కవసరములగు రెండధికారసూత్రములు చెప్పిన తర్వాత ప్రత్యయమును విధించుసూత్రము చెప్పఁబడుచున్నది.

**సూ. అశ్వపత్యాదిభ్యశ్చ 4-1-84.**

**వృ : ఏభ్యోఽణ్ స్యాత్ ప్రాగ్దీవ్యతీయేష్వర్థేషు.**

వ వి : 'అశ్వపత్యాదిభ్యః (5-3) చ (అవ్యయ).

అను : సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య) అణ్ (1-1) తద్ధితః (1-1)

అర్థ : అశ్వపత్యాదులకు ప్రాగ్దీవ్యతీయార్థములందు అణ్ ప్రత్యయమగును'

వివ : తద్ధితప్రత్యయములన్నియు నా యా యర్థములను వ్యక్తము చేయుచు శబ్దములకు చేరుచుండును సూత్రములందా యర్థములు నిర్దేశింపబడినవి ఉదా : తస్యాపత్యమ్ - అతనిసంతానము, తేన రక్తంరాగాత్ - దానిచేత నెఱ్ఱపడినది తత్రోద్ధృతమ్ - దానిమీది పైకి తీయబడినది ఇట్లు. ప్రాగ్దీవ్యతీయార్థములనగా 'తేనదీవ్యతి ఖనతి జయతి జితమ్' అను సూత్రమునకు పూర్వమునందుగల అర్థము లందు' అని యర్థము ఆ అర్థములందు అశ్వపతి మున్నగుశబ్దములకు 'అణ్' ప్రత్యయము వచ్చును అనగా అశ్వపతి మున్నగువానికి అణ్ ప్రత్యయము చేర్పగా నేర్పడిన పదము 'అశ్వపతియొక్క కుమారుడు' మున్నగు అర్థములు కలది యగు నని తాత్పర్యము

ఉదా : అశ్వపతే రపత్యాది - అశ్వపతియొక్క సంతానము మున్నగునది ఈ వాక్యమునందు అశ్వపతేః అపత్యాది అను రెండును సమర్థములైన పదములు వానిలో మొదటిది అశ్వపతేః అనునది దానికి పరముగా ఈ 'అణ్' ప్రత్యయమగునని 'సమర్థానాం ప్రథమాద్వా' అను అధికారసూత్రముచే అర్థమగు వర్థము 'అశ్వపతేః + అణ్' అణ్ అనునది తద్ధితప్రత్యయము' కృత్తద్ధిత సమాసాశ్చ' అను సూత్రముచే తద్ధితాంతమునకు ప్రాతిపదికసంజ్ఞ కలుగును 'అశ్వపతి + ఙస్, అణ్' ఇది ప్రాతిపదికము 'సుపో ధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే ప్రాతిపదికసంజ్ఞ గల దీనియొక్క అవయవమగు సుప్పునకు (ఙస్ అనుదానికి) లుక్కు వచ్చును అశ్వపతి+అణ్'.

ఇట్టిస్థితిలో 'తద్ధితేష్వచామాదేః' అను సూత్రముచే ఆదివృద్ధి వచ్చును ణిత్తుగాని కిత్తుగాని యగు తద్ధితప్రత్యయము పరమగునపుడు పూర్వమున నున్న దాని అచ్చులలో మొదటి అచ్చునకు వృద్ధివచ్చును అణ్ ప్రత్యయము ణిత్తగు తద్ధితము. ఇది పరమైనపుడు 'అశ్వపతి' అను దాని మొదటి అకారమునకు వృద్ధి ఆకారము ఆదేశమగును 'ఆశ్వపతి + అ' - 'యస్యేతిచ' (భ సంజ్ఞకము యొక్క ఇ వర్ణాన్తములకు, తద్ధితప్రత్యయముగాని ఈకారముగాని పరమగునపుడు లోపమువచ్చును.) అను సూత్రముచే ఇ కారము లోపింపగా ఆశ్వపత్ + అ =

అశ్వపత + స = ఆశ్వపతమ్ అగును. (అశ్వపతికి సంబంధించినది. అశ్వపతి కుమారుడు, అశ్వపతి కూతురు ఇత్యాదిగా దీనికర్థములు ఆ అర్థానుగుణముగా ఆశ్వపతమ్, ఆశ్వపతః, ఆశ్వపతీ అని మూడులింగములలో రూపములుండవచ్చును) (తద్ధితేష్వచామాదేః, యస్యేతిచ అను సూత్రము తీప్రకరణమున పలుతావులందు అవసరములగును కావున వాని యర్థమును జాగ్రత్తగా అనుసంధించుకొనదగును)

ఇట్లే గణపతేః అపత్యాది - గణపతియొక్క సంతానము మొదలి గణపతి + అణ్, ఆదివృద్ధి, గాణపతి + అ, యస్యేతిచ, ఇ కారలోపము గాణపత + స = గాణపతమ్.

**అశ్వపత్యాది గణము :** అశ్వపతి (జ్ఞానపతి) శతపతి ధనపతి గణపతి [స్థానపతి యజ్ఞపతి] రాష్ట్రపతి కులపతి గృహపతి (పశుపతి) ధాన్యపతి ధన్వపతి (బన్ధుపతి ధర్మపతి) సభాపతి ప్రాణపతి క్షేత్రపతి - ఇత్యశ్వపత్యాదిః

ఈవ 'అణ్' అనునది సామాన్యప్రత్యయము ఇటుపై కొన్నివిశేష ప్రత్యయములు చెప్పబడుచున్నవి.

**సూ. దిత్యదిత్యాదిత్య పత్యుత్తర పదాణ్ణ్యః 4-1-85**

**వృ. ప్రాగ్దీవ్యతీయేష్వర్థేషు. దితేరపత్యం దైత్యః, అదితేరాదిత్యస్య వా ఆదిత్యః. ప్రాజాపత్యః.**

ప వి. దిత్యదిత్యాదిత్యపత్యుత్తరపదాత్ (5-1) ణ్యః (1-1)

అను. సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య)

అర్థ: దితి, అదితి, ఆదిత్య, అను వానికిని, పత్యుత్తరపదములకును అపత్యాద్యర్థమున 'ణ్య' ప్రత్యయము వచ్చును. ఉదా దితేః అపత్యమ్ - దైత్యః, అదితేః, ఆదిత్యస్య వా అపత్యం ఆదిత్యః, ప్రాజాపత్యః.

వివ : మర్థములలో మొదటినియును, దితి, అదితి, ఆదిత్య అనుపదములకును, పతిశబ్దము ఉత్తరపదముగా గలవానికిని వారిసంతానము' మున్నగు నర్థములలో ణ్య' అను ప్రత్యయము వచ్చును ఇందు ణకారమిత్తు (చుటూ) ణిత్తు కావున ఆదివృద్ధి వచ్చును

ఉదా దితేః అపత్యమ్ - దితియొక్క కుమారుడు - దితి + ఙస్, ణ్య ప్రాతిపదికసంజ్ఞ, విభక్తిలోపము దితి+య, ఆదివృద్ధి (ఇకారమునకు ఐ) దైతి+య, యస్యేతిచ, ఇకారలోపము, దైత్+య=దైత్య+సు=దైత్యః (యకారాది ప్రత్యయము పరమగునప్పుడు పూర్వము భసంజ్ఞకమగును - యచిభమ్).

అదితేః అపత్యమ్, అదితి పుత్త్రుఁడు, అదితి + ఙస్, ణ్య, అదితి+య అదితి + య, ఆదిత్ + య = ఆదిత్య + సు = ఆదిత్యః.

ఆదిత్యస్య అపత్యమ్ - ఆదిత్యుని కుమారుఁడు, ఆదిత్య + ఙస్, ణ్య ఆదిత్య + య, యస్యేతిచ, అకారలోపము, 'ఆదిత్య్ + య, అనియుండ 'హలో యమాం యమి లోపః' 8-4-64, హల్లులకు పరముగానున్న యమ్ వర్ణము లకు, యమ్ వర్ణములు పరములగునపుడు, లోపము వైకల్పికముగా నగును అను సూత్రముచే మొదటి యకారమునకు లోపము రాఁగా 'ఆదిత్య' అగును ఆదిత్య+సు ఆదిత్యః యకారలోపము రానిచో రెండు యకారము లున్న రూపముండును. ఆదివృద్ధిచే ఆకారమునకు ఆకారమే వచ్చును

ప్రత్యుత్తరపదమున కుదాహరణము. ప్రజాపతేః అపత్యం పుమాన్ - ప్రజాపతియొక్క సంతానమైన పురుషుఁడు. ప్రజాపతి + ఙస్, ణ్య ప్రాతిపదికత్వము, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఇకారలోపము, ప్రాజాపత్య + సు = ప్రాజాపత్యః

వా. దేవాద్యఞఞౌ. (౨౬౫౫).

వృ. దైవ్యమ్ - దైవమ్.

ప వి దేవాత్ (5-1) యఞ్ అఞౌ (1-2).

అర్థ దేవశబ్దమునకు అపత్యాద్యర్థమున యఞ్, అఞ్ అను ప్రత్యయములు చేయును ఉదా : దైవ్యమ్ - దైవమ్.

వివ దేవశబ్దమునకు సంతానము, అతనికి సంబంధించినది మున్నగు ప్రాగ్దీవ్యతీయార్థములలో యఞ్, అఞ్ అను ప్రత్యయములు పర్యాయముగా నగును ఇందు ఞ కారము ఇత్తు దానివలన ఆద్యక్షరమునకు వృద్ధివచ్చును (తద్ధితేష్వచామాదేః)

ఉదా : దేవస్య అపత్యమ్ - దేవ + ఙస్, యఞ్, ప్రాతిపదికసంజ్ఞ, విభక్తి లోపము, దేవ + య(ఞ్), దైవ + యస్యేతిచ, అకారలోపము దైవ్ + య = దైవ్య + సు = దైవ్యమ్ 'అఞ్' ప్రత్యయము వచ్చినచో దేవ + అఞ్, దైవ + అ, దైవ + సు = దైవమ్.

వా. బహిషష్టిలోపో యఞ్ చ. (౨౬౫౬).

వృ : బాహ్యః.

ప. వి : బహిషః (6-1) టిలోపః (1-1) యఞ్ (1-1) చ (అవ్య)

అర్థ : 'బహిస్' అను అవ్యయమునకు టి లోపము యఞ్ ప్రత్యయము నగును ఉదా: బాహ్యః

వివ : 'బహిస్' అను అవ్యయమునకు ప్రాగ్దీవ్యతీయార్థములలో యఞ్ ప్రత్యయమగును. అది వచ్చినపుడు టి భాగమునకు లోపము అగును. ప్రత్యయము ఞిత్తగుటచే ఆదివృద్ధివచ్చును

ఉదా : బహిః భవః - వెలుపల నున్నవాడు, బహిస్ + యఞ్, ఆదివృద్ధి బాహిస్ + య(ఞ్) టి భాగమగు 'ఇస్' అనుదానికి లోపము బాహ్ + య = బాహ్య + సు = బాహ్యః

వా : ఈకక్ చ (2557).

ప. వి : ఈకక్ (1-1) చ (అవ్య)

అర్థ : 'బహిస్' అనుదానికి 'ఈకక్' అను ప్రత్యయము కూడనగును

వివ : ప్రాగ్దీవ్యతీయార్థములలో 'బహిస్' అను అవ్యయమునకు యఞ్ ప్రత్యయమే కాక 'ఈకక్' అను ప్రత్యయముకూడ చేరును ఇందు తుది కకారము ఇత్తు (హలన్త్యమ్) అది ఇత్తు అగుటచే నగు కార్యవిశేషము క్రిందిసూత్రముచే తెలుపబడుచున్నది.

సూ : కితి చ 7-2-118

వృ : అచామాదేరచో వృద్ధిః స్యాత్. బాహీకః

ప. వి : కితి (7-1) చ (అవ్య)

అను. తద్ధితేషు (7-3) అచామ్ (6-3) ఆదేః (6-1) వృద్ధిః (1-1).

అర్థ : కిత్తయిన తద్ధితము పరమగునపుడును అచ్చులలో మొదటిదానికి వృద్ధి ఆదేశమగును. ఉదా : బాహీకః

వివ : ఇది 'తద్ధితేష్వచామాదేః' అను సూత్రమునకు తరువాతిసూత్రము. కకారము ఇత్తుగాగల తద్ధితప్రత్యయము పరమగునపుడును పూర్వమునమున్న శబ్ద స్వరూపముయొక్క అచ్చులలో మొదటిదానికి వృద్ధి వచ్చును తద్ధితప్రత్యయమున ఞకారము, ణకారము, కకారము ఇత్తులుగా నున్నచో, అవి పరమగునపుడు ఆదివృద్ధివచ్చు నని తాత్పర్యము.

ఉదా : బహిస్ + ఈకక్. 'ఈకక్ చ' అను దానియందలి చ కారమువలన పూర్వవార్తికమున చెప్పఁబడిన టి లోపము ఈకక్ ప్రత్యయము వచ్చు నపుడును వచ్చును. ఆదివృద్ధి, టి లోపము, బాహ్ + ఈక = బాహీక + సు = బాహీకః — వెలుపలనున్నవాఁడు.

వా. సర్వత్ర గోరజాది ప్రసఙ్గే యత్. (వా)

వృ : గోరపత్యాది గవ్యమ్.

ప వి : సర్వత్ర (అవ్య) గోః (6-1) అజాదిప్రసఙ్గే (7-1) యత్ (1-1)

అర్థ : గోశబ్దమునకు అజాదిప్రసంగమున ప్రాగ్దీవ్యతీయార్థము లన్నింటి యందును యత్ ప్రత్యయము వచ్చును. ఉదా : గోః అపత్యాది, గవ్యమ్.

వివ : అజాది ప్రసంగమనగా అచ్చు ఆదియందున్న ప్రత్యయములగు అణ్ మున్నగునవి రాఁదగు సందర్భములన్నియని యర్థము. పూర్వవార్తికమగు 'లోమ్నోఽపత్యేషు బహుష్వకారః' అను దానియందు అపత్యార్థమునకు మాత్రమే గ్రహింపఁబడుటచే అదికాక తక్కిన యర్థములందును ఈ ప్రత్యయము వచ్చుటకై 'సర్వత్ర' అను పదము గ్రహింపఁబడినది. ఇట్లు గోశబ్దమునకు ప్రాగ్దీవ్యతీయార్థము లన్నింటియందును, అచ్చు ఆది యందుఁగల ప్రత్యయము రావలసియున్న సందర్భమునందు 'యత్' అను తద్ధితప్రత్యయము వచ్చునని సూత్రార్థ మేర్పడినది

ఉదా : గోః అపత్యాది - గోవుయొక్క సంతానము, లేక వికారము (అనగా దానివలన నేర్పడిన క్షీరము మున్నగునది) గో + ఙస్ + యత్. తకారమునకు ఇత్తు ప్రాతిపదికసంజ్ఞ కలిగి 'ఙస్' ప్రత్యయమునకు లోపము 'గో + య' 'వాన్తో యి ప్రత్యయే' అను సూత్రముచే అవాదేశము గ్ + అవ్ + య = గవ్య + సు = గవ్యమ్.

సూ. ఉత్సాదిభ్యోఽఞ్ 4-1-86.

వృ : ఔత్సః.

ప. వి : ఉత్సాదిభ్యః (5-3) అఞ్ (1-1).

అను : తద్ధితాః (1-3) ప్రత్యయః (1-1) సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (1-1) వా (అవ్య).

అర్థ : ప్రాగ్దీవ్యతీయార్థములందు 'ఉత్స' మున్నగు శబ్దములకు 'అఞ్' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఉదా : ఔత్సః.

వివ : ఉత్స మున్నగు శబ్దములకు 'ఆతని సంతానము' మున్నగు నర్థము లందు 'అణ్' అను తద్ధిత ప్రత్యయము చేయును. ఇందు ణ కారముండుట అది పరమగు నప్పుడు ఆదివృద్ధి వచ్చును

ఉదా : ఉత్సస్య అపత్యం పుమాన్, ఉత్సుని కుమారుడు ఉత్స + ఙస్ + అణ్, ప్రాతిపదికసంజ్ఞ, విభక్తిలోపము, ఆదివృద్ధి, అకారలోపము ఔత్స + సు = ఔత్సః,

**ఉత్సాదిగణము :** ఉత్స ఉదపాన వికర వినద మహానద మహానస తరుణ తలున బష్కయాసే పృథివీ (ధేను) పఙ్క్తి జగతీ త్రిష్టుప్ అనుష్టుప్ జనపద భరత ఉశీనర గ్రీష్మ పీలుకుణ 'ఉదస్థానదేశే 57' పృషదంశ భల్లకీయ రథన్తర మాధ్యందిన బృహత్ మహత్ సత్త్వత్ కురు పఞ్చాల ఇంద్రావసాన ఉష్ణిహ్ కకుభ్ సువర్ణ దేవ 'గ్రీష్మాదచ్ఛన్దసి 58' ఇత్యుత్సాదిః.

**వృ : ఇత్యపత్యాది వికారాన్తార్థ సాధారణ ప్రత్యయాః.** ఇట్లు అపత్యార్థము మొదలుకొని వికారార్థము అంతముగాఁ గల సాధారణ ప్రత్యయములు చెప్పఁబడినవి

## ఇతి సాధారణ ప్రత్యయ ప్రకరణము

**ప్రకరణావలోకనము :** ఇందు అపత్యాధికారము మొదలుకొని వికారాధికారము వఱకుఁ గల సాధారణప్రత్యయములు విధింపఁబడినవి ఈ ప్రకరణమున అణ్, ణ్య, యఞ్, అఞ్, ఈకక్, యత్ అను ప్రత్యయములు ఆ యా శబ్దములకు విధింపఁబడినవి తద్ధితేష్వచామాదేః, కితి చ అను సూత్రములు ఇందు ఆదివృద్ధిని విధించునవి 'సమర్థానాం ప్రథమాద్వా', 'ప్రాగ్దీవ్యతోఽణ్' అనునవి అధికార సూత్రములు

## అథ అపత్యాధికార ప్రకరణమ్

అప : అపత్యమనఁగా సంతానము ఈ ప్రకరణమున ఆ యా శబ్దములకు ఆతని 'సంతానము' అను నర్థమున వచ్చు తద్ధితప్రత్యయములు విధింపఁబడుచున్నవి. కావున దీనికి అపత్యాధికార ప్రకరణ మనిపేరు

**సూ. స్త్రీపుంసాభ్యాం నఞ్ స్నఞౌ భవనాత్ 4.1.87.**

**వృ : ధాన్యానాం భవన ఇత్యతః ప్రాగర్థేష్వాభ్యాం క్రమాత్ స్తః. స్త్రైణః, పౌంస్నః.**

ప ఛే : స్త్రీ పుంసాభ్యామ్ (5-2) నఞ్ స్నఞ్ (1-2) భవనాత్ (5-1).

అను : తద్ధితాః (1-3) ప్రత్యయాః (1-1) సమర్థానామ్ (6-1) ప్రథమాత్ (5-1) వా (అప్య) ప్రాక్ (1-1)

అర్థ : ధాన్యానాం భవనే క్షేత్రే' అను సూత్రమునకు పూర్వమునందుఁగల అర్థములలో స్త్రీ, పుంస్ అను శబ్దములకు క్రమముగా నఞ్, స్నఞ్ అను ప్రత్యయములు వచ్చును ఉదా : స్త్రైణః, పౌంస్నః

వివ : సూత్రమునందలి 'భవనాత్' అను పదము 'భవన' అను పదము గల సూత్రము అని ఉపదిగా తెలుపును అది ధాన్యానాం భవనే క్షేత్రే' (5-2-1) అనునది ఈ సూత్రము మొదలుకొని ఆ సూత్రముహద్దుగా గల సూత్రములయందుఁ జెప్పఁబడిన అపత్యము, భవము, సమూహము మున్నగు అర్థములలో స్త్రీ శబ్దమునకు 'నఞ్' అను ప్రత్యయమును, 'పుంస్' శబ్దమునకు 'స్నఞ్' అను ప్రత్యయమును జేరును, ఈ రెంటియందును ఞకారమిత్తు గావున స్త్రీ పుంస్ శబ్దముల అచ్చునకు వృద్ధివచ్చును (తద్ధితేష్వచామాదేః)

ఉదా : స్త్రియాః అపత్యమ్ = స్త్రీ యొక్క సంతానము, స్త్రీణామ్ సమూహః స్త్రీసముదాయము స్త్రీ + ఙస్ ఆమ్, నఞ్, ప్రాతిపదికసంజ్ఞ విభక్తిలోపము, ఆదివృద్ధి స్త్రై + న, 'అట్కుప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి' అనుసూత్రముచే రేఫ యోగమువలన నకారమునకు ణత్వము స్త్రైణ + సు = స్త్రైణః

పుంసః అపత్యమ్, పుంసామ్ సమూహః పుంస్ + ఙస్ ఆమ్ స్నఞ్ పుంస్ + స్న, ఆదివృద్ధి పౌంస్ + స్న ఇచట పౌంస్' అనుదానికి స్వాది ష్వసర్వనామస్థానే' అను సూత్రముచే పదసంజ్ఞ కలుగును (క ప్రత్యయము అవధిగాఁగల స్వాది ప్రత్యయములు - సర్వనామస్థానభిన్నములు - పరములగునపుడు పూర్వమునకు పదసంజ్ఞకలుగును) కావున 'సంయోగాన్తస్య లోపః' అనుసూత్రముచే సకారమునకు లోపము పౌంస్న + సు = పౌంస్నః ఇందు 'స్న' విడుపకారము ప్రత్యయములోనిదని తెలియనగును స్త్రీషుభవః - స్త్రీలయందున్నవాఁడు, పుంసు భవః = పురుషులయందున్నవాఁడు అనుఅర్థములయందును ఈ రూపములే యేర్పడును

ఇక నపత్యాధికారసూత్రము చెప్పఁబడుచున్నది.

సూ : తస్యాపత్యమ్ 4-1-92

వృ : షష్ఠ్యన్తాత్ కృతసన్ధేః సమర్థాదపత్యేఽర్థే ఉక్తా వక్ష్యమాణాశ్చ ప్రత్యయా వా స్యుః.

ప వి : తస్య (6-1) అపత్యమ్ (1-1)

అను సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య)

అర్థ : షష్ఠ్యంతమును, కృతసంధియు సమర్థము నగుపదమునకు అపత్యమను నర్థమున ఉక్తములును వక్ష్యమాణములు నగుప్రత్యయములు వైకల్పికముగా నగును

విప . 'తస్య' అనునది షష్ఠ్యంతపదమునకు చిహ్నము 'సమర్థానాం ప్రథమాద్వా' అను అధికార సూత్రము చొప్పున సంధ్యాదికార్యము లన్నియు చేయఁబడిన సమర్థమగు షష్ఠ్యంతపదమునకు వరముగా' అనునర్థము కలుగును ఆ షష్ఠ్యంతపదముచే వాచ్యుఁడగు వ్యక్తియొక్క సంతానము అనునర్థమును దెలుపుటకు అట్టిపదమునకు ఇంతకుపూర్వము చెప్పఁబడిన అణ్, ఞ్య, అఞ్ మున్నగు ప్రత్యయములును, ఇఁకముందు చెప్పఁబడు ఫక్, ఇఞ్, అఞ్ మున్నగు ప్రత్యయములును జేరును ఇంతకుముందు జెప్పఁబడిన ప్రత్యయములన్నియు ప్రాగ్దీవ్యతీయార్థమునందగును అందపత్యార్థమును గలదు కావున ఆ ప్రత్యయములు కూడ అపత్యార్థమున వచ్చుననునర్థము లభించును 'వా' అను పదము అనువృత్తి యగుటవలన ప్రత్యయము రాకుండుటయుఁ గలదు

ఉదా : ఉపగోరపత్యం పుమాన్ - ఉపగువు అనువాని సంతానమైన పురుషుఁడు ఇందు సమర్థమైన షష్ఠ్యంతపదము 'ఉపగోః' అనునది దానికి వరముగా అతనిపుత్త్రుఁడు అనునర్థమున అణ్' ప్రత్యయము (ప్రాగ్దీవ్యతోఽణ్ అను సూత్రమునుండి అధికారరూపమున వచ్చినది) చేరును అనగా అణ్' ప్రత్యయాంతమైన ఉపగుశబ్దమునకు ఉపగువుయొక్క సంతానమైన పురుషుఁడు అనియర్థము 'ఉపగు + ఙస్, అణ్, తద్ధితాంతమగుటచే ప్రాతిపదికమగును కావున విభక్తికి లోపము వచ్చును ప్రత్యయము ణిత్తు కావున ఆదివృద్ధి, 'ఔపగు + అ' అనియుండ క్రింది సూత్రమేక కార్యమును విధించుచున్నది

సూ : ఓర్గుణః 6-4-146

వృ : ఉవర్ణాన్తస్య భస్య గుణః స్యాత్ తద్ధితే. ఉపగోరపత్య మౌపగవః.

ప వి : ఓః (6-1) గుణః (1-1)

అను : భస్య (6-1) తద్ధితే (7-1)

అర్థ : ఉవర్ణాంతమైన భసంజ్ఞకమునకు, తద్ధితము పరమగునపుడు, గుణము వచ్చును ఉదా ఉపగోరపత్యం పుమాన్ ఔపగవః.

వివ : 'ఓః' అనునది 'ఉ' అనుదానియొక్క షష్ఠ్యంతరూపము, అది 'భస్య' అను దానికి విశేషణము తదంతవిధిచే 'ఉవర్ణాంతమైన' అనునర్థము కలుగును. యకారాదిప్రత్యయము గాని అచ్చు అదియందుఁగల ప్రత్యయముగాని పరముగ నున్నపుడు పూర్వమునకు భసంజ్ఞ కలుగును - (యచిభమ్), ఉవర్ణముఅంతమునఁ గలభసంజ్ఞకమునకు, తద్ధితప్రత్యయము పరమగునపుడు గుణమాదేశమగును 'అలోఽన్త్యస్య' అనుపరిభాషచే తుదిఉవర్ణమునకు ఈ గుణము వచ్చును ఉకారము నకు అంతరతమమైన గుణము ఓకారము

ఉదా · ఔపగు + అ - ఇచట 'అ' అనునది అజాదిప్రత్యయముకావున 'ఔపగు' అనునది భసంజ్ఞకమగును దాని తుది ఉకారమునకు గుణము ఓకారము వచ్చును ఔపగో+అ, అవాదేశము (ఏచోఽయవాయావః) ఔపగవ + సు= ఔపగవః

అవ · పూర్వోక్తములైన అణ్, ణ్య, అఞ్, నఞ్, స్నఞ్ ప్రత్యయము లకు అపత్యార్థమున నుదాహరణములు చూపఁబడుచున్నవి

వ్యా : ఆశ్వపతః, దైత్యః, ఔత్సః, స్త్రైణః, పౌంస్నః.

వివ : అశ్వపతేఃఅపత్యం, అశ్వపతేః' అను పదమునకు 'అశ్వపత్యాది భ్యశ్చ' అనుసూత్రముచే అణ్ ప్రత్యయము-ఆశ్వపతః

దితేఃఅపత్యమ్, దితిశబ్దమునకు దిత్యదిత్యాదిత్యపత్యుత్తర పదాణ్ణ్యః' అను సూత్రముచే అపత్యార్థమున ణ్య' ప్రత్యయము - దైత్యః

ఉత్సస్యాపత్యమ్, ఉత్సశబ్దమునకు ఉత్సాదిభ్యోఽఞ్' అనుసూత్రముచే అపత్యార్థమున అఞ్' ప్రత్యయము - ఔత్సః.

స్త్రియాఃఅపత్యమ్, స్త్రీశబ్దమునకు 'స్త్రీపుంసాభ్యామ్' ఇత్యాదిసూత్రముచే అపత్యార్థమున నఞ్' ప్రత్యయము - స్త్రైణః

పుంసఃఅపత్యమ్, పుంస్శబ్దమునకు స్త్రీపుంసాభ్యామిత్యాది సూత్రముచే అపత్యార్థమున స్నఞ్ ప్రత్యయము - పౌంస్నః.

పీనిప్రక్రియ ఆయా సూత్రములకడ చూపఁబడినది

అవ : అపత్యమనగా సంతానము ఇది ఒక్క పుత్త్రునికే పరిమితముకాదు. పుత్త్రునిపుత్త్రుఁడు, ఆతనిపుత్త్రుఁడు మున్నగువారికిని వర్తించును అట్టి అపత్యము

పదు గోత్రము, యువ మున్నగు సంజ్ఞలు గలవు ముందువిధింపఁబడు ప్రత్యయములు కొన్ని గోత్రాపత్యార్థమునందును, మఱికొన్ని యువాపత్యార్థమునందును చేరును కావున గోత్రనిర్వచనము ఇచటచేయఁబడుచున్నది దీనితఱువాతిసూత్రమున గోత్ర శబ్ద ప్రయోగము గలదు దానికై యీ సూత్ర మిట నవసరమగుచున్నది

సూ . అపత్యం పౌత్రప్రభృతిగోత్రమ్ 4-1-162

వృ : అపత్యత్వేన వివక్షితం పౌత్రాది గోత్రసంజ్ఞంస్యాత్.

ప వి ఆపత్యమ్ (1-1) పౌత్రప్రభృతి (1-1) గోత్రమ్ (1-1)

అర్థ : అపత్యరూపమున వివక్షితమైనపౌత్రాదికము గోత్రసంజ్ఞకలది యగును

వివ : అపత్యమనగా సంతానము అని స్థూలమైన యర్థము సంతానమనగా పుత్త్రుఁడు, పుత్త్రిక అని తనకు అనంతరమైన తరమువారిని మాత్రమే చెప్పునా? లేక పౌత్రుఁడు, ప్రపౌత్రుఁడు మున్నగు మూఁడవ, నాల్గవతరములవారిని కూడ బోధించునా? అనగా నిఘంటువునుబట్టి ఇది రెండవతరము వారికే సంజ్ఞ అని తెలియును 'ఆత్మజస్తనయః సూనుః సుతః పుత్త్రః స్త్రియాంత్వమీ ఆహుర్దుహితరం సర్వేఽపత్యంతోకం తయోస్సమే' అని నిఘంటువు ఆత్మజుఁడు, తనయుఁడు, సూనుఁడు, సుతుఁడు, పుత్త్రుఁడు ఇవిసమానార్థకములు స్త్రీ లింగమున వీనినుండి ఏర్పడు ఆత్మజ, తనయ మున్నగువానితో దుహిత అను శబ్దముకూడ నీయర్థమున వ్యవహరింపఁబడును అపత్యము, తోకము అనుశబ్దములు, పుత్త్రుఁడు, పుత్త్రిక అను రెండర్థములందును వ్యవహరింపఁబడును' అని పైదానికర్థము దీనినిబట్టి అపత్య శబ్దము పుత్త్రుఁడు, పుత్త్రిక అనునర్థమును మాత్రమే ఇచ్చును ఇట్లయెడ పౌత్రాదికమైన అపత్యముగోత్రమగుననుట యెట్లుపొసఁగును ? అనగా పై నిఘంటువు అపత్యశబ్దముయొక్క స్థూలార్థమునే చెప్పినది న పతన్తి పితరో యేన తదపత్యమ్' - ఎవనివలన పితరులు నరకమున పడరో అట్టివాఁడు అపత్యము అను వ్యుత్పత్తినిబట్టి, పౌత్రాదులుకూడ పితామహాదులను నరకమునుండి ఉద్ధరించువారుగా మహాభారతాదీతిహాసములయందు ప్రమాణీకరింపఁబడుటచేత పౌత్రాదులకును అపత్య సంజ్ఞ కలుగును ఇది భాష్యసమ్మతమైన విషయము

పై అంశమునుబట్టి అపత్యముగా వివక్షింపఁబడిన పౌత్రుఁడు మున్నగువారికి 'గోత్రము' అనుసంజ్ఞయుండును అనగా ఒక మూలపురుషునిమనుమఁడి, మూఁడవ, నాల్గవ, ఐదవతరములవారును, ఇంకను తఱువాతివారును ఆ వ్యక్తియొక్క గోత్రము వారుగా వ్యవహరింపఁబడుదురని తాత్పర్యము

పౌత్రుఁడనగా పుత్రుని పుత్రుఁడు అపత్యముగా వివక్షింపఁబడినపుడే యాతనికి గోత్రసంజ్ఞ, పౌత్రుఁడనియే చెప్పఁదలఁచినపుడు గోత్ర సంజ్ఞయుండదని తెలుపుటకై అపత్యత్వేనవివక్షితమ్' అని చెప్పఁబడినది.

అవ : గోత్రాపత్యార్థమును అపత్యాధికారవిహితప్రత్యయములను సంబంధించిన నియమ మొకటి యీ క్రిందిసూత్రముచే చెప్పఁబడుచున్నది.

సూ : ఏకో గోత్రే 4-1-93.

వృ : గోత్రే ఏక ఏవప్రత్యయః స్యాత్. ఉపగోర్గోత్రాపత్యమౌపగవః

ప వి : ఏకః (1-1) గోత్రే (7-1)

అర్థ : గోత్రాపత్యార్థమున ఒక్కప్రత్యయమే వచ్చును ఉదా : ఉపగోర్గోత్రాపత్యమౌపగవః

వివ : గోత్రమనగా అపత్యముగా వివక్షింపఁబడినపౌత్రుఁడు మున్నగువారని పైసూత్రమున వివరింపఁబడినది అట్టి గోత్రాపత్యమును చెప్పునపుడు సమర్థమైన షష్ఠ్యంతమునకు ఒక్కప్రత్యయమే వచ్చును ఈ సూత్రము అపత్యాధికారములోనిదగుటచే 'అపత్య' ప్రత్యయమనునర్థము సిద్ధించినది ఉపగుని కుమారుఁడు అనునర్థమున ఉపగుశబ్దమునకు అణ్ప్రత్యయముచేరి 'ఔపగవ' అయినది ఔపగవునికుమారుఁడు అనునర్థమున ఔపగవశబ్దమున కొకప్రత్యయమును, మఱలనాతనిపుత్రుఁడు అనునర్థమున మఱియొకప్రత్యయము - ఇట్లుబహు ప్రత్యయముల పరంపర చేరుచుండునా? అనుశంకకు సమాధానముగా ఈసూత్రము చెప్పఁబడినది గోత్రాపత్యము' అనునర్థమున నొక్కప్రత్యయమే చేరును ఆ ప్రత్యయాంతరూపమే పౌత్రుని, ప్రపౌత్రుని, తదనంతరతరములవారి నెందఱనైనను బోధించునని తాత్పర్యము ఉదాహరణము ఉపగోర్గోత్రాపత్యమ్-ఉపగువు యొక్క గోత్రాపత్యము ఔపగవః ఔపగవ్ఞడనఁగా ఉపగుని పుత్రుఁడు, పౌత్రుఁడు, ప్రపౌత్రుఁడు ఇత్యాదిగా సందర్భమునుబట్టి అర్థమును గ్రహింపవచ్చునని సూత్రభావము ఈ సూత్రమువలన ఒకశబ్దమునకు అనేకప్రత్యయముల పరంపర చేరవలసిన ప్రమాదము తప్పినది

సూ : గర్గాదిభ్యో యఞ్ 4-1-105

వృ : గోత్రాపత్యే. గర్గస్యగోత్రాపత్యం గార్గ్యః, వాత్స్యః

వ. వి : గర్గాదిభ్యః (5-3) యఞ్ (1-1)

అను సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1) గోత్రే

అర్థ . గర్గాదులగు సమర్థషష్ఠ్యంతములకు గోత్రాపత్యార్థమున 'యఞ్' అను తద్ధితప్రత్యయము చేరును.

వివ గోత్రాపత్యమనగా అపత్యరూపమున నపేక్షితమగు (చెప్పఁగోరఁబడిన) పౌత్రుఁడు మున్నగువారు అయర్థమున, గర్గాదులగువాని షష్ఠ్యంత రూపములకు 'యఞ్' అను తద్ధితప్రత్యయము చేరును ఇందు ఞకారేత్తు కావున గర్గాదిశబ్దములయొక్క ఆదిఅచ్చునకు వృద్ధివచ్చును

ఉదా . గర్గస్య గోత్రాపత్యమ్-గర్గునియొక్క గోత్రమునందలి పురుషుఁడు మనుమఁడు, మునిమనుమఁడు మొ॥వాఁడు గర్గ + ఙస్, యఞ్, విభక్తిలోపము ఆదివృద్ధి, గార్గ + య, యస్యేతిచ, అకారలోపము, గార్గ + య = గార్గ్య + సు = గార్గ్యః

వత్సస్య గోత్రాపత్యం పుమాన్-వత్సునియొక్క గోత్రాపత్యము వత్స + ఙస్, యఞ్, విభక్తిలోపాదికము వాత్స్య + సు = వాత్స్యః

గర్గాదిగణము : గర్గ వత్స 'వాజాసే' 67 సంకృతి అజ వ్యాఘ్రపాత్ విదభృత్ ప్రాచీనయోగ [అగస్తి] పులస్తి చమస రేభ అగ్నివేశ శఙ్ఖ శట శక ఏక ధూమ అవట మనస్ ధనఞ్జయ వృక్ష విశ్వావసు జరమాణ లోహిత సంశిత బభ్రు వల్గు మణ్డు గణ్డు శఙ్కు లిగు గుహలు మన్తు మఙ్క్షు అలిగు జిగీషు మను తన్తు మనాయీ సూను కథక కన్థక ఋక్ష తృక్ష (వృక్ష) [తను] తరుక్ష తలుక్ష తణ్డ వతణ్డ కపికత కురుకత అనడుహ్ కణ్వ శకల గోకక్ష అగస్త్య కుణ్డినీ యజ్ఞవల్క పర్ణవల్క అభయజాత విరోహిత వృషగణ రహూగణ శణ్డిల వర్ణక (చణక) చులుక ముద్గల ముసల జమదగ్ని పరాశర జతూకర్ణ (జాతూకర్ణ) మహిత మన్త్రిత అశ్మరథ శర్కరాక్ష పూతిమాష స్థూరా అదరక (అరరక) ఏలాక పిఙ్గల కృష్ణ (లో) గోలన్ద ఉలూక తితిక్ష భిషజ(భిషక్)[భిష్ణజ] భడిత భణ్డిత దల్భ చేకిత చికిత్సిత దేవహూ ఇన్ద్రహూ ఏకలూ పిప్పలూ బృహదగ్ని [సులోహిన్] సులాభిన్ ఉక్థ కుటీగు - ఇతిగర్గాదిః.

**సూ : యఞఞోశ్చ 2-4-64.**

**వృ : గోత్రే యద్యఞన్తమఞన్తంచ తదవయవయో రేతయోర్లుక్ తత్కృతే బహుత్వే, నతు స్త్రియామ్. గర్గాః, వత్సాః.**

వ ఏ యఞఞోః (6-2) చ (అవ్య)

అను : గోత్రే (7-1) బహుషు (7-1) తేన (3-1) ఏవ (అవ్య) అస్త్రియామ్ (7-1) లుక్ (1-1)

అర్థ : గోత్రార్థమున విహితములగు యఞ్, అఞ్ ప్రత్యయము అంతమునం గల శబ్దముల అవయవములగు యఞ్ అఞ్ ప్రత్యయములకు, తత్కృతమైన బహుత్వమున్నపుడు, లుక్కు వచ్చును స్త్రీలింగమున రాదు ఉదా . గర్గాః వత్సాః

ఇవ గోత్రాపత్యము అనునర్థమున విధింపఁబడిన ప్రత్యయములగు యఞ్, అఞ్ అను ప్రత్యయములకు బహువచనమునందు లుక్కువచ్చును ఇట్లగుటలో కొన్ని నియమములు గలవు ఆ ప్రత్యయము అంతమునఁ గల శబ్దముల బహుత్వము ఆ ప్రత్యయాంతముచే నయినదియే కావలయును అనగా యఞ్, అఞ్ అను ప్రత్యయములు (గోత్రాపత్యము అనునర్థమున విధింపఁబడినవి) ఏశబ్దములకు విధింపఁబడునో బహువచనప్రత్యయముకూడ ఆశబ్దమునకే విధింపఁబడినది కావల యును స్త్రీలింగమునందు దీ లుక్కు కలుగదు

ఉదా : గర్గస్య గోత్రాపత్యాని పుమాంసః - గర్గునియొక్క గోత్రాపత్యము లయిన పురుషులు - గర్గ + జస్, యఞ్, (గర్గాదిభ్యో యఞ్) విభక్తికి లుక్కు గర్గ + య, దీనికి బహువచన ప్రత్యయము వివక్షితమగునపుడు, ఈ 'యఞ్' ప్రత్యయమునకు ప్రకృతసూత్రముచే లుక్కువచ్చును గర్గ + య + జస్ = జకారమిత్తు (చుటూ) గర్గాస్, గర్గాః ఈ గర్గశబ్దమునకు ప్రథమావిభక్తిలో రూపములు ఇట్లుండును గార్గ్యః - (ఏ) గార్గ్యౌ - (ద్వి) గర్గాః (బహు)

ఇట్లే వత్సస్య గోత్రాపత్యాని పుమాంసః, వత్సునియొక్క గోత్రాపత్యములగు పురుషులు - వత్స + జస్ + యఞ్, వత్స + యఞ్ + జస్, వత్స + జస్ = వత్సాః,

ఈ రెండు దాహరణములందును, యఞ్ ప్రత్యయమునకు లుక్కువిధింపఁ బడినది కావున దానివలననగు ఆదివృద్ధియును రాదు

ఈ యఞ్, అఞ్ ప్రత్యయములు యఞంత, అఞంతకృతములే కావలయు ననుటచే ప్రియగార్గ్యాః మున్నగుచోటులందు లుక్కురాదు ప్రియుఁడైన గార్గ్యుఁడు కలవారు అనునర్థమున బహుత్వము 'గార్గ్య' అను యఞంతముచే నేర్పడినదికాదు అనగా బహుత్వసంఖ్యలో మున్నవారు గరులుకారు గార్గ్యునియందు ప్రియత్వముగల ఇతర వ్యక్తులు. కావున బహుత్వమిచట అన్యపదార్థకృతము అగుటచే లుక్కురాదు.

స్త్రీలింగమున నీలుక్కు లేదమటచే 'గార్గీ - గార్గ్యౌ - గార్గ్యః' అను రూపమే యుండును.

అవ : పూర్వము గోత్రసంజ్ఞ తెలుపఁబడినది. అపత్యవ్యవహారము గలిగిన వ్యక్తులలో కొన్నిలక్షణములు గలవారికి 'యువ' సంజ్ఞ కలుగునని యీ క్రింది సూత్రము చెప్పుచున్నది.

సూ : జీవతి తు వంశ్యే యువా 4-1-163.

వృ : వంశ్యే పిత్రాదౌ జీవతి పౌత్రాదేర్యదపత్యం చతుర్థాది తద్యువసంజ్ఞమేవ స్యాత్.

ప వి . జీవతి (7-1) తు (అవ్య) వంశ్యే (7-1) యువా (1-1)

అను : అపత్యం (1-1) పౌత్ర ప్రభృతి (1-1)

అర్థ : వంశ్యులగు తండ్రిమున్నగువారు జీవించి యుండఁగా పౌత్రుఁడు మున్నగువారి సంతానమగు నాల్గవతరము వ్యక్త్యాదికము యువసంజ్ఞకమే యగును

వివ : వంశమనఁగా తన పుట్టుకకు కారణమైన తండ్రి, తాత మున్నగువారి పరంపర. అందు పుట్టినవాఁడు వంశ్యుఁడు అనఁగా తండ్రి, తాతమున్నగు వ్యక్తులు ఈ సూత్రమునందలి 'తు' అను అవ్యయము అవధారణార్థకము. ఇట్లు యువా, తు = యువసంజ్ఞకమే యగునని యర్థమేర్పడును వంశ్యుఁడైన తండ్రి మున్నగు వ్యక్తి జీవించియున్నచో పౌత్రుఁడు మున్నగు వారిసంతానమునకు 'యువ' అను సంజ్ఞయే యుండును కాని గోత్ర సంజ్ఞయుండదు రఘువు కుమారుఁడు, అజుఁడు, అజునికుమారుఁడు దశరథుఁడు, అతని పుత్రులు రామాదులు రామాదులు రఘువునకు నాల్గవతరమువారు రఘువు మనుమఁడగు దశరథునికి గోత్ర సంజ్ఞకలుగును దశరథపుత్రులగు రామాదులకు తండ్రి మున్నగువారు జీవించి యున్నచో గోత్రసంజ్ఞకలుగదు. యువసంజ్ఞ కలుగును వారు సజీవులుకానియెడల రామాదులకును గోత్ర సంజ్ఞ కలుగును. అట్లే రామాదుల పుత్రపౌత్రాదులకు గోత్ర యువసంజ్ఞలు పైనియమానుసారము గలుగుచుండును

ఇట్లు గోత్ర సంజ్ఞయు, యువ సంజ్ఞయు నొక్కవ్యక్తికే కలుగవని తాత్పర్యము.

అవ : ఈ 'యువ' సంజ్ఞ ఉత్తరసూత్రములో వ్యవహరింపఁబడుచున్నది.

సూ : గోత్రాద్యూన్యస్త్రియామ్ 4-1-94.

వృ : యూన్యపత్యే గోత్రప్రత్యయాన్తాదేవ ప్రత్యయస్స్యాత్ స్త్రియాం తు న యువసంజ్ఞా.

ప వి : గోత్రాత్ (5-1) యూని (7-1) అస్త్రియామ్ (7-1)

అను : తస్య (6-1) అపత్యమ్ (1-1) ప్రత్యయః

అర్థ : 'యువాపత్యము' అనునర్థమున గోత్రప్రత్యయాంతమునకే ప్రత్యయమగును స్త్రీత్వమున యువసంజ్ఞకలుగదు

వివ : గర్గుని మనుమఁడు గర్గునికి గోత్రాపత్యము. గర్గుని మనుమని మనుమఁడు, అనగా గర్గునినుండి అయిదవతరమువాఁడు, తనతండ్రియున్నగువాడు బ్రతికియుండగా గర్గునికి గోత్రాపత్యముగా వ్యవహరింపఁబడఁడు. యువాపత్యముగా వ్యవహరింపఁబడును. ఈ అయిదవతరము వ్యక్తిని (గర్గుని మనుమని మనుమనిని) తెలుపుటకు గర్గశబ్దముపై గోత్రాపత్యప్రత్యయము చేర్పవలయునా? లేక యువాపత్యప్రత్యయమును చేర్పవలయునా ? అనఁగా 'గర్గుని గోత్రపురుషుఁడు' అనునర్థమున నేర్పడిన యఞ్ ప్రత్యయాంతమగు 'గార్గ్య' అనునదియే బ్రతికియున్నతండ్రి గలిగినట్టి, గర్గుని మనుమనిమనుమనిని బోధించునా ? లేక ఏ ప్రత్యయము 'గార్గ్య' అనుదానికి చేర్పవలయునా? అను సందేహము నీ సూత్రము తొలఁగించును యువసంజ్ఞగల ఆ అయిదవతరము వ్యక్తిని తెలుపుటకు గోత్రాపత్యప్రత్యయాంతమునకు మరల యువాపత్యప్రత్యయము చేరుననియు నరాసరి మూలపురుషుని బోధించుశబ్దమునుండి యువాపత్యప్రత్యయము చేరదనియు నీసూత్రము యొక్క భావము వాస్తవ గోత్రాపత్యప్రత్యయాంతముపై యువాపత్యప్రత్యయము చేర్పవచ్చును గాని గోత్రాపత్యప్రత్యయము [illegible]యొకటి చేరదని తాత్పర్యము అపత్యము స్త్రీ అయినచో యువసంజ్ఞకలుగదు

అవ : ఈ పైనియమము క్రిందిసూత్రమునందు సమన్వితమగుచున్నది

సూ : యఞిఞోశ్చ 4-1-101

వృ : గోత్రే యౌ యఞిఞౌ తదన్తాత్ ఫక్.

ప వి : యఞిఞోః (6-2) చ (అవ్య)

అను : గోత్రే (7-1) ఫక్ (1-1) ప్రత్యయః (1-1) తద్ధితః (1-1)

అర్థ : గోత్రార్థమున వచ్చిన యఞ్, ఇఞ్ ప్రత్యయము అంతమునఁగలవానికి ఫక్ ప్రత్యయము చేరును.

వివ : 'గోత్రాపత్యము' అనునర్థమున చేరిన యఞ్, ఇఞ్ అను ప్రత్యయములంతమునఁ గల సమర్థములగు షష్ఠ్యంతరూపములకు వాని సంతానము అను నర్థమున 'ఫక్' అను తద్ధిత ప్రత్యయము చేరును. గోత్రాపత్యమను నర్థమున ప్రత్యయమొకటి చేరినపిదపనదే యర్థమున మఱల ప్రత్యయము చేరదని 'ఏకో గోత్రే' అను నియమము ఉండుటచే, గోత్రాపత్యార్థమున విహితములగు యఞ్, ఇఞ్ ప్రత్యయాంతములకు విధింపఁబడిన యీ ఫక్ ప్రత్యయము యువాపత్యార్థమున నగు ననుట సిద్ధమగును. గోత్రమనగా మనుమఁడు, మునిమనుమఁడు మున్నగు వ్యక్తులు. 'యువ' అనగా బ్రదికియున్న తండ్రిగల మూఁడవ మనుమఁడు మున్నగు వ్యక్తులు.

ఉదా. గర్గస్య గోత్రాపత్యమ్ - గర్గుని మనుమఁడు అనునర్థమున 'గర్గస్య' అను షష్ఠ్యంతమునకు గర్గాదిభ్యో యఞ్ అను సూత్రముచే యఞ్ ప్రత్యయము రాఁగా, గర్గ + యఞ్, ఆదివృద్ధి, అకారలోపములు కలిగి, 'గార్గ్య' అగును. 'గార్గ్యస్య పౌత్రః' అనునర్థమున ఆ వ్యక్తికి యువసంజ్ఞయుండిన యెడల (అనగా అతని తండ్రియో తాతయో జీవించియున్నపుడు) గార్గ్యశబ్దమునకు ప్రకృత సూత్రముచే ఫక్ ప్రత్యయము చేరును. గార్గ్య + ఙస్, ఫక్ అనియుండ ప్రాతిపదికత్వము గలిగి సుప్పునకు లుక్కు వచ్చును. గార్గ్య + ఫక్

ఆపై యుదాహరణమున క్రిందిసూత్రముచే కార్యవిశేషము విధింపఁబడుచున్నది.

**సూ : ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనామ్**
**7-1-2**

**వృ : ప్రత్యయాదేః ఫస్య ఆయన్, ఢస్యేయ్, ఖస్య ఈన్, ఛస్య ఈయ్, ఘస్య ఇయ్ ఏతే స్యుః. గర్గస్య యువాపత్యం గార్గ్యాయణః, దాక్షాయణః**

ప వి : ఆయనేయీనీయియః (1-3) ఫఢఖఛఘామ్ (6-3) ప్రత్యయాదీనామ్ (6-3)

అర్థ : ప్రత్యయముయొక్క ఆదివర్ణమగు ఫకారమునకు 'ఆయన్', ఢకారమునకు 'ఏయ్,' ఖకారమునకు 'ఈన్,' ఛకారమునకు 'ఈయ్', ఘకారమునకు 'ఇయ్' అను నాదేశములగును. ఉదా. గర్గుని యువాపత్యము గార్గ్యాయణః, అట్లే దాక్షాయణః.

వివ. ఆయనేయీనీయియః అనుపదమునందు ఆయన్, ఏయ్, ఈన్, ఈయ్, ఇయ్ అను నైదు ఆదేశములు చెప్పబడినవి ప్రత్యయము అనుపేరు గలవానియొక్క మొదటనున్న ఫకారాదివర్ణముల కీ యాదేశములు క్రమముగా నగును ఫ=ఆయన్, ఢ=ఏయ్, ఖ = ఈన్, ఛ = ఈయ్, ఘ = ఇయ్ అను తీరున నివి యాదేశములగును దీనిచే గార్గ్య + ఫక్, అనుచోట, ఫకారమునకు 'ఆయన్' ఆదేశము ఫలోని అకారము ఆయన్ అనుదానికి చేయును ఫ్ + అ = ఆయన్ + అ గార్గ్య + ఆయన్ + అ (క్) కకారమిత్తు నకారమునకు 'అట్కుప్వాఙ్ను మ్వ్యవాయేఽపి' అనుసూత్రముచేణత్వము గార్గ్యాయణ + సు= గార్గ్యాయణః గర్గుని మనుమని మనుమడనియు, వానితండ్రియో, తాతయో, ముత్తాతయో జీవించియుండెననియు నీపదమున కర్థము పిత్రాదులు మృతులైన యెడల నీతనికి గోత్రసంజ్ఞమాత్రమే యుండును గావున గార్గ్యః' అనియే యగును గార్గ్యస్య పుత్రః' అనునర్థమున గోత్రముకాని యువకాని వివక్షింపబడలేదు కావున వక్ష్యమాణముగు 'ఇఞ్' ప్రత్యయము చేరి 'గార్గిః' యగును కావున గర్గునియువాపత్యము అనునర్థముననే గార్గ్యాయణః' అను రూప మేర్పడును

ఇట్లే దక్షస్య యువాపత్యమ్' - దక్షునియువాపత్యము - దక్షుని మనుమని మనుమడు (బ్రదికియున్న పిత్రాదులుగలవాడు) అనునర్థమున దాక్షి' అను ఇఞ్ ప్రత్యయాంతముపై ఫక్' ప్రత్యయము (ఇఞ్ ప్రత్యయము అనంతర సూత్రముచే వచ్చును) దాక్షి + ఫక్, కకారమిత్తు, ఫకారమునకు (ఫ) 'ఆయన్' ఆదేశము, దాక్షి + ఆయన, యస్యేతి చ - ఇకారలోపము, దాక్ష్ + ఆయన, షకారయోగముచే నకారమునకు ణకారాదేశము (అట్కుప్వాఙ్) దాక్షాయణ + సు = దాక్షాయణః పిత్రాదులు మృతులైనచో దాక్షిః అనియే యగును

**సూ : అత ఇఞ్ 4.1-95**

**వృ : అపత్యేఽర్థే దాక్షిః.**

ప వి . అతః (5-1) ఇఞ్ (1-1)

అను : సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య) తస్య (6-1) అపత్యమ్ (1-1) ప్రత్యయః (1-1) తద్ధితః (1-1)

అర్థ : అదంతమై సమర్థమైన షష్ఠ్యంతపదమునకు అపత్యార్థమున ఇఞ్ ప్రత్యయము వైకల్పికముగా నగును ఉదా . దాక్షిః.

వివ : 'అతః' అనునది 'ప్రథమాత్' అనుదానికి విశేషణము కావున తదంత విధిచే 'అదంతమైన' అనునర్థము కలుగును సంధ్యాదికార్యములన్నియు జరిగిన షష్ఠ్యంతపదము హ్రస్వ అకారము అంతమునఁగలదియగుచో దానికి, అతని సంతానము అనునర్థమున 'ఇఞ్' అను ప్రత్యయము చేరును ఇందు ఞకారమిత్తు కావున ఆదివృద్ధి కలుగును

ఉదా దక్షస్య అపత్యం పుమాన్ - దక్షునికుమారుఁడు - దక్ష+ఙస్, ఇఞ్, ప్రాతిపదిక సంజ్ఞ, విభక్తిలోపము, దక్ష + ఇ, ఆది వృద్ధి, దాక్ష + ఇ, యస్యేతి చ - అకారలోపము, దాక్షి = దాక్షి + సు = దాక్షిః (దీనినుండియే పైసూత్రమునఁ జూపఁబడిన దాక్షాయణః' అనురూపమేర్పడినది) దాశరథిః' మున్నగురూపము లిట్లే యేర్పడును

అపి . పైసూత్రముచే ఇఞ్ ప్రత్యయమురాని 'బాహు' మున్నగువానికిని అపత్యార్థమున ఇఞ్ ప్రత్యయము వచ్చుటను ఈ క్రింది సూత్రము విధించుచున్నది

**సూ : బాహ్వాదిభ్యశ్చ 4-1-96**

**వృ : బాహవిః, ఔడులోమిః ఆకృతిగణోఽయమ్.**

ప ౨ . బాహ్వాదిభ్యః (5-3) చ (అవ్య)

అను సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య) తస్య (6-1) అపత్యమ్ (1-1) ఇఞ్ (1-1) ప్రత్యయః (1-1) తద్ధితః (1-1)

అర్థ . బాహుమున్నగువానికిని అపత్యార్థమున ఇఞ్ ప్రత్యయము వచ్చును ఉదా బాహవిః, ఔడులోమిః ఇది ఆకృతిగణము

విపి . పైసూత్రమున ఇఞ్ ప్రత్యయము అదంతములకు మాత్రమే విధింపఁబడినది దానిచే ఇఞ్' ప్రత్యయము సిద్ధింపని బాహు, ఉడులోమన్ మున్నగువాని షష్ఠ్యంతములకు అపత్యార్థమున 'ఇఞ్' ప్రత్యయ మీ సూత్రముచే కలుగును

ఉదా : బాహోరపత్యం పుమాన్. బాహువనువాని పుత్త్రుఁడు. బాహు + ఙస్ + ఇఞ్, ఞకారమిత్తు, విభక్తిలోపము ఆదివృద్ధి కలిగి 'బాహు + ఇ' అగును ఆకారమునకు వచ్చు వృద్ధి ఆకారమే ఓర్గుణః' అనుసూత్రముచే ఉకారము నకు గుణము బాహో + ఇ, అవాదేశము (ఏచోఽయవాయావః) బాహవ్ + ఇ= బాహవి + సు=బాహవిః

ఉడులోమ్నః అపత్యం పుమాన్ - ఉడులోమునికుమారుడు (ఉడువులవలె నక్షత్రములు, అట్టి రోమములు కలవాడు ఉడులోముడు) ఉడులోమన్ + ఙస్, ఇఞ్ (ఉడులోమన్ శబ్దము నకారాంతము రాజన్ వంటిది), విభక్తిలోపము ఉడులోమన్ + ఇఞ్, తద్ధితేష్వచామాదేః అనుసూత్రముచే ఆద్యక్షరమగు ఉకారము నకు వృద్ధి ఔకారము, ఔడులోమన్ + ఇ, 'నస్తద్ధితే' అనుసూత్రముచే టి లోపము ఔడులోమ్ + ఇ ఔడులోమి + సు = ఔడులోమిః

**బాహ్వాదిగణము** : బాహు ఉపబాహు ఉపవాకు నివాకు శివాకు వటాకు ఉపనిన్దు (ఉపబిన్దు) వృషలీ వృకలా చూడా బలాకా మూషికా కుశలా భగలా (ఛగలా) ధ్రువకా [ధువకా] సుమిత్రా దుర్మిత్రా పుష్కరసద్ అనుహరత్ దేవశర్మన్ అగ్నిశర్మన్ [భద్రశర్మన్ సుశర్మన్] కునామన్ (సునామన్) పఞ్చన్ సప్తన్ అష్టన్ అమితౌజసః సలోపశ్చ 58 సుధావత్ ఉదఞ్చు శిరస్ మాష శరావిన్ మరీచీ క్షేమవృద్ధిన్ శృఙ్ఖలతోదిన్ ఖరనాదిన్ నగర - మర్దిన్ ప్రాకారమర్దిన్ లోమన్ అజీగర్త కృష్ణ యుధిష్ఠిర అర్జున సామ్బ గద ప్రద్యుమ్న రామ [ఉదఙ్క]. ఉదకః సంజ్ఞాయామ్, 60 సంభూయోఽమ్భసోః సలోపశ్చ 61 ఆకృతి గణోఽయమ్ తేన సాత్వకిః జాఙ్ఘిః ఐన్ద్రశర్మిః ఆజధేనవిః ఇత్యాది ఇతిబాహ్వాదిః.

సూ : అనృష్యానన్తర్యే బిదాదిభ్యోఽఞ్ 4-1-104.

వృ : యే త్వత్ర నృషయస్తేభ్యోఽపత్యాన్తరాపత్యేఽప్యత్రతు గోత్రే. బిదస్య గోత్రం బైదః, బైదౌ. బిదాః. పుత్రస్యాపత్యం పౌత్రః, పౌత్రౌ, పౌత్రాః. ఏవంగాహిత్రాదయః.

ప వి అనృషి (పంచమిలోపించినపదము) ఆనన్తర్యే (7-1) బిదాదిభ్యః (5-3) అఞ్ (1-1)

అను సమర్థానాం ప్రథమాద్వా, గోత్రే (7-1) తస్య (6-1) అపత్యమ్ (1-1) ప్రత్యయః (1-1) తద్ధితః (1-1)

అర్థ : బిదాదులలో ఋషివాచకములు కాని వానికి అనంతరాపత్యార్థమునను, ఋషివాచకములకు గోత్రార్థమునను 'అఞ్' ప్రత్యయము వచ్చును ఉదా : బిదస్యగోత్రాపత్యమ్, బైదః, బైదౌ, బిదాః పుత్రస్య ...త్రః, పౌత్రౌ, పౌత్రాః

వివ : బిదాదిగణములో బిద, కశ్యప పుత్ర, దుహితృమున్నగు ఋషివాచకములు

'అనంతర్యే' అను పదమునకు అనంతరము అని యర్థము అది అపత్యశబ్దముతో నన్వయించి 'అనంతరాపత్యార్థమున' అనునర్థము నిచ్చును అంతరమనగా వ్యవధానము, అడ్డు అదిలేనిది అనంతరము ప్రకృతము అపత్యాధికారము కనుక దేనితో అంతరములేనిది అను ఆకాంక్షకు తరములతో అంతరములేనిది అనునర్థము సిద్ధించును తండ్రికి కుమారునికిని తరములలో వ్యవధానములేదు తాతకు మనుమనికి తండ్రి తరము వ్యవధానము అనంతర్యే అనగా 'తరములలో నెట్టి అడ్డులేని' అని అర్థము 'కొడుకు, కూతురు' అనునర్థమున - అని భావము ఇది పంచమీవిభక్తి లోపించిన పదము 'అనృషి' అనుదానికి సంబంధించిన పదము కావున బిదాదిగణములోని ఋషివాచకములు కాని వానికి వానికొడుకు, కూతురు అనునర్థమునందును, పరిశేష న్యాయమున ఋషివాచకములకు గోత్రాపత్యము అనునర్థమునను అఞ్' ప్రత్యయము చేయునని ఫలితార్థము సిద్ధించినది

ఉదా · బిదస్య గోత్రాపత్యమ్ బిదశబ్దము ఋషిని తెలుపునది కావున గోత్రార్థమున అఞ్ ప్రత్యయమగును బిద + ఙస్, అఞ్, విభక్తిలోపము ఞిత్తగుటచే ఆదివృద్ధి, బైద + అ, యస్యేతిచ' అకారలోపము బైద్ + అ = బైద + సు = బైదః

ఈ ప్రత్యయము గోత్రాపత్యార్థమున వచ్చినది అగుటచే ఇది అంతమునందు గల దానియొక్క బహుత్వము వివక్షితమగునప్పుడు, ఈ ప్రత్యయమునకు 'యఞఞోశ్చ' అను సూత్రముచే లుక్కువచ్చును బిద + అఞ్ + జస్ - బిద + జస్ = బిద + అస్, బిదాస్ బిదాః - ఈ విషయము తెలుపుటకే ప్రథమావిభక్తి రూపములు మూడును వృత్తిలో ఉదాహరింపబడినవి బైదః (ఏ) బైదౌ (ద్వి) బిదాః (బహు) బైదః - బిదుని మనుమడు మున్నగువాడు - బిదాః - బిదుని మనుమలు మున్నగువారు

ఋషివాచకములు కాని 'పుత్ర' మున్నగు శబ్దములకు అతని పుత్రుడు లేక 'పుత్రిక' అనునర్థమున మాత్రమే యీ ప్రత్యయము చేయును

ఉదా . పుత్రస్య పౌత్రః - పుత్రుని పిల్లవాడు పుత్ర + ఙస్ + అఞ్ ప్రాతిపదికత్వము, విభక్తిలోపము, పుత్ర + అ, ఆదివృద్ధి, పౌత్ర + అ, యస్యేతిచ- అకారలోపము, పౌత్ర్ + అ = పౌత్ర + సు = పౌత్రః దీనికి బహువచనమున 'అఞ్' ప్రత్యయము లోపించదు ఏలయన నిది గోత్రాపత్యార్థమున వచ్చినది కాదు యఞఞోశ్చ అను సూత్రమునలోపవిధి, గోత్రాప్రత్యార్థమున విధింపబడిన యఞ్, అఞ్ ప్రత్యయములకే గోత్రసంజ్ఞ మనుమడు మొదలుకొని మూడవ

తరము మున్నగువారికే యుండును గాని పుత్త్రిని యుండదు ఈ విషయమును తెలుపుటకే వృత్తిలో పౌత్రః, పౌత్రౌ, పౌత్రాః అని ప్రథమావిభక్తియందలి మూడువచనములందును రూపము ఉదాహరింపబడినవి

ఇట్లే దుహితుః పుత్త్రః – కూతుకొడుకు, దుహితృ + ఙస్, అణ్, దుహితృ + అ, ఆదివృద్ధి, దౌహితృ + అ, యణాదేశము దౌహిత్ర + సు = దౌహిత్రః మొదలగునవి యగును

బిదాదిగణము : బిద ఉర్వ కశ్యప కుశిక భరద్వాజ ఉపమన్యు కిలాత కందర్ప (కిందర్భ) విశ్వానర ఋషిషేణ (ఋష్టిషేణ) ఋతభాగ హర్యశ్వ ప్రియక ఆపస్తమ్బ కూచవార శరద్వత్ శునక (శునక్) ధేను గోపవన శిగ్రు బిందు [భోగక] భాజన [శమిక] అశ్వావతాన శ్యామాక శ్యామక [శ్యావలి] శ్యాపర్ణ హరిత కిందాస వహ్యస్క అర్కలూష (అర్కలూష) వధ్యోగ విష్ణువృద్ధ ప్రతిబోధ రథిత రథీతర (రథన్తర) గవిష్ఠిర నిషాద [శబర అలస] మఠర (మృదాకు) సృదాకు మృదు పునర్భూ పుత్ర దుహితృ ననాన్దృ పరస్త్రీపరశుం చ 66 ఇతి బిదాదిః

సూ : శివాదిభ్యోఽణ్ 1-4-112.

వృ : అపత్యే శైవః గాఙ్గః.

ప వి శివాదిభ్యః (5-3) అణ్ (1-1)

అను. సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1)

అర్థ : శివ మున్నగు సమర్థ షష్ఠ్యంతములకు 'సంతానము' అనునర్థమున అణ్ ప్రత్యయము చేరును ఉదా శైవః, గాఙ్గః

వివ అతనియొక్క సంతానము అనునర్థమున శివ మున్నగు షష్ఠ్యంతములకు 'అణ్' అను తద్ధితప్రత్యయము వైకల్పికముగా వచ్చును ఇది గోత్రము, యువ అను నర్థమున గాక సామాన్యాపత్యార్థమున శబ్దములకు వచ్చును ఇందు ణకారము ఇత్తు కావున వృద్ధి వచ్చునపుడు ఆదివృద్ధి వచ్చును.

ఉదా. శివస్యాపత్యం పుమాన్, శివునియొక్క సంతానము శివ + ఙస్ + అణ్ తద్ధితాంతమగుటచే ప్రాతిపదికసంజ్ఞ కలిగి విభక్తిలోపించును శివ+అ, ఆదివృద్ధి, శైవ + అ, యస్యేతిచ, అకారలోపము, శైవ్+అ=శైవ+సు=శైవః.

గఙ్గాయాః అపత్యం పుమాన్ – గంగయొక్క కుమారుడు, గఙ్గా + ఙస్, అణ్ విభక్తిలోపము, ఆదివృద్ధి, అకారలోపము, గాఙ్గ్ + అ = గాఙ్గ + సు = గాఙ్గః

**శివాదిగణము** శివ ప్రోష్ఠ ప్రోష్ఠిక చణ్డ జమ్భ భూరి దణ్డ కుఠార కకుభ్ (కకుభా) అనభిమ్లాన కోహిత సుఖ సన్ధి ముని కకుత్స్థ కహోడ కోహడ కహూయ కహయ రోధ కపిఞ్జల (కుపిఞ్జల) ఖఞ్జన వతణ్డ తృణకర్ణ క్షీరహ్రద జలహ్రద పరిల [పథిక] పిష్ట హైహయ (పార్షికా) గోపికా కపిలికా జటిలికా బధిరికా మఞ్జీరక (మఞ్జిరక) వృష్ణిక ఖఞ్జార ఖఞ్జాల (కర్మార) రేఖ లేఖ ఆలేఖన విశ్రవణ రవణ వర్తనాక్ష గ్రీవాక్ష (విటప పిటక) పిటాక తృక్షాక నభాక ఊర్ణనాభ జరత్కారు (వృథా ఉత్క్షేప) పురోహితికా సురోహితికా సురోహికా ఆర్యశ్వేత (ఆర్యశ్వేత) సుపిష్ట మసురకర్ణ మయూరకర్ణ (ఖర్జూరకర్ణ) కదూరక తక్షన్ ఋష్టిషేణ గఙ్గా విపాశ యస్క లహ్య ద్రుహ్య అయస్థూణ తృణకర్ణ (తృణ కర్ణ) పర్ణ భలన్దన విరూపాక్ష భూమి ఇలా సపత్నీ. 'ద్వ్యచో నద్యాః' 72 'త్రివేణీ త్రివణం చ' 73. ఇతి శివాదిః.

**సూ : ఋష్యన్ధకవృష్ణికురుభ్యశ్చ 4-1-114.**

**వృ : ఋషిభ్యః – వాసిష్ఠః, వైశ్వామిత్రః అన్ధకేభ్యః – శ్వాఫల్కః వృష్ణిభ్యః – వాసుదేవః, కురుభ్యః – నాకులః సాహదేవః**

ప. వి : ఋష్య....కురుభ్యః (5-3) చ (అవ్య).

అను : సమర్థానాం ప్రథమాద్వా, ప్రత్యయః (1-1) తద్ధితః (1-1) అణ్ (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1)

అర్థ : ఋషివాచకములకు, అంధక వృష్ణికురు వంశ్యులను దెలుపువానికిని అపత్యార్థమున అణ్ ప్రత్యయము వచ్చును. ఉదా : ఋషివాచకములకు – వాసిష్ఠః, వైశ్వామిత్రః, అన్ధక వంశ్యవాచకములకు – శ్వాఫల్కః, వృష్ణివాచకములకు – వాసుదేవః, కురువాచకములకు – నాకులః సాహదేవః

వివ : ఋషులనగా వేదమంత్రములను దర్శించినవారు. అన్ధక, వృష్ణి, కురు అనునవి వంశములు ఇచట ఈ శబ్దములచే ఆ వంశములందు పుట్టినవ్యక్తులు గ్రహింపబడుదురు షష్ఠ్యంతములగు వీనికి, వారిసంతానము అనునర్థమున 'అణ్' ప్రత్యయము చేయును. ప్రత్యయము ణిత్తగుటచే ఆదివృద్ధి వచ్చును.

ఉదా : ఋషివాచకములకు:- వసిష్ఠస్య అపత్యం పుమాన్, వసిష్ఠమహర్షి కుమారుఁడు, వసిష్ఠ + ఙస్, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, అకారలోపము, వాసిష్ఠ్ + అ=వాసిష్ఠ + సు=వాసిష్ఠః.

విశ్వామిత్రస్య అపత్యం పుమాన్, విశ్వామిత్రుని కుమారుఁడు, విశ్వామిత్ర + ఙస్, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఇ > ఐ), అకారలోపము వైశ్వామిత్ర్ + అ=వైశ్వామిత్ర + సు=వైశ్వామిత్రః

అన్ధకవంశ్యవాచకములకు :- శ్వఫల్కస్య అపత్యం పుమాన్ - శ్వఫల్కుఁడను అంధకవంశము వానికుమారుఁడు, శ్వఫల్క + ఙస్ + అణ్, విభక్తి లోపాదికము శ్వాఫల్క్ + అ = శ్వాఫల్క + సు = శ్వాఫల్కః

వృష్ణి వంశ్యవాచకములకు . వసుదేవస్య అపత్యం పుమాన్, వసుదేవుఁడను వృష్ణివంశ్యుని కుమారుఁడు, వసుదేవ + ఙస్, అణ్, వాసుదేవః

కురువంశ్యవాచకములకు .- నకులస్య అపత్యం పుమాన్, నకులుని కుమారుఁడు, నకుల + ఙస్ + అణ్ - నాకులః (నకులుఁడు కురువంశ్యుఁడు)

సహదేవస్య అపత్యం పుమాన్, సహదేవ + ఙస్, అణ్ - సాహదేవః, (సహదేవుఁడును కురువంశ్యుఁడే) విభక్తిలోపము, ఆదివృద్ధి, తుదిఅకారలోపము - అనునవి పై ఉదాహరణము లన్నింటియందును సాధారణములు

సూ : మాతురుత్సంఖ్యాసంభద్ర పూర్వాయాః 4-1-115

వృ : సంఖ్యాదిపూర్వస్య మాతృశబ్దస్య ఉదాదేశఃస్యాదణ్ ప్రత్యయశ్చ. ద్వైమాతురః, షాణ్మాతురః, సాంమాతురః, భాద్ర మాతురః

ప వి : మాతుః (6-1) ఉత్ (1-1) సంఖ్యాసంభద్రపూర్వాయాః (6-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తస్య (6-1) అపత్యమ్ (1-1)

అర్థ : సంఖ్యావాచకమును, సమ్, భద్ర అనునవియు పూర్వముగాఁగల జననీ వాచకమగు మాతృశబ్దమునకు అపత్యార్థమున అణ్ ప్రత్యయమును, ఉదాదేశము నగును. ఉదా : ద్వైమాతురః మొ॥ వి

వివ : సంఖ్యావాచకములనగా ఏక, ద్వి మొ॥వి 'సమ్' అనునది ప్రాదులలో నొకటి. భద్ర అనునది ఒకశబ్దము. ఇవి పూర్వమునఁ గల మాతృ శబ్దమునకు, ఆమెయొక్క సంతానము అనునర్థమున అణ్ ప్రత్యయము వచ్చునపుడు

తుదియున్న ఋకారముయొక్క స్థానమున హ్రస్వఉకారము (ఉత్) వచ్చును. 'సంఖ్యాసంభద్రపూర్వాయాః' అను స్త్రీలింగగ్రహణమువలన నిచటి మాతృశబ్దము తల్లి యనునర్థముగల స్త్రీలింగమే యగుట స్పష్టమైనది లేనిచో 'కొలుచువాఁడు' అను నర్థముగల పుంలింగశబ్దము కూడ గ్రహింపఁబడవలసి వచ్చును.

ఉదా : ద్వయోః మాత్రోః అపత్యం పుమాన్ - ఇద్దఱుతల్లులకుమారుఁడు ద్వి + ఓస్, మాతృ + ఓస్, అణ్, (ఇచట, ద్వి, మాతృశబ్దములకు 'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' అనుసూత్రముచే సమాసము. క్రింది యుదాహరణము లందును అదియే సమాసవిధాయకసూత్రము) ద్విమాతృ + అణ్, హ్రస్వఉకారాదేశము ఈ ఉకారము ఋకారస్థానమున విధింపఁబడినదగుటచే రపరముగా వచ్చును (ఉరణ్ రపరః) ద్విమాత్ + ఉర్ + అ, ఆదివృద్ధి, ద్వైమాతుర + సు= ద్వైమాతురః (వినాయకుఁడు) ఇది సంఖ్యాపూర్వమున కుదాహరణము.

షణ్ణాం మాతౄణామ్ అపత్యం పుమాన్ - ఆరుగురు తల్లుల తనయుఁడు షష్ + ఆమ్, మాతృ + ఆమ్ + అణ్, విభక్తిలోపము షకారమునకు జశ్త్వము, షడ్ + మాతృ + అ, అనునాసికసంధి, షణ్మాతృ + అ, ఉదాదేశము షణ్మాతుర్ + అ, ఆదివృద్ధి, షాణ్మాతుర + సు = షాణ్మాతురః (కుమారస్వామి) ఇదియు సంఖ్యాపూర్వమున కుదాహరణము

సమీచీనా మాతా సంమాతా - సమీచీనురాలగుతల్లి, తస్యాః అపత్యమ్, ఆమె యొక్క కుమారుఁడు, సంమాతృ + అణ్, ఉదాదేశము సంమాతుర్ + అ, ఆదివృద్ధి, సాంమాతుర + సు=సాంమాతురః

భద్రమాతుః అపత్యం పుమాన్ - భద్రయైనతల్లియొక్క పుత్త్రుఁడు. భద్రమాతృ + అణ్, ఉదాదేశము, భద్రమాతుర్ + అ, ఆదివృద్ధి, భాద్రమాతుర + సు = భాద్రమాతురః.

సూ : స్త్రీభ్యో ఢక్ 4-1-120

వృ : స్త్రీప్రత్యయాన్తేభ్యో ఢక్. వైనతేయః.

ప వి : స్త్రీభ్యః (5-3) ఢక్ (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1)

అర్థ . స్త్రీ ప్రత్యయాంతములకు అపత్యార్థమున ఢక్ ప్రత్యయము చేరును

ఉదా : వైనతేయః

వివ : ఇచట స్త్రీ శబ్దముచే టాప్, డాప్, చాప్, ఙీప్, ఙీష్, ఙీన్ ఇత్యాది స్త్రీప్రత్యయములు గ్రహింపఁబడవలయును ప్రత్యయగ్రహణపరిభాషచే అవి అంతమునఁగల రూపములు గ్రహింపఁబడును సంఖ్యాదికార్యములు చేయఁబడిన షష్ఠ్యంతములగు స్త్రీప్రత్యయాంతములకు, ఆమెయొక్క కుమారుఁడు లేక పుత్రి అను నర్థమున 'ఢక్' అను తద్ధిత ప్రత్యయము చేయును ఇందు కకారమిత్తు. దానివలన స్త్రీప్రత్యయాంతరూపముయొక్క ఆదియచ్చునకు వృద్ధివచ్చును ఢకారమునకు 'ఆయనేయీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్' అను సూత్రముచే 'ఏయ్' అనునాదేశము వచ్చును అది 'ఢ'లోని అకారముతో కలసి 'ఏయ' అగును.

ఉదా : వినతాయాః అపత్యం పుమాన్ – వినతయొక్క కుమారుఁడు వినతా శబ్దము 'టాప్' అను స్త్రీ ప్రత్యయమంతమందుఁ గలరూపము వినతా + ఙస్, ఢక్, ప్రాతిపదికసంజ్ఞ (కృత్తద్ధితసమాసాశ్చ) విభక్తిలోపము వినతా + ఢ (క్), 'ఏయ్' ఆదేశము, ఆదివృద్ధి (ఇ > ఐ) వైనతా + ఏయ, 'యస్యేతిచ' సూత్రముచే ఆకారలోపము వైనత్ + ఏయ = వైనతేయ + సు = వైనతేయః (గరుత్మంతుఁడు).

సూ : కన్యాయాః కనీన చ 4 1-116.

వృ : చాదణ్ కానీనో వ్యాసః కర్ణశ్చ.

ప వి . కన్యాయాః (6-1) కనీన (ప్రథమా విభక్తి లోపించిన పదము) చ (అవ్య)

అను : తస్య (6-1) అపత్యమ్ (1-1) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1)

అర్థ : కన్యాశబ్దమునకు, ఆమెయొక్క కుమారుఁడు అనునర్థమున కనీన అను నాదేశము కూడ వచ్చును 'కూడ' అనుటచే అణ్ ప్రత్యయము నగును కానీనుఁ డనగా వ్యాసుఁడును, కర్ణుఁడును

వివ : ఇచట 'కన్యా' శబ్దమునకు అవివాహితయగు స్త్రీ అని యర్థము 'కన్యయొక్క సంతానము' అనునర్థమున షష్ఠ్యంతమగు కన్యాశబ్దమునకు అణ్ ప్రత్యయము చేయును అది చేయునపుడు 'కన్యా' శబ్దమునకు 'కనీన' అను నాదేశము కూడ వచ్చును ఇది అనేక వర్ణాదేశమగుటచే కన్యాశబ్దమును మొత్తముగా తొలఁగించి వచ్చును. (అనేకాల్ శిత్సర్వస్య) ఇది 'స్త్రీభ్యోఢక్' అనుసూత్రమునకు అపవాదము. అనగా కన్యాశబ్దము కూడ స్త్రీ ప్రత్యయాంతమే కనుక ఆసూత్రముచే 'ఢక్' ప్రత్య

యము ప్రాప్తించుచుండగా దీనిచే అణ్ ప్రత్యయము విధింపబడినది. ణిత్తగుటచే ఆదివృద్ధి యగును.

ఉదా : కన్యాయాః అపత్యం పుమాన్ - కన్యయొక్క కుమారుఁడు - కన్యా + ఙస్, అణ్, విభక్తిలోపము, కనీన ఆదేశము, కనీన + అ, ఆదివృద్ధి, కానీన + అ, యస్యేతిచ అకారలోపము, కానీన్ + అ, కానీన + సు = కానీనః, అవివాహితయగు సత్యవతికి పరాశర మహర్షివలన నుదయించుటవలన వ్యాసుఁడును, కన్యయగు కుంతీదేవికిఁ బుట్టుటవలన కర్ణుఁడును కానీనులు.

## సూ : రాజశ్వశురాద్యత్ 4-1-137

ప ని : రాజశ్వశురాత్ (5-1) యత్ (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1)

వివ : సమర్థములై షష్ఠ్యంతములైన రాజన్, శ్వశురశబ్దములకు, 'వాని యొక్క అపత్యము' అనునర్థమున 'యత్' అను తద్ధిత ప్రత్యయము చేరును ఇందు తకార మిత్తు

అవ : పై సూత్రమునందలి రాజశబ్దమున నొకనియమము చెప్పఁబడు చున్నది.

## వా : రాజ్ఞో జాతావేవేతి వాచ్యమ్ (వా 2627)

ప ని : రాజ్ఞః (5-1) జాతౌ (7-1) ఏవ (అవ్య) ఇతి (అవ్య) వాచ్యమ్ (1-1)

వివ : రాజశబ్దమునకు జాతిఅర్థమైనపుడే పై సూత్రముచే విధింపఁబడిన యత్ ప్రత్యయము వచ్చునని చెప్పఁదగును అనగా రాజన్ శబ్దమునకు యత్ ప్రత్యయము చేరఁగా నేర్పడు సముదాయముచేత జాతివాచ్యము కావలయునని తాత్పర్యము ఇది అపత్యాధికారమగుటచే కేవలము 'రాజుయొక్క సంతానము' అనునర్థము కాక క్షత్రియ జాతిపురుషుఁడు' అనునర్థము ఈ ప్రత్యయాంతముచే సిద్ధింపవలయును

ఉదా : రాజ్ఞఃఅపత్యం పుమాన్, రాజన్ + ఙస్ + యత్, విభక్తిలోపము. 'రాజన్ + య' అనియుండ 'నస్తద్ధితే' అను సూత్రముచే టిలోపము ప్రాప్తమగు చున్నది. ఈ క్రింది సూత్రముచే నది వారింపఁబడుచున్నది.

## తద్ధితాధికార ప్రకరణమ్

సూ : యే చాభావకర్మణోః 6-4-168

వృ : యాదౌ తద్ధితే అన్ ప్రకృత్యాస్యాన్నతు భావ కర్మణోః. రాజన్యః.

ప. వి : యే (7-1) చ (అవ్య) అభావకర్మణోః (7-2)

అను : తద్ధితే (7-1) అన్ (1-1) ప్రకృత్యా (3-1)

అర్థ . యకారాది తద్ధిత ప్రత్యయము పరమగునపుడు 'అన్' ప్రకృతితో నుండును భావకర్మార్థములందు మాత్రము అట్లుండదు.

వివ : 'యే' అనునది 'య' అనుదాని సప్తమీ విభక్తి రూపము అది యవర్ణమును తెలుపును అది తద్ధితే అనుదానికి విశేషణము వర్ణగ్రాహకమైన సప్తమ్యంత విశేషణమునకు తదాదివిధిచే 'యకారాదియైన తద్ధిత ప్రత్యయము పరమగునపుడు' అనునర్థము వచ్చును. 'అన్' అనునది కొన్ని శబ్దముల తుది నుండు అకారనకారముల సముదాయరూపము దానికి యకారాది ప్రత్యయము పరమగునపుడు ప్రకృతిభావ ముండును అనగా 'నస్తద్ధితే' అనుసూత్రముచే రావలసిన టిలోపము రాదని తాత్పర్యము. భావము, కర్మము అనునర్థములందు వచ్చిన యకారాది తద్ధిత ప్రత్యయము పరమగునపుడు మాత్రము ఈ ప్రకృతిభావము కలుగదు. టిలోపము వచ్చును

ఉదా : రాజ్ఞః అపత్యమ్ - రాజుయొక్క పుత్రుఁడు అనునర్థమున రాజన్ శబ్దమునకు 'యత్' ప్రత్యయము వచ్చును (రాజశ్వశురాద్యత్) రాజన్ + య(త్), నస్తద్ధితే అనుసూత్రముచే నిట 'అన్' అను వర్ణములకు లోపము ప్రాప్తించు చుండఁగా సూత్రముచే నది వారింపఁబడినది. కావున రాజన్య = రాజన్య + సు = రాజన్యః. 'జాతావేవ' అనుటచే రాజన్యుఁడనఁగా రాజకుమారుఁడై, రాజ వంశములోని వ్యక్తి యని యర్థము.

ఈ ప్రకృతిభావము భావకర్మార్థములయందు రాదు రాజ్ఞఃకర్మ, రాజుయొక్క కర్మము, లేక రాజ్ఞోభావః రాజుయొక్కభావము అనునర్థములందు అన్లోపము కలిగి 'రాజ్యమ్' అనురూపమేర్పడును. (ఈయర్థములందు 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణిచ' అను సూత్రముచే 'ష్యఞ్' ప్రత్యయము వచ్చును).

అప : రాజశబ్దమునకు యత్ ప్రత్యయము జాత్యర్థమునందే వచ్చునని వార్తికముచే చెప్పఁబడినది. దాని ప్రయోజనము పరిశీలింపఁబడుచున్నది.

వృ : జాతావేవేతి కిమ్ ?

అర్థ : జాత్యర్థమునందే యనవేల ? 'రాజన్' శబ్దమునకు రాజశ్వశురాద్యత్, అను సూత్రముచే విధింపఁబడిన ప్రత్యయము జాత్యర్థమునందే వచ్చును. రాజు యొక్క కుమారుఁడయ్యును రాజజాతిత్వములేని వ్యక్తిని తెలుపునపుడు 'యత్' ప్రత్యయము రాదు. సామాన్యప్రత్యయమగు 'అణ్' వచ్చును ఉదా: రాజ్ఞఃపుత్రః, రాజుయొక్కకుమారుఁడు (శూద్రాదిస్త్రీలయందు జన్మించినవాఁడు) రాజన్ + ఙస్, అణ్, విభక్తిలోపము. ఇచటను 'అన్' అను భాగమునకు నస్తద్ధితే అను సూత్రముచే టిలోపము ప్రాప్తించుచుండఁగా ఈ క్రింది సూత్రము దానినివారించుచున్నది.

సూ : అన్ 6-4-167

వృ : అన్ ప్రకృత్యా స్యాదణి పరే. రాజనః.

ప వి : అన్ (1-1)

అను : ప్రకృత్యా (3-1) అణి (7-1)

అర్థ : అణ్ ప్రత్యయము పరమగునపుడు 'అన్' అనునది ప్రకృతితో నుండును ఉదా : రాజనః

వివ : 'అన్' అనునది అకారనకారముల సముదాయము అది అణ్ అను తద్ధితప్రత్యయము పరమగునపుడు నస్తద్ధితే' అనుసూత్రముచే లోపింపవలసి యుండగా నీ సూత్రమున ప్రకృతిభావముచే నిషేధింపఁబడినది. ఉదా : రాజన్ + అ(ణ్)=రాజన + సు=రాజనః.

'రాజన్యః', 'రాజనః' అను వాని అర్థభేదమును గమనింపవలయును. మొదటిదిజాతివాచకము, యత్ ప్రత్యయాంతము. రెండవది కేవలాపత్యార్థకము. అణ్ ప్రత్యయాంతము.

అవ : 'రాజశ్వశురాద్యత్' అనుసూత్రములోని రాజ శబ్దమునకుఁ గల అర్థ విశేషమును, ప్రక్రియావిశేషమును చూచితిమి. ఇపుడు శ్వశురశబ్దమునకు యత్ ప్రత్యయాంతరూపమును చూతము.

వృ : శ్వశుర్యః

వివ : 'శ్వశురస్య' అపత్యం పుమాన్. శ్వశురునియొక్క కుమారుఁడు.

(శ్వశురుడు=మామ) శ్వశుర + యత్, 'యస్యేతి చ' అకారలోపము. శ్వశుర్ + య = శ్వశుర్య + సు=శ్వశుర్యః-(మామకొడుకు).

సూ : క్షత్రాద్ఘః 4-1-138.

వృ : క్షత్రియః. జాతావిత్యేవ. క్షాత్రిరన్యః.

ప వి : క్షత్రాత్ (5-1) ఘః (1-1)

అను : తస్య (6-1) అపత్యమ్ (1-1)సమర్థానాం ప్రథమాద్వా, ప్రత్యయః (1-1) తద్ధితః (1-1)

అర్థ : 'క్షత్రస్య' అనుసమర్థ షష్ఠ్యంతపదమునకు అపత్యార్థమున 'ఘ' ప్రత్యయము వచ్చును. ఇదియును జాత్యర్థమునందే. ఉదా : క్షత్రియః ఇతరుడు 'క్షాత్రి' అగును

విప : క్షత్రస్య అపత్యం పుమాన్ - క్షత్రుని పుత్రుడై క్షత్రజాతికి చెందినవాడు అనునర్థమున క్షత్రశబ్దమునకు 'ఘ' అను తద్ధితప్రత్యయము వచ్చును రాజ్ఞో జాతావేవేతి వాచ్యమ్' అను వార్తికమునుండి 'జాతావేవ' అనుభాగమిటకు తెచ్చుకొనబడినది కాన ఈప్రత్యయము క్షత్రజాతి వ్యక్తిని బోధించునపుడేవచ్చును.

ఉదా : క్షత్ర + ఙస్, ఘ, విభక్తిలోపము. ఘకారమునకు, 'ఆయనే యీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్' అనుసూత్రముచే 'ఇయ్' ఆదేశము ఘ=ఇయ్+అ=క్షత్రి + ఇయ, యస్యేతిచ-అకారలోపము క్షత్ + ఇయ=క్షత్రియ + సు = క్షత్రియః.

క్షత్రజాతి వ్యక్తికాక 'క్షత్రునికి శూద్రాదిస్త్రీలయందు సముత్పన్నుడైన కుమారుడు' అనునర్థమున ఈ ప్రత్యయమురాదు. 'అతఇఞ్' అనుసూత్రముచే 'ఇఞ్' ప్రత్యయము వచ్చును. క్షత్ర + ఙస్, ఇఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, క్షాత్ర + ఇ యస్యేతిచ అకారలోపము. క్షాత్రి + సు=క్షాత్రిః.

సూ : కులాత్ఖః 4-1-139.

వృ : కులీనః తదన్తాదపి; ఆఢ్యకులీనః.

ప వి : కులాత్ (5-1) ఖః (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1)

అర్థ : కులశబ్దమునకు అపత్యార్థమున 'ఖ' ప్రత్యయమగును. ఉదా : కులీనః, కులశబ్దాంతమునకును ఈ ప్రత్యయము చేరును. ఆఢ్యకులీనః.

వివ : 'కులముగలవాని సంతానము' అనునర్థమున 'కులస్య' అను సమర్థ షష్ఠ్యంతపదమునకు 'ఖ' ప్రత్యయము చేరును ఇందలి ఖకారమునకు, 'ఆయనేయీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్' అను సూత్రముచే 'ఈన్' ఆదేశమగును. (ఖ్ + అ, ఈన్ + అ = ఈన)

కులస్య అపత్యమ్ కుల + ఙస్, ఖ, విభక్తిలోపము, కుల+ఖ, ఈనా దేశము, కుల + ఈన, యస్యేతిచ అకారలోపము కుల్ + ఈన = కులీన + సు = కులీనః.

ఈ ఖ ప్రత్యయము కులశబ్దమంతమునందుగలదానికిని చేరును ఈ విషయము అష్టాధ్యాయి క్రమములో దీని తరువాతి సూత్రమునందలి 'అపూర్వపదాత్' అను సూత్రముచే జ్ఞాపితమైనది.

ఉదా : ఆఢ్యకులస్య అపత్యమ్, గొప్పకులముకలవానికుమారుడు, ఆఢ్య కుల + ఙస్, ఖ, విభక్తిలోపము, ఈనాదేశము, అకారలోపము, ఆఢ్యకుల్ + ఈన ఆఢ్యకులీన + సు = ఆఢ్యకులీనః.

సూ : రేవత్యాదిభ్యష్ఠక్ 4-1-146

ప వి · రేవత్యాదిభ్యః (5-3) ఠక్ (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1)

అర్థ : రేవత్యాదులకు అపత్యార్థమున ఠక్ ప్రత్యయమగును

వివ . రేవతీ మున్నగువాని సమర్థషష్ఠ్యంతపదములకు ఆమె సంతానము అనునర్థమున 'ఠక్' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఇందు కకారమిత్తు కావున 'కితిచ' అనుసూత్రముచే ఆదివృద్ధివచ్చును.

ఉదా : రేవత్యాః అపత్యం పుమాన్ - రేవతియొక్క పుత్రుడు, రేవతీ + ఙస్, ఠక్. విభక్తిలోపము, రేవతీ + ఠ, కితిచ, ఆదివృద్ధి (ఏ > ఐ) 'రైవతీ+ ఠ' అనియుండ క్రిందిసూత్రముచే కార్యవిశేషము విధింపబడుచున్నది.

సూ : ఠస్యేకః 7-3-50

వృ : అఙ్గాత్పరస్య ఠస్యేకాదేశః. రైవతికః.

ప. వి : ఠస్య (6-1) ఇకః (1-1)

అను : అఙ్గస్య (6-1)

అర్థ : అంగమునకు పరముగానున్న 'ఠ' అనుదానికి 'ఇక' అనునాదేశము వచ్చును ఉదా రైవతికః

వివ : దేనికి ప్రత్యయము విధింపబడునో అది మొదలుగా గలసముదాయము నకు, ఆప్రత్యయము పరమగునపుడు, అంగసంజ్ఞయగును (యస్మాత్ప్రత్యయ విధిస్తదాది ప్రత్యయేఽఙ్గమ్) అట్టి అంగసంజ్ఞ కలదానికి పరముగా నున్న 'ఠ' అను దానికి 'ఇక' అనునాదేశము వచ్చును ఈ ఆదేశము అనేకవర్ణములు గలది గావున సర్వాదేశమగును

ఉదా : రైవత + ఠ - రైవత + ఇక, యస్యేతిచ, అకారలోపము. రైవత్ + ఇక = రైవతిక + సు = రైవతికః

ఈ రేవత్యాదులకు విధింపబడిన ఠక్ ప్రత్యయము 'స్త్రీభ్యో ఢక్' ఇత్యాది సూత్రములచే నగు ఢక్ మున్నగువానికి అపవాదము.

**రేవత్యాదిగణము :** రేవతీ అశ్వపాలీ మణిపాలీ ద్వారపాలీ వృకవఞ్చిన్ వృకబన్ధు వృకగ్రాహ కర్ణగ్రాహ దణ్డగ్రాహ కుక్కుటాక్ష (కకుదాక్ష) [చామరగ్రాహ] - ఇతిరేవత్యాదిః

**సూ : జనపద శబ్దాత్ క్షత్రియాదఞ్ 4-1-168.**

**వృ : జనపదక్షత్రియవాచకాచ్ఛబ్దాదఞపత్యే. పాఞ్చాలః.**

ప వి : జనపదశబ్దాత్ (5-1) క్షత్రియాత్ (5-1) అఞ్ (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1)

అర్థ : జనపదక్షత్రియ వాచకశబ్దమునకు అపత్యార్థమున అఞ్ ప్రత్యయము వచ్చును ఉదా. పాఞ్చాలః

వివ : జనపదమనగా దేశము. క్షత్రియుడనగా క్షత్రియకులమున బుట్టిన వాడు. కొన్నిశబ్దములు దేశనామములను, వానినేలు రాజనామములను జెప్పుచుండును. ఉదాహరణమునకు అంగదేశము. అంగుడు. 'అంగ' అనునది ఇటదేశమునకు,

దానిసేలు రాజునకును నామము ఇట్టివానిని జనపదక్షత్రియవాచకము లందురు. సమర్థములై షష్ఠ్యంతములైన జనపదక్షత్రియవాచకములకు, 'వానిసంతానము' అను నర్థమున 'అఞ్' ప్రత్యయము చేయుము ఇందు ఞకారమిత్తు కావున పది పరమగు నపుడు ఆదివృద్ధి సిద్ధించును.

ఉదా : పఞ్చాల – ఇది యొకదేశమునకును, దానిఏలురాజునకును సంజ్ఞ. పఞ్చాలస్య అపత్యం పుమాన్, పఞ్చాలుని పుత్రుడు, పఞ్చాల + ఙస్, అఞ్ విభక్తిలోపము, పఞ్చాల + అ (ఞ్) ఆదివృద్ధి, పాఞ్చాల + అ, యస్యేతిచ, అకారలోపము, పాఞ్చాల్ + అ = పాఞ్చాల + సు = పాఞ్చాలః

వా॥ క్షత్రియసమానశబ్దాజ్జన పదాత్తస్యరాజన్యపత్యవత్ (2669)

వృ : పఞ్చాలానాం రాజా పాఞ్చాలః

ప వి : క్షత్రియసమానశబ్దాత్ (5-1) జనపదాత్ (5-1) తస్య (6-1) రాజని (7-1) అపత్యవత్ (అవ్య)

అర్థ : క్షత్రియసమానశబ్దమగు జనపదవాచకమునకు, 'దానిరాజు' అను నర్థమున అపత్యార్థమునందువలె ప్రత్యయమగును ఉదా . పఞ్చాలానాం రాజా పాఞ్చాలః

వివ : ఏశబ్దము ఒక క్షత్రియునికిని, ఆతనిచే పాలింపబడుదేశమునకును వాచకమగునో అట్టిదానికి, అదేశపురాజు' అనునర్థమున, అపత్యార్థములో ఏ ప్రత్యయము చేయునో ఆ ప్రత్యయము చేయును

ఉదా 'పఞ్చాల' ఇది జనపద క్షత్రియ వాచకము 'పంచాలదేశపురాజు' అను నర్థమున దీనికి అపత్యార్థమున పూర్వసూత్రముచే విధింపబడిన అఞ్ ప్రత్యయమునే యీవార్తికము విధించినది. పఞ్చాలానాం రాజా–పఞ్చాల + ఆమ్, అఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, పాఞ్చాల + అ (ఞ్), యస్యేతి చ అకార లోపము, పాఞ్చాల్ + అ=పాఞ్చాల + సు = పాఞ్చాలః.

పై సూత్రవార్తికములనుబట్టి పాంచాలుడనునది పంచాలుని కుమారునికిని, పంచాలదేశపురాజునకును సంజ్ఞయగును.

అవ : పై సూత్రమున (జనపదశబ్దాత్-) విధింపబడిన 'అఞ్' ప్రత్యయమునకు కొన్ని అపవాదములు చెప్పబడుచున్నవి

వా: పూరోరణ్ (2670)

వృ: పౌరవః.

ప. వి: పూరోః (5-1) అణ్.

అర్థ: పూరుశబ్దమునకు అపత్యార్థమున అణ్ ప్రత్యయము చేరును
ఉదా: పౌరవః

వివ: పూరు శబ్దము క్షత్రియవాచకమే కాని జనపదవాచకము కాదు కావున దీనికి అపత్యార్థమున 'అణ్' ప్రత్యయము సామాన్య సూత్రమగు 'తస్యాపత్యమ్' అను సూత్రముచేతనే రావచ్చును కాని 'అణ్' ప్రత్యయముతోపాటు దీనికి తద్రాజసంజ్ఞ (ముందు చెప్పబడును) సిద్ధించుటకై యిచట అణ్ ప్రత్యయము పఠింపబడినది తద్రాజసంజ్ఞవలని ప్రయోజనము ముందు తెలుపబడును

ఉదా. పూరోరపత్యమ్, పూరువుయొక్క కుమారుడు, పూరు + జస్, అణ్, విభక్తి లోపము, పూరు + అణ్, ఆదివృద్ధి, పౌరు + అ, 'ఓర్గుణః' అను సూత్రముచే ఉకారమునకు గుణము పౌరో + అ, అవాదేశము, (ఏచోఽయవాయావః) పౌరవ్ + అ = పౌరవ + సు = పౌరవః.

వా: పాణ్డోర్డ్యణ్ (2671)

వృ: పాణ్డ్యః.

ప. వి: పాణ్డోః (5-1) డ్యణ్ (1-1)

అర్థ: జనపదక్షత్రియవాచకమగు 'పాణ్డు' శబ్దమునకు అపత్యార్థమునను, తద్దేశాధిపతి అనునర్థమునను డ్యణ్ ప్రత్యయము చేరును.

ఉదా: పాణ్డ్యః

వివ: పాండువనగానిచట ధర్మరాజాదుల తండ్రికాడు అతనిపేరు జనపద వాచకము కాదు కావున నీయర్థము తెలియును జనపదవాచకము క్షత్రియవాచకము నైన పాండుశబ్దమునకు, అతనికుమారుడు అను నర్థమునను, క్షత్రియసమాన శబ్దాత - ఇత్యాది వార్తికమువలన పాండుదేశపురాజు అనునర్థమునను డ్యణ్' అను ప్రత్యయము చేరును ఇది 'అణ్' ప్రత్యయమునకపవాదము. ఇందుడకారణకారము లిత్తులు. డిత్తగుటవలన 'టేః 6-4-143 (డిత్తుపరమగునపుడు టి భాగమునకు లోపము వచ్చును) అనుసూత్రముచే టి సంజ్ఞకమగు ఉకారమునకు లోపము వచ్చును. ణిత్తగుటచే ఆదివృద్ధి. ఆకారమునకు ఆకారమే వచ్చును.

ఉదా : పాణ్డోరపత్యం, రాజా వా, పాండువుయొక్క పుత్రుడు లేక పాండు దేశపురాజు. పాణ్డు + ఙస్, డ్యణ్, విభక్తిలోపము పాణ్డు + డ్యణ్, పాణ్డు+య టిలోపము, పాణ్డ్ + య = పాణ్డ్య పాణ్డ్య + సు = పాణ్డ్యః.

సూ : కురునాదిభ్యో ణ్యః 4-1-172.

వృ : కౌరవ్యః, నైషధ్యః.

ప వి : కురునాదిభ్యః (5-3) ణ్యః (1-1)

అను : జనపద శబ్దాత్ (5-1) క్షత్రియాత్ (5-1) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తస్య (6-1) అపత్యమ్ (1-1) సమర్థానాం ప్రథమాద్వా

అర్థ : జనపదక్షత్రియవాచకములగు కురుశబ్దమునకు, నకారాది శబ్దములకును 'ణ్య' అను తద్ధితప్రత్యయము వచ్చును ఉదా . కౌరవ్యః, నైషధ్యః

వివ . నాదులనగా నకారము మొదలందుగలశబ్దములు జనపదక్షత్రియవాచకములగు కురుశబ్దముయొక్క షష్ఠ్యంతరూపమునకు, అట్టివేయగు నకారాదిశబ్దముల షష్ఠ్యంతరూపములకును వరుసగా, వాని కుమారుడు లేక ఆదేశపురాజు అనునర్థము నందు 'ణ్య' అను ప్రత్యయము వచ్చును ఇందు ణకారము ఇత్తు (పోవు) దానిచే ఆదివృద్ధి కలుగును

ఉదా కురోరపత్యం = కురువుయొక్క సంతానము, లేక కురూణాం రాజా, కురుదేశముల రాజు కురు + ఙస్ ఆమ్, ణ్య, విభక్తిలోపము కురు + ణ్య, ఆదివృద్ధి, కౌరు + య, ఓర్గుణః అనుసూత్రముచే ఉకారమునకు గుణము, కౌరో+య, 'వాన్తో యి ప్రత్యయే' అను సూత్రముచే అవాదేశము కౌరవ్ + య=కౌరవ్య + సు=కౌరవ్యః

నిషధస్య అపత్యం, రాజా వా, నిషధునికుమారుడు లేక నిషధదేశపురాజు నిషధ+ఙస్ + ణ్య, విభక్తిలోపము, ఆదివృద్ధి, నైషధ+య, యస్యేతిచ, అకారలోపము నైషధ్య+సు=నైషధ్యః.

సూ : తే తద్రాజాః 4-1-174.

వృ : అఞాదయస్తద్రాజ సంజ్ఞాః స్యుః.

ప వి : తే (1-3) తద్రాజాః (1-3)

అర్థ : అఞ్ మున్నగు ప్రత్యయములు తద్రాజ సంజ్ఞకములు.

వివ : జనపదశబ్దాత్ - ఇత్యాదిసూత్రము మొదలుకొని యిట విధింపబడిన అఞ్, అణ్, ఞ్యఙ్, ఞ్య - అను ప్రత్యయములకు 'తద్రాజ' అను సంజ్ఞ కలుగును.

అవ : పై సంజ్ఞ క్రింది సూత్రమున ప్రయుక్తమైనది

**సూ : తద్రాజస్య బహుషు తేనై వాస్త్రియామ్ 2-4-62.**

**వృ : బహుష్వర్థేషు తద్రాజస్య లుక్, తత్కృతే బహుత్వే న తు స్త్రియామ్, పఞ్చాలాః ఇత్యాది.**

ప ఛే : తద్రాజస్య (6-1) బహుషు (7-3) తేన (3-1) ఏవ (అవ్య) అస్త్రియామ్ (7 1)

అను : లుక్ (1-1)

అర్థ : బహువచనమున తద్రాజప్రత్యయమునకు లుక్కు వచ్చును బహుత్వము తద్రాజప్రత్యయాంతకృతమైనపుడే యీలుక్కు అగును స్త్రీత్వమున రాదు ఉదా : పంచాలాః మొ॥ వి

వివ : తద్రాజ ప్రత్యయము చేరిన రూపములయొక్క బహుత్వము వివక్షితమగునపుడు ఆ తద్రాజప్రత్యయమునకు లుక్కు వచ్చును తద్రాజప్రత్యయము దేనిచేతనో దానిచే వాచ్యులగు వ్యక్తులకు సంబంధించిన బహుత్వమున్నపుడే యీ లుక్కు వచ్చును లుక్కు అనగా ప్రత్యయముయొక్క అదర్శనము తద్రాజ సంజ్ఞపై సూత్రమున వివరింపబడినది.

ఉదా పఞ్చాలస్య అపత్యాని పుమాంసః, పంచాలునియొక్క సంతానమైన పురుషులు పంచాలశబ్దము జనపదక్షత్రియవాచకము దానికి అపత్యార్థమున 'జనపదశబ్దాత్ క్షత్రియాదఞ్' అను సూత్రముచే 'అఞ్' ప్రత్యయము చేరును 'పఞ్చాల + అఞ్'. ఇపుడు దీనికి బహుత్వసంఖ్య వివక్షితమైనది ఆబహుత్వము పంచాలుని అపత్యములకు సంబంధించినది కావున ప్రకృతసూత్రముచే తద్రాజ సంజ్ఞగల అఞ్ ప్రత్యయమునకు లుక్కువచ్చును పఞ్చాల + (అఞ్) + జస్ = పఞ్చాల + అస్ = పఞ్చా - లాస్ - పంచాలాః పంచాలుని కుమారులు ఇట్లే తక్కిన ప్రత్యయములకును రూపములుండును

ఈ సూత్రమునుబట్టి తద్రాజప్రత్యయాంతములకు బహువచనమున మాత్రము ప్రత్యయము లోపించును. ఏకద్వివచనములలో ప్రత్యయము లుండును. ప్రత్యయమునుబట్టి వచ్చు ఆదివృద్ధ్యాదికార్యములు ఏకద్వివచనములలో,

గన్పట్టును. బహువచనమునఁ గన్పట్టిష క్రింది ప్రథమావిభక్తిరూపములను బట్టి తక్కినవాని మాహించుకొనునది.

| శబ్దము | ఏ | ద్వి | బహు | |
|---|---|---|---|---|
| పంచాల — | పాంచాలః | పాంచాలౌ | పంచాలాః. | ప్ర వి: |
| పూరు — | పౌరవః | పౌరవౌ | పూరవః | |
| పాణ్డు — | పాణ్డ్యః | పాణ్డ్యౌ | పాండవః. | |
| కురు — | కౌరవః | కౌరవౌ | కురవః. | |
| నిషధ — | నైషధ్యః | నైషధ్యౌ | నిషధాః. | |

ఇత్యాదులగునని.

**సూ : కమ్బోజాల్లుక్ 4-1-175**

**వృ : అస్మాత్తద్రాజస్యలుక్. కమ్బోజః, కమ్బోజౌ.**

ప వి : కమ్బోజాత్ (5-1) లుక్ (1-1)

అను : తద్రాజాః (1-3)

అర్థ : కమ్బోజ శబ్దమునకు పరముగానున్న తద్రాజప్రత్యయమునకు లుక్కువచ్చును. ఉదా : కమ్బోజః, కమ్బోజౌ.

వివ : కమ్బోజ శబ్దము జనపద క్షత్రియవాచకము. దానికి, అపత్యార్థము నందును, ఆ దేశమునకురాజు అనునర్థమునందును, 'జనపదశబ్దాత్ క్షత్రియాదఞ్' అను సూత్రముచేతను, 'క్షత్రియసమానశబ్దాజ్జనపదాత్తస్య రాజన్యపత్యవత్' అను వార్తికముచేతను విహితమైన 'అఞ్' ప్రత్యయమునకు లుక్కువచ్చును లుక్కు వచ్చినను అర్థభంగము కలుగదని తాత్పర్యము.

ఉదా : కమ్బోజస్య అపత్యంపుమాన్. కమ్బోజ + ఙస్, అఞ్, విభక్తి లోపము. కమ్బోజ + అఞ్, ప్రకృతసూత్రముచే 'అఞ్' ప్రత్యయమునకును లుక్కు (అదర్శనము). కమ్బోజ + సు = కమ్బోజః. కమ్బోజరాజునకును, అతని పుత్త్రునకును ఇది సంజ్ఞ.

తక్కిన తద్రాజప్రత్యయములకు బహువచనమునందు మాత్రమే లుక్కు వచ్చును. దీనికి ఏక ద్వివచనములందును వచ్చుట విశేషము. దానిని సూచించుటకే ఉదాహరణములు కమ్బోజః (ఏ) కమ్బోజౌ (ద్వి) అనునవి చూపఁబడినవి.

అవ : సూత్రమున కమ్బోజశబ్దముయొక్కటికి పరముగా నున్నతద్రాజ ప్రత్యయమునకే లుగ్విధానము చేయఁబడి యుండగా వార్తికకారుఁడు దాని నిట్లు విస్తరించుచున్నాఁడు

**వా॥ కమ్బోజాదిభ్య ఇతి వక్తవ్యమ్ (2674).**

**వృ : చోళః, శకః, కేరళః, యవనః.**

ప వి : కమ్బోజాదిభ్యః (5-3) ఇతి (అవ్య) వక్తవ్యమ్ (1-1).

అర్థ : తద్రాజప్రత్యయలోపము కమ్బోజాదిశబ్దములకు అని చెప్పఁదగును. ఉదా. చోళః మొ॥వి.

విప : ఒక్క కంబోజశబ్దమునకు మాత్రమేకాక, అట్టివేయగు, చోళ, శక, కేరళ మున్నగువానికి పరముగా నున్న తద్రాజప్రత్యయములకును లుక్కు చెప్పవల యునని వార్తికము యొక్కభావము కావున చోళాదిశబ్దములును కమ్బోజశబ్దమువలె చోళుఁడు, చోళునికుమారుఁడు చోళదేశపురాజు అనునర్థములు గలది యగును ఉదా : చోళస్య అపత్యం, రాజావా, చోళునికుమారుఁడు లేక చోళదేశపురాజు.

ఉదా : చోళ + జస్ + అణ్, విభక్తిలోపము, ప్రత్యయలోపము. చోళ + సు = చోళః, అట్లే కేరళ + జస్ + అణ్ = కేరళః, శక + జస్, + అణ్, శకః, యవన + జస్ + అణ్, యవనః మొ॥వి.

**కంబోజాదిగణము :** కమ్బోజ చోళ కేరళ శక యవన ఇతి కంబో జాదిః.

## ఇతి అపత్యాధికారప్రకరణము.

**ప్రకరణావలోకనము :** 'అతనియొక్క అపత్యము' అను నర్థమున నా మాశబ్దములకు విహితములగు ప్రత్యయము లనేకము లిందు చెప్పఁబడినవి వీనిని నాలుగు విధములుగా విభజింపనగును (1) కూతురు, కొడుకు అనునర్థము నిచ్చునవి కేవలాపత్యప్రత్యయములు (2) అపత్యముగా వివక్షింపఁబడిన మనుమఁడు మనుమురాలు మున్నగు మూఁడవతరము మొదలుకొని తదువాతితరములవారి నంద ను చెప్పు ప్రత్యయములు గోత్రప్రత్యయములు ఇందు ఏతరమువారిని చెప్ప లసినను ప్రత్యయమొక్కటియే చేటును (3) జీవత్పితృకులైన మనుమని సంతానము మున్నగువారిని యువాపత్యమందురు. వారిని చెప్పవలసినప్పుడు గోత్ర

ప్రత్యయాంతర మైపై చేరు ప్రత్యయములను యువాపత్యప్రత్యయములందురు. (4) దేశ వాచకము రాజవాచకము నొకటియేయగు శబ్దములకు ఆతని అపత్యము, ఆ దేశపురాజు అను నర్థమున చేరు ప్రత్యయములు (రాజప్రత్యయములు) ఈ నాలుగువిధములను సోదాహరణముగ సప్రక్రియముగ నిందు నిరూపింపబడినవి.

ఇందలి అణ్, అఞ్ ప్రత్యయములచే నేర్పడు రూపములో భేదమేమియు లేదు. స్వరమున మాత్రము భేదముండును కొన్నియెడల బహువచన ప్రత్యయము పరమగునపుడు లుక్కు వచ్చుట అఞ్ ప్రత్యయమునకు కలదు. ఫ = ఆయన, ఢ = ఏయ, ఖ = ఈన, ఘ = ఇయ అను రీటుగా మారుట యీ ప్రకరణములో చూడదగు ఢకారమునకు ఈ యాదేశము వచ్చుట మాత్రమిందు ప్రసక్తమగును.

ఇందు విధింపబడిన ప్రత్యయము లన్నియు సమర్థషష్ఠ్యంతములకే చేరును. ఇందు ప్రత్యయములు పరములగునపుడు తుదినున్న అ, ఆ, ఇ, ఈ లకు యస్యేతిచ అనుసూత్రముచేత లోపమువచ్చుటయు, ఉ ఊ లకు ఓర్గుణః అనుసూత్రముచే గుణమువచ్చుటయు పలుతావుల పరిశీలించగలము.

## అథ చాతురర్థిక ప్రకరణమ్.

అథ. చతురర్థములకు సంబంధించిన ప్రత్యయములుగల ప్రకరణమగుటచే దీనిని చాతురర్థిక ప్రకరణమందురు. పూర్వప్రకరణమున అపత్యార్థప్రత్యయములు మాత్రమే ప్రధానముగ చెప్పబడినవి. ఇందు అనేకములగు నర్థములలో తద్ధిత ప్రత్యయములు విధింపబడుచున్నవి ఇందు తుది భాగమున 'అది ఆదేశమందున్నది' 'దానిచే నేర్పడినది' 'దానికి నివాసమైనది' 'దానికి దూరమైనదికాదు' అను నాలుగర్థములలో ప్రత్యయములు విధింపబడుచున్నవి. దానినిబట్టి యీ ప్రకరణమునకు చాతురర్థిక ప్రకరణమను పేరుగలిగినది. కొందఱు ఇందలి రక్తాద్యర్థముల నొక ప్రకరణముగా, చాతురర్థిక ప్రకరణమును మఱియొక ప్రకరణముగా విభజించిరి. ఆ విభాగము మనము సందర్భానుసారముగా గుర్తింపగలము. పూర్వప్రకరణము నందు వలెనే యిందును 'సమర్థానాం ప్రథమాద్వా' తద్ధితాః, ప్రత్యయః అను

సరికారములు ప్రవర్తించును ఆదివృద్ధి, తుది ఇవర్ణ వర్ణముల లోపము మున్నగు నవి యథాసంభవముగ నిందును కలుగుచుండును

పూర్వప్రకరణమున 'తస్య' అను షష్ఠ్యంతసూచకపదము అధికృతమైనట్లు, ఇందు తేన, తత్ర, సా, తద్, తస్య అనుపదము లందందు గోచరించును. అవి యాయా విభక్త్యంతములకు సూచకములు వానిని సందర్భానుసారముగా పరిశీలింతము.

**సూ : తేన రక్తం రాగాత్ 4-2-1.**

**వృ : అణ్ స్యాత్. కషాయేణ రక్తం వస్త్రం కాషాయమ్.**

ప వి . తేన (3-1) రక్తమ్ (1-1) రాగాత్ (5-1).

అను : అణ్ (1-1) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య)

అర్థ : 'దానిచే రంగు వేయఁబడినది' అనునర్థమున తృతీయాంతమైన రాగవాచకశబ్దమునకు పరముగా అణ్ ప్రత్యయ వచ్చును ఉదా : కషాయేణ రక్తం వస్త్రమ్ కాషాయమ్

వివ : 'తేన' అనునది తృతీయా విభక్తి అంతమునఁగలపదమునకు చిహ్నము. రక్తమనగా రంగు వేయఁబడిన వస్తువు రాగవాచకమనగా రంగు వేయుటలో సాధనమగు ద్రవ్యమును తెలుపునది. రంజ్ధాతువునకు ఘఞ్ ప్రత్యయము చేరఁగా 'రాగః' అగును. రంగువేయుటలో సాధనముగా ఉపయోగింపఁబడిన కషాయము మున్నగు రాగవాచకశబ్దముల తృతీయాంతరూపములకు, 'దానితో రంగువేయఁబడిన వస్త్రము మున్నగునది' అనునర్థమున, 'అణ్' ప్రత్యయము చేరును ఇందు ణకారము ఇత్తగుటచే శబ్దమునందు మొదటి అచ్చునకు వృద్ధి వచ్చును

ఉదా : కషాయేణ రక్తంవస్త్రమ్ - కషాయముతో రంగువేయఁబడిన వస్త్రము. ఇందు 'కషాయ' అనునది రాగవాచకము అనగా రంగువేయుటలో సాధనమైన పదార్థము తృతీయాంతమగుటవలన సమర్థములైన వానిలో ప్రథమము. అనగా మొదట నుచ్చరింపఁబడినది దానిచే రంగువేయఁబడిన వస్త్రమును బోధించుచు 'కషాయేణ' అనుపదమునకు 'అణ్' ప్రత్యయము చేరును. కషాయ + టా, అణ్, తద్ధితాంతము కావున ఈ మొత్తమునకు ప్రాతిపదిక సంజ్ఞ

కలుగును. (కృత్తద్ధిత సమాసాశ్చ) ప్రాతిపదికావయవములగు సుప్పులకు లుక్కు వచ్చును (సుపోధాతు ప్రాతిపదికయోః) కషాయ + అణ్, ణిత్తగుతద్ధిత ప్రత్యయము పరమగుటచే కషాయ'లోని తొలి అచ్చగు అకారమునకు వృద్ధి ఆకారమాదేశమగును (తద్ధితేష్వచామాదేః) కాషాయ + అ, యస్యేతిచ అను సూత్రముచే తుది అకారమునకు లోపము, కాషాయ్ + అ=కాషాయ+సు = కాషాయమ్ (నపుం)

**సూ : నక్షత్రేణ యుక్తః కాలః 4-2-3.**

**వృ : అణ్ స్యాత్.**

ప. వి : నక్షత్రేణ (3-1) యుక్తః (1-1) కాలః (1-1).

అను : తేన (3-1) అణ్ (1-1) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) సమర్థానాం ప్రథమాద్వా

అర్థ : తృతీయాంతమైన నక్షత్రవాచక శబ్దమునకు, 'దానితోకూడిన కాలము' అనునర్థమునందు, అణ్ ప్రత్యయము వచ్చును

వివ . అనువృత్తిగా వచ్చిన 'తేన' అనుపదము నక్షత్రేణ అనుదానితో నన్వయించును. తృతీయాంతమైన నక్షత్రవాచకశబ్దము ఇచట సమర్థములలో మొదటిదిగా నుచ్చరింపఁబడినది తేన నక్షత్రేణయుక్తఃకాలః'- ఆ నక్షత్రముతో కూడినకాలము' అనునర్థమును తెలియఁజేయుచు సమర్థములలో ప్రథమమగు తృతీయాంతమైన నక్షత్రవాచకశబ్దమునకు పరముగా 'అణ్' అను తద్ధితప్రత్యయము వచ్చును.

ఉదా . పుష్యేణ యుక్తమహః - ఇందు 'పుష్యేణ' అనునది నక్షత్రవాచక తృతీయాంతపదము 'అహః' అనునది కాలవాచకశబ్దము (పగలు). ప్రత్యయము చేరిన పిదప నేర్పడురూపము దానిని (అహఃఅనుదానిని) తెలుపును ఎట్టి అహ స్సనగా పుష్యనక్షత్రముతో కూడిన అహస్సు అని యర్థము ఈ యర్థమును తెలుపుటకు పుష్యేణ' అను నక్షత్రవాచకమునకు 'అణ్' ప్రత్యయము చేరును. పుష్య + టా, అణ్, ప్రాతిపదికసంజ్ఞ విభక్తిలోపము పుష్య + అణ్, ఆది వృద్ధి, పౌష్య + అ, యస్యేతిచ అను సూత్రముచే అకారలోపము, 'పౌష్య + అ' అని యుండగా ననంతరకార్యమును క్రింది వార్తికము తెలుపుచున్నది.

**వా॥ తిష్యపుష్యయో ర్నక్షత్రాణి యలోప ఇతి వాచ్యమ్. (4200).**

**వృ : పుష్యేణయుక్తం పౌషమహః, పౌషీరాత్రిః.**

ప వి : తిష్యపుష్యయోః (6-2) నక్షత్రాణి (7-1) య (విభక్తిలోపించిన పదము) లోపః (1-1) ఇతి (అవ్య) వాక్యమ్ (1-1)

అర్థ : తిష్య పుష్య అనువాని యకారమునకు, నక్షత్రార్థమున వచ్చిన అణ్ ప్రత్యయము పరమగునపుడు, లోపము చెప్పనగును ఉదా : పౌషమహః, పౌషీరాత్రిః

వివ : నక్షత్రాణి, నక్షత్ర + అణి, అనుదానికి 'నక్షత్రేణయుక్తః కాలః' అను సూత్రముచే విధింపబడిన అణ్' ప్రత్యయము పరమగునపుడు అనియర్థము. అట్టియెడ తిష్య, పుష్య అనువాని యకారమునకు లోపము వచ్చును

ఉదా : పైసూత్రమును ఉదాహరింపబడిన 'పౌష్య + అ' అనురూపములో యకారమున కీవార్తికముచే లోపమురాగా పౌష + అ=పౌష + సు = 'పౌషమ్' అయినది 'అహః' అనునపుంసకలింగశబ్దమునకు విశేషణమగుటచే నిదియు నపుంసకమయినది.

ఇట్లే పుష్యేణ యుక్తారాత్రిః. పుష్యనక్షత్రముతో కూడిన చంద్రుడు గల రాత్రి పుష్య + టా + అణ్ (నక్షత్రేణ యుక్తః కాలః అనుసూత్రముచే అణ్ ప్రత్యయము) విభక్తిలోపము పుష్య + అ (ణ్), ఆదివృద్ధి, పౌష్య + అ, యస్యేతిచ, అకారలోపము, ప్రకృతవార్తికముచే యకారలోపము, పౌష్ + అ = 'పౌష' దీనికి స్త్రీత్వమును డీప్' ప్రత్యయము వచ్చును పౌష + డీప్ (జకార పకారములిత్తులు) పౌష + ఈ, యస్యేతిచ - అకారలోపము, పౌష్ + ఈ = పౌషీ + సు = పౌషీ స్త్రీలింగమగు రాత్రిశబ్దమునకు విశేషణమగుటచే 'పౌషీ' అనునదియు స్త్రీలింగమైనది

అవ . పైని విధింపబడిన ప్రత్యయమునకు కొన్నియెడల అదర్శనము క్రింది సూత్రముచే విధింపబడుచున్నది

**సూ : లు బవిశేషే. 4-2-4.**

**వృ : పూర్వేణ విహితస్యలుప్ వష్టి దణ్డాత్మకస్య కాలస్యావాన్తర విశేష శ్చేన్న గమ్యతే. అద్యపుష్యః.**

ప. వి : లుప్ (1-1) అవిశేషే (7-1).

అను : నక్షత్రేణ (3-1) యుక్తః (1-1) కాలః (1-1) అణ్ (1-1).

అర్థ : అరువది ఘటికల రూపమున విభజింపఁబడిన కాలముయొక్క అవాంతర విశేషము తెలియఁబడనిచో, పూర్వసూత్రముచే విధింపఁబడిన ప్రత్యయమునకు లుప్పు వచ్చును ఉదా : అద్యపుష్యః.

వివ అవిశేషే అనగా 'విశేషము తెలియఁబడనియప్పుడు' అని యర్థము దేనియొక్క విశేషము? అని ఆకాంక్ష జనించును సందర్భమునుబట్టి 'నక్షత్రేణ యుక్తః కాలః' అనుసూత్రమునందు 'నక్షత్రముతో కూడిన కాలము' అనునర్థమున ప్రత్యయము విధింపఁబడుచున్నది కావున 'కాలము యొక్క విశేషము' అనునర్థము సిద్ధించును కాలముయొక్కవిశేష మనగా నేమి? ఇది పద్దికాలము కాదు. నక్షత్రముతో యుక్తమైనకాలము చంద్రుఁడు ఒక్కొక్క నక్షత్రముతో కూడియుండు కాల ప్రమాణము అఱువది ఘటికలని సిద్ధాంతము అట్లు అఱువది, అఱువది ఘటికలుగా విభజింపఁబడినకాలముయొక్క అవాంతరవిశేషములగు (అందులోని చిన్న చిన్న భాగములు) పగలు, రాత్రి, మధ్యాహ్నము, సాయంకాలము మొదలగునవి వివక్షింపఁబడనియెడల పైసూత్రముచే విధింపఁబడిన ప్రత్యయమునకు లుప్పువచ్చును. 'లుప్' అనునదియు ప్రత్యయముయొక్క అదర్శనమునకు ఒకసంజ్ఞ (ప్రత్యయస్య లుక్ శ్లులుపః)

ఉదా అద్యపుష్యః – ఈ దినము పుష్యనక్షత్రయుక్తమైనకాలము అద్య అనునది ఈరోజు అనునర్థముగల అవ్యయము దీనిచే అఱువది ఘటికల ప్రమాణము గల అహోరాత్రకాలవిశేషమే తెలియఁబడుచున్నది కాని, దాని అవాంతరభేదము లగు పగలు, రాత్రి మున్నగునవి చెప్పఁబడుటలేదు కావున విశేషము గిహ్యమాన మగుటలేదు (అవిశేషే) అందువలన 'పుష్యేణ యుక్తః కాలః' అనునర్థమున 'నక్షత్రేణయుక్తః కాలః' అను సూత్రముచే వచ్చిన అణ్ ప్రత్యయమునకు లుప్పు వచ్చును పుష్య + టా + అణ్, విభక్తియు అణ్ ప్రత్యయమును లోపించును పుష్య + సు = పుష్యః

ప్రత్యయము రాకముందు 'పుష్యః' అనుదానికి పుష్యనక్షత్రమని యర్థము ప్రత్యయముచేరి లోపించిన పిదప 'పుష్యః' అనుదానికి పుష్యనక్షత్రముతో కూడిన దినము అనియర్థ మేర్పడును కావున ప్రత్యయము రానేల? పోనేల? అని శంకింపరాదు

అవ : మఱియొక అర్థమున ప్రత్యయము విధింపఁబడుచున్నది.

**సూ : దృష్టం సామ 4-2-7.**

**వృ : తేనేత్యేవ. వసిష్ఠేన దృష్టం వాసిష్ఠం సామ.**

వ. వి : దృష్టమ్ (1-1) సామ (1-1).

అను : తేన (3-1) సమర్థానాం ప్రథమాద్వా, అణ్ (1-1) ప్రత్యయః (1-1) తద్ధితః (1-1).

అర్థ : 'అతనిచే దర్శింపఁబడిన సామము' అనునర్థమున ద్రష్టను తెలుపు తృతీయాంతపదమునకు, అణ్ ప్రత్యయము చేయును వసిష్ఠునిచే దర్శింపఁబడిన సామము - వాసిష్ఠమ్

వివ : ఋషులనగా వేదమంత్రములను దర్శించినవారు వేదమంత్రములు కొన్ని కొన్నిటిని కొందఱు కొందఱు ఋషులు దర్శించిరి ఆసామము ఆ మహర్షిచే దర్శింపఁబడినది (మొట్టమొదటగా నతఁడు దానిని గుర్తించి తదర్థాదికమును లోకము నకు వెల్లడించుటకు ఇట దర్శనమని వ్యవహారము). అనునర్థమున దర్శించిన వ్యక్తిని బోధించు తృతీయాంతపదమునకు, అణ్ ప్రత్యయము చేయును.

ఉదా : వసిష్ఠేనదృష్టం సామ - వసిష్ఠునిచే దర్శింపఁబడినసామము (వేద భాగము). వసిష్ఠ + టా + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, వాసిష్ఠ + అ యస్యేతిచ, అకారలోపము వాసిష్ఠ్ + అ=వాసిష్ఠ+సు=వాసిష్ఠమ్ (నపుం)

అప : పైసూత్రమున కొక అపవాదము చెప్పఁబడుచున్నది.

**సూ : వామదేవాడ్డ్యడ్డ్యౌ 4-2-9.**

**వృ : వామదేవేన దృష్టం సామ, వామదేవ్యమ్.**

వ వి : వామదేవాత్ (5-1) డ్యడ్డ్యౌ (డ్యత్, డ్య) (1-2)

అను : తేన (3-1) దృష్టమ్ (1-1) సామ (1-1) సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః (1-1)

అర్థ : వామదేవశబ్దమునకు అతనిచే దర్శింపఁబడినసామము' అనునర్థము నందు డ్యత్, డ్య అను ప్రత్యయములు వచ్చును. వామదేవునిచే దర్శింపఁబడిన సామము వామదేవ్యము.

వివ : వామదేవునిచే దర్శింపఁబడినసామము అనునర్థమున తృతీయాంతమగు వామదేవశబ్దమునకు పర్యాయముగా డ్యత్, డ్య అను ప్రత్యయములు చేయును, ఈ రెంటియందును డకారమునకు 'చుటూ' అను సూత్రముచే ఇత్సంజ్ఞ కలుగును. డ్యత్ ప్రత్యయమునందు తకారముకూడ ఇత్తే. ఇంక రెంటియందును మిగులునది 'య'

ఒక్కటియే. కావున నేర్పడు రూపమొక్కటియే. స్వరములో భేదమును దెలుపుటకై రెండు ప్రత్యయములు గ్రహింపబడినవి (స్వరమనగా ఉదాత్తాదికము)

ఉదా : వామదేవేన దృష్టంసామ – వామదేవ + టా, డ్యత్ డ్య' విభక్తి లోపము 'వామదేవ + య' అనియుండ 'యస్యేతిచ' అను సూత్రముచే 'వామదేవ' అనుదాని టి భాగమగు అకారమునకు లోపము వచ్చును వామదేవ్ + య = వామదేవ్య + సు = వామదేవ్యమ్ (టేః – 6-4-143 డిత్తుపరమగునపుడు భసంజ్ఞకముయొక్క టి భాగమునకు లోపమగును).

[వామదేవశబ్దములోని అకారలోపమునకు యస్యేతిచ అనుసూత్రమే చాలును. ప్రత్యయమున డకారం మిత్తుగా నుండనక్కరలేదు. కాని స్వరమునకు సంబంధించిన యొక విశేషమును స్ఫురింపజేయుటకై ప్రత్యయములు డిత్తులుగా నిర్దేశింపబడినవి తదనుగుణముగా 'టేః' అనుసూత్రముచే లోపముచేయబడినది].

అవ : పటియొక అర్థమున ప్రత్యయము విధింపబడుచున్నది

**సూ : పరివృతో రథః 4-2-14.**

**వృ : అస్మిన్నర్థేఽణ్ ప్రత్యయః. స్యాత్. వస్త్రైః పరివృతో వాస్త్రో రథః.**

ప వి : పరివృతః (1-1) రథః (1-1).

అను : తేన (3-1) ప్రత్యయః (1-1) తద్ధితః, సమర్థానాం ప్రథమాద్వా. అణ్ (1-1)

అర్థ : 'దానిచే పరివృతమైన రథము' అనునర్థమున అణ్ ప్రత్యయమగును ఉదా : వస్త్రముచే పరివృతమైనది, వాస్త్రః, రథః

వివ : 'పరివృతము' = అన్నివైపులను కప్పబడినది. అట్టిరథము చెప్పబడునపుడు దేనితో కప్పబడినదో తద్వాచక తృతీయాంతమునకు అణ్' ప్రత్యయము చేరును.

ఉదా : వస్త్రైః పరివృతో రథః – వస్త్రముచే గప్పబడిన రథము ఇందు రథమును అన్నివైపులను కప్పుటకు ఉపయోగింపబడినవస్తువు వస్త్రము. తద్వాచక తృతీయాంతము, వస్త్రైః అనునది. దానికి ఈ సూత్రముచే 'అణ్' ప్రత్యయము. వస్త్ర + టా + అణ్, ప్రాతిపదికసంజ్ఞ కలిగి విభక్తి (టా) లోపించును. ప్రత్యయము ణిత్తగుటచే ఆదివృద్ధి కలుగును. వాస్త్ర+అ, 'యస్యేతిచ' అకార లోపము, వాస్త్ర్ + అ = వాస్త్ర + సు = వాస్త్రః.

అవ : అర్థాంతరము చెప్పఁబడుచున్నది. 'శేష' అనునది నివృత్తమగు చున్నది.

**సూ : తత్రోద్ధృత మమత్రేభ్యః 4-2-14.**

**వృ: శరావే ఉద్ధృతః. శారావ ఓదనః.**

వ. వి : తత్ర (అవ్య) ఉద్ధృతమ్ (1-1) అమత్రేభ్యః (5-3)

అను . సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః: ప్రత్యయః: అణ్ (1-1).

అర్థ : సప్తమ్యంతములగు పాత్రవాచక శబ్దములకు, 'తీసి దానియందుంచఁ బడినది' అనునర్థమున, 'అణ్' ప్రత్యయము వచ్చును ఉదా : శరావమునందు తీసి ఉంచఁబడినది – శారావః ఓదనః

వివ : 'తత్ర' అనుపదము సప్తమ్యర్థకము (దానియందు) : ఉద్ధృతమ్' అనగా తీసి 'ఉంచఁబడినది' అని యర్థము అమత్రములనగా పాత్రములు. ఒక పదార్థమును ఒకచోటినుండి తీసి ఏ పాత్రయందుంతుమో ఆ పాత్రను తెలుపు సప్తమ్యంతపదమునకు 'దానియందుంచఁబడినది' అను నర్థమున 'అణ్' ప్రత్యయము చేయును ఇందు ణకారమిత్తు ఆదివృద్ధి వచ్చును

ఉదా : శరావే ఉద్ధృతః ఓదనః మూకుడునందు తీసి ఉంచఁబడిన అన్నము. ఇందు 'శరావము' ఒకపాత్ర దాని యందుంచఁబడిన పదార్థము ఓదనము ఆ యర్థము నభివ్యక్తముచేయుచు సప్తమ్యంతపాత్రవాచకశబ్దమగు శరావే అనుదానికి పరముగా 'అణ్' ప్రత్యయము వచ్చును. శరావ + ఙి + అణ్ ప్రాతిపదికత్వము, విభక్తిలోపము, శరావ + అ, ఆదివృద్ధి, శారావ + అ, యస్యేతిచ-అకారలోపము, శారావ్ + అ = శారావ + సు=శారావః. మూకుటిలో నుంచఁబడిన అన్నము మొదలగునది.

**సూ : సంస్కృతం భక్షాః 4-2-16.**

**వృ : సప్తమ్యన్తాదణ్ స్యాత్సంస్కృతేఽర్థే యత్సంస్కృతం భక్షాశ్చేత్ తేస్యుః. భ్రాష్ట్రేషు సంస్కృతా భ్రాష్ట్రా భక్షాః.**

వ. వి : సంస్కృతమ్ (1-1) భక్షాః (1-3).

అను : తత్ర (అవ్య) అణ్ (1-1) తద్ధితః, ప్రత్యయః, సమర్థానాం ప్రథమాద్వా.

అర్థ : 'అందు సంస్కరింపఁబడినది' అనునర్థమున సప్తమ్యంతపదమునకు అణ్ ప్రత్యయము చేరును సంస్కరింపఁబడినవి భక్షములైనపుడే యీ ప్రత్యయము వచ్చును. ఉదా : భ్రాష్ట్రములందు సంస్కరింపఁబడిన భక్షములు - భ్రాష్ట్రాః.

వివ : సంస్కరించుట యనగా వంట మున్నగు వ్యాపారముచే గుణవిశేషము నొకదానియందు కలుగునట్లు చేయుట సంస్కృతమనగా నట్లు చేయఁబడినది. భక్షములనఁగా తినఁబడుపదార్థములు దేనియందు తినఁబడు పదార్థములు సంస్కరింపఁబడునో దానిని తెలుపున సప్తమ్యంతపదమునకు, సంస్కరింపఁబడిన పదార్థములను తెలియఁజేయుచు, అణ్ ప్రత్యయము వచ్చును

ఉదా : భ్రాష్ట్రేషు సంస్కృతాః, భ్రాష్ట్రము అనగా 'మంగలము' అనఁబడు ఒక విధమగువంటకు పనికివచ్చు మృణ్మయపాత్రము 'అందువండఁబడిన భక్షములు' అనునర్థమున 'భ్రాష్ట్రేషు' అను సప్తమ్యంతపదమునకు 'అణ్' ప్రత్యయము చేరును భ్రాష్ట్ర + సుప్ + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి ఆకారమునకు ఆకారమే వచ్చును భ్రాష్ట్ర + అ, 'యస్యేతిచ' అకారలోపము, భ్రాష్ట్ర + అ = భ్రాష్ట్ర, ఇది 'భక్షాః' అను బహువచనాంతమునకు విశేషణమగుటచే దీనికిని ప్రథమాబహువచన ప్రత్యయము చేరును భ్రాష్ట్ర + జస్ = భ్రాష్ట్రాః.

**సూ : సా ఽస్య దేవతా 4-2-24.**

**వృ : ఇన్ద్రో దేవతా ఽస్యేతి ఐన్ద్రంహవిః. పాశుపతమ్, బార్హస్పత్యమ్.**

ప వి : సా (1-1) అస్య (6-1) దేవతా (1-1),

అను : సమర్థానాం ప్రథమాద్వా; తద్ధితః; ప్రత్యయః అణ్ (1-1)

అర్థ : 'అది దానికి దేవత' అనునర్థమున ప్రథమాంతమునకు 'అణ్' ప్రత్యయము చేరును ఉదా : ఇంద్రుఁడు ఈహవిస్సునకు దేవత - ఐన్ద్రమ్, పాశుపతమ్, బార్హస్పత్యమ్.

వివ : ఒకదేవతను పేర్కొని 'అది ఈహవిరాదికమునకు 'దేవత' అనునర్థమును జెప్పవలసినపుడు ప్రథమాంతమగు దేవతావాచక శబ్దమునకు పరముగా అణ్ ప్రత్యయము వచ్చును. సూత్రమున 'సా' అను శబ్దము ప్రథమాంతదేవతావాచకములకు చిహ్నము. 'అర్పణము చేసెడు వస్తువునందు ఉద్దేశ్యవిశేషమైనది

'దేవత' అని నిర్వచింపఁబడినది. హవిస్సు నెవరినుద్దేశించి అర్పింతుమో అది 'దేవత'

ఉదా : ఇన్ద్రోదేవతాఅస్యహవిషః. ఈ హవిస్సునకు దేవత ఇంద్రుఁడు. ఇందు దేవతావాచకప్రథమాంతము 'ఇన్ద్రః' అనునది అతని నుద్దేశించి ఈయఁబడిన హవిస్సు ప్రత్యయాంతముచే తెలుపఁబడును. ఇన్ద్ర + సు + అణ్. విభక్తిలోపము, ఆదివృద్ధి (ఇ > ఐ) ఐన్ద్ర + అ, యస్యేతిచ, అకారలోపము. ఐన్ద్ర + అ=ఐన్ద్ర+సు=ఐన్ద్రమ్ (నపుం).

పశుపతిర్దేవతా అస్య - దీనికి పశుపతిదేవత. పశుపతి సు + అణ్ ('అశ్వపత్యాదిభ్యశ్చ' అనుసూత్రముచే ఈ యర్థమున 'అణ్' ప్రత్యయము) విభక్తి లోపము, ఆదివృద్ధి, పాశుపతి + అ, యస్యేతిచ, ఇకారలోపము పాశుపత్ + అ = పాశుపత + సు=పాశుపతమ్

బృహస్పతిర్దేవతాఽస్య - దీనికి బృహస్పతిదేవత - బృహస్పతిశబ్దము పత్యుత్తరపదము కావున 'దిత్యదిత్యాదిత్య పత్యుత్తర పదాణ్ణ్యః' అనుసూత్రముచే ఈ యర్థమున 'ణ్య' ప్రత్యయము వచ్చును. బృహస్పతి + సు + ణ్య (ణకారమిత్తు) విభక్తిలోపము, ఆదివృద్ధి (ఋ > ఆర్) బార్హస్పతి + య, యస్యేతిచ ఇకారలోపము బార్హస్పత్య + సు=బార్హస్పత్యమ్

సూ : శుక్రాద్ఘన్ 4-2-26.

వృ : శుక్రియమ్.

ప వి . శుక్రాత్ (5-1) ఘన్ (1-1).

అను : సా (1-1) అస్య (6-1) దేవతా (1-1) సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః.

అర్థ : 'శుక్రుఁడు దీనిదేవత' అనునర్థమున ప్రథమాంతమగు శుక్రశబ్దము నకు 'ఘన్' ప్రత్యయము వచ్చును ఉదా : శుక్రియమ్.

వివ : ఇది పూర్వసూత్రమున కపవాదము 'శుక్రుఁడు దేవతగాఁగలది'అను నర్థమున 'శుక్రః' అను ప్రథమాంతపదమునకు 'ఘన్' అను ప్రత్యయము చేయును. ఇందు నకారమిత్తు ఘకారమునకు (ఘ-అనుదానికి) 'ఆయనేయీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్' అను సూత్రముచే 'ఇయ్' అను నాదేశము వచ్చును (ఘ+అ=ఇయ్ + అ). ఇందు ఆదివృద్ధికి నిమిత్తము లేదు ఆదివృద్ధికి నిమిత్తములుణిత్తు, ఞిత్తు,కిత్తులు.

ఉదా : శుక్రో దేవతా అస్య - ఈ హవిస్సునకు శుక్రుఁడు దేవత శుక్ర + సు - ఘన్, విభక్తి లోపము, శుక్ర + ఘ, ఇయాదేశము, శుక్ర + ఇయ, యస్యేతి చ అకారలోపము, శుక్ + ఇయ, శుక్రియ + సు = శుక్రియమ్ (నపుం)

సూ : సోమాట్ట్యణ్ 4-2-30.

వృ : సౌమ్యమ్.

ప వి : సోమాత్ (5-1) ట్యణ్ (1-1).

అను . సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః; ప్రత్యయః: సా (1-1) అస్య (6-1) దేవతా (1-1)

అర్థ : 'అది దాని దేవత' అను నర్థమున 'సోమః' అను ప్రథమాంతమునకు ట్యణ్ ప్రత్యయము చేరును. ఉదా : సౌమ్యమ్

వివ : సోమోదేవతా అస్య'-ఈ హవిరాదికమునకు సోముఁడు దేవత అను నర్థము 'సోమః' అనుసమర్థప్రథమాంతమునకు 'ట్యణ్' అను తద్ధిత ప్రత్యయము వచ్చును ఇందు టకారణకారములిత్తులు (చుటూ, హలన్త్యమ్) 'య' మిగులును ణిత్తగుటచే ఆదివృద్ధి

ఉదా : సోమోదేవతా అస్య - సోమ + సు + ట్యణ్, విభక్తి లోపము, సోమ + ట్యణ్, ఆ-వృద్ధి (ఓ > ఔ) సౌమ + య, యస్యేతిచ - అకార లోపము, సౌమ్య + సు=సౌమ్యమ్

సూ వాయ్వృతు పిత్రుషసోయత్ 4-2-31.

వృ : వాయవ్యమ్, ఋతవ్యమ్.

ప. వి : వాయ్వృతు పిత్రుషసః (5-1) యత్ (1-1).

అను : సమర్థానాం ప్రథమాద్వా; తద్ధితః; ప్రత్యయః, సా (1-1) అస్య (6-1) దేవతా (1-1)

అర్థ : 'అది వీనిదేవత' అనునర్థమున ప్రథమాంతములగు వాయు, ఋతు, పితృ, ఉషస్ అనువానికి 'యత్' ప్రత్యయమగును. ఉదా : వాయవ్యమ్, ఋతవ్యమ్.

వివ ఈ యత్ ప్రత్యయము 'సాస్యదేవతా' అనుసూత్రముచే ప్రాప్తమగు 'అణ్' ప్రత్యయమున కపవాదము. వాయుః, ఋతుః, పితా, ఉషః అను ప్రథ

ప్రాంతములకు, వాయ్వాదులు దేవతలుగాఁగలహవిరాదులు అర్థములైనపుడు, యత్ ప్రత్యయము చేరును ఇందును ఆదివృద్ధికి నిమిత్తము లేదు.

ఉదా : వాయుర్దేవతాస్య - వాయువు దేవతగాఁగలది వాయు + సు + యత్, తకారమిత్తు, విభక్తిలోపము. వాయు + య, 'ఓర్గుణః' అను సూత్రముచే ఉకారమునకు గుణము, వాయో + య, 'వాన్తో యి ప్రత్యయే' అనుసూత్రముచే ఓకారమునకు అవాదేశము వాయవ్ + య = వాయవ్య + సు = వాయవ్యమ్.

ఋతుర్దేవతాఽస్య - ఋతువు దేవతగాఁగలది ఋతు + సు + యత్. ఋతు + య, గుణము, ఋతో + య, అవాదేశము, ఋతవ్ + య = ఋతవ్య + సు = ఋతవ్యమ్

అపి : 'పితా దేవతా అస్య - పితృదేవతగాఁగలది పితృ + సు + యత్, విభక్తిలోపము 'పితృ + య' అనియుండ క్రింది సూత్రము కార్యవిశేషమును విధించుచున్నది

సూ : రీఙృతః 7-4-27.

వృ : అకృద్యకారేఽసార్వధాతుకే యకారే చ్వౌ చ పరే ఋతో రీఙాదేశః. 'యస్యేతిచ' పిత్ర్యమ్

ప వి: రీఙ్ (1-1) ఋతః (6-1)

అను : అఙ్గస్య (6-1) అకృత్సార్వధాతుకయోః (6-2) (అవ్య) యి (7-1)

అర్థ : అకృద్యకారమును, అసార్వధాతుకయకారమును మును పరమగునపుడు, ఋదంతమైన అంగమునకు రీఙాదేశము వచ్చును. తిచ' అనుసూత్రముచే ఈకారలోపము పిత్ర్యమ్

వివ : 'ఋతః' అనునది 'అంగస్య' అనుదానికి విశేషణము. తదంతవిధిచే 'హ్రస్వఋకారము అంతమునఁగల అంగముయొక్క స్థానమున' అను సర్థము సిద్ధించును (తపరస్తత్కాలస్య, షష్ఠీస్థానేయోగా అను పరిభాషలు సమన్వయించుకొనవలయును). కృత్తు అనగా ధాతువునకు చేరు తిఙ్భిన్న ప్రత్యయము అది కానిది అకృత్తు. సార్వధాతుక మనగా ధాతువులకు చేరు తిఙ్లు శిత్తులైన ప్రత్యయములు అవికానిది అసార్వధాతుకము. కృత్తుకానిదాని యకారముగాని, సార్వధాతుకము కాని దాని యకారముగాని, చ్వి ప్రత్యయముగాని పరమగునపుడు ఋదంత

మైన అంగముయొక్క తుదివర్ణమునకు (జిహ్వ) 'రీ(ఙ్)' అను ఆదేశము వచ్చును. (ఙకారమిత్తు) (ఙిత్తుకావున నీయాదేశము తుదివర్ణమునకగును).

ఉదా : పితృశబ్దమునకు 'పితాదేవతాఅస్య' అనునర్థమునందు వాయ్వృతు పిత్రుషసోయత్ అనుసూత్రముచే యత్ ప్రత్యయము వచ్చి పితృ + య అని యేర్పడుట ఈ సూత్రముయొక్క అవతారికలో చూపఁబడినది. పితృ + య - ఇచట యకారము కృత్సంబంధికాదు, సార్వధాతుక ప్రత్యయసంబంధియుకాదు ఇది తద్ధిత ప్రత్యయము కాన పితృ' అను అంగముయొక్క తుదివర్ణమైన ఋకారమునకు రీ' అను నాదేశము వచ్చును పిత్రీ + య, యస్యేతిచ అను సూత్రముచే ఈకారలోపము పిత్ + య = పిత్ర్య + సు = పిత్ర్యమ్.

అవ : 'వాయ్వృతు' ఇత్యాదిసూత్రమునందలి 'ఉషస్' శబ్దమున కుదాహరణము.

వృ : ఉషస్యమ్

వివ : ఉషోదేవతాస్య - ఉషస్సు దీనియొక్క దేవత ఉషస్ + సు యత్, విభక్తిలోపము, ఉషస్ + య=ఉషస్య + సు =ఉషస్యమ్

'సాస్యదేవతా' అనునర్థమున ప్రత్యయములు ఇంతటితో ముగిసినవి

సూ : పితృవ్య మాతుల మాతామహ పితామహాః 4-2-36.

వృ : ఏతేనిపాత్యన్తే. పితుర్భ్రాతా పితృవ్యః, మాతుర్భ్రాతా మాతులః, మాతుఃపితా మాతామహః, పితుఃపితా పితామహః.

ప. వి : పితృవ్య .... పితామహాః (1-3).

అర్థ : ఇవి నిపతింపఁబడుచున్నవి. పితయొక్క భ్రాతపితృవ్యః, మాతయొక్క భ్రాత = మాతులః, మాతయొక్క తండ్రి మాతామహః, పితయొక్క తండ్రి పితామహః.

వివ : పితృమాతృ శబ్దములకు ప్రత్యయవిధానము చేయకయే పాణిని కొన్ని యర్థములందు రూపమును నిపతింపఁజేసెను. తండ్రి సోదరుఁడు అనునర్థమున పితృ

మాతృశబ్దమునుండి 'మాతుల' అనునదియు 'తల్లి తండ్రి' అనునర్థమున మాతృ శబ్దమునుండి 'మాతా మహ' అనురూపమును, 'తండ్రి తండ్రి' అను నర్థమున పితృ శబ్దమునుండి 'పితామహ' అనునదియు నేర్పడునని ప్రత్యయములను పేర్కొనకయే రూపములను ప్రదర్శించెను ప్రక్రియతో నిమిత్తములేక ఇః రూపమిట్లుండునని నిర్దేశించుటను నిపాతమందురు.

కాని వార్తికకారుడు వీనికి ప్రకృతివిభాగము నొనరించెను. (1) 'పితుర్భ్రాతరి వ్యత్' పితృశబ్దమునకు అతనిసోదరుడు అనునర్థమున 'వ్యత్' ప్రత్యయము. పితృ + జస్ + వ్యత్, పితృవ్య + సు=పితృవ్యః (2) 'మాతుర్డులచ్'- మాతృశబ్దమునకు ఆమె సోదరుడు అనునర్థమున 'డులచ్' ప్రత్యయము మాతృ+ జస్, డులచ్, (డకారచకారము లిత్తులు) మాతృ + ఉల, 'టేః' అను సూత్రముచే ఋకారమునకు లోపము. మాత్ + ఉల = మాతుల + సు = మాతులః. (3) 'మాతృ పితృభ్యాం పితరి డామహచ్' - మాతృ పితృశబ్దములకు వారితండ్రి అనునర్థమున 'డామహచ్' ప్రత్యయమగును మాతృ + జస్ + డామహచ్ (డ్, చ్ లు ఇత్తులు) టిలోపము మాత్+ఆమహ = మాతామహ + సు = మాతామహః పితృ + జస్ + డామహచ్, పిత్ + ఆమహ=పితామహ + సు = పితామహః

**సూ : తస్య సమూహః 4-2-37**

**వృ : కాకానాం సమూహః కాకమ్.**

ప వి : తస్య (6-1) సమూహః (1-1)

అర్థ : వానియొక్క సమూహము అనునర్థమున సమర్థషష్ఠ్యంతమునకు అణ్ ప్రత్యయము వచ్చును. ఉదా : కాకులయొక్క సమూహము=కాకమ్.

వివ : 'తస్య' అనునది షష్ఠ్యంత పదమునకు చిహ్నము. దేనియొక్క సమూహము చెప్పబడునో తద్వాచకషష్ఠ్యంతమునకు, సమూహమను నర్థమును దెలియజేయుచు 'అణ్' ప్రత్యయము వచ్చును.

ఉదా : 'కాకానాం సమూహః' కాకులయొక్క సమూహము. కాక + ఆమ్, అణ్, ప్రాతిపదికసంజ్ఞ, విభక్తిలోపము, కాక్ + అ(ణ్), ఆదివృద్ధి, ఆకారమునకు ఆకారమేయగును. కాక + అ, యస్యేతిచ-అకారలోపము కాక్+అ = కాక+సు=కాకమ్ (నపుం).

సూ : భిక్షాదిభ్యోఽణ్ 4-2-38.

వృ : భైక్షమ్. గర్భిణీనాం సమూహో గార్భిణమ్. ఇహ 'భస్యాఢే తద్ధితే' ఇతి పుంవద్భావే కృతే —

ప. వి : భిక్షాదిభ్యః (5-3) అణ్ (1-1)

అను : తస్య (6-1) సమూహః (1-1) సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః, ప్రత్యయః.

అర్థ : భిక్షాదులకు, 'వానిసమూహము' అనునర్థమున 'అణ్' ప్రత్యయ మగును. ఉదా : భైక్షమ్ గర్భిణులసమూహము అనునర్థమున భస్యాఢే తద్ధితే' అను వార్తికముచే పుంవద్భావము కాఁగా (వక్ష్యమాణసూత్రముచే కార్యము చెప్పఁబడుచున్నది).

వివ : 'తస్యసమూహః' అనుసూత్రముచే భిక్షాదులకు ప్రాప్తమగు అణ్ ప్రత్యయమునకు రక్, అఞ్ మొ॥లగు ప్రత్యయము లపవాదములుగా చెప్పఁబడి యుండుటచే వానిని బాధించుటకు మఱల నీసూత్రముచే 'అణ్' ప్రత్యయము విధింపఁబడినది. భిక్షమున్నగువాని షష్ఠ్యంతరూపములకు, 'వాని సముదాయము' అనునర్థమున 'అణ్' ప్రత్యయము చేరును.

ఉదా : భిక్షాణాం సమూహః - భిక్షములసమూహము భిక్షా + ఆమ్, అణ్, విభక్తిలోపము. భిక్షా + అణ్, ఆదివృద్ధి (ఇ> ఐ) భైక్షా + అ, యస్యేతిచ - ఆకారలోపము, భైక్ష్ + అ=భైక్ష+సు= భైక్షమ్ (నపుం)

గర్భః అస్యా స్త్రీతి గర్భిణీ, గర్భముగలస్త్రీ. ఇచట గర్భశబ్దమునకు 'అది కలది' అనునర్థమున 'ఇన్' ప్రత్యయముచేరి 'గర్భిన్' అగును. దానికి స్త్రీత్వమున 'ఙీప్' ప్రత్యయముచేరి 'గర్భిణీ' అగును ప్రకృతమున గర్భిణీనాం సమూహః, అనునర్థమున అణ్ ప్రత్యయము 'గర్భిణీ + ఆమ్ + అణ్, విభక్తిలోపము, గర్భిణీ + అణ్ అనియుండ, 'భస్యాఢే తద్ధితే' (3028) (ఢ భిన్న తద్ధిత ప్రత్యయము పరమగునపుడు భసంజ్ఞకమైన స్త్రీప్రత్యయాంతరూపమునకు పుంవద్భావమువచ్చును) అను వార్తికముచే 'గర్భిణీ' శబ్దమునకు పుంవద్భావము వచ్చును. అనగా 'ఙీప్' ప్రత్యయము అదృశ్యమగును. గర్భిన్ + అ(ణ్) అని యుండును. ఆదివృద్ధి రాఁగా 'గార్భిన్ + అ' అగును. ఇట్టియెడ 'నస్తద్ధితే' అను సూత్రముచే ఇందలి 'ఇన్' భాగమునకు లోపము రావలసియుండఁగా క్రింది సూత్రము దానిని వారించుచున్నది.

సూ : ఇనణ్యనపత్యే 6-4-164.

వృ : అనపత్యార్థేఽణి ఇన్ ప్రకృత్యా. తేన నస్తద్ధిత ఇతి టిలోపో న.

ప వి : ఇన్ (1-1) అణి (7-1) అనపత్యే (7-1).

అను : ప్రకృత్యా (3-1).

అర్థ . అనపత్యార్థకమగు అణ్ ప్రత్యయము పరమగునపుడు 'ఇన్' అను నది ప్రకృతితో నుండును దీనిచే నస్తద్ధితే' అను సూత్రమువలన నగుటిలోపము రాదు. గార్గిణమ్

వివ : 'అణ్' ప్రత్యయము అనేకార్థములలో విధింపఁబడినది అపత్యార్థమున విధింపఁబడినది కాక తక్కిన అర్థములలో విధింపఁబడిన అణ్ ప్రత్యయము పరమగునపుడు పూర్వమున నున్న శబ్దస్వరూపముయొక్క 'టి' అగు ఇన్' అను నది ప్రకృతితోనుండును అనగా దానికి విధింపఁబడిన లోపము రాదని తాత్పర్యము

ఉదా : గార్గిన్ + అ, ఇచట అణ్ ప్రత్యయము సమూహమునునర్థమున వచ్చినది. కావున 'నస్తద్ధితే' అనుసూత్రమువలన రావలసిన టిలోపమును ప్రకృతి సూత్రము వారించినది నకారమునకు రేఫయోగమువలన ణత్వము. (అట్ కుప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి) గార్గిణ + సు = గార్గిణమ్

అవ : శిక్షాదులలోనిదే యగు పతిమొక యుదాహరణము చూపఁబడు చున్నది.

**వృ : యువతీనాం సమూహో యౌవనమ్. శతృప్రత్యయాన్తాదనుదాత్తా 'దేరఞితీ యౌవతమ్'.**

అర్థ : యువతుల సమూహము అనునర్థమున 'యౌవనమ్' అని యగును. శతృప్రత్యయాంతమునకు ('యువతీ' అనుదానికి) 'అనుదాత్తాదేరఞ్' అనుసూత్రముచే అఞ్ ప్రత్యయము రాగా దానినుండి 'యౌవతమ్' అనియు రూపమగును.

వివ : సంస్కృతమున యౌవనము గలది అనునర్థమున 'యువతిః' అను ఇకారాంతశబ్దమొకటియు, 'యువతీ' అను ఈకారాంతశబ్దమొకటియుగలదు ఇందు మొదటిది 'యువన్' శబ్దమునకు 'తి' అను స్త్రీ ప్రత్యయము చేరగా నేర్పడినది (యూనస్తిః) రెండవది యుధాతువునకు శతృప్రత్యయము చేరగా నేర్పడిన

యువత్ అనుదానికి 'ఉగితశ్చ' అను సూత్రముచే 'ఙీప్' ప్రత్యయము చేరగా నేర్పడినది. ఈ రెండిటికిని సమూహార్థక ప్రత్యయము చేరగా మొదటిదానినుండి 'యౌవనమ్' అనియు, రెండవదానినుండి 'యౌవతమ్' అనియు రూపము లేర్పడును ప్రక్రియ చూతము.

(1) యువతీనాం సమూహః – (ఇచట తి ప్రత్యయాంతము గ్రహింపఁ బడినది) – యువతులసమూహము – యువతి + ఆమ్, అణ్ (భిక్షాదిభ్యోఽణ్) విభక్తిలోపము యువతి + అణ్, 'భస్యాఢేతద్ధితే' అను వార్తికముచే పుంవద్భావము (యువన్ + తి – తిప్రత్యయము పోవును) యువన్ + అణ్, ఆదివృద్ధి, యౌవన్ + అ అనియుండ 'నస్తద్ధితే' అనుసూత్రముచే టిలోపము ప్రాప్తింపఁగా 'అన్' అనుసూత్రము దానిని వారించును యౌవన + సు = యౌవనమ్.

'యు' మిశ్రణామిశ్రణయోః అనుధాతువునకు శతృప్రత్యయము చేర్చినచో 'యువత్' అనురూపమేర్పడును. దీనికి స్త్రీత్వమున 'ఉగితశ్చ' అనుసూత్రముచే 'ఙీప్' ప్రత్యయ మగును. 'యువతీ' – ఈ శబ్దమునుండి ఏర్పడిన సమూహార్థక రూపము 'యౌవతమ్' అగును. యువతీ + ఆమ్, అఞ్, అనుదాత్తాదేరఞ్ 4-2-44 (అనుదాత్తాంతమై, ఇకారాంతమైన శబ్దమునకు సమూహార్థమున అఞ్ ప్రత్యయమగును) అను సూత్రముచే ఇచట అఞ్ ప్రత్యయము. (భిక్షాది గణములో 'యువతీ' శబ్దములేదు యువతి అను తి ప్రత్యయాంతమే కలదు) విభక్తిలోపము యువతీ + అఞ్, పుంవద్భావము (యువత్ + ఈ, పుంవద్భావముచే 'ఈ' ప్రత్యయము అదృశ్యమగును) యువత్ + అఞ్, ఆదివృద్ధి, యౌవత్ + అ = యౌవత + సు = యౌవతమ్.

పుంలింగరూపములోని భేదమునుబట్టి (యువన్, యువత్) ఈరెండురూపము లేర్పడును.

**భిక్షాదిగణము** : భిక్షా గర్భిణీ క్షేత్ర కరీష అఙ్కార (అఙ్గార) చర్మిన్ (వర్మన్) ధర్మిన్ సహస్ర యువతి పదాతి పద్ధతి అథర్వన్ దక్షిణా (భూతవిషయ శ్రోత్ర). ఇతి భిక్షాదిః

**సూ : గ్రామజనబన్ధుభ్యస్తల్ 4-2-43.**

**వృ : తలన్తం స్త్రియామ్. గ్రామతా, జనతా, బన్ధుతా.**

**ప వి : గ్రామజన బన్ధుభ్యః (5-3) తల్ (1-1).**

అను : తస్య (6-1) సమూహః (1-1) సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః, ప్రత్యయః

అర్థ : గ్రామ, జన, బంధు అను శబ్దములకు 'వానిసమూహము' అనునర్థమున 'తల్' ప్రత్యయము చేరును. తల్ ప్రత్యయాంతము స్త్రీలింగమగును. ఉదా: గ్రామతా, జనతా, బన్ధుతా.

వివ : 'గ్రామాదులసమూహము అనునర్థమున' షష్ఠ్యంతములగు గ్రామ, జన, బంధు అను పదములకు పరముగా 'తల్' అను ప్రత్యయము చేరును ఇందు లకారమిత్తు 'తల న్తంస్త్రియామ్' అను లింగానుశాసనసూత్రమువలన 'తల్' ప్రత్యయము అంతమునఁగల శబ్దములు స్త్రీలింగములగును. వానికి స్త్రీత్వమున 'టాప్' అను ప్రత్యయము చేరునని భావము.

ఉదా : గ్రామాణాం సమూహః - గ్రామముల సమూహము. గ్రామ + ఆమ్ + తల్, విభక్తిలోపము గ్రామ + త(ల్) గ్రామత, స్త్రీత్వమున టాప్ ప్రత్యయము (అజాద్యతష్టాప్), గ్రామత + టాప్ (టకారపకారములిత్తులు) గ్రామత + ఆ, సవర్ణదీర్ఘము గ్రామతా + సు = గ్రామతా.

ఇట్లే జనానాం సమూహః, జనముల సమూహము, జన + ఆమ్, తల్, జనతా. బన్ధూనాం సమూహః, బంధు + ఆమ్, తల్, బన్ధుతా (బంధువుల సమూహము.)

అవ : పై సూత్రమున కనుబంధముగా నొకవార్తికము చెప్పఁబడుచున్నది.

**వా॥ గజసహాయాభ్యాం చేతి వక్తవ్యమ్ (2721).**

**వృ : గజతా, సహాయతా.**

ప. వి : గజసహాయాభ్యామ్ (5-2) చ (అవ్య) ఇతి (అవ్య) వక్తవ్యమ్ (1-1).

అర్థ : గజ, సహాయశబ్దములకును, సమూహార్థమున 'తల్' ప్రత్యయము చెప్పనగును, ఉదా : గజతా, సహాయతా.

వివ : సూత్రములో ఉన్న మూఁడు శబ్దములకే కాక గజ, సహాయ అను వాని షష్ఠ్యంతరూపములకును, 'వానిసమూహము' అనునర్థమున 'తల్' ప్రత్యయము వచ్చునని వార్తిక తాత్పర్యము.

ఉదా : గజానాం సమూహః - గజములసమూహము. గజ+ఆమ్, తల్
గజ + త, గజత + టాప్, గజతా + సు = గజతా.

సహాయానాం సమూహః- సహాయులసమూహము. సహాయ + ఆమ్, తల్,
సహాయత + టాప్, సహాయతా + సు = సహాయతా.

వా॥ అహ్నః ఖః క్రతౌ 2722.

వృ : అహీనః.

ప. వి . అహ్నః (5-1) ఖః (1-1) క్రతౌ (7-1).

అర్థ : క్రత్వర్థమున వర్తమానమగు 'అహన్' శబ్దమునకు సమూహార్థమున ఖ ప్రత్యయమగును. ఉదా : అహీనః.

వివ : యజ్ఞసంబంధమైన అహస్సులసమూహము అనునర్థమున షష్ఠ్యంతమగు 'అహన్' శబ్దమునకు, ఖప్రత్యయము వచ్చును, ఇట్టి అహస్సులను పౌత్యాహస్సులందురు. ఇందు ఖకారమునకు ఆయనేయాపీత్యాదిసూత్రముచే 'ఈన్' ఆదేశమగును. (ఖ్ + అ = ఈన్ + అ = ఈన).

ఉదా : అహ్నాం సమూహః - పౌత్యాహస్సులసమూహము, అహన్ + ఆమ్, ఖ, విభక్తిలోపము అహన్ + ఖ, ఈనాదేశము, అహన్ + ఈన్ + అ 'అహన్ + ఈన', 'అహ్నష్టఖోరేవ' అనుసూత్రముచే టిలోపము (అహన్ శబ్దమునకు, ట, ఖ ప్రత్యయములు పరములగునపుడే టిలోపము వచ్చును) అహ్ + ఈన = అహీన + సు = అహీనః.

సూ : అచిత్తహస్తిధేనోష్ఠక్ 4-2-47

ప వి : అచిత్తహస్తిధేనోః (5-1) ఠక్ (1-1).

అను : తస్య (6-1) సమూహః (1-1) సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః, ప్రత్యయః

అర్థ : అప్రాణివాచకశబ్దములకును, హస్తి, ధేనుశబ్దములకును, 'వాని సమూహము' అనునర్థమున 'ఠక్' ప్రత్యయము వచ్చును.

వివ : అచిత్తములనగా చిత్తములేనివి. అనగా అప్రాణులు. అప్రాణివాచకములయొక్కయు, హస్తిధేనుశబ్దములయొక్కయు షష్ఠ్యంతరూపములకు, వాని సమూహము అనునర్థమున 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఇందు కకారమిత్తు. కావున 'కితిచ' అనుసూత్రముచే ఆదివృద్ధియగును.

ఉదా : సక్తూనాం సమూహః - సక్తువుల (పేలపిండియొక్క) సమూహము, సక్తువు అప్రాణివాచకము. సక్తు + ఆమ్ + ఠక్, ప్రాతిపదిక సంజ్ఞయు విభక్తి లోపమును రాఁగా సక్తు + ఠక్ అని యగును ఆదివృద్ధి, సాక్తు + ఠ.

అవ : అంగ సంజ్ఞకలదానికి పరముగా నున్న 'ఠ' అనుదానికి 'ఇక' ఆదేశమగునని 'ఠస్యేకః' అనుసూత్రము చెప్పినది. దానివలన పై ఉదాహరణమున 'ఇకాదేశము' ప్రాప్తించుచుండగా నీక్రింది సూత్రముచే అపవాదము చెప్పఁబడుచున్నది.

సూ : ఇసుసుక్తాన్తాత్కః 7-3-50.

వృ : ఇస్, ఉస్, ఉక్ త్ ఏతదన్తాత్ పరస్య ఠస్య కః. సాక్తుకమ్, హాస్తికమ్, ధైనుకమ్.

ప. వి ; ఇసుసుక్తాన్తాత్ (5-1) కః (1-1)

అను : అఙ్గస్య (6-1) ఠస్య (6-1)

అర్థ : ఇస్, ఉస్, ఉక్, త్ అనునవి అంతమునఁగల అంగమునకు పరముగా నున్న 'ఠ' అనుదానికి 'క' అనునాదేశమగును ఉదా : సాక్తుకమ్, ధైనుకమ్.

వివ : ఇది 'ఠస్యేకః' అనుసూత్రమున కపవాదము ఇస్, ఉస్ అనువర్ణ సముదాయములును, ఉక్ ప్రత్యాహారములోని ఉ, ఋ, ఌ అనునవియు, త్ అను వర్ణమును అంతమునఁగల అంగమునకు పరముగానున్న 'ఠ' అనుదానికి 'క' అనునాదేశమగును.

ఉదా : 'సాక్తు + ఠ' (ఇంతవఱకు ప్రక్రియ పైసూత్రవివరణమునఁ జూపఁబడినది). సాక్తు + క = సాక్తుక + సు = సాక్తుకమ్. (సక్తుశబ్దము ఉకారాంతము).

ఇట్లే 'ధేనూనాం సమూహః' - ధేనువుల సమూహము-ధేను + ఆమ్, ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఏ > ఐ) ధైను + ఠ, కాదేశము, ధైనుక + సు= ధైనుకమ్.

హస్తినాం సమూహః - 'ఏనుఁగులసమూహము' - హస్తిన్ + ఆమ్, ఠక్, విభక్తిలోపము. హస్తిన్ + ఠక్, ఆదివృద్ధి, హాస్తిన్ + ఠ, ఇది ఇసాద్యంతము కాదు కావున 'క' ఆదేశమురాదు. 'ఠస్యేకః' అనుసూత్రముచే ఇకాదేశమే అగును.

'హాస్తిన్ + ఇక, న స్తద్ధితే టిలోపము, హాస్త్ + (ఇన్) ఇక=హాస్తిక + సు = హాస్తికమ్.

అవ : సమూహార్థక ప్రత్యయములు పూర్తి అయినవి. అర్థాంతరమున ప్రత్యయములు విధింపబడుచున్నవి.

సూ : తదధీతే తద్వేద 4-2-59.

ప వి : తత్ (2-1) అధీతే (క్రియాపదము) తత్ (2-1) వేద (క్రియా పదము).

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః, అణ్ (1-1).

అర్థ : దానినధ్యయనము చేయువాఁడు, దానినెఱుఁగువాఁడు, అనునర్థమున సమర్థద్వితీయాంతపదములకు 'అణ్' ప్రత్యయమగును.

వివ : సూత్రమునందలి 'తత్' అను - రెండుపదములు ద్వితీయాంతమునకు చిహ్నములు. ఆయాశాస్త్రాదులను బేర్కొని వాని నధ్యయనము చేయువాఁడు, వాని యర్థాదుల నెఱిఁగినవాఁడు అనుఅర్థము చెప్పవలసినపుడు, శాస్త్రాదివాచక ద్వితీయాంతములకు 'అణ్' ప్రత్యయము చేరును. అధ్యయనము, వేదనము అను రెండంశము లీసూత్రమున గ్రహింపఁబడినవి. ఇవి రెండును ఏకార్థములుకావా ? వీనికి భేదమేమి ? భేదము లేనిచో రెంటిని గ్రహింపనేల ? అనుశంకలు కలుగ వచ్చును వీనికి భేదము గలదు. గురువు చెప్పిన దానిని వెంట నుచ్చరించుచు వేదాదులను పఠించుట అధ్యయనము. విషయవిమర్శనపూర్వకమైన అర్థజ్ఞానమును పొందుట వేదనము. వేదములను చాలమంది వల్లెవేయుదురు. దానిపేరధ్యయనము భాష్యములను విమర్శించి అర్థజ్ఞానమును పొందుట వేదనము. ఈ రెంటిలో ఏది చెప్పఁబడవలసినను శాస్త్రాది నామములను దెలుపు శబ్దముల ద్వితీయాంతములకు ప్రకృతసూత్రముచే 'అణ్' ప్రత్యయమును, వక్ష్యమాణసూత్రములచే ఆయా అపవాద ప్రత్యయములును వచ్చును.

ఉదా : వ్యాకరణమధీతే వేదవా, వ్యాకరణమునధ్యయనము చేయువాఁడు లేక ఎఱుగువాఁడు. ఇందు వ్యాకరణ మొకవిద్య. సూత్రపాఠాదికమును వల్లె వేసెను అనిగాని, అర్థజ్ఞానమును పొందెను అనిగాని దీనికర్థము. వ్యాకరణ + అమ్ + అణ్, ప్రాతిపదిక సంజ్ఞ కలిగి విభక్తి లోపించును. వ్యాకరణ + అణ్.

అప : పై స్థితిలో ఆదివృద్ధి రావలసియుండగా నపవాదముగా కార్యాంత రము విధింపఁబడుచున్నది.

సూ : న య్వాభ్యాం పదాన్తాభ్యాం పూర్వౌ తు తాభ్యామైచ్ 7-3-3.

వృ : పదాన్తాభ్యాం యకారవకారాభ్యాం పరస్య న వృద్ధిః. కింతు తాభ్యాం పూర్వౌ క్రమాదైజావాగమౌ స్తః. వ్యాకరణ మధీతే వేద వా వైయాకరణః

ప వి : న (అవ్య) య్వాభ్యామ్ (5-2) పదాన్తాభ్యామ్ (5-2) పూర్వౌ (1-2) తు (అవ్య) తాభ్యామ్ (5-3) ఐచ్ (1-1)

అను : తద్ధితేషు (7-3) అచామ్ (6-3) ఆదేః (6-1) ఞ్ణితి (7-1) కితి (7-1) వృద్ధిః (1-1) అచః (6-1).

అర్థ : పదాంతములైన యకారవకారములకు పరముగా నున్న అచ్చునకు, వృద్ధిరాదు. కాని వానికి పూర్వమున క్రమముగా ఐ ఔ అనునవి యాగమము లగును. ఉదా : వైయాకరణః.

వివ : ఇది తద్ధితేష్వచామాదేః, కితిచ అనుసూత్రముల కపవాదము. కావున ఆరెండు సూత్రములచే ప్రాప్తమగు వృద్ధి నిది కొన్ని సందర్భములలో వారించు చున్నది. ఏ యచ్చునకు ఆ సూత్రములచే వృద్ధిప్రాప్తమగునో ఆ అచ్చు, పదము యొక్క అంతముననున్న యకారవకారములకు పరముగానుండినదగునెడల దానికి వృద్ధిరాదు కాని ఆ యకారవకారములకు పూర్వమున ఐఔవర్ణము లాగమము లగును. అనగా యకారమునకు పూర్వమున ఐకారమును, వకారమునకు పూర్వమున ఔకారమును ఆగమముగా వచ్చునని భావము. సూత్రమున 'పూర్వౌ' అనుపదము 'పూర్వావయవములు' అనునర్థమున ప్రయోగింపఁబడి యుండుటచే ఆగమముగా వగు నను నర్థము లభ్యమైనది.

ఉదా : వ్యాకరణ + అణ్, ఇచట ఆద్యచ్చునకు వృద్ధిరావలసియున్నది అది యీ సూత్రముచే నిషేధింపఁబడినది. ఇందు పదాంతమైన యకారముగలదా ? అని శంక కలుగవచ్చును. 'వి + ఆ, కరణ' అనునవి యీ పదముయొక్క అవయవ ములు. ఇందు 'వి' అనునుపసర్గముయొక్క ఇకారము పదాంతము. 'ఇకోయణచి' అను సూత్రముచే దానికాదేశమైనయకారము కూడ పదాంతమేయగును. కావున

'వ్య' అనుదానికి పరముగానున్న అకారము పదాంతయకారమునకు పరముగా నున్నదియే యగును దాని కీసూత్రముచే వృద్ధినిషేధము కలుగును. పిదప యకారమునకు పూర్వమున ఐకారమాగమముగా వచ్చును. వ్ + ఐయ్ ఆకరణ + అ (ణ్). వైయాకరణ + అ, యస్యేతిచ, అకారలోపము, వైయాకరణ్ + అ=వైయాకరణ + సు = వైయాకరణః. (ఈ సూత్రములేనిచో 'వ్యాకరణః' అనురూపమే యీ యర్థమున నేర్పడవలసి యుండును).

సూ : క్రమాదిభ్యో వున్ 4-2-61.

వృ : క్రమకః, పదకః, శిక్షకః, మీమాంసకః.

ప. వి : క్రమాదిభ్యః (5-3) వున్ (1-1).

అను : తత్ (2-1) అధీతే (క్రి. ప) తత్ (2-1) వేద (క్రి. ప) సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః; ప్రత్యయః.

అర్థ : క్రమాది శబ్దములకు దానినిఅధ్యయనముచేయువాఁడు, దాని నెఱిఁగిన వాఁడు అను నర్థమున 'వున్' ప్రత్యయము వచ్చును ఉదా : క్రమకః మొ॥వి

వివ : క్రమము, పదము అనునవి వేదాధ్యయనములోని పద్ధతులు. శిక్షా, మీమాంసలు శాస్త్రములు వీనితోపాటు 'సామన్' శబ్దము కూడ నీగణమునఁ గలదు. అదియొకవేదము వీని నధ్యయనముచేయుట, అర్థము నెఱుఁగుట అను నర్థములందు, ద్వితీయాంతములగు నీక్రమాదులకు 'వున్' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఇందు నకార మిత్తు 'వు' అనుదానికి 'యువోరనాకౌ' అనుసూత్రముచే 'అక' ఆదేశమగును ఇందాదివృద్ధికి నిమిత్తములేదు.

ఉదా : క్రమ మధీతే వేద వా. క్రమము నధ్యయనము చేయువాఁడు, లేక తదర్థము నెఱుఁగువాఁడు క్రమ + అమ్, వున్, విభక్తిలోపము, 'అక' ఆదేశము. క్రమ + అక, యస్యేతిచ అకారలోపము, క్రమ్ + అక = క్రమక + సు= క్రమకః.

ఇట్లే పదమధీతే వేదవా, పద + అమ్, వున్, పద + అక, యస్యేతిచ పద్ + అక = పదక + సు = పదకః.

శిక్షామధీతే వేదవా, శిక్షా + అమ్ + వున్, శిక్షా+అక, యస్యేతిచ అకార లోపము, శిక్ష్ + అక = శిక్షక + సు=శిక్షకః.

మీమాంసామధీతే వేదవా, మీమాంసా + అమ్, వున్, మీమాంసా + అక, అకారలోపము, మీమాంస్ + అక = మీమాంసక + సు = మీమాంసకః.

క్రమాదిగణము : క్రమ పద శిక్ష మీమాంసా సామన్ ఇతి క్రమాదిః.

ఇంతవఱకు దీనిని రక్తాద్యర్థిక ప్రకరణముగా నొక విభాగము గలదు. ఇటుపై చెప్పఁబడునవి చాతురర్థిక ప్రత్యయములు.

అవ : చాతురర్థిక ప్రకరణము అనగా నాలుగర్థములందు విధింపఁబడు ప్రత్యయములకు సంబంధించిన ప్రకరణమని యర్థము ఆ నాలుగర్థములును ముందు వివరింపఁబడుచున్నవి.

**సూ : తదస్మిన్నస్తీతి దేశే తన్నామ్ని 4-2-67.**

**వృ : ఉదుమ్బరా స్సన్త్యస్మిన్ దేశే ఔదుమ్బరః.**

ప వి : తత్ (1-1) అస్మిన్ (7-1) అస్తి (క్రి. ప) ఇతి (అవ్య) దేశే (7-1) తన్నామ్ని (7-1)

అను : సమర్థానాంప్రథమాద్వా. తద్ధితః; ప్రత్యయః, అణ్ (1-1).

అర్థ : 'అది యందుఁగలదు' అనునర్థమున, ప్రత్యయాంతముచే దేశము యొక్క నామము తెలియఁబడునపుడు, అణ్ ప్రత్యయము వచ్చును ఉదా : ఉదుంబరములు (ఒకవిధమగు వృక్షములు) గలదేశము-ఔదుంబరః.

వివ : సూత్రమునందలి 'తత్' పదము ప్రథమాంతమునకు చిహ్నము. 'అవి యందుఁగలవు' అనునర్థమును దెలుపును. ఏవికలవనిచెప్పదుమో వానిని వచించు శబ్దముల ప్రథమాంతరూపములకు అణ్ ప్రత్యయము వచ్చును. ఆ ప్రత్యయము చేరిన శబ్దరూపము ఆదేశమునకు నామమగునపుడే యీ ప్రత్యయము చేరును.

ఉదా : ఉదుమ్బరాః సన్త్యస్మిన్దేశే, ఉదుంబరములు గల దేశము. ఇందు ప్రథమోచ్చరితమైన ప్రథమాంతపదము 'ఉదుమ్బరాః' అనునది దానికి పరముగా, అవి గలదేశముయొక్కనామమును తెలుపుచు 'అణ్' ప్రత్యయము చేరును. ఉదుమ్బర + జస్, అణ్, ప్రాతిపదికసంజ్ఞ, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఉ> ఔ) ఔదుమ్బర + అ, యస్యేతిచ, ఔదుమ్బర్ + అ = ఔదుమ్బర+సు=ఔదుమ్బరః.

ఉదుంబరవృక్షములు గలదేశమున కిదిపేరు. ఇది వక్ష్యమాణమతుప్ ప్రత్యయమున కపవాదము. ఈ సూత్రమునఁ జెప్పఁబడిన అర్థము నాలుగర్థములలో మొదటిది

అవ : రెండవయర్థమున ప్రత్యయము విధింపఁబడుచున్నది.

**సూ : తేన నిర్వృత్తమ్. 4-2-68.**

**వృ : కుశామ్బేన నిర్వృత్తానగరీ కౌశామ్బీ.**

ప. వి : తేన (3-1) నిర్వృత్తమ్ (1-1).

అను : సమర్థానాం ప్రథమాద్వా; తద్ధితః; ప్రత్యయః; అణ్ (1-1) దేశే (7-1) తన్నామ్ని (7-1)

అర్థ : 'అతనిచే నేర్పఱుపఁబడినది' అనునర్థమున ఆ పేరుగలదేశము తెలియఁబడునపుడు సమర్థమగు తృతీయాంతపదమునకు అణ్ ప్రత్యయము వచ్చును. ఉదా : కుశాంబునిచే చేయఁబడిననగరి-'కౌశామ్బీ'

వివ : తేన అనునది ఇచట కర్తృవాచక తృతీయాంతమునకు చిహ్నము ఒకదేశవిశేషము ఒకవ్యక్తిచే నేర్పడినదైనచో, కర్తయగు ఆ వ్యక్తిని తెలుపు తృతీయాంతపదమునకు, 'అతనిచే చేయఁబడినది' అను నర్థమున 'అణ్' ప్రత్యయము వచ్చును. ప్రత్యయాంతము ఆదేశమునకు నామమైనపుడే యీ ప్రత్యయము వచ్చును.

**ఉదా :** కుశామ్బేన నిర్వృత్తానగరీ - కుశాంబునిచే నిర్మింపఁబడిన నగరి. ఇందు సమర్థములగు పదములలో మొదట ఉచ్చరింపఁబడినది 'కుశామ్బేన' అనునది. అది తృతీయాంతము అతనిచే నేర్పఱుపఁబడిననగరి అను నర్థమును తెలుపుచు దానికి 'అణ్' ప్రత్యయమగును. కుశామ్బ + టా, అణ్, విభక్తి లోపము, ఆదివృద్ధి, (ఉ>ఔ) కౌశామ్బ + అ, 'యస్యేతిచ' అకారలోపము, కౌశామ్బ్+అ='కౌశామ్బ' ఇది 'నగరీ' అను స్త్రీలింగశబ్దమునకు విశేషణమగుటచే ఇదియు స్త్రీలింగము కావలయును. 'టిడ్ఢాణఞ్....' ఇత్యాదివక్ష్యమాణసూత్రముచే అణ్ ప్రత్యయాంతములకు స్త్రీత్వమున 'ఙీప్' ప్రత్యయము వచ్చును. కౌశామ్బ + ఙీప్ (ఙకారపకారములిత్తులు) యస్యేతిచ, అకారలోపము, కౌశామ్బ్ + ఈ = కౌశామ్బీ + సు=కౌశామ్బీ.

**'అతనిచే నిర్మింపఁబడినది' అనునది రెండవయర్థము.**

అప : మూఁడవ అర్థము.

సూ : తస్య నివాసః 4-2-69.

వృ : శిబీనాం నివాసో దేశః శైబః.

ప వి : తస్య (6-1) నివాసః (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః, అణ్ దేశే (7-1) తన్నామ్ని (7-1)

అర్థ : 'అతని నివాసము' అనునర్థమున షష్ఠ్యంతపదమునకు 'అణ్' ప్రత్యయము వచ్చును ఉదా : శిబుల నివాసమైన దేశము-శైబః

వివ : 'వీరికి ఇది నివాసభూమి' అనునర్థమున ఎవరికి నివాసభూమియో వారిని తెలుపు పదముయొక్క షష్ఠ్యంతరూపమునకు పరముగా అణ్ ప్రత్యయము వచ్చును ప్రత్యయాంతముచే దేశముయొక్క నామము తెలుపఁబడవలయును

ఉదా : శిబీనాం నివాసో దేశః - ఇందు సమర్థములలో మొదటిది 'శిబీనామ్' అను షష్ఠ్యంతపదము 'వారియొక్క నివాసదేశము' అనునర్థమున అణ్ ప్రత్యయము దానికి చేరును శిబి + ఆమ్, అణ్, విభక్తిలోపము ఆదివృద్ధి (ఇ > ఐ) శైబి + అ, యస్యేతిచ - ఇకారలోపము, శైబ్ + అ = శైబః - ఇది శిబులు నివసించుదేశమునకు నామము

మూఁడవ అర్థమీసూత్రమునఁ దెలుపఁబడినది

అప : నాలుగవ అర్థము

సూ : అదూరభవశ్చ 4-2-70.

వృ విదిశాయా అదూరభవం వైదిశమ్.

ప. వి : అదూరభవః (1-1) చ (అవ్య)

అను : సమర్థానాం ప్రథమాద్వా; తద్ధితః, ప్రత్యయః, అణ్, తస్య (6-1) దేశే (7-1) తన్నామ్ని (7-1).

అర్థ : 'దానికి అదూరభవము' అనునర్థమున షష్ఠ్యంతపదమునకు, తన్నామకదేశము తెలియఁబడినపుడు, అణ్ ప్రత్యయము వచ్చును. ఉదా : విదిశకు అదూరభవము, వైదిశమ్.

వివ: దూరభవమనగా దూరమున నున్నది అదికానిది అదూరభవము. అనగా సమీపమున నున్నదని భావము దేనికి సమీపముననున్న దేశాదికము చెప్పఁబడునో, దానిని చెప్పుశబ్దముయొక్క షష్ఠ్యంతరూపమునకు పరముగా అణ్ ప్రత్యయము వచ్చును. ప్రత్యయాంతముచే దేశనామము తెలుపఁబడవలయును.

ఉదా : విదిశాయా అదూరభవం నగరమ్ - విదిశకు దగ్గఱగానున్న నగరము ఇందు ప్రథమోచ్చరితమైన 'విదిశాయాః' అను షష్ఠ్యంత పదమునకు అణ్ ప్రత్యయము. విదిశా + ఙస్, అణ్, విభక్తిలోపము, విదిశా + అణ్, ఆది వృద్ధి, (ఇ > ఐ) వైదిశా + అ, యస్యేతిచ - ఆకారలోపము వైదిశ్ + అ = వైదిశ + సు = వైదిశమ్ - ఇది విదిశకు దగ్గఱగానున్న నగరమునకు పేరు.

ఇది నాలుగవ యర్థము. 'తన్నామకదేశము వాచ్యమగుట' అను సామాన్య లక్షణముచే నీనాలుగర్థములయందు వచ్చు ప్రత్యయములకు చాతురర్థిక సంజ్ఞ కలిగినది

అవ . ఈ చాతురర్థిక ప్రత్యయమునకు కొండొకయెడ అదర్శనము విధింపఁబడుచున్నది.

**సూ : జనపదే లుప్ 4-2-81.**

**వృ : జనపదే వాచ్యే చాతురర్థికస్య లుప్.**

ప వి : జనపదే (7-1) లుప్ (1-1)

అర్థ : జనపదము వాచ్యమగునపుడు చాతురర్థిక ప్రత్యయమునకు లుప్పు వచ్చును

వివ : జనపదమనగా కొన్నిగ్రామముల సముదాయము. 'అది యిందుఁ గలదు', 'అతనిచే చేయఁబడినది', 'అతనికినివాసము', 'దానికదూరభవము' అను నాలుగర్థములలో విధింపఁబడిన ప్రత్యయములకు చాతురర్థిక ప్రత్యయములని పేరు. చాతురర్థిక ప్రత్యయాంతముచేత వాచ్యమగునది జనపదమైనచో ఆ ప్రత్యయమునకు లుప్పువచ్చును ప్రత్యయముయొక్క అదర్శనమునకు 'లుప్' అను సంజ్ఞ వ్యవహరింపఁబడును (ప్రత్యయస్యలుక్శ్లులుపః).

అవ : పైసూత్రమునకు ఉదాహరణము చూపుటకై 'లుప్' రూపమైన అదర్శనముయొక్క ప్రత్యేకత తెలుపఁబడుచున్నది.

సూ : లుపి యుక్తవద్వ్యక్తి వచనే 1-2-51.

వృ : లుపి సతి ప్రకృతివల్లిఙ్గవచనే స్తః. పఞ్చాలానాం నివాసో జనపదః పఞ్చాలాః; కురవః, అఙ్గాః, వఙ్గాః, కలిఙ్గాః.

ప. వి : లుపి (7-1) యుక్తవత్ (అవ్య) వ్యక్తి వచనే (1-2)

అర్థ : లుప్పు వచ్చినప్పుడు ప్రకృతికి వలె లింగవచనము లగును. ఉదా : పఞ్చాలాః, ఇత్యాది.

వివ : యుక్తమనగా శబ్దమనియు, వ్యక్తి అనగా లింగమనియు, వచన మనగా సంఖ్యయనియు ప్రాచీనులవ్యవహారము లుప్ అను సంజ్ఞతో విధింపఁ బడిన అదర్శనము (ఉన్నది కన్పడకుండుట) జరిగినప్పుడు, ప్రత్యయము దేనికి విధింతురో దాని లింగవచనములే ప్రత్యయాదర్శనము కలిగినదానికిని అగును ఇది యొక పరిభాష. అదర్శనమును జెప్పుటకు నాలుగు సంజ్ఞలు కలవు (1) లోపము (2) లుక్ (3) శ్లు (4) లుప్ సూత్రములలో వీనిప్రయోగ మున్నపుడు అదర్శ నము కలుగుట అనునది సామాన్యలక్షణమే యైనను, వీనికి విడివిడిగా ప్రయోజ నాంతరములు గలవు అందు లుప్పుయొక్క ప్రయోజన మీసూత్రముచే చెప్పఁ బడినది

ఉదా పఞ్చాలానాం నివాసో జనపదః - పంచాలురయొక్క నివాసమైన జనపదము అనునర్థమున 'పఞ్చాల + ఆమ్' అను షష్ఠీ బహువచనాంతమునకు 'తస్యనివాసః' అనుసూత్రముచే అణ్ ప్రత్యయము వచ్చును పఞ్చాల + ఆమ్, అణ్, ప్రాతిపదిక సంజ్ఞచే విభక్తిప్రత్యయమగు 'ఆమ్' అనుదానికి లుక్కు వచ్చును. 'జనపదేలుప్' అనుసూత్రముచే ఇచట జనపదము వాచ్యమగు చున్నది కావున చాతురర్థిక ప్రత్యయమగు 'అణ్' అనుదానికి లుప్పువచ్చును 'పఞ్చాల'. ఇప్పుడు ఇది 'జనపదః' అను ఏకత్వసంఖ్యా విశిష్టమగు ద్రవ్యమునే తెలుపునదైనను, ప్రకృత పరిభాషచే ప్రత్యయవిధికి పూర్వము 'పఞ్చాలానామ్' అనునది బహువచనాంతమగుటనుబట్టి-యిదియు బహువచనాంతమగును ప్రత్యయ విధికి పూర్వమునను, లుప్పు వచ్చినతర్వాతను ఇది పుంలింగముగనే యుండును. పఞ్చాల + జస్ = పఞ్చాలాః

ఇట్లే కురూణాం నివాసో జనపదః - కురువులనివాసమైన జనపదము' కురు + ఆమ్ + అణ్, విభక్తిలోపము, ప్రత్యయలోపము (జనపదేలుప్) కురు + జస్ = కురవః.

అఙ్గానాం నివాసో జనపదః - అంగులనివాసమైనదేశము అఙ్గ + ఆమ్, + అణ్, అఙ్గ + జస్ = అఙ్గాః

వఙ్గానాం నివాసో జనపదః - వఙ్గ + ఆమ్ + అణ్, వఙ్గ + జస్ = వఙ్గాః

కలిఙ్గానాం నివాసోజనపదః - కలిఙ్గ + ఆమ్ + అణ్, కలిఙ్గ + జస్ = కలిఙ్గాః

ఈ పై యుదాహరణములన్నింటను 'జనపదేలుప్' అను సూత్రముచే చాతురర్థిక ప్రత్యయమునకు లుప్పువచ్చినపిదప ప్రకృతులగు అంగాది శబ్దములు బహువచనాంతములగుటచే ఏకత్వసంఖ్యాబోధకమైన 'అంగ'మున్నగునవి బహువచనాంతములైనవి అదియ యిందువిశేషము

**సూ : వరణాదిభ్యశ్చ 4-2-82.**

**వృ : అజనపదార్థ ఆరమ్భః. వరణానా మదూరభవం నగరం వరణాః.**

ప వి : వరణాదిభ్యః (5-3) చ (అవ్య).

అను : లుప్ (1-1).

అర్థ : వరణాదిశబ్దములకు పరముగానున్న చాతురర్థిక ప్రత్యయమునకును లుప్పు వచ్చును. జనపదము కాక తక్కిన యర్థము వాచ్యమగునపుడు లుప్పు వచ్చుట కీసూత్రము ఉదా : వరణానామదూరభవం నగరం వరణాః.

వివ : వరణాది శబ్దములకు వచ్చిన చాతురర్థికప్రత్యయముచే జనపదము వాచ్యమగునపుడు లుప్పు వచ్చుటకు ఈ సూత్ర మక్కరలేదు. 'జనపదేలుప్' అనుసూత్రముచేతనే అగును. మఱల నీసూత్రముచే లుప్పు విధించుటవలన జనపదముకాక తక్కిన యర్థము గమ్యమానమగునపుడు లుప్పు వచ్చునని చెప్పుట అయినది అట్టి యెడ వరణాదిశబ్దములకు చేరిన చాతురర్థికప్రత్యయమునకు లుప్పు వచ్చును.

ఉదా : వరణానామదూరభవం నగరమ్ - వరణ యనునదికి సమీపముగా నున్న నగరము - (వరణానది కాశికి ఉత్తరమునఁగలదు. బహువచనమిట పూజార్థమున నైనది). వరణా + ఆమ్ + అణ్ (వరణాశబ్దము స్త్రీ లింగము) విభక్తి లోపము. ఇచట అదూరభవమైన నగరము ప్రత్యయాంతముచే చెప్పఁబడుచున్నది.

కావున ప్రకృతసూత్రముచే 'అణ్' ప్రత్యయమున కదర్శనము. 'వరణా' - ఇది 'నగరమ్' అనునపుంసకలింగశబ్దమును చెప్పునదియైనను, 'లుపి యుక్తవద్వ్యక్తి వచనే' అను సూత్రము ననుసరించి ప్రకృతియగు 'వరణా'యను నదీవాచక శబ్దమును బట్టియే స్త్రీలింగమును, బహువచనాంతకము నగును వరణా + జస్ = వరణాః.

వరణాదిగణము : వరణా శృఙ్గీ శాల్మలి శుణ్డీ శయాణ్డీ పర్ణీ తామ్రపర్ణీ గోద ఆలిఙ్గ్యాయన జాలపదీ (జానపదీ) జమ్బూ పుష్కర చమ్పా పమ్పా వల్గు ఉజ్జయినీ గయా మథురా తక్షశిలా ఉరసా గోమతీ వలభీ - ఇతివరణాదిః

సూ : కుముదనడవేతసేభ్యో డ్మతుప్ 4-2-87.

ప. వి. కుముదనడవేతసేభ్యః (5-3) డ్మతుప్.

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః

అర్థ : కుముద, నడ, వేతస అనువానికి 'అరిగలది' అనునర్థమున డ్మతుప్ ప్రత్యయము వచ్చును.

వివ : కుముద, నడ, వేతస అనువాని ప్రథమాంతములకు, అవిగల దేశాదులను దెలుపుచు, డ్మతుప్ ప్రత్యయము వచ్చును ప్రకరణమునుబట్టి తదస్మిన్నస్తీత్యాదులగు నాలుగర్థములలో నీ ప్రత్యయము రావలసియున్నను, అవి అధికముగా గలదేశము' అనునర్థమునందు మాత్రమే యగునని భాష్యకారులు చెప్పియుండుటను బట్టి యాయర్థమునందే వచ్చును ఇందు డకారపకారము లిత్తులు (చుటూ, హలన్త్యమ్) ఉకారముచ్చారణార్థకము (డ్), మత్, (ఉ) (ప్). ప్రత్యయము డిత్తగుటవలన పూర్వమున నున్నశబ్దస్వరూపముయొక్క టిభాగమునకు లోపము వచ్చును. (టేః).

ఉదా : కుముదా అస్మిన్సన్తీతికుముద్వాన్ - కుముదములు అధికముగాగలదేశము - కుముద + జస్ + డ్మతుప్, విభక్తిలోపము, కుముద + మత్ 'టేః' అనుసూత్రముచే టిలోపము 'కుముద్ + మత్'

అవ : పైదశలో క్రిందిసూత్రముచే మకారమునకు వకారాదేశము.

సూ : ఝయః 8-2-10.

వృ : ఝయన్తాన్మతోర్మస్య వః. కుముద్వాన్, నడ్వాన్.

ప. వి : ఝయః (5-1).

అను : మతోః (6-1) వః (1-1)

అర్థ : ఝ యంతమునకు పరముగానున్న 'మతుప్' ప్రత్యయమకారమునకు వకార మాదేశమగును. ఉదా : కుముద్వాన్, నడ్వాన్.

వివ : ఝయ్ ప్రత్యాహారమున అనునాసికములు కాక తక్కిన వర్ణాక్షరములు గలవు. 'ఝయః' అనునది పంచమ్యంతము కావున 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాషచే నిచట విధింపఁబడిన కార్యము 'ఝయ్' వర్ణమునకు పరముగా నున్నదాని కగును. ఇట పరముగా నుండునది మతుప్ ప్రత్యయము పరముగా నున్న 'మత్' అనుదానికి విధింపఁబడిన యీ వకారాదేశమను కార్యము 'ఆదేః పరస్య' అను పరిభాషచే తొలివర్ణమగు మకారమునకు వచ్చును. ఇట్లు ఝయ్ప్రత్యాహారములోని వర్ణములకు పరముగానున్న మతుప్ప్రత్యయమకారమునకు వకారమాదేశ మగునను నర్థము సిద్ధించును

ఉదా : కుముద్ + మత్ ఇటదకారము ఝయ్వర్ణము దానికి పరముగా నున్న ప్రత్యయములోని మకారమునకు వకారాదేశము. కుముద్ + వత్ = కుముద్వత్ + సు = కుముద్వాన్

నడః నడ్వస్మిన్నితి నడ్వాన్ - (నడమనుఒకవిధమగుగడ్డికలది) నడ + జస్ + డ్మతుప్, నడ + మత్ 'టేః' టి - లోపము, నడ్ + మత్, ఝయః' అను సూత్రముచే వకారాదేశము, నడ్వత్ + సు = నడ్వాన్.

ఆవ : పేతసాః సన్త్యస్మిన్ - పేతసములు గలది పేతస + డ్మతుప్ పేతస + మత్, 'టేః' అనుసూత్రముచే టిలోపము పేతస్ + మత్ ఇచట సకారము ఝయ్ప్రత్యాహారములోనిది కాదు కావున పూర్వసూత్రముచే వకారాదేశము రాకుండుటచే సూత్రాంతరము చెప్పఁబడుచున్నది

**సూ : మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః 8-2-9**

**వృ : మవర్ణాన్తాన్మవర్ణావర్ణోపధాచ్చ యవాదివర్జితాత్పరస్య మతోర్మస్య వః. పేతస్వాన్.**

ప. వి : మాత్ (5-1) ఉపధాయాః (5-1) చ (అవ్య) మతోః (6-1) వః (1-1) అయవాదిభ్యః (5-3).

అర్థ : మవర్ణముగాని అవర్ణముగాని అంతమునఁగలదానికిని, మవర్ణము గాని అవర్ణముగాని ఉపధగా గలదానికిని పరముగానున్న మతుప్ప్రత్యయమకారమునకు వకారమాదేశమగును ఉదా : పేతస్వాన్.

వివ : 'మాత్, ఉపధాయాః' అని విభజించుకొనగా చేర్చబడిన మాత్ అను దానిని ఆవృత్తి చేసికొనవలయును ('మాత్, మాత్ అని రెండుపదములున్నట్లుగా భావింపవలయును). మొదటి 'మ' అనగా (మ్ + అ). మకారఅకారములు. దానికి పంచమిచేర్చగా 'మాత్' అగును పరముగా నున్న మతుప్ ప్రత్యయమును బట్టి పూర్వమునందు శబ్దస్వరూప మిట గ్రహింపఁబడగా దానికి 'మాత్' అనునది విశేషణ మగును తదంతవిధిచే 'మవర్ణము అవర్ణమునంతమునఁగల శబ్దస్వరూపమునకు పరముగానున్న' అనునర్థము లభించినది. ఆవృత్తమైన రెండవ 'మాత్' పదము 'ఉపధాయాః' అనుదానికి విశేషణము. కావున మవర్ణ అవర్ణములు ఉపధగాఁగల శబ్దస్వరూపములకు పరముగానున్న' అనునర్థము సిద్ధించును. ఇచట పరభాగమున నున్న మతుప్ ప్రత్యయమునకు విధింపఁబడు వకారాదేశము 'ఆదేఃపరస్య' అను పరిభాషను బట్టి 'మతుప్' అనుదాని తొలివర్ణమగు మకారస్థానమున వచ్చును. 'అయవాదిభ్యః' అనుపదమువలన యవాదిగణపఠిత శబ్దములకు పరముగానున్న మతుప్ ప్రత్యయమకారమునకు వకారాదేశము రాదు ఇట్లు యవాదిశబ్దములలో చేరనిదై, మవర్ణమవర్ణములంతమునఁగలదియు లేక, అవర్ణమవర్ణములు ఉపధగాఁ గలదియునగు శబ్దస్వరూపమునకు పరముగానున్న మతుప్రత్యయ మకారమునకు వకారమాదేశమగునను నర్థము సిద్ధించును

ఉదా : పేతస్ + మత్, 'పేతస్' అనునది అకారోపధము. దానికి పరముగా నున్న మతుప్రత్యయమకారమునకు వకారాదేశము రాఁగా, పేతస్ వత్- పేతస్వత్ + సు=పేతస్వాన్ అగును

**యవాదిగణము :** యవ దల్మి ఊర్మి (ఉర్మి) భూమి కృమిక్రుఞ్చా వశా ద్రాక్షా ధ్రాక్షా ధ్రజి (ధ్వజి) ధ్వజి నిజి సిజి సఞ్జ హరిత్ కకుత్ మరుత్ గరుత్ ఇక్షు ద్రు మధు - ఇతి యవాదిః. ఆకృతిగణః

**సూ : నడశాదాడ్డ్వలచ్ 4-2-88.**

**వృ : నడ్వలః.**

ప. వి : నడశాదాత్ (5-1) డ్వలచ్ (1-1)

అను : తత్ (1-1) అస్మిన్ (7-1) అస్తి (క్రియా.ప) సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః.

అర్థ : నడ, శాద అనువాని ప్రథమాంతములకు 'అవి యిందుఁగలవు' అను నర్థమున 'డ్వలచ్' అను ప్రత్యయము వచ్చును. ఉదా : నడ్వలః.

వివ : 'నడాః సన్త్యస్మిన్', 'శాదాః సన్త్యస్మిన్' అనునర్థములందు 'నడాః 'శాదాః' అనుసమర్థ ప్రథమాంతములకు వరుసగా 'డ్వలచ్' ప్రత్యయముచేరును. ఇందు డకారచకారములిత్తులు (చుటూ, హలన్త్యమ్) 'వల' మిగులును ప్రత్యయము డిత్తగుటచే పూర్వమునమున్న శబ్దము టిభాగమునకు లోపమువచ్చును (టేః).

ఉదా : నడ + జస్ + డ్వలచ్, విభక్తిలోపము (సుపోధాతు ప్రాతిపదికయోః) టిలోపము (టేః) నడ్ + వల = నడ్వల + సు=నడ్వలః.

నడశబ్దమునకు కుముదనడేత్యాది సూత్రముచే 'డ్మతుప్' ప్రత్యయము కూడ విధింపఁబడియుండుటవలన 'నడ్వాన్' అనురూపము కూడ నుండును

శాద + జస్, డ్వలచ్, విభక్తిలోపము, టిలోపము శాద్ + వల = శాద్వల + సు=శాద్వలః.

**సూ : శిఖాయా వలచ్ 4-2-89.**

**వృ : శిఖావలః.**

ప. వి : శిఖాయాః (5 1) వలచ్ (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా; తద్ధితః; ప్రత్యయః; తప్ (1-1) అస్మిన్ (7-1) అస్తి (క్రి ప) ఇత్యాదులు

అర్థ : 'శిఖలిందుఁగలవు' 'శిఖలచే నిర్వృత్తమైనది' మున్నగు నర్థములందు ప్రథమాద్యంతమగు 'శిఖా' శబ్దమునకు 'వలచ్' ప్రత్యయము చేరును ఉదా : శిఖావలః

వివ : తదస్మిన్నస్తి, తేననిర్వృత్తమ్ మున్నగునర్థములందు, ప్రథమాంతము లేక తృతీయాంతము లేక షష్ఠ్యంతమునగు శిఖాశబ్దమునకు 'వలచ్' అను తద్ధిత ప్రత్యయము చేరును ఇందు చకారమిత్తు.

ఉదా : శిఖాః సన్త్యస్మిన్ - శిఖలుగలది, శిఖాభిః నిర్వృత్తమ్, శిఖలచే చేయఁబడినది - శిఖాయాఃనివాసః - శిఖకునివాసమైనది - శిఖాయాః అదూరభవః - శిఖకు సమీపమున నున్నది - అనునర్థములందు - శిఖా + జస్, శిఖా + భిస్, శిఖా + ఙస్ ఆమ్ అనువానికి 'వలచ్' ప్రత్యయము, విభక్తిలోపము శిఖావల+ సు = శిఖావలః.

ఇది చాతురర్థిక ప్రకరణము.

**ప్రకరణావలోకనము :** ఈ ప్రకరణమున, దానిచే రంగు వేయఁబడినది, ఆ నక్షత్రముతో కూడిన కాలము, అతనిచే దర్శింపఁబడినసామము, దానితో పరివృతమైన రథము, దానియందు (పాత్రయందు) తీసిఉంచఁబడినది, దానియందు సంస్కరింపఁబడిన భక్షములు, అది దీని దేవత, దానిసమూహము, దానిని చదివెను, దానినెఱిఁగెను అనునర్థములందాయా ప్రత్యయములాయావిభక్త్యంతములకు విధింపఁబడినవి మఱియు అది యిందుఁగలదు, అతనిచే - లేక దానిచే నేర్పడినది, వారికి నివాసము, దానికి సమీపమున నున్నది. అను నాలుగు అర్థములలో ఆ పేరుగల దేశములు గమ్యమానములగునపుడును ప్రత్యయములు విధింపఁబడినవి 'తన్నామక దేశము' అనుసాధారణలక్షణముసుబట్టి యీ ప్రత్యయములకు చాతురర్థికములను సంజ్ఞ యేర్పడినది 'అది యిందుఁ గలదు' అను సాధారణార్థమునను కొన్ని ప్రత్యయములు విధింపఁబడినవి తండ్రి సోదరుఁడు మున్నగు నర్థములలో పితృవ్యాది శబ్దములు నిపతింపఁబడినవి తిష్యపుష్యయోర్నక్షత్రాణ్యాదివార్తికమును, రీఙృతః, ఇసజ్యాసపత్యే, ఇసుసుక్తాన్తాత్కః, నయ్వాభ్యాం పదాన్తాభ్యాం పూర్వౌతు తాభ్యామైచ్, ఋయః, మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః అను సూత్రములును ఆయా కార్యవిశేషములను ప్రదర్శించినవి లుబవిశేషే, జనపదేలుప్ అను సూత్రములు వచ్చిన తద్ధితప్రత్యయములకు అదర్శనమును జెప్పినవి 'లుపి యుక్తవద్వ్యక్తివచనే' అను పరిభాష యొకటి యిందు ఆవశ్యకమైనది

# అథ శైషిక ప్రకరణమ్

అవ : శేషమనగా మిగిలినది. మిగిలినది ఏది అను ఆకాంక్షకు చెప్పగా మిగిలినది అను సమాధానము వచ్చును కావున ఇతఃపూర్వము చెప్పఁబడిన అపత్యార్థకములు, రక్తాద్యర్థకములు, చాతురర్థికములును కాక తక్కినవి శేష ప్రత్యయములు. ఈ అష్టాధ్యాయిలో 'శేషే' అను నధికారమున చెప్పఁబడినవి 4-2-92 మొదలుకొని తస్యవికారః 4-3-134 అనుసూత్రమునకు పూర్వము వఱకు శేషాధికారము శేషమునకు సంబంధించిన ప్రత్యయములు శైషికములు. వానిని చెప్పు ప్రకరణము కావున నిది శైషిక ప్రకరణ మాయెను.

సూ : శేషే 4-2-92.

వృ : అపత్యాది చతురర్థ్యన్తాదన్యోఽర్థః శేషః తత్రాణాదయస్స్యుః చక్షుషా గృహ్యతే చాక్షుషం రూపమ్; శ్రావణశ్శబ్దః, ఔపనిషదః పురుషః, దృషదిపిష్టా దార్షదాస్సక్తవః, చతుర్భిరుహ్యతే చాతురం శకటం, చతుర్దశ్యాం దృశ్యతే చాతుర్దశం రక్షః. 'తస్య వికారః' ఇత్యతః ప్రాక్ శేషాధికారః, లక్షణం చ

ప రి : శేషే (7-1).

అను : తద్ధితః, ప్రత్యయః, సమర్థానాం ప్రథమాద్వా

అర్థ : అపత్యార్థము మొదలుకొని చతురర్థి అంతముగా చెప్పగా మిగిలినది శేషము. ఆ యర్థమునందు అణాది ప్రత్యయములగును ఉదా : చక్షుషా గృహ్యతే - చక్షుస్సుతో గ్రహింపఁబడునది - చాక్షుషంరూపమ్ మొ॥ వి. 'తస్య వికారః' అనుసూత్రమునకు పూర్వమువఱకు శేషాధికారము, లక్షణముకూడ.

విప . దానిచేత గ్రహింపఁబడినది, దానిచే ప్రతిపాదింపఁబడినది, మున్నగు నర్థము లితఃపూర్వము చెప్పఁబడిన అపత్య, రక్తాది, చతురర్థులలో లేవు. ఇంతకు పూర్వము చెప్పగా మిగిలిన అర్థములు శేషములు. ఆ యర్థములందు 'ప్రాగ్దీవ్యతోఽణ్' 'అశ్వపత్యాదిభ్యశ్చ' మున్నగుసూత్రములచేఁ జెప్పఁబడిన సాధారణ ప్రత్యయములు వచ్చును. ఇది అధికారసూత్రమగుటచే నాయాగ్రహణాద్యర్థముల యందు వక్ష్యమాణ ప్రత్యయములును వచ్చును.

ఉదా:చక్షుషాగృహ్యతే - చక్షుస్సుచే గ్రహింపఁ బడునది, చక్షుస్ + టా,

అణ్, విభక్తిలోపము, చక్షుష్ + అణ్, ఆదివృద్ధి, చాక్షుష్ + అ, చాక్షుష + సు=చాక్షుషమ్-కంటిచే గ్రహింపఁబడురూపాదికము: శ్రవణేన గృహ్యతే-శ్రవణముచే గ్రహింపఁబడునది, శ్రవణ + టా + అణ్, శ్రవణ + అ(ణ్), ఆదివృద్ధి. శ్రావణ + అ, యస్యేతిచ-అకారలోపము, శ్రావణ్ + అ=శ్రావణ+సు=శ్రావణః - శ్రవణముచే గ్రహింపఁబడు శబ్దాదికము ఉపనిషద్భిః ప్రతిపాద్యతే - ఉపనిషత్తులచే ప్రతిపాదింపఁ బడువాఁడు, ఉపనిషద్ + భిస్, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఉ> ఔ) ఔపనిషద్ + అ=ఔపనిషద + సు=ఔపనిషదః - ఉపనిషత్తులచే నిరూపింపఁబడు పురుషుఁడు

దృషదిపిష్టాః - ఱాతియందు నూరఁబడినవి దృషద్ + ఙి, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఋ> అర్) (ద్ అర్షద్) దార్షద్ + అ=దార్షద+జస్ = దార్షదాః - ఱాతిపై నూరఁబడిన పేలపిండి మొ॥వి.

చతుర్భిరుహ్యతే - నాల్గింటిచే మోయఁబడునది చతుర్ + భిస్ + అణ్, చాతుర్ + అ = చాతుర+సు=చాతురమ్-నాలుగుగుఱ్ఱములు మున్నగు వానిచే లాగఁబడు శకటము మొ॥వి.

చతుర్దశ్యాం దృశ్యతే - చతుర్దశీ తిథియందు చూడఁబడు రక్షస్సు - కృష్ణచతుర్దశియందు రక్షస్సులు కనఁబడుదురని అగుప్రసిద్ధము చతుర్దశీ + ఙి, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, చాతుర్దశీ + అ, యస్యేతిచ ఈకారలోపము చాతుర్దశ్ + అ=చాతుర్దశ + సు=చాతుర్దశమ్.

ఇది అధికారసూత్రము. కావున వక్ష్యమాణసూత్రములందు 'శేషే' అను పదమధికృతమై అపత్యాద్యర్థములు కాని వానియందు ఆయాప్రత్యయములగు నని చెప్పను. అంతియ కాక ఇది లక్షణసూత్రముకూడ అనగా వక్ష్యమాణసూత్రములందు గ్రహింపఁబడని గ్రహణాద్యర్థములయందు 'చక్షుషా' మున్నగువానికి 'అణ్' ప్రత్యయమీసూత్రముచేతనే యగునని తాత్పర్యము.

**సూ : రాష్ట్రావార పారాద్ఘఖౌ 4-2-93.**

**వృ : ఆభ్యాం క్రమాద్ఘఖౌ స్తః. రాష్ట్రే జాతాదిః, రాష్ట్రియః, అవార పారీణః.**

వ. వి : రాష్ట్రావారపారాత్. (5-1) ఘఖౌ (1-2).

అను : సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః; ప్రత్యయః; శేషే (7-1).

అర్థ : రాష్ట్ర, అవారపార అనువానికి శేషార్థమునందు క్రమముగా ఘ ఖ ప్రత్యయము లగును. ఉదా : రాష్ట్రమునందు జాతుఁడు మఱవాఁడు-రాష్ట్రియః అవారపారీణః.

వివ యథాసంభవముగ అయావిభక్త్యంతములైన రాష్ట్ర, అవారపార అను శబ్దములకు అందు పుట్టినవాఁడు, దానిని చేరినవాఁడు మున్నగు శేషార్థములందు క్రమముగా ఘ, ఖ అను తద్ధిత ప్రత్యయములు చేరును. ఇందు ఘ అనున 'ఇయ' లగును; ఖ అనునది 'ఈన' అగును 'ఆయనేయీనీయియః' అను సూత్రముచే నీరూపములు సిద్ధించును.

ఉదా : రాష్ట్రే జాతః, రాష్ట్రమునందు పుట్టినవాఁడు, ఇచట సప్తమ్యంత మగు రాష్ట్రశబ్దమునకు ఘ ప్రత్యయము. రాష్ట్ర + ఙి, ఘ, విభక్తిలోపము ఇయాదేశము, రాష్ట్ర + ఘ> ఇయ్ + అ=రాష్ట్ర + ఇయ, యస్యేతిచ - అకార లోపము రాష్ట్ర్ + ఇయ, రాష్ట్రియ + సు = రాష్ట్రియః. రాష్ట్రమును పొందినవాఁడు, రాష్ట్రమునందున్నవాఁడు మున్నగు నర్థములందును రూపమిట్టే యగును

అవారపారంగతః – అవారపారమును (సముద్రమును) చేరినవాఁడు. ఇచట ద్వితీయాంతమగు అవారపారశబ్దమునకు 'ఖ' ప్రత్యయము. అవారపార + అమ్ ఖ, విభక్తిలోపము, ఈనాదేశము, యస్యేతిచ, అకారలోపము అవారపార్ + ఈన=అవారపారీన, నకారమునకుణత్వము, (అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి) అవారపారీణ + సు=అవారపారీణః. సముద్రమునందున్నవాఁడు మున్నగునర్థము లును దీనికి యథాసంభవముగ నూహించుకొనవలెను.

అవ : అవారపారశబ్దమునకు ఖప్రత్యయము చేరుటలో నొకవిశేషము చెప్పఁ బడుచున్నది.

**వా॥ అవారపారాద్విగృహీతాదపి విపరీతాచ్చేతి వక్తవ్యమ్ (1771-1772).**

**వృ : అవారీణః, పారీణః, పారావారీణః.**

ప. వి : అవారపారాత్ (5-1). విగృహీతాత్ (5-1). అపి (అవ్య) విప రీతాత్ (5-1) చ (అవ్య) ఇతి (అవ్య) వక్తవ్యమ్ (1-1)

అర్థ : విభజింపఁబడినదియు, తాఱుమాఱైనదియు నగు అవారపారశబ్దము నకును ఖ ప్రత్యయమగునని చెప్పఁదగును. ఉదా : అవారీణః, పారీణః, పారావారీణః

వివ : 'అవారపార' అనుశబ్దమునందు అవార, పార అను రెండవయవములు గలవు. 'రాష్ట్రావారపారాద్ఘఖౌ' అనుసూత్రమున అవారపార శబ్దమునకు 'ఖ' ప్రత్యయము విధింపఁబడినది ఈ వార్తికము ఆశబ్దమునందలి అవార, పార అను రెండు శబ్దములకు విడివిడిగాను, ఆ శబ్దములను తాఱుమాఱుచేయగా నేర్పడు 'పారావార' అనుశబ్దమునకును శేషార్థమున 'ఖ' ప్రత్యయమగుటను విధించుచున్నది కావున అవార, పార, పారావారశబ్దములకు శేషార్థమున 'ఖ' ప్రత్యయము వచ్చుననుట ఫలితార్థము

ఉదా : అవారం గతః – ఈవలియొడ్డును జేరినవాఁడు, అవార + అమ్ + ఖ, విభక్తిలోపము, ఈనాదేశము, అకారలోపము–ణత్వము, అవారీణ + సు = అవారీణః. పారంగతః పారీణః – ఆవలియొడ్డును జేరినవాఁడు, పారావారంగతః – పారావారీణః – సముద్రమును జేరినవాఁడు – ప్రక్రియ 'అవారీణః' అనుదానివలెనే అరయునది.

అవ : ఇచట 'గ్రామాద్యఖఞౌ' మున్నగుసూత్రములందు ప్రత్యయములు మాత్రమే చెప్పఁబడుచున్నవి అవియే యర్థములందు ఆయాప్రకృతులకు చేసెనో యనుసందేహము కలుగును. దానిని వృత్తికారులు తీర్చుచున్నారు

వృ : ఇహ ప్రకృతి విశేషాద్ఘాదయష్ట్యుట్యులన్తా ఉచ్యన్తే. తేషాం జాతాదయో ర్థవిశేషాస్సమర్థ విభక్తయశ్చ వక్ష్యన్తే.

అర్థ : ఇచట ప్రకృతి విశేషమునకు పరముగా ఘ ప్రత్యయము మొదలుకొని ట్యు, ట్యుల్ అనునంతవఱకు ప్రత్యయములు చెప్పఁబడుచున్నవి. వానియొక్క జాతాద్యర్థవిశేషములును, సమర్థవిభక్తులును తఱువాత చెప్పఁబడును.

వివ : తద్ధిత ప్రత్యయవిధానము నందొక పద్ధతిగలదు. ప్రకృతి ఏది? అది ఏ విభక్త్యంతమై ప్రత్యయమును పొందుచున్నది? అర్థమేది? అను మూఁడంశము లిందు ముఖ్యములు. ఉదా 'తేనరక్తం రాగాత్' ఇందు 'రాగాత్' అనునది రాగ వాచకశబ్దమను ప్రకృతిని తెలుపును. 'తేన' అనునది ఆరాగవాచకశబ్దము తృతీయాంతము కావలయునని చెప్పును. 'రక్తమ్' అనునది 'రంగువేయఁబడిన' అను నర్థవిశేషమును తెలుపును. ఇట్లే మూఁడంశములును జెప్పఁబడినప్పుడే విధానము సమగ్రమగును. ఈ ప్రకరణమున 'గ్రామాద్యఖఞౌ' అను తఱువాతిసూత్రమున

'గ్రామాత్' అను శబ్దముచే ప్రకృతి చెప్పఁబడినది. 'యఖఞౌ' అనునది ప్రత్యయములను జెప్పును. ఇందు సమర్థవిభక్తియేది? అర్థమేది? అను ప్రశ్నలకు పై వృత్తివాక్యములు సమాధానము చెప్పుచున్నవి ఈ ప్రకరణమును మొదలుకొని (4 2 94) ట్యు, ట్యుల్ (4 3-23) వఱకు ముందు అయా ప్రకృతివిశేషములకు, అగు ప్రత్యయములు చెప్పఁబడు చున్నవి. వాని సమర్థవిభక్తులును, అర్థవిశేషములును, తత్రజాతః (4-3-25) అనుసూత్రము మొదలుకొని ప్రకరణాంతమువఱకు (4-3-120) చెప్పఁబడఁగలవు. అనగా 4-3-25 నుండి 4-3-120 వఱకు చెప్పఁబడిన అర్థవిశేషములలో నాయా విభక్త్యంతములకు 4-2-94 మొదలుకొని 4 3-23 వఱకు విధింపఁబడిన ప్రత్యయములు, చేరునని తాత్పర్యము.

అవ : ఇటుపై ప్రకృతులును ప్రత్యయములును పేర్కొనఁ బడుచున్నవి.

**సూ : గ్రామాద్య ఖఞౌ 4-2-94.**

**వృ : గ్రామ్యః, గ్రామీణః.**

ప. వి : గ్రామాత్ (5 1) య ఖఞౌ (1-2)

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః; ప్రత్యయః.

అర్థ : 'తత్రజాతః' మున్నగు వక్ష్యమాణార్థవిశేషములయందు గ్రామశబ్దప్రకృతిక సప్తమ్యంతాదిరూపములకు య, ఖఞ్ అను ప్రత్యయములు చేరును. ఉదా : గ్రామ్యః, గ్రామీణః.

వివ : ముందు చెప్పఁబడు 'తత్రజాతః' అందుపుట్టినవాఁడు మున్నగునర్థములయందు, సప్తమీమున్నగు విభక్తులంతమునఁ గల 'గ్రామ' అనుదానికి య, ఖఞ్ అను ప్రత్యయములు పర్యాయముగా వచ్చును. (పర్యాయమనగా నదివచ్చినపు డిదిరాదు. ఇది వచ్చినపు డది రాదు అని యర్థము.) ఇందు 'ఖఞ్' ప్రత్యయమున ఞకారమిత్తు. ఆదివృద్ధి యగును ఖకారమునకు ఆయనేయీనీత్యాదిసూత్రముచే ఈనాదేశమగును

ఉదా : గ్రామేజాతః, గ్రామమునందు పుట్టినవాఁడు, గ్రామ + ఙి, య విభక్తిలోపము, యస్యేతిచ అకారలోపము. గ్రామ్ + య=గ్రామ్య + సు = గ్రామ్యః. గ్రామ + ఙి + ఖఞ్, గ్రామ + ఈన, యస్యేతిచ, అకారలోపము గ్రామ్ + ఈన = గ్రామీన, నకారమునకు ణత్వము (అట్కుప్వాఙ్)

గ్రామీణ + సు = గ్రామీణః గ్రామము[redacted]గ్రామమునందు ప్రాయిక ముగా నుండువాఁడు, గ్రామమునుండి వచ్చి[redacted] కరములు చెప్పుకొనవచ్చును. ఈ యర్థము లన్నియు ముందు చెప్పఁబడుచున్నవి.

సూ : నద్యాదిభ్యో ఢక్ 4-2-97.

వృ . నాదేయం, మాహేయం, వారాణసేయమ్

ప వి : నద్యాదిభ్యః (5-3) ఢక్ (1-1);

అను : సమర్థానాం ప్రథమాద్వా తద్ధితః, ప్రత్యయః, శేషే (7-1)

అర్థ : నద్యాదిశబ్దములకు శేషార్థమున ఢక్ ప్రత్యయము వచ్చును. ఉదా : నాదేయమ్ మొ॥వి

వివ : అందు పుట్టినది. దానినుండి వచ్చినది మున్నగునర్థములందు సప్తమ్యాది విభక్తులు అంతమునఁగల నదీమున్నగుశబ్దములకు 'ఢక్' ప్రత్యయము వచ్చును ఇందు కకారంమిత్తు. ఢ్' అనుదానికి ఆయనేయీనీత్యాదిసూత్రముచే 'ఏయ్' ఆదేశము వచ్చును. ఢలోని అకారము ఆదేశమైన ఏయ్ అనుదానిలో కలిసి 'ఏయ' అగును కిత్తగుటచే శబ్దమున కాదివృద్ధియగును.

ఉదా : నద్యాం జాతమ్, నదియందు పుట్టినది నదీ + ఙి, ఢక్, విభక్తి లోపము, నదీ + ఢక్ కితిచ - ఆదివృద్ధి నాదీ + ఢ, ఏయాదేశము, నాదీ + ఏయ, యస్యేతిచ ఈకారలోపము, నాద్ + ఏయ = నాదేయ + సు = నాదేయమ్.

మహ్యాంభవమ్ - మహి (భూమి) యందు ఉన్నది. మహీ + ఙి, ఢక్ విభక్తిలోపము, ఆదివృద్ధి, ఏయాదేశము, మాహీ + ఏయ, ఈకారలోపము-యస్యేతిచ, మాహ్ + ఏయ=మాహేయ + సు = మాహేయమ్. వారాణస్యాం భవమ్, వారాణసియందు ఉన్నది. వారాణసీ + ఙి, ఢక్ విభక్తిలోపాదులు, వారాణసేయమ్.

నద్యాదిగణము : నదీ మహీ వారాణసీ శ్రావస్తి కౌశామ్బీ వనకౌశామ్బీ (వన కోశామ్బీ) కాశపరీ కాశఫారీ (కాశఫరీ) ఖాదిరీ పూర్వనగరీ పాఠా మాయా శాల్వా దార్వా సేతకీ 'వడవాయా వృషే' 88. ఇతినద్యాదిః.

సూ : దక్షిణా పశ్చాత్పుర సస్త్యక్ 4-2-98.

వృ : దాక్షిణాత్యః, పాశ్చాత్యః, పౌరస్త్యః.

వ. వి : దక్షిణా పశ్చాత్పురసః (5-1) త్యక్ (1-1).

అను : సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః; ప్రత్యయః; శేషే (7-1)

అర్థ : దక్షిణా, పశ్చాత్, పురస్ అనుశబ్దములకు 'అందున్నవాఁడు' మున్నగుశేషార్థములందు త్యక్ ప్రత్యయము వచ్చును. ఉదా : దాక్షిణాత్యః మౌని.

వివ : దక్షిణా, పశ్చాత్, పురస్ అను మూఁడును అవ్యయములు దక్షిణ భాగము, వెనుకభాగము, ముందుభాగము అని క్రమముగా వీని కర్థము. పశ్చాత్, పురస్ శబ్దములు పడమర, తూర్పు అను దిగర్థములందును వ్యవహరింపఁబడును అందు పుట్టినవాఁడు, ఉన్నవాఁడు, అటనుండి వచ్చినవాఁడు మున్నగు శేషాధికారము నఁ గల అర్థములందు ఈ అవ్యయములకు పరముగా 'త్యక్' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఇది కిత్తగుటచే ఆదివృద్ధి వచ్చును.

దక్షిణా భవః - దక్షిణమున నున్నవాఁడు దక్షిణా + త్యక్, ఆదివృద్ధి, దాక్షిణాత్య + సు = దాక్షిణాత్యః.

పశ్చాత్ భవః - పడమటిదిక్కున నున్నవాఁడు / ఉన్నది పశ్చాత్ + త్యక్ ఆదివృద్ధి, పాశ్చాత్ + త్య = పాశ్చాత్త్యః.

పురః భవః - తూర్పుననున్నవాఁడు / ఉన్నది. పురస్ + త్యక్, ఆదివృద్ధి (ఉ > ఔ) పౌరస్ + త్య = పౌరస్త్య + సు = పౌరస్త్యః.

**సూ : ద్యుప్రాగపాగుదక్ ప్రతీచో యత్ 4-2-101**

**వృ : దివ్యమ్, ప్రాచ్యమ్, అపాచ్యమ్, ఉదీచ్యమ్, ప్రతీచ్యమ్.**

వ. వి : ద్యు .... ప్రతీచః (5-1) యత్.

అను : శేషే (7-1) సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః: ప్రత్యయః.

అర్థ : దివ్, ప్రాఞ్చ్, అపాఞ్చ్, ఉదఞ్చ్, ప్రత్యఞ్చ్ అనువానికి శేషార్థమున 'యత్' ప్రత్యయము వచ్చును. ఉదా : దివ్యమ్ ఇత్యాది.

వివ : అందుపుట్టినవాఁడు మున్నగు శేషాధికారమున చెప్పఁబడినయర్థము లందు 'దివ్' మున్నగుశబ్దములయొక్క ఆయావిభక్త్యంతరూపములకు పరముగా యత్ అను తద్ధితప్రత్యయము చేరును. ఇందు తకారమిత్తు.

ఉదా: (1) దివిభవమ్ = స్వర్గమునందున్నది. దివ్ + ఙి + య(త్) విభక్తి లోపము, దివ్ + య = దివ్య + సు = దివ్యమ్.

(2) ప్రాచిభవమ్ - ప్రాఞ్చ్ + ఙి + యత్ సుబ్లోపము, ప్రాఞ్చ్ + య 'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి' 6-4-24 (హలంతము లైన అంగము లయు, ఇదిత్తులుకాని అంగములయు నకారమునకు, కిత్తుగాని ఙిత్తుగాని పరమగు నపుడు, లోపము అగును) అనుసూత్రముచే ఞకారరూపనకారము లోపించును. (ప్ర + అఞ్చ్ + క్విన్ అనునది ప్రాఞ్చ్ అయినది అచటి క్విన్ ప్రత్యయమును బట్టి యీ లోపము వచ్చును) 'ప్రఅచ్ + య'. పిదప అచః (6-4-138) (లోపించిన నకారముగల భసంజ్ఞకమగు అఞ్చ్ ధాతువుయొక్క అకారమునకు లోపము వచ్చును) అనుసూత్రముచే అకారము లోపించును. 'ప్రచ్ + య'. ఇప్పుడు 'చౌ' (6-3-139) అను సూత్రముచే 'ప్ర'లోని అకారమునకు దీర్ఘము వచ్చును (లోపించిన నకార అకారములు గల అఞ్చ్ ధాతురూపము పరమగునపుడు పూర్వముననున్న అకారమునకు దీర్ఘము వచ్చును) ప్రాచ్ + య = ప్రాచ్య + సు = ప్రాచ్యమ్. (తూర్పున నున్నది, పుట్టినది మొ॥వి)

ఇట్లే అపాచిభవమ్ - అపాఞ్చ్ + ఙి + యత్, విభక్తిలోపము, అపాఞ్చ్ + య, అప అఞ్చ్ య, అఞ్చ్ ధాతువునందలి అనునాసికమునకు అకారము నకు లోపముగుట 'అప'లోని తుది అకారమునకు దీర్ఘముగుట పూర్వోదాహరణము నందువలెనే జరుగును. అపాచ్ + య = అపాచ్య + సు = అపాచ్యమ్.

ఉదీచిభవమ్ - ఉదఞ్చ్ + ఙి, యత్, విభక్తిలోపము, ఉద్ అఞ్చ్ + య అనునాసికాక్షరము లోపించిన పిదప 'ఉద్ అచ్ + య' అయియుండ ఉదఈత్ 6-4-139. (ఉద్ అనుశబ్దమునకు పరముగానున్న లుప్తనకారమగు అఞ్చ్ ధాతువు యొక్క అకారమునకు ఈకారమాదేశమగును) అను సూత్రముచే ఈకారాదేశము కలిగి ఉద్ ఈచ్ + య = ఉదీచ్య + సు = ఉదీచ్యమ్ అగును

ప్రతీచిభవమ్ - ప్రత్యఞ్చ్ + ఙి, యత్, విభక్తిలోపము ప్రతి + అఞ్చ్ + య, నకారలోపము (ఞకారము లోపించును) అకారలోపము, పూర్వాక్షర దీర్ఘము. ప్రతి + అచ్, ప్రతి + చ్, ప్రతీచ్ + య = ప్రతీచ్య + సు = ప్రతీచ్యమ్.

**సూ : అవ్యయాత్త్యప్ 4-2-104.**

**వా : అమేహక్వతసిత్రేభ్య ఏవ (వా. 2779).**

**వృ : అమాత్యః, ఇహత్యః, క్వత్యః, తతస్త్యః, తత్రత్యః.**

ప వి : అవ్యయాత్ (5-1) త్యప్ (1-1) అమేహక్వతసిత్రేభ్యః (5-3) ఏవ (అవ్య).

అను : శేషే (7-1) సమర్థానాం ప్రథమాద్వా, ప్రత్యయః, తద్ధితః.

అర్థ : అవ్యయమునకు శేషార్థములయందు త్యప్ ప్రత్యయము వచ్చును. అమా, ఇహ, క్వ, తస్ ప్రత్యయాంతములు, త్రప్రత్యయాంతములు అనునవ్యయములకు మాత్రమే యీ ప్రత్యయము వచ్చును. ఉదా : అమాత్యః మొ॥వి.

వివ : సూత్రమున ప్రతి అవ్యయమునకును తత్రభవః మున్నగునర్థముల యందు 'త్యప్' ప్రత్యయము విధింపఁబడగా వార్తికకారుఁడు దానిని సవరించెను. అమా, ఇహ, క్వ అను అవ్యయములకు, తసిల్, త్రల్ అను తద్ధిత ప్రత్యయము లంతమునఁ గల అవ్యయములకును మాత్రమే యీ 'త్యప్' ప్రత్యయమగును ఇందు ప వర్గమిత్తు.

(1) 'అమా' అనునవ్యయమునకు 'సమీపము' అర్థము. అమాభవః - సమీపమున నుండువాఁడు అమా + త్యప్-అమాత్యః-మంత్రి

(2) 'ఇహ' = ఇక్కడ, ఇహభవః - ఇక్కడనుండువాఁడు, ఇహ + త్యప్ = ఇహత్య + సు=ఇహత్యః.

(3) క్వ = ఎక్కడ, క్వభవః = ఎక్కడనుండువాఁడు క్వ + త్యప్= క్వత్య + సు=క్వత్యః.

(4) తతః - ఇది 'తసిల్' ప్రత్యయాంతము, ఎందుండి వచ్చినవాఁడు తతస్+త్యప్ = తతస్త్య + సు=తతస్త్యః.

(5) తత్ర - త్రల్ ప్రత్యయాంతము - అందు, తత్రభవః, అందుండు వాఁడు తత్ర + త్యప్, తత్రత్య + సు=తత్రత్య.

వా॥ త్యబ్నేర్ధ్రువ ఇతి వక్తవ్యమ్ (2780).

వ వి : త్యప్ (1-1) నేః (5-1) ధ్రువే (7-1) ఇతి (అవ్య) వక్తవ్యమ్ (1-1).

అర్థ : 'ని' అను నవ్యయమునకు, 'ధ్రువము' అనునర్థము గమ్యమగు నపుడు, 'త్యప్' ప్రత్యయము చెప్పనగును.

వివ : 'నియతము' అనునర్థముగల 'ని' అనునవ్యయమునకు, ప్రత్యయాంతమునచే 'ధ్రువము' అనునర్థము తెలియఁబడునపుడు 'త్యప్' ప్రత్యయము చెప్పఁదగు నని వార్తికభావము.

ఉదా : నియతం భవః - తప్పక అగునది, ని + త్యప్, పకారమిత్తు నిత్య + సు = నిత్యః.

అవ : 'వృద్ధాచ్ఛః' అను వక్ష్యమాణసూత్రమునందలి వృద్ధసంజ్ఞ నీక్రింది రెండుసూత్రములు వివరించుచున్నవి.

సూ : వృద్ధిర్యస్యాచామాదిస్తద్వృద్ధమ్ 1-1-73.

వృ : యస్య సముదాయస్యాచాం మధ్యే ఆదిర్వృద్ధిః తద్వృద్ధ సంజ్ఞంస్యాత్.

ప. వి : వృద్ధిః (1-1) యస్య (6-1) అచామ్ (6-3) ఆదిః (1-1) తత్ (1-1) వృద్ధమ్ (1-1)

అర్థ : ఏ సముదాయముయొక్క అచ్చులయందు మొదటిది వృద్ధిసంజ్ఞకమో ఆ సముదాయమునకు వృద్ధమని సంజ్ఞ

వివ : ఆ ఐ ఔలకు వృద్ధిసంజ్ఞ 'వృద్ధిరాదైచ్' అనుసూత్రముచే కలిగినది. ఒకవర్ణములసముదాయములోని అచ్చులలో మొట్టమొదటిది వృద్ధిసంజ్ఞకల ఆ, ఐ, ఔ అను వానిలో నేదేనొకటి అయినయెడల ఆ సముదాయము మొత్తమునకు 'వృద్ధమ్' అనుసంజ్ఞయుండును ఉదా : 'శాలా' - ఇందు రెండచ్చులు గలవు. అందు మొదటిదగు ఆకారమువృద్ధి, కావున 'శాలా' శబ్దమునకు వృద్ధమని పేరు

సూ : త్యదాదీనిచ 1-1-74.

వృ : వృద్ధ సంజ్ఞాని స్యుః.

ప. వి : త్యదాదీని (1-3) చ (అవ్య)

అను : వృద్ధమ్ (1-1)

అర్థ : త్యద్ మున్నగునవియు వృద్ధసంజ్ఞములగును

వివ : త్యద్ మున్నగువాని తొలియచ్చు వృద్ధి సంజ్ఞకము కాదు. కావున వీనికి పూర్వసూత్రముచే వృద్ధసంజ్ఞకలుగని కారణమున, ప్రక్రియలో అవసర మగుటచే ఈ సూత్రముచే మరల విధింపఁబడినవి.

త్యదాదులు : త్యద్, తద్, యద్ ఏతద్ ఇదమ్ అదస్ ఏక ద్వి యుష్మద్ అస్మద్ భవతు కిమ్ ఇది సర్వాదులలో అంతర్గణము.

అవ : పై రెండుసూత్రములచే చెప్పఁబడిన వృద్ధసంజ్ఞకమునకు శేషార్థము లందు ప్రత్యయము విధింపఁబడుచున్నది.

**సూ : వృద్ధాచ్ఛః 4-2-114.**

**వృ : శాలీయః, తదీయః.**

ప వి : వృద్ధాత్ (5-1) ఛః (1-1)

అను : సమర్థానాం ప్రథమాద్వా: తద్ధితః; ప్రత్యయః; శేషే (7-1).

అర్థ : వృద్ధ సంజ్ఞకలదానికి శేషార్థమున 'ఛ' ప్రత్యయమగును. ఉదా : శాలీయః, తదీయః.

వివ : దేనితొలి అచ్చు వృద్ధిసంజ్ఞకమో దానికిని, త్యదాదులకును వృద్ధమని పేరు అట్టి వృద్ధవాచకశబ్దముల యా యా విభక్త్యంతములకు 'అందు పుట్టినవాఁడు' మున్నగు శేషాదికార్థములందలి యర్థములందు 'ఛ' అను ప్రత్యయము వచ్చును. ఇందు 'ఛ్' అను హల్మాత్రమునకు ఆయనేయీనీత్యాదిసూత్రముచే ఈయ్ 'అనునాదేశము' వచ్చును (ఛ్ + అ = ఈయ్ + అ = ఈయ).

ఉదా : శాలాయాం జాతః-శాలయందు పుట్టినవాఁడు, శాలాశబ్దము వృద్ధము, దాని సప్తమ్యంతముపై ఛ ప్రత్యయము. శాలా + ఙి, ఛ, విభక్తిలోపము, శాలా + ఛ, ఈయాదేశము, శాలా + ఈయ్ + అ, యస్యేతిచ-ఆకారలోపము, శాల్ + ఈయ = శాలీయ + సు = శాలీయః.

తద్ శబ్దమునకు 'త్యదాదీనిచ' అనుసూత్రముచే వృద్ధసంజ్ఞకలదు. తస్య అయమ్ = వానికి సంబంధించినవాఁడు అనువర్థమున షష్ఠ్యంతమగు తచ్ఛబ్దమునకు ఛ ప్రత్యయము తద్ + ఙస్ + ఛ, విభక్తిలోపము, ఈయాదేశము, తద్ + ఈయ = తదీయ + సు = తదీయః.

**వా : వానామధేయస్యవృద్ధసంజ్ఞా వక్తవ్యా (576).**

వృ : దేవదత్తీయః, దైవదత్తః.

ప. వి : వా (అవ్య) నామధేయస్య (6-1) వృద్ధసంజ్ఞా (1-1) వక్తవ్యా

అర్థ : నామధేయమునకు వృద్ధసంజ్ఞ వైకల్పికముగా నగునని చెప్పఁదగును. ఉదా : దేవదత్తీయః, దైవదత్తః.

వివ : నామధేయ వాచకములగు 'దేవదత్త' మున్నగువానికి వైకల్పికముగా వృద్ధసంజ్ఞ కలుగును. కనుక వానికి శేషార్థములయందు ఛ ప్రత్యయము వైకల్పికముగా వచ్చునని తాత్పర్యము.

ఉదా : దేవదత్తస్య అయమ్ = దేవదత్తునికి సంబంధించినది అనువర్థమున షష్ఠ్యంతమగు దేవదత్త శబ్దమునకు, వృద్ధసంజ్ఞయున్నపుడు ఛ ప్రత్యయము. దేవదత్త + ఙస్, ఛ, విభక్తిలోపము, దేవదత్త + ఛ, ఈయాదేశము, అకార లోపము, దేవదత్ + ఈయ=దేవదత్తీయ + సు=దేవదత్తీయః.

వైకల్పికమగుటచే వృద్ధసంజ్ఞలేనియెడల 'తస్యేదమ్' అనునర్థమున సామాన్యమగు 'అణ్' ప్రత్యయము. దేవదత్త + ఙస్ + అణ్, విభక్తి లోపము, ఆదివృద్ధి, దైవదత్త + అ, అకారలోపము (యస్యేతిచ) దైవదత్ + అ=దైవదత్త + సు=దైవదత్తః.

సూ : గహాదిభ్యశ్చ 4-2-138

వృ : గహీయః.

ప. వి : గహాదిభ్యః (5-3) చ (అవ్య).

అను : సమర్థానాం ప్రథమాద్వా; తద్ధితాః; ప్రత్యయః, ఛః (1-1) శేషే (7-1).

అర్థ : గహాదిశబ్దములకు శేషార్థమున ఛ ప్రత్యయమగును. ఉదా :- గహీయః

వివ : అందున్నవాఁడు మున్నగు శేషార్థములయందు సప్తమ్యాద్యంతములగు గహాదిశబ్దములకు ఛ ప్రత్యయమగును.

ఉ : గహేభవః (గహమనుదేశవిశేషమునందున్నవాఁడు) గహ + ఙి + ఛ, విభక్తిలోపము, ఈయాదేశము (ఆయనేయీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్) గహ + ఈయ, యస్యేతి చ - అకారలోపము గహ్ + ఈయ = గహీయ + సు=గహీయః.

**గహాదిగణము** : గహ అన్తస్థ సమ విషమ. 'మధ్యమధ్యమం చాణ్ చరణే' 87. ఉత్తమ అఙ్గ, వఙ్గ, మగధ, పూర్వపక్ష, అపరపక్ష, అధమశాఖ ఉత్తమశాఖ ఏకశాఖ సమానశాఖ సమానగ్రామ ఏకగ్రామ ఏకవృక్ష ఏకపలాశ ఇష్వగ్ర ఇష్వనీక అవస్యన్దన కామప్రస్థ ఖాడికాడాయని (ఖాడాయన) కాఠేరణి లావేరణి సౌమిత్రి శైశిరి ఆసుత్ దైవశర్మి శ్రౌతి ఆహింసి ఆమిత్రి

వ్యారి వైశ అధ్యశ్వ అన్యశసి (అప్యశంపి) శౌణ్డ అగ్రిశర్మ భౌతి వారాటకి వాల్మికి (వాల్మీకి) క్షైమవృద్ధి అశ్వత్థి ఔద్గాహమాని ఐక బిన్దవి దన్తాగ్ర హంస తత్వగ్ర (తన్త్వగ్ర) ఉత్తర అన్తర (అనన్తర) 'ముఖపార్శ్వతసోర్లోపః' ౮౮. 'జనపర యోఃకుక్చ' ౮౯. 'దేవస్యచ' ౯౦. 'వేణుకాదిభ్యశ్ఛణ్' ౯౧. ఇతిగహాదిః. ఆకృతిగణః.

సూ : యుష్మదస్మదో రన్యతరస్యాం ఖఞ్ చ 4-3-1.

వృ : చాచ్ఛః, పక్షేఽణ్. యువయో ర్యుష్మాకం వా అయం యుష్మదీయః; అస్మదీయః

ప. వి : యుష్మదస్మదోః (6-2) అన్యతరస్యామ్ (అవ్య) ఖఞ్ (1-1) చ (అవ్య).

అను : సమర్థానాం ప్రథమాద్వా; తద్ధితః, ప్రత్యయః; శేషే (7-1).

అర్థ : యుష్మద్, అస్మద్ శబ్దములకు శేషార్థమున ఖఞ్ ప్రత్యయముకూడ వచ్చును. 'కూడ' అనుటచే ఛ ప్రత్యయమునగును వైకల్పికముగాన సాధారణ మగు 'అణ్' ప్రత్యయము వగును. ఉ॥ యువయో ర్యుష్మాకం వా యుష్మదీయః, అస్మదీయః;

వివ : యుష్మద్ అస్మద్‌శబ్దములు నీ, నా అనునర్థము గల సర్వనామములు. శేషార్థములగు సంబంధించినది' మున్నగు నర్థములందు షష్ఠీవిభక్త్యంతములగు వీనికి ఖఞ్ ప్రత్యయమును, ఛ ప్రత్యయము వైకల్పికముగా నగును. ఇవి రెండును రానిచో ఈ సూత్రము అణధికారములోనిది (ప్రాగ్దీవ్యతోఽణ్) కావున అణ్ ప్రత్యయము వచ్చును.

ఉదా : ఛప్రత్యయమున కుదాహరణము చూపబడుచున్నది. ఖఞ్, అణ్ ప్రత్యయములకు సంబంధించి మఱికొంత ప్రక్రియ యుండుటచే నది ఉత్తర సూత్రమున చూపబడును.

యువయోః అయమ్, యుష్మాకం అయమ్: మీ యిరువురికి సంబంధించినది-సంబంధించినవాడు. మీకు సంబంధించినది - సంబంధించినవాడు, అనుచోట షష్ఠ్యంతమగు 'యుష్మద్' శబ్దమునకు ఛప్రత్యయము యుష్మద్+ఓస్|ఆమ్+ఛ. విభక్తిలోపము, ఈయాదేశము, యుష్మద్+ఈయ=యుష్మదీయ+సు= యుష్మదీయః.

అస్మాకం ఆవయోః అస్మాకం వా అయమ్, మా యిరువురికి లేక మాకు సంబం ధించినవాఁడు, అస్మద్ + ఓస్|ఆమ్ + ఛ, విభక్తిలోపము, ఈయాదేశము, అస్మద్ + ఈయ=అస్మదీయ + సు=అస్మదీయః.

ప్రకృతులగు యుష్మదస్మచ్ఛబ్దములు ఏకవచనాంతములగునపుడు వాని కాదేశమొకటి విధింపఁబడుచున్నది గాన యువయోః, యుష్మాకమ్, ఆవయోః, అస్మాకమ్ అను షష్ఠీద్వివచన బహువచనరూపములే యిందుగ్రహింపఁబడినవి.

సూ : తస్మిన్నణిచ యుష్మాకాస్మాకౌ 4-3-2.

వృ : యుష్మదస్మదోరేతావాదేశౌ స్తః ఖఞి అణి చ. యౌష్మాకీణః, ఆస్మాకీనః, యౌష్మాకః, ఆస్మాకః.

ప. వి : తస్మిన్ (7-1) అణి (7-1) చ (అవ్య) యుష్మాకాస్మాకౌ(1-2).

అను : యుష్మదస్మదోః (6-2).

అర్థ : ఖఞ్, అణ్ ప్రత్యయములు పరములగునపుడు యుష్మద్, అస్మద్ శబ్దములకు క్రమముగా యుష్మాక, అస్మాక అనునాదేశములు వచ్చును. ఉదా : యౌష్మాకీణః, ఆస్మాకీనః; యౌష్మాకః, ఆస్మాకః.

వివ : 'తస్మిన్' అను సర్వనామరూపమునకు పూర్వసూత్రమున విధింపఁ బడిన 'ఖఞ్' ప్రత్యయము బోధ్యము ఖఞ్, అణ్ ప్రత్యయములు పరములగు నపుడు 'యుష్మద్' అనుదానికి యుష్మాక అనునదియు, అస్మద్ అనుదానికి 'అస్మాక' అనునదియు నాదేశములగును అనేకపర్ణాదేశములగుటచే నివి సర్వా దేశములుగా వచ్చును.

ఉదా : యువయోర్యుష్మాకం వా అయమ్ అనునర్థమున షష్ఠీద్వివచన బహు వచనాంతములకు ఖఞ్ ప్రత్యయము పూర్వసూత్రముచే వచ్చును. యుష్మద్ + ఓస్ - ఆమ్ + ఖఞ్, విభక్తిలోపము, 'యుష్మాక' ఆదేశము, యుష్మాక+ఖ(ఞ్), ఆదివృద్ధి, యౌష్మాక + ఖ, ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యాదీనామ్ అను సూత్రముచే ఖకారమునకు ఈన్ నాదేశము, యౌష్మాక + ఈన, అకారలోపము - యస్యేతిచ, యౌష్మాక్ + ఈన = నకారమునకు ణత్వము, (షకారయోగముచే) యౌష్మాకీణ + సు = యౌష్మాకీణః.

ఇట్లే ఆవయోరస్మాకం వా అయమ్. అస్మద్ + ఓస్ - ఆమ్ + ఖఞ్, విభక్తిలోపము, అస్మాకఆదేశము, ఆదివృద్ధి, ఈనాదేశము, అకారలోపము ఆస్మాకీన + సు=ఆస్మాకీనః.

అణ్ ప్రత్యయము వచ్చినచో, యుష్మాక + అణ్, ఆదివృద్ధి, యౌష్మాక + అ యస్యేతిచ-అకారలోపము యౌష్మాక్+అ=యౌష్మాక + సు = యౌష్మాకః. ఇట్లే అస్మాక + అణ్, ఆదివృద్ధి, అకారలోపము, ఆస్మాక + సు= ఆస్మాకః.

అవ : తవఅయమ్, మమఅయమ్ - నీసంబంధమైనది, నాసంబంధమైనది అను నర్థమున నేకవచనాంతములగు యుష్మదస్మచ్ఛబ్దములకు ఖఞ్ అణ్ ప్రత్యయములు చేరునపుడు అగు కార్యవిశేషము చెప్పఁబడుచున్నది.

**సూ : తవకమమకావేకవచనే 4-3-3.**

వృ: ఏకార్థవాచినో ర్యుష్మదస్మదో స్తవకమమకౌ స్తః ఖఞి అణి చ. తావకీనః- తావకః; మామకీనః - మామకః.

ప. వి : తవకమమకౌ (1-2) ఏకవచనే (7-1)

అను : యుష్మదస్మదోః (6-2) ఖఞి (7-1) అణి (7-1).

అర్థ : ఏకార్థవాచకములైన యుష్మద్, అస్మద్ శబ్దములకు, ఖఞ్, అణ్ ప్రత్యయములు పరములగునపుడు క్రమముగా తవక, మమక, అనునాదేశము లగును ఉదా : తావకీనః ఇత్యాది.

వివ : ఖఞ్, అణ్ ప్రత్యయములకు ప్రకృతులగు యుష్మదస్మచ్ఛబ్దములు ఏకార్థవాచకములైనచో (ఒక ద్రవ్యమును బోధించునవి అయినచో= ఏకవచనాంతములైనచో) వానికి ఆ ప్రత్యయములు పరములగునపుడు క్రమముగా తవక, మమక అనునవి యాదేశములగును ఇవియును సర్వాదేశములే.

ఉదా : తవ అయమ్ = నీకు సంబంధించినది. యుష్మదస్మదోరన్యతరస్యాం ఖఞ్ చ అను సూత్రముచే ఖఞ్ ప్రత్యయము, యుష్మద్+ఙస్ + ఖఞ్, విభక్తిలోపము, తవక - ఆదేశము, తవక + ఖఞ్, ఆదివృద్ధి, తావక + ఖఞ్, ఈనాదేశము(ఆయనేయీనీ....)అకారలోపము; తావక్ + ఈన=తావకీన + సు = తావకీనః.

అణ్ ప్రత్యయమగుచో, తవక + అణ్, ఆదివృద్ధి, అకారలోపము తావక్ + అ=తావక + సు=తావకః.

అస్మే, మమఅయమ్ = నాది, అస్మద్+జస్, ఖఞ్, అస్మద్ + ఖఞ్, మమక + ఖఞ్, మామక + ఖఞ్, మామక + ఈన, మామక్ + ఈన = మామకీన + సు = మామకీనః.

అణ్ ప్రత్యయమగుచో, మమక + అణ్, మామక + అ, మామక్ + అ= మామక + సు=మామకః.

అవ : యుష్మదస్మచ్ఛబ్దము లేకవచనాంతములైనపుడు ఛ ప్రత్యయము పరమైనచో అగురూపమును దెలుపుటకై వృత్తికారుఁడు దానిని గ్రహించుచున్నాఁడు

వృ ఛేతు—

అర్థ : ఛ ప్రత్యయము పరమైనచో-

అవ : అగు కార్యవిశేషముక్రింది సూత్రముచే తెలుపఁబడుచున్నది.

**సూ : ప్రత్యయోత్తరపదయోశ్చ 7-2-98.**

**వృ :** మ పర్యన్తయోరనయో రేకార్థవాచినో స్త్వమా స్తః ప్రత్యయే ఉత్తర పదే చ పరతః. త్వదీయః, మదీయః; త్వత్పుత్రః, మత్పుత్రః.

ప. వి : ప్రత్యయో త్తరపదయోః (7-2) చ (అవ్య).

అను : యుష్మదస్మదోః (6-2) త్వమౌ (1-2) ఏకవచనే (7-1) మపర్యన్తస్య (6-1)

అర్థ : మపర్యంతములును, ఏకార్థవాచకములును అగు యుష్మదస్మచ్ఛబ్దములకు, ప్రత్యయముగాని ఉత్తరపదముగాని పరమగునపుడు, క్రమముగా 'త్వ' 'మ' అనునాదేశములు వచ్చును. ఉదా : త్వదీయః, మదీయః, త్వత్పుత్రః, మత్పుత్రః.

వివ : ఏకవచనాంతములైన యుష్మద్, అస్మద్ శబ్దములకు ప్రత్యయముగాని ఉత్తర పదముగాని పరమగునపుడు మకారమువఱకుఁగల ఆ శబ్దముల వర్ణసముదాయమునకు క్రమముగా 'త్వ', 'మ' అనునాదేశములగును. యుష్మద్ యుష్మ=త్వద్, అస్మ(ద్)=మద్ అని యగునని తాత్పర్యము.

ఉదా : తవ అయమ్ = నీది, 'యుష్మద్+జస్' అనుదానికి ఛ ప్రత్యయము, ('యుష్మదస్మదోరన్యతరస్యాం' అను సూత్రముచే) యుష్మద్+జస్ + ఛ

విభక్తిలోపము 'యుష్మ' అనుదానికి 'త్వ' ఆదేశము, త్వద్ + ఛ, ఛకారము ఆయనేయీనీ ఇత్యాది సూత్రముచే ఈయాదేశము. త్వద్ + ఈయ = త్వదీయ + సు: త్వదీయః.

సమాసమునందును పూర్వపదమగు యుష్మచ్ఛబ్దమునం దీయాదేశమగున 'తవపుత్రః' నీకొడుకు, యుష్మద్ + జస్, పుత్ర + సు, షష్ఠీ అనుసూత్రము సమాసము, విభక్తిలోపము యుష్మద్ + పుత్ర, యుష్మ> త్వ త్వద్ + పుత్ర ఖరిచ, చర్త్వము త్వత్పుత్ర + సు = త్వత్పుత్రః.

మమ అయమ్ - నాది, నావాడు - అస్మద్ + జస్, ఛ, విభక్తిలోపము 'అస్మ' అనుదానికి 'మ' ఆదేశము, మద్ + ఛ, ఈయాదేశము మద్ + ఈయ : మదీయ + సు = మదీయః

సమాసమున మమపుత్రః, అస్మద్ + జస్, పుత్ర + సు, అస్మద్ + పు 'మ' ఆదేశము మద్ + పుత్ర, చర్త్వము - మత్పుత్ర + సు = మత్పుత్రః

యుష్మదస్మచ్ఛబ్దములకు శేషార్థములలో ఖఞ్, ఛ, అణ్ అనుమూ ప్రత్యయములు చేరును. అప్పటిస్వరూపము క్రింది విధముగా నుండును.

| | | యుష్మద్ | అస్మద్. |
|---|---|---|---|
| ఏకవచనాంతముపై | ఖఞ్, | తావకీనః | మామకీనః |
| " | అణ్ - | తావకః | మామకః |
| " | ఛ - | త్వదీయః | మదీయః. |

| | | యుష్మద్ | అస్మద్ |
|---|---|---|---|
| ద్విబహువచనాంతములపై, | ఖఞ్ | -యౌష్మాకీణః | అస్మాకీనః. |
| " | అణ్ | -యౌష్మాకః | అస్మాకః. |
| " | ఛ | -యుష్మదీయః | అస్మదీయః. |

**సూ : మధ్యాన్మః 4-3-8.**

**వృ : మధ్యమః.**

వ వి : మధ్యాత్ (5-1) మః (1-1)

అను : శేషే (7-1) సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః.

అర్థ : మధ్యశబ్దమునకు శేషార్థమున 'మ' ప్రత్యయము వచ్చును. ఉదా మధ్యమః.

వివ : 'మధ్యేభవః' 'మధ్యనున్నవాఁడు' అనునర్థమునందు సప్తమ్యంత మగు మధ్యశబ్దమునకు 'మ' ప్రత్యయము చేరును. ఉదా : మధ్య + ఙి, మ, విభక్తిలోపము, మధ్యమ + సు = మధ్యమః.

సూ : కాలాట్ఠఞ్ 4-3-11.

వృ : కాలికమ్, మాసికమ్, సాంవత్సరికమ్.

ప. వి : కాలాత్ (5-1) ఠఞ్ (1-1)

అను : శేషే (7-1) సమర్థానామిత్యాదులు.

అర్థ : కాలవాచకశబ్దములకు శేషార్థమున ఠఞ్ ప్రత్యయము వచ్చును. : కాలికమ్ మొ॥వి.

వివ : సూత్రమునందలి 'కాలాత్' అనుపదముచే కేవలము కాలశబ్దమునకే కాక కాలవాచకములగు మాస, సంవత్సర, అబ్ద మున్నగువానినికూడ గ్రహించుట భాష్యసమ్మతము. కావున కాలశబ్దమునకును, కాలవాచకశబ్దములకును భవాద్యర్థములయందు 'ఠఞ్' అను తద్ధిత ప్రత్యయము చేరును ఇందు ఞకారమిత్తు. దాని వలన ఆదివృద్ధివచ్చును. 'ఠ' అనుదానికి ఇకాదేశమగును (ఠస్యేకః).

ఉదా : కాలేభవమ్ - కాలమునందున్నది, కాల + ఙి, ఠఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (అ > ఆ) కాల + ఠ, ఇకాదేశము, కాల + ఇక, అకారలోపము (యస్యేతిచ) కాల్ + ఇక = కాలిక + సు = కాలికమ్.

మాసిభవమ్, మాసమున నుండునది, మాస్ + ఙి, ఠఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఇకాదేశము, మాస్ + ఇక = మాసిక + సు = మాసికమ్.

సంవత్సరేభవమ్, సంవత్సరమునందగునది, సంవత్సర + ఙి, ఠఞ్, విభక్తి లోపము, ఆదివృద్ధి, సాంవత్సర + ఠ, ఇకాదేశము, అకారలోపము, సాంవత్సర్ + ఇక = సాంవత్సరిక + సు = సాంవత్సరికమ్

సాయంప్రాతర్భవః, జాతః. సాయంకాల ప్రాతఃకాలములందుండునది. అనునర్థములలో 'సాయంప్రాతర్' అను అవ్యయమునకును, పునఃపునర్భవః — మాటిమాటికి పుట్టువాఁడు-పుట్టునది అనునర్థమునందు 'పునఃపునర్' అనునవ్యయము నకు 'కాలాట్ఠఞ్' అనుసూత్రముచే ఠఞ్ ప్రత్యయమువచ్చును సాయంప్రాతర్ + ఠఞ్, పునఃపునర్ + ఠఞ్ ఆదివృద్ధి, ఇకాదేశములు రాఁగా సాయంప్రాతర్ + ఇక, పౌనఃపునర్ + ఇక అనియుండ క్రిందివార్తికముచే టిలోపమగును.

**వా। అవ్యయానాం భమాత్రే టిలోపః (4187)**

**వృ। సాయంప్రాతికః, పౌనఃపునికః.**

ప. వి : అవ్యయానామ్ (6-3) భమాత్రే (7-1) టిలోపః (1-1).

అర్థ : భసంజ్ఞ కలిగిన మాత్రమున అవ్యయములకు టిలోపమగును ఉదా : సాయంప్రాతికః, పౌనః పునికః.

వివ : సాధారణముగా శబ్దస్వరూపముయొక్క టిభాగమునకు డిత్తు పరమై నపుడే లోపము వచ్చును. (టేః) అట్లు డకారము ఇత్తుగా లేని ప్రత్యయము పరమగునపుడు, భసంజ్ఞగల అవ్యయములకు టిలోపము నీ వార్తికము విధించుచున్నది. యకారాది అజాది స్వాది ప్రత్యయములు పరములగుచో పూర్వమునకు భసంజ్ఞ కలుగును (యచిభమ్).

సాయంప్రాతర్ + ఇక, పౌనఃపునర్ + ఇక ఇట అజాది ప్రత్యయము పరమగుటచే ఈ రెంటికిని 'భ' సంజ్ఞకలుగును. ఈ వార్తికముచే టిభాగమగు 'అర్' అనునదిలోపించును. సాయంప్రాతిక + సు = సాయంప్రాతికః, పౌనఃపునిక + సు=పౌనఃపునికః.

**సూ : ప్రావృష ఏణ్యః 4-3-17.**

**వృ : ప్రావృషేణ్యః.**

ప. వి : ప్రావృషః (5-1) ఏణ్యః (1-1).

అను : సమర్థానామిత్యాది. శేషే (7-1) కాలాత్ (5-1).

అర్థ : ప్రావృట్ శబ్దమునకు తత్రభవః' అనునర్థమున 'ఏణ్య' అను ప్రత్యయము వచ్చును ఉదా : ప్రావృషేణ్యః

వివ : ప్రావృట్టనగా వర్షకాలము. ఋతువాచకమైన యీ శబ్దముయొక్క సప్తమ్యంతమునకు 'అందుండునది' అను నర్థమున 'ఏణ్య' అను ప్రత్యయము వచ్చును.

ఉదా : ప్రావృషిభవః - ప్రావృష్ + ఙి, ఏణ్య, విభక్తిలోపము. ప్రావృషేణ్య + సు = ప్రావృషేణ్యః - మేఘము మొదలగునది.

**సూ : సాయంచిరంప్రాహ్ణేప్రగేఽవ్యయేభ్యష్ట్యుట్యులౌ తుట్ చ 4-3-23.**

వృ : సాయమిత్యాదిభ్యశ్చతుర్భ్యోఽవ్యయేభ్యశ్చ కాలవాచిభ్యష్ట్యు ట్యులౌ స్తః, తయోస్తుట్ చ తుటః ప్రాగనాదేశః. తేన 'అనద్యతనే' ఇతి నిర్దేశస్సఙ్గచ్ఛతే. సాయన్తనం, చిరన్తనమ్ ప్రాహ్ణే ప్రగే అనయోరేదన్తత్వం నిపాత్యతే. ప్రాహ్ణేతనమ్, ప్రగేతనమ్, దోషాతనమ్.

వ. వి : సాయం .. అవ్యయేభ్యః (5–3) ట్యుట్యులౌ (1–2) తుట్ (1–1) చ (అవ్య).

అను : సమర్థానామిత్యాది; కాలాత్ (5-1) శేషే (7-1).

అర్థ : సాయ, చిర, ప్రాహ్ణ, ప్రగ అనుశబ్దములకును, కాలవాచకములైన అవ్యయములకును ట్యు ట్యుల్ అను ప్రత్యయములు, శేషార్థములందు వచ్చును. వానికి తుడాగమముకూడ నగును. తుడాగమమునకు పూర్వము 'అన' ఆదేశము చేయవలయును. అపుడు 'అనద్యతనే' అను పాణిని నిర్దేశము కుదురును. ఉదా : సాయంతనమ్, చిరంతనమ్ – ప్రాహ్ణ, ప్రగ అనువానికి ఏదంతత్వము ఇందు నిపతింపఁ బడినది. ప్రాహ్ణేతనమ్, ప్రగేతనమ్ అవ్యయమున కుదాహరణము– దోషాతనమ్.

వివ : కాలమును దెలుపుపదములగు సాయ; చిర, ప్రాహ్ణ, ప్రగ అను నాలుగు సుబంతములకును, కాలవాచకములే యగు అద్య, దోషామున్నగు అవ్యయములకును, 'అందున్నవాఁడు' మున్నగు శేషాధికారములోని అర్థవిశేషములందు 'ట్యు', 'ట్యుల్' అను ప్రత్యయములు వచ్చును. ఈ ప్రత్యయములకు 'తుట్' అనునాగమము కూడ వచ్చును ఈ ప్రత్యయములందు టకారలకారము లిత్తులు. రెంటియందును 'యు' మిగులును కావున ఏర్పడురూపమొక్కటియే అయినను స్వరవిశేషము కొఱకు రెండు ప్రత్యయములు విధింపఁబడినవి

'యువోరనాకౌ' అను సూత్రముచే ఈ ప్రత్యయమునకు 'అన' ఆదేశము రావలయును. విధింపఁబడిన తుట్ ఆగమము (త్ + ఉ + ట్ ఉకారముచ్చారణార్థకము, టకారమిత్తు) 'యు' అనుస్వరూపముగా నున్నపుడు వచ్చునా? 'అన' ఆదేశము వచ్చినపిదప వచ్చునా? అను సందేహమిట జనించును. మొదటిపక్షమున 'త్యు' అయినచో అనాదేశము వచ్చుటకు వీలులేదు అంగమునకు పరముగానున్న 'యు' అనుదానికే అనాదేశము వచ్చును. 'త్యు' అనుచోట అంగసంజ్ఞగల 'సాయం' ఇత్యాదులకును, 'యు' అనుదానికి నడుమ తకారమున్నదిగదా। ఆగమములు దేనికి

విధింపఁబడునో దాని అవయవములే అగునుగదా (యదాగమా స్తద్గుణీభూతా స్తద్గ్రహణేన గృహ్యన్తే) దీనినిబట్టి తుడాగమసహిత యు ప్రత్యయము, (త్యు), 'యువోరనాకౌ' అనుసూత్రమున గ్రహింపఁబడదా? గ్రహింపఁబడినచో అనాదేశము వచ్చి 'తన' అగుట కభ్యంతరమేమి? అనరాదు. 'నిర్దిశ్యమానస్యాదేశాభవన్తి' అను నొక పరిభాషగలదు. ఆదేశములు నిర్దిశ్యమానములకే (పేర్కొనఁబడినవానికే) వచ్చును సూత్రమున 'యు' అనునదియే పేర్కొనఁబడినది కాని 'త్యు' కాదుగదా! కావున అనాదేశము రాఁజాలదు. పోనీ ముందు 'యు' అనుదానికి అనాదేశము చేసికొని పిదప తుడాగమము చేయరాదా? అన్నచో దానికొక పరిభాష అడ్డు తగులును. తుడాగమము ట్యుట్యుల్ ప్రత్యయములకు అంతరంగకార్యము. అనగా అవి శబ్దస్వరూపమునకు చేరునపుడు వీనితో నెడఁబాయక చేరును. ఇఁక అనాదేశమన్ననో బహిరంగము తుడాగమముతో కూడ వచ్చిన ప్రత్యయములోని 'యు' అనుదానికి అనంతరకాలికమగు కార్యమని భావము. బహిరంగ కార్యముకంటె అంతరంగ కార్యము బలీయము. (పరనిత్యాంతరంగాపవాదానా ముత్తరోత్తరం బలీయః). కావున అంతరంగకార్యమగుతుడాగమమే ముందు జరుగవలయును. ఇట్లే ప్రత్యయము 'తన' అనుస్వరూపమును పొందవలసియుండగా శాస్త్రమంగీకరించుటలేదు. కాని పాణిని మహర్షి 'అనద్యతనే లఙ్' మున్నగు సూత్రములలో ఈ 'ట్యు' ప్రత్యయమునకు అనాదేశము చేసినతర్వాతనే తుడాగమముచేసి 'అనద్యతనే' మున్నగువానిని ప్రయోగించియున్నారు (అద్య + ట్యు, అద్య + యు, అద్య + అన, తుడాగమము అద్యత్ + అన = అద్యతన) అట్టి ప్రయోగములను బట్టి ప్రకృతప్రత్యయమునకు ముందే అనాదేశము చేసిపిదప తుడాగమము చేయవలయుననుట నిరూపితమైనది ఈ విషయమునే 'తుటః ప్రాగనాదేశః' ఇత్యాది వృత్తివాక్యము సూచించును.

ఉదా : సాయంతనమ్ – సాయంకాలమున నగునది సాయ + ఙి + ట్యు - ట్యుల్. విభక్తిలోపము, సాయ + యు, 'అన' ఆదేశము సాయ + అన, తుడాగమము, టిత్తగుటచే ఆద్యవయవమగును. సాయ + త్ + అన = సాయ + తన ఈ ప్రత్యయము వచ్చునపుడు సాయ, చిర అనుశబ్దములకు మకారాంతత్వము 'సాయంచిరం' ఇత్యాది ప్రయోగమువలన నిపతింపఁబడినది. సాయమ్ తన + సు=మకారమున కనుస్వారాదేశపరసవర్ణములు 'సాయన్తనమ్'.

చిరంతనమ్ చిర + ఙి, ట్యు-ట్యుల్, చిర + యు, చిర + అన, చిర + తన, మాంతత్వము చిరన్తన + సు = చిరన్తనమ్.

ప్రాహ్ణ + సు, ట్యు/ట్యుల్, ప్రాహ్ణ + యు, అనాదేశము, తుడాగమము, ప్రాహ్ణ + తన, సూత్రమున 'ప్రాహ్ణేప్రగే' అని ప్రయోగింపఁబడియుండుటచే వీనికి ఏదంతత్వము నిపతింపఁబడినదని తెలియనగును. ప్రాహ్ణేతన + సు = ప్రాహ్ణేతనమ్

ప్రగేభవమ్, ప్రగ + ఙి, ట్యు-ట్యుల్, ప్రగ + యు, అనాదేశము, తుడాగమము, ప్రగ + తన, ఏదంతత్వము ప్రగేతన + సు = ప్రగేతనమ్.

ఈ సూత్రమునందలి సాయ, చిర, ప్రాహ్ణ, ప్రగ అనునవి అవ్యయములు కావు అవ్యయములైనచో సూత్రమునందలి 'అవ్యయేభ్యః' అనుపదముచేతనే వానికిని ఈ ప్రత్యయములు సిద్ధించును 'సాయం, ప్రగే' మున్నగు నవ్యయము లును గలవు. వానికి 'అవ్యయేభ్యశ్చ' అనుపదముచే ఈ ప్రత్యయములు సిద్ధించును.

అవ్యయమున కుదాహరణము - దోషాభవమ్ - దోషా అను నవ్యయమునకు 'రాత్రి' అని అర్థము దోషా + ట్యు - ట్యుల్, దోషా + యు, అనాదేశము దోషా + అన, తుడాగమము, దోషా, త్ + అన = దోషాతన + సు = దోషాతనమ్.

అవ: ఇంతవఱకు ప్రకృతులు ప్రత్యయములు మాత్రమే చెప్పఁబడినవి. ఇటుపై శేషాధికారమునందలి అర్థవిశేషములును, సమర్థవిభక్తులును, మఱికొన్ని ప్రత్యయములును జెప్పఁబడుచున్నవి.

**సూ : తత్ర జాతః 4-3-25.**

**వృ : సప్తమీసమర్థాజ్జాత ఇత్యర్థేఽణాదయో ఘాదయశ్చ స్యుః స్రుఘ్నే జాతః స్రౌఘ్నః; ఉత్సే జాతః ఔత్సః, రాష్ట్రే జాతః రాష్ట్రియః, అవారపారే జాతః అవారపారీణః ఇత్యాది.**

వ. వి : తత్ర (అవ్య) జాతః (1-1).

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః, శేషే (7-1).

అర్థ : సప్తమీసమర్థమునకు అందుపుట్టినవాఁడు అనునర్థమున అణాది ప్రత్యయములును ఘాదిప్రత్యయములును చేరును. ఉదా : స్రుఘ్నే జాతః స్రౌఘ్నః ఇత్యాదులు.

వివ : తత్ర అనునది సప్తమ్యర్థక అవ్యయము. సంధికార్యాదులు చేయఁబడిన సమర్థపదములలో మొదటిదాని విభక్తి నీపదము సూచించును. 'సమర్థమైన సప్తమ్యంత పదమునకు' అని యీ పదముచే నర్థమేర్పడును. 'జాతః' అనునర్థము ఈ సూత్రమున సూచింపఁబడినది. తద్ధిత ప్రకరణారంభమునందలి సాధారణ ప్రత్యయములగు అణాదులు 'తేనదీవ్యతి' అను సూత్రమునకు పూర్వమునఁ గల అర్థములన్నింటను వచ్చునని చెప్పుటచేత నవియును, శేషాధికారమున 'రాష్ట్రావార పారాద్ఘఖౌ' ఇత్యాదిసూత్రములచే విధింపఁబడిన ఘ మున్నగునవియును, 'అందు పుట్టినవాఁడు' అనునర్థమున సప్తమ్యంతపదములకు పరముగా చేరును.

ఉదా : స్రుఘ్నేజాతః – స్రుఘ్నదేశమున పుట్టినవాఁడు, స్రుఘ్న + ఙి, అణ్ (అణధికారములోనిదగుటచే సామాన్యమగు అణ్ ప్రత్యయముచేరినది) విభక్తి లోపము, ఆదివృద్ధి, స్రౌఘ్న + అ, యస్యేతిచ–అకారలోపము, స్రౌఘ్న + అ=స్రౌఘ్న+సు=స్రౌఘ్నః.

ఉత్సేజాతః, ఉత్సమనుచోట పుట్టినవాఁడు, ఉత్స + ఙి + అఞ్ (ఉత్సాదిభ్యోఽఞ్) ఉత్స + అ, ఆదివృద్ధి, అకారలోపము, ఔత్స + సు = ఔత్సః.

రాష్ట్రేజాతః, రాష్ట్రమున పుట్టినవాఁడు, రాష్ట్ర + ఙి, ఘ (రాష్ట్రావార పారాద్ఘఖౌ) విభక్తిలోపము, ఘకారమునకు ఇయాదేశము, అకారలోపము, రాష్ట్ర + ఇయ = రాష్ట్రియ + సు=రాష్ట్రియః

అవారపారేజాతః, సముద్రమున పుట్టినవాఁడు, అవారపార + ఙి, ఖ, (రాష్ట్రావారపారాద్ఘఖౌ) అవారపార + ఖఞ్, అకారలోపము, ఈనాదేశము, ణత్వము, అవారపారీణ + సు=అవారపారీణః మొ॥వి.

సూ : ప్రావృషష్ఠప్ 4-3-26.

వృ : ఏణ్యాపవాదః. ప్రావృషికః.

ప. వి : ప్రావృషః (5-1) ఠప్ (1-1).

అను : తత్ర (7-1) జాతః (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : సప్తమ్యంతమగు ప్రావృట్ఛబ్దమునకు 'అందు పుట్టినవాఁడు' అను నర్థమున 'ఠప్' ప్రత్యయము వచ్చును. ఇది 'ఏణ్య' ప్రత్యయమున కపవాదము, ఉదా : ప్రావృషికః.

వివ : పూర్వము 'ప్రావృషఏణ్యః' అను సూత్రముచే ప్రావృట్ఛబ్దమునకు శేషార్థములందు ఏణ్యప్రత్యయము విధింపఁబడినది. ఇది దానికపవాదము. 'ప్రావృట్కాలమున పుట్టినవాఁడు' అనునర్థమునందు 'ఠప్' ప్రత్యయము వచ్చును. ఇతరార్థములందు ఏణ్య ప్రత్యయమగునని తాత్పర్యము. ఇందు పవర్గమిత్తు. 'ఠ' అనుదానికి ఇకాదేశమగును. (ఠస్యేకః)

ఉదా : ప్రావృషిభవః, ప్రావృష్ + ఙి, ఠప్, విభక్తిలోపము, ఇకాదేశము ప్రావృష్ + ఇక = ప్రావృషిక + సు = ప్రావృషికః - వర్షకాలమున పుట్టినది.

'శేషే' అనునధికారములో 'తత్రజాతః' అనునది ఒక అర్థవిశేషము

అప : ఇటియొక అర్థవిశేషము.

సూ : ప్రాయభవః 4-3-39.

వృ : తత్రేత్యేవ. స్రుఘ్నే ప్రాయేణ, బాహుల్యేన భవతి స్రౌఘ్నః.

ప వి : ప్రాయభవః (1-1).

అను : తత్ర (అవ్య) సమర్థానా మిత్యాది.

అర్థ : 'అందు అధికముగా ఉండునది' అనునర్థమున అణాది సాధారణప్రత్యయములు, ఘాదులగు శైషికప్రకరణ ప్రత్యయములును యథాసంభవముగ నగును.

వివ : సప్తమ్యంతములైన సమర్థపదములకు 'అందుఅధికముగా నుండునది' అనునర్థమున అణాదిప్రత్యయములు వచ్చును.

ఉదా : స్రుఘ్నేప్రాయభవః - స్రుఘ్నదేశమున అధికముగా నుండునది, స్రుఘ్న + ఙి + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, అకారలోపము, స్రౌఘ్న + సు = స్రౌఘ్నః.

శేషాధికారములో నిందు చెప్పఁబడిన రెండవయర్థ మీ 'ప్రాయభవః' అనునది.

సూ : సమ్భూతే 4-3-41.

వృ : స్రుఘ్నే సంభవతి స్రౌఘ్నః.

ప. వి : సమ్భూతే (7-1).

అను : తత్ర (అవ్య) సమర్థానా మిత్యాది.

అర్థ : సప్తమ్యంతపదమునకు 'అందు ఉండవచ్చును' అని సంభావింపఁదగిన దానిని చెప్పుచు అణాది ఘాది ప్రత్యయములు యథాసంభవముగ నగును ఉదా : స్రౌఘ్నః.

వివ : సమర్థపదములలో మొదటిదగు సప్తమ్యంతమునకు పరముగా, దానిచే వాచ్యమగు దేశాదికమునందు ఉండవచ్చునని సంభావింపఁబడు వస్తువును / వ్యక్తిని తెలుపుచు, సాధారణప్రత్యయములగు అణాదులును, శైషికప్రత్యయములగు 'ఘ' మున్నగునవియుఁ జేరును.

ఉదా : స్రుఘ్నే సంభవతి (స్రుఘ్నదేశమున నుండవచ్చునని ఊహింపఁబడునది) స్రుఘ్న + ఙి + అణ్, స్రౌఘ్న + సు = స్రౌఘ్నః.

ఈ 'సంభూత్' అనునది శైషికమున మూఁడవ యర్థము.

**సూ : కోశాడ్ఢఞ్ 4-3-42.**

**వృ : కౌశేయం వస్త్రమ్.**

ప. వి : కోశాత్ (5-1) ఢఞ్ (1-1).

అను : సమర్థానామిత్యాది.

అర్థ : కోశశబ్దమునకు 'దాని వికారము' అనునర్థమున ఢఞ్ ప్రత్యయము వచ్చును. ఉదా : కౌశేయమ్ వస్త్రమ్.

వివ : ఈ సూత్రమున కనుబంధముగా 'వికారేకోశాడ్ఢఞ్' అను వార్తికము చెప్పఁబడినది కావున షష్ఠ్యంత కోశశబ్దమునకు పరముగా దానియొక్క-వికారము అనునర్థమున, ఢఞ్ ప్రత్యయము చేరును. కోశస్యవికారః – (ఒకవిధమగు కృమి యొక్క-కోశము (అంతర్భాగము) యొక్క- వికారము = అందుండి వెలువడిన పదార్థము) కోశ + ఙస్ + ఢఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఢకారమునకు 'ఏయ్' ఆదేశము, కౌశ+ఏయ్+అ, యస్యేతిచ-అకారలోపము కౌశ్+ఏయ= కౌశేయ + సు=కౌశేయమ్. పట్టువస్త్రము.

**సూ : తత్రభవః 4-3-53.**

**వృ : స్రౌఘ్నః, ఔత్సః, రాష్ట్రియః.**

ప. వి : తత్ర (అవ్య) భవః (1-1)

అను : సమర్థానామిత్యాది.

అర్థ : 'అందున్నవాఁడు' అనునర్థమున సప్తమ్యంత సమర్థములకు అణాది సాధారణ ప్రత్యయములును, ఘాదిశైషికప్రత్యయములును వచ్చును. ఉదా : స్రౌఘ్నః, ఔత్సః, రాష్ట్రియః.

వివ : భూధాతువునకు ఉనికి అర్థము. కావున 'భవః' అనగా ఉన్న / ఉండు వాఁడు అని అర్థము. 'తత్ర జాతః' అనగా అందు పుట్టినవాఁడు. దానికిని దీనికిని భేద మిది. సప్తమ్యంతపదమునకు పరముగా 'దానిచే వాచ్యమగు దేశాదికమునందున్న వాఁడు' అనునర్థమున సాధారణ ప్రత్యయప్రకరణమున విధింపఁబడిన అణ్ మున్నగు ప్రత్యయములును, శేషాధికారమున చెప్పఁబడిన 'ఘ' మున్నగు ప్రత్యయములును యథాసంభవముగ, వచ్చును. యథాసంభవముగ వచ్చుట యనగా ఏ సూత్రమునందును పేర్కొనని శబ్దములకు అణ్ ప్రత్యయము, ఉత్సాదులకు అఞ్ ప్రత్యయమును (ఉత్సాదిభ్యోఽఞ్) రాష్ట్రశబ్దమునకు ఘప్రత్యయమును, అవారపారశబ్దమునకు 'ఖ' ప్రత్యయమును – ఈ విధముగా ఈ అర్థమునందు వచ్చునని భావము.

ఉదా : స్రుఘ్నేభవః – స్రౌఘ్నః (స్రుఘ్న + ఙి, అణ్) ఉత్సేభవః = ఔత్సః (ఉత్సాదిభ్యోఽఞ్ ఉత్స + ఙి + అఞ్) రాష్ట్రేభవః – రాష్ట్రియః (రాష్ట్రావారపారాద్ఘఖౌ – రాష్ట్ర + ఙి + ఘ, ఘకారమునకు ఇయాదేశము).

**సూ : దిగాదిభ్యో యత్ 4-3-54.**

**వృ : దిశ్యమ్, వర్గ్యమ్.**

ప. వి : దిగాదిభ్యః (5-3) యత్ (1-1).

అను : తత్ర (అవ్య) భవః (1-1) సమర్థానామిత్యాదికము.

అర్థ : 'అందున్నది' అనునర్థమున సప్తమ్యంతములగు దిగాదిపదములకు 'యత్' ప్రత్యయము వచ్చును.

వివ : దిశ్, వర్గ మున్నగు సప్తమ్యంతపదములకు దానియందున్నది, ఉన్న వాఁడు అనునర్థమును తెలుపుచు యత్ ప్రత్యయము చేరును. ఇందు తకారమిత్తు.

ఉదా : దిశిభవమ్ - దిక్కునందున్నది. దిశ్ + ఙి + యత్, విభక్తి లోపము, దిశ్య + సు=దిశ్యమ్.

వర్గేభవమ్ - వర్గమునందున్నది. వర్గ + ఙి + యత్, విభక్తిలోపము, యస్యేతిచ-అకారలోపము, వర్గ్ + య=వర్గ్య+సు=వర్గ్యమ్.

**దిగాదిగణము :** దిశ్ వర్గ పూగ గణ పక్ష ధాయ్య మిత్ర మేధా అన్తర పథిన్ రహస్ అలీక ఉఖా సాక్షిన్ దేశ ఆది అన్త ముఖ జఘన మేఘ యూథ, 'ఉదకాత్సంజ్ఞాయామ్' 88. జ్ఞాయ (న్యాయ) వంశ వేశ కాల ఆకాశ-ఇతిదిగాదిః.

**సూ . శరీరావయవాచ్చ 4-3-55.**

**వృ : దన్త్యమ్, కణ్ఠ్యమ్.**

ప. వి : శరీరావయవాత్ (5-1) చ (అవ్య).

అను : తత్ర (అవ్య) భవః (1-1) సమర్థానామిత్యాది, యత్ (1-1).

అర్థ : సప్తమ్యంతమగు శరీరావయవవాచకమునకు 'అందున్నది' మున్నగు నర్థమున 'యత్' ప్రత్యయము వచ్చును ఉదా : దన్త్యమ్, కంఠ్యమ్ మొ॥వి.

వివ: శరీర అవయవవాచకములగు దంత, కంఠ, ఓష్ఠ, నాసిక మున్నగువాని సప్తమ్యంతరూపములకు పరముగా, అందు (దంతాదుల యందు) ఉండునది, అగునది, ఏర్పడునది అనునర్థములందు యత్ ప్రత్యయము వచ్చును పైనిజెప్పిన యర్థములు 'భవః' అనుదానికి సందర్భానుసారముగా ఊహించుకొనదగినవి.

ఉదా : దన్తేషుభవమ్ దన్త + సుప్, యత్, విభక్తిలోపము, దన్త + య (త్) యస్యేతిచ - అకారలోపము దన్త్ + య=దన్త్య + సు=దన్త్యమ్- దంతములయందేర్పడు తకారాది వర్ణాదికము.

కణ్ఠే భవమ్, కణ్ఠ + ఙి, యత్, కణ్ఠ + య, కణ్ఠ్ + య=కణ్ఠ్య + సు=కణ్ఠ్యమ్. (కంఠమున నేర్పడు కకారాది వర్ణాదికము).

**వా॥ అధ్యాత్మాదేష్ఠఞిష్యతే (2869).**

**వృ : అధ్యాత్మంభవమాధ్యాత్మికమ్.**

ప. వి : అధ్యాత్మాదేః (5-1) ఠఞ్ (1-1) ఇష్యతే (క్రి. ప).

అర్థ : అందుండునది అనునర్థమున అధ్యాత్మాదిశబ్దములకు 'ఠఞ్' ప్రత్యయము వచ్చుట ఇష్టము . ఉదా : అధ్యాత్మంభవ మాధ్యాత్మికమ్.

వివ : 'అధ్యాత్మ' మున్నగువానికి 'అందుండునది' అనునర్థమున 'ఠఞ్' ప్రత్యయము వచ్చును. ఇందు ఞకారమిత్తు. ఠకారమునకు 'ఠస్యేకః' అనుసూత్రముచే ఇకాదేశము వచ్చును.

ఉదా : అధ్యాత్మం భవమ్ ఆధ్యాత్మికశబ్దము 'ఆత్మని' – ఆత్మయందు అను నర్థముగల అవ్యయీభావమగుటచే అవ్యయము : అధ్యాత్మ + ఠఞ్, ఆదివృద్ధి ఆధ్యాత్మ + ఠ, ఇకాదేశము, ఆధ్యాత్మ + ఇక, యస్యేతిచ అకారలోపము ఆధ్యాత్మ్ + ఇక=ఆధ్యాత్మిక + సు = ఆధ్యాత్మికమ్

అవ : దేవేషు 'దేవులయందు' అనునర్థముగల 'అధిదేవ' అనునవ్యయము నకు 'ఠఞ్' ప్రత్యయము. 'అధిదేవ + ఠఞ్' అనియుండ క్రిందిసూత్రముచే ఉభయ పదవృద్ధి విధింపఁబడుచున్నది.

సూ . అనుశతికాదీనాంచ 7-3-20.

వృ : ఏషాముభయపదవృద్ధిర్ఞితిణితికితిచ. ఆధిదైవికమ్, ఆధిభౌతికమ్, ఐహలౌకికమ్ ఆకృతిగణోఽయమ్.

ప. వి : అనుశతికాదీనామ్ (6-3) చ (అవ్య)

అను : తద్ధితేషు (7-3) అచామ్ (6-3) ఆదేః (6-1) వృద్ధిః (1-1) ఞ్ణితి (7-1) కితి (7-1) ఉత్తర పదస్య (6-1) పూర్వపదస్య (6-1).

అర్థ : అనుశతికాదులకు, ఞిత్తు, ణిత్తు, కిత్తులు పరములగునపుడు ఉభయ పదవృద్ధివచ్చును. ఉదా : ఆధిదైవికమ్ ఇత్యాది.

వివ : ఞకారణకారకకారము లిత్తులుగాఁ గల తద్ధితప్రత్యయములు పరములగు నపుడు పూర్వమున నున్నశబ్దస్వరూపముయొక్క అచ్చులలో తొలియచ్చునకు వృద్ధి వచ్చుటను పూర్వ మనేకోదాహరణములందు చూచితిమి (సూ. తద్ధితేష్వచామాదేః, కితిచ). ప్రకృత సూత్రము, 'అనుశతిక' మొదలగు వానిలోని పూర్వోత్తరపదముల యొక్క తొలిఅచ్చులు రెంటికిని ఞిత్ ణిత్ కిత్తులు పరములగునపుడు వృద్ధి వచ్చుటను విధించుచున్నది.

ఉదా : అధిదేవ + ఠఞ్, ఞిత్తు పరముగానున్నది కావున 'అధిదేవ' అనుదాని యందలి పూర్వపదమైన 'అధి' అను దానితొలిఅచ్చగు అకారమునకు, ఉత్తరపదమగు 'దేవ' అనుదానియందలి తొలిఅచ్చయిన ఏకారమునకు వృద్ధివచ్చును

(క్రమముగా అ, ఐలు వచ్చును) ఆధిదైవ + ఇక, యస్యేతిచ-అకారలోపము - అధిదైవ్ + ఇక = ఆధిదైవిక + సు = ఆధిదైవికమ్.

ఇక్లే అధిభూతంభవమ్ - అధిభూతమున నుండునది, అధిభూత + ఠఞ్ (అధ్యాత్మాదేష్ఠఞిష్యతే) ఉభయపదవృద్ధి, ఆధిభౌత+ఇక, అకారలోపము ఆధి భౌతిక + సు = ఆధిభౌతికమ్.

ఇహలోకే భవమ్ - ఈలోకమున నగునది. ఇహలోక + ఙి, ఠఞ్, విభక్తిలోపము, ఉభయపదవృద్ధి, ఐహలౌక + ఇక, అకారలోపము ఐహలౌక్ + ఇక = ఐహలౌకిక + సు=ఐహలౌకికమ్.

**(i) అధ్యాత్మాదిగణము :** అధ్యాత్మ అధిదేవ అధిభూత - ఇత్యధ్యాత్మాదిః.

**(ii) అనుశతికాదిగణము :** అనుశతిక అనుహోడ అనుసంవరణ (అను సంచరణ) అను సంవత్సర అఙ్గారవేణు అసిహత్య (అస్యహత్య) అస్య హేతి వధోగ పుష్కరసద్ అనుహరత్ కురుకత కురు - పఞ్చాల ఉదకశుద్ధ ఇహలోక పరలోక సర్వలోక సర్వపురుష సర్వభూమి ప్రయోగ పరస్త్రీ 'రాజ పురుషాత్ ష్యఞ్'సూత్రనద-ఇత్యనుశతికాదిః. ఆకృతిగణోఽయమ్. తేన అధిగమ అధిభూత అధిదేవ చతుర్విద్యా ఇత్యాదయోఽప్యన్యేవిజ్ఞేయాః.

**సూ : జిహ్వామూలాఙ్గులేశ్ఛః 4-3-62.**

**వృ : జిహ్వామూలీయమ్, అఙ్గులీయమ్.**

ప. వి : జిహ్వామూలాఙ్గులేః (5-1) ఛః (1-1).

అను : శరీరావయవాత్ (5-1) తత్ర (అవ్య) భవః (1-1) సమర్థానా మిత్యాది.

అర్థ : జిహ్వామూల, అఙ్గులి అను శరీరావయవవాచకములకు 'అందగునది' అనువర్థమున 'ఛ' ప్రత్యయము వచ్చును. ఉదా : జిహ్వామూలీయమ్, అంగు లీయమ్.

వివ : ఇది 'శరీరావయవాత్' అనుసూత్రమున కపవాదము. శరీరావయవము లగు జిహ్వామూల, అంగులి అనువాని సప్తమ్యంతరూపములకు వరముగా అంద

ఉండునది, ఏర్పడునది అమనర్థమున 'ఛ' ప్రత్యయము వచ్చును. అయనేయానీత్యాది సూత్రముచే ఛకారమునకు 'ఈయ్' ఆదేశమగును.

ఉదా : జిహ్వామూలే భవమ్, నాలుకమొదట నేర్పడునది, జిహ్వామూల + ఙి, ఛ, విభక్తిలోపము, ఈయాదేశము, జిహ్వామూల + ఈయ్ + . అ (ఛ్ +అ) యస్యేతిచ అకారలోపము, జిహ్వామూల్ + ఈయ=జిహ్వామూలీయ+ సు=జిహ్వామూలీయమ్.

అఙ్గులౌభవమ్ - అంగుళియందుండునది అఙ్గుళి + ఙి, ఛ, విభక్తి లోపము, ఈయాదేశము, ఇకారలోపము, అఙ్గుల్ + ఈయ=అఙ్గులీయ + సు = అఙ్గులీయమ్

సూ : వర్గాన్తాచ్చ 4-3-63.

వృ : కవర్గీయమ్.

ప. వి : వర్గాన్తాత్ (5-1) చ (అవ్య).

అను : తత్ర (అవ్య) భవః (1-1) ఛః (1-1) సమర్థానామిత్యాదులు.

అర్థ : వర్గశబ్దమంతమునఁ గలశబ్దములకు 'అందుండునది' అనునర్థమున 'ఛ' ప్రత్యయము వచ్చును ఉదా : కవర్గీయమ్.

వివ : 'వర్గ' అనునది అంతమునఁ గల శబ్దముల సప్తమ్యంతమునకును పరముగా 'అందుండునది' అమనర్థమున 'ఛ' ప్రత్యయమగును.

ఉదా : కవర్గే భవమ్ = కవర్గమున నుండునది. కవర్గ + ఙి, ఛ, విభక్తి లోపము కవర్గ ఛ, ఈయాదేశము కవర్గ + ఈయ, అకారలోపము, కవర్గ్ + ఈయ = కవర్గీయ + సు కవర్గీయమ్.

'తత్ర భవః' అను సూత్రము మొదలుకొని యింతవఱకు అందుండునది అనునర్థమున సప్తమ్యంతసమర్థములకు వివిధప్రత్యయములు విధింపఁబడినవి. శేషాధికారమున నిది నాల్గవ యర్థము.

అవ : పేఠొక యర్థమును, సమర్థ విభక్తియు ప్రారంభింపఁబడుచున్నవి.

సూ : తత ఆగతః 4-3-74.

వృ : స్రుఘ్నాదాగతః స్రౌఘ్నః.

ప. వి : తతః (అవ్య) ఆగతః (1-1).

అను : సమర్థానామిత్యాదికము.

అర్థ : 'దానినుండి వచ్చినది' అనునర్థమున పంచమ్యంత పదములకు పరముగా సాధారణ ప్రత్యయములగు అణాదులును, శైషికప్రత్యయములగు ఘాదులును వచ్చును. ఉదా : స్రౌఘ్నః.

వివ : తచ్ఛబ్దమునకు 'తసిల్' అనుపంచమ్యర్థక తద్ధితప్రత్యయముచేరగా 'తతః' అగును. ఇది సమర్థపదముయొక్క పంచమీవిభక్తిని సూచించును. పంచమ్యంత పదమునకు పరముగా, 'దానిచే వాచ్యమగు దేశాదికమునుండి వచ్చినవాఁడు' అనునర్థమున సాధారణప్రత్యయప్రకరణమున విధింపఁబడిన అణాదులును, శైషికప్రకరణమున విధింపఁబడిన 'ఘ' మున్నగునవియు, వచ్చును.

ఉదా : స్రుఘ్నాదాగతః - స్రుఘ్నదేశమునుండి వచ్చినవాఁడు; స్రుఘ్న + ఙసి+అణ్ (ప్రాగ్దీవ్యతోఽణ్ అనుసూత్రమునుండి 'అణ్' అనునది యీ సూత్రమునకు అధికారముగా వచ్చును). విభక్తిలోపము, ఆదివృద్ధి, అకారలోపము, స్రౌఘ్న + సు = స్రౌఘ్నః.

సూ : ఠగాయస్థానేభ్యః 4-3-75.

వృ : శుల్కశాలాయా ఆగత శ్శౌల్కశాలికః.

ప. వి : ఠక్ (1-1) ఆయస్థానేభ్యః (5-3).

అను : తతః (అవ్య) ఆగతః (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : ఆయస్థానవాచకములకు పరముగా 'దానినుండి వచ్చినవాఁడు' అనునర్థమున 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : శుల్కశాలాయా ఆగతః శౌల్కశాలికః.

వివ : ప్రభుత్వమునకు పన్నురూపములో వచ్చు ధనాదికమును ఆయ మందురు. దానియొక్క శాల ఆయశాల దానిని చెప్పుపదముల పంచమ్యంతరూపమునకు, అందుండి వచ్చినది / వచ్చినవాఁడు అనునర్థమున 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఇందు కకారమిత్తు. దానివలన ఆదివృద్ధి వచ్చును. ఠకారమునకు ఇకాదేశము (ఠస్యేకః).

ఉదా : శుల్కశాలాయా ఆగతః. శుల్కశాలనుండి వచ్చినవాఁడు. శుల్కశాలా + ఙసి, ఠక్, విభక్తిలోపము, కిత్త్వ - ఆదివృద్ధి,

శాల్కా-శాలా + ఇక, యస్యేతిచ - అకారలోపము, శాల్కా-శాల్ ఇక = శాల్కా-శాలిక + సు = శాల్కా-శాలికః.

సూ : విద్యా యోని సమ్బన్ధేభ్యో వుఞ్ 4-3-77.

వృ : ఔపాధ్యాయకః, పైతామహకః.

ప వి : విద్యా యోని సంబంధేభ్యః (5-3) వుఞ్ (1-1).

అను : తత (అవ్య) ఆగతః (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : విద్యా యోని సంబంధవాచకములకు పరముగా, అటనుండి వచ్చినది/వచ్చినవాఁడు అనునర్థములందు, వుఞ్ ప్రత్యయము వచ్చును.

ఉదా : ఔపాధ్యాయకః, పైతామహకః.

వివ : విద్యాసంబంధమనగా విద్యకు సంబంధించిన గురువు శిష్యుఁడు మొ॥వి. యోని సంబంధమనగా పుట్టుకకు సంబంధించినది. తండ్రి, తాత, కొడుకు మున్నగునవి. పంచమ్యంతములగు వీనికి, వానినుండి వచ్చినది అనునర్థమున 'వుఞ్' అను ప్రత్యయము చేరును ఇందు ఞకారమిత్తు. దానివలన ఆదివృద్ధి యగును. 'వు' అనుదానికి 'యువోరనాకౌ' అను సూత్రముచే 'అక' ఆదేశము.

ఉదా : ఉపాధ్యాయాదాగతః - ఉపాధ్యాయునివలన వచ్చినది. ఉపాధ్యాయ శబ్దము విద్యకు సంబంధించినది. ఉపాధ్యాయ + ఙసి, వుఞ్, ఆదివృద్ధి (ఉ > ఔ) ఔపాధ్యాయ + వు, 'అక' ఆదేశము ఔపాధ్యాయ + అక, యస్యేతిచ, అకారలోపము ఔపాధ్యాయ్ + అక = ఔపాధ్యాయక + సు = ఔపాధ్యాయకః.

పితామహాదాగతః - తాతనుండి వచ్చినది. పితామహశబ్దము యోని (పుట్టుక) సంబంధమును తెలుపునది. పితామహ + ఙసి + వుఞ్ విభక్తిలోపాదికము పైతామహక + సు = పైతామహకః.

సూ : హేతుమనుష్యేభ్యోఽన్యతరస్యాం రూప్యః 4-3-81.

వృ : సమాదాగతం సమరూప్యమ్. పక్షేగహాదిత్వాచ్ఛః - సమీయమ్, దేవదత్తరూప్యమ్ - దైవదత్తమ్ - దేవదత్తీయమ్

ప. వి : హేతుమనుష్యేభ్యః (5-3) అన్యతరస్యామ్ (అవ్య) రూప్యః (1-1).

అను : తతః (అవ్య) ఆగతః (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : హేతువాచకమనుష్యవాచక పంచమ్యంతములకు పరముగా 'వాని నుండి వచ్చినది' అనునర్థమున 'రూప్య' అను ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. ఉదా : సమాదాగతం సమరూప్యమ్-రానిపక్షమున, 'గహాదిభ్యశ్చ' అను సూత్రముచే 'ఛ' ప్రత్యయము - సమీయమ్. ఇట్లే దేవదత్తరూప్యమ్, దైవదత్తమ్, దేవదత్తీయమ్.

వివ : పంచమ్యంతములగు హేతువాచకశబ్దములకును, మనుష్యవాచకశబ్దములకును, ఆటనుండి వచ్చినది అనునర్థమున 'రూప్య' అను ప్రత్యయము చేరును అది వైకల్పికము.

ఉదా : సమాదాగతమ్, సమమువలన వచ్చినది ఇచట సమశబ్దము హేతు వాచకము. సమ + ఙసి + రూప్య - విభక్తిలోపము-సమరూప్య + సు = సమరూప్యమ్. ఈ ప్రత్యయము రానిచో సమశబ్దము గహాదులలోనిదగుటచే 'ఛ' ప్రత్యయము వచ్చును. సమ + ఙసి + ఛ, విభక్తిలోపము, ఈయాదేశము సమ + ఈయ, యస్యేతిచ అకారలోపము సమ్, ఈయ = సమీయ + సు = సమీయమ్.

మనుష్యవాచకముల కుదాహరణము. దేవదత్తాదాగతమ్ - దేవదత్తునివలన వచ్చినది దేవదత్త + ఙసి, రూప్య, విభక్తిలోపము దేవదత్తరూప్య + సు = దేవదత్తరూప్యమ్. దేవదత్త శబ్దము మనుష్య నామవాచకమగుటచే వృద్ధ సంజ్ఞ దీనికి వైకల్పికముగా నగును (వా నామధేయస్య వృద్ధసంజ్ఞా వక్తవ్యా) కావున రూప్య ప్రత్యయము రానిచో వృద్ధసంజ్ఞయున్నయెడల 'వృద్ధాచ్ఛః' అనుసూత్రముచే ఛ ప్రత్యయము అగును. దేవదత్త + ఙసి, ఛ, విభక్తిలోపము, ఈయాదేశము, అకారలోపము, దేవదత్తీయ + సు = దేవదత్తీయమ్ వృద్ధసంజ్ఞలేనియెడల సాధారణ ప్రత్యయమగు 'అణ్' వచ్చును. దేవదత్త + ఙసి + అణ్, ఆది వృద్ధ్యాదులు 'దైవదత్తమ్'.

సూ : మయట్ చ 4-3-82.

వృ : సమమయమ్, దేవదత్తమయమ్.

వ. వి : మయట్ (1-1) చ (అవ్య).

అను : హేతుమనుష్యేభ్యః (5-3) తతః (అవ్య) ఆగతః (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'అటనుండి వచ్చినది' అనునర్థమున పంచమ్యంతములగు హేతు మనుష్యవాచకములకు పరముగా మయట్ ప్రత్యయము కూడ వచ్చును. ఉదా : సమమయమ్, దేవదత్తమయమ్.

వివ : పూర్వసూత్రమున విధింపఁబడిన రూప్యప్రత్యయము వచ్చు నర్థములో 'మయట్' ప్రత్యయము కూడనగునని సూత్రార్థము. కావున పంచమ్యంతములగు హేతువాచక మనుష్యవాచకశబ్దములకు పరముగా, 'అటనుండి వచ్చినది' అనునర్థమున 'మయట్' ప్రత్యయమును చేరును. ఇందు టకారమిత్తు (హలన్త్యమ్).

ఉదా : సమాదాగతమ్ - సమ+జసి+మయట్, విభక్తిలోపము సమమయ+ సు=సమమయమ్.

దేవదత్తాదాగతమ్, దేవదత్త+జసి+మయట్, దేవదత్తమయ+సు=దేవదత్తమయమ్

'తతఆగతః' మొదలుకొని యింతవఱకుఁ జెప్పఁబడిన అర్థము ఇందలి శైషికములలో నైదవది.

అవ : మఱియొకయర్థము.

సూ : ప్రభవతి 4-3-83.

వృ : హిమవతః ప్రభవతి హైమవతీగఙ్గా.

ప. వి : ప్రభవతి (క్రి. ప).

అను : తతః (అవ్య) సమర్థానామిత్యాదులు

అర్థ : 'దానివలన పుట్టునది' అనునర్థమున పంచమ్యంత సమర్థమునకు పరముగా అణాదిప్రత్యయములగును. ఉదా : హిమవతః ప్రభవతి హైమవతీ గఙ్గా.

వివ : 'దానివలన పుట్టుచున్నది' అనునర్థమున పుట్టుకస్థానమును దెలుపు శబ్దముయొక్క పంచమ్యంతరూపమునకు పరముగా అణాదిసాధారణ ప్రత్యయములు, ఘాదిశైషిక ప్రత్యయములును అగును.

ఉదా : హిమవతః ప్రభవతి - హిమవంతునియందు పుట్టుచున్నది హిమవత్ + ఙసి, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, హైమవత్ + అ = హైమవత, ఇది గంగా అను స్త్రీలింగశబ్దమునకు విశేషణమగుటచే ఇదియును స్త్రీలింగము కావలయును. టిడ్ఢాణఞ్ ఇత్యాదిసూత్రముచే అణంతములకు స్త్రీత్వమున 'ఙీప్' ప్రత్యయము వచ్చును. హైమవత + ఙీప్ (ఙకారపకారములిత్తులు) హైమవత + ఈ,

యస్యేతిచ - అకారలోపము, 'హైమవత్ + ఈ' = హైమవతీ + సు = హైమవతీ.

'ప్రభవతి' అనునది శైషికములలో నాలవ యర్థము.

అవ : అర్థాంతరము వివరింపఁబడుచున్నది.

సూ : తద్గచ్ఛతి పథిదూతయోః 4-3-85.

వృ : స్రుఘ్నం గచ్ఛతి స్రౌఘ్నః పన్థాదూతో వా.

వ. వి : తత్ (2-1) గచ్ఛతి (క్రి. ప) పథిదూతయోః (7-2)

అను : సమర్థానామిత్యాది.

అర్థ : 'దానిని గూర్చి వెళ్ళును' అనునర్థమున ద్వితీయాంతసమర్థమునకు మార్గము, దూత అనునవి గమ్యమానములగునపుడు అణాది ప్రత్యయములుచేరును. ఉదా : స్రుఘ్నంగచ్ఛతి, స్రౌఘ్నః పన్థా, దూతో వా.

వివ : 'తత్' అనునది గమనక్రియలో నుద్దేశ్యమగు దేశాదివాచక ద్వితీయాంతమునకు చిహ్నము. అట్టి ద్వితీయాంతపదమునకు, 'దానిని గూర్చి వెళ్ళువాఁడు' అనునర్థమున అణాది ప్రత్యయములు వచ్చును. ప్రత్యయాంతముచే దూతయో, మార్గమో వ్యక్తము కావలయును.

ఉదా : స్రుఘ్నంగచ్ఛతి - స్రుఘ్నదేశమునకు పోవునది / పోవువాఁడు స్రుఘ్న + అమ్ + అణ్, విభక్తిలోపాదులు, స్రౌఘ్న + సు = స్రౌఘ్నః = స్రుఘ్న దేశమునకు పోవుబాట లేక దూత.

'తద్గచ్ఛతి' అనునది శైషికములలో నేదవ యర్థము.

అవ : మఱియొక యర్థము.

సూ : అభినిష్క్రామతి ద్వారమ్ 4-3-86.

వృ : స్రుఘ్న మభినిష్క్రామతి స్రౌఘ్నం కాన్యకుబ్జ ద్వారమ్.

వ. వి : అభినిష్క్రామతి (క్రి. వ) ద్వారమ్ (1-1)

అను : తత్ (2-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానిని వెడలుచున్నాఁడు' అనునర్థమున ద్వారముగమ్యమానమగునపుడు, ద్వితీయాంతపదములకు అణాదిఘాదిప్రత్యయములు చేరును. ఉదా : స్రౌఘ్నం కాన్యకుబ్జద్వారమ్.

వివ : 'అభినిష్క్రామతి' అనగా 'అభిముఖముగా నిష్క్రమించుచున్నాఁడు' అని యర్థము. నిష్క్రమింపఁబడునది ద్వారముకావలయును. ఒకవ్యక్తి దేనినుద్దేశించి యొక ద్వారమునుండి వెలువడునో తద్వాచక ద్వితీయాంత పదమునకు అద్వాగమును దెలుపుచు అణాది ప్రత్యయములు వచ్చునని తాత్పర్యము.

ఉదా : స్రుఘ్నమభినిష్క్రామతి స్రౌఘ్నం కాన్యకుబ్జద్వారమ్ - స్రుఘ్న దేశము నభిముఖముగా చేసికొని వెలువడుద్వారము. స్రుఘ్న + అమ్, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, అకారలోపము-స్రౌఘ్న + సు = స్రౌఘ్నమ్. కాన్యకుబ్జముయొక్క కోటనుండి స్రుఘ్నదేశమువైపు పోవుటకు వీలైన ద్వారమని దీనియర్థము.

'అభినిష్క్రామతిద్వారమ్' అనునది యుండెనిమిదవ యర్థము.

సూ . అధికృత్య కృతే గ్రన్థే 4-3-87.

**వృ : శారీరక మధికృత్య కృతో గ్రన్థః శారీరకీయః. శారీర కంభాష్యమితి త్వభేదోపచారాత్.**

ప వి : అధికృత్య (అవ్య) కృతే (7-1) గ్రన్థే (7-1).

అను : తత్ (2-1) సమర్థానా మిత్యాది.

అర్థ : 'దాని నధికరించి' (విషయముగా చేసికొని) అనునర్థమున, చేయఁబడిన గ్రంథము వాచ్యమగునపుడు ద్వితీయాంత సమర్థపదమునకు అణాదిప్రత్యయములు యథాసంభవముగ నగును. ఉదా : శారీరక మధికృత్య కృతో గ్రన్థఃశారీరకీయః. శారీరకభాష్యమనుచోట విషయ గ్రంథనామముల కభేదోపచారమని యెఱుఁగునది.

వివ : 'దీనిని విషయముగా చేసికొని యీ గ్రంథము వ్రాయఁబడినది' అనునర్థమున విషయమును దెలుపు ద్వితీయాంతపదమునకు, ప్రత్యయాంతముచే గ్రంథము వాచ్యమగునపుడు, అణాదిప్రత్యయములు, శేషాధికార ప్రత్యయములును యథాయోగ్యముగ వచ్చును.

ఉదా : శారీరక మధికృత్య కృతో గ్రంథః - శారీరకమును విషయముగా చేసి వ్రాయఁబడిన గ్రంథము. శారీరక + అమ్ + ఛ - శారీరకశబ్దమున అద్యచ్చు (ఆ + అ) వృద్ధిసంజ్ఞకము. కావునశబ్దమునకు వృద్ధమనుపేరుకలుగును (వృద్ధి ర్యస్యాచామాదిస్తద్వృద్ధమ్) అందువలన వృద్ధాచ్ఛః' అను సూత్రముచే శైషికార్థమున ఛ ప్రత్యయము వచ్చినది. విభక్తిలోపము, ఈయాదేశము, అకారలోపము శారీరక్ + ఈయ=శారీరకీయ + సు=శారీరకీయః.

ఈ సూత్రముచే శారీరకీయమగుభాష్యము అని కావలసియుండ 'శారీరకం భాష్యమ్' అను వ్యవహారమెట్లు కుదురును? అను ప్రశ్నకు విషయమునకు గ్రన్థనామమునకు అభేదమును భావించుటవలన కుదురునను సమాధానము చెప్పఁబడినది. శకుంతలను చదువుచున్నాను అనగా శకుంతలను గూర్చి వ్రాయఁబడిన గ్రంథమును చదువుచున్నానని భావము. పై 'శారీరకం భాష్యమ్' అనునది అట్టిది. కొన్నియెడల గ్రంథకర్తృనామమునకు గ్రంథనామమునకు అభేదోపచారముండును భారవిని చదువు చున్నాఁడు అనగా భారవికృతకిరాతార్జునీయకావ్యము చదువుచున్నాఁడని అర్థము. ఉపచార మనగా 'సూచన' అని స్థూలమైన అర్థము.

'అధికరించి వ్రాయఁబడిన గ్రంథము' అనునది శైషికములలో నిట తొమ్మిదవది.

సూ : సోఽస్యనివాసః 8-3-89.

వృ : స్రుఘ్నోనివాసోఽస్య స్రౌఘ్నః.

ప. వి : సః (1-1) అస్య (6-1) నివాసః (1-1).

అను : సమర్థానామిత్యాది.

అర్థ : 'ఇది ఇతనికి నివాసము' అనునర్థమున దేశాదికమును జెప్పుసమర్థ ప్రథమాంతమునకు పరముగా అణాదిప్రత్యయములు చేరును. ఉదా : స్రుఘ్న మితనికి నివాసము. స్రౌఘ్నః.

వివ : ఒకస్థలమును పేర్కొని యది యతనికి నివాసము అని చెప్పునపుడు దేశవాచకశబ్దముయొక్క ప్రథమాంతమునకు పరముగా, అది నివాసముగాఁగల వ్యక్తిని చెప్పుచు సాధారణప్రత్యయములగు 'అణ్' మున్నగునవియు శైషికములగు 'ఘ' మున్నగునవియు యథాయోగ్యముగ వచ్చును.

ఉదా : స్రుఘ్నోనివాసోఽస్య - 'స్రుఘ్న + సు + అణ్', ఆదివృద్ధ్యాదులు స్రౌఘ్న + సు = స్రౌఘ్నః - స్రుఘ్నమునందు నివసించు వాఁడని అర్థము.

ఇది పదియవయర్థము.

సూ : తేనప్రోక్తమ్ 4-3-101.

వృ : పాణినినా ప్రోక్తం పాణినీయమ్.

ప. వి : తేన (3-1) ప్రోక్తమ్ (1-1).

అను : సమర్థానామిత్యాది.

అర్థ : 'అతనిచే చెప్పఁబడినది' అనునర్థమున తృతీయాంతపదమునకు, పరముగా అణాదిప్రత్యయములు యథాసంభవముగ వచ్చును. ఉదా : పాణినినా ప్రోక్తమ్ - పాణినీయమ్.

వివ : ఒకనిచే చెప్పఁబడిన శాస్త్రాదికమును ఆ వ్యక్తిపేరుతో చెప్పునపుడు కర్తయగు నాతని నామమును దెలుపు శబ్దముయొక్క తృతీయాంతరూపమునకు పరముగా, అణాదిసాధారణ ప్రత్యయములును, శైషికములగు ఛ మున్నగునవియు యథాసంభవముగ వచ్చును.

ఉదా : పాణినినా ప్రోక్తమ్ - పాణినిచే చెప్పఁబడినది, పాణిని + టా + ఛ, పాణిని శబ్దము వృద్ధ సంజ్ఞకము కావున 'వృద్ధాచ్ఛః' అను సూత్రముచే ఛ ప్రత్యయము. విభక్తిలోపము, 'ఈయ్' ఆదేశము, ఇకారలోపము పాణిన్+ఈయ= పాణినీయ + సు=పాణినీయమ్-పాణినిచే చెప్పఁబడిన వ్యాకరణశాస్త్రము.

ఇది శైషికములలో పదునొకండవ యర్థము.

సూ : తస్యేదమ్ 4-3-120.

వృ : ఉపగోరిద మౌపగవమ్.

ప. వి : తస్య (6-1) ఇదమ్ (1-1).

అను : సమర్థానామిత్యాది.

అర్థ : 'అతనికి సంబంధించినది' అనునర్థమున షష్ఠ్యంతమునకు పరముగా అణాది ప్రత్యయములు వచ్చును. ఉదా : ఉపగువునకు సంబంధించినది-ఔపగవమ్.

వివ : ఒక వస్తువునో వ్యక్తినో పేర్కొని దానికి లేక అతనికి సంబంధించినది అని చెప్పునపుడు సంబంధివాచకశబ్దముయొక్క షష్ఠ్యంతమునకు పరముగా సాధారణప్రత్యయములగు అణాదులును, శైషికములగు ఘాదులును యథాసంభవముగ నగును.

ఉదా : ఉపగోరిదమ్ - ఉపగువునకు సంబంధించినది. ఉపగు + ఙస్ + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఔపగు+అ, ఓర్గుణః, ఔపగో + అ, అవాదేశము ఔపగవ + సు=ఔపగవమ్.

ఇది శైషికములలో పండ్రెండవ యర్థము.

ఇది శైషిక ప్రకరణము.

ప్రకరణావలోకనము : అపత్యార్థము, రక్తాద్యర్థము, చతురర్థిఅనునవి కాక తక్కినవి ఇట (తస్యవికారః అనునది హద్దుగాఁగలవి) శేషశబ్దవాచ్యములు. ఇందు పంద్రెండు అర్థ విశేషములు చెప్పఁబడినవి. ఆ అర్థవిశేషములలో వచ్చు ప్రత్యయములేవిభక్త్యంతములకు వరముగా వచ్చునో యావిభక్త్యంతములు, తత్ర. తతః, తేన, మున్నగు తచ్ఛబ్దరూపములచే చెప్పఁబడినవి. ఈ ప్రకరణమున ఆయాపదములకు రాఁదగు ప్రత్యయములు ముందు చూపఁబడినవి. 'తత్రజాతః' మున్నగు నర్థవిశేషములు తర్వాత పేర్కొనఁబడినవి ఆ అర్థవిశేషములం దాయా విభక్త్యంతమున రాష్ట్రాదిశబ్దములకు 'ఘ' మున్నగు ప్రత్యయము లగునని తాత్పర్యము. తద్ధిత ప్రకరణారంభమునందలి సాధారణప్రత్యయములకు కూడ అచ్చటి కచ్చట అర్థ నిర్దేశము చేయఁబడలేదు. అవి 'తేన దీవ్యతి ఖనతిజయతి జితమ్'అనునది హద్దుగాఁ గల అర్థములలో వచ్చునని చెప్పఁబడియుండుటచే ఈశైషికార్థములును ఆ పరిధి లోనివే కనుక అందలి అణాది ప్రత్యయములు ఆయాపదములకు వచ్చును. శబ్దమును పేర్కొనక అర్థమును సమర్థ విభక్తిని మాత్రమే సూచించినతావులందెల్ల వేఱుప్రత్యయమున కవకాశము ఉండదు కావున 'ప్రాగ్దీవ్యతోఽణ్' అనుదానినుండి అధికారరూపమున వచ్చు అణ్ ప్రత్యయము వానికి చేరును. ప్రస్తుతశబ్దమున కిట్లు అనేకార్థములలో అణ్ ప్రత్యయమగుట చూపఁబడినది పందర్భమును బట్టి దానికాయాయర్థములు నిర్ణయింపఁబడును. ఆయర్థములందు రాష్ట్రశబ్దమునకు ఘ ప్రత్యయము, ప్రావృట్ఛబ్దమునకు ఏణ్యప్రత్యయము మున్నగు విధములుగా విధింపఁ బడినవి. వీనికి మాదులే వచ్చును గాని అణ్ణు రాదు. ఇట్లు తక్కిన విషయములు నూహించుకొనునది.

ఇందు 'వృద్ధ' సంజ్ఞ నిర్వచింపఁబడినది. తస్మిన్నణిచయుష్మాకాస్మాకౌ, తవకమమకావేకవచనే, ప్రత్యయోత్తరపదయోశ్చ అవ్యయానాం భమాత్రేటిలోపః, అనుశతికాదీనాంచ అనునవి కార్యవిశేషములను ప్రపంచించినవి. తక్కినసూత్రములు ప్రత్యయవిధాయకములు. ఇందు చెప్పఁబడిన పంద్రెండర్థము లాయాతావులందు వివరణాంతమున యథోచితముగ పేర్కొనఁబడినవి.

# అథ ప్రాగ్దీవ్యతీయ ప్రకరణమ్

అవ : ఇటనుండి 'దాని వికారము', 'దాని అవయవము' అనునర్థములలో తద్ధిత ప్రత్యయములు విధింపఁబడుచున్నవి 'తస్యవికారః' అను నధికారము 4-3-134 తో ప్రారంభమై నాల్గవ అధ్యాయములోని తృతీయపాదము అంతము వఱకు ప్రసరించుచున్నది. చతుర్థ పాదారంభములో దీవ్యతిత్యార్థములలో ప్రత్యయములు చెప్పఁబడుచున్నవి దానికి పూర్వమున నున్నది యగుటచే దీనికి ప్రాగ్దీవ్యతీయ ప్రకరణమని పేరు.

**సూ : తస్యవికారః 4-3-134.**

ప వి : తస్య (6-1) వికారః (1-1).

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః, అణ్ (ప్రాగ్దీవ్యతోఽణ్)

అర్థ : 'దానియొక్క వికారము' అనునర్థమున సమర్థమైన షష్ఠ్యంతమునకు ఎంపికగా 'అణ్' మున్నగు ప్రత్యయములు వచ్చును

వివ : వికారమనగా విక్రియ, మార్పు. మూలవస్తువునుండి అవస్థాంతరమును పొంది రూపొందిన వస్త్వాదిక మని తాత్పర్యము. గోవునుండి లభ్యమగు క్షీరాదికము గోవుయొక్క వికారము ఈ వికారము దేనిదో దానిని చెప్పు శబ్దము యొక్క షష్ఠ్యంతపదమునకు, ఆ వికారమగు వస్త్వాదికమును తెలుపుచు సాధారణ ప్రత్యయప్రకరణమున విధింపఁబడిన అణ్ మున్నగునవియు ఈ ప్రకరణమున విధింపఁబడు 'మయట్' మున్నగు విశేష ప్రత్యయములును యథాసంభవముగ వచ్చును. అనగా విశేషప్రత్యయములు వేనివేనికి విధింపఁబడునో వానివానికవియే వచ్చును. అట్లు ప్రత్యేకించి ప్రత్యయము చెప్పనిచోట 'ప్రాగ్దీవ్యతోఽణ్' అను సూత్రమునుండి అధికారముగా వచ్చు అణ్ ప్రత్యయము చేయునని తాత్పర్యము.

ఉదా : అశ్మనః వికారః - రాతియొక్క వికారము; అశ్మన్ + ఙస్, అణ్ (ప్రాతిపదికత్వము (కృత్తద్ధితసమాసాశ్చ) విభక్తిలోపము (సుపోధాతు ప్రాతిపదికయోః) ఆదివృద్ధి (తద్ధితేష్వచామాదేః) 'ఆశ్మన్ + అ' అనియుండ 'నస్తద్ధితే' అనుసూత్రముచే ప్రాప్తమగు టిలోపమును 'అన్' అనుసూత్రము వారించినది. కాని యిచట టిలోపము అవసరమగుటచే ఈ క్రింది వార్తికము దానిని మరల విధించుచున్నది.

వా॥ అశ్మనో వికారే టిలోపో వక్తవ్యః (4185)

వృ : అశ్మనో వికార ఆశ్మః.

వ. వి : అశ్మనః (6-1) వికారే (7-1) టిలోపః (1-1) వక్తవ్యః (1-1

అర్థము : అశ్మన్ శబ్దమునకు వికారార్థకమగు అణ్ ప్రత్యయము పరమగు నపుడు టిలోపము చెప్పఁదగును. ఉదా : ఆశ్మః.

వివ : అశ్మన్ శబ్దమునందు 'అన్' అనుభాగము టి. 'న తద్ధితే' అని సూత్రముచే దీనికి లోపము రావలసియుండగా 'అన్' సూత్రముచే లోపనిషేధము చెప్పఁబడి యుండుటచే ఈ వార్తికము 'అశ్మన్'లోని 'అన్' అనుదానికి వికారార్థమున వచ్చిన అణ్ ప్రత్యయము పరమగునపుడు సూత్రము లోపమును విధించుచున్నది.

అశ్మన్ + అ, టిలోపము ఆశ్మ + అ = ఆశ్మ + స = ఆశ్మః.

అవ : మఱి రెండుదాహరణములు వికారార్థమున చూపఁబడుచున్నవి.

వృ : భాస్మనః, మార్త్తికః.

వివ : భస్మనః వికారః - భస్మముయొక్క వికారము, భస్మన్ + ఙస్ + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, భాస్మన్ + అ, టిలోపము రావలసియుండగా 'అన్' అనుసూత్రముచే నిషేధింపఁబడినది భాస్మన + సు = భాస్మనః.

మృత్తికాయాః వికారః, మట్టియొక్క వికారము, మృత్తికా + ఙస్ + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఋ > అర్) మార్త్తికా + అ, యస్యేతిచ, ఆకారలోపము, మార్త్తిక + సు = మార్త్తికః.

రాతితో చేయఁబడిన విగ్రహము. భస్మముతో నేర్పడిన ఔషధాదికము, మట్టితో చేయఁబడిన పాత్రాదికము వికారములుగా భావింపఁబడవచ్చును.

సూ : అవయవే చ ప్రాణ్యోషధి వృక్షేభ్యః 4-3-135.

వృ : చాద్వికారే. మయోరస్యావయవో వికారో వా మాయూరః; మౌర్వం కాణ్డం భస్మ వా; పైప్పలమ్.

వ. వి : అవయవే (7-1) చ (అవ్య) ప్రాణి, ఓషధి, వృక్షేభ్యః (5-3).

అను : తస్య (6-1) సమర్థానామిత్యాది, అణ్ (1-1).

అర్థ : ప్రాణివాచకములయు, ఓషధివాచకములయు, వృక్షవాచకములయు షష్ఠ్యంతములకు దాని అవయవము అనునర్థమునను, చకారమువలన వికారార్థము నందును అణ్ మున్నగు ప్రత్యయములు వచ్చును. ఉదా : మాయూరః ఇత్యాది.

వివ : అవయవమనగా భాగము, ఏకదేశము. ప్రాణులయొక్కయు, ఓషధులయొక్కయు, వృక్షములయొక్కయు అవయవములు ప్రత్యయాంతములచే వాచ్యములగునపుడు వాని షష్ఠ్యంతరూపములకు అణ్ మున్నగు సాధారణ ప్రత్యయములు వచ్చును అవయవేచ = అవయవార్థమునందును అనుట ప్రకరణము ననుసరించి యీ ప్రాణ్యాదివాచకములకు వికారార్థమునను ఈ ప్రత్యయము లగు నని తాత్పర్యము

ఉదా : మయూరస్య అవయవో వికారో వా - మయూరము యొక్క అవయవము లేక వికారము, మయూరము ప్రాణివాచకము: మయూర + ఙస్ + అఞ్ ('ప్రాణిరజతాదిభ్యః' అను సూత్రముచే అఞ్ ప్రత్యయము) విభక్తిలోపము, ఆది వృద్ధి, అకారలోపము, మాయూర్ + అ, మాయూర + సు = మాయూరః .. నెమలి పింఛము మొదలగునవయవము కాని, వికారమగు గ్రుడ్డు మొ॥ది కాని దీనిచే వాచ్యమగును

మూర్వాయాః అవయవో వికారో వా, 'మూర్వా' అనునది ఒక ఓషధి విశేషము. ఓషధియనగా తృణలతారూపమైనది మూర్వా + ఙస్ + అణ్ (సాధారణప్రత్యయము) విభక్తిలోపము, ఆదివృద్ధి (ఊ> ఔ) మౌర్వా + అ, యస్యేతిచ ఆకారలోపము 'మౌర్వ్ + అ' = మౌర్వ + సు = మౌర్వమ్ - అవయవమైనచో కాండమని యర్థము. వికారమయినచో మూర్వయొక్క భస్మమని యర్థము.

పిప్పలస్య అవయవో వికారోవా - పిప్పల మనగా రావిచెట్టు. ఇది వృక్ష వాచకము. పిప్పల + ఙస్ + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, (ఇ> ఐ) పైప్పల + అ, అకారలోపము, పైప్పల్ + అ = పైప్పల + సు = పైప్పలమ్ - రావిచెట్టు అవయవము లేక దాని వికారమగు భస్మము మొ॥ది.

**సూ : మయడ్వైతయోర్భాషాయామభక్ష్యాచ్ఛాదనయోః. 4-3-143.**

**వృ : ప్రకృతిమాత్రాన్మయడ్వాస్యాద్వికారావయవయోః. అశ్మమయమ్- ఆశ్మనమ్. అభక్ష్యేత్యాదికిమ్? మౌద్గస్సూపః, కార్పాసమాచ్ఛాదనమ్.**

ప. వి : మయట్ (1-1) వా (అప్య) ఏతయోః (7-2) భాషాయామ్ (7-1) అభక్ష్యాచ్ఛాదనయోః (7-2)

అను : తస్య (6-1) సమర్థానామిత్యాది

అర్థ : ఏశబ్దమునకైనను దాని వికారము, అవయవము అను నర్థమున, లోక భాషయందు మయట్ ప్రత్యయము వైకల్పికముగా నగును. భక్ష్యము, ఆచ్ఛాదనము అనునవి గమ్యమగునపుడు మాత్రము ఈ ప్రత్యయము రాదు. ఉదా : అశ్మమయమ్ - ఆశ్మనమ్. అభక్ష్య - ఇత్యాదిపదమేల ? మౌద్గఃసూపః, కార్పాసమాచ్ఛాదనమ్ అనుచోట మయట్ ప్రత్యయము రాలేదు.

వివ : దాని అవయవమును గాని వికారమునుగాని చెప్పవలసినచో తద్వాచక షష్ఠ్యంతమునకు పరముగా మయట్ ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. ఇది లోకభాషయందు వచ్చు ప్రత్యయము. వేదమునందు రాదని భావము. ప్రత్యయాంతముచే వాచ్యమగునది భక్ష్యముగాని ఆచ్ఛాదనముగాని అయినచో నీ ప్రత్యయము రాదు వైకల్పికమనుటచే ఇది రానియెడల తక్కిన అణాదిసాధారణ ప్రత్యయములును, వక్ష్యమాణ విశేషప్రత్యయములును వానికి చేరును. ప్రకృతిమాత్రాత్ అనుటవలన విధి ఏ శబ్దమునకైనను యోగ్యతానుగుణముగ చేయును.

ఉదా : అశ్మనః అవయవో వికారో వా. అశ్మన్ + ఙస్ + మయట్. టకారమిత్తు. 'అశ్మన్ + మయ' 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అనుసూత్రముచే నకారలోపము, అశ్మమయ + సు = అశ్మమయమ్ - రాతి అవయవము, లేక వికారము ఈ ప్రత్యయము రానిచో 'అణ్' ప్రత్యయమగును. అశ్మన్ + ఙస్, అణ్ - విభక్తిలోపము, ఆదివృద్ధి, ఆశ్మన్ + అ, వికారార్థమున మాత్రమే టిలోపము (అశ్మనో వికారే టిలోపో వక్తవ్యః) అవయవార్థమున 'అన్' అను దానికి లోపమురాదు (అన్) ఆశ్మన + సు=ఆశ్మనమ్.

అవయవము, వికారము అగునది భక్ష్యము(తినఁబడునది)లేక ఆచ్ఛాదనము (కప్పునది) అయినపుడు ఈ మయట్ ప్రత్యయమురాదని 'అభక్ష్యాచ్ఛాదనయోః అనుపదమువలన తెలుపఁబడినది. కాన ముద్గానాం వికారః సూపః అనునర్థమున 'ముద్గానామ్' అనుదానికి మయట్ ప్రత్యయమురాదు. బిల్వాదిభ్యోఽణ్ అనుసూత్రముచే

అణ్ ప్రత్యయము వచ్చును. ముద్గ + ఆమ్, అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఉ > ఔ) అకారలోపము, మౌద్గ + సు = మౌద్గఃసూపః పెసలతో వండఁబడిన పప్పు.

కర్పాస్యాః అవయవో వికారో వా కర్పాసీ + ఙస్, అణ్, విభక్తి లోపము, ఆదివృద్ధి, కార్పాసీ + అ, యస్యేతిచ-ఈకారలోపము, కార్పాస్ + అ=కార్పాస+సు=కార్పాసమ్. ఇచట 'బిల్వాదిభ్యోఽణ్' అను సూత్రముచే అణ్ ప్రత్యయము.

సూ : నిత్యం వృద్ధశరాదిభ్యః 4-3-144.

వృ : ఆమ్రమయమ్, శరమయమ్

ప వి : నిత్యమ్ (2-1) వృద్ధశరాదిభ్యః (5-3).

అను : మయట్ (1-1) అవయవే (7-1) వికారః (1-1)సమర్థానామిత్యాది.

అర్థ : వృద్ధ సంజ్ఞకములకును, శరాదులకును దానియొక్క అవయవము వికారము అనుసర్థములందు మయట్ప్రత్యయము నిత్యముగా వగును. ఉదా : ఆమ్రమయమ్, శరమయమ్.

వివ: పూర్వసూత్రముచే వైకల్పికముగా ప్రాప్తమగు మయట్ ప్రత్యయము వృద్ధసంజ్ఞకలవానికిని, శర మున్నగువానికిని నిత్యముగా నగును. ఏ శబ్దస్వరూపము యొక్క తొలిఅచ్చు వృద్ధిసంజ్ఞకమో, ఆ శబ్దస్వరూపము వృద్ధసంజ్ఞకమగును.

ఉదా : ఆమ్రస్య అవయవో వికారో వా-ఆమ్రము (మామిడిచెట్టు) యొక్క అవయవము లేక వికారము, ఆమ్ర + ఙస్ + మయ(ట్) విభక్తిలోపము, ఆమ్రమయ + సు= ఆమ్రమయమ్. ఇది వృద్ధమున కుదాహరణము.

శరాదులకు :- శరస్య అవయవో వికారో వా-శరముయొక్క అవయవము లేక వికారము శర + ఙస్ + మయట్, శరమయ + సు=శరమయమ్.

శరాదిగణము : శర.దర్భ మృద్(మృత్) కుటీ తృణ సోమ బల్బజ-ఇతిశరాదిః.

సూ : గోశ్చ పురీషే. 4-3-145.

వృ : గోమయమ్.

ప. వి : గోః (5-1) చ (అవ్య) పురీషే (7-1).

అను : మయట్ (1-1) నిత్యమ్ (2-1) సమర్థానామిత్యాది; తస్య (6-1) వికారః (1-1).

అర్థ : షష్ఠ్యంతమగు గోశబ్దమునకు, దాని వికారమైన పురీషము (పెండ) వాచ్యమగునపుడు మయట్ ప్రత్యయము నిత్యముగా వగును. ఉదా : గోమయమ్.

వివ : గోవుయొక్క వికారమైన పురీషము ప్రత్యయాంతముచే వాచ్యమగు నెడల షష్ఠ్యంతమగు గోశబ్దమునకు 'మయట్' ప్రత్యయము నిత్యముగానగును గోఃవికారఃపురీషమ్ గో + ఙస్ + మయట్, విభక్తిలోపము. గోమయ + సు = గోమయమ్. =అవుపేడ.

సూ . గోపయసోర్యత్ 4-3-160

వృ : గవ్యమ్, పయస్యమ్

ప. వి : గోపయసోః (6-2) యత్ (1-1)

అను : తస్య (6-1) వికారః (1-1) అవయవే (7-1) సమర్థానామిత్యాది.

అర్థ : గో, పయస్ అనువానికి దానిఅవయవము, దాని వికారము అనునర్థము లందు 'యత్' ప్రత్యయము వచ్చును. ఉదా : గవ్యమ్, పయస్యమ్.

వివ : గోవుయొక్కవికారము లేక అవయవము అనుసర్థమునందును, పయస్సు యొక్క వికారము అనుసర్థమునందును షష్ఠ్యంతములగు శబ్దములకు పరముగా యత్ ప్రత్యయము వచ్చును.

ఉదా : గోర్వికారోఽవయవోవా. గో + ఙస్, యత్, విభక్తిలోపము, తకార మిత్తు - గో+య='వాన్తోయిప్రత్యయే'-అవాదేశము, గవ్య + సు=గవ్యమ్-గోవు యొక్క పాలు మొ॥వి

పయసః వికారమ్-పయస్ + ఙస్ + యత్, విభక్తిలోపము, పయస్+య= పయస్య+సు-పయస్యమ్-పాలనుండి యేర్పడిన తక్రాదికము.

ఇది ప్రాగ్దీవ్యతీయ ప్రకరణము.

ప్రకరణావలోకనము : దానియొక్క వికారము, దానియొక్క అవ యవము అనునర్థములందు షష్ఠ్యంతసమర్థములకు పరముగా అణాదిప్రత్యయము లును, మయట్ ప్రత్యయమును, యత్ ప్రత్యయమును ఇందు విధింపబడినవి. 'అశ్మనో వికారేటిలో వక్తవ్యః' అనువార్తికము ప్రక్రియను దెలుపును. తక్కిన వన్నియు ప్రత్యయవిధాయకములు.

# అథ ఠగధికార ప్రకరణమ్

అవ : తద్ధిత ప్రకరణారంభమున 'ప్రాగ్దీవ్యతోఽణ్' అనుసూత్రమున చెప్పఁబడిన 'అణ్' ప్రత్యయముయొక్క అధికార అవధి పూర్తి అయినది. అనగా ఇంతవఱకు చెప్పఁబడిన అర్థములలో విశేషప్రత్యయవిధానము లేనిచోట 'అణ్' అనునది ఉపస్థితమగుచుండెడిది. ఇటుపై దానికి అవకాశములేదు. క్రొత్తగా 'ఠక్' అను ప్రత్యయముయొక్క అధికారము ప్రారంభింపఁబడుచున్నది. 'ఠక్' ప్రత్యయాధికారమునకు సంబంధించిన ప్రకరణమగుటచే దీనికి ఠగధికారప్రకరణమని పేరు.

**సూ : ప్రాగ్వహతేష్ఠక్ 4-4-1.**

**వృ : తద్వహతీత్యతః ప్రాక్ ఠగధిక్రియతే.**

ప వి : ప్రాక్ (1-1) వహతేః (5-1) ఠక్ (1-1).

అర్థ . తద్వహతి' ఇత్యాదిసూత్రమువఱకు 'ఠక్' అను ప్రత్యయము యొక్క అధికారము.

వివ : 'తద్వహతి రథయుగ ప్రాసఙ్గమ్' అను సూత్రము సంఖ్య 4 4-75.

ఈ సూత్రమునందలి 'వహతేః' అనుపదము వహతిశబ్దము గల ఈసూత్రమును పరామర్శించును ప్రకృతసూత్రము మొదలుకొని ఆసూత్రమునకు పూర్వము వఱకు విధింపఁబడిన అర్థములందు, విశేష ప్రత్యయములు విధింపఁబడని తావులం దెల్ల 'ఠక్' అను ప్రత్యయము ఉపస్థితమగునని తాత్పర్యము.

**సూ : తేన దీవ్యతి ఖనతి జయతి జితమ్ 4-4-2.**

**వృ : అక్షైర్దీవ్యతి ఖనతి జయతి జితమ్ వా ఆక్షికమ్.**

ప. వి : తేన (3-1) దీవ్యతి, ఖనతి, జయతి (క్రియాపదములు) జితమ్ (1-1).

అను : సమర్థానాం ప్రథమాద్వా, తద్ధితః, ప్రత్యయః, ఠక్ (1-1).

అర్థ : దానిచే విరాజిల్లును, త్రవ్వును, జయించును, జయింపఁబడినది అను నర్థములందు తృతీయాంత సమర్థపదమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : ఆక్షికమ్.

వివ : 'తేన' అనునద్ది తృతీయాంతపదమును సూచించును. దానిచేత ప్రకాశించును, దానిచేత త్రవ్వును, దానిచేత జయించును, దానిచేత జయింపబడినది అను నర్థములందు సమర్థములగు వానిలో ప్రథమోచ్చరితములైన తృతీయాంతపదములకు పరముగా 'ఠక్' అను తద్ధిత ప్రత్యయము చేరును. అనగా ప్రత్యయము చేరిన రూపము ప్రకాశించుదానిని, త్రవ్వువానిని, జయించువానిని, జయింపబడుదానిని వచించును. ప్రకృతియగు తృతీయాంతము ప్రకాశించుట మొదలగువానిలో సాధనములను తెలుపును.

ఉదా : అక్షైర్దీవ్యతి, ఖనతి, జయతి, జితమ్వా. అక్షములలో విరాజిల్లును, త్రవ్వును, జయించును, జయింపబడినది. అక్ష + భిస్ + ఠక్ తద్ధితాంతమగుటచే దీనికి ప్రాతిపదిక సంజ్ఞకలుగును. (కృత్తద్ధితసమాసాశ్చ) ప్రాతిపదికావయవము లగు సుప్పులకు (విభక్తిప్రత్యయములకు) లుక్కు వచ్చును (సుపోధాతు ప్రాదికయోః) కితిచ – ఆదివృద్ధి ఆక్ష + ఠ, ఠస్యేకః – ఇకాదేశము, ఆక్ష + ఇక, యస్యేతిచ–అకారలోపము–ఆక్ష్ + ఇక ఆక్షిక + సు = ఆక్షికమ్.

సూ : సంస్కృతమ్ 4-4-3.

వృ : దధ్నా సంస్కృతం దాధికమ్; మారీచికమ్.

ప. వి : సంస్కృతమ్ (1-1)

అను : తేన (3-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాదులు.

అర్థ : దానిచేత సంస్కరింపబడినది అనునర్థమున తృతీయాంతపదమునకు పరముగా, సంస్కృతమైన దానిని చెప్పుచు, 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : దాధికమ్, మారీచికమ్.

వివ : 'ఒకవస్తువు ఒకవస్తువుచేత సంస్కరింపబడినది' అనునది చెప్పవలసినపుడు దేనితో సంస్కరింపబడినదో దానిని తెలుపు శబ్దముయొక్క తృతీయాంత రూపమునకు 'ఠక్' ప్రత్యయము చేరును. ఇందు ఠకారము ఇత్తు. దానివలన ఆదివృద్ధిఅగును.

ఉదా : దధ్నా సంస్కృతమ్ = పెరుగుతో సంస్కరింపబడినది దధిన్ + టా, ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఇకాదేశము దాధిన్ + ఇక, నస్తద్ధితే టిలోపము దాధ్ + ఇక = దాధిక + సు = దాధికమ్.

మరీచిభిః సంస్కృతమ్ – మిరియములతో సంస్కరింపబడినది. మరీచి + భిస్ + ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఇకాదేశము, ఇకారలోపము మారీచ్ + ఇక = మారీచిక + సు = మారీచికమ్.

సూ : తరతి 4-4-5.

వృ : ఉడుపేన తరతి ఔడుపికః.

ప. వి : తరతి (క్రి. ప)

అను : తేన (3-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానిచే దాటుచున్నాఁడు' అనునర్థమున తృతీయాంతపదమునకు పరముగా 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : ఔడుపికః.

వివ : తరణసాధనమగుదానిని చెప్పు తృతీయాంతపదమునకు పరముగా ఠక్ ప్రత్యయము వచ్చును. ప్రత్యయాంతముచే దానిచేదాటు వ్యక్త్యాదికము తెలుపఁబడును.

ఉదా : ఉడుపేన తరతి - తెప్పతో దాటుచున్నాఁడు - ఉడుప + టా, ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఔడుప + ఠ ఇకాదేశము, అకారలోపము, ఔడుప్ + ఇక = ఔడుపిక+సు=ఔడుపికః.

సూ : చరతి 4-4-8.

వృ : హస్తినా చరతి హాస్తికః; దధ్నా చరతి భక్షయతి దాధికః.

ప. వి : చరతి (క్రి ప).

అను : తేన (3-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానితో చరించుచున్నాఁడు' అనునర్థమున సమర్థతృతీయాంతమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : హాస్తికః, దాధికః

వివ : 'చర గతిభక్షణయోః' - 'చర్' ధాతువు వెళ్ళు, తిను అను రెండర్థములందు వర్తించును. కావున దానితో వేగుచున్నాఁడు, దానితో తినుచున్నాఁడు అనునర్థములందు సమర్థములలో ప్రథమమగు తృతీయాంతపదమునకు 'ఠక్' ప్రత్యయము చేరును.

ఉదా : హస్తినా చరతి, హస్తితో తిరుగుచున్నాఁడు, హస్తిన్+టా, ఠక్ విభక్తిలోపము, ఆదివృద్ధి, హాస్తిన్ + ఠ, ఇకాదేశము, హాస్తిన్+ఇక, నస్తద్ధితే, టిలోపము, హాస్తిక + సు=హాస్తికః.

దధ్నా చరతి - దధితో భక్షించుచున్నాఁడు, దధిన్ + టా+ఠక్ - విభక్తిలోపాదులు దాధిక + సు=దాధికః.

**సూ : సంసృష్టే 4-4-22.**

**వృ : దధ్నా సంసృష్టం దాధికమ్.**

ప. వి : సంసృష్టే (7-2).

అను : తేన (3-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానితో కలుపఁబడినది' అనునర్థమున తృతీయాంతసమర్థమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : దధ్నా సంసృష్టం దాధికమ్.

వివ : తృతీయాంతపదముతో వాచ్యమగు పదార్థముతో కలుపఁబడినది చెప్పఁబడునపుడు, తృతీయాంతసమర్థమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : దధ్నా సంసృష్టమ్ - పెరుగుతో కలుపఁబడినది దధిన్+టా, ఠక్ విభక్తిలోపాదులు దాధ్ + ఇక = దాధిక + సు = దాధికమ్.

**సూ : ఉఞ్ఛతి 4-4-32**

**వృ : బదరాణ్యుఞ్ఛతి బాదరికః.**

ప. వి : ఉఞ్ఛతి (క్రి. ప).

అను : తత్ (2-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : దానిని / వానిని ఏఱుకొనుచున్నాఁడు అనునర్థమున ద్వితీయాంత సమర్థమునకు పరముగా 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : బదరాణి ఉఞ్ఛతిః బాదరికః.

వివ : ఇందనువృత్తిగా వచ్చిన 'తత్'అనుపదము సమర్థములలో ప్రథమో చ్చారితమైన ద్వితీయాంతపదమునకు చిహ్నము. 'వానిని లేక దానిని ఏఱుకొను వాఁడు' అనునర్థమున నట్టిపదమునకు పరముగా 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : బదరాణి ఉఞ్ఛతి - రేఁగుఁబండ్లను ఏఱుకొనువాఁడు. బదర + శస్+ ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి, బాదర+ఠ, ఠకారమునకు ఇకాదేశము, యస్యేతి - అకారలోపము బాదర్ + ఇక=బాదరిక + సు=బాదరికః.

**సూ : రక్షతి 4-4-33.**

**వృ : సమాజం రక్షతి, సామాజికః.**

ప. వి : రక్షతి (క్రి. ప).

అను : తత్ (2-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : దానిని రక్షించువాఁడు అనునర్థమున ద్వితీయాంతమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : సామాజికః.

వివ : ద్వితీయాంతసమర్థమునకు, 'దానిని రక్షించువాఁడు' అనునర్థమున ఠక్ ప్రత్యయము వచ్చును. సమాజం రక్షతి – సమాజ + అమ్ + ఠక్, విభక్తి లోపాదులు, సామాజిక + సు= సామాజికః – సమాజమును రక్షించుచున్నాడు.

సూ : శబ్ద దర్దురం కరోతి 4-4-34.

వృ : శబ్దంకరోతి శాబ్దికః; దర్దురం కరోతి దార్దురికః.

ప వి : శబ్ద దర్దురమ్ (2-1) కరోతి (క్రి ప)

అను : తత్ (2-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : శబ్ద, దర్దుర అనువాని ద్వితీయాంతములకు, 'దానిని చేయుచున్నాఁడు' అనునర్థమున, 'ఠక్' ప్రత్యయము చేరును. ఉదా : శాబ్దికః, దార్దురికః.

వివ : ద్వితీయాంతపదములైన శబ్దమ్, దర్దురమ్ అనువానికి, 'దానిని చేయువాఁడు' అనునర్థమున 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : శబ్దం కరోతి – శబ్దమును చేయువాఁడు, శబ్ద + అమ్ + ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి; శాబ్ద + ఠ, ఠకారమునకు ఇకాదేశము, శాబ్ద + ఇక యస్యేతిచ, అకారలోపము, శాబ్ద్ + ఇక=శాబ్దిక+సు=శాబ్దికః

దర్దురం కరోతి – మట్టిను చేయువాఁడు, దర్దుర + అమ్, ఠక్, విభక్తి లోపాదులు – దార్దురిక + సు=దార్దురికః.

సూ : ధర్మం చరతి 4-4-41.

వృ : ధార్మికః.

ప. వి : ధర్మమ్ (2-1) చరతి (క్రి. ప).

అను : తత్ (2-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'ధర్మమును చరించువాడు, అనునర్థమున ద్వితీయాంతమగు ధర్మ శబ్దమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : ధార్మికః.

వివ : 'ధర్మము నాచరించువాఁడు' అనునర్థమున' ధర్మమ్' అను ద్వితీయాంత పదమునకు పరముగా 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : ధర్మం చరతి, 'ధర్మ + అమ్ + ఠక్', విభక్తిలోపము, ఆదివృ
ఇకాదేశము, అకారలోపము ధార్మ్ + ఇక = ధార్మిక + సు = ధార్మికః.

**వా॥ అధర్మాచ్చేతి వక్తవ్యమ్ (2966).**

**వృ : అధర్మికః.**

ప. వి : అధర్మాత్ (5-1) చ (అవ్య) ఇతి (అవ్య) వక్తవ్యమ్ (1-1)

అర్థ : దాని నాచరించుచున్నాఁడు అనునర్థమున అధర్మశబ్దమునకును ఠక్ ప్రత్యయము చెప్పఁదగును. ఉదా : అధర్మికః

వివ : అధర్మం చరతి - అధర్మము నొనరించువాఁడు. అధర్మ + అమ్ ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి అధర్మ + ఠ, ఇకాదేశము, అకారలోపము అధర్మ్ + ఇక = అధర్మిక + సు = అధర్మికః.

**సూ : శిల్పమ్ 4-4-55.**

**వృ : మృదఙ్గ వాదనం శిల్పమస్య మార్దఙ్గికః.**

ప. వి : శిల్పమ్ (1-1).

అను : తత్ (1-1) అస్య (6-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది

అర్థ : 'అది యితనికి శిల్పము' అనునర్థమున ప్రథమాంత పదములకు పర ముగా 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : మార్దఙ్గికః.

వివ : శిల్పమనగా ఒకపనియందు నేర్పు. 'ఈపని ఇతనికి శిల్పము' అను నర్థమున ప్రథమాంతసమర్థమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : మృదఙ్గవాదనం శిల్పమస్య - మృదంగవాదనము ఇతనికి శిల్పము ఇచట 'మృదంగము శిల్పముగాఁగలవాఁడు, అనునర్థము చెప్పఁజాలము. మృదంగము క్రియ కాదుగదా; శిల్పమనగా క్రియలయందలి కౌశలమని చెప్పఁబడినది కావున విగ్రహమట్లు చెప్పఁబడినది. ప్రత్యయము మాత్రము 'మృదఙ్గః' అనుదానికి వచ్చును. అచట మృదంగమునకు లక్షణచే మృదంగవాదనమర్థము. ఒకయర్థము పొసఁగనిచో పొసగించుటకు దానికి సన్నిహితమగు నర్థమును గ్రహింతుము. దానిని లక్షణార్థమందురు. మృదఙ్గ + సు, ఠక్ = విభక్తిలోపము, ఆదివృద్ధి (ఋ > అర్) మార్దఙ్గ + ఠ ఇకాదేశము, మార్దఙ్గ + ఇక, అకారలోపము, మార్దఙ్గ్ + ఇక = మార్దఙ్గిక + సు = మార్దఙ్గికః.

సూ : ప్రహరణమ్ 4-4-57.

వృ : అసిః ప్రహరణమస్య ఆసికః, ధానుష్కః.

ప వి : ప్రహరణమ్ (1-1)

అను : ఠక్ (1-1) అస్య (6-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'అది అతనికి ఆయుధము' అనునర్థమున ప్రథమాంతమునకు 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : ఆసికః, ధానుష్కః.

వివ : ప్రహరణమనగా ప్రహరించుసాధనము, ఆయుధము. ఇది ఇతనికి ఆయుధము అనునర్థమున ఆయుధవాచక ప్రథమాంతములకు పరముగా 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : అసిః ప్రహరణమస్య - ఖడ్గమితనికి ఆయుధము. అసి + సు + ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి ఆసి + ఠ, ఇకాదేశము, ఇకారలోపము ఆస్ + ఇక = ఆసిక + సు = ఆసికః కత్తి ఆయుధముగాఁ గలవాఁడు.

ధనుః ప్రహరణమస్య - ధనుస్సు ఇతనికి ఆయుధము. ధనుస్ + సు + ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ధానుస్ + ఠ, 'ఇసుసుక్తాన్తాత్కః' అను సూత్రముచే ఉసంతమైన 'ధానుస్' అనుదానికి పరముగా నున్న 'ఠ' అనుదానికి 'క' అనునది ఆదేశమగును ధానుస్ + క, సకారమునకు రుత్వము దానికి విసర్గము నాదేశమగును. 'ధానుః + క' 'ఇణః షః' అనుసూత్రముచే విసర్గమునకు షకారమాదేశమగును ధానుష్ + క = ధానుష్క + సు = ధానుష్కః (ఇణః షః 8-3-39 ఇణ్వర్ణములకు పరముగానున్న విసర్గమునకు అపవాదులగు కవర్గ పవర్గములు పరములగునపుడు షకారమగును).

సూ : శీలమ్ 4-4-61.

వృ : అపూపభక్షణం శీలమస్య ఆపూపికః.

ప. వి : శీలమ్ (1-1).

అను : ఠక్ (1-1) అస్య (6-1) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'అది యితనికి శీలము' అనునర్థమున సమర్థప్రథమాంతములకు 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : అపూపభక్షణం శీలమస్య = ఆపూపికః.

వివ : శీలమనగా స్వభావము. ఒకపనిని ఒకఁడు స్వభావముగా చేయుచుండును. అట్టిది చెప్పఁబడునపుడు శీలవాచక ప్రథమాంతములకు పరముగా 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : అపూపభక్షణం శీలమస్య – అప్పములు తినుట యితని శీలము 'అపూప + ఙస్ +' ఇచట అపూపశబ్దమునకు అపూపములు తినుట ఠక్ అని లక్ష్యార్థము. విభక్తిలోపము, ఆదివృద్ధి ఆపూప + ఠ, ఇకాదేశము, అకార లోపము ఆపూప్ + ఇక = ఆపూపిక + సు = ఆపూపికః.

సూ : నికటే వసతి 4-4-73.

వృ : నైకటికో భిక్షుకః.

ప. వి : నికటే (7-1) వసతి (క్రి ప).

అను : ఠక్ (అవ్య) ఠక్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : సప్తమ్యంతమగు నికటశబ్దమునకు 'అందు వసించువాఁడు' అను నర్థమున 'ఠక్' ప్రత్యయము వచ్చును. ఉదా : నైకటికో భిక్షుః.

వివ : అనువృత్తమైన తత్ర అనుపదము సప్తమీవిభక్తి సూచకము. సప్తమీవిభక్తి అంతమునఁ గల నికటశబ్దమునకు పరముగా అందు వసించువాఁడు అనునర్థమున 'ఠక్' ప్రత్యయము వచ్చును.

ఉదా : నికటే వసతి – సమీపమున వసించువాఁడు – నికట + ఙి + ఠక్, విభక్తిలోపము, ఆదివృద్ధి, నైకట + ఠ, ఇకాదేశము, అకార లోపము. నైకట్ + ఇక = నైకటిక + సు = నైకటికః. – సమీపమున వసించు భిక్షువు.

ఇది ఠగధికారప్రకరణము.

ప్రకరణావలోకనము : ఇందు తృతీయాంతరూపములపై 'దానిచే విరాజిల్లును, తప్పును, జయించును, జయింపఁబడినది, సంస్కరింపఁబడినది, తరించుచున్నాఁడు, చరించుచున్నాఁడు, కలుపఁబడినది అనునర్థములందును, ద్వితీయాంతపదములపై దానిని ఏఱుకొనుచున్నాఁడు, రక్షించుచున్నాఁడు, (శబ్ద దర్దురములను) చేయుచున్నాఁడు, (ధర్మాధర్మములను) ఆచరించుచున్నాఁడు, అను నర్థములందును, ప్రథమాంతములపై అది ఇతనికి శిల్పము, ఆయుధము, శీలము అనునర్థములందును, సప్తమ్యంతమగు నికటశబ్దముపై, అందు వసించుచున్నాఁడు అనునర్థమునందును 'ఠక్' ప్రత్యయము వచ్చుట సోదాహరణముగ ప్రదర్శింపఁబడినది.

# అథ ప్రాగ్ఘితీయ ప్రకరణము

అవ : అణ్, ఠక్ ప్రత్యయాధికారములవలె యత్ ప్రత్య ప్రారంభింపఁబడుచున్నది 5-1-5 వ సంఖ్యగల సూత్రము 'తస్మైహితమ్' అనునది దానికి పూర్వమువఱకు చెప్పఁబడిన అర్థములలో సాధారణముగా ఈ 'యత్' ప్రత్యయము వచ్చును. హితశబ్దఘటిత సూత్రమునకు పూర్వమువఱకు విధింపఁబడు ప్రత్యయములకు సంబంధించిన ప్రకరణమగుటచే దీనికి ప్రాగ్ఘి (ప్రాక్ + హి) తీయ ప్రకరణమని పేరు.

**సూ : ప్రాగ్ఘితాద్యత్ 4-4-75.**

**వృ : తస్మైహితమిత్యతః ప్రాగ్యదధిక్రియతే.**

ప. వి : ప్రాక్ (1-1) హితాత్ (5-1) యత్ (1-1).

అర్థ : 'తస్మైహితమ్' అనునర్థమునకు పూర్వమువఱకు 'యత్' అనునది అధికారమగును

వివ : సూత్రమునందలి హితశబ్దము, అదిగలసూత్రమును బోధించును. అది 'తస్మైహితమ్' 5-1-5 అనునది. దానికి పూర్వమునఁ జెప్పఁబడిన అర్థములందాయా సమర్థసుబంతములకు 'యత్' ప్రత్యయము సాధారణముగా నగును. విశేష ప్రత్యయములు విధింపఁబడినచో అవి చేరును. ప్రత్యయ మేదియు పేర్కొనఁబడనిచోట ఈ హద్దులో 'యత్' అనునది ఉపస్థితమగునని ఫలితార్థము.

**సూ : తద్వహతి రథయుగప్రాసఙ్గమ్ 4-4-76.**

**వృ : రథం వహతి రథ్యః; యుగ్యః, ప్రాసఙ్గ్యః.**

ప. వి : తత్ (2-1) వహతి (క్రి. ప) రథయుగప్రాసఙ్గమ్ (2-1).

అను : సమర్థానామిత్యాది; యత్ (1-1).

అర్థ : దానిని మోయును అనునర్థమున ద్వితీయాంతములైన రథ, యుగ, ప్రాసంగ, అనువానికి యత్ ప్రత్యయము చేరును. ఉదా : రథం వహతి రథ్యః, యుగ్యః, ప్రాసఙ్గ్యః.

వివ : 'తత్' అనునది ద్వితీయాంతపదమును సూచించును. చేయఁబడినసంధి మున్నగు కార్యములు గలిగిన సమర్థములలో ప్రథమోచ్చరితములైన రథ, యుగ, ప్రాసఙ్గ అను వాని ద్వితీయాంతరూపములకు, దానిని మోయు అశ్వాదికమును

దెలుపుచు, యత్ ప్రత్యయము వచ్చును. ఇందు తకారేత్సంజ్ఞ. ఈ ప్రత్యయము పర మగునపుడు, పదము తుది అకారమునకు లోపము వచ్చును (యస్యేతిచ).

రథం వహతి – రథమును వహించునది. రథ + అమ్ + యత్, విభక్తి లోపము, అకారలోపము రథ్ + య = రథ్య + సు = రథ్యః – గుఱ్ఱము మొ॥వి.

యుగం వహతి – యుగమనగా కాడి, దానిని మోయునది. యుగ + అమ్ + యత్, విభక్తిలోపఅకారలోపములు యుగ్ + య=యుగ్య + సు = యుగ్యః.

ప్రాసఙ్గం వహతి – ప్రాసంగమనగా క్రొత్తగా బండికి కట్టుటకు శిక్షణ పొందుచున్న అశ్వాదికము యొక్క మెడపైనుంచు కాడిగానుండుచు కాడివంటిది దానిని మోయునది. ప్రాసఙ్గ + అమ్ + యత్, విభక్తిలోపఅకారలోపములు ప్రాసఙ్గ్+య =ప్రాసఙ్గ్య + సు=ప్రాసఙ్గ్యః.

సూ : ధురో యడ్ఢకౌ 4-4-77.

వృ : ధుర్యః, ధౌరేయః.

ప. వి : ధురః (5-1) యత్, ఢకౌ (1-2)

అను : తత్ (2-1) వహతి (క్రి ప) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానిని మోయును' అనునర్థమున 'ధుర్' శబ్దమునకు యత్, ఢక్ ప్రత్యయములు పర్యాయముగా వచ్చును. ధుర్యః, ధౌరేయః.

వివ : ధురమనగా భారము. దానిని వహించునది అనునర్థమున ద్వితీయాంత మగు 'ధుర్' శబ్దమునకు పరముగా యత్ ప్రత్యయమును, ఢక్ - ప్రత్యయమును వచ్చును.

ఉదా : ధురంవహతి - ధురమును మోయునది - ధుర్ + యత్, = ధుర్య + సు = ధుర్యః. ధుర్ + ఢక్, కిత్తిచ, ఆదివృద్ధి ధౌర్ + ఢ, ఢకారమునకు 'ఏయ్' ఆదేశము (ఆయనేయీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్) (ఢ్ + అ=ఏయ్+అ=ఏయ) ధౌర్ + ఏయ=ధౌరేయ + సు = ధౌరేయః. (గుఱ్ఱము మున్నగువాని మెడమీద మోయుటకై ఉంచెడు కాడియొక్క ప్రదేశమును ధురమందురు). దానిని మోయు అశ్వాదికము ధుర్యము, ధౌరేయము అనఁబడును.

(ఇచట 'ధుర్' అను రేఫాంతశబ్దముయొక్క ఉపధకు, యత్ ప్రత్యయ యోగమున 'హలిచ' అను సూత్రముచే ప్రాప్తమగు దీర్ఘము 'నభకుర్ఛురామ్' (8-2-79) అనుసూత్రముచే వారింపఁబడును. భసంజ్ఞకము యొక్కయు, కుర్, ఛుర్ అనువానియొక్కయు ఉపధకు దీర్ఘము రాదు అని సూత్రార్థము).

**సూ : నౌవయోధర్మ విషమూల మూల సీతాతులాభ్యస్తార్య తుల్య ప్రాప్యవధ్యానామ్య సమసమిత సమ్మితేషు 4-4-91.**

**వృ : నావా తార్యం నావ్యంజలం; వయసాతుల్యోవయస్యః, ధర్మేణప్రాప్యం ధర్మ్యమ్, విషేణవధ్యో విష్యః; మూలేన ఆనామ్యం మూల్యమ్, మూలేన సమోమూల్యః; సీతయాసమితం సీత్యంక్షేత్రమ్, తులయా సమ్మితం తుల్యమ్.**

ప వి నౌవయో....తులాభ్యః (6-3) తార్య .... సంమితేషు (7-3)

అను : యత్ (1-1) సమర్థానా మిత్యాది.

అర్థ : నౌ, వయస్, ధర్మ, విష, మూల, మూల, సీతా, తులా అను వాని తృతీయాంతరూపములకు క్రమముగా, తార్యము, తుల్యము, ప్రాప్యము, వధ్యము, ఆనామ్యము, సమము, సమితము, సంమితము అనునర్థములందు, యత్ ప్రత్యయము వచ్చును. ఉదా నావ్యమ్ ఇత్యాది.

వివ : ఈ సూత్రమున తృతీయాంతములగు 'నౌ' మున్నగువానికి యత్ ప్రత్యయ మాయాయర్థవిశేషములందు విధింపఁబడినది 'తృతీయాంతములు' అను పది అర్థభావనను బట్టి సిద్ధించును. అనగా 'తార్యము' అనునర్థము సిద్ధింపవలయు నన్న 'నౌ' శబ్దముయొక్క తృతీయాంతరూపమునకే యత్ ప్రత్యయము చేయవల యును. ఇట్లే తక్కినవానికిని అర్థమును బట్టి తృతీయాంతమనునది ఊహింపఁ బడినది.

(1) నావాతార్యమ్ - నావచే తరింపఁ బడునది. నౌ + టా + యత్, విభక్తిలోపము, నౌ + య, వాన్తోయి ప్రత్యయే అనుసూత్రముచే ఔకారమునకు 'అవాదేశము' నావ్ + య = నావ్య + సు=నావ్యమ్ జలమ్=నావచే దాటఁ బడునీరు.

(2) వయసాతుల్యః - తుల్యుఁడనగా సమానుఁడు; వయస్సుచేత సమానుఁడు, వయస్ + టా + య, వయస్ + య = వయస్య + సు = వయస్యః - మిత్రుఁడు.

(3) ధర్మేణ ప్రాప్యమ్ - ప్రాప్యమనగా పొందఁదగినది, ధర్మముచే పొందఁదగినది. ధర్మ+టా + యత్ - ధర్మ + య, యస్యేతిచ-అకారలోపము ధర్మ్ + య=ధర్మ్య + సు=ధర్మ్యమ్.

(4) విషేణ వధ్యః = వధ్యుఁడనగా వధింపఁదగినవాఁడు, విషముచే వధ్యుఁడు. విష+టా, యత్, విభక్తిలోపము, అకారలోపము, విష్ + య = విష్య + సు=విష్యః.

(5) మూలేన ఆనామ్యమ్-మూలమనగా వర్తకుఁడు కొన్నవెల. ఆనామ్య మనగా మూలముచే పొందఁబడునది. మూలముచే ఆనామ్యమైనది మూల+టా+ యత్, విభక్తిలోపము, అకారలోపము మూల్ + య = మూల్య + సు = మూల్యమ్ = విక్రయమునకు నిర్ణయించినధరలో వర్తకునకు వచ్చులాభము. కాని నేటి వ్యవహారమున లాభముతో కూడిన మొత్తము అమ్మకముధరను మూల్యమను చున్నారు

(6) మూలేన సమః-మూలముతో సమానమైనది. మూల + టా + యత్- మూల్య+సు=మూల్యః.

(7) సీతయా సమితం - సీత అనగా నాగటిచాలు, దానితో కూడినది. సీతా + టా+యత్ = విభక్తిలోపము, అకారలోపము సీత్+య=సీత్య+సు= సీత్యమ్ క్షేత్రమ్ దున్నఁబడినభూమి.

(8) తులయా సంమితమ్ = తులతో (త్రాసుతో) తూచఁబడినది తులా+ టా + యత్, విభక్తిలోపము, అకారలోపము తుల్ + య=తుల్య+సు= తుల్యమ్

నౌమున్నగు శబ్దముల కీయర్థములందే యత్ ప్రత్యయమగునని తాత్పర్యము. కావున వయస్సుతో తుల్యుఁడగు శత్రువు వయస్యుఁడు కాఁజాలఁడు. తక్కినవానికి నిట్లే యూహించునది.

సూ : తత్ర సాధుః 4-4-98.

వృ : సామసుసాధుః, సామన్యః; కర్మణ్య, శరణ్యః.

ప. వి : తత్ర (అవ్య) సాధుః (1-1).

అను : యత్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'ఆ విషయమున సాధువు' అనునర్థమున విషయవాచక సప్తమ్యంతము లకు యత్ ప్రత్యయమగును. ఉదా : సామసుసాధుఃసామన్యః ఇత్యాది

వివ : ఇచట సాధుశబ్దముచే ప్రవీణుఁడు, నేర్పరి అనునర్థమును గ్రహింప వలయును. 'ఆ విషయమునందు నేర్పరి' అనునర్థమున విషయవాచకము సప్తమ్యంతమునకు పరముగా 'యత్' ప్రత్యయము వచ్చును

ఉదా : సామసుసాధుః – సామములయందు నేర్పరి – సామన్+సుప్ + యత్, విభక్తి లోపము 'సామన్ + య' అనియుండ 'నస్తద్ధితే' అనుసూత్ర ముచే ప్రాప్తమగు టిలోపమును 'యే చాభావకర్మణోః' అనుసూత్రము వారించును. సామన్య+సు=సామన్యః.

కర్మసు సాధుః – కర్మములయందు నిపుణుఁడు, కర్మన్ + సుప్+యత్, విభక్తిలోపము, కర్మన్ + య, 'అన్' అను టిభాగమునకు 'యేచాభావకర్మణోః' అను సూత్రముచే ప్రకృతిభావము, రేఫయోగముచే నకారమునకు ణత్వము (అట్కుప్వాఙ్ ....) కర్మణ్య+సు=కర్మణ్యః

శరణేసాధుః – శరణమునందు (రక్షణమునందు) ప్రవీణుఁడు శరణ + ఙి, యత్, విభక్తిలోపము, యస్యేతిచ – అకారలోపము. శరణ్య + సు = శరణ్యః.

సూ : సభాయా యః 4-4-105.

వృ : సభ్యః.

ప వి : సభాయాః (5-1) యః (1-1)

అను : తత్ర (అవ్య) సాధుః (1-1) సమర్థానామిత్యాది

అర్థ : 'అందు సాధువు' అనునర్థమున సప్తమ్యంత సభాశబ్దమునకు 'య' ప్రత్యయము చేరును. ఉదా : సభ్యః.

వివ : 'సభాయాం సాధుః' అనునర్థమున 'సభాయామ్' అను సప్తమ్యంత రూపమునకు 'య' ప్రత్యయము చేరును. ఇది యత్ప్రత్యయమునకు అపవాదము. ఈ రెండు ప్రత్యయములలో నేది చేరినను అగురూపమొక్కటియే కాని ఉదాత్తాది స్వరవిషయక భేదముకొఱకు ప్రత్యయాంతరముగా విధింపఁబడినది

ఉదా : సభాయాం సాధుః - సభయందు నిపుణుఁడు - సభా + ఙి + య, విభక్తి లోపము, ఆకారలోపము సభ్ + య = సభ్య + సు = సభ్యః

వృ : ఇతి ఛయతో ఽవధిః.

అర్థ : ఇంతవఱకు యత్ప్రత్యయము యొక్క హద్దు.

## ఇది ప్రాగ్ఘితీయ ప్రకరణము.

**ప్రకరణావలోకనము :** ఇందు సాధారణముగా యత్ ప్రత్యయము విధింపఁబడినది. 'ఠక్', 'య' అను ప్రత్యయములును విధింపఁబడినవి. 'దానిని మోయునది' అనునర్థమున రథాదిశబ్దముల ద్వితీయాంతములకును, తార్హ్యము మున్నగు నర్థములలో తృతీయాంతనావాది పదములకును, అందు సాధువు అనునర్థమున సప్తమ్యంతపదములకు ఈ ప్రత్యయములు విధింపఁబడినవి.

# అథ ఛయద్విధి ప్రకరణమ్.

అవ : ఇటుపై కొన్ని అర్థవిశేషములలో ఛ, యత్ ప్రత్యయములు చెప్పఁబుచున్నవి వానిని విధించు ప్రకరణమగుటచే దీనికి ఛయద్విధిప్రకరణమని పేరు.

సూ : ప్రాక్క్రీతాచ్ఛః 5-1-1.

వృ : తేన క్రీత మిత్యతః ప్రాక్ ఛోఽధిక్రియతే.

ప వి : ప్రాక్ (1-1) క్రీతాత్ (5-1) ఛః (1-1).

అను . సమర్థానామిత్యాది

అర్థ . 'తేన క్రీతమ్' 5-1-37 అనుదానికి పూర్వమువఱకు 'ఛ' అనునది అధికారము.

వివ : 'తేనక్రీతమ్' అనుసూత్రమునకు పూర్వమువఱకు విధింపఁబడిన యర్థవిశేషములలో ఆయాశబ్దములకు 'ఛ' ప్రత్యయము వచ్చును. అపవాద ప్రత్యయములు చెప్పఁబడినచో అవి దీనిని బాధించును. సూత్రమునందలి 'క్రీతాత్' అనునది క్రీత శబ్దఘటిత సూత్రమును దెలుపును.

సూ : ఉగవాదిభ్యో యత్ 5-1-2.

వృ : ఉవర్ణాన్తాద్గవాదిభ్యశ్చయత్ ఛస్యాపవాదః, శఙ్కవ్యం దారు; గవ్యమ్.

ప, వి : ఉగవాదిభ్యః (5-3) యత్ (1-1).

అను : సమర్థానామ్ (6-3) ప్రథమాత్ (5-1) వా (అవ్య) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) ప్రాక్ (1-1) క్రీతాత్ (5-1).

అర్థ : ఉవర్ణాంతములకును గవాదులకును, తేన క్రీతమ్' అను సూత్రమునకు పూర్వమువఱకుఁ గల అర్థములలో యత్' ప్రత్యయము వచ్చును. ఉదా: శఙ్కవ్యందారు; గవ్యమ్. ఇది ఛ ప్రత్యయమున కపవాదము.

వివ : ఈ యత్ ప్రత్యయము పైసూత్రమునఁ జెప్పఁబడిన ఛ ప్రత్యయమున కపవాదము. వక్ష్యమాణార్థములలో ఉకారాంతశబ్దములకును, గవాదులకును సాధారణప్రత్యయమగు 'ఛ' అనునది రాక యత్ ప్రత్యయము వచ్చునని సూత్రార్థము. దీనిబట్టి యీ ప్రకరణమున 'ఛ', 'యత్' అను రెండు ప్రత్యయ

ములను ప్రత్యేకముగా ప్రత్యయమును జెప్పనిచోట ఉపస్థితములగుచుండును అందు ఉకారాంతములకును, గవాదులకును యత్ ప్రత్యయమును, తక్కినవానికి ఛ ప్రత్యయమును అగునని ఫలితార్థము. ఇట్లు దీనికి ఛ యద్విధి ప్రకరణమను పేరు కలిగినది.

ఉదా : శఙ్కవ్యం దారు - శఙ్కు + ఙే + యత్ - శఙ్కుశబ్దము ఉకారాంతము - కావున 'యత్' ప్రత్యయము తస్మైహితమ్ అను వక్ష్యమాణార్థమున వచ్చినది విభక్తిలోపము శఙ్కు + య, ఓర్గుణః. శఙ్కో + య, వాన్తోయి ప్రత్యయే - అవాదేశము శఙ్కవ్ + య=శఙ్కవ్య + సు = శఙ్కవ్యందారు = శంకువు చేయుటకు యోగ్యమైన కొయ్య.

గవ్యమ్ - గోవుకు హితమైనది, గో + ఙే+య(త్) ఇది గవాదుల లోనిది విభక్తిలోపము, గో + య, అవాదేశము గో + య=గవ్య+సు = గవ్యమ్.

గ. సూ : నాభినభంచ (గ౧. 95).

వృ : నభ్యోఽక్షః; నభ్యమఞ్జనమ్.

ప వి : నాభి (లుప్తవిభక్తిక పదము) నభమ్ (1-1) చ (అవ్య).

అర్థ : యత్ ప్రత్యయయోగమున నాభిశబ్దమునకు 'నభ' అను నాదేశము కూడ వచ్చును. ఉదా : నభ్యోఽక్షః; నభ్యమఞ్జనమ్.

వివ : ఇది గవాదిగణములోని సూత్రము. గణములో నేదేని ఒకశబ్దమునకు లేదా కొన్నిశబ్దములకు సంబంధించిన విశేషమొకసూత్రముగా చెప్పఁబడును. అట్టి వానిని గణసూత్రములందురు ఇది అట్టిది. దానికి హితమైనది మున్నగు నర్థము లలో 'నాభి' శబ్దము నభ అనునాదేశమును, యత్ ప్రత్యయమును పొందును. ఇచట 'నాభి' శబ్దము రథముయొక్క నాభి అనునర్థమునందలిదియే గ్రహింపఁబడవలయు నని వ్యాఖ్యాతలచే చెప్పఁబడినది. చక్రమునకు మధ్య నుండురంధ్రమును నాభి యందురు. దానికి హితమైనది అనునర్థమున నీ నభాదేశయత్ప్రత్యయములు వచ్చును.

నాభయేహితః - నాభి + ఙే + యత్, విభక్తిలోపము, నభ + య(త్) 'యస్యేతిచ' - అకారలోపము నభ్+య=నభ్య + సు=నభ్యః - రథముయొక్క నాభికి అనుగుణమైన ఇరుసు. నభ్యమ్ అంజనమ్ = రథముయొక్క నాభికి యోగ్యమైన కారు మున్నగునది.

గవాదిగణము : గో హవిస్ అక్షర విష బర్హిస్ అష్టకా స్వదా యుగ మేధా స్రుచ్. 'నాభినభంచ' 95 'శునః సంప్రసారణం వాచదీర్ఘత్వం తత్సంని యోగేన చాన్తో దాత్తత్వమ్' 96 'ఊధసోఽనఙ్ చ' 97. కూప ఖద దర ఖర అసుర అధ్వన్ (అధ్వస) క్షర వేద బీజ దీస (దీప్త). ఇతిగవాదిః.

సూ : తస్మై హితమ్ 5-1-5.

వృ : వత్సేభ్యో హితో వత్సీయో గోధుక్.

ప వి : తస్మై (4-1) హితమ్ (1-1)

అను : ఛః (1-1) ఉగవాదిభ్యః (5-3) యత్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానికొఱకు హితమైనది' అనునర్థమున సమర్థచతుర్థ్యంతమునకు యథాసంభవముగ ఛ, యత్ ప్రత్యయములు వచ్చును. ఉదా : వత్సేభ్యోహితః వత్సీయో గోధుక్

వివ : 'తస్మై' అనునది చతుర్థ్యంత పదమునకు చిహ్నము. 'దానికొఱకు హితమైనది' అనునర్థమున హితము దేనినుద్దేశించి అగునో తద్వాచక చతుర్థ్యంతము ఉకారాంతముగాని గవాదిగాని అయినచో యత్ ప్రత్యయమును, తక్కినది ఛ ప్రత్యయమును పొందును.

ఉదా : వత్సేభ్యోహితః- వత్సములకు హితమైనది. వత్స + ఙే, ఛ విభక్తిలోపము. ఛకారమునకు ఈయ్‌ఆదేశము వత్స + ఈయ, యస్యేతిచ - అకారలోపము. వత్స + ఈయ = వత్సీయ + సు = వత్సీయః గోధుక్ - వత్సీయుఁడైన పాలుపిదుకువాఁడు. (వత్సశబ్దము గవాదుల లోనిదికాదు).

సూ : శరీరావయవాద్యత్ 5-1-6.

వృ : దన్త్యమ్, కణ్ఠ్యమ్, నస్యమ్.

ప వి : శరీరావయవాత్ (5-1) యత్ (1-1).

అను : సమర్థానా మిత్యాది; తస్మై (4-1) హితమ్ (1-1).

అర్థ : 'దానికొఱకు హితమైనది' అనునర్థమున శరీరావయవవాచక చతుర్థ్యంతములకు 'యత్' ప్రత్యయము వచ్చును.

వివ : శరీరావయవములగు పన్ను ముక్కు మున్నగువానికి వాచకములైన దన్త, నాసికా మున్నగువాని చతుర్థ్యంతరూపములకు, వానికి హితమైనది అనునర్థమున 'యత్' ప్రత్యయము వచ్చును. ఇది ఛ ప్రత్యయమునకపవాదము.

ఉదా : దన్తేభ్యోహితమ్ - దంతములకొఱకు హితమైనది. దన్త+భ్యస్+యత్, విభక్తిలోపము, దన్త + య, యస్యేతిచ - అకారలోపము-దన్త్+య= దన్త్య + సు=దన్త్యమ్.

కణ్ఠాయ హితమ్ కంఠమునకు హితమైనది. కణ్ఠ+ఙే+యత్, కణ్ఠ్ + య = కణ్ఠ్య + సు = కణ్ఠ్యమ్.

నాసికాయై హితమ్ నాసికకు హితమైనది. నాసికాశబ్దమునకు ఈ ప్రత్యయ యోగమున 'నస్' అనునాదేశము విధింపఁబడినది. నస్ + య = నస్య+సు = నస్యమ్ - ముక్కుపొడి.

'వాని యందేర్పడునది' అనునర్థమునందు దంత్యమ్ మున్నగునవి అగును 'శరీరావయవాచ్చ' (శైషిక) సందర్భమునుబట్టి యర్థభేదమును గమనింప వలయును

**సూ : ఆత్మన్విశ్వజనభోగోత్తరపదాత్ఖః 5-1-9.**

ప. వి : ఆత్మన్... పదాత్ (5-1) ఖః (1-1).

అను : తస్మై (4-1) హితమ్ (1-1) సమర్థానామిత్యాది

అర్థ : ఆత్మన్, విశ్వజన అనుశబ్దములయు భోగశబ్దము ఉత్తరపదముగాఁ గల వానియొక్కయు చతుర్థ్యంతములను దానికి హితమైనది' అనునర్థమున ఖ' ప్రత్యయము వచ్చును

వివ : చతుర్థీ విభక్త్యంతములగు ఆత్మన్, విశ్వజన అనువానికిని భోగ శబ్దము ఉత్తరపదముగాఁ గలవానికిని, దానికి హితమైనది అనునర్థమున 'ఖ' ప్రత్యయము వచ్చును

ఉదా : ఆత్మనే హితమ్ - ఆత్మకు హితమైనది. ఆత్మన్+ఙే+ఖ, విభ లోపము ఆయనేయీనీత్యాదిసూత్రముచే 'ఈన్' ఆదేశము, 'ఆత్మన్ + ఈన' - ఇట్టి యెడ 'నస్తద్ధితే' అను సూత్రముచే టిలోపము ప్రాప్తించుచుండ నీక్రింది సూత్రము దానిని నిషేధించుచున్నది.

**సూ : ఆత్మాధ్వానౌ ఖే 6-4-169.**

**వృ : ఏతౌ ఖే ప్రకృత్యా స్తః. ఆత్మనే హిత మాత్మనీనమ్.**

ప. వి : ఆత్మాధ్వానౌ (1-2) ఖే (7-1).

అను : ప్రకృత్యా (3-1).

అర్థ : ఆత్మన్, అధ్వన్ శబ్దములు ఖ ప్రత్యయము పరమగునప్పుడు ప్రకృతితో నుండును. ఉదా : ఆత్మనీనమ్

వివ : ప్రకృతితో నుండుననగా వానికి ప్రాప్తమగుటిలోపము రాదనిభావము. ఈన' అనునది ఆదేశమగుటచే ఆదేశము స్థానివంటిదగునను పరిభాషనుబట్టి 'ఆత్మన్+ఈన' అనుచోట 'ఖ' ప్రత్యయము పరమయినదనియే భావన. ఆత్మన్+ ఈన = ఆత్మనీన + సు = ఆత్మనీనమ్

అవ : విశ్వజన, భోగోత్తర పదముల కుదాహరణములు.

వృ : విశ్వజనీనమ్, మాతృభోగీణః

వివ . విశ్వజనేభ్యోహితమ్ - సమస్తజనులకు హితమైనది. విశ్వజన + భ్యస్ + ఖ, విభక్తిలోపము, ఈనాదేశము, అకారలోపము, విశ్వజనీన + సు= విశ్వజనీనమ్.

మాతృభోగాయహితమ్, మాతృభోగ + ఙే + ఖ, విభక్తిలోపాదులు, మాతృభోగ్ + ఈన=నకారమునకు ణత్వము (ఋకారయోగముచే)

మాతృభోగీణ + సు=మాతృభోగీణః.

ప్రకరణావలోకనము : ఇందు 'తస్మైహితమ్' అనుసర్థమున ఛ, యత్ ప్రత్యయములును, ఖ ప్రత్యయమును విధింపబడినవి 'నాభినభంచ' అను గణ సూత్రము నాభిశబ్దమునకు నభాదేశమును విధించినది. 'ఆత్మాధ్వానౌఖే' అనునది టిలోపమును వారించినది.

# అథ ఆర్హీయ ప్రకరణమ్

అవ : 'తదర్హతి' అనునర్థమీప్రకరణమున చెప్పఁబడుచున్నది. మఱికొన్ని యర్థములందును ప్రత్యయములు విధింపఁబడుచున్నవి. 'అర్హము' అనునర్థమున విధింపఁబడు ప్రత్యయములుగల ప్రకరణమగుటచే దీనికి ఆర్హీయప్రకరణమని పేరు

సూ : **ప్రాగ్వతేష్ఠఞ్ 5-1-18.**

వృ : **తేన తుల్యమిత్యతః ప్రాక్ ఠఞ్ అధిక్రియతే.**

ప వి : ప్రాక్ (1-1) వతేః (5-1) ఠఞ్ (1-1)

అర్థ : 'తేనతుల్యం క్రియా చేద్వతిః' అనుసూత్రమువఱకు 'ఠఞ్' అనునది అధికారము

వివ : సూత్రమునందలి వతిశబ్దము అదిగల సూత్రమును దెలుపును. 'తేన తుల్యం క్రియా చేద్వతిః' అనునది యా సూత్రము అంతవఱకు (5-1-115) విశేష ప్రత్యయములు చెప్పఁబడనిచోట 'ఠఞ్' ప్రత్యయము ఉపస్థితమగునని సూత్రతాత్పర్యము

సూ : **తేన క్రీతమ్ 5-1-37.**

వృ : సప్తత్యా క్రీతం సాప్తతికమ్, ప్రాస్థికమ్.

ప వి : తేన (3-1) క్రీతమ్ (1-1).

అను : ఠఞ్ (1-1) ప్రత్యయః, తద్ధితః, సమర్థానాం, ప్రథమాత్, వా.

అర్థ : 'దానిచే కొనఁబడినది' అనునర్థమున తృతీయాంతపదమునకు పరముగా ఠఞ్ ప్రత్యయము వచ్చును. ఉదా : సాప్తతికమ్; ప్రాస్థికమ్.

వివ : కొనఁబడిన వస్తువును తెలుపుచు, కొనుటలో సాధనమైన దానిని చెప్పు శబ్దముయొక్క తృతీయాంతరూపమునకు పరముగా 'ఠఞ్' అను ప్రత్యయము వచ్చును ఇందు ఞకారమిత్తు. 'ఠ' కారమునకు ఇక' ఆదేశమగును (ఠస్యేకః).

ఉదా : సప్తత్యా క్రీతమ్. డెబ్బది (రూప్యములు మున్నగువాని)చే కొనఁబడినది. సప్తతి + టా + ఠఞ్ విభక్తిలోపము, ఆదివృద్ధి, ఇకాదేశము, సాప్తతి + ఇక, యస్యేతిచ - ఇకారలోపము, సాప్తత్ + ఇక=సాప్తతిక+సు=సాప్తతికమ్.

ప్రస్థేన క్రీతమ్ - ప్రస్థముచే కొనఁబడినది. ప్రస్థ + టా + ఠఞ్ విభక్తిలోపాదులు, ప్రాస్థిక + సు=ప్రాస్థికమ్.

సూ : తస్యేశ్వరః 5-1-42.

సూ : తత్ర విదిత ఇతి చ 5-1-43.

వృ : సర్వభూమి పృథివీభ్యామణఞౌ స్తః.

ప వి : తస్య (6-1) ఈశ్వరః (1-1) తత్ర (అవ్య) విదితః (1-1) ఇతి (అవ్య) చ (అవ్య)

అను : సర్వభూమిపృథివీభ్యామ్ (5-2) అణఞౌ (1-2) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానియొక్క ఈశ్వరుఁడు' 'అందు తెలియఁబడినవాఁడు' అనునర్థము లందు సర్వభూమి, పృథివీ శబ్దములకు పరముగా అణ్, అఞ్ ప్రత్యయములు వచ్చును.

వివ : దానియొక్క ఈశ్వరుఁడు అనునర్థమున షష్ఠ్యంతసమర్థములును, అందు తెలియఁబడినవాఁడు (ప్రసిద్ధికెక్కినవాఁడు) అనునర్థమున సప్తమ్యంత సమర్థములును అయినసర్వభూమి పృథివీ శబ్దములకు క్రమముగా అణ్, అఞ్ ప్రత్యయములు వచ్చును. ఈ ప్రత్యయములకు రూపభేదములేదు. ణ్, ఞ్-లు ఇత్తు లగుటవలన స్వరములో భేదముండును.

ఉదా : సర్వభూమేః ఈశ్వరః, సర్వభూమౌ విదితో వా - సర్వభూమికి నీశ్వరుఁడు, లేక సర్వభూమియందు ప్రసిద్ధుఁడు, సర్వభూమి + ఙస్/ఙి + అణ్, విభక్తిలోపము, సర్వభూమి + అణ్, ఇది అనుశతికాదులలోనిది కావున 'అనుశతికాదీనాంచ' అను సూత్రముచే ఉభయపదవృద్ధి వచ్చును సార్వభౌమ + అ, యస్యేతిచ - అకారలోపము, సార్వభౌమ్+అ = సార్వభౌమ+సు = సార్వభౌమః. (అనుశతికాదీనాంచ అనుసూత్రము తైషికప్రకరణమున వ్యాఖ్యానింపఁబడినది).

పృథివ్యా ఈశ్వరః, పృథివ్యాం విదితోవా - పృథివికి ఈశ్వరుఁడు లేక, పృథివియందు విదితుఁడు పృథివీ + ఙస్/ఙి + అఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఋ > అర్) పార్థివీ + అ, యస్యేతిచ - ఈకారలోపము పార్థివ్+అ= పార్థివ+సు=పార్థివః.

సూ : పఙ్క్తి-వింశతి త్రింశచ్చత్వారింశత్పఞ్చాశత్ షష్టి సప్తత్యశీతి నవతి శతమ్ 5-1-59.

వృ : ఏతేరూఢ శబ్దా నిపాత్యన్తే.

ప వి : పఙ్క్తి.... శతమ్ (1-1)

అను : తత్ (1-1) అస్య (6-1) పరిమాణమ్ (1-1).

అర్థ : పంక్తిమున్నగురూఢి శబ్దము లీసూత్రముచే నిపతింపఁబడుచున్నవి.

వివ : ఈ సూత్రములోనికి 'తదస్య పరిమాణమ్' అనునది అనువృత్తమగును. 'అది దీనిపరిమాణము' అనునర్థమున పంక్తి మున్నగు రూఢిశబ్దములు ఈ సూత్రముచే నిపతింపఁబడుచున్నవి. రూఢియనగా జనవ్యవహారములో నొక యర్థమునందు స్థిరత్వమును పొందుట. అవయవార్థమును బట్టించుకొన నక్కరలేదని భావము వీనిస్వరూపము నీక్రిందివిధముగా నెఱయఁదగును

(1) పఞ్చ పాదాఃపరిమాణమస్య-పంచపాదములు దీనికి పరిమాణము అనునర్థమున పఞ్చన్ శబ్దమునకు తిప్రత్యయము, టిలోపము, పఞ్చ + తి, చకారమునకు కుత్వము పఙ్క్ + తి = పఙ్క్తి+సు=పఙ్క్తిః. ఇది అయిదుపాదములుగల ఛందోవిశేషమునకు సంజ్ఞ.

(2) దశానాం వర్గో దశత్ - పదింటివర్గము 'దశత్' అగును. ద్వౌదశతౌ పరిమాణమస్య - రెండు దశత్తుల పరిమాణముగల సంఘము మున్నగునది. అనునర్థమున ద్విదశత్ శబ్దమునకు 'శతిచ్' ప్రత్యయము, ప్రకృతికి (ద్విదశత్ - అను దానికి) 'విన్' ఆదేశము-విన్+శతి (చ్) నకారమున కనుస్వారాదేశము, వింశతి + సు=వింశతిః - ఇరువదింటియొక్క సంఘము 'వింశతి' శబ్దము స్త్రీలింగము నేకవచనము నగుట లోకవ్యవహారసిద్ధము నేఁడు వింశతి మున్నగునవి ఇరువదింటి సముదాయము అనునర్థమునందు మాత్రమే కాక 'యిరువది' మున్నగు నర్థమునందును వాడఁబడుచున్నవి అప్పుడు సముదాయమునకు, సంఖ్యకు అభేదము చెప్పఁబడినదని భావింపవలయును.

(3) త్రయఃదశతః, పరిమాణమస్య - మూఁడుదశత్తుల పరిమాణముగలది. త్రిదశత్ శబ్దమునకు శత్ ప్రత్యయమును, ప్రకృతియగు 'త్రిదశత్' అనుదానికి త్రిన్ అను నాదేశమును నిపతింపఁబడినవి. త్రిన్+శత్, త్రింశత్ + సు = త్రింశత్ = మూఁడుపదుల పరిమాణముగల సంఘము.

(4) చత్వారో దశతః పరిమాణమస్య - నాలుగు దశత్తులు పరిమాణముగాఁగలది, చతుర్దశత్ శబ్దమునకు 'శత్' ప్రత్యయము, ప్రకృతికి 'చత్వారిన్' అనునాదేశముమ నిపతింపఁబడినవి. చత్వారిన్ + శత్, అనుస్వారాదేశము, చత్వారింశత్ + సు=చత్వారింశత్-నాలుగుపదుల లెక్కగలసంఘము.

(5) పఞ్చదశతః పరిమాణమస్య - అయిదు దశత్తులు పరిమాణముగా గలది శత్ ప్రత్యయము. ప్రకృతికి 'పఞ్చా' ఆదేశము, పఞ్చాశత్ + సు = పఞ్చాశత్, అయిదుపదుల పరిమాణముగల సంఘము

(6) షడ్ దశతః పరిమాణమస్య - అఱువదులు పరిమాణముగాఁగల సంఘము 'తి' ప్రత్యయము, ప్రకృతికి 'షష్' అనునాదేశము, షకారమునకు ఝరాంజశోఽన్తే అనుసూత్రముచే ప్రాప్తమగు జశ్త్వమురాకుండుటయు షష్+తి, ష్టుత్వము, షష్టి + సు=షష్టిః.

(7) సప్త దశతః పరిమాణమస్య - ఏడుపదులు పరిమాణముగా గల సంఘము. 'తి' ప్రత్యయము, ప్రకృతికి 'సప్త' ఆదేశమును నిపతింపఁబడినవి సప్తతి + సు = సప్తతిః.

(8) అష్టౌదశతః పరిమాణమస్య - ఎనిమిది పదులు పరిమాణముగాగల సంఘము, 'తి' ప్రత్యయమును, ప్రకృతికి 'అశీ' ఆదేశమునునిపతింపఁ అశీతి + సు = అశీతిః.

(9) నవ దశతః పరిమాణమస్య - తొమ్మిదిపదులు పరిమాణముగాఁగల సంఘము 'తి' ప్రత్యయమును ప్రకృతికి 'నవ' ఆదేశమును నిపతింపఁబడినవి. నవతి + సు=నవతిః.

(10) దశ దశతః ప్రమాణమస్య - పదిపదులు పరిమాణముగాగలసంఘము 'త' ప్రత్యయము, ప్రకృతికి 'శ' అను నాదేశమును నిపతింపఁబడినవి. శత + సు=శతమ్

ఇవి యన్నియు అవ్యుత్పన్నరూపములని భాష్యోక్తి. ప్రకృతిప్రత్యయవిభాగమును సుస్పష్టముగా నిరూపింప వీలులేనివానిని అవ్యుత్పన్నములందురు.

సూ : తదర్హతి 5-1-63.

వృ : శ్వేతచ్ఛత్రమర్హతి శ్వైతచ్ఛత్రికః.

ప. వి : తత్ (2-1) అర్హతి (క్రి. ప)

అను : ఠఞ్ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'దానిని పొందుటకు తగినవాఁడు'అనునర్థమున ద్వితీయాంతపదమునకు పరముగా 'ఠఞ్' ప్రత్యయము వచ్చును. ఉదా : శ్వైతచ్ఛత్రికః.

వివ : ద్వితీయాంతపదమునకు, దానిచేవాచ్యమగుదానిని పొందుటకు తగిన వాఁడు అనునర్థమును వ్యక్తముచేయుచు 'ఠఞ్' ప్రత్యయము వచ్చును.

ఉదా : శ్వేతచ్ఛత్రమ్ అర్హతి - తెలిగొడుగును పొందుటకు తగినవాఁడు శ్వేతచ్ఛత్ర + అమ్ + ఠఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఏ > ఐ) శ్వైత చ్ఛత్ర + ఠ, ఇకాదేశము, అకారలోపము, శ్వైతచ్ఛత్ర్ + ఇక = శ్వైత చ్ఛత్రిక + సు = శ్వైతచ్ఛత్రికః

**సూ : దణ్డాదిభ్యోయత్ 5-1-66.**

**వృ : ఏభ్యోయత్. దణ్డమర్హతి దణ్డ్యః, అర్ఘ్యః, వధ్యః.**

ప. వి : దణ్డాదిభ్యః (5-3) యత్ (1-1).

అను : తత్ (2-1) అర్హతి (క్రి. ప) సమర్థానామిత్యాది;

అర్థ : 'దానిని పొందనర్హుఁడు' అనునర్థమున దండాదిప్రకృతిక ద్వితీయాంత ములకు యత్ ప్రత్యయము వచ్చును. ఉదా : దణ్డ్యః.

వివ : 'దండము పొందుటకు యోగ్యుఁడు' అను నిట్టి యర్థమునందు దండాదిశబ్దముల ద్వితీయాంతములకు పరముగా 'యత్' ప్రత్యయము వచ్చును. ఇందు తకారమిత్తు. ఇది 'ఠఞ్' ప్రత్యయమున కపవాదము.

దణ్డమర్హతి - దండమునకు యోగ్యుఁడు దణ్డ + అమ్ + యత్, విభక్తి లోపము, అకారలోపము దణ్డ్ + య=దణ్డ్య+సు=దణ్డ్యః

అర్ఘమర్హతి - పూజకు తగినది. అర్ఘ + అమ్ + యత్, విభక్తిలోపము, అకారలోపము, అర్ఘ్య+సు=అర్ఘ్యః.

వధమర్హతి - వధకు యోగ్యుఁడు - వధ + అమ్ + యత్, వధ్య + సు = వధ్యః.

దండాదిగణము : దణ్డ ముసల మధుపర్క కశా అర్ఘ మేఘ మేధా సువర్ణ ఉదక వధ యుగ గుహా భాగ ఇభ భఙ్గ - ఇతిదణ్డాదిః.

**సూ : తేన నిర్వృత్తమ్ 5-1-79.**

**వృ : అహ్నానిర్వృత్తమ్ ఆహ్నికమ్**

ప. వి : తేన (3-1) నిర్వృత్తమ్ (1-1).

అను : ఠఞ్ (1-1) సమర్థానామిత్యాది. కాలాత్ (5-1).

అర్థ. 'దానిచేత నెఱవేఱినది' అనునర్థమున తృతీయాంతపదమునకు పరముగా 'ఠఞ్' ప్రత్యయము వచ్చును

వివ : ఇది 'కాలాత్' అనునధికారములోనిది. కాలవాచకశబ్దముల తృతీయాంతమునకు 'దానిచేత నెఱవేఱినది' అనునర్థమున 'ఠఞ్' ప్రత్యయము వచ్చును.

ఉదా : అహ్నా నిర్వృత్తమ్ - పగటిచే నెఱవేఱినది - అహన్+టా + ఠఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఆహన్ + ఠ, ఇకాదేశము. ఆహన్ + ఇక, టిలోపము ప్రాప్తించుచుండగా 'అహ్నష్ఠ ఖోరేవ' అనునియమముచే నదివారింపఁబడును. 'అల్లోపోఽనః' అను సూత్రముచే హకారమునందలి అకారమునకు లోపము వచ్చును ఆహన్+ఇక=ఆహ్నిక + సు=ఆహ్నికమ్.

వృ। ఇతి ఠఞ్ ఽవధిః

అర్థ : ఇది 'ఠఞ్' ప్రత్యయమునకు హద్దు.

ఇది ఆర్హీయప్రకరణము.

ప్రకరణావలోకనము : ఈ ప్రకరణమున 'దానిచే కొనఁబడినది', దానియొక్క ఈశ్వరుఁడు, దానియందు విదితుఁడు, దానినిఁబొంద నర్హుఁడు, దానిచేత నెఱవేఱినది అనునర్థములందు ఠఞ్, యత్, అణ్, అఞ్ ప్రత్యయములు విధింపఁబడినవి పంక్త్యాదిశబ్దములు 'అది దీనియొక్క పరిమాణము' అనునర్థమున నిపతింపఁబడినవి. అర్హార్థమున విధింపఁబడిన ప్రత్యయమునుబట్టి దీనికి ఆర్హీయ ప్రకరణమను సంజ్ఞకలిగినది.

# అథ నఞ్స్నఞధికార ప్రకరణమ్.

అప : 'స్త్రీ పుంసాభ్యాం నఞ్ స్నఞౌ భవనాత్' అనుసూత్రమున ధాన్యానాం భవనే క్షేత్రే' అనుసూత్రమునకు పూర్వము వఱకుఁగల అర్థములలో స్త్రీపుంస్ శబ్దములకు నఞ్ స్నఞ్ ప్రత్యయములు వచ్చునని చెప్పఁబడినది. ఆయర్థము లీప్రకరణముతో ముగియనున్నవి. కావున నఞ్ స్నఞ్ ప్రత్యయముల అధికారము ముగియు ప్రకరణము కావున దీనికి నఞ్స్నఞధికార ప్రకరణమను నామము ఉంచఁబడినది ఇందు సాధారణముగ భావకర్మార్థములయందు వచ్చు ప్రత్యయములు చెప్పఁబడి యుండుటచే భావకర్మార్థక ప్రకరణమనియు దీనికి వ్యవహారము గలదు.

సూ : తేనతుల్యం క్రియాచేద్వతిః 5-1-115.

వృ: బ్రాహ్మణేనతుల్యం బ్రాహ్మణవదధీతే క్రియాచేత్ కిమ్? గుణతుల్యే మాభూత్. పుత్రేణతుల్యః స్థూలః.

ప. వి : తేన (3-1) తుల్యమ్ (1-1) క్రియా (1-1) చేత్ (అవ్య) వతిః (1-1).

అను : సమర్థానా మిత్యాదిః

అర్థ : 'దానితో తుల్యమైనది' అనునర్థమున తుల్యమైన క్రియవాచ్యమగు నపుడు తృతీయాంతపదమునకు 'వతి' ప్రత్యయము చేరును. క్రియవాచ్యమగువో అనుటవలన గుణముతుల్యమైనపు డీప్రత్యయము రాదు పుత్రేణతుల్యఃస్థూలః.

వివ : తుల్యమనగా సమానము తుల్యమగు క్రియవాచ్యమైనపుడు తృతీయాంతపదమునకు పరముగా 'వతి' అను తద్ధిత ప్రత్యయము చేరును. ఇందు 'ఇ' కారము ఇత్తు (ఉపదేశేఽజనునాసిక ఇత్).

ఉదా : బ్రాహ్మణేవ తుల్యమధీతే - బ్రాహ్మణునితో తుల్యముగా చదువు చున్నాఁడు-బ్రాహ్మణుఁడు చదివినట్లుగా చదువుచున్నాఁడు ఇచట క్రియతుల్యమైనదికావున బ్రాహ్మణేన'అను తృతీయాంతపదమునకు 'వతి'ప్రత్యయమువచ్చును. బ్రాహ్మణ+టా+వత్ (ఇ). విభక్తిలోపము. బ్రాహ్మణవత్. బ్రాహ్మణుడు చదివినవిధముగా క్షత్రియాదులు చదువుట అయినది అనిదీనికి తాత్పర్యము. ఇచట బ్రాహ్మణశబ్దముచే బ్రాహ్మణాధ్యయనము గ్రాహ్యము.

వతి ప్రత్యయాంతము అవ్యయము కావున దానికి పరముగా చేరినసుప్పులకు లుక్కువచ్చును (అవ్యయాదాప్సుపః).

వతి ప్రత్యయాంతముచే క్రియయే వాచ్యము కావలయునమటచే గుణాదులు వాచ్యములగునపు డీప్రత్యయమురాదు ఉదా : పుత్రేణతుల్యః స్థూలః పుత్రునితో తుల్యుఁడైన స్థూలుఁడు - స్థూలత్వము గుణము. ఇచట 'పుత్రవత్' అనరాదు.

**సూ : తత్ర తస్యేవ 5-1-116.**

వృ : మధురాయామివ మధురావత్ స్రుఘ్నే ప్రాకారః, చైత్రస్యేవ చైత్రవన్మైత్రస్య భావః.

ప. వి : తత్ర (అవ్య) తస్య (6-1) ఇవ (అవ్య).

అను : సమర్థానామిత్యాది, వతిః (1-1).

అర్థ : 'దానియందువలె', 'దాని(యొక్క) వలె' అనునర్థములందు సప్తమ్యంత, షష్ఠ్యంతపదములకు పరముగా 'వతి' ప్రత్యయము వచ్చును. ఉదా : మధురా యామివ=మధురావత్ స్రుఘ్నే ప్రాకారః, చైత్రస్యేవ చైత్రవన్మైత్రస్య భావః.

వివ : తత్ర అనునది సప్తమ్యంతపదమును, తస్య అనునది షష్ఠ్యంతపదమును సూచించును ఇవ అనునది పీనితో ప్రత్యేకముగా నన్వయించును తత్ర ఇవ - దానియందువలె - 'దానియందున్నట్లుదీని యందున్నది' అనునర్థమునందును తస్య ఇవ - దానివలెనిది యున్నది అనునర్థమునందును క్రమముగా సప్తమ్యంత షష్ఠ్యంతపదములకు పరముగా 'వతి' ప్రత్యయముచేరును.

ఉదా : సప్తమ్యంతమునకు - మథురాయామ్ ఇవ - మథురయందు వలె, మథురా + ఙి, వతి, విభక్తిలోపము మథురావత్, మథురావత్. స్రుఘ్నే ప్రాకారః స్రుఘ్నమునందలి ప్రాకారము మథురయందలిప్రాకారమువలె నున్నది అని యర్థము.

షష్ఠ్యంతమునకు-చైత్రస్యేవ - చైత్రుని (భావము)వలె: చైత్ర + ఙస్ + వతి - విభక్తిలోపము చైత్రవత్ చైత్రవత్ మైత్రస్యభావః మైత్రునియొక్క భావము చైత్రునిభావమువలె నున్నది.

**సూ : తస్యభావస్త్వతలౌ 5-1-119.**

వృ . ప్రకృతిజన్యబోధే ప్రకారో భావః. గోర్భావో గోత్వమ్; 'త్వాన్తం క్లీబమ్' [లి. 120] 'తలన్తం స్త్రియామ్ [లి. 17].

వ. వి : తస్య (6-1) భావః (1-1) త్వతలౌ (1-2).

అను : సమర్థానామిత్యాది.

అర్థ : వానియొక్క దానియొక్క భావము అనునర్థమున షష్ఠ్యంతమునకు త్వ, తల్ ప్రత్యయములు వచ్చును. ప్రకృతిజన్యబోధమునందు ప్రకారము భావము. ఉదా : గోర్భావః గోత్వమ్. త్వ ప్రత్యయాంతము నపుంసకమగును. తల్ ప్రత్యయాంతము స్త్రీలింగమగును (లింగానుశాసనము).

వివ : భావమనగా ప్రకృతిజన్య బోధమునందు ప్రకారము అని చెప్పఁబడినది. ప్రత్యయము దేనికి విధింపఁబడునో అది ప్రకృతి. ప్రకృతిజన్యమనగా ప్రకృతినుండి పుట్టునది, అదిబోధము. ప్రకృతిజన్యబోధమనగా ప్రకృతినుండి పుట్టు అర్థజ్ఞానము. 'గోవు' అనగా కుక్క పిల్లి యిత్యాదులుకాని జంతువిశేషమని యర్థము. తదితర జంతువులకంటె దీనిని వేఱుగా చూపుధర్మవిశేషము ఏదికలదో దానిని ప్రకారమందురు. అనగా ఆ జంతువును ఆ పేరుతో వ్యవహరించుటకు వీలైన సర్వలక్షణముల సమాహారమని తాత్పర్యము. దానికి భావమనిపేరు. దేనియొక్క భావము వాచ్యమగునో, తద్వాచక షష్ఠ్యంతమునకు పరముగా 'త్వ', 'తల్' అను ప్రత్యయములు వచ్చును. ఇందు 'తల్'లోని లకారము ఇత్తు. త్వప్రత్యయము చేరినశబ్దము నపుంసకమనియు, తల్ ప్రత్యయము చేరినరూపము స్త్రీలింగమనియు 'త్వాన్తం క్లీబమ్', 'తలన్తం స్త్రియామ్' అను లింగానుశాసనసూత్రములచే చెప్పఁబడినది.

ఉదా : గోర్భావః - గోవుయొక్క భావము గో + ఙస్, త్వ, విభక్తి లోపము - గోత్వ + సు = 'గోత్వమ్' - గోవునందుండు విశిష్టధర్మము. తల్ ప్రత్యయము వచ్చినచో గో+ఙస్ + తల్ = గోత, ఇది స్త్రీలింగము కావున స్త్రీత్వమున 'టాప్' ప్రత్యయము చేరును. గోత+టాప్ (టకార పకారములిత్తులు) గోత + అ = గోతా + సు = గోతా.

సూ : ఆ చ త్వాత్ 5-1-120.

వృ : బ్రహ్మణస్త్వ ఇత్యతః ప్రాక్ త్వతలావధిక్రియేతే. అపవాదైస్సహ సమావేశార్థమిదమ్. చకారో నఞ్స్నఞ్భ్యామపి సమావేశార్థః, స్త్రియాభావః స్త్రైణమ్ - స్త్రీత్వమ్-స్త్రీతా. పౌంస్నమ్ - పుంస్త్వమ్ పుంస్తా.

వ. వి : ఆ (అవ్య) చ (అవ్య) త్వాత్ (5-1).

అను : త్వతలౌ (1-2).

అర్థ : 'బ్రాహ్మణ స్త్వః' (5-1-136) అనుసూత్రమునకు పూర్వమువఱకు నీ ప్రత్యయము లధికృతములగును అపవాదములతో కూడనివియును వచ్చుటకై యీ సూత్రము చెప్పబడినది నఞ్స్నఞ్ ప్రత్యయములతోకూడ నివి యగునని చెప్పుటకొఱకు చకారము సూత్రమున గ్రహింపబడినది. ఉదా : స్త్రియాభావః. స్త్రైణమ్ ఇత్యాది.

వివ : పై సూత్రమున (5-1-120) విధింపబడిన త్వ, తల్ ప్రత్యయములు బ్రాహ్మణ స్త్వః (5-1-136) అను సూత్రమునకు పూర్వమువఱకు అధికారరూపమున పోవునని యీ సూత్రముయొక్క యర్థము. ఈ విషయము ప్రత్యేకించి చెప్పనేల? అనువృత్తి చేతనే యీయర్థము సిద్ధింపవచ్చునుగదా! అనుదానికి సమాధానము చెప్పబడుచున్నది. కేవలము అనువృత్తిగా వచ్చినయెడల అపవాద ప్రత్యయములగు 'ఇమనిచ్' మున్నగునని విధింపబడిన తావులందు వీనికి ప్రవేశముండజాలదు. అపవాదప్రత్యయములగుటచే త్వతల్ప్రత్యయములను బాధించి అవియే వచ్చును కావున నీ సూత్రమున వీనికి అధికారముగుట విధింపబడినది. అట్లు విధింపబడుటవలన అపవాదప్రత్యయములగు ఇమనిచ్' మున్నగునవి రాదగిన ప్రకృతులకు, వానితోపాటు త్వతల్ప్రత్యయములు కూడ వచ్చుననునర్థము సిద్ధించును. అనగా ఇమనిజాదులు త్వతల్ ప్రత్యయములను వైకల్పికముగా బాధించునని తాత్పర్యము. సూత్రమునందలి 'చ' అనుపదము సముచ్చయార్థకము- త్వతల్ ప్రత్యయములుకూడ 'బ్రాహ్మణ స్త్వః' అనుసూత్రమునకు పూర్వమువఱకు అధికారములగుననగా వానితోపాటు నఞ్, స్నఞ్ప్రత్యయములుకూడ వచ్చునని తాత్పర్యము. అవి స్త్రీపుంస్ శబ్దములకు విధింపబడినవి. కావున స్త్రీశబ్దమునకు భావార్థమున త్వతల్ ప్రత్యయములతోపాటు నఞ్ ప్రత్యయము చేరును అట్లే 'పుంస్' శబ్దమునకు త్వతల్ ప్రత్యయములతోపాటు స్నఞ్ ప్రత్యయము కూడ చేరును.

ఉదా : స్త్రియాఃభావః స్త్రీయొక్క-భావము స్త్రీ + ఙస్ + నఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, స్త్రైన, ణత్వము = స్త్రైణ + సు = స్త్రైణమ్ త్వ ప్రత్యయము చేరినచో స్త్రీ + ఙస్ + త్వ = స్త్రీత్వ + సు = స్త్రీత్వమ్ అగును. తల్ ప్రత్యయము చేరినచో, స్త్రీ + ఙస్ + త = స్త్రీత, స్త్రీలింగమున స్త్రీతా + సు = స్త్రీతా అగును.

'పుంసోభావః - పుంస్ + ఙస్ + స్నఞ్, విభక్తిలోపము ఆదివృద్ధి పౌంస్ + స్న, సకారమునకు 'సంయోగాన్తస్యలోపః' అనుసూత్రముచే లోపము

పౌంస్న + సు = పౌంస్నమ్ త్వప్రత్యయము చేరినచో పుంస్ + జస్ + త్వ, విభక్తిలోపము, సకారలోపము, (సంయోగాన్తస్య లోపః) పుః త్వ, 'పుమః ఖయ్యమ్పరే' ఇత్యాదిసూత్రముచే రుత్వవిసర్గాదేశములు, విసర్గమునకు సకారాదేశము రాఁగా 'పుంస్త్వమ్' అగును తల్ప్రత్యయము చేరినచో స్త్రీ 'పుంస్తా' అను రూపమగును. (రూపసిద్ధికి హల్ సంధిపరిచ్ఛేదమునందలి 'పుమః ఖయ్యమ్పరే' సూత్రోదాహరణముల సిద్ధిక్రమము సరయునది.

సూ : పృథ్వాదిభ్య ఇమనిజ్వా 5-1-122.

వృ : వా వచన మణాది సమావేశార్థమ్

ప. వి : పృథ్వాదిభ్యః (5-3) ఇమనిచ్ (1-1) వా (అవ్య).

అను : తస్య (6-1) భావః (1-1) త్వతలౌ (1-2) సమర్థానామిత్యాది

అర్థ : 'దాని యొక్క భావము' అనునర్థమున షష్ఠ్యంతములగు పృథుమున్నగు వానికి 'ఇమనిచ్' ప్రత్యయము వైకల్పికముగా నగును. 'వా' అనుట అణాది ప్రత్యయముల సమావేశము కొఱకు.

వివ : భావార్థమున 'పృథు' మున్నగువానికి 'ఇమనిచ్' ప్రత్యయము చేరును ఇది త్వతల్ ప్రత్యయములకు అపవాదమే అయినను, 'ఆచత్వాత్' అను సూత్రము వలన వానిని వైకల్పికముగా బాధించును అనగా పృథుమున్నగువానికి భావార్థమున ఇమనిచ్ ప్రత్యయమును, త్వతల్ ప్రత్యయములును వచ్చును. ఇట్లు అపవాద ప్రత్యయమగునది వైకల్పికముగా వచ్చునను నర్థము ఆ సూత్రముచేతనే సిద్ధించుచుండగా మరల నిందు 'వైకల్పికముగా' ననునర్థముగల 'వా' అను దానిని గ్రహింపనేల? అనగా అణాదిప్రత్యయములు వచ్చుటకొఱకని సమాధానము చెప్పఁబడినది పృథ్వాదులలోని పృథుమృదు మున్నగు శబ్దములకు 'ఇగన్తాచ్చ లఘుపూర్వాత్' అను సూత్రముచే అణ్ ప్రత్యయమును, 'చణ్డ', 'ఖణ్డ' మున్నగు వానికి 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చ' అను సూత్రముచేత ష్యఞ్ ప్రత్యయమును ఈ మొదలగునవి సాధారణప్రత్యయములుగా విధిం [illegible] ఏతే సూత్రము వానికి బాధకముగా 'ఇమనిచ్' ప్రత్యయమును విధించుచున్నది. సూత్రమున 'వా' పదములేనిచో పృథుమృదు మున్నగువానికి ఇమనిచ్, త్వతల్ ప్రత్యయములు మాత్రమే వచ్చునుగాని పైన చెప్పఁబడిన అణ్, ష్యఞ్ మున్నగునవి వచ్చుటకు వీలుకాదు. అవియును రావలయునను తాత్పర్యముతో సూత్రమున

'వా' పదము ఉంచఁబడినది కావున పృథుమున్నగువానికి భావార్థమున, ఇమనిచ్, త్వతల్ ప్రత్యయములతోపాటు అణ్, ష్యఞ్ అఞ్ అను ప్రత్యయములుకూడ వచ్చునని తాత్పర్యము

ఉదా : పృథోర్భావః-పృథువు = గొప్పది, దానియొక్క-భావము. పృథు + ఙస్ + ఇమనిచ్ ఈ ప్రత్యయమున చకారమిత్తు. 'ని' లోని ఇకారము ఉచ్చారణార్థకము ఇమన్' మిగులును విభక్తిలోపము 'పృథు + ఇమన్'-అగు పాటి కార్యము నీ క్రింది సూత్రము విధించుచున్నది.

సూ : రఋతో హలాదేర్లఘోః 6-4-161.

వృ : హలాదేర్లఘోః ఋకారస్య రః స్యాత్, ఇష్ఠేమేయస్సు.

ప వి : రః (1-1) ఋతః (6-1) హలాదేః (6-1) లఘోః (6-1).

అను : ఇష్ఠేమేయస్సు (7-3) అఙ్గస్య (6-1)

అర్థ : హలాదియైన అంగముయొక్క లఘువైన హ్రస్వఋకారమునకు, ఇష్ఠన్, ఇమన్, ఈయస్ ప్రత్యయములు పరములగునపుడు, 'ర' అనునాదేశము వచ్చును

వివ : ఇష్ఠన్, ఇమన్, ఈయస్ అను ప్రత్యయములు పరములగునపుడు హల్లు మొదటఁగల అంగము యొక్క-లఘువగు హ్రస్వఋకారము స్థానమున 'ర' (ర్ + అ) అనునాదేశము వచ్చును.

ఉదా : పృథు + ఇమన్ - ఇందు 'పృథు' అను అంగము హలాది అందు లఘువైన ఋకారము గలదు. ఈ అంగమునకు 'ఇమన్' ప్రత్యయము పరముగా నున్నది. కావున ఋకారము పోయి 'ర' అనునది ఆదేశమగును. ప్ + రథు = ప్రథు + ఇమన్' అగును.

అవ : పైదశలో క్రింది సూత్రముచే టిలోపము విధింపఁబడుచున్నది.

సూ : టేః 6-4-155.

వృ : భస్య టేర్లోప ఇష్ఠేమేయస్సు.

ప. వి. టేః (6-1)

అను : భస్య (6-1) లోపః (1-1) ఇష్ఠేమేయస్సు (7-3).

అర్థ : ఇష్ఠన్, ఇమన్, ఈయస్ అను ప్రత్యయములు పరములగునపుడు భసంజ్ఞకము యొక్క టిభాగమునకు లోపము వచ్చును.

వివ : యకారాది ప్రత్యయములుగాని, అజాది ప్రత్యయములు గాని పరము లగునపుడు పూర్వమునకు భసంజ్ఞ కలుగును. అట్టి భసంజ్ఞకముయొక్క 'టి' కి, ఇష్ఠన్, ఇమన్, ఈయస్ ప్రత్యయములు పరములగునప్పుడు లోపము వచ్చును.

ఉదా : ప్రథు + ఇమన్, ఇమన్ ప్రత్యయమజాది కనుక భసంజ్ఞను పొందు 'ప్రథు' అనుదాని 'టి' అగు ఉకారము లోపించును ప్రథ్ + ఇమన్ = ప్రథిమన్ + సు = ప్రథిమా.

అవ : 'రఋతోహలాదేర్లఘోః' అనుసూత్రముచే 'ర' ఆదేశము కొన్నిటికే వచ్చునని యీ క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా॥ పృథుమృదు భృశకృశ దృఢ పరివృఢానామేవ రత్వమ్ (4211).

ప. వి : పృథు.........నామ్ (6-3) ఏవ (అవ్య) రత్వమ్ (1-1)

అర్థ : రఋతో ఇత్యాది సూత్రముచే విధింపఁబడిన 'ర' ఆదేశము పృథు, మృదు, భృశ, కృశ, దృఢ, పరివృఢ అనుశబ్దములకు మాత్రమే.

వివ : ఈ వార్తికముచే 'రఋతో' ఇత్యాది సూత్రమునకు పరిమితి ఏర్పడినది. ఇవికాక తక్కినశబ్దముల కాసూత్రమున చెప్పిన లక్షణములు సరిపడినను రాదేశము రాదని తాత్పర్యము.

ఉదాహరణప్రదర్శనము : పృథోర్భావః-ప్రథిమా; పార్థవమ్, మ్రదిమా మార్దవమ్

వివ : 'ప్రథిమా' అనుదాని ప్రక్రియపైని చూపఁబడినది ఇమనిచ్ ప్రత్యయము రానిచో 'అణ్' ప్రత్యయము ఇగన్తాచ్చలఘుపూర్వాత్ అనుసూత్రముచే వచ్చును. (లఘుపూర్వకమైన ఇగ్వర్ణము అంతమునఁగల శబ్దముయొక్క షష్ఠ్యంతమునకు భావకర్మార్థములయందు అణ్ ప్రత్యయము వచ్చును) పృథు + ఙస్ + అణ్, విభక్తిలోపము, ఆదివృద్ధి పార్థు + అ, ఓర్గుణః, పార్థో + అ, అవాదేశము, పార్థ + వ + సు = పార్థవమ్.

ఇట్లే మృదోర్భావః - మృదువుయొక్కభావము; మృదు + ఙస్ + ఇమనిచ్, విభక్తిలోపము, 'ర' ఆదేశము, టిలోపము మ్రదిమన్ + సు = మ్రదిమా, అణ్ వచ్చినచో మృదు + ఙస్, అణ్, మృదు + అణ్, మార్దు + అ, మార్దో + అ, మార్దవ్ + అ = మార్దవ + సు = మార్దవమ్.

వీనికి త్వతల్ ప్రత్యయములును వచ్చును. పృథుత్వమ్, పృథుతా, మృదుత్వమ్, మృదుతా ఇత్యాదులు.

పృథ్వాదిగణము : పృథు మృదు మహత్ పటు తను లఘు బహు సాధు ఆశు ఉరు గురు బహుల ఖణ్డ దణ్డ అకిఞ్చన బాల హోడ పాక వత్స మన్ద స్వాదు హ్రస్వ దీర్ఘ ప్రియ వృష ఋజు క్షిప్ర క్షుద్ర అణు - ఇతి పృథ్వాదిః

సూ : వర్ణదృఢాదిభ్యః ష్యఞ్ చ 5-1-123.

వృ : చాదిమనిచ్. శౌక్ల్యమ్. శుక్లిమా, దార్ఢ్యమ్, ద్రఢిమా

ప ని : వర్ణదృఢాదిభ్యః (5-3) ష్యఞ్ (1-1) చ (అవ్య).

అను తస్య (6-1) భావః (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : వర్ణవాచకషష్ఠ్యంతములకును, దృఢాదిప్రకృతిక షష్ఠ్యంతములకును వరుసగా భావార్థమున ష్యఞ్ ప్రత్యయముకూడ వచ్చును కూడ యనుటచే ఇమనిచ్ ప్రత్యయమును వచ్చును. ఉదా : శౌక్ల్యమ్ ఇత్యాది

వివ : శుక్ల, నీల మున్నగు రంగులను తెలుపు పదముల షష్ఠ్యంతములకును, దృఢమున్నగువాని షష్ఠ్యంతములకును భావార్థమున ష్యఞ్, ఇమనిచ్ ప్రత్యయములు వచ్చును ష్యఞ్ ప్రత్యయములో షకార ఞకారము లిత్తులు. (షః ప్రత్యయస్య, హలన్త్యమ్.)

ఉదా : శుక్లస్యభావః - శుక్లముయొక్క భావము, (శుక్లము వర్ణవాచకము) శుక్ల + ఙస్, ష్యఞ్, విభక్తిలోపము, శుక్ల + (ష్) య (ఞ్) ఆదివృద్ధి, అకార లోపము, శౌక్ల్ + య=శౌక్ల్య + సు=శౌక్ల్యమ్. ఇమనిచ్ ప్రత్యయము వచ్చి నచో శుక్ల + ఇమన్ (ఇచ్) చేః, టిలోపము శుక్ల్ + ఇమన్=శుక్లిమన్+సు= శుక్లిమా.

దృఢస్యభావః దృఢముయొక్కభావము, దృఢ + ష్యఞ్, ఆదివృద్ధి (ఋ> అర్) దార్ ఢ + య, యస్యేతిచ అకారలోపము, దార్ఢ్ య=దార్ఢ్య + సు=దార్ఢ్యమ్. ఇమనిచ్ ప్రత్యయము వచ్చినచో దృఢ + ఇమన్, ర-ఆదేశము ద్రఢ + ఇమన్, టిలోపము ద్రఢిమన్ + సు=ద్రఢిమా.

దృఢాదిగణము : దృఢ వృఢ పరివృఢ భృశ కృశ [వక్ర] శుక్ర చుక్ర ఆమ్ర [కృష్ట] లవణ తామ్ర శీత ఉష్ణ జడ బధిర పణ్డిత మధుర మూర్ఖ మూక. 'వేర్యాతలాభ మతిమనః శారదానామ్' 101. 'సమామతి మనసోః' 102. జవన.. ఇతి దృఢాదిః.

సూ : గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణిచ 5-1-124.

వృ : చాద్భావే. జడస్యభావః కర్మవాజాడ్యమ్; మౌఢ్యమ్. బ్రాహ్మణ్యమ్. ఆకృతిగణోఽయమ్.

ప వి : గుణవచన బ్రాహ్మణాదిభ్యః (5-3) కర్మణి (7-1) చ (అవ్య).

అను : ష్యఞ్ (1-1) తస్య (6-1) భావః (1-1) సమర్థానాంప్రథమాద్వా

అర్థ : గుణవాచకశబ్దములకును, బ్రాహ్మణాదులకును ఆతనిభావము, కర్మము అనునర్థములందు ష్యఞ్ ప్రత్యయము వచ్చును. ఉదా . జాడ్యమ్ ఇత్యాది.

వివ : గుణమును వచించునవి గుణవచనములు షష్ఠ్యంతములగువానికిని, బ్రాహ్మణాదులకును, వానియొక్క భావములేక ఆతనియొక్క కర్మము (ఆతడు చేయుపని) అనునర్థమునందు ష్యఞ్ ప్రత్యయము వచ్చును 'ఆచత్వాత్' అను సూత్రముచే భావమున త్వతల్ ప్రత్యయములును వచ్చును. ఉదా : జడస్యభావః కర్మవా, జడునియొక్క భావము లేక కర్మము జడ + ఙస్ + ష్యఞ్, విభక్తి లోపము, ఆదివృద్ధి జాడ + య (షకారఞకారములిత్తులు) అకారలోపము (యస్యేతిచ) జాడ్ + య=జాడ్య + సు=జాడ్యమ్ (జడ శబ్దము గుణమును జెప్పును).

మూఢస్యభావః కర్మవా, మూఢునియొక్క భావము లేక కర్మము, మూఢ + ఙస్, ష్యఞ్, మూఢ + ష్యఞ్, మౌఢ + య, మౌఢ్ + య=మౌఢ్య + సు=మౌఢ్యమ్.

బ్రాహ్మణాదుల కుదాహరణము - బ్రాహ్మణస్యభావః కర్మవా, బ్రాహ్మణుని భావము లేక కర్మము, బ్రాహ్మణ + ఙస్, ష్యఞ్, విభక్తిలోపము, ఆది వృద్ధి (అ> ఆ) అకారలోపము బ్రాహ్మణ్య + సు=బ్రాహ్మణ్యమ్.

పై వానికన్నింటికి భావార్థమున త్వతల్ ప్రత్యయములు వచ్చినచో జడత్వం జడతా, మూఢత్వమ్, మూఢతా, బ్రాహ్మణత్వమ్, బ్రాహ్మణతా అనురూపము లేర్పడును.

బ్రాహ్మణాదిగణము : బ్రాహ్మణ బాడబ మాణవ ('అర్హతోనుమ్చ' 103) చోర ధూర్త ఆరాధయ విరాధయ అపరాధయ ఉపరాధయ ఏకభావ ద్విభావ త్రిభావ అన్యభావ అక్షేత్రజ్ఞ సంవాదిన్ సంవేశిన్ సంభాషిన్ బహుభాషిన్

ర్షఘాతిన్ విఘాతిన్ సమస్థ విషమస్థ పరిమస్థ మధ్యమస్థ అనీశ్వర కుశల చపల నిపుణ పిశున కుతూహల క్షేత్రజ్ఞ నిశ్న బాలిశ అలస దుఃపురుష కాపురుష రాజన్ గణపతి అధిపతి గడుల దాయాద విశస్తి విషమ విపాత నిపాత. 'సర్వవేదాదిభ్యః స్వార్థే' 104 'చతుర్వేదస్యోభయ పదవృద్ధిశ్చ' 105. శౌటీర - ఆకృతిగణో౽యమ్ ఇతి బ్రాహ్మణాదిః.

సూ : సఖ్యుర్యః 5-1-126.

వృ : సఖ్యమ్

ప వి : సఖ్యుః (5-1) యః (1-1).

అను : సమర్థానామిత్యాది, తస్య (6-1) భావః (1-1) కర్మ (1-1).

అర్థ : సఖిశబ్దమునకు వానిభావము లేక కర్మము అనునర్థమున 'య' అను ప్రత్యయము వచ్చును. ఉదా : సఖ్యమ్

వివ : సఖ్యుఃభావః కర్మవా, సఖియొక్క భావము లేక కర్మము అనునర్థమున 'య' అను ప్రత్యయము వచ్చును సఖి + ఙస్ + య, విభక్తిలోపము, ఇకార లోపము, సఖ్ + య = సఖ్య + సు = సఖ్యమ్.

సూ : కపిజ్ఞాత్యోర్ఢక్ 5-1-127.

వృ : కాపేయమ్, జ్ఞాతేయమ్.

ప వి : కపిజ్ఞాత్యోః (6-2) ఢక్ (1-1).

అను : తస్య (6-1) భావః (1-1) కర్మ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : దాని / వానిభావము లేక కర్మము అనునర్థమున కపి, జ్ఞాతిశబ్దముల షష్ఠ్యంతరూపములకు పరముగా 'ఢక్' ప్రత్యయము వచ్చును.

వివ . కపియొక్క భావము లేక కర్మము, జ్ఞాతియొక్క భావము లేక కర్మము అనునర్థమున కపిజ్ఞాతిశబ్దములకు ఢక్ ప్రత్యయము వచ్చును. కకారఇత్తు దానిచే నాదివృద్ధి యగును. ఢకారమునకు ఏయాదేశము.

కపేఃభావఃకర్మవా. కపి + ఙస్ + ఢక్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఏయ్ ఆదేశము, కాపి + ఏయ్, ఇకారలోపము, కాపేయ + సు = కాపేయమ్.

జ్ఞాతేఃభావః కర్మవా : జ్ఞాతి+ఙస్ + ఢక్, జ్ఞాతి+ఏయ, జ్ఞాత్+ఏయ= జ్ఞాతేయ + సు=జ్ఞాతేయమ్.

సూ : పత్యన్తపురోహితాదిభ్యో యక్ 5-1-128.

వృ : సైనాపత్యం; పౌరోహిత్యమ్.

ప. వి : పత్యన్తపురోహితాదిభ్యః (5-3) యక్.

అను : తస్య (6-1) భావః (1-1) కర్మ (1-1) సమర్థానామిత్యాది.

అర్థ : పతిశబ్దమంతమునఁగల శబ్దములకును, పురోహితాదిశబ్దములకు భావ కర్మార్థములందు 'యక్' ప్రత్యయము వచ్చును ఉదా : సైనాపత్యమ్ పౌరోహిత్యమ్

వివ : వానిభావము లేక కర్మము అనునర్థమున షష్ఠ్యంతములగుపతి శబ్దాంతములకును, పురోహితమున్నగు శబ్దములకును 'యక్' అను తద్ధిత ప్రత్యయము వచ్చును. ఇందు కకారమిత్తు. అగుటచే ఆదివృద్ధి వచ్చును

ఉదా : (1) పత్యంతశబ్దము : సేనాపతేః భావః కర్మవా-సేనాపతియొక్క భావము లేక కర్మము, సేనాపతి + ఙస్ + యక్, విభక్తిలోపము, ఆదివృద్ధి (కితిచ) సైనాపతి+య, యస్యేతిచ-ఇకారలోపము, సైనాపత్+య=సైనాపత్య+ సు=సైనాపత్యమ్.

ii పురోహితాది. పురోహితస్య భావః కర్మవా. పురోహితునిభావము లేక కర్మము, పురోహిత + ఙస్ + యక్, పురోహిత + యక్, పౌరోహిత + య, పౌరోహిత్ + య=పౌరోహిత్య+సు=పౌరోహిత్యమ్.

పురోహితాదిగణము : పురోహిత, 'రాజా౽సే' 106. గ్రామిక పిణ్డిక సుహిత బాలమన్ద (బాల మన్ద) ఖణ్డిక దణ్డిక వర్మిక కర్మిక ధర్మిక శీలిక (సూతిక మూలిక తిలక) అఞ్జలిక (అన్తలిక) [రూపిక ఋషిక] పుత్రిక అవిక ఛత్రిక పర్షిక పథిక చర్మిక (ప్రతిక) సారథి ఆస్తిక సూచిక సంరక్షసూచక (సంరక్ష సూచక) నాస్తిక [అజానిక శాక్వర నాగర చూడిక] ఇతి పురోహితాదిః.

ఇదినఞ్స్నఞధికారప్రకరణము.

ప్రకరణావలోకనము : ఇందు వతిప్రత్యయము దానితోతుల్యము, దానియందువలె, దానివలె అనునర్థములందు క్రమముగా తృతీయా, సప్తమీ షష్ఠ్యంతసమర్థములకు విధింపఁబడినది భావార్థమున త్వతల్ ప్రత్యయములును, ఇమనిచ్ ష్యఞ్ ప్రత్యయములును విధింపఁబడినవి ఇందు మొదటి రెండును సాధారణప్రత్యయములు. తరువాతిరెండును విశేషప్రత్యయములు ష్యఞ్ ప్రత్యయమును, య, ఢక్, యక్ ప్రత్యయములను గుణవచనాదులకు భావార్థముతోపాటు కర్మార్థమునందు కూడ వచ్చును. ఈ భావకర్మార్థములందు విధింపఁబడిన ప్రత్యయములు షష్ఠ్యంత సమర్థములకు పరముగా వచ్చును. ఇందు 'ఆ చ త్వాత్' అనునది త్వతల్ ప్రత్యయముల అధికారమును జెప్పును. ర ఋతో హలాదేర్లఘోః, టేః అనునవి ఇమనిచ్ప్రత్యయ పరత్వమున నగు కార్యవిశేషములను దెలుపునవి.

# అథ పాఞ్చమిక ప్రకరణమ్

అవ : ఇందు భవనాద్యర్థమునందు ప్రత్యయములు విధింపఁబడుచున్నవి. 'నఞ్ స్నఞ్' ప్రత్యయముల అధికారము ఇంతవఱకే కావున నిటుపైఁ జెప్పఁబడు నర్థములందు స్త్రీపుంస్ శబ్దముల కాప్రత్యయములు చేరవు.

సూ : ధాన్యానాం భవనే క్షేత్రే ఖఞ్ 5-2-1.

వృ : ముద్గానాం భవనం క్షేత్రం మౌద్గీనమ్

ప వి : ధాన్యానామ్ (6-3) భవనే (7-1) క్షేత్రే (7-1) ఖఞ్ (1-1)

అను : తస్య (6-1) సపర్థానామిత్యాది

అర్థ : ధాన్యములయొక్క ఉత్పత్తిస్థానమైన క్షేత్రము అనునర్థమున ధాన్యవాచక షష్ఠ్యంతములకు ఖఞ్ ప్రత్యయము వచ్చును ఉదా : ముద్గానాం భవనం క్షేత్రమ్ - మౌద్గీనమ్.

వివ : ధాన్యములనగా వడ్లు, గోధుమలు, పెసలుమున్నగునవి భవనమనగా ఉత్పత్తిస్థానము క్షేత్రమనగా పంటపొలము ధాన్యములయొక్క ఉత్పత్తిస్థానమగు పంటపొలము ప్రత్యయాంతముచే వాచ్యమగునపుడు ధాన్యవాచక షష్ఠ్యంతములకు పరముగా ఖఞ్ ప్రత్యయము చేరును. భవనశబ్దమునకు ఇల్లుమున్నగు నర్థమును, క్షేత్రశబ్దమునకు పుణ్యస్థలమున్నగు నర్థమును వేఱుగా నుండుటవలన నా యర్థములందలివి గ్రహింపకుండుటకై సూత్రమున రెండుపదములును గ్రహింపఁబడినవి. ప్రత్యయమునందు ఞకారమిత్తు. దానివలన ఆదివృద్ధివచ్చును. ఖకారమునకు 'ఈన్' ఆదేశము (ఆయనేయీనీ....)

ఉదా : ముద్గానాం భవనం క్షేత్రమ్ - పెసలు పండుపొలము, ముద్గ + ఆమ్, ఖఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, ఈనాదేశము మౌద్గ + ఈన, అకారలోపము, మౌద్గ్ + ఈన = మౌద్గీన + సు = మౌద్గీనమ్.

సూ : వ్రీహిశాల్యోర్ఢక్ 5-2-2.

వృ : వ్రైహేయమ్, శాలేయమ్.

ప. వి : వ్రీహిశాల్యోః (6-2) ఢక్ (1-1).

అను : ధాన్యానామ్ (6-3) భవనే (7-1) క్షేత్రే (7-1) సపర్థానామిత్యాది.

అర్థ : వ్రీహి శాలిశబ్దములకు, వానిభవనమైన క్షేత్రము అనునర్థమున ఢక్ ప్రత్యయము వచ్చును వ్రైహేయమ్, శాలేయమ్.

వివ : వ్రీహి, శాలి అనునవియు ధాన్యవాచక శబ్దములే వీనికి పైసూత్రముచే ప్రాప్తించు ఖఞ్ ప్రత్యయమున కపవాదముగా దీనిచే ఢక్ ప్రత్యయము విధింపఁబడినది కకారమిత్తు ఢకారమునకు 'ఏయ్' ఆదేశము వచ్చును.

ఉదా : వ్రీహీణాం భవనంక్షేత్రమ్ - వ్రీహులకు (వడ్లకు) ఉత్పత్తిస్థానమగు క్షేత్రము వ్రీహి + ఆమ్ + ఢక్, విభక్తిలోపము, ఆదివృద్ధి (ఈ < ఐ) ఏయ్ ఆదేశము(ఢ్ = ఏయ్+అ = ఏయ),ఇకారలోపము, వ్రైహేయ + సు = వ్రైహేయమ్.

శాలీనాంభవనం క్షేత్రమ్ = శాలిధాన్యమునకు ఉత్పత్తిస్థానమగు క్షేత్రము శాలి+ఆమ్, ఢక్, ఆదివృద్ధ్యాదులు, శాలేయ+సు=శాలేయమ్

**సూ : హైయఙ్గవీనం సంజ్ఞాయామ్ 5-2-23.**

**వృ : నవనీతే నిపాతితోఽయమ్.**

ప. వి : హైయఙ్గవీనమ్ (1-1) సంజ్ఞాయామ్ (7-1).

అర్థ హైయఙ్గవీన శబ్దము సంజ్ఞయందగును ఇది నవనీతము అనునర్థమున నిపతింపఁబడిన సంజ్ఞ

వివ : 'హ్యోగోదోహముయొక్క వికారము' అనునర్థమున సంజ్ఞగమ్యమానమగునపుడు ఖఞ్ ప్రత్యయమును, ప్రకృతికి 'హియఙ్గు' అను నాదేశమును ఈ సూత్రముచే నిపతింపఁబడినవి. హ్యోగోదోహమనగా 'నిన్నపిదికిన ఆవుపాలు' అనియర్థము. హ్యః = నిన్న; దోహః=పిదుకఁ బడినది హియఙ్గు + ఖఞ్, ఆదివృద్ధి, హైయఙ్గు + ఈన, ఓర్గుణః, హైయఙ్గో + ఈన, అవాదేశము హైయఙ్గవీన + సు=హైయఙ్గవీనమ్ నిన్న పిదికిన ఆవుపాలనుండి తీయఁబడిన వెన్న అనునర్థమున నిదిసంజ్ఞ.

**సూ : తదస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్ 5-2-36.**

**వృ : తారకా స్సంజాతా అస్యతారకితం నభః; పణ్డితః. ఆకృతిగణోఽయమ్.**

**ప. వి : తత్ (1-1) అస్య (6-1) సంజాతమ్ (1-1) తారకాదిభ్యః (5-3) ఇతచ్ (1-1).**

అను : సమర్థానామిత్యాది.

అర్థ : 'అది దీనికి పుట్టినది' అనునర్థమున ప్రథమాంతములగు తారకాది శబ్దములకు 'ఇతచ్' ప్రత్యయము వచ్చును. ఉదా : తారకితం నభః, పణ్డితః–ఇది ఆకృతిగణము.

వివ : ప్రథమాంతములగు తారకాది శబ్దములకు, అవి దేనికి పుట్టినవో దానిని తెలియఁజేయుచు, ఇతచ్ ప్రత్యయము చేరును. సూత్రమునందలి 'తత్' పదము సమర్థములలో ప్రథమమైనది ప్రథమాంతమగుటను సూచించును. ప్రత్యయము నందలి చకారమిత్తు.

ఉదా : తారకాః సంజాతా అస్య – నక్షత్రములు దీనికి (దీనియందు) పుట్టినవి తారకా + జస్, ఇతచ్, విభక్తిలోపము, యస్యేతిచ–అకారలోపము, తారక్ + ఇత = తారకిత + సు = తారకితమ్, నభః – నక్షత్రములుగల ఆకాశము.

పణ్డా అస్య సంజాతా – వివేకము ఇతనికి కలిగినది పణ్డా + సు + ఇతచ్, విభక్తిలోపము, అకారలోపము, పణ్డ్ + ఇత = పణ్డిత + సు = పణ్డితః.

**తారకాదిగణము** : తారకా పుష్ప కర్ణిక మఞ్జరీ ఋజీష [క్షణ సూచ] మూత్ర నిష్క్రమణ పురీష ఉచ్చార ప్రచార (విచార) కుడ్మలిత కణ్టక ముసల (ముకుల) కుసుమ కుతూహల స్తబక (స్తపక) కిసలయ పల్లవ (ఖణ్డ) వేగ నిద్రా ముద్రా బుభుక్షా (ధేనుష్యా) పిపాసా శ్రద్ధా అభ్ర పులక అఙ్గారక వర్ణక ద్రోహ దోహ సుఖ దుఃఖ ఉత్కణ్ఠా భర వ్యాధి వర్మన్ వ్రణ గౌరవ శాస్త్ర తరఙ్గ తిలక చన్ద్రిక అన్ధకార గర్వ కుమురు (ముకుర) హర్ష ఉత్కర్ష (రణ) కువలయ గర్ధ క్షుధ్ సీమన్త జ్వర గర రోగ రోమాఞ్చ పణ్డా కజ్జల తృష్ కోరక కల్లోల స్థపుట ఫల కఞ్చుక శృఙ్గార అఙ్కుర శైవల వకుల శ్వభ్ర ఆరాల కలఙ్క కర్దమ (కన్దల) మూర్ఛా అఙ్గార హస్తక ప్రతిబింబ విఘ్నతన్త్ర ప్రత్యయ దీక్షా గర్జ 'గర్భాద్ప్రాణిని' III. ఇతితారకాదిః ఆకృతిగణః.

సూ : ప్రమాణే ద్వయసజ్దఘ్నఞ్మాత్రచః 5-2-37.

వృ : ఊరూ ప్రమాణమస్య ఊరుద్వయసమ్, ఊరుదఘ్నమ్; ఊరుమాత్రమ్

ప వి : ప్రమాణే (7-1) ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచః (1-3).

అను : తత్ (1-1) అస్య (6-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'ఇది దీనికి ప్రమాణము' అనునర్థమున ప్రథమాంతములకు ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్ అను ప్రత్యయములు వచ్చును.

వివ : ప్రమాణమనగా ప్రమను గలిగించునది. 'ప్రమ' అనగా ఒకదానికి సంబంధించిన నిశ్చయజ్ఞానము. ఈ సూత్రమున మాత్రము ప్రమాణశబ్దమునకు 'కొలత' అని అర్థము. కొలతను తెలియఁజేయు ప్రథమాంతపదములకు పరముగా, దేని కొలత తెలుపఁబడునో దానిని తెలుపుచు, ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్ ప్రత్యయములు పర్యాయముగా వచ్చును.

ఉదా : ఊరూ ప్రమాణమస్య - ౘొదలలోతుగలది, ఊరు + ఔ + , ద్వయ స(చ్) దఘ్న(చ్) మాత్ర (చ్) - విభక్తిలోపము, ఊరుద్వయస + సు = ఊరుద్వయసమ్, ఊరుదఘ్నమ్, ఊరుమాత్రమ్.

## సూ : యత్తదేతేభ్యః పరిమాణే వతుప్ 5-2-39.

## వృ : యత్పరిమాణమస్య యావాన్, తావాన్, ఏతావాన్.

ప. వి : యత్తదేతేభ్యః (5-3) పరిమాణే (7-1) వతుప్ (1-1).

అను : తత్ (1-1) అస్య (6-1) సమర్థానామిత్యాది.

అర్థ : ప్రథమాంతములగు యద్, తద్, ఏతద్ అనువానికి పరిమాణార్థమున వతుప్' ప్రత్యయము వచ్చును. ఉదా : యావాన్ ఇత్యాది.

వివ : ఎంత పరిమాణముగలది(యో), అంత పరిమాణముగలది, ఇంత పరిమాణముగలది అనునర్థములను వ్యక్తము చేయుచు ప్రథమాంతములగు యద్, తద్, ఏతద్ శబ్దములకు వతుప్ ప్రత్యయము వచ్చును. ప్రమాణశబ్దము పొడవుయొక్క కొలఁత అనునర్థమునందు మాత్రమే ప్రయోగింతురు. పరిమాణశబ్దము వైశాల్యము, ఘనము, ద్రవ్యము మున్నగువానికొలఁతలకు వ్యవహరింతురు. ప్రత్యయమున ఉకారపకారము లిత్తులు.

ఉదా : యత్పరిమాణమస్య - ఏది దీనికి పరిమాణమో, యద్ + సు + వతుప్, విభక్తిలోపము, 'యద్ + వత్' అనియుండ, ఆసర్వనామ్నః 6-3-91 (సర్వనామమునకు, దృక్, దృశ, వతు అనునవి పరములగునపుడు ఆకారమంతాదేశమగును) అను సూత్రముచే దకారమునకు ఆకారాదేశము. య + ఆ వత్, సవర్ణదీర్ఘసంధి, యావత్ + సు = యావాన్ = ఎంత (యో).

తత్ పరిమాణమస్య-అది దీనికి పరిమాణము తద్+సు+వతుప్ సు-లోపము, ఆకారాదేశము, సంధి తావత్ + సు=తావాన్-అంత

ఏతత్ పరిమాణమస్య - ఇది దీనికి పరిమాణము - ఏతద్ + సు+వతుప్, విభక్తిలోపము, ఆకారాదేశము, సంధి, ఏత · అవత్, ఏతావత్ + సు=ఏతావాన్ = ఇంత.

సూ : సంఖ్యాయా అవయవే తయప్ 5-2-42.

వృ · పఞ్చ అవయవా అస్య పఞ్చతయమ్.

ప. వి : సంఖ్యాయాః (5-1) అవయవే (7-1) తయప్ (1-1).

అను : తత్ (1-1) అస్య (6-1) సమర్థానామిత్యాది

అర్థ : ప్రథమాంతములగు సంఖ్యావాచకములకు, అన్ని అవయవములు గలది అనునర్థమున 'తయప్' ప్రత్యయము చేరును. ఉదా పఞ్చతయమ్

వివ : ప్రథమాంతములైన సంఖ్యావాచకశబ్దములకు 'ఆ సంఖ్యగల అవయవములు గలది' అనునర్థమును తెలుపుచు, తయప్' అను ప్రత్యయము వచ్చును ఇందు వివర్ణమిత్తు.

ఉదా : పఞ్చ అవయవా అస్య - అయిదు అవయవములు దీనికి గలవు. పఞ్చన్ + జస్ + తయప్, విభక్తిలోపము, నకారలోపము (నలోపః ప్రాతిపదికాన్తస్య) పఞ్చతయ · సు=పఞ్చతయమ్

సూ . ద్విత్రిభ్యాం తయస్యాయజ్వా 5-2-43.

వృ : ద్వయమ్ - ద్వితయమ్; త్రయమ్ - త్రితయమ్.

ప. వి : ద్విత్రిభ్యామ్ (5-2) తయస్య (6-1) అయచ్ (1-1) వా (అవ్య)

అర్థ : ద్వి, త్రి అనుశబ్దములకు పరమగానున్న తయప్ ప్రత్యయము స్థానమున 'అయచ్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చును.

ఉదా : ద్వయమ్-ద్వితయమ్: త్రయమ్-త్రితయమ్.

వివ : ద్విత్రి అను సంఖ్యావాచకశబ్దములకు అన్ని అవయవములు గలది అనునర్థమున వచ్చిన తయప్ ప్రత్యయమును తొలిగించి 'అయచ్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చును.

ఉదా : ద్వౌ అవయవౌ అస్య - రెండవయవములు దీనికిఁ గలవు-ద్వి + ఔ+తయప్, విభక్తిలోపము, 'అయచ్' ఆదేశము (చకారమిత్తు) ద్వి+అయ, యస్యేతిచ-ఇకారలోపము, ద్వ్+అయ=ద్వయ+సు=ద్వయమ్ అయజాదేశము రానిచో, ద్వితయ + సు'ద్వితయమ్' అనియగును.

త్రయోఽవయవా అస్య - మూఁడు అవయవములు దీనికిఁ గలవు-త్రి + జస్, తయప్, విభక్తిలోపము, అయజాదేశము, త్రి + అయ, ఇకారలోపము త్ర్ + అయ=త్రయ+సు=త్రయమ్, రానిచో త్రితయమ్.

సూ : ఉభాదుదాత్తో నిత్యమ్ 5-2-44.

వృ : ఉభయమ్.

ప వి : ఉభాత్ (5-1) ఉదాత్తః (1-1) నిత్యమ్ (2-1).

అను : తయస్య (6-1) అయచ్ (1-1).

అర్థ : ఉభశబ్దమునకు పరముగానున్న 'తయప్' ప్రత్యయమునకు ఉదాత్త స్వరముగల అయజాదేశము నిత్యముగా నగును. ఉదా : ఉభయమ్.

వివ : ఉభశబ్దమునకు 'రెండు అవయవములుగలది' అనునర్థమున 'సంఖ్యాయా అవయవే తయప్' అను సూత్రముచే వచ్చిన తయప్ ప్రత్యయము నకు 'అయచ్' ఆదేశము నిత్యముగా నగును. ఆ ప్రత్యయము (అయచ్) ఆద్యు దాత్తమును అగును.

ఉదా : ఉభౌ అవయవౌ అస్య - రెండు అవయవములు దీనికిఁ గలవు. ఉభ + ఔ, తయప్, విభక్తిలోపము, 'అయ(చ్)' ఆదేశము, ఉభ + అయ అకార లోపము, ఉభయ + సు=ఉభయమ్.

## ఇది పాంచమిక ప్రకరణము

ప్రకరణావలోకనము : ధాన్యములకు ఉత్పత్తిస్థానమైన క్షేత్రము అను నర్థమున ఖఞ్ అను సాధారణప్రత్యయమును, 'ఢక్' అను విశేషప్రత్యయమును షష్ఠ్యంతప్రాతిపదికముల క్రింద విధింపఁబడినవి. హైయంగవీనశబ్దము నిపతింపఁబడినది. (1) అది దీనికి పుట్టినది, (2) అది దీనికి ప్రమాణము, (3) అది దీనికి పరిమాణము, (4) అన్ని అవయవములు దీనికిఁ గలవు అను

నర్థములందు (1) ఇతచ్, (2) ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్, (3) వతుప్ (4) తయప్ ప్రత్యయములు ప్రథమాంతములకు విధింపఁబడినవి. 'తయప్' ప్రత్యయము సంఖ్యావాచకములకు పరముగా వచ్చును. ద్విత్రిశబ్దములకు పరముగా నున్న 'తయప్' ప్రత్యయమునకు వైకల్పికముగాను, 'ఉభ' శబ్దమునకు పరముగానున్న దానికి నిత్యముగాను 'అయచ్' ప్రత్యయమాదేశముగా విధింపఁబడినది.

# అథ మత్వర్థీయ ప్రకరణమ్.

అవ : 'అది దీనికిఁగలదు, అది దీనియందుకలదు' అనునర్థములందు ప్రథమాంతములకు 'మతుప్' అను ప్రత్యయము వచ్చును. కావున మతుప్ ప్రత్యయము కలది, కలవాఁడు అనునర్థము గలది యగును. ఆయర్థమునందు విధింపఁబడిన ప్రత్యయములను ప్రధానముగ చెప్పు ప్రకరణమగుటచే దీనికి మత్వర్థీయ ప్రకరణమని పేరు. ఇందు ముందు పూరణార్థక ప్రత్యయములు కూడ చెప్పఁబడుచున్నవి.

సూ : తస్య పూరణే డట్ 5-2-48.

వృ : ఏకాదశానాం పూరణః ఏకాదశః.

ప. వి : తస్య (6-1) పూరణే (7-1) డట్ (1-1).

అను : సంఖ్యాయాః (5-1) సమర్థానామిత్యాది.

అర్థ : 'ఆ సంఖ్యను పూరించునది' అమనర్థమున సంఖ్యావాచకశబ్దములకు పరముగా 'డట్' ప్రత్యయము వచ్చును. ఉదా : ఏకాదశానాం పూరణః ఏకాదశః.

వివ : పూరణమనఁగా పూరించునది. లెక్కింపఁబడు వస్తువులలెక్కను తెలుపు సంఖ్యావాచక షష్ఠ్యంతమునకు, 'ఆ సంఖ్యను పూరించునది' అనునర్థమున 'డట్' ప్రత్యయము వచ్చును. ఉదా : ఏకాదశానాం పూరణః, ఏకాదశన్ + ఆమ్, డట్. విభక్తిలోపము. డట్ ప్రత్యయమున డకారటకారము లిత్తులు. (చుటూ, హలన్త్యమ్) 'టేః' అనుసూత్రముచే టి సంజ్ఞకమగు 'అన్' అనుదానికి లోపము, ఏకాదశ్+అ=ఏకాదశ+సు = ఏకాదశః. పదునొకండవది 'ఏదిలేనిచో 'పదునొకఁడు' అను సంఖ్య పూరింపఁబడదో అది' అని తాత్పర్యము. తెలుఁగున నీయర్థమున 'అవ' అనునది వచ్చును. పూరణార్థమున ఏక శబ్దమునకు ప్రత్యయము రాదు. ఏకత్వమును పూరించుట యుండదుగదా!

సూ : నాన్తాదసంఖ్యాదేర్మట్ 5-2-49.

వృ : మడాగమః పఞ్చానాం పూరణః పఞ్చమః. నాన్తాత్ కిమ్? వింశః.

ప. వి : నాన్తాత్ (5-1) అసంఖ్యాదేః (5-1) మట్ (1-1).

అను : డట్ (1-1).

అర్థ : సంఖ్యావాచకము ఆదియందులేని నకారాంతమగు సంఖ్యావాచకమునకు పరముగానున్న డట్ ప్రత్యయమునకు 'మట్' అనునాగమము వచ్చును. ఉదా : పఞ్చమః, 'నాన్తాత్' అనుటవలన 'వింశః' అనుచోట మట్ ఆగమము లేదు.

వివ : సంఖ్యావాచకము పూర్వపదముగా లేనిదియు, నకారము అంతమునఁ గలదియు నగు సంఖ్యావాచకశబ్దమునకు పరముగా, పూరణార్థమునఁ జేరిన 'డట్' ప్రత్యయమునకు 'మట్' అనునాగమము వచ్చును. ఇందు టకారమిత్తు. అకార ముచ్చారణార్థకము. ఉదా : పఞ్చానాం పూరణః అయిదింటియొక్క పూరణము. పఞ్చన్ + ఆమ్, డట్, విభక్తిలోపము. పఞ్చన్ + అ, మట్ ఆగమము టిత్తుగావున డట్ ప్రత్యయమునకు పూర్వావయవముగా వచ్చును పఞ్చన్+మ్+అ, 'నలోపః ప్రాతిపదికాన్తస్య' – నకారలోపము, పఞ్చమ + సు = 'పఞ్చమః' – అయిదవవాఁడు.

ఈ మడాగమము నకారాంత సంఖ్యావాచకములకే విధింపఁబడినది. కావున వింశతి శబ్దమున కిదిరాదు. వింశతేః పూరణః – వింశతి + ఙస్+డట్, విభక్తి లోపము

తరువాతి కార్యము నీక్రింది సూత్రము విధించుచున్నది.

సూ : తి వింశతేర్డితి 6-4-142.

వృ : వింశతే ర్భస్య తిశబ్దస్య లోపో డితి పరే. వింశః.

ప. వి : తి (షష్ఠిలోపించినపదము) వింశతేః (6-1) డితి (7-1).

అను : భస్య (6-1) లోపః (1-1).

అర్థ : భసంజ్ఞకమగు 'వింశతి' శబ్దముయొక్క తిశబ్దమునకు, డిత్తుపరమగు నపుడు లోపము వచ్చును. ఉదా : వింశః.

వివ : డట్ ప్రత్యయము పరముగా నుండుటచే 'వింశతి' శబ్దమునకు భసంజ్ఞ కలుగును. దానియొక్క 'తి' అనుభాగమునకు డకారమిత్తుగాఁగల (డట్) ప్రత్యయము పరమగునపుడు లోపము వచ్చును.

ఉదా : వింశతి + అ = వింశ + అ, 'అతోగుణే' అనుసూత్రముచే పరరూప మేకాదేశమై 'వింశ' అగును. వింశ + సు = వింశః – ఇరువదవవాఁడు ఇరువదవది.

అవ : నాన్తాదిత్యాది సూత్రమున 'అసంఖ్యాదేః' అనుపదమునకు సార్థక్య మును చూపుచున్నారు.

వృ : అసంఖ్యాదేః కిమ్? ఏకాదశః.

వివ : మడాగమము సంఖ్యావాచకము పూర్వపదముగాఁ గలనకారాంతసంఖ్యా వాచకమునకు పరముగానున్నడట్ ప్రత్యయమునకు రాదు. ఉదా : ఏకాదశన్ - ఇందు నకారాంత సంఖ్యావాచకము 'దశన్' అనునది దానికి 'ఏక' అను సంఖ్యా వాచకము పూర్వమువఁ గలదు. ఏకాదశన్ + డట్ - ఏకాదశః (ఇట మడాగమము రాలేదు ).

సూ : షట్ కతి కతిపయ చతురాం థుక్ 5-2-51.

వృ : డటి. షణ్ణాం పూరణః. షష్ఠః, కతిథః. కతిపయశబ్దస్య అత ఏవ డట్, కతిపయథః, చతుర్థః;

ప వి : షట్ .... చతురామ్ (6-3) థుక్.

అను : డట్ (1-1).

అర్థ : డట్ ప్రత్యయము పరమగునపుడు షష్, కతి, కతిపయ, చతుర్ శబ్దములకు 'థుక్' అనునాగమము వచ్చును. ఉదా : షష్ఠః ఇత్యాది. కతిపయశబ్ద మున కీసూత్రముచేతనే డట్ ప్రత్యయ మగును. కతిపయథః. చతుర్థః.

వివ : అను వృత్తమైన 'డటి' అనుదానిని సప్తమ్యంతముగా మార్చుకొన వలయును. తస్మిన్నిత్యాదిసూత్రముచే అది పరమగునపు డనునర్థము వచ్చును. డట్ ప్రత్యయము పరమగునపుడు షష్, కతి, కతిపయ, చతుర్ అనుశబ్దములకు 'థుక్' అనునాగమము వచ్చును. ఇందు కకారమిత్తు. ఉకార ముచ్చారణార్థకము.

ఉదా : షణ్ణాం పూరణః - ఆఱింటిని పూరించునది. షష్ + ఆమ్, డట్, విభక్తిలోపము, ఇత్తులకు లోపము. షష్ + అ, ఆగమము కిత్తగుటచే 'షష్' అనుదానికి అంతావయవముగా వచ్చును. షష్థ్ + అ, ష్టుత్వము, షష్ఠ్ + అ=షష్ఠ + సు = షష్ఠః-ఆఱవది/ఆఱవవాఁడు.

కతి = ఎన్ని; 'బహుగణవతుడతి సంఖ్యా' (బహు, గణశబ్దములకు, వతు, డతి ప్రత్యయాంతములకును సంఖ్యాసంజ్ఞ కలుగును) అను సూత్రముచే సంఖ్యాసంజ్ఞ కలుగును. ఇది డతి ప్రత్యయాంతము (కిమ్ + డతి=కతి) 'కతీనాం,

పూరణః, ఎన్నిటియొక్క పూరణము కతి + ఆమ్, డట్, కతి + అ, ప్రకృత సూత్రముచే థుగాగమము, కతిథ్ + అ, కతిథ + సు = కతిథః.

కతిపయశబ్దము సంఖ్యావాచకము కాదు, కావున సంఖ్యావాచకములకు మాత్రమే విధింపఁబడిన డట్ ప్రత్యయము దీనికి పరముగా నుండుట కుదురదు. అది పరముగా నుండుటయే జరుగనిచో ఈథుక్ ఆగమము వచ్చుటయెట్లు? కావున నీసూత్రమున నీ పదముండుటనుబట్టియే సంఖ్యావాచకము కాకపోయినను 'కతిపయ' శబ్దమునకు 'డట్' ప్రత్యయము వచ్చుననుట జ్ఞాపితమైనది. కతిపయానాం పూరణః కతిపయ + ఆమ్, డట్, విభక్తిలోపము. థుగాగమము, కతిపయథ్ + అ = కతిపయథ + సు = కతిపయథః.

చతుర్ణాం పూరణః - నాల్గింటిని పూరించునది. చతుర్ + ఆమ్, డట్ చతుర్ + అ, థుక్ - చతుర్థ్ + అ = చతుర్థ + సు = చతుర్థః-నాల్గవది నాల్గవవాఁడు.

సూ : ద్వేస్తీయః 5-2-54.

వృ : డటోఽపవాదః. ద్వయోః పూరణో ద్వితీయః.

ప. వి : ద్వేః (6-2) తీయః (1-1)

అను : తస్య (6-1) పూరణే (1-1).

అర్థ : ద్విశబ్దమునకు పూరణార్థమున 'తీయ' ప్రత్యయము వచ్చును. ఇది 'డట్' ప్రత్యయమున కపవాదము. ఉదా : ద్వితీయః.

వివ : రెండు అనుసంఖ్యను పూరించునది అనునర్థమున షష్ఠ్యంతమగు 'ద్వి' శబ్దమునకు 'తీయ' అను ప్రత్యయము వచ్చును. 'తస్య పూరణేడట్' అను సూత్రముచే ప్రాప్తమగు డట్ ప్రత్యయమున కిది యపవాదము.

ఉదా : ద్వయోః పూరణః-రెంటిని పూరించునది, ద్వి + ఓస్, తీయ-విభక్తిలోపము. ద్వితీయ + సు = ద్వితీయః.

సూ : త్రేస్సంప్రసారణంచ 5-2-55.

వృ : తృతీయః.

ప. వి : త్రేః (6-1) సంప్రసారణమ్ (1-1) చ (అవ్య).

అను : తస్య (6-1) పూరణే (7-1) 'తీయః' (1-1).

అర్థ : 'త్రి' అను సంఖ్యావాచకమునకు పూరణార్థమున 'తీయ' ప్రత్యయము, అది వచ్చునపుడు సంప్రసారణము కలుగును. ఉదా : తృతీయః

వివ : షష్ఠ్యంతమగు త్రిశబ్దమునకు పూరణార్థమునందు 'తీయ' అను ప్రత్యయము వచ్చును. అది పరమగునపుడు 'త్రి' అనుదానికి సంప్రసారణము వచ్చును. అనగా అందలి రేఫమునకు ఋకారాదేశమగును. (సంప్రసారణమనగా యవరలలకు ఇ ఉ ఋ ౡ ఌ వచ్చుట).

ఉదా : త్రయాణాం పూరణః-మూడింటిని పూరించునది/వాడు త్రి +ఆమ్+ తీయ, విభక్తిలోపము, సంప్రసారణము త్ + ఋ + ఇ, సంప్రసారణాచ్చ అను సూత్రముచే ఋ ఇలకు పూర్వరూప మేకాదేశమగును. తృతీయ + సు = తృతీయః

ఇంతవఱకు సంఖ్యావాచకములకు చేరు పూరణార్థకప్రత్యయములు చెప్పఁబడినవి.

సూ : శ్రోత్రియంశ్ఛన్దోఽధీతే 5-2-84.

వృ : శ్రోత్రియః. వేత్యను వృత్తే శ్ఛాన్దసః.

ప వి : శ్రోత్రియన్ (1-1) ఛన్దః (2-1) అధీతే (క్రి. ప).

అను : సమర్థానా మిత్యాది.

అర్థ : 'ఛందస్సును అధ్యయనము చేయువాఁడు' అనునర్థమున ద్వితీయాంతమగు ఛందశ్శబ్దమునకు 'ఘన్' ప్రత్యయమును, ప్రకృతికి శ్రోత్రాదేశము నీ సూత్రముచే నిపతింపఁబడినవి. శ్రోత్రియః. 'వా' అనునది అనువృత్తమగుటచే 'ఛాందసః' అనియు నుండును.

వివ : 'ఛందః' అనగా వేదము. 'దానినధ్యయనము చేయువాఁడు' అనునర్థమున ద్వితీయాంతమగు 'ఛందస్' శబ్దమునకు ఘన్ ప్రత్యయమును, 'శ్రోత్ర' అను ఆదేశమును ఈ సూత్రముచే నిపతింపఁబడినవి.

ఉదా : ఛన్దః అధీతే - ఛన్దస్ + అమ్, ఘన్, విభక్తిలోపము, శ్రోత్ర ఆదేశము, శ్రోత్ర + ఘన్, ఘకారమునకు 'ఇయ్'ఆదేశము, (ఆయనేయీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్) శ్రోత్ర + ఇయన్, యస్యేతిచ-అకార లోపము. శ్రోత్ర్ + ఇయన్='శ్రోత్రియన్' - ఈనిపతింపఁబడిన ప్రాతిపదిక రూపమున నకారమిత్తు. శ్రోత్రియ+సు=శ్రోత్రియః.

'శావతిథంగ్రహణమితిలుగ్వా' (5-2-77) అనుసూత్రమునుండి మండూక ప్లుతితో వాశబ్దమిట కనువృత్తమగుటచే 'శ్రోత్రియః' అమరూపము పై కల్పికముగా నేర్పడునను నర్థము సిద్ధించును. కావున నిది కానిచో 'తదధీతే తద్వేద' అనుసూత్ర ముచే 'అణ్' ప్రత్యయము వచ్చును. ఛందస్ + అణ్, ఆదివృద్ధి, ఛాందస్ + అ = ఛాన్దస + సు = ఛాన్దసః. (కప్పదాటువలె నడుమ నొకసూత్రమునో, కొన్ని సూత్రములనో వదలి ఆవలిసూత్రమున కొకపదము చేరుటను ఇందు మండూక ప్లుతి యందురు.)

సూ : పూర్వాదినిః 5-2-89.

వృ : పూర్వం జ్ఞాత మనేన పూర్వీ.

ప. వి : పూర్వాత్ (5-1) ఇనిః (1-1).

అను : అనేన (3-1) సమర్థానామిత్యాది.

అర్థ : కర్తృవాచక తృతీయాంతముతో సంబంధముగల పూర్వశబ్దమునకు పర ముగా 'ఇని' ప్రత్యయము వచ్చును. ఉదా : పూర్వంజ్ఞాతమనేన పూర్వీ

వివ : అనువృత్తిగా వచ్చిన 'అనేన' అనునది కర్తను దెలుపు తృతీయాం తము. 'దేనికి కర్త' అను ప్రశ్నకు ఏదో ఒకక్రియావిశేషమునకు అను సమా ధానము వచ్చును. అక్రియ పూర్వము జరిగినది అనునర్థమున ప్రథమాంతమగు పూర్వశబ్దమునకు పరముగా 'ఇని' ప్రత్యయము వచ్చును. ఇందు తుదిఇకారము ఉచ్చారణార్థకము.

ఉదా : పూర్వం జ్ఞాతమనేన, పూర్వము వీనిచే తెలియఁబడినది. పూర్వ + సు = ఇన్, విభక్తిలోపము, అకారలోపము, పూర్విన్ + సు = పూర్వీ.

సూ : సపూర్వాచ్చ 5-2-87.

వృ : కృతపూర్వీ.

ప. వి : స పూర్వాత్ (5-1) చ (అవ్య).

అను : పూర్వాత్ (5-1) ఇనిః (1-1) సమర్థానామిత్యాది; అనేన (3-1)

అర్థ : సపూర్వమైన పూర్వశబ్దమునకును 'ఇని' ప్రత్యయము వచ్చును.

వివ : పై సూత్రమున వివరింపఁబడిన అర్థములో, పూర్వము మఱియొక శబ్దము గల పూర్వశబ్దమునకు 'ఇని' ప్రత్యయము వచ్చును.

ఉదా : కృతపూర్వమనేన=ఇతనిచే పూర్వము చేయఁబడినది. ఇచట పూర్వ శబ్దమునకు పూర్వము 'కృత' శబ్దము కలదు. కృతపూర్వ + ఇన్, కృతపూర్వ + ఇన్, అకారలోపము, కృతపూర్విన్ + సు=కృతపూర్వీ.

**సూ : ఇష్టాదిభ్యశ్చ 5-2-88.**

**వృ : ఇష్టమనేన ఇష్టీ, అధీతీ.**

ప. వి : ఇష్టాదిభ్యః (5-3) చ (అవ్య).

అను : ఇనిః (1-1) సమర్థానామిత్యాది; అనేన (3-1).

అర్థ : కర్తృవాచకమును దెలియఁజేయుచు 'ఇష్ట' మున్నగు వాని ప్రథమాంతములకు 'ఇని' ప్రత్యయము చేరును. ఉదా : ఇష్టీ, అధీతీ.

వివ: 'ఇష్టమ్ అనేన' - ఇతనిచే యజింపఁబడినది, (యజ్ ధాతువునకు 'క్త' ప్రత్యయముచేయగా 'ఇష్టమ్' అగును) ఇతనిచే చదువఁబడినది అనునర్థమునందు, కర్తను దెలుపుచు, ఇష్టాదిశబ్దముల ప్రథమాంతరూపములకు పరముగా 'ఇని' ప్రత్యయము వచ్చును.

ఇష్ట + అమ్+ఇన్; విభక్తిలోపము, అకారలోపము, ఇష్టిన్+సు = ఇష్టీ యజ్ఞముచేసినవాఁడు, అధీత + అమ్ + ఇన్,అధీత్ + ఇన్=అధీతిన్+సు=అధీతీ-అధ్యయనము చేసినవాఁడు.

**ఇష్టాదిగణము :** ఇష్ట పూర్త ఉపాసాదిత నిగదిత పరిగదిత (పరివాదిత) నికథిత నిషాదిత నిపతిత సంకలిత పరికలిత సంరక్షిత పరిరక్షిత అర్చిత గణిత అవకీర్ణ ఆయుక్త గృహీత ఆమ్నాత శ్రుత అధీత (అవధాన)ఆసేవిత అవధారిత అవకల్పిత నిరాకృత ఉపకృత ఉపాకృత అనుయుక్త అనుగణిత అనుపఠిత వ్యాకులిత - ఇతీష్టాదిః.

అవ : మతుప్ప్రత్యయము విధింపఁబడుచున్నది దీనియర్థమునందే మఱికొన్ని ప్రత్యయములును విధింపఁబడుచున్నవి.

**సూ : తదస్యాస్త్యస్మిన్నితి మతుప్ 5-2-94.**

**వృ : గావోఽస్యాస్మిన్వా సన్తి గోమాన్.**

ప. వి : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి, ప) అస్మిన్ (7-1) ఇతి (అవ్య) మతుప్ (1-1).

అను : సమర్థానా మిత్యాది.

అర్థ : ఇది దీనికి ఉన్నది, ఇది దీనియందున్నది అనునర్థములందు ప్రథమాంత ప్రాతిపదికములకు మతుప్ ప్రత్యయము చేరును. ఉదా : గోమాన్.

వివ : ఒక వస్తువు ఒకనికిఁగలదు, ఒకదానియందుఁ గలదు అనునర్థమునందు ఆ వస్తువుతో సంబంధముగల వ్యక్తిని, ఆ వస్తువున కాధారమైన దానిని తెలియఁజేయుచు వస్తువును వచించు ప్రథమాంతపదములకు పరముగా 'మతుప్' ప్రత్యయము చేరును. ఇందు పవర్ణమిత్తు - ఉకారముచ్చారణార్థకము. ప్రత్యయముగా మిగులునది 'మత్'.

ఉదా : గావః అస్య అస్మిన్ వాస న్తి - గోవులు ఇతనికి / దీనికి కలవు లేక దీనియందుఁగలవు-గో + జస్ + మతుప్, విభక్తిలోపము, గోమత్ + సు = గోమాన్ - గోవులు గలవ్యక్తి, గోవులధికముగాఁ గలనగరము మొ॥వి.

ఇట్టి యర్థమునే మత్వర్థమందురు. ఇచట కలది, కలవాఁడు అనుదానికి 'అధికముగా ఉన్న వ్యక్తి అని అర్థము. 'ధనవంతుఁడు' అన్నచో అధికముగా ధనము గలవాఁడు అనియే కాని ఏదో కొంచెము ధనమున్నవానిని ఆపదముచే వ్యవహరింపము. ఈ ప్రత్యయమును, ఈ యర్థమునందు విధింపఁబడు నితర ప్రత్యయములను ఏయే యర్థములను వ్యక్తముచేయునో యీ క్రింది శ్లోకము వివరించును.

శ్లో॥ భూమనిందా ప్రశంసాసు నిత్యయోగేఽతిశాయనే
సంసర్గేఽస్తి వివక్షాయాం భవన్తి మతుబాదయః (వా 3183).

భూమమనగా బహుత్వము = గోమాన్ - గోవులు బహుసంఖ్యలో కలవాఁడు, నింద = కకుదావ ర్తినీ కన్యా. కకుదము - మూపు, అందు సుడిగలది. అది నిందా పాత్రమైన విషయము. ప్రశంస = రూపవాన్ పురుషః - రూపవంతుఁడగు పురుషుఁడు - ప్రశంసింపఁ దగినరూపము గలవాఁడని యర్థము. నిత్యయోగము = ఎల్లపుడు దానితో కలయిక యుండుట - క్షీరిణోవృక్షాః - పాలుగల చెట్లు, ఆ చెట్లయందు పాలు ఎడతెగక యుండుననిభావము. అతిశయము-ఉదరిణీ కన్యా = అతిశయమగు ఉదరముగల కన్య. సంసర్గము=సంబంధము, దణ్డీ-దండముతో సంబంధముగల వ్యక్తి అని యర్థము. ఇట్లు మతుప్ మున్నగు ప్రత్యయములు, అస్తివివక్షయందు = కలది, కలవాఁడు అనునర్థమును చెప్పఁగోరినపుడు సాధారణముగా పైయర్థములయందు ఆయా ప్రకృతులకు చేరును.

అవ : మతుప్ప్రత్యయము చేరునపుడు కొన్నిటికగు కార్యవిశేషము తెలుపుటకై క్రింది సూత్రముచే అర్థవానికి భసంజ్ఞ విధింపఁబడుచున్నది.

సూ : తసౌ మత్వర్థే 1-4-19.

వృ : తాన్త సాన్తౌ భసంజ్ఞౌ మత్వర్థే ప్రత్యయే. సమ్ప్రసారణమ్. విదుష్మాన్.

ప వి : తసౌ (1-2) మత్వర్థే (7-1).

అను : భమ్ (1-1).

అర్థ : మత్వర్థ ప్రత్యయము పరమగునపుడు, తాన్త సాన్తములు భసంజ్ఞ కలవి యగును. అందువలన సంప్రసారణము. ఉదా : విదుష్మాన్.

వివ : 'మతుప్' ప్రత్యయమును, ఆ యర్థమున విధింపఁబడు నితర ప్రత్యయములును పరములగునపుడు తవర్గమును, సవర్గమును అంతమునఁగల శబ్దములకు భసంజ్ఞ కలుగును. సాధారణముగా యకారాదులును అజాదులును అగు స్వాది ప్రత్యయములు పరములగునపుడే భసంజ్ఞకలుగును మత్వర్థక ప్రత్యయములు కొన్ని అజాదులు కానిని పరములగునపుడును, తాంతసాంతములకు భసంజ్ఞ కలుగుటకై యీ సూత్రము చెప్పఁబడినది

విద్వాంసః సన్త్యస్మిన్ = 'విద్వాంసులిందుఁగలరు' అనునర్థమున ప్రథమాంతమగు విద్వచ్ఛబ్దమునకు 'తదస్యాస్త్యస్మిన్నితి మతుప్' అనుసూత్రముచే 'మతుప్' ప్రత్యయము. విద్వస్ + జస్ + మతుప్ విభక్తిలోపము. విద్వస్ + మత్, ప్రకృతసూత్రముచే సకారాంతమగు 'విద్వస్' అనుదానికి భసంజ్ఞ కలుగును. కలుగఁగా వసోః సంప్రసారణమ్ 6-4-131 ('వస్' అనునది అంతమునఁగల భసంజ్ఞకమునకు సంప్రసారణము వచ్చును) అను సూత్రముచే సంప్రసారణము వచ్చును. (వ్ > ఉ) విద్ ఉ అస్ - 'సంప్రసారణాచ్చ' అను సూత్రముచే ఉ+అ లకు పూర్వరూపమేకాదేశమగును. విదుస్ + మత్, ఆదేశప్రత్యయయోః (8-3-59) (ఇణ్ వర్ణములకును, కవర్గమునకును పరమునానున్న ఆదేశమును, ప్రత్యయావయవమును అగు సకారమునకు షకారమాదేశమగును) అను సూత్రముచే సకారమునకు షత్వము. విదుష్మత్ + సు=విదుష్మాన్ - విద్వాంసులు గలదేశము మున్నది.

వా॥ గుణవచనేభ్యో మతుపో లుగిష్టః (3185).

వృ : శుక్లోగుణోఽస్యాస్తీతి శుక్లః పటః, కృష్ణః.

ప. వి : గుణవచనేభ్యః (5-3) మతుపః (6-1) లుక్ (1-1) ఇష్టః (1-1).

అర్థ : గుణవాచకశబ్దములకు పరముగానున్న మతుప్ ప్రత్యయమునకు లుక్కు వచ్చుట ఇష్టము.

వివ : శుక్లత్వము, కృష్ణత్వము మున్నగు గుణములను వచించు శుక్ల, కృష్ణ అనువానికి పరముగా 'అది కలదు' అనునర్థమున చేరిన 'మతుప్' ప్రత్యయమునకు లుక్కు వచ్చును.

ఉదా : శుక్లః అస్య అస్తి-తెలుపు వీనికి కలదు. శుక్ల + సు + మత్. విభక్తిలోపము, ప్రకృతవార్తికముచే 'మతుప్' లోపము. శుక్ల + సు = శుక్లః. ప్రత్యయమునకు లుక్కు కలిగినను అర్థమునకు భంగముండదు. కావున నీ 'శుక్లః' అనుపదమునకు తెలుపుగల వస్త్రము ఇత్యాది అర్థముండును. అట్లే కృష్ణఃఅస్యఅస్తి కృష్ణ + సు+మత్, కృష్ణ+సు=కృష్ణః.

సూ : ప్రాణిస్థాదాతో లజన్యతరస్యామ్ 5-2-96.

వృ : చూడాలః-చూడావాన్ ప్రాణిస్థాత్ కిమ్? శిఖావాన్ దీపః.

ప. వి : ప్రాణిస్థాత్ (5-1) ఆతః (5 1) లచ్ (1-1) అన్యతరస్యామ్ (అవ్య).

అను : తద్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి. ప) అస్మిన్ (7-1) సమర్థానామిత్యాది.

అర్థ : ప్రాణియందున్న వస్తువును వచించు ఆకారాంత శబ్దముయొక్క ప్రథమాంతమునకు 'అది అతనికి కలదు, లేక అతనియందు గలదు' అనునర్థమున 'లచ్' ప్రత్యయము వైకల్పికముగా నగును. ఉదా : చూడాలః - చూడావాన్. ప్రాణిస్థమనవేల? శిఖావాన్ దీపః.

వివ : ప్రాణియొక్క అవయవాదులను తెలుపు ఆకారాంతముల ప్రథమా విభక్త్యంత రూపములకు, 'అది వీనికి కలదు' అనునర్థమునందు 'లచ్' అను ప్రత్యయము వైకల్పికముగా చేరును. ఇందు చకారమిత్తు. ఉదా : చూడా అస్య అస్తి - చూడ (శిఖ) దీనికిగలదు. చూడాశబ్దము ప్రాణిస్థము, ఆకారాంతము, చూడా + సు, లచ్, విభక్తిలోపము చూడాల + సు = చూడాలః. వైకల్పిక మగుటచే రానిచో సాధారణమగు 'మతుప్' ప్రత్యయము వచ్చును. చూడా + మత్, 'మాదుపధాయా మతోర్వోఽయవాదిభ్యః' అను సూత్రముచే మకారమునకు వకారాదేశము, చూడావత్ + సు= చూడావాన్.

ఈ ప్రత్యయము ప్రాణిస్థవాచకములకే వచ్చుననుటచే శిఖ (జ్వాల) దీనికిఁ గలదు' అనునర్థమున శిఖాశబ్దమునకు లచ్ ప్రత్యయము రాదు. మతుప్ ప్రత్యయము రాఁగా, శిఖా + సు + మత్, శిఖావత్ + సు = శిఖావాన్ దీపః - జ్వాలగల దీపము.

అవ : పైని జెప్పబడిన 'లచ్' ప్రత్యయము ప్రాణిస్థమైన సర్వమునకు రాదని యీ క్రింది వార్తికము తెలుపుచున్నది.

వా॥ ప్రాణ్యఙ్గాదేవ (3189).

వృ : నేహ - మేధావాన్.

ప. వి : ప్రాణ్యఙ్గాత్ (5-1) ఏవ (అవ్య).

అర్థ : 'లచ్' ప్రత్యయము మత్వర్థమున ప్రాణ్యంగవాచకమునకు మాత్రమే వచ్చును. కాన 'మేధావాన్' అనుచోట రాదు.

వివ : 'ప్రాణిస్థాత్' అనుపదమున కిది వివరణప్రాయము. ప్రాణియొక్క అవయవములగు వానిని తెలుపు పదములకే 'లచ్' ప్రత్యయము వచ్చును గాని తక్కినవానికి రాదు. 'మేధా'= బుద్ధి - ఇది అంగము కాదు. అంగమనగా ఆకారము గలది మాత్రమే. బుద్ధికి ఆకారములేదు గాన అది అంగము కానేరదు. కావున దీనికి 'లచ్' ప్రత్యయము రాదు. ఈ వార్తికము లేనిచో మేధకూడ ప్రాణియందే యుండును గాన సూత్రముచే దీనికి 'లచ్' ప్రత్యయము రావలసి యుండెడిది.

మేధా అస్య అస్తి-మేధ ఇతనికి గలదు. మేధా + సు+మతుప్, మేధా + మత్, వకారాదేశము, మేధావత్ + సు=మేధావాన్. (మవర్ణాంతము, అవర్ణాంతము, మకారోపధము, అకారోపధమునయిన శబ్దములకు పరముగానున్న మతుప్ప్రత్యయ మకారమునకు వకారమాదేశమగును. యవాదిశబ్దములకు పరముగా నున్న దానికి కాదు. మాదుపధాయామతోర్వో ఽయవాదిభ్యః).

సూ : లోమాది పామాది పిచ్ఛాదిభ్యః శనేలచః 5-2-100.

వృ : లోమాదిభ్యః శః - లోమశః - లోమవాన్-పామాదిభ్యోనః - పామనః.

ప. వి : లోమాది పామాదిపిచ్ఛాదిభ్యః (5-3) శనేలచః 1-3.

అను : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి. వ) అస్మిన్ (7-1) పమర్థానామిత్యాది.

అర్థ : 'అది దీనికి లేక దీనియందుకలదు' అనునర్థమున ప్రథమాంతము అగు లోమాదులకు శ ప్రత్యయమును, పామాదులకు న ప్రత్యయమును, పిచ్ఛాదులకు 'ఇలచ్' ప్రత్యయము నగును. ఉదా : లోమశః ఇత్యాది.

వివ : మత్వర్థమున (అది కలది లేక కలవాఁడు అనునర్థమున) 'లోమన్' మున్నగు శబ్దములకు 'శ' ప్రత్యయము వచ్చును.

ఉదా : లోమాని అస్యసన్తి - లోమములు దీనికి / వీనికి గలవు లోమన్ + జస్, శ=విభక్తిలోపము, లోమన్ + శ, 'నలోపః ప్రాతిపదికాన్తస్య' నకారలోపము - లోమశ + సు = లోమశః శరీరమున వెంట్రుకలధికముగా గలవాఁడు.

**లోమాదిగణము :** లోమన్ రోమన్ బభ్రు హరి గిరి కర్క- కపి ముని తరు-ఇతిలోమాదిః.

పామాది శబ్దములకు మత్వర్థమున 'న' ప్రత్యయము వచ్చును పామా అస్య అస్తి - పామ (ఒకచర్మరోగము) కలవాఁడు, పామన్ + సు, న, విభక్తిలోపము, నకారలోపము - పామన+సు=పామనః. (గజ్జికలవాఁడు).

అవ : పామాదిగణములోని రెండు గణసూత్రములు వివరింపఁబడుచున్నవి.

i) గ. సూ : అఙ్గాత్కల్యాణే (118)

వృ : అఙ్గనా.

ప. వి : అఙ్గాత్ (5-1) కల్యాణే (7-1).

అర్థ : అంగశబ్దమునకు 'న' ప్రత్యయము కల్యాణార్థమున వచ్చును.

వివ : కల్యాణమైన = సుందరమైన అంగములు గలది అనునర్థమున అంగ శబ్దమునకు పరముగా 'న' ప్రత్యయము వచ్చును. ఉదా : కల్యాణాని అఙ్గాని అస్యాః సన్తి - సుందరములైన అంగము లీమెకుఁ గలవు. అఙ్గ+జస్+న, విభక్తిలోపము, స్త్రీత్వమున టాప్' ప్రత్యయము, అఙ్గన + టాప్, అఙ్గన+ఆ=అఙ్గనా+సు=అఙ్గనా.

ii) లక్ష్మ్యా అచ్చ (గ. 121).

వృ : లక్ష్మణః.

ప. వి : లక్ష్మ్యాః (6-1) అత్ (1-1) చ (అవ్య)

అర్థ : లక్ష్మీశబ్దమునకు అకారాదేశము కూడను.

వివ : 'లక్ష్మిగలవాఁడు' అనునర్థమున ప్రథమాంతమగు లక్ష్మీశబ్దమునకు 'న' ప్రత్యయము వచ్చును. అది పరమగునపుడు హ్రస్వ అకారము అంతాదేశమును అగును

ఉదా : లక్ష్మీః అస్య అస్తి - లక్ష్మి ఇతనికిఁగలదు. లక్ష్మీ + సు+న, విభక్తిలోపము, అకారాదేశము, లక్ష్మ+అ=లక్ష్మ + న, షకారయోగముచే నకారమునకు ణత్వము. లక్ష్మణ + సు=లక్ష్మణః

పామాదిగణము : పామన్ వామన్ వేమన్ హేమన్ శ్లేష్మన్ కద్రు (కద్రూ) బలి సామన్ ఊష్మన్ కృమి. 'అఙ్గాత్కల్యాణే' 118. 'శాకీపలాలీ దద్రూణాం హ్రస్వత్వంచ' 119. (విష్వగిత్యుత్తరపదలోపశ్చాకృతసన్ధేః) లక్ష్మ్యా అచ్చ' 121 - ఇతిపామాదిః.

వృ : పిచ్ఛాదిభ్య ఇలచ్-పిచ్ఛిలః - పిచ్ఛావాన్.

వివ : 'పిచ్ఛము దీనికిఁగలదు' అనునట్టి అర్థముల 'పిచ్ఛా' మున్నగుశబ్దముల ప్రథమాంతములకు 'ఇలచ్' ప్రత్యయము చేరును.

ఉదా : పిచ్ఛాఅస్య అస్తి - గంజిమీఁది మీఁగడ మున్నగునది గలది - పిచ్ఛా + సు + ఇలచ్ - చకారమిత్తు, విభక్తిలోపము, ఆకారలోపము (యస్యేతిచ) పిచ్ఛ+ఇల=పిచ్ఛిల + సు=పిచ్ఛిలః, ఇది రానియెడల మతుప్ ప్రత్యయము, మకారమునకు వకారాదేశము పిచ్ఛావాన్.

పిచ్ఛాదిగణము : పిచ్ఛా ఉరస్ ధువక ధ్రువక. 'జటాఘటాకాలాఃక్షేపే' 122. వర్ణ ఉదక పఙ్క ప్రజ్ఞా-ఇతి పిచ్ఛాదిః.

సూ : దన్త ఉన్నత ఉరచ్ 5-2-106.

వృ : ఉన్నతా దన్తా అస్య దన్తురః.

ప. వి : దన్తే (7-1) ఉన్నతే (7-1) ఉరచ్ (1-1).

అను : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి. ప).

అర్థ : 'ఉన్నతములైన దంతములు గలది లేక కలవాఁడు' అనునర్థమున ప్రథమాంతమగు దంతశబ్దమునకు పరముగా 'ఉరచ్' ప్రత్యయము వచ్చును. ఉదా : దన్తురః.

వివ : ఈ సూత్రమున 'దంతే' అనుచోట సప్తమి పంచమ్యర్థమున ప్రయుక్తమైనది. ఉన్నతే అనునది దానికి విశేషణము. ఉన్నత అనునది విశేషణముగాఁ గల దంతశబ్దమునకు 'అవి యితనికిఁగలవు' అనునర్థమున 'ఉరచ్' ప్రత్యయము వచ్చును. ఇందు చకారమిత్తు.

ఉదా : ఉన్నతాః దన్తాః అస్యసన్తి - దన్త + జస్ + ఉరచ్, విభక్తిలోపము, దన్త + ఉర, అకారలోపము - దన్ + ఉర = దన్తుర + సు = దన్తురః - ఎత్తైన దంతములు గలవాడు.

సూ : కేశాద్వోఽన్యతరస్యామ్ 5-2-109.

వృ : కేశవః-కేశవాన్.

ప. వి : కేశాత్ (5-1) వః (1-1) అన్యతరస్యామ్ (అవ్య).

అను : తత్ (1-1) వః (1-1) అస్య (6-1) అస్తి (క్రి. ప).

అర్థ : 'అవి యితనికిఁగలవు' అనునర్థమున కేశశబ్దమునకు వైకల్పికముగా 'వ' అను ప్రత్యయము వచ్చును. ఉదా : కేశవః - కేశవాన్.

వివ : (మంచి) కేశములు ఇతనికిఁ గలవు అనునర్థమున ప్రథమాంతమగు 'కేశ' శబ్దమునకు పరముగా 'వ' అను ప్రత్యయము వైకల్పికముగానగును.

ఉదా : కేశాః అస్య సన్తి - మంచికేశములు గలవాఁడు, కేశ + జస్+వ, విభక్తిలోపము, కేశవ + సు = కేశవః. ఇది రానిచో సాధారణమగు మతుప్ ప్రత్యయము వచ్చును. కేశ + మత్, వకారాదేశము, కేశవత్ + సు = కేశవాన్.

వా॥ అన్యేభ్యోఽపిదృశ్యతే (3210).

వృ : మణివః

ప. వి : అన్యేభ్యః (5-3) అపి (అవ్య) దృశ్యతే (క్రి. ప).

అర్థ : 'వ' ప్రత్యయము ఇతరములకును గన్పట్టుచున్నది. ఉదా : మణివః.

వివ: పై సూత్రమున 'వ' ప్రత్యయము కేశశబ్దమునకు సూత్రమే విధింపఁబడినది. ఇది మఱికొన్ని యితరశబ్దములకును గన్పట్టుచున్నదని యీ వార్త్తికము చెప్పుచున్నది.

ఉదా : మణిః అస్య అస్తి - మణి దీనికిఁగలదు. మణి + సు + వ = విభక్తిలోపము, మణివ + సు = మణివః.

**వా॥ అర్ణసో లోపశ్చ (5053).**

వృ : అర్ణవః.

ప. వి : అర్ణసః (6-1) లోపః (1-1) చ (అవ్య).

అర్థ : 'అర్ణస్' శబ్దమునకు 'వ' ప్రత్యయముతోపాటు అంత్యాక్షరలోపమును అగును. ఉదా : అర్ణవః

వివ : 'అన్యేభ్యోఽపి దృశ్యతే' అను వార్తికముచే 'వ' ప్రత్యయము కేశ శబ్దమునకే కాక తక్కిన మఱికొన్నిటికిని వచ్చునని చెప్పఁబడినది ఆ ప్రత్యయము 'అర్ణస్' - శబ్దమునకు కూడ వచ్చును. అది వచ్చునప్పుడు సకారమునకు లోపమును అగును. (అలోఽన్త్యస్య' అను పరిభాషచే అంత్యాక్షరము సకార మిట గ్రహింపఁ బడును).

ఉదా : అర్ణః అస్మిన్ అస్తి - జలము దీనియందధికముగాఁ గలదు - అర్ణస్ + సు + వ, విభక్తిలోపము, సకారలోపము, అర్ణవ + సు = అర్ణవః - సముద్రము.

**సూ : అత ఇనిఠనౌ 5-2-115.**

వృ : దణ్డీ - దణ్డికః.

ప. వి : అతః (5-1) ఇనిఠనౌ (1-2)

అను : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి ప) అస్మిన్ (7-1)

అర్థ : మత్వర్థమున అదంతమునకు పరముగా ఇని, ఠన్ ప్రత్యయములు వచ్చును. ఉదా : దణ్డీ - దణ్డికః.

వివ : హ్రస్వఅకారాంతములైన ప్రాతిపదికముల ప్రథమాంతములకు, మత్వర్థమున (అదికలదు అనునర్థమున) 'ఇని', 'ఠన్' ప్రత్యయములు చేరును. 'ఇని' ప్రత్యయమున తుది ఇకార ముచ్చారణార్థకము. 'ఠన్' ప్రత్యయమున నకారమిత్తు.

ఉదా : దణ్డః అస్యఅస్తి - ఇతనికి దండముకలదు, దండశబ్దము అదంతము. దణ్డ + సు; ఇన్, విభక్తి లోపము, అకారలోపము, దణ్డ్ + ఇన్ = దణ్డిన్ + సు = దణ్డీ. దణ్డ + ఠ, ఠకారమునకు ఇకాదేశము. (ఠస్యేకః), అకారలోపము దణ్డ్ + ఇక = దణ్డిక + సు = దణ్డికః.

సూ : వ్రీహ్యాదిభ్యశ్చ 5-2-116.

వృ : వ్రీహీ. వ్రీహికః.

ప వి : వ్రీహ్యాదిభ్యః (5-3) చ (అవ్య).

అను : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి. ప) అస్మిన్ (7-1) ఇని ఠనౌ (1-2).

అర్థ : వ్రీహ్యాది ప్రకృతిక ప్రథమాంతములకును మత్వర్థమున ఇని, ఠన్ ప్రత్యయములు వచ్చును. ఉదా : వ్రీహీ, వ్రీహికః.

వివ : వ్రీహ్యాదిగణములో పఠింపఁబడినశబ్దముల ప్రథమాంతములకును 'అది వీనికిఁగలదు. అనునర్థమున ఇని, ఠన్ ప్రత్యయములు చేరును. ఇవి అదంత ములు కాని కారణమున మరల చెప్పవలసి వచ్చినది

ఉదా : వ్రీహిః అస్య అస్తి - వరిపంట ఇతనికిఁగలదు. వ్రీహి + సు + ఇన్, విభక్తిలోపము, ఇకారలోపము, వ్రీహ్ + ఇన్ = వ్రీహిన్ + సు = వ్రీహీ. వ్రీహి + సు + ఠన్, విభక్తిలోపము, ఇకాదేశము, ఇకార లోపము - వ్రీహ్ + ఇక=వ్రీహిక + సు=వ్రీహికః.

వ్రీహ్యాదిగణము : వ్రీహి మాయా (శాలా) శిఖా మాలా మేఖలా కేకా అష్టకా పతాకా చర్మన్ వర్మన్ దంష్ట్రా సంజ్ఞా బడబా కుమారీ నౌ వీణా బలాకా యవఖదనౌ కుమారీ, 'శీర్షాన్నఞః' 128. ఇతి వ్రీహ్యాదిః.

సూ : అస్మాయామేధాస్రజోవినిః 5-2-121.

వృ : యశస్వీ - యశస్వాన్; మాయావీ; మేధావీ; స్రగ్వీ.

ప. వి : అస్, మాయా, మేధా, స్రజః (5-1) వినిః (1-1).

అను : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి. ప) అస్మిన్ (7-1)

అర్థ : అస్అంతములు, మాయా, మేధా, స్రక్శబ్దములును - వీనిప్రథ మాంతములకు మత్వర్థమున 'విని' ప్రత్యయము చేరును. ఉదా : యశస్వీ మొ॥వి.

వివ : 'అస్' అను శబ్దభాగము అంతమునఁ గలవానియొక్కయు, మాయా మేధా, స్రక్ అనువానియొక్కయు ప్రథమాంతములకు, 'అది వీనికిఁ గలదు' అనునర్థమున 'విని' ప్రత్యయము చేరును. ఇందు తుది ఇకారము ఉచ్చార ణార్థకము.

ఉదా : యశస్ - ఇది అస్ అంతము. యశః అస్య అస్తి-యశస్సుకలవాఁడు యశస్+సు + విని, విభక్తిలోపము, యశస్ + విన్=యశస్విన్ + సు=యశస్వీ. ఈ సూత్రములోనికి 'అన్యతరస్యామ్' అనుపదమును మండూకప్లుతిచే అను వర్తింపఁజేయఁగా ఈ ప్రత్యయము వీనికి వైకల్పికముగా నగు ననునర్థము కలుగును. కావున నిది రానిచో మతుప్ ప్రత్యయము వచ్చును. యశస్+మత్, అదుపధ మగుటచే వకారాదేశము, యశస్వత్ + సు = యశస్వాన్. (తసౌమత్వర్థే అను సూత్రముచే భసంజ్ఞయుండును గాన నిచట సకారమునకు రుత్వము లేదు).

మాయా అస్య అస్తి-మాయ ఇతనికిఁ గలదు మాయా+సు+విన్-మాయా విన్ + సు=మాయావీ.

మేధా అస్యఅస్తి - మేధ (బుద్ధివిశేషము) ఇతనికిఁ గలదు-మేధా+సు+ విన్-మేధావిన్ + సు=మేధావీ.

స్రక్ అస్యఅస్తి - స్రజము ఇతనికిఁగలదు. స్రజ్ + సు + విన్, విభక్తి లోపము. జకారమునకు కుత్వము. (చోఃకుః) స్రగ్ + విన్, స్రగ్విన్ + సు = స్రగ్వీ -

పక్షమున వీనికి మతుప్ ప్రత్యయము వచ్చును. మాయావాన్, మేధావాన్, స్రగ్వాన్. మాయాశబ్దము వ్రీహ్యాదులలోని దగుటచే ఇన్, ఠన్ ప్రత్యయములును వచ్చును. మాయీ, మాయికః.

**సూ : వాచో గ్మినిః 5-2-124.**

**వృ : వాగ్మీ.**

ప వి : వాచః (5-1) గ్మినిః (1-1).

అను : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి ప) అస్మిన్ (7-1) సమర్థానా మిత్యాది.

అర్థ : వాక్ శబ్దమునకు మత్వర్థమున గ్మిని ప్రత్యయము వచ్చును. ఉదా : వాగ్మీ.

వివ : 'మంచివాక్కులుగలవాఁడు' అనునర్థమున 'వాచ్' అనుశబ్దముయొక్క ప్రథమాంతమునకు 'గ్మిని' ప్రత్యయము వచ్చును. ఇందు తుదిఇకారము ఉచ్చారణార్థకము.

ఉదా : వాచః అస్యసన్తి - వాచ్+జస్+గ్మిన్, విభక్తిలోపము, చకారమునకు కుత్వము, వాక్ + గ్మిన్, కకారమునకు జశ్త్వము వాగ్మిన్ + సు = వాగ్మీ ప్రత్యయమున గకారములేనియెడల వాగ్ + మిన్ అనుదశలో, 'ప్రత్యయే భాషాయాం నిత్యమ్' అనువార్తికముచే అనునాసికాదేశము నిత్యముగా వచ్చి 'వాఙ్మీ'అను రూపము కావలసియుండును. దానిని వారించుటకై గకారముంచఁబడినది.

**సూ : అర్శ ఆదిభ్యోఽచ్ 5-2-127.**

**వృ : అర్శసః. ఆకృతిగణోఽయమ్.**

ప. వి : అర్శ ఆదిభ్యః (5-3) అచ్ (1-1).

అను : తత్ (1-1) అస్య (6-1) అస్తి (క్రి. ప) అస్మిన్ (7-1) సమర్థానామిత్యాది.

అర్థ : మత్వర్థమున 'అర్శస్' మున్నగుశబ్దములకు 'అచ్' ప్రత్యయము వచ్చును. ఉదా : అర్శసః. ఇది ఆకృతిగణము.

వివ : 'అది వీనికి / దీనికి కలదు' అనునర్థమున ప్రథమాంతములగు 'అర్శస్' మున్నగువానికి 'అచ్' ప్రత్యయము వచ్చును చకారమిత్తు.

ఉదా : అర్శాంసి అస్యసన్తి = అర్శస్సులు (మూల అనుపేరుగలరోగము) వీనికిఁ గలవు. అర్శస్+జస్, అచ్, విభక్తిలోపము, అర్శస్ + అ=అర్శస + సు=అర్శసః - మూలరోగముకలవాఁడు

**అర్శ ఆదిగణము :** అర్శస్ - ఉరస్ తున్ద చతుర పలిత జటా (ఘటా) ఘాటా అభ్ర (అఘ) (కర్దమ) అమ్ల లవణ, స్వాఙ్గాదీనాత్ 125. వర్ణాత్. ఇత్యర్శ ఆదిః. ఆకృతిగణః.

## ఇది మత్వర్థీయ ప్రకరణము.

**ప్రకరణావలోకనము :** ఈ ప్రకరణమున ముందు సంఖ్యావాచకములకు పూరణార్థక ప్రత్యయములగు డట్, తీయ, ప్రత్యయములు విధింపఁబడినవి. అందు డట్ ప్రత్యయమునకు కొన్నిశబ్దముల విషయమున మడాగమము విధింపఁబడినది. అట్లే డట్ ప్రత్యయము పరమగునపుడు షడాది శబ్దములకు థుగాగమము విధింపఁబడినది. త్రి శబ్దమునకు తీయ ప్రత్యయయోగమున సంప్రసారణము కూడ

కలుగును. 'వింశతి' శబ్దమునకు 'డట్' ప్రత్యయపరకత్వమున 'తి'లోపము విధింపఁబడినది శ్రోత్రియశబ్దము నిపతింపఁబడినది పూర్వశబ్దమునకు, ఇష్టాదులకును 'ఇని' ప్రత్యయము విధింపఁబడినది.

అది వీనికి/దీనికి (లేక) వీనియందు/దీనియందుకలదు అనునర్థమున మతుప్, లచ్,శ,న, ఇలచ్, ఉరచ్, వ, ఇని, రన్, విన్, గ్మిన్, అచ్ ప్రత్యయములు ఆయా శబ్దములకు విధింపఁబడినవి ఇందు సాధారణప్రత్యయమగు 'మతుప్' అనునది తక్కిన ప్రత్యయములు వచ్చు వానికిని సాధారణముగా పాక్షికముగా వచ్చును. ఈ ప్రత్యయములను మత్వర్థ ప్రత్యయములందురు. మకారము, హ్రస్వ అకారము అనునవి అంతమునను, ఉపధాక్షరముగను గల శబ్దములకును, ఝయంతములకును పరముగా నున్న మతుప్ప్రత్యయమకారమునకు వకారమాదేశమగుట నిందను సంధించుకొననగును.

# అథ ప్రాగ్దిశీయ ప్రకరణమ్.

అవ : ఈ ప్రకరణమున విభక్తిసంజ్ఞకల కొన్ని ప్రత్యయములు విధింపఁబడుచున్నవి. 'దిక్శబ్దేభ్యః....' (5-3-27) అనుసూత్రమునకు పూర్వమువఱకు విధింపఁబడిన ప్రత్యయములకు విభక్తి సంజ్ఞ కలుగును. 'దిక్' శబ్దముగల సూత్రమునకు పూర్వమున విధింపఁబడిన ప్రత్యయములకు సంబంధించిన ప్రకరణము కావున దీనికి ప్రాగ్దిశీయ ప్రకరణమని పేరు.

సూ : ప్రాగ్దిశో విభక్తిః 5-3-1.

వృ : దిక్ శబ్దేభ్య ఇత్యతః ప్రాగ్వక్ష్యమాణాః ప్రత్యయాః విభక్తిసంజ్ఞాఃస్యుః.

ప. వి : ప్రాక్ (1-1) దిశః (5-1) విభక్తిః (1-1).

అను : తద్ధితః (1-1) ప్రత్యయః (1-1).

అర్థ : 'దిక్శబ్దేభ్యః' అను సూత్రమునకు పూర్వమువఱకు విధింపఁబడు వక్ష్యమాణ ప్రత్యయములు విభక్తి సంజ్ఞకములు.

వివ : సూత్రమునందలి దిక్శబ్దము, ఆ శబ్దముగల సూత్రమును తెలుపును అది "దిక్శబ్దేభ్యః సప్తమీ పఞ్చమీ ప్రథమాభ్యో దిగ్దేశకాలేష్వస్తాతిః" 5-3-27 అనునది. అంతవఱకు 'విభక్తిః' అను పదము అధికారమగును. అనగా 5-3-1 నుండి 5-3-26 వఱకు విధింపఁబడు ప్రత్యయములకు 'విభక్తి' అను సంజ్ఞ యుండును. కావున విభక్తి సంజ్ఞగలవానికి అగు కార్యములు వీని కగునని తాత్పర్యము. 'సమర్థానామ్' 'ప్రథమాత్' అనుపదముల అధికారము ఇది మొదలుకొని లేదు. 'వా' అనుపదము మాత్రము అనువృత్తమగును.

ఈ ప్రత్యయములకు విభక్తి సంజ్ఞను విధించుటవలన ప్రయోజనములు మూఁడు గలవు. (1) "నవిభక్తౌతుస్మాః" 1-3-4 అను సూత్రముచే వీని అంతమునసున్న తవర్గ సకారమకారములకు ఇత్సంజ్ఞ కలుగదు. (విభక్తియందు అంత్యములగు హల్లులగుతవర్గసకారమకారము లిత్తులు కావు అని సూత్రార్థము. ఇది 'హలన్త్యమ్' అను సూత్రమున కపవాదము). (2) విభక్తి పరమగునపుడు త్యదాదులకు విధింపఁబడిన అత్వము ఈ ప్రత్యయములు పరములగునపుడును వచ్చును (త్యదాదీనామః - 7-2-102-త్యదాదులకు విభక్తి పరమగునపుడు అకారమంతాదేశమగును.) (3) స్వరవిశేషము.

సూ : కిం సర్వనామబహుభ్యోఽద్వ్యాదిభ్యః 5-3-2.

వృ : కిము స్సర్వనామ్నో బహుశబ్దాచ్చేతి ప్రాగ్దిశోఽధిక్రియతే.

ప. వి : కిం సర్వనామబహుభ్యః (5-3) అద్వ్యాదిభ్యః (5-3).

అర్థ : కిమః, సర్వనామ్నః, బహుశబ్దాత్ అనునీపదములు మూఁడును దిక్చ్ఛబ్దేభ్య ఇత్యాది సూత్రమువఱకు అధికారములుగా పోవును.

వివ : ఈ సూత్రమునందు విధింపఁబడు ప్రత్యయ మేదియు చెప్పఁబడకుండుటవలన నిది యధికారసూత్రమని తెలిసినది. సూత్రమునందలి 'కిం......బహుభ్యః' అనుపదముయొక్క పంచమీవిభక్తివలన వక్ష్యమాణ ప్రత్యయములు వీనికి పరముగా వచ్చుననునర్థము కలుగును కావున ముందుఁ జెప్పఁబోవు సూత్రముల యందు (5-3-26 వఱకు) 'కిమః, సర్వనామ్నః, బహుశబ్దాత్' అను పంచమ్యంతపదములు ఉపస్థితములగు ననునర్థము కలిగినది సర్వనామసంజ్ఞకములే అయిన ద్వి మున్నగువానికి ముందు విధింపఁబడు ప్రత్యయములు రావు అని 'అద్వ్యాదిభ్యః' అనుపదమున కర్థము 'కిమ్' శబ్దముకూడ సర్వనామమే. అట్టియెడ మఱల 'కిమ్'శబ్దమును సూత్రమున వేఱుగా గ్రహించుటయేల? అని శంకింపరాదు. ఏలయన అది ద్వ్యమున్నగువానిలోఁ గలదు. కావున దానిని వేఱుగా గ్రహింపనిచో వక్ష్యమాణ ప్రత్యయములు వానికి రాఁజాలవు. వచ్చుట అవసరము కానమఱల నిది విడిగా గ్రహింపఁబడినది.

ద్వ్యాదులు : ద్వి యుష్మద్ అస్మద్ భవతు (కిమ్) - ఇవి సర్వాదుల లోనివి.

సూ : పఞ్చమ్యాస్తసిల్ 5-3-7.

వృ : పఞ్చమ్యన్తేభ్యః కిమాదిభ్య స్తసిల్ వా స్యాత్.

ప. వి : పఞ్చమ్యాః (5-1) తసిల్ (1-1)

అను : కిం సర్వనామ బహుభ్యః (5-3) విభక్తిః (1-1) వా (అవ్య).

అర్థ : పంచమ్యంతములగు కిమాదులకు తసిల్ప్రత్యయము వచ్చును. అది విభక్తి సంజ్ఞకమగును.

వివ : కిమాదులనగా కిమ్శబ్దము, సర్వనామసంజ్ఞగల సర్వాదులు, బహుశబ్దము. పంచమ్యంతములగు వీనికి 'తసిల్' ప్రత్యయము చేరును. దానికి విభక్తి

సంజ్ఞ కలుగును. ఇందు లకారమిత్తు. ఇకార ముచ్చారణార్థకము. ప్రత్యయముగా మిగులునది 'తస్' అనునది. ఇది వైకల్పికముగా కిమాదులకు చేరును.

ఉదా : కస్మాత్ (కింశబ్దముయొక్క పంచమ్యంతరూపము) కిమ్ + ఙసి, తసిల్, తద్ధితాంతమగుటచే ప్రాతిపదికసంజ్ఞ కలిగి, 'సుపో ధాతు ప్రాతిపదికయోః' అను సూత్రముచే సుప్పునకు (ఙసి) లుక్కు వచ్చును.

'కిమ్ + తస్' అనియుండగా క్రిందిసూత్రముచే కార్యవిశేషము విధింపఁబడు చున్నది.

సూ : కుతిహోః 7-2-104.

వృ : కిమః కుస్స్యాద్ తాదౌ హాదౌ చ విభక్తౌ. కుతః, కస్మాత్.

ప. వి : కు (ప్రథమా విభక్తిలోపించిన పదము) తిహోః (7-2).

అను : విభక్తౌ (7-1) కిమః (6-1).

అర్థ : తాదియు, హాదియునగు విభక్తిపరమగునపుడు 'కిమ్' శబ్దమునకు 'కు' అనునాదేశము కలుగును ఉదా : కుతః.

వివ : 'తిహోః' అనునది తకారహకారములను బోధించును. ఇందు 'తి' లోని ఇకారము ఉచ్చారణార్థకము. తిహోః అనునది 'విభక్తౌ' అనుదానికి విశేషణము. త్, హ అనునవి వర్ణములగుటచే, 'యస్మిన్విధి స్తదాదావల్గ్రహణే' అను పరిభాష చొప్పున తదాదివిధిచే 'తకారాదియు హకారాదియు విభక్తి పరమగునపుడు' అనునర్థము వచ్చును. కు అనునది అనేకవర్ణములు గల ఆదేశమగుటచే (క్, ఉ=2) 'కిమ్' అనుదానిమొత్తమును తొలగించి వచ్చును. (అనేకాల్ శిత్సర్వస్య). కిమ్ + తస్=కుతస్, సకారమునకు రుత్వవిసర్గములు రాఁగా 'కుతః' అగును. తసిల్ ప్రత్యయమునకు విభక్తి సంజ్ఞయుండుటకు నీయాదేశమగుట ఒక ప్రయోజనము. తసిల్ ప్రత్యయాంతము, 'తసిలాదయః ప్రాక్పాశపః' (పాశప్ ప్రత్యయమునకు పూర్వమునఁ గలతసిలాది ప్రత్యయము లంతమునఁ గలవి అవ్యయము లగును) అను సర్వాదిగణ వాక్యము వలన అవ్యయమగును. కావున దీనికి చేరిన సుప్పులకు లుక్కు వచ్చును (అవ్యయాదాప్సుపః). తసిల్ ప్రత్యయము చేరుట వైకల్పికము గావున రానిచో 'కస్మాత్' అను పంచమీ విభక్తిరూపము కూడ నుండును.

అవ : సర్వనామమున కుదాహరణము చూపఁబడుచున్నది.

సూ : ఇదమ ఇశ్ 5-3-3.

వృ : ప్రాగ్దిశీయే. ఇతః.

ప. వి : ఇదమః (6-1). ఇశ్ (1-1)

అర్థ : ప్రాగ్దిశీయ ప్రత్యయములు పరములగునపుడు 'ఇదమ్' శబ్దమునకు 'ఇశ్' అనునాదేశము వచ్చును. ఉదా : ఇతః.

వివ : 'ప్రాగ్దిశీయప్రత్యయములు పరములగునపుడు' అమనర్థము ప్రకరణమును బట్టి సిద్ధించును. అట్టివియగు (5-3-26 వఱకు విధింపఁబడినవియగు) ప్రత్యయములు పరములగునపుడు 'ఇదమ్' అనుసర్వనామమునకు 'ఇశ్' అనునాదేశము వచ్చును. ఇందు శకారమిత్తు. 'అనేకాల్ శిత్సర్వస్య' అను పరిభాషచే 'ఇ' అనుసీఆదేశము 'ఇదమ్' శబ్దమును మొత్తముగా తొలగించి వచ్చును.

ఉదా : ఇదమ్ + జసి + తసిల్ (పఞ్చమ్యాస్తసిల్ అనుసూత్రముచే ప్రత్యయము) విభక్తిలోపము, 'ఇ' ఆదేశము, ఇ + తస్=ఇతస్, అవ్యయమగుటచే సుబ్లుక్కు. సకారమునకు రుత్వ విసర్గములు. ఇతః. వైకల్పికమగుటచే ఈతసిల్ ప్రత్యయము రానియెడల 'అస్మాత్' అను పంచమ్యంతరూపముండును.

సూ : ఏతదోఽన్ 5-3-5.

వృ : ప్రాగ్దిశీయే. అనేకాల్త్వాత్సర్వాదేశః. అతః.

ప. వి : ఏతదః (6-1) అన్ (1-1).

అర్థ : ప్రాగ్దిశీయ ప్రత్యయము పరమగునపుడు ఏతచ్ఛబ్దమునకు 'అన్' అనునాదేశము వచ్చును. అనేకాలాదేశమగుటచే సర్వాదేశము అతః

వివ : 'ప్రాగ్దిశీయే' అనునది ప్రకరణలబ్ధము ఆ ప్రత్యయము పరమగునపుడు ఏతచ్ఛబ్దమునకు 'అన్' అనునాదేశము వచ్చును. ఇది అనేకవర్ణములుగల ఆదేశమగుటచే మొత్తమును తొలగించి వచ్చును.

ఉదా : ఏతస్మాత్. ఏతద్ + జసి + తసిల్ (పఞ్చమ్యాస్తసిల్) సుబ్లుక్కు (విభక్తిలోపము) 'అన్' ఆదేశము అన్ + తస్, నకారమునకు 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అనుసూత్రముచే లోపము. అతస్+సు (అవ్యయమగుటచే సుప్పునకు లుక్కు) సకారమునకు రుత్వ విసర్గములు (ససజుషోరుః, ఖరవసానయోర్విసర్జనీయః). అతః.

అవ : కొన్ని సర్వనామములకును, బహుశబ్దమునకు నుదాహరణములు చూపఁబడుచున్నవి.

వృ : అముతః, యతః, తతః, బహుతః.

వివ : పంచమ్యంతములగు అదస్, యద్, తద్, అను సర్వనామములకును, బహుశబ్దమునకు 'పంచమ్యాస్తసిల్' అనుసూత్రముచే 'తసిల్' ప్రత్యయము చేఁగా నేర్పడిన రూపములివి. ప్రక్రియ నరయుదము

(1) అముష్మాత్ - అదస్ + ఙసి + తసిల్, విభక్తి లోపము. అదస్+ తస్, త్యదాదీనామః (త్యదాది సర్వనామములకు విభక్తి పరమగునపుడు అకారమంతాదేశమగును) అద+అ, అతోగుణే అనుసూత్రముచే పరరూపము (అద్, అ + అ = అద) అద + తస్, అదసోऽసేర్దాదుదోమః 8-2-80 (సకారాంతము కాని 'అదస్' లనుదాని దకారమునకు పరముగా నున్నవర్ణమునకు ఉకారాదేశమును, దకారమునకు మకారాదేశమును వచ్చును) అను సూత్రముచే అమ్+ఉ+తస్ = అముతస్ అగును అవ్యయత్వము. సుబ్లుక్కు. సకారమునకు రుత్వ విసర్గములు. అముతః 'తసిల్' ప్రత్యయము రానిచో 'అముష్మాత్' అను పంచమ్యంతరూపముండును.

(2) యతః : యస్మాత్ = యద్ + ఙసి + తసిల్, విభక్తిలోపము. త్యదాదీనామః అనుసూత్రముచే దకారమునకు అకారాదేశము. య+అ = పరరూపసంధి. య + తస్ = యతస్ = యతః, యస్మాత్ అను రూపముకూడ నుండును.

(3) తతః - తస్మాత్ - తద్ + ఙసి + తసిల్ - తద్ + తస్, పైదాని వలెనే ప్రక్రియ, త + అ+తస్ త + తస్-తతస్=తతః; తస్మాత్ అనియు నుండును.

పైని చూపఁబడినవి సర్వనామముల కుదాహరణములు ఈ ప్రాగ్దిశీయ ప్రత్యయములు 'బహు' శబ్దమునకు కూడ వచ్చును. బహు + భ్యస్ + తసిల్, విభక్తిలోపము. బహుతస్ = బహుతః - రానిచో 'బహుభ్యః' అనియు నుండును.

అవ : కింసర్వనామేత్యాది సూత్రమునందలి 'అద్వ్యాదిభ్యః' అనుదళము యొక్క సార్థక్యమును గమనింతము.

వృ : ద్వ్యాదేస్తు - ద్వాభ్యామ్.

వివ : ద్వి మున్నగు వానికైనచో 'ద్వాభ్యామ్' అనురూపమే యుండును. అనగా 'ద్వి' మున్నగు సర్వనామములకు తసిలాది ప్రత్యయములు రావని తాత్ప ర్యము - ద్వాభ్యామ్-పంచమీద్వివచనము.

సూ : పర్యభిభ్యాం చ. 5-3-9.

వృ : తసిల్. పరితః, సర్వత ఇత్యర్థః. అభితః, ఉభయత ఇత్యర్థః.

ప. వి : 'పర్యభిభ్యామ్ (5-2) చ (అవ్య).

అను : తసిల్ (1-1).

అర్థ : పరి, అభి అనునవ్యయములకుఁ గూడ పంచమిగా నీతసిల్ ప్రత్య యము వచ్చును. పరితః - అంతటను అని యర్థము. అభితః - రెండువైపులను-అని యర్థము.

వివ : పరి, అభి అను అవ్యయములు కిమాదులలో చేరినవి కావున వీనికి తసిల్ ప్రత్యయము ఈ సూత్రముచే వేఱుగా చెప్పఁబడినది. వీనికి ఈ ప్రత్య యము సర్వ, ఉభయ అను వాని యర్థమునందే యని 'సర్వోభయార్థాభ్యామేవ' అను వార్తికము చెప్పుచున్నది. కావున 'పరి' కి తసిల్ ప్రత్యయము చేర్చినచో 'సర్వతః=అన్నివైపుల అను నర్థము సిద్ధించును, 'అభి'కి చేర్చినచో ఉభయతః= రెండువైపులను అనునర్థము సిద్ధించును.

ఉదా : పరి+తసిల్ = పరితః, అభి + తసిల్ =అభితః.

అవ : సప్తమ్యర్థమున ప్రత్యయములు విధింపఁబడుచున్నవి.

సూ : సప్తమ్యాస్త్రల్ 5-3-10.

వృ : కుత్ర, యత్ర, బహుత్ర.

ప. వి : సప్తమ్యాః (5-1) త్రల్ (1-1).

అను : కిం సర్వనామబహుభ్యః (5-3) విభక్తిః (1-1) వా.

అర్థ : సప్తమ్యంతములగు కిమాదులకు త్రల్ ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. ఉదా : కుత్ర మొ॥వి.

వివ : సప్తమ్యంతములైన 'కిమ్' శబ్దమునకును, సర్వనామసంజ్ఞకముల కును, బహుశబ్దమునకును 'త్రల్' అను తద్ధిత ప్రత్యయము వైకల్పికముగా నగును. ద్వ్యాదులకు రాదు. ఇందు లకారమిత్తు.

ఉదా : కస్మిన్ = దేనియందు; కిమ్ + ఙి + త్రల్, విభక్తిలోపము కిమ్ + త్ర, 'కుతిహోః' అను సూత్రముచే 'కు' ఆదేశము - కుత్ర - ఇదియు నవ్యయమగుటచే దీనికి పరముగా చేరిన సుప్పునకు లుక్కు వచ్చును. దీనికి పద సంజ్ఞ కలుగును. వైకల్పికమగుటచే 'కస్మిన్' అనురూపము కూడ నుండును.

సర్వనామమున కుదాహరణము. యద్ + ఙి + త్రల్, విభక్తిలోపము, అకారాదేశము, (త్యదాదీనామః) య + అ, త్ర, పరరూపసంధి (అతోగుణే) యత్ర. యస్మిన్ అనియు రూపముండును.

బహుశబ్దమున కుదాహరణము : బహు + ఙి, త్రల్, బహుత్ర-రానిచో 'బహుషు' అనియుండును.

**సూ : ఇదమో హః 5-3-11.**

**వృ : త్రలోఽపవాదః. ఇహ.**

ప. వి : ఇదమః (5-1) హః (1-1).

అను : సప్తమ్యాః (5-1) విభక్తిః.

అర్థ : సప్తమ్యంతమగు 'ఇదమ్' శబ్దమునకు 'హ' అను ప్రత్యయము వచ్చును. ఇది 'త్రల్' ప్రత్యయమున కపవాదము. ఉదా : ఇహ.

వివ : 'ఇదమ్' అను సర్వనామమునకు పై సూత్రముచే 'త్రల్' ప్రత్యయము ప్రాప్తించుచుండగా అపవాదముగా 'హ' ప్రత్యయము విధింపఁబడినది.

ఉదా : ఇదమ్ + ఙి, హ, విభక్తిలోపము. 'ఇదమ్' శబ్దమునకు ఇ (శ్) ఆదేశము. ఇ + హ = ఇహ - అవ్యయమగుటచే సుబ్లుక్కు. పదసంజ్ఞ కలుగును.

**సూ : కిమోఽత్ 5-3-12.**

**వృ : వా స్యాత్.**

ప. వి : కిమః (5-1) అత్ (1-1).

అను : సప్తమ్యాః (5-1) విభక్తిః (1-1) వా (అవ్య).

అర్థ : సప్తమ్యంతమగు కిమ్ శబ్దమునకు 'అత్' ప్రత్యయము వైకల్పికముగా నగును.

వివ : ఇదియు త్రల్ ప్రత్యయమున కపవాద[redacted]
మిత్తు. అత్ ప్రత్యయమునకు విభక్తిసంజ్ఞ యుం[redacted]
అనుసూత్రముచే నిట తకారము ఇత్తు కా వీలులేదుగదా అని శంకింపఁబనిలేదు. 'తవర్గస్యేత్వ ప్రతిషేధో౽తద్ధితే' అనువార్తికము గలదు. తవర్గమునకు ఇత్వ నిషేధము తద్ధితభిన్న ప్రత్యయములందు మాత్రమే అనుటవలన నిది తద్ధిత ప్రత్యయమునందలిదగుటచే దీనికి ఇత్సంజ్ఞ కలుగును.

ఉదా : కిమ్ + ఙి, అత్, విభక్తిలోపము. కిమ్ + అ-తరువాతికార్యమును క్రిందిసూత్రము విధించును.

**సూ : క్వాతి 7-2-105.**

**వృ : కిమః. క్వ, కుత్ర.**

ప. వి : క్వ (ప్రథమలోపించిన పదము) అతి (7-1).

అను : కిమః (6-1).

అర్థ : కిమ్ శబ్దమునకు 'అత్' పరమగునపుడు 'క్వ' అనునాదేశము వచ్చును
ఉదా : క్వ.

వివ : 'అత్' అనుతద్ధిత ప్రత్యయము పరమగునపుడు 'కిమ్' అనుదానికి 'క్వ' అనునాదేశము వచ్చును. (అనేకాల్ సూత్రముచే నిదిసర్వాదేశము) కిమ్ + అ, క్వ + అ, అతోగుణే-పరరూపము 'క్వ' అవ్యయమగుటచే దీనికిచేరిన విభక్తి ప్రత్యయమునకు లుక్కు-వచ్చును.

అత్ ప్రత్యయము వైకల్పికమగుటచే రానియెడల 'త్రల్' ప్రత్యయము వచ్చును. కిమ్ + ఙి, త్రల్, కు ఆదేశము, కుత్ర. అదియు రానిచో 'కస్మిన్' అను విభక్త్యంతరూప ముండును.

**సూ : ఇతరాభ్యో౽పి దృశ్యన్తే 5-3-14.**

**వృ : పఞ్చమీ సప్తమీతర విభక్త్యన్తాదపి తసిలాదయో దృశ్యన్తే.**

ప. వి : ఇతరాభ్యః (5-3) అపి (అవ్య) దృశ్యన్తే (క్రి. ప).

అను : తసిల్, త్రల్. ఆదయః,

అర్థ : తసిలాదిప్రత్యయములు పంచమీసప్తమీవిభక్త్యంతములకే కాక ఇతర విభక్త్యంతములకును జేరుట కన్పట్టుచున్నది.

విష్ట : తసిల్ ప్రత్యయాదులు పంచమ్యంతకిమాదులకును, త్రల్ ప్రత్యయాదులు సప్తమ్యంతకిమాదులకును విధింపఁబడినవి. అవి యితరవిభక్త్యంతముల కును చేరుచుండుట ప్రయోగములలో కన్పట్టుచున్నదని యీ సూత్రము తాత్పర్యము.

అవ : పై సూత్రమున కనుబంధముగ క్రిందివార్తికము చెప్పఁబడుచున్నది.

**వా॥ దృశిగ్రహణాద్భవదాదియోగ ఏవ (వా 3244).**

**వృ : సభవాన్, తతోభవాన్, తత్రభవాన్, తతోభవన్తమ్, తత్ర భవన్తమ్. ఏవం దీర్ఘాయుః, దేవానాం ప్రియః, ఆయుష్మాన్.**

అవ : దృశిగ్రహణమువలన భవదాదిశబ్దములతో యోగమున్నపుడే ఇతర విభక్త్యంతములైన కిమాదులకు తసిలాదులగునని చెప్పవలయును. ఉదా : సభవాన్. మొ॥వి.

వివ : సూత్రమున 'దృశ్యన్తే' (కన్పట్టుచున్నవి) అను క్రియాపదమువలన నిది ప్రయోగానుసారముగా చూచుకొనవలసిన విషయమని చెప్పినట్లయినది. కావున 'భవత్' మున్నగుపదములతో కలయిక యున్నపుడే, అనగా భవదాదిశబ్దములు అనుసరించి ప్రయోగింపఁబడునపుడే ఇతరవిభక్త్యంతములగు కిమాదులకు తసిలాది ప్రత్యయములు కన్పట్టుచున్నవని వార్తికతాత్పర్యము.

ఉ॥ సభవాన్ – ఇందు 'సః' అనునది ప్రథమాంతము. ఆ యర్థములో తతో భవాన్, తత్రభవాన్ మున్నగునవియు వ్యవహరింపఁబడును. అనగా ఇచటి తతః తత్ర అనునవి ప్రథమాంతమగు తచ్ఛబ్దమునకు తసిల్, త్రల్ ప్రత్యయములు చేరగా నేర్పడిన రూపములని తాత్పర్యము. తతోభవన్తమ్, తత్రభవన్తమ్ అను చోట ద్వితీయాంతతచ్ఛబ్దమునకు తసిల్, త్రల్ ప్రత్యయములు చేరినవి.

భవదాదులలో దీర్ఘాయుః, దేవానాం ప్రియః, ఆయుష్మాన్ అనునవి కలవు. కావున తతోదీర్ఘాయుః, తత్రదీర్ఘాయుః ఇత్యాదులందును ప్రథమాంతతదాదులకు తసిల్, త్రల్ ప్రత్యయములు చేరును.

**సూ : సర్వైకాన్యకిం యత్తదః కాలే దా 5-3-15.**

**వృ : సప్తమ్యన్తేభ్యః కాలే దా స్యాత్**

ప. వి : సర్వ, ఏక, అన్య, కిమ్, యత్, తదః (5-1) కాలే (7-1) దా (1-1).

అను : విభక్తిః (1-1).

అర్థ : సర్వ, ఏక, అన్య, కిమ్, యత్, తత్ అను వాని సప్తమ్యంతరూపములకు కాలము తెలియఁబడునపుడు 'దా' ప్రత్యయము చేరును.

వివ : 'కాలము'ను దెలియఁజేసెడు సర్వస్మిన్, ఏకస్మిన్, అన్యస్మిన్, కస్మిన్, యస్మిన్, తస్మిన్ అనువానికి స్వార్థమునందు దా ప్రత్యయమువచ్చును.

ఉదా : సర్వస్మిన్‌కాలే; సర్వ + ఙి, దా, విభక్తిలోపము, సర్వదా - అవ్యయము.

అవ : దీనికి రూపాంతరమును గలదు. అది వివరింపబడుచున్నది.

**సూ . సర్వస్యసోఽన్యతరస్యాం ది 5-3-9.**

**వృ : దాదౌ ప్రాగ్దిశీయే సర్వస్య సోవా. సర్వస్మిన్ కాలే సదా; సర్వదా.**

ప. వి : సర్వస్య (6-1) సః (1-1) అన్యతరస్యామ్ (అవ్య)ది (7-1).

అర్థ : దకారాది ప్రాగ్దిశీయప్రత్యయము పరమగునపుడు 'సర్వ' శబ్దమునకు 'స' అనునాదేశము వచ్చును. ఉదా : సదా; సర్వదా.

వివ : 'ప్రాగ్దిశీయే' అనునది ప్రకరణమునుబట్టి గ్రహింపఁబడినది. 'ది' అనునది దానికి విశేషణము. తదాది విధిచే (యస్మిన్విధిస్తదాదావల్గ్రహణే) 'దకారాది ప్రాగ్దిశీయ ప్రత్యయము పరమగునపుడు' అమనర్థము కలిగినది. 'స' అనునది అనేకాలాదేశము (స్ + అ) కావున సర్వ అనుదానికి మొత్తమునకు వచ్చును. ఉదా : సర్వస్మిన్ కాలే, సర్వ + ఙి + దా, విభక్తిలోపము, స ఆదేశము-సదా. ఇది రానిచో సర్వదా అనురూపముండును. దా ప్రత్యయమురానియెడల 'సర్వస్మిన్‌కాలే' అనియుండును.

**అవ : ఏ కాదులకుదాహరణములు.**

**వృ : ఏకదా, అన్యదా, కదా, యదా, తదా.**

వివ : (1) ఏకస్మిన్‌కాలే - ఒకకాలమునందు ఏక + ఙి, దా విభక్తిలోపము, ఏకదా. (2) అన్యస్మిన్‌కాలే=మఱియొకకాలమునందు, అన్య + ఙి,

దా, అన్యదా: (3) కస్మిన్కాలే - ఏకాలమునందు, కిమ్+ఙి, దా, విభక్తిలోపము: కిమ్ + దా, కిమః కః (7-2-103) విభక్తి పరమగునపుడు కిమ్శబ్దమునకు 'క'అను నాదేశము వచ్చును. దా ప్రత్యయము విభక్తిసంజ్ఞకము. కదా. (4) యస్మిన్కాలే- యద్ + ఙి, దా, విభక్తిలోపము, త్యదాదీనామః, య + అ, దా, పరరూప సంధి, యదా. (5) తస్మిన్కాలే, తద్ + ఙి, దా, త + అ, దా, తదా.

దాప్రత్యయాంతము లవ్యయములు. కావున వానికి పరమైన సుప్పునకు లుక్కువచ్చును. ఈ ప్రత్యయము వైకల్పికమగుటచే రానిచో 'ఏకస్మిన్కాలే' మున్నగురూపములుండును.

అవ : సూత్రమునందలి 'కాలే' అనుపదముయొక్క సార్థక్యము పరిశీలింపఁ బడుచున్నది.

వృ : కాలేకిమ్? సర్వత్రదేశే.

వివ : సర్వాదిశబ్దములచే కాలము వాచ్యమగునపుడే 'దా' ప్రత్యయము వచ్చును. కావున 'సర్వస్మిన్ దేశే' అనుచోట 'దా' ప్రత్యయమురాదు. త్రల్ ప్రతయము 'సప్తమ్యా స్త్రల్' అనుసూత్రముచే వచ్చును. సర్వ + ఙి, త్రల్, సర్వత్ర.

సూ : ఇదమోర్హిల్ 5-3-16.

వృ : సప్తమ్యన్తాత్.

ప. వి : ఇదమః (5-1) ర్హిల్ (1-1).

అను : కాలే (7-1) విభక్తిః (1-1).

అర్థ : సప్తమ్యంతమగు ఇదమ్ శబ్దమునకు కాలార్థమున 'ర్హిల్' ప్రత్యయము వచ్చును.

వివ : 'అస్మిన్ కాలే' అనునర్థమున సప్తమ్యంతమగు 'ఇదమ్' శబ్దమునకు పరముగా 'ర్హిల్' ప్రత్యయము వచ్చును. లకారమిత్తు. ఇది 'ఇదమోహః' అను సూత్రముచే విధింపఁబడిన హ ప్రత్యయమున కపవాదము. ఉదా : అస్మిన్కాలే- ఈ కాలమునందు, ఇదమ్ +ఙి, ర్హిల్, విభక్తిలోపము. ఇదమ్ + ర్హి (ల్). ఇట్టిస్థితిలో వగు కార్యవిశేషము క్రిందిసూత్రముచే విధింపబడుచున్నది.

**సూ : ఏతేతౌ రథోః 5-3-4.**

**వృ : ఇదమః ఏత, ఇత్ ఏతౌ స్తో రేఫాదౌ థకారాదౌ చ ప్రాగ్దిశీయే పరే. అస్మిన్ కాలే ఏతర్హి.**

ప. వి : ఏతేతౌ (1-2) రథోః (7-2).

అర్థ : ఇదమ్ శబ్దమునకు, రేఫాదిప్రాగ్దిశీయమును, థకారాదిప్రాగ్దిశీయమును పరమగునపుడు క్రమముగా ఏత, ఇత్ అనునాదేశములు వచ్చును. ఉదా : ఏతర్హి.

వివ : ప్రకరణమునుబట్టి ప్రాగ్దిశీయే అనునది లబ్ధమగును. రథోః అనునది దానికి విశేషణము. వర్ణగ్రాహక సప్తమ్యంతము కావున తదాదివిధిచే 'రేఫాది, థకారాది ప్రాగ్దిశీయ ప్రత్యయము పరమగునపుడు' అనునర్థము కలుగును. అట్టి యెడ ఇదమ్ శబ్దమునకు క్రమముగా ఏత, ఇత్ అనునాదేశములు వచ్చును. ఇది అనేకాలాదేశము కావున సర్వమునకు వచ్చును. (అనేకాల్శిత్సర్వస్య).

ఉదా : ఇదమ్ + ఙి, ర్హిల్, ఇదమ్ + ర్హిల్, ఏతఆదేశము, ఏతర్హి. ఈకాలమునందు

థకారాదిప్రత్యయము పరమగునపుడు 'ఇత్' ఆదేశమునకు ఉదాహరణము సందర్భానుగుణముగా చూపఁబడును. ర్హిల్ ప్రత్యయాంతము అవ్యయము.

**వృ : కాలే కిమ్? ఇహ దేశే.**

వివ : 'ర్హిల్' ప్రత్యయము కాలము వాచ్యమగునపుడే వచ్చును కావున అస్మిన్ దేశే' - ఈదేశమునందు అనునర్థమున నదిరాదు. 'హ' ప్రత్యయము వచ్చి ఇహ(దేశే)' - అగును

**సూ : అనద్యతనే ర్హిలన్యతరస్యామ్ 5-3-21.**

**వృ : కర్హి-కదా, యర్హి-యదా, తర్హి-తదా.**

ప. వి : అనద్యతనే (7-1) ర్హిల్ (1-1) అన్యతరస్యామ్ (అవ్య).

అను : కిం సర్వనామబహుభ్యః (5 3) అద్వ్యాదిభ్యః (5-3) కాలే (7-1) విభక్తిః (1-1)

అర్థ : అనద్యతన మైనకాలము వాచ్యమగునపుడు కిమాదులకు ర్హిల్ ప్రత్యయము వైకల్పికముగా నగును. ఉదా : కర్హి - కదా మునిః.

వివ : అద్య = నేఁడు, అద్యతన = నేటికిసంబంధించినది, అనద్యతన = నేటిదికానిది - అట్టికాలవిశేషము వాచ్యమగునపుడు సప్తమ్యంతములగు కిమ్‌శబ్దమునకు, సర్వనామములకును, 'ర్హిల్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చును.రానిచో 'సర్వైకాన్య' అనుసూత్రముచే 'దా' ప్రత్యయమగును ఉదా : (1) కస్మిన్‌కాలే, కిమ్ + ఙి, ర్హిల్, విభక్తిలోపము. 'కిమః కః' అనుసూత్రముచే 'క' ఆదేశము కర్హి, లేనిచో కదా. (2) యస్మిన్‌కాలే - ఏకాలమునందు, యద్+ఙి, ర్హిల్ విభక్తిలోపము, దకారమునకు అకారాదేశము (త్యదాదీనామః) పరరూపసంధి (అతో గుణే) య+అ=యర్హి, యదా. (3) తస్మిన్‌కాలే, తద్ + ఙి, ర్హిల్, తద్ + ర్హి, త+అ, ర్హి, తర్హి, తదా.

ర్హిల్ ప్రత్యయాంతము లవ్యయములు.

అవ : ఏతస్మిన్ కాలే-ఈకాలమునందు అనునర్థమున ఏతద్ + ఙి, ర్హిల్, విభక్తికి లుక్కు వచ్చి 'ఏతద్ + ర్హి' అయియుండ క్రిందిసూత్రముచే కార్యవిశేషము చెప్పఁబడుచున్నది.

**సూ : ఏతదః 5-3-5.**

**వృ : ఏత, ఇత్ ఏతౌ స్తో రేఫాదౌ థాదౌ చ ప్రాగ్దిశీయే ఏతస్మిన్‌కాలే - ఏతర్హి.**

ప వి : ఏతదః (6-1).

అను : ఏతేతౌ (1-2) రథోః (7-2).

అర్థ : రేఫాదియు, థకారాదియునగు ప్రాగ్దిశీయ ప్రత్యయము పరమగునపుడు ఏతద్ శబ్దమునకు క్రమముగా ఏత, ఇత్ అను నాదేశములు వచ్చును ఉదా : ఏతర్హి.

వివ : పూర్వము 'ఇదమ్' శబ్దమునకు విధింపఁబడిన ఏత, ఇత్ అనునాదేశములు, ఏతద్ శబ్దమునకును, రేఫాదిథకారాది ప్రాగ్దిశీయ ప్రత్యయములు పరములగునపుడును, క్రమముగా వచ్చును.

ఉదా : ఏతస్మిన్‌కాలే, ఏతద్ + ఙి, ర్హిల్, విభక్తిలోపము. ఏతద్ ర్హిల్, 'ఏత' ఆదేశము, ఏతర్హి.

**సూ : ప్రకారవచనే థాల్ 5-3-23.**

వృ : ప్రకారవృత్తిభ్యః కిమాదిభ్యః థాల్. తేన ప్రకారేణ, తథా

వ. వి : ప్రకార వచనే (7-1) థాల్ (1-1).

అను : కింసర్వనామబహుభ్యః (5-3) అద్వ్యాదిభ్యః (5-3) విభక్తిః (1-1).

అర్థ : ప్రకారము అనునర్థమునందు కిమాదులకు 'థాల్' అను తద్ధితప్రత్యయము వచ్చును. ఉదా : తేన ప్రకారేణ - తథా.

వివ : 'ప్రకారవచనే' అనుపదమున సప్తమి పంచమ్యర్థకము. కావున 'ప్రకారవచనములగు కిమాదులకు పరముగా' అనునర్థము వచ్చును. ప్రకారమనగా విశేషము. సామాన్యముకంటె భిన్నముగా నుండుదానిని విశేషమందురు. దానిని వచించునపుడు కిమాదిశబ్దములకు 'థాల్' ప్రత్యయము వచ్చును. ఇందలి ప్రకారశబ్దముచే సాదృశ్యమనునర్థమును గ్రహింపరాదు.

తేన ప్రకారేణ - ఆ విధముగా-తద్ + థాల్, దకారమునకు అకారాదేశము (త్యదాదీనామః) త + అ, అతోగుణే-పరరూపసంధి, తథా. ఇది యవ్యయము. కాన దీనికి పరముగా వచ్చిన విభక్తిప్రత్యయమునకు లుక్కు వచ్చును. అట్లిది పదమగును.

సూ : ఇదమస్థముః 5-3-24.

వృ : థాలోఽపవాదః.

వ వి : ఇదమః (5-1) థముః (1-1).

అను : ప్రకారవచనే (7-1) విభక్తిః. (1-1).

అర్థ : ప్రకారవాచకమగు ఇదమ్ శబ్దమునకు 'థము' ప్రత్యయము వచ్చును ఇది థాల్ ప్రత్యయమున కపవాదము.

వివ : 'ఈ ప్రకారముగా' అనునర్థమున 'ఇదమ్' శబ్దమునకు పరముగా 'థము' ప్రత్యయము వచ్చును. ఇందు తుది ఉకారము ఉచ్చారణార్థకము.

ఉదా : ఇదమ్ + థమ్, 'ఏతేతౌరథోః' అను సూత్రముచే ఇదమ్ శబ్దమునకు 'ఇత్' ఆదేశము. ఇత్ థమ్ = ఇత్థమ్-ఇదియు నవ్యయము.

వా : ఏతదో వాచ్యః (3285)

వృ : అనేన ఏతేన వా ప్రకారేణ ఇత్థమ్.

ప వి : ఏతదః (5-1) వాచ్యః (1-1).

అర్థ : 'థము' ప్రత్యయము 'ఏతద్' అను సర్వనామమునకును చేరును.

వివ : సూత్రమున 'ఇదమ్' శబ్దమునకు మాత్రమే విధింపఁబడిన థము ప్రత్యయము వార్తికముచే 'ఏతద్' శబ్దమునకును వచ్చునని చెప్పఁబడినది. అనేన ఏతేన వా ప్రకారేణ=ఈః ప్రకారముగా, ఏతద్ + థము (ఏతదః)'ఇత్' ఆదేశము =ఇత్థమ్.

'ఏతద్' 'ఇదమ్' అను రెండు సర్వనామములును 'ఈః' అనునర్థమున సంస్కృతమున ప్రయోగింపఁబడును.

సూ : కిమశ్చ 5-3-25.

వృ : కేనప్రకారేణ, కథమ్.

వృ : కిమః (5-1) చ (అవ్య).

అను . ప్రకార వచనే (7-1) థముః (1-1).

అర్థ : ప్రకారార్థమున 'కిమ్' శబ్దమునకును 'థము' ప్రత్యయము చేరును.
ఉదా : కథమ్

వివ : 'థాల్' ప్రత్యయము ప్రాప్తించుచుండగా అపవాదముగా 'థము' ప్రత్యయము 'కిమ్'శబ్దమునకు 'ఏ ప్రకారముగా' అనునర్థమున విధింపబడినది.

కిమ్ + థము, కిమఃకః' అనుసూత్రముచే 'క' ఆదేశము. కథమ్. ఇదియు అవ్యయము.

ఇది ప్రాగ్దిశీయ ప్రకరణము.

**ప్రకరణావలోకనము :** కిమ్ శబ్దమునకు, ద్విమున్నగునవికాక తక్కిన సర్వనామములకును బహుశబ్దమునకు సాధారణముగా పంచమీ, సప్తమ్యర్థములలో వచ్చు తద్ధిత ప్రత్యయము లీప్రకరణమునఁ జెప్పఁబడినవి. తసిల్, త్రల్, హ, అత్, దా, ర్హిల్, థాల్, థము అను ప్రత్యయము లిందుఁ జెప్పఁబడినవి. ఈ ప్రత్యయములు వచ్చునపుడు కిమాదులకగు ననేకములైన మార్పు లిందు చెప్పఁబడినవి. ఈ ప్రత్యయాంతములన్నియు నవ్యయములు కావున వీనిపై విభక్తి ప్రత్యయము నిలువదు. అది వచ్చి లోపించుటవలన వీనికి పదత్వము సిద్ధించును. ఈ ప్రత్యయములకు విభక్తి సంజ్ఞ యుండుటవలన విభక్తి పరముగా నున్నపుడు జరుగు కార్య విశేషములిందు జరుగును.

# అథ ప్రాగివీయ ప్రకరణమ్.

అవ : 'ఇవే ప్రతికృతౌ' అనుసూత్రమునకు పూర్వమువఱకు విధింపఁబడు తమబాదిప్రత్యయములు గలప్రకరణమగుటచే దీనికి ప్రాగివీయప్రకరణ మని పేరు.

**సూ : అతిశాయనే తమబిష్ఠనౌ 5-3-55.**

**వృ : అతిశయ విశిష్టార్థవృత్తేః స్వార్థ ఏతౌ స్తః, అయమేషా మతిశయే నాఢ్యః = ఆఢ్యతమః; లఘుతమః-లఘిష్ఠః.**

ప. వి : అతిశాయనే (7-1) తమబిష్ఠనౌ (1-2).

అను : (5-1) తద్ధితః (1-1) ప్రత్యయః.

అర్థ : 'అతిశయముతోఁగూడినది' అనునర్థమును దెలుపు పదమునకు స్వార్థమునందు తమప్, ఇష్ఠన్ అను ప్రత్యయములు వచ్చును. ఉదా : ఇతఁడు వీరిలో అధికముగా ఆఢ్యుఁడు-ఆఢ్యతమః; లఘుతమః, లఘిష్ఠః.

వివ : అతిశాయనమనగా ఉత్కర్షము. అతిశయము అనువిశేషమును వ్యక్తము చేయునపుడు పదమునకు స్వార్థమునందు తమప్, ఇష్ఠన్ అనుప్రత్యయములు చేరును ఈ ప్రత్యయములు చేరిన రూపములు, 'అందఱిలో ఉత్కర్షము కలవాఁడు' అనునర్థమును బోధించును. 'ఇద్దఱిలో నొకఁడు ఉత్కర్ష కలవాఁడు' అనునర్థమున 'ద్వివచన....' ఇత్యాదిసూత్రముచే తరప్, ఈయసున్ ప్రత్యయములు విధింపఁబడుటచే, ప్రకృతసూత్రమునందలి ప్రత్యయములు, ఇద్దఱకంటె నెక్కువమందిలో ఉత్కర్షను చెప్పునపుడే వచ్చునను నర్థము సిద్ధించును.

ఉదా : అయమేషామతిశయేన ఆఢ్యః - ఇతఁడు వీరిలో అతిశయముగా ఆఢ్యుఁడు. అను నీయర్థమునందు 'ఆఢ్యః' అను విశేషణవాచకమునకు ఈ ప్రత్యయములు చేరును. ఆఢ్య + సు, తమప్ (పవర్ణమిత్తు) విభక్తిలోపము. ఆఢ్యతమ + సు=ఆఢ్యతమః.

అయమేషామతిశయేనలఘుః - ఇతఁడు వీరిలో నధికముగా లఘువు అనునర్థమున లఘుశబ్దమునకు తమప్ ప్రత్యయము. లఘు + సు, తమప్, విభక్తిలోపము, లఘుతమ + సు=లఘుతమః. ఇదే యర్థమున ఇష్ఠన్ ప్రత్యయము రాఁగా లఘు + సు + ఇష్ఠన్, (నకారమిత్తు) విభక్తిలోపము. లఘు+ఇష్ఠ-టేః -

(ఇష్ఠ, ఇమ, ఈయస్ అను ప్రత్యయములు పరములగునపుడు టికిలోపము వచ్చును) అను సూత్రముచే టిలోపము. లఘు + ఇష్ఠ = లఘిష్ఠ + సు = లఘిష్ఠః.

**సూ : తిఙశ్చ 5-3-56.**

**వృ : తిఙన్తాదతిశయే ద్యోత్యే తమప్ స్యాత్.**

ప. వి : తిఙః (5-1) చ (అవ్య).

అను : తమప్ (1-1).

అర్థ : అతిశయము తెలుపఁబడునపుడు 'తమప్' ప్రత్యయము తిఙంతము నకును పరముగా వచ్చును.

వివ : తద్ధిత ప్రత్యయములు ప్రాతిపదికసంజ్ఞగలవానికి, ఆయావిభక్త్యంత రూపములపై మాత్రమే చేరునని 'ఙ్యాప్ప్రాతిపదికాత్' (4-1-1) అనునధికార సూత్రము చెప్పుచున్నది. తిఙ్ ప్రత్యయములు ప్రాతిపదికములకు చేరవు. ఈతమప్ ప్రత్యయము తిఙంతములకును (క్రియాపదములకు) అతిశయము చెప్పఁబడునపుడు చేరునని యీ సూత్రముచే చెప్పఁబడినది. ఉదాహరణము ముందుఁ జూపఁబడు చున్నది.

**సూ : తరప్తమపౌ ఘః 1-1-22.**

ప. వి : తరప్, తమపౌ (1-2) ఘః (1-1).

అర్థ : తరప్, తమప్ అను రెండు ప్రత్యయములకును 'ఘ' అని పేరు.

వివ : 'అతిశాయనే తమబిష్ఠనౌ' అనుసూత్రమున విధింపఁబడిన తమప్, అనుదానికి, 'ద్వివచన విభజ్యోపపదే తరబీయసునౌ' అను వక్ష్యమాణ సూత్రముచే విధింపఁబడు 'తరప్' అను ప్రత్యయమునకును 'ఘ' అని సంజ్ఞ కావున నీవ్యా కరణమునందెందైన 'ఘ' అనునది వ్యవహరింపఁబడినదో ఈ రెండు ప్రత్యయ ములను గ్రహింపవలయును.

అవ : ముందు సూత్రమున దీని ప్రయోగము గలదు.

**సూ : కిమేత్తిఙవ్యయఘాదామ్వద్రవ్యప్రకర్షే 5-4-11.**

**వృ : కిమ ఏదన్తాత్తిఙోఽవ్యయాచ్చ యో ఘః తదన్తాదాము స్యాన్న తు ద్రవ్యప్రకర్షే. కింతమామ్, ప్రాహ్ణేతమామ్, పచతితమామ్, ఉచ్చైస్తమామ్. ద్రవ్యప్రకర్షే తు. ఉచ్చైస్తమః తరుః.**

వ. వి : కిమే.........ఘాత్ (5-1) అము (1-1) అద్రవ్య ప్రకర్షే(7-1).

అర్థ : ఘ ప్రత్యయాంతములైన కిమ్ శబ్దమునకును. ఏకారాంతమునకును, తిజంతమునకును, అవ్యయమునకు పరముగా 'అము' అను ప్రత్యయము వచ్చును. ద్రవ్యప్రకర్షము వ్యక్తమగునపుడు మాత్రమురాదు. ఉదా : కిన్తమామ్ మొ॥వి.

వివ : 'ఘ' అనగా తరప్, తమప్ అను ప్రత్యయములు అవి అంతమునఁ గల 'కిమ్' శబ్దము, ఏకారాంతశబ్దము, తిజన్తము (క్రియావాచకపదము) అవ్యయము అను వానికి పరముగా 'అము' అను ప్రత్యయము వచ్చును. ఈ ప్రత్యయముచేరిన రూపముచే ద్రవ్యముయొక్క ప్రకర్ష తెలియఁబడునేని ఇదిరాదు. ద్రవ్యమనగా లింగము, సంఖ్య, కారకము అనువానితో కూడినది. 'అము' ప్రత్యయమున ఉకార ముచ్చారణార్థకము.

ఉదా : 'కిమ్' శబ్దమునకు కేవల స్వార్థమున తమ ప్రప్రత్యయము చేరినది. అతిశయార్థమిట పొసఁగదు. వీరిలో అతిశయముగా నెవఁడు అనునట్టి అర్థము అసంభావ్యముకదా ! 'కింతమ' ప్రకృతసూత్రముచే 'అము' ప్రత్యయము. కింతమ + అమ్, యస్యేతిచ - అకారలోపము, కింతమామ్. అమ్ ప్రత్యయాం తము అవ్యయము.

ప్రాహ్ణమనగా పగటియొక్క పూర్వభాగము. 'అతిశయితే ప్రాహ్ణే' 'అతి శయమైన ప్రాహ్ణమునందు' అనునర్థమున 'ప్రాహ్ణే' అనుసప్తమ్యంత రూపమునకు 'తమప్' ప్రత్యయము. ప్రాహ్ణ + ఙి, తమ 'ఘకాల తనేషుకాలనామ్నః' 6-3-17 (ఘ ప్రత్యయమును కాలశబ్దమును, తన ప్రత్యయమును పరమగునపుడు సప్తమికి లుక్కురాదు) అను సూత్రముచే 'ఙి' ప్రత్యయమునకు లుక్కురాదు (సుపోధాతు ప్రాతిపదికయోః అనుదాని కిదిఅపవాదము) కావున 'ప్రాహ్ణే' అని యుండును. 'ప్రాహ్ణేతమ' అనుచోట ఏదంతమునకు పరముగా తమప్ ప్రత్యయమున్నది కావున ప్రకృత సూత్రముచే 'అము' ప్రత్యయము. ప్రాహ్ణేతమ+అమ్, అకారలోపము, ప్రాహ్ణేతమామ్.

'పచతి' అను తిజంతమునకు 'తిఙశ్చ' అనుసూత్రముచే 'తమప్ ప్రత్య యము. అతిశయేన పచతి - అతిశయముగా వండుచున్నాఁడు. 'పచతితమ' ప్రకృత సూత్రముచే 'అము' ప్రత్యయము. పచతితమ + అమ్, అకారలోపము. పచతిత మామ్.

'ఉచ్చైః' అనునది అవ్యయము. దీనికి అతిశయార్థమున 'తమప్' ప్రత్యయము. ఉచ్చైస్ + తమప్ = ఉచ్చైస్తమ + అమ్=ఉచ్చైస్తమామ్ - పఠతి' మిక్కిలి ఎక్కువగా పఠించుచున్నాఁడు. పఠనక్రియయందలి ఉచ్చైస్త్వముయొక్క ఆధిక్యమిట తమప్ ప్రత్యయముచే చెప్పఁబడును.

పై అన్ని ఉదాహరణములందును ద్రవ్యప్రకర్ష చెప్పఁబడలేదు. ప్రాహ్ణేతమాం కరోతి, ఉచ్చైస్తమాం పఠతి మున్నగుచోటులందు క్రియయొక్క ఉత్కర్షము వాచ్యమగుచున్నది. ద్రవ్యోత్కర్షము వాచ్యమగుచో 'అద్రవ్య ప్రకర్షే' అనుటవలన నీ 'ఆము' ప్రత్యయము రాదు. అతిశయేన ఉచ్చైః తరుః-మిక్కిలి ఎత్తైనచెట్టు. ఇచట తరువు ద్రవ్యము. దానియొక్క అతిశయము చెప్పఁబడుటచే ఉచ్చైస్తమశబ్దమున కిచట 'అమ్' ప్రత్యయము రాదు ఉచ్చైస్తమః తరుః.

సూ : ద్వివచన విభజ్యోపపదే తరబీయసునౌ 5-3-57.

వృ : ద్వయో రేకస్యాతిశయే విభక్తవ్యే చోపపదే సుప్తిఙన్తాదేతౌ స్తః. పూర్వయోరపవాదః. అయ మనయో రతిశయేన లఘుర్లఘుతరః. లఘీయాన్; ఉదీచ్యాః ప్రాచ్యేభ్యః పటుతరాః-పటీయాంసః.

ప. వి : ద్వివచన విభజ్యో పపదే (7-1) తరబీయసునౌ (1-2).

వ. వి : అతిశాయనే (7-1) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1) తిఙః (5-1)

అర్థ : ఇద్దఱిలో నొకనియొక్క అతిశయమును విభజింపవలసినప్పుడును, ఉపపదముగా నున్నపుడును సుప్తిఙంతములకు పరముగా తరప్, ఈయసున్ అను ప్రత్యయములు వచ్చును. ఇవి తమప్, ఇష్ఠన్ ప్రత్యయముల కపవాదములు. ఉదా : వీరిరువురిలో నితఁడు అతిశయముగా లఘువు - లఘుతరః, లఘీయాన్. ఉదీచ్యులు ప్రాచ్యులకంటె పటుతరులు, పటీయాంసులు.

వివ : ద్వివచనమనగా నిద్దఱను / రెంటిని చెప్పునది. విభజ్యమనగా విభజింపఁబడఁదగినది. విభజ్యమైనది అతిశయము. ద్వివచనము, విభజ్యమునైన ఉపపదమున్నపుడు అనగా రెంటిని చెప్పునదియు, విభజింపఁబడవలసినదియు నుపపదముగా నున్నపుడని యర్థము. అనగా రెండింటిలో నొకదాని అతిశయము

చెప్పవలసియున్నపుడు, ఆ రెంటిని వచించు పదము ఉపపదముగా (సమీపమున నుండు పదముగా) నున్నపుడును, విభజింపఁబడవలసిన దానిని బోధించు పదము ఉపపదముగా నున్నపుడును సుబంతతిజంతములకు పరముగా తరప్, ఈయసున్ అను ప్రత్యయములు చేరును. తద్ధితప్రత్యయములు సుబంతములకే వచ్చునను సిద్ధాంతమువలన (సుబన్తాత్తద్ధితోత్పత్తిః; సుబంతములకును, 'తిఙశ్చ' అను సూత్రము అనువృత్తమగుటవలన తిజంతములకును ఇవి చేరుననుట వ్యక్తమైనది

(1) రెంటిలో నొకదాని యతిశయమును చెప్పుటకు ఉదాహరణము : అయ మనయో రతిశయేన లఘుః - ఇతఁడు వీరిరువురిలో నుక్కిలిగా తేలికయైనవాఁడు. 'అనయోః' అనునది యిచట ఉపపదము. లఘు + సు + తరప్, విభక్తిలోపము (పకారమిత్తు) లఘుతర + సు = లఘుతరః. 'ఈయసున్' ప్రత్యయమును ఈ యర్థమున రావచ్చును. లఘు + సు + ఈయసున్. ప్రత్యయమున నకారమిత్తు. ఉకారముచ్చారణార్థకము. లఘు + ఈయస్, టేః అను సూత్రముచే టిలోపము లఘీయస్+సు = లఘీయాన్.

ఇద్దఱుకాక అనేకవ్యక్తులలో నొకని యతిశయము చెప్పవలసినచో ఈ ప్రత్యయములు రావు. తమప్, ఇష్ఠన్ ప్రత్యయములు వచ్చును.

(2) విభజింపఁబడవలసినది ఉపపదముగానున్నపు డుదాహరణము. ఉదీచ్యాః ప్రాచ్యేభ్యః పటుతరాః, పటీయాంసః - ఉదీచ్యులు ప్రాచ్యులకంటె పటుతరులు, పటీయాంసులు. ఇచట ప్రాచ్యులనుండి విభజింపఁబడువారైన ఉదీచ్యులను చెప్పు పదమగు 'ఉదీచ్యాః' అనునది సమీపమున నుచ్చరింపఁబడు పదమగుటచే (ఉపపదమగుటచే) 'పటు' అను విశేషణశబ్దమున కీప్రత్యయములు వచ్చినవి పటు + జస్ + తర, పటుతర + జస్ = పటుతరాః. పటు + ఈయస్ (ఉన్) టేః అను సూత్రముచే టిలోపము. పట్ + ఈయస్ = పటీయస్ + జస్ = పటీయాంసః.

ఈ సూత్రమునందలి 'ఉపపదము' ధాత్వధికారములో నిర్వచింపఁబడినది కాదు. సమీపమున నుచ్చరితమైన పదమను నవయవార్థముతోనే యిందు గ్రహింపవలయును.

ఇట్లు, తరప్, ఈయసున్ ప్రత్యయములు రెంటిలో నొకదాని అతిశయమును జెప్పునపుడును, తమప్, ఇష్ఠన్ ప్రత్యయములు రెండుకంటె నెక్కువైన వానిలో నొకదాని అతిశయమును జెప్పునపుడును వచ్చుననుట వ్యక్తమైనది. ఇవి ఆంగ్లములోని Comparative Degree, Superlative Degree అనువానికి స్థూలముగా సమానార్థకములు.

ఈ నాల్గింటిలో అజాదిప్రత్యయములగు 'ఇష్ఠన్' 'ఈయసున్' అనునవి గుణవాచకములకు మాత్రమే చేరునను నియమము గలదు (అజాదీగుణవచనాదేవ 5-3-58) దీనినిబట్టియే తిజంతములకు, తదితరగుణవచనములు కాని వానికిని తర ప్తమ ప్రత్యయములు మాత్రమే చేరుననియు, గుణవాచకములగు లఘు, పటు మున్నగువానికి ఈ నాల్గు ప్రత్యయములును రావచ్చుననియు స్పష్టమైనది.

సూ : ప్రశస్యస్య శ్రః 5-3-60.

వృ . ఇష్ఠేయసోః పరతః.

ప. వి : ప్రశస్యస్య (6-1) శ్రః (1-1).

అను : అజాదీ (1-2).

అర్థ : ఇష్ఠ, ఈయస్ ప్రత్యయములు పరములగునపుడు ప్రశస్య శబ్దమునకు 'శ్ర' అనునాదేశము వచ్చును.

వివ : అనువృత్తిగా వచ్చిన 'అజాదీ' అనుపదమును సప్తమ్యంతముగా మార్చుకొనవలయును. కావున పై ప్రత్యయములు నాల్గింటిలో 'అజాదులగు ఇష్ఠన్, ఈయసున్ అనునవి పరమగునపుడు' అనునర్థము సిద్ధించును (తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య). అవి పరమగునపుడు 'ప్రశస్య' అనుశబ్దమునకు 'శ్ర' అనునాదేశము కలుగును. అనేకవర్ణములుగల ఆదేశమగుటచే 'ప్రశస్య' అను మొత్తమును తొల గించి వచ్చును (అనేకాల్ శిత్సర్వస్య).

ఉదా : అయమనయోః అతిశయేన ప్రశస్యః - ఇతఁడు వీరిరువురిలో అతి శయముగా ప్రశస్యుఁడు (ప్రశంసించుటకు యోగ్యుఁడు) అనునర్థమున 'ప్రశస్య' శబ్దమునకు ద్వివచనేత్యాది సూత్రముచే 'ఈయసున్' ప్రత్యయము. ప్రశస్య + సు + తరప్, విభక్తిలోపము, శ్రఆదేశము. 'శ్ర + ఈయస్,' ఇట 'ఠేః' అను సూత్రముచే టిలోపము ప్రాప్తమగుచుండగా క్రిందిసూత్రముచే వారింపఁబడు చున్నది.

సూ : ప్రకృత్యైకాచ్ 6-4-163.

వృ : ఇష్ఠాదా వేకాచ్ ప్రకృత్యా స్యాత్. శ్రేష్ఠః, శ్రేయాన్.

ప. వి. ప్రకృత్యా (3-1) ఏకాచ్ (1-1).

అను : ఇష్ఠేమేయఃసు (7-3).

అర్థ : ఇష్ఠాదులు పరములగునపుడు ఏకాచ్చు ప్రకృతితో నుండును. ఉదా : శ్రేష్ఠః, శ్రేయాన్.

వివ : ఇష్ఠ, (ఇష్ఠన్) ఇమ (ఇమనిచ్) ఈయస్ (ఈయసున్) అను ప్రత్యయములు పరములగునపుడు ఒకే అచ్చుగల శబ్దభాగము ప్రకృతిభావముతో నుండును. 'అల్లోపోఽనః' అనుసూత్రముచే ప్రాప్తమగు అకారలోపమునకును, 'యస్యేతిచ' అనుసూత్రముచే ప్రాప్తమగు ఇకారాకారలోపమునకును, 'నస్తద్ధితే' 'టేః' అనుసూత్రములచే ప్రాప్తమగుటిలోపమునకును ఇది బాధకము. కావున ఇష్ఠాదులు పరములగునపుడు ఏకాచ్చులయెడ నీసూత్రములు ప్రవర్తింపవని తాత్పర్యము.

ఉదా : శ్ర + ఈయస్, గుణము, శ్రేయస్ + సు=శ్రేయాన్. అస్తి అయమేతేషామతిశయేన ప్రశస్యః - ఇతఁడు వీరందఱిలో మిక్కిలిగా ప్రశస్యుఁడు అనునర్థమున, ప్రశస్యశబ్దమునకు ఇష్ఠన్ ప్రత్యయము (అతిశాయనే తమబిష్ఠనౌ) ప్రశస్య + సు + తమప్ = విభక్తిలోపము, 'శ్ర' ఆదేశము శ్ర + ఇష్ఠ, ప్రకృతిభావము విధింపఁబడుటచే 'టేః' అనుసూత్రముచే ప్రాప్తమగు టిలోపము రాదు. గుణమేకాదేశమగును (అద్గుణః) శ్రేష్ఠ + సు = శ్రేష్ఠ.

సూ : జ్య చ 5-3-61.

వృ : ప్రశస్యస్య జ్యాదేశః స్యాదిష్ఠేయసోః. జ్యేష్ఠః.

వ. వి : జ్య (ప్రథమావిభక్తిలోపించినపదము) చ (అవ్య).

అను : ప్రశస్యస్య (6-1) అజాదీ (1-2).

అర్థ : ఇష్ఠ, ఈయస్ ప్రత్యయములు పరములగునపుడు ప్రశస్యశబ్దమునకు 'జ్య' అనునాదేశము కూడ వచ్చును. ఉదా : జ్యేష్ఠః.

వివ : ఇంతకు పూర్వము ప్రశస్యశబ్దమునకు విధింపఁబడిన శ్రాదేశముతో పాటు 'జ్య' అనునాదేశము కూడ ఇష్ఠ, ఈయస్ ప్రత్యయములు పరములగునపుడు వచ్చును. ఉదా : ప్రశస్య + సు + ఇష్ఠ, జ్య + ఇష్ఠ, టిలోపము ప్రకృత్యైకాచ్ అను సూత్రముచే వారింపఁబడఁగా గుణమేకాదేశమై జ్యేష్ఠ + సు=జ్యేష్ఠః అగును.

అవ : ఈయస్ ప్రత్యయము పరమగునపుడు జ్యాదేశము కలిగి 'జ్య + ఈయస్'అనియుండ క్రిందిసూత్రముచే కార్య విశేషము చెప్పఁబడుచున్నది.

సూ : జ్యాదాదీయసః 6-4-160.

వృ : జ్యాయాన్. 'ఆదేః పరస్య'.

ప. వి. జ్యాత్ (5-1) ఆత్ (1-1) ఈయసః (6-1).

అర్థ : 'జ్య' అనుదానికి పరముగా నున్న ఈయస్ ప్రత్యయమునకు ఆకార మాదేశమగును, ఉదా : జ్యాయాన్, 'ఆదేః పరస్య' అను పరిభాషచే ఆద్యక్షర మున కాదేశమైనది.

వివ : 'జ్య' అనుదానికి పరముగానున్న ఈయస్ ప్రత్యయమునకు విధింపఁబడిన 'ఆ' అనునాదేశము 'ఆదేఃపరస్య' అను పరిభాషచే ఈయస్ అనుదాని తొలివర్ణమగు ఈకారస్థానమున వచ్చును. జ్య+ఈయస్, జ్య + ఆయస్=జ్యాయస్ + సు =జ్యాయాన్. ఈయిరువురిలో ఇతఁడు ప్రశస్యుఁడు అని యర్థము.

సూ . బహోర్లోపో భూచ బహోః 6-4-158.

వృ: బహోః పరయో రిమేయసో ర్లోపస్స్యాద్బహోశ్చ భూరాదేశః. భూమా - భూయాన్.

ప వి : బహోః (5-1) లోపః (1-1) భూ (ప్రథమావిభక్తి లోపించిన పదము) చ (అవ్య) బహోః (6-1).

అను : ఇష్ఠేమేయస్సు (7-3).

అర్థ : బహుశబ్దమునకు పరముగానున్న ఇమన్, ఈయస్ ప్రత్యయముల తొలివర్ణమునకు లోపమగును. 'బహు' అనుదానికి 'భూ' అనునాదేశము కూడనగును. ఉదా : భూమా - భూయాన్.

వివ : మొదటి బహోః' అనునది పంచమ్యంతము కావున 'తస్మాదిత్యుత్తరస్య' అనుపరిభాషచే దానికి పరముగానున్న అనునర్థము కలుగును. పరముగా నుండవలసినవి ఇష్ఠన్, ఇమనిచ్, ఈయసున్ ప్రత్యయములు. వీనికి విధింపఁబడిన లోపమనుకార్యము 'ఆదేః పరస్య' (పరమునకు విహితమైన కార్యము పరముగా నున్నదాని ఆదివర్ణమునకగును) అను పరిభాషచే వీని తొలివర్ణములకు వచ్చును. అందు 'ఇష్ఠన్' ప్రత్యయమునకు కార్యాంతరవిధానము తరువాతి సూత్రమున చేయఁబడుచుండుటవలన నది యిందువదలఁబడినది. కావున బహుశబ్దమునకు పరముగా నున్న ఇమన్, ఈయస్ అను ప్రత్యయములయొక్క తొలివర్ణములగు ఇ ఈ లకు లోపము వచ్చును అనునర్థము సిద్ధించినది. రెంతవ 'బహోః' అనునది

షష్ఠ్యంతము. 'షష్ఠీస్థానేయోగా' అను పరిభాషచే 'బహు అనుదాని స్థానము'న అనునర్థమేర్పడును. 'భూ' అనునాదేశము ఈ ప్రత్యయములు పరములగునపుడు 'బహు' అనుదానికి వచ్చును. 'అనేకాల్ శిత్సర్వస్య' అను పరిభాషచే 'బహు'అను దానిని మొత్తముగా తొలగించి 'భూ' ఆదేశము వచ్చును.

ఉదా : బహోః భావః - బహుసంఖ్యగలదానిభావము అనునర్థమున బహు శబ్దమునకు 'పృథ్వాదిభ్య ఇమనిజ్వా' అను సూత్రముచే ఇమనిచ్ ప్రత్యయము. బహు + ఙస్ + ఇమనిచ్, విభక్తిలోపము, బహు + ఇమన్, ప్రకృతసూత్రముచే ప్రత్యయములోని తొలివర్ణమగు ఇకారమునకు లోపము, శబ్దమునకు భూ ఆదేశము భూ + మన్ + భూమన్ + సు=భూమా.

అయమనయోరతిశయేన బహుః ఇతఁడు వీరిరువురిలో మిక్కిలిగా అధికుఁడు అనునర్థమున 'ఈయసున్' ప్రత్యయము (ద్వివచనవిభజ్యోపపదే తరబీయసునౌ) బహు + సు+ఈయసున్, విభక్తిలోపము, ఈకారలోపము, భూ ఆదేశము. భూ + యస్=భూయస్ + సు=భూయాన్.

అవ : ఇష్ఠన్ప్రత్యయమునకు సంబంధించిన కార్యవిశేషము చెప్పఁబడుచున్నది.

సూ : ఇష్ఠస్య యిట్ చ 6-4-159.

వృ : బహోః పరస్య ఇష్ఠస్య లోపః స్యాద్యిడాగమశ్చ. భూయిష్ఠః.

ప వి : ఇష్ఠస్య (6-1) యిట్ (1-1) చ (అవ్య).

అను : బహోః (5-1) లోపః (1-1).

అర్థ : బహుశబ్దమునకు పరముగానున్న 'ఇష్ఠన్' ప్రత్యయముయొక్క ఇకారమునకు లోపమును, 'యిట్' అనునాగమమును కూడనగును. ఉదా : భూయిష్ఠః.

వివ : ఇది 'బహోర్లోపో భూచబహోః' అనుసూత్రమునకు అనుబంధముగా చెప్పఁబడినది. కావున బహుశబ్దమునకు పరముగానున్న ఇష్ఠన్ ప్రత్యయము యొక్క ఇకారమునకు లోపమును, ప్రత్యయమునకు 'యిట్' అనునాగమమును, బహుశబ్దమునకు 'భూ' అనునాదేశమును కలుగునని తాత్పర్యము. 'యిట్'లో టకారమిత్తు. కావున వది అద్యవయవముగా నాగమమగును. (ఆద్యన్తౌటకితౌ).

ఉదా : అయమేతేషామతిశయేన బహుః - ఇతఁడు వీరిలో మిక్కిలిగా అధికుఁడు. బహు + సు + ఇష్ఠన్ (అతిశాయనే తమబిష్ఠనౌ) విభక్తిలోపము. ఇకారలోపము, బహు + ష్ఠ, 'యి' అగమము బహు + యిష్ఠ, భూ ఆదేశము భూయిష్ఠ + సు = భూయిష్ఠః.

సూ : విన్మతోర్లుక్ 5-3-65.

వృ : ఇష్ఠేయసోః. అతిశయేన స్రగ్వీ స్రజిష్ఠః-స్రజీయాన్. అతిశయేన త్వగ్వాన్ - త్వచిష్ఠః-త్వచీయాన్.

ప. వి : విన్మతోః (6-2) లుక్ (1-1).

అను : అజాదీ (1-2).

అర్థ : ఇష్ఠ, ఈయస్ ప్రత్యయములు పరములగునపుడు విన్, మత్ ప్రత్యయములకు లుక్కు వచ్చును. ఉదా : స్రజిష్ఠః-స్రజీయాన్ మొ॥వి.

వివ : 'అది యితనికిఁగలదు' అనునర్థమున వచ్చిన విని, మతుప్ ప్రత్యయములంతమునఁ గల పదములకు, ఇష్ఠ, ఈయస్ ప్రత్యయములు పరములైనచో విన్, మత్ ప్రత్యయములకు లుక్కు (అదర్శనము) వచ్చును.

ఉదా : స్రగ్ అస్యఅస్తీతి స్రగ్వీ - 'అస్మాయామేధాస్రజోవినిః' అను సూత్రముచే 'స్రజ్' శబ్దమునకు మత్వర్థమున 'విని' ప్రత్యయముచేరగా 'స్రగ్వీ' అయినది. అతిశయేన స్రగ్వీ అనునర్థమున 'అతిశాయనే తమబిష్ఠనౌ' అను సూత్రముచే ఇష్ఠన్ ప్రత్యయము. స్రగ్విన్ + సు, ఇష్ఠన్, విభక్తిలోపము, ప్రకృత సూత్రముచే 'విన్' ప్రత్యయమునకు లుక్కు, స్రజ్ + ఇష్ఠ = స్రజిష్ఠ + సు = స్రజిష్ఠః-విన్ ప్రత్యయము నిమిత్తముగా వచ్చిన పదత్వము, అది అదర్శనమగుటచే పోవును గావున చోఃకుః అనుసూత్రముచే కుత్వమురాదు కుత్వము పదసంజ్ఞ కల దానికే వచ్చును.

అయమనయో రతిశయేన స్రగ్వీ - ఇతఁడు వీరిరువురిలో మిక్కిలిగా స్రగ్వి (మాలలుగలవాఁడు) అనునర్థమున 'స్రగ్వీ' అనుదానికి ఈయసున్ ప్రత్యయము. (ద్వివచన విభజ్యోపపదే తరబీయసునౌ) స్రగ్విన్ + సు + ఈయసున్, విభక్తిలోపము, ప్రకృతసూత్రముచే 'విన్' ప్రత్యయమునకు లుక్కు. స్రజ్ + ఈయస్ = స్రజీయస్ + సు = స్రజీయాన్.

మతుప్ప్రత్యయమునకు లుక్కు - అతిశయేన త్వగ్వాన్, త్వగ్వత్+సు + ఇష్ఠన్, విభక్తిలోపము, మతుబ్లుక్కు, త్వచ్ + ఇష్ఠ=త్వచిష్ఠ + సు=త్వచిష్ఠః. (శ్రేష్ఠమగు చర్మముగలవారిలో నుత్కర్షకలవాఁడు).

అయమనయో రతిశయేన త్వగ్వాన్, త్వచ్ + మత్ + సు + ఈయస్ ను, మత్ ప్రత్యయములకులుక్కు. త్వచీయస్+సు=త్వచీయాన్ (మంచిచర్మము గల యిరువురిలో నధికుఁడు).

తరప్ - ఈయసున్, తమప్-ఇష్ఠన్ అను ప్రత్యయములకు సంబంధించిన విధానము పూర్తి అయినది.

సూ : ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్యదేశీయరః 5-3-68.

వృ : ఈషదూనో విద్వాన్-విద్వత్కల్పః, విద్వద్దేశ్యః విద్వద్దేశీయః.

ప. వి : ఈషదసమాప్తౌ (7-1) కల్పప్, దేశ్య, దేశీయరః (1-3).

అర్థ : 'కొంచెము తక్కువ' అనునర్థమున సుబంతతిజంతములకు కల్పప్, దేశ్య, దేశీయర్ అను ప్రత్యయములు వచ్చును. ఉదా : ఈషదూనో విద్వాన్, విద్వత్కల్పః - ఇత్యాది.

వివ : సమాప్తి అనగా తుదిముట్టుట అనియర్థము. అట్లు తుదిముట్టకుండుట అసమాప్తి. అది ఈషత్-కొంచెము అయినచో ఈషదసమాప్తి-అనగా పూర్తి అగుటకు కొంచెము తక్కువ అనియర్థము. అట్టియర్థము వ్యక్తముచేయుచు సుబంతమునకు తిజంతమునకు పరముగా స్వార్థమున కల్పప్, దేశ్య, దేశీయర్అను ప్రత్యయములు వచ్చును. ఇందు పవర్ణమును, రేఫమును ఇత్తులు.

ఉదా : ఈషదూనో విద్వాన్-కొంచెము తక్కువ పండితుఁడు, పాండిత్యము యొక్క సమాప్తికి కొంచెము తక్కువలో నున్నవాఁడని భావము. విద్వస్ స + కల్ప, విభక్తిలోపము, 'స్వాదిష్వసర్వనామస్థానే' (1-4 17) (సర్వనామస్థానభిన్నములైన కప్రత్యయావధికములగు స్వాదిప్రత్యయములు పరమగునపుడు పూర్వమునకు పదసంజ్ఞ కలుగును) అను సూత్రముచే 'విద్వస్' అనుదానికి పదసంజ్ఞ కలుగును. 'ఝలాంజశోఽన్తే' అను సూత్రముచే సకారమునకు జశ్త్వము దకారము, అరిచ, చర్త్వము - విద్వత్కల్ప+సు=విద్వత్కల్పః.

అట్లే విద్వస్+దేశ్య,విద్వద్+దేశ్య = విద్వద్దేశ్య + సు = విద్వద్దేశ్యః. విద్వస్, దేశీయర్, విద్వద్+దేశీయ=విద్వద్దేశీయ సు=విద్వద్దేశీయః. ఈ రెండుదాహరణములలో చర్త్వప్రసంగమునకు తావులేదు

**సూ : విభాషా సుపో** బహుచ్పురస్తాత్తు 5-3-68.

**వృ : ఈషదూనః** పటుః బహుపటుః; పటుకల్పః, సుపః కిమ్? పచతి కల్పమ్.

ప. వి : విభాషా (1-1) సుపః (5-1) బహుచ్ (1-1) పురస్తాత్ (అవ్య) తు (అవ్య).

అను : ఈషదసమాప్తౌ (7-1).

అర్థ : 'కొంచెము తక్కువ' అనునర్థమున సుబంతములకు బహుచ్ప్రత్యయము ముందుభాగమునఁ జేరును. ఉదా : ఈషదూనః పటుః. బహుపటుః, పటుకల్పః. సుపః అననేలః పచతి కల్పమ్.

వివ : 'కొంచెముతక్కువ' అనునర్థమును వ్యక్తముచేయుచు సుబంతములకు 'బహుచ్' ప్రత్యయము చేరును ప్రత్యయము లన్నియు దేనికి విధింపఁబడునో దానికి పరముగా చేరును. కాని యిది సుబంతమునకు ముందుభాగమునఁ జేరును.

ఉదా : ఈషదూనః పటుః - కొంచెము తక్కువతనముగల పటువు. పటుత్వము కొంచెము తక్కువగా గలవాఁడనిభావము. పటు + సు=బహు (చ్) పటు + సు (చకారమిత్తు) అర్థవదధాతురిత్యాదిసూత్రముచే ప్రాతిపదికసంజ్ఞ. విభక్తిలోపము. బహుపటుః. ఇది వైకల్పికము కాన రానిచో పైసూత్రముచే కల్పప్ మున్నగునవి. పటు + సు+కల్పప్ = పటుకల్ప + సు=పటుకల్పః.

ఈ ప్రత్యయము సుబంతములకే వచ్చుననుటచే క్రియావాచకములయిన తిఙంతములకు రాదు. ఉదా : పచతికల్పమ్-ఈషదూనం పచతి-కొంచెము తక్కువగా వండుచున్నాఁడు. ఇచట పూర్వసూత్రముచే కల్పప్రత్యయము.

**సూ : ప్రాగివాత్కః 5-3-70.**

**వృ : ఇవేప్రతికృతౌ ఇత్యతః ప్రాక్కాధికారః.**

ప. వి : ప్రాక్ (1-1) ఇవాత్ (5-1) కః (1-1).

అర్థ : 'ఇవే ప్రతికృతౌ' అనుసూత్రమునకు పూర్వమువఱకు కప్రత్యయాధికారము.

వివ : సూత్రమునందలి ఇవాత్ అనునది ఇవశబ్దఘటిత సూత్రమువఱకు అనువర్తము నిచ్చును. అది 'ఇవే ప్రతికృతౌ' 5-3-96 అనునది ఈ సూత్రము మొదలుకొని ఆ సూత్రమునకు పూర్వమువఱకు 'కః' అనునది అధికారరూపమున ప్రవేశించును. అనగా విశేషప్రత్యయము విధింపఁబడనిచో ఈ పరిధిలో కప్రత్యయము ఉపస్థితమగునని తాత్పర్యము.

సూ : అవ్యయసర్వనామ్నా మకచ్ ప్రాక్ టేః 5-3-71.

వృ : కాపవాదః.

ప వి : అవ్యయసర్వనామ్నామ్ (6-3) అకచ్ (1-1) ప్రాక్ (1-1) టేః (5-1).

అను : ప్రాక్ (1-1) ఇవాత్ (5-1).

అర్థ : 'ఇవే ప్రతికృతౌ' అనుసూత్రమునకు పూర్వమువఱకుఁ గలసూత్రములలోఁ జెప్పఁబడిన యర్థములందు అవ్యయములయు, సర్వనామములయు టి భాగమునకు ముందు 'అకచ్' ప్రత్యయము వచ్చును. ఇది క ప్రత్యయమున కపవాదము.

వివ : పూర్వసూత్రమున కప్రత్యయాధికారము చెప్పఁబడినది ఈ సూత్రముచే 'అకచ్' ప్రత్యయము విధింపఁబడినది. 'ఇవే ప్రతికృతౌ' అను సూత్రమునకు పూర్వమువఱకుఁ గల అర్థములలో అవ్యయములకును, సర్వనామములకును టికి ముందు అకచ్ ప్రత్యయమును, తదితరములకు పరముగా 'క' ప్రత్యయమును అగునని తాత్పర్యము.

సూ . అజ్ఞాతే 5-3-73.

వృ : కస్యాయమశ్వోఽశ్వకః, ఉచ్చకైః, నీచకైః, సర్వకే.

ప. వి : అజ్ఞాతే (7-1)

అను : కః (1-1) అవ్యయసర్వనామ్నామ్ (6-3) అకచ్ (1-1) ప్రాక్ (1-1) టేః (5-1).

అర్థ : అజ్ఞాతమైనది అనునర్థమున సుబంతములకు క ప్రత్యయ మగును. అవ్యయ సర్వనామములకు వాని టి భాగమునకు ముందు 'అకచ్' ప్రత్యయము వచ్చును. ఉదా : అశ్వకః ఇత్యాది.

వివ : అజ్ఞాతమనగా తెలియఁబడనిది. ఆ యర్థమును వ్యక్తముచేయుచు అవ్యయ సర్వనామేతరములకు క ప్రత్యయము వచ్చును. అవ్యయసర్వనామముల టి భాగమునకు పూర్వమున 'అకచ్' ప్రత్యయము వచ్చును. ఇందు చకారమిత్తు. కలోని అకారముచ్చారణార్థకము.

ఉదా : కస్యాయమశ్వః – ఇది ఎవరిగుఱ్ఱము? అజ్ఞాతమనునర్థమును దెలుపుట కీవాక్య ముపయోగింపఁబడినది. 'అజ్ఞాతోఽశ్వః' అని విగ్రహము, అశ్వ + సు + క, విభక్తిలోపము – 'అశ్వక' అశ్వక + సు = అశ్వకః–ఎవరిదో తెలియని గుఱ్ఱము.

అవ్యయముల కుదాహరణము అజ్ఞాతముచ్చైః – తెలియఁబడని ఎత్తు ఉచ్చైస్ – ఇందు టి భాగము ఐస్, దానికి పూర్వమున అక్ ప్రత్యయము రాగా ఉచ్చ్ అక్ ఐస్ = ఉచ్చకైస్ అగును. ఇది అవ్యయమగుటచే దీనికి చేరిన సువ్వునకు లుక్కు వచ్చును. సకారమునకు రుత్వ విసర్గములు ఉచ్చకైః.

ఇట్లే నీచైః – నీచ్ + ఐస్, నీచ్ అక్ ఐస్ = నీచకైస్ = నీచకైః.

సర్వనామముల కుదాహరణము : సర్వ, ఇందు టి తుది అకారము సర్వ్ + అక్ + అ=సర్వక + జస్ (ప్రథమాబహువచనము). ఇచట జస్ ప్రత్యయమునకు 'శీ' ఆదేశము. సర్వక + ఈ (శకారమిత్తు) గుణము సర్వకే. తెలియఁబడనివారని యర్థము.

**సూ : కుత్సితే 5-3-74.**

**వృ : కుత్సితోఽశ్వోఽశ్వక .**

ప. వి : కుత్సితే (7-1).

అను : కః మున్నగునవి.

అర్థ 'కుత్సితమైనది' అనునర్థమును వ్యక్తము చేయుచు క, అకచ్ ప్రత్యయములు యథాసంభవముగ వచ్చును.

వివ : 'యథాసంభవముగ' ననగ అవ్యయసర్వనామముల టీ భాగమునకు ముందు 'అకచ్' ప్రత్యయమును, తక్కినవానికి పరముగ క ప్రత్యయమును వచ్చునని తాత్పర్యము.

ఉదా : కుత్సితోఽశ్వః = కుత్సితమైన గుఱ్ఱము. అశ్వ + సు + క విభక్తిలోపము. అశ్వక + సు=అశ్వకః.

సూ : కిం యత్తదో నిర్ధారణే ద్వయోరేకస్య డతరచ్ 5-3-92.

వృ : అనయోః కతరో వైష్ణవః. యతరః, తతరః.

ప. వి : కింయత్తదః (5-1) నిర్ధారణే (7-1) ద్వయోః(7-2)ఏకస్య (6-1) డతరచ్ (1-1).

అర్థ : రెంటిలో నొకదానియొక్క నిర్ధారణమునందు కిమ్, యద్, తద్ అను వానికి డతరచ్ ప్రత్యయము వచ్చును. ఉదా : కతరః.

వివ : నిర్ధారణమనగా వేఱుచేయుట. ఇద్దఱిలో / రెంటిలో నొకనిని / నొకదానిని వేఱుచేయునపుడు నిర్ధరింపఁబడు దానిని / వానిని వచించుపదములగు కిమ్, యద్, తద్ అనువానికి 'డతరచ్' అను తద్ధితప్రత్యయము చేరును. ఇందు డకారచకారము లిత్తులు (చుటూ, హలన్త్యమ్.)

ఉదా : కిమ్+సు+డతరచ్ విభక్తిలోపము, కిమ్ + అతర, టిలోపము (టేః) క్ + అతర = కతర + సు=కతరః - అనయోః కతరో వైష్ణవః - వీరిరువురిలో వైష్ణవుఁడెవరు? కతరశబ్దముచే వైష్ణవత్వగుణము గలవానిని అది లేని వానినుండి వేఱుచేయుచున్నామని తాత్పర్యము.

యద్+సు+డతరచ్, యద్+అతర, టిలోపము, య్+అతర=యతర+ సు=యతరః తద్ + డతరచ్, తతర + సు = తతరః. అనయోః యతరః వైష్ణవః - వీరిరువురిలో నెవడు వైష్ణవుఁడో, అనయోః తతరః వైష్ణవః - వీరిరువురిలో అతఁడు వైష్ణవుఁడు ఇత్యాదిగా వీని యర్థము నెఱుఁగవలయును.

సూ : వా బహూనాం జాతిపరిప్రశ్నే డతమచ్ 5-3-93.

వృ : జాతి పరిప్రశ్న ఇతిప్రత్యాఖ్యాత మాకరే. కతమో భవతాం కఠః,యతమః. తతమః వాగ్రహణమకజర్థమ్. యకః. సకః.

ప వి : వా (అవ్య) బహూనామ్ (6-3) జాతి పరిప్రశ్నే (7-1) డతమచ్ (1-1).

అను : కిం యత్తదః (5 1) నిర్ధారణే (7-1) ఏకస్య (6-1).

అర్థ : అనేకులయందొకని నిర్ధరించునపుడు, జాతి పరిప్రశ్నమునందు నిర్ధార్య మాణులను తెలుపు కిమ్, యద్, తద్ శబ్దములకు పరముగా డతమచ్ ప్రత్యయము వచ్చును. జాతి పరిప్రశ్నమనునది సూత్రమునుండి తొలఁగింపఁబడవచ్చునని

భాష్యమునఁ జెప్పఁబడినది. ఉదా : కతమః ఇత్యాది. వాగ్రహణము అకచ్ ప్రత్యయముకొఱకు చేయఁబడినది. ఉదా : యకః, సకః.

వివ : పూర్వసూత్రమున నిద్దఱిలో నొకని నెన్నుట చెప్పఁబడినది. అనేకులలో నొకనిని ఎన్నవలసినపుడు, అట్లెన్నుటలో జాతినిగూర్చిన ప్రశ్నము తెలియఁబడునపుడు, కిమ్, యద్, తద్ అనుపదములకు 'డతమచ్' ప్రత్యయము చేటునని యీ సూత్రము చెప్పుచున్నది ఈ సూత్రమున 'జాతిపరిప్రశ్నే' అనునది తీసివేయఁదగునని భాష్యకారులు చెప్పిరి కావున జాతిని ప్రశ్నించుటయే కాక నామాదులను ప్రశ్నించుటయందును ఈ ప్రత్యయము రావచ్చును.

ఉదా : కిమ్+డతమచ్ (డకారచకారములిత్తులు) కిమ్ + అతమ, టిలోపము క్ + అతమ = కతమ + సు = కతమః యద్ + సు=డతమచ్ య్+ అతమ=యతమ + సు = యతమః, తద్ + సు+డతమచ్, త్ + అతమ = తతమ + సు=తతమః.

కతమో భవతాం కఠః? =మీలో ఎవఁడు కఠశాఖకు చెందినవాఁడు? కఠశాఖనధ్యయనము చేయువారందఱు నొకజాతి. కావున నిచట జాతిప్రశ్నమున్నది యతమోభవతాం కఠఃసదేవదత్తః-మీలోనెవఁడు కఠశాఖకు చెందినవాఁడో వాఁడు దేవదత్తుడు. భవతాంతతరః కఠః. మీలోవాఁడు కఠుఁడు. 'జాతిపరిప్రశ్నే' అనుదానిని తొలగింపవచ్చుననుటవలన 'భవతాం కతమోదేవదత్తః' - మీలో నెవఁడు దేవదత్తుఁడు ఇత్యాది విధముగను ఉండవచ్చును.

సూత్రమున 'వా' అనుపదమును గ్రహించుటవలన నిదివైకల్పికము కావున రానిచో నీయర్థమున 'అకచ్' ప్రత్యయము వచ్చును.

ఉదా : య్+అక్+అద్=యకద్ + సు, త్యదాదీనామః అనుసూత్రముచే దకారమున కకారాదేశము, పరరూపసంధి యక + సు=యకః. త్ అక్+అద్ = తకద్+సు, త్యదాద్యత్వము, పరరూపసంధి, తక + సు (తదోస్సస్సావనన్త్యయోః 7-2-106) త్యదాదుల అనంత్యములైన తకారదకారములకు సకారము సు ప్రత్యయము పరమగునపుడు అగును). సక + సు=సకః.

ఇది ప్రాగివీయ ప్రకరణము.

ప్రకరణావలోకనము : అనేకులలో నొకని ఆధిక్యమును దెలుపునపుడు వచ్చు తమప్, ఇష్ఠన్ ప్రత్యయములును, ఇద్దఱిలో నొకని అతిశయమును

దెలుపు నపుడువచ్చు తరప్, ఈయసున్ ప్రత్యయములును ఇందు ముందు తెలుపఁబడినవి ఆ ప్రత్యయాంతములకు కొన్నియెడల వచ్చు 'అమ్' ప్రత్యయమును విధింపఁబడినది. ఇష్ఠన్, ఈయసున్ ప్రత్యయములు పరములగునపుడువచ్చుకార్యవిశేషములు- శ్ర, జ్య ఆదేశములు, ఈయస్ ప్రత్యయములోని ఈకారమున కాకారాదేశము, బహుశబ్దమునకు పరముగా ఆ ప్రత్యయముల తొలిఅచ్చులకు లోపము వచ్చుట మున్నగునవియు నిందు చెప్పఁబడినవి. కొంచెము తక్కువ అనునర్థమును తెలుపు కల్పప్, దేశ్య, దేశీయర్ ప్రత్యయములును, బహుచ్ ప్రత్యయమును ఇందు విధింపఁబడినవి క్, అకచ్ ప్రత్యయములు అజ్ఞాత, కుత్సితార్థములందు ప్రదర్శింపఁబడినవి ఇరువురిలో నొకనిని నిర్ధరించుట యనునర్థమున వచ్చుడతరచ్ ప్రత్యయమును, అనేకులలో నొకనిని నిర్ధరించుటయను నర్థమున వచ్చుడతమచ్ ప్రత్యయమును సోదాహరణముగ ప్రదర్శింపఁబడినవి.

# అథ స్వార్థిక ప్రకరణమ్.

అవ : స్వార్థమనగా తనయొక్క అర్థము. ప్రకృతియొక్క అర్థముకంటె భిన్నము కాని యర్థమును ఇట స్వార్థమందురు అట్టి యర్థమునందు విధింపఁబడు ప్రత్యయములు గల ప్రకరణమగుటచే దీనికి స్వార్థికప్రకరణమనిపేరు.

**సూ : ఇవే ప్రతికృతౌ 5-3-96**

**వృ : కన్ స్యాత్. అశ్వ ఇవ ప్రతికృతిః అశ్వకః.**

ప. వి : ఇవే (7-1) ప్రతికృతౌ (7-1).

అను : కన్ (1-1) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1).

అర్థ : ఇవార్థమున వర్తమానమగు ప్రాతిపదికమునకు ప్రతికృతి గమ్యమానమగునపుడు 'కన్' ప్రత్యయము వచ్చును ఉదా: అశ్వమువంటి ప్రతికృతి(బొమ్మ) అశ్వకః.

వివ : 'ఇవ' అనునది పోలికను దెలియఁజేయును. ప్రతికృతి యనఁగా మట్టి మున్నగువానితో చేయఁబడిన ప్రతిమ. ఉపమానవాచకములకు, పరముగా, ఉపమేయమగు ప్రతికృతిని తెలియఁజేయుచు కన్ ప్రత్యయము చేరును. ఇందు నకారమిత్తు. ఉదా : అశ్వ ఇవప్రతికృతిః - అశ్వమువంటి ప్రతిమ. అశ్వ + సు + కన్, విభక్తిలోపము. అశ్వక + సు=అశ్వకః. స్వార్థికప్రత్యయములు ప్రకృతిననుసరించియే లింగవచనములను పొందును (స్వార్థికాః ప్రకృతితో లింగ వచనాన్య నువర్తన్తే) అనున్యాయము ననుసరించి 'అశ్వక' శబ్దము 'ప్రతికృతి'అను స్త్రీలింగశబ్దమును చెప్పునది అయినను ప్రకృతియగు 'అశ్వ' శబ్దమును బట్టి పుంలింగమైనది.

**వా॥ సర్వప్రాతిపదికేభ్యః స్వార్థే కన్.**

**వృ : అశ్వకః.**

ప వి : సర్వప్రాతిపదికేభ్యః (5-3) స్వార్థే (7-1) కన్ (1-1).

అర్థ : సర్వప్రాతిపదికములకును స్వార్థమున 'కన్' ప్రత్యయము వచ్చును. ఉదా : అశ్వకః.

వివ : ప్రాతిపదికములన్నింటికిని విశేషార్థమును దేనిని స్ఫురింపఁజేయకయే దానికి సహజముగాఁ గల అర్థమునందే 'కన్' అను ప్రత్యయము రావచ్చును,

ఉదా : అశ్వ ఏవ అశ్వకః. అశ్వమనగా నేమి యర్థమో అశ్వకమనినను అదియ యర్థము. అశ్వ + కన్ (నకారమిత్తు) అశ్వకః.

సూ : తత్ప్రకృతవచనే మయట్ 5-4-21.

వృ : ప్రాచుర్యేణ ప్రస్తుతం ప్రకృతమ్; తస్యవచనం ప్రతిపాదనమ్. భావేఽధికరణే వా ల్యుట్. ఆద్యే. ప్రకృతమన్నమన్నమయమ్; అపూపమయమ్ ద్వితీయేతు-అన్నమయో యజ్ఞః; అపూపమయం పర్వ

ప. వి . తత్ (1-1) ప్రకృతవచనే (7-1) మయట్ (1-1)

అను : తద్ధితః (1-1) ప్రత్యయః (1-1).

అర్థ : ఆధిక్యముతో ప్రస్తుతమైనది ప్రకృతము. వచనమనగా దానియొక్క ప్రతిపాదనము ప్రకృతము ప్రతిపాదింపఁబడునపుడు ప్రథమాంతములకు 'మయట్' ప్రత్యయము వచ్చును. ఇందు వచనమనునది భావమునఁగాని అధికరణార్థమునఁగాని వచ్చిన ల్యుట్ ప్రత్యయమంతమునఁగలరూపము. మొదటిపక్షమున ప్రకృతమన్నమన్నమయమ్, అపూపమయమ్ మున్నగువిధముగానగును. రెండవపక్షమున నైనచో అన్నమయో యజ్ఞః. అపూపమయం పర్వ అను విధముగా నగును.

విప : 'తత్' అనునది యిట విధింపఁబడినప్రత్యయము ప్రథమావిభక్త్యంతములకు పరముగా చేయుటను సూచించును. ప్రకృతవచనము అనుదానికి ప్రకృతము యొక్క వచనము అని యర్థము. ప్రకృతమనగా అధికరూపమున ఉపస్థితమైనది= కూడి ఉన్నది అని యర్థము. వచనము అనునది 'వచ్' ధాతువునకు ల్యుట్ ప్రత్యయము రాఁగా నేర్పడిన రూపము. ఇచటి ల్యుట్ ప్రత్యయము భావార్థమునఁ గాని, అధికరణార్థమునఁగాని వచ్చినదిగా భావింపనగును. భావార్థమైనచో వచనమనగా ప్రతిపాదనము = ప్రతిపాదించుట. ప్రకృతమును ప్రతిపాదించుట యనగా అధికముగా ఉపస్థితమైన వస్తువుయొక్క స్థితిని తెలుపుట - అట్లు తెలుపునపుడు ప్రథమాంతపదమునకు 'మయట్' ప్రత్యయము చేరును.

ఉదా : ప్రకృతమన్నమ్ = అధికముగా ఉపస్థితమైన (ఉన్న) అన్నము - అన్న + సుః మయట్ (టకారమిత్తు) విభక్తిలోపము. అన్నమయ + సు=అన్నమయమ్, ఇచట అన్నము అధికముగా నుండుటను మయట్ ప్రత్యయము వ్యక్తము చేయుచున్నది. ఇట్లే ప్రకృతమపూపమ్ - అధికముగా ఉపస్థితమైన అపూపము (భక్ష్యము) అపూప + సు, మయట్ - అపూపమయ + సు = అపూపమయమ్.

వచనమ్ అనుచోట అధికరణార్థమును భావించినచో ప్రక్రియతే = ప్రతిపాద్యతే యస్మిన్ తత్ ప్రకృతవచనమ్-ప్రకృతమైనది దేనియందు ఉన్నదని చెప్పఁబడునో అది ప్రకృత వచనము అనునర్థము సిద్ధించును. దీనినిబట్టి ప్రకృతమైన (అధికముగా ఉపస్థితమైన) వస్తువు దేనియందుఁగలదని వచింతుమో దానిని (ఆ అధికరణమును) తెలుపుచు వస్తువాచక ప్రథమాంతమునకు పరముగా మయట్ ప్రత్యయము వచ్చును.

ఉదా : ప్రకృత మన్నం యస్మిన్ = దేనియందు అధికముగా సమకూడిన అన్నముగలదో అది. అన్న + సు, మయట్, విభక్తిలోపము. అన్నమయ+సు=అన్నమయః యజ్ఞః. ఇచట ప్రత్యయము అధికరణమైనదానిని బోధించుచున్నది కాన ఈ పక్షమున నిది స్వార్థిక ప్రత్యయము కాఁజాలదు. అయినను సాధారణముగా స్వార్థమునందే ప్రత్యయములు విధింపఁబడును. క్వాచిత్కముగా ఇతరార్థములందును రానగునని సంభావింపవలయును.

ఇట్లే ప్రకృతాని అపూపాని యస్మిన్ - పర్వణి అధికములైన అపూపము లెందుఁ గలవో ఆపర్వము. అపూప + జస్, మయట్, విభక్తిలోపము, అపూపమయ + సు = అపూపమయమ్. అధికరణవాచకమగు పర్వశబ్దము నపుంసకము కావున నిదియు నపుంసకమైనది.

భావార్థమున మయట్ప్రత్యయాంతమునకు సామాన్యమైన నపుంసకత్వము కలుగును.

**సూ : ప్రజ్ఞాదిభ్యశ్చ 5-4-38.**

**వృ : అణ్ స్యాత్. ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః, దైవతమ్.**

ప. వి : ప్రజ్ఞాదిభ్యః (5-3) చ (అవ్య).

అను : అణ్ (1-1).

అర్థ : ప్రజ్ఞమున్నగువానికి స్వార్థమున అణ్ ప్రత్యయము వచ్చును.

ఉదా : ప్రాజ్ఞః, దైవతమ్.

వివ : ప్రకృతియొక్క అర్థముకంటె భిన్నము కాని అర్థమునందు, ప్రజ్ఞమున్నగుశబ్దములకు అణ్ ప్రత్యయము చేరును. అనగా అణ్ ప్రత్యయము రాకముందు ప్రజ్ఞాదుల కేయర్థముండునో వచ్చిన తరువాతకూడ ఆ యర్థమే యుండునని తాత్పర్యము.

ఉదా : ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః-ప్రజ్ఞ + అణ్, ఆదివృద్ధి, ప్రాజ్ఞ + అ, యస్యేతి చ - అకారలోపము, ప్రాజ్ఞ్ + అ=ప్రాజ్ఞ + సు=ప్రాజ్ఞః-ప్రాజ్ఞః-ప్రాజ్ఞ డాగునా తెలిసినవాఁడు.

దేవతా + అణ్, ఆదివృద్ధి, దైవతా+అ, యస్యేతిచ - అకారలోపము - దైవత+సు=దైవతమ్ (ఈ శబ్దము పుంనపుంసకములలో నుండును)

ప్రజ్ఞాదిగణము : ప్రజ్ఞ వణిజ్ ఉశిజ్ ఉష్ణిజ్ ప్రత్యక్ష [విద్వస్] విదన్ షోడన్ విద్యా మనస్. 'శ్రోత శరీరే' 145. జుహ్వత్. కృష్ణమృగే 146. చికీర్షత్ చోర శత్రు యోధ చక్షుస్ వసు (ఏనస్) మరుత్ క్రుఞ్చ సత్వన్తు దశార్హ వయస్ (వ్యాకృత) అసుర రక్షస్, పిశాచ, అశని, కార్షాపణ దేవతా బన్ధు- ఇతి ప్రజ్ఞాదిః.

సూ : బహ్వల్పార్థాచ్ఛస్కారకాదన్యతరస్యామ్ 5-4-42.

వృ : బహూని దదాతి బహుశః, అల్పశః.

ప. వి : బహ్వల్పార్థాత్ (5-1) శస్ (1-1) కారకాత్ (5-1) అన్యతరస్యామ్ (అవ్య).

అర్థ : కారకసంజ్ఞగల బహు, అల్ప అనునర్థముగలశబ్దములకు 'శస్' అను ప్రత్యయము వైకల్పికముగా నగును. ఉదా : బహుశః, అల్పశః.

వివ : బహ్వల్పార్థకములై కారకసంజ్ఞగల శబ్దములకు పరముగా శస్ ప్రత్యయము వైకల్పికముగా నగును. కారకములనగా కర్మాదులు. క్రియతో నన్వయించునవి.

ఉదా : బహూనిదదాతి అనేకముల నిచ్చుచున్నాఁడు ఇచ్చుట అను వ్యాపారములో 'బహూని' అనునది కర్మవాచకము కాన కారకము బహు + శస్ + శస్ (మొదటిశస్ అనునది ద్వితీయాబహువచనప్రత్యయము. రెండవది తద్ధితము) విభక్తిలోపము. బహుశస్ ఇది అవ్యయమగును. కావున దీనికిచేరిన సుప్పునకు లుక్కువచ్చును. సకారమునకు రుత్వవిసర్గములు. బహుశః. ఇట్లే అల్పానిదదాతి- అల్ప + శస్ + శస్ - అల్ప + శస్=అల్పశః.

వా : ఆద్యాదిభ్య స్తసే రుపసంఖ్యానమ్ 3339.

వృ : ఆదౌ ఆదితః, మధ్యతః, అన్తతః, పృష్ఠతః, పార్శ్వతః. ఆకృతిగణోఽయమ్, స్వరేణ-స్వరతః, వర్ణతః.

వ. వి : అద్యాదిభ్యః - (5-3) తసేః (6-1) ఉపసంఖ్యానమ్ (1-1).

అర్థ : అద్యాది శబ్దములకు పరముగా 'తసి' ప్రత్యయమును చెప్పవలెను. ఉదా : ఆదితః మొ॥వి. ఇది ఆకృతిగణము. కాన స్వరేణ-స్వరతః, వర్ణతః మున్నగునవియగును.

వివ : ఆదిమున్నగు శబ్దములకు అన్ని విభక్తుల యర్థములందును 'తసి' ప్రత్యయము వచ్చును. ఇందు తుది ఇకారము ఉచ్చారణార్థకము.

ఉదా : ఆదౌ - ఆదియందు - ఆది + తస్ = ఆదితస్ = ఇది అవ్యయము. కావున సుప్పులు చేరి లోపించును. సకారమునకు రుత్వవిసర్గములు ఆదితః- ఇది సప్తమీ విభక్త్యర్థమున వచ్చినది. ఇట్లే, మధ్యే - మధ్యతః-మధ్యయందు, పృష్ఠే - పృష్ఠతః = పృష్ఠమువైపు; పార్శ్వే = పార్శ్వతః - పార్శ్వమునందు మున్నగునవి. అద్యాదిగణము ఆకృతిగణము. దానిచే విభక్త్యర్థమున 'తస్' ప్రత్యయము చేరిన వానికన్నింటికిని ఈ వార్తికమే గతియని తాత్పర్యము. ఉదా : స్వరేణ - స్వర + తస్=స్వరతః-స్వరముచేత ఇట తసిప్రత్యయము తృతీయా విభక్త్యర్థకము. ఇట్లే వర్ణేన - వర్ణతః-వర్ణముచేత మొ॥వి.

అద్యాదిగణము : ఆది మధ్య అన్త పృష్ఠ పార్శ్వ - ఇత్యాద్యాదిః - ఆకృతిగణః.

**సూ : కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః 5-4-50.**

**వా॥ అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్ (3340).**

**వృ : వికారాత్మతాం ప్రాప్నువత్యాం ప్రకృతౌ వర్తమానాద్వికారశబ్దాత్ స్వార్థే చ్విర్వాస్యాత్ కరోత్యాదిభిర్యోగే.**

వ. వి : కృభ్వస్తియోగే (7-1) సంపద్యకర్తరి (7-1) చ్విః(1-1) అభూతతద్భావే (7-1) ఇతి (అవ్య) వక్తవ్యమ్ (1-1).

అను : వా (అవ్య).

అర్థ : కృ, భూ, అస్, ధాతువులతో యోగమున్నపుడు వికారాత్మత్వమును పొందుచున్న ప్రకృతియందు వర్తమానమగు వికారవాచకమునకు పరముగా 'చ్వి' ప్రత్యయము వైకల్పికముగా నగును.

వివ : సంపద్యకర్త అనగా సంపద్యముయొక్క కర్త అనియర్థము. సంపద్యమనగా అయినది, ఏర్పడినది, సాధింపబడినది అనియర్థము. అట్లు సాధింపబడిన

దానియొక్క కర్తను సంపద్యకర్త యందురు. ఏది ఏదిగా సాధింపఁబడినది? అను ఆకాంక్షకు సమాధానముగా వార్తికకారులు 'అభూతతద్భావే' అని చెప్పిరి. ఇదివఱకు ఆ విధముగా లేనిది ఆ విధముగానగుట యీ పదమున కర్థము. ఒకవస్తువు తనకు పూర్వములేని రూపము ఇప్పుడు పొందుట అని తాత్పర్యము. వికారాత్మతను పొందిన = పూర్వము తనకులేనిరూపమును పొందిన, ప్రకృతియందు = మూలపదార్థమును చెప్పుటయందు, వర్తమానమగు = ఉండు; వికారవాచకశబ్దమునకు = మార్పు చెందినదానిని వచించు శబ్దమునకు పరముగా 'చ్వి' ప్రత్యయము వచ్చును.

ఈ ప్రత్యయము ప్రకృతివాచకమునకు (మార్పుచెందని స్థితిలో నున్నదానిని వచించుదానికి) రాదు. వికారవాచకమునకు (మార్పుచెందిన దాని వచించుదానికి) వచ్చును. ఇట్లనుటలో వ్యాఖ్యానమే శరణ్యము.

ఉదా : అకృష్ణః కృష్ణః సంపద్యతే-ఇదివఱకు కృష్ణవర్ణముగా లేనిది ఇప్పుడు కృష్ణవర్ణము గలదిగా నేర్పడుచున్నది. ఒకవస్తువు పూర్వము నల్లగా లేదు. ఇప్పుడు నల్లగా అగుచున్నది. ప్రకృతి నల్లగాలేని ఆ వస్తువు. వికారాత్మతను పొందినది నల్లగానైన ఆ వస్తువు. కృష్ణః అను వికారస్వరూపమును పొందినదానిని వచించు పదము లక్షణార్థముచే ప్రకృతియగు 'అకృష్ణః' అనుదానియర్థము నొసఁగును. ఇట్టి యర్థమునందు కృష్ణశబ్దమునకు 'చ్వి' ప్రత్యయము వచ్చునని తాత్పర్యము.

ఈ ప్రత్యయమున చకారమిత్తు (చుటూ). ఇకారముచ్చారణార్థకము. 'వ్' అనుదానికి 'వేరపృక్తస్య' అనుసూత్రముచే లోపము వచ్చును. ఇట్లే ప్రత్యయము సర్వలోపి. అయినను దీనిని నిమిత్తముగా చేసికొని కొన్నికార్యవిశేషములు జరుగును. అవి క్రింద చెప్పఁబడుచున్నవి.

సూ : అస్య చ్వౌ 7-4-32.

వృ : అవర్ణస్య ఈత్ స్యాచ్చ్వౌ. అకృష్ణః కృష్ణః సమ్పద్యతే, తంకరోతి కృష్ణీకరోతి; బ్రహ్మీభవతి, గఙ్గీస్యాత్.

ప. వి : అస్య (6-1) చ్వౌ 7-1.

అను : ఈ (1-1).

అర్థ : చ్వి ప్రత్యయము పరమగునపుడు అకారమునకు ఈత్వము వచ్చును.
ఉదా : కృష్ణీకరోతి ఇత్యాది.

వివ : చ్వి ప్రత్యయము పరమగునపుడు అవర్ణముయొక్క స్థానమున దీర్ఘ ఈకారము వచ్చును.

ఈ ప్రత్యయము కృ = చేయు, భూ=ఉండు, అగు, అస్=ఉండు, అను ధాతువులతో సంబంధమున్నపుడే వచ్చును. వానికి క్రమముగా ఉదాహరణములు.

అకృష్ణం కృష్ణంకరోతి - కృష్ణము కానిదానిని కృష్ణముగా చేయుచున్నాడు కృష్ణ + సు + చ్వి, విభక్తిలోపమునకు అకారమునకు ఈకారాదేశము కృష్ణ + ఈ= కృష్ణీ' చ్వి ప్రత్యయము సర్వలోపి కావున 'కృష్ణీ' అనియగును. ఇది అవ్యయము - కృష్ణీకరోతి - కృష్ణవర్ణముగా లేనివానిని వేషాదులచేత కృష్ణవర్ణము గలవానినిగా చేయుచున్నాఁడని యర్థము. ఇచట అకృష్ణుఁడనగా కృష్ణుఁడుకాని నటుఁడు. అతఁడు ప్రకృతిభూతుఁడు. అతఁడు కృష్ణభావమను వికారమును పొంది అట్లగుటవలన సంపద్యకర్తయగును. ఇట్లు వికారమును పొందినవానిని తెలుపు 'కృష్ణః' అనునది, ప్రకృతియగు అకృష్ణుని అభేదారోపము (భేదములేదని చెప్పుట)చే చెప్పుచున్నది అట్టి కృష్ణశబ్దమునకు 'చ్వి' ప్రత్యయ మయ్యెనని తెలియఁదగును.

అబ్రహ్మ బ్రహ్మ సంపద్యమానంభవతి - పూర్వము బ్రహ్మము కానిది బ్రహ్మముగా నగుచున్నది. బ్రహ్మ + సు, చ్వి, విభక్తిలోపము, అకారమునకు ఈకారాదేశము బ్రహ్మ + ఈ = బ్రహ్మీ+సు= బ్రహ్మీ భవతి.

అగఙ్గా గఙ్గా సంపద్యమానా స్యాత్-గంగగానిది గంగగా అగును. గఙ్గా + చ్వి, ఈకారాదేశము గఙ్గీ స్యాత్.

అవ : అస్య చ్వౌ అనుసూత్రమున కొక అపవాదము వీక్రింది వార్తికము చెప్పుచున్నది.

**వా॥ అవ్యయస్య చ్వౌ ఈత్వం నేతివాచ్యమ్ (5052).**

**వృ : దోషాభూతమహః, దివాభూతా రాత్రిః.**

ప వి : అవ్యయస్య (6-1) చ్వౌ (7-1)ఈత్వమ్ (1-1) న (అవ్య) ఇతి (అవ్య) వాచ్యమ్ (1-1).

అర్థ : అవ్యయమునకు చ్వి ప్రత్యయము పరమగునపుడు ఈత్వము రాదని చెప్పనగును. ఉదా : దోషాభూతమహః, దివాభూతారాత్రిః.

వివ : 'అస్య చ్వౌ' అనుసూత్రముచే విధింపఁబడిన ఈకారాదేశము అవ్యయముల తుది అకారమునకు రాదని తాత్పర్యము.

ఉదా : అదోషాదోషాసంపద్యమానం భూతమ్. రాత్రికానిది రాత్రి గానయినది. 'దోషా' శబ్దము రాత్రి అనునర్థముగల అవ్యయము. దోషా + చ్వి-దోషా.

ఈత్వమురాలేదు, దోషాభూతమ్ అహః=రాత్రి గానయిన పగలు. మేఘాదులచే గాఢముగా నావరింపఁబడి చీకటిగానైన పగటిభాగమని దీనికర్థము.

అదివా దివా సంపద్యమానం-పగలుకానిది పగలు గానయినది దివా + చ్వి- దివా, ఈత్వము రాలేదు. దివాభూతా (కుగతిప్రాదయః అనుసూత్రముచే సమాసము) రాత్రిః - పగటివలెనైన రాత్రి. అతిశయమైన దీపములకాంతిచే పగటివలె భాసిల్లు రాత్రియని యర్థము.

సూ : విభాషా సాతి కార్త్స్న్యే (5-4-52.)

వృ : చ్వి విషయే సాతిర్వాస్యాత్ సాకల్యే.

ప వి : విభాషా (1-1) సాతి (ప్రథమలోపించిన పదము) కార్త్స్న్యే (7-1)

అను : కృభ్వ స్తియోగే (7-1) సంపద్యకర్తరి (7-1)

అర్థ : చ్విప్రత్యయము వచ్చు విషయమున సాకల్యము గమ్యమానమగు నపుడు 'సాతి' అను ప్రత్యయము వచ్చును.

విప : కృత్స్నము యొక్క-భావము కార్త్స్న్యము. అనగా సాకల్యము = పూర్తి అని యర్థము. అది చెప్పవలసి వచ్చినపుడు కృ, భూ, అస్ ధాతువులతో యోగమున్నపుడు అభూతతద్భావముగల సంపద్యకర్త్రర్థమున 'సాతి' ప్రత్యయము వచ్చును. ఉదాహరణము ముందు సూత్రమునఁ జూపఁబడుచున్నది. (సాతి ప్రత్యయమున ఇకారముచ్చారణార్థకము).

సూ : సాత్పదాద్యోః 8-3-111.

వృ : సస్య షత్వం న. దధిసించతి, కృత్స్నంశస్త్రం అగ్నిస్సంప ద్యతే అగ్నిసాద్భవతి.

ప. వి : సాత్పదాద్యోః 6-2.

అను : మూర్ధన్యః (1-1) న (అవ్య) సః (6-1).

అర్థ : పదాది సకారమునకును, సాత్ప్రత్యయసకారమునకును షత్వమురాదు. ఉదా : దధిసించతి. అగ్నిసాద్భవతి.

వివ : 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే ప్రాప్తమగు షత్వమునకు ఇది నిషేధము. ఇణ్‌వర్ణములకును, కవర్గమునకును పరముగానున్న ఆదేశ ప్రత్యయముల సకారమునకు షత్వము రావలసియున్నది. అట్టి సకారము పదము యొక్క ఆదివర్ణమైనయెడలను, 'సాత్' ప్రత్యయసంబంధమైన యెడలను షత్వము రాదని సూత్రార్థము.

ఉదా : పదాది సకారమునకు : 'దధిసించతి' - 'సించతి'లోని సకారము ఆదేశ రూపమైనది - 'షిచ' అను ధాతువునందు 'ధాత్వాదేః షః సః' అను సూత్రముచే షకారమునకు సకారమాదేశమైనది. సించతి' అనునది యీ ధాతువుయొక్క రూపము. ఇందు సకారము పదముయొక్క ఆదివర్ణము కావున షత్వమీసూత్రముచే నిషేధింపఁబడినది. దధిసించతి.

సాత్‌ప్రత్యయమున కుదాహరణము, కృత్స్నంశస్త్రమగ్నిస్సంపద్యతే. శస్త్రమంతయును అగ్నిగా అగుచున్నది, శస్త్రమనునది అగ్నిగా మాఱుట అను దానిని ఇట్టి అంతయును అనునర్థము కలదు కావున 'విభాషాసాతి కార్త్స్న్యే' అను సూత్రముచే అగ్నిశబ్దమునకు సాతి ప్రత్యయము. అగ్ని+సు+సాత్ (ఇ) విభక్తి లోపము అగ్నిసాత్. ఇది షత్వమీ సూత్రముచే నిషేధింపఁబడినది (ఇది ప్రత్యయ సకారము కావున 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే షత్వము ప్రాప్తమగు చున్నది) అగ్నిసాత్ - ఇది అవ్యయము. దీనికి పరముగా చేరిన సుప్పునకు లుక్కు వచ్చును. ఇదిపదమగును. అగ్నిసాద్భవతి.

సాతి ప్రత్యయము వైకల్పికము కావున రానిచో చ్విప్రత్యయము వచ్చును. 'అగ్ని + చ్వి' అనియుండ క్రిందిసూత్రముచే కార్యమొకటి వచ్చుచున్నది.

**సూ : చ్వౌ చ 7-4-26.**

**వృ : దీర్ఘః స్యాత్. అగ్నీభవతి.**

ప. వి : చ్వౌ (7-1) చ (అవ్య)

అను : దీర్ఘః (1-1).

అర్థ : చ్వి ప్రత్యయము పరమగునప్పుడు పూర్వమునకు దీర్ఘము వచ్చును. ఉదా : అగ్నీభవతి.

వివ : అగ్ని + చ్వి అనియుండ ప్రకృతసూత్రముచే విధింపఁబడిన దీర్ఘము 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే అంత్యాక్షరమగు ఇకారమునకు వచ్చును అగ్నీ (చ్విప్రత్యయము సర్వలోపి) ను ప్రత్యయము చేత అదృశ్యమగును, అగ్నీ భవతి.

సూ : అవ్యక్తానుకరణాద్ద్వ్యజవరార్ధాదనితౌ డాచ్ 5-4-57.

వృ : ద్వ్యచ్ అవరం న్యూనం, నతు తతో న్యూనమ్; అనేకాజితి యావత్. తాదృశమర్ధం యస్య తస్మాద్డాచ్‌స్యాత్ కృభ్వస్తిభిర్యోగే.

ప వి : అవ్యక్తానుకరణాత్ (5-1) ద్వ్యజవరార్ధాత్ (5-1) అనితౌ (7-1) డాచ్ (1-1)

అను : కృభ్వస్తియోగే (7-1) తద్ధితః (1-1) ప్రత్యయః (1-1).

అర్థ : అవ్యక్తధ్వనిననుకరించునదియు, కనీసము రెండచ్చులు అర్ధభాగముగాఁ గలదియు నగుశబ్దమునకు, ఇతిశబ్దము పరముగా లేనిచో తల, డాచ్ ప్రత్యయము వచ్చును.

వివ : అకారాదివర్ణములు స్పష్టముగా గుర్తించుటకు వీలులేనిది అవ్యక్తము. కుండలు మొదలుగునవి దొరలిపడునపుడు వచ్చుధ్వనివంటిదని యర్థము. దానిని కొన్ని వర్ణములసముదాయముతో ననుకరింతుము. ధామ్, పటత్, ఫట్ మున్నగునవి. ఇట్టిది ద్వ్యజవరార్ధముకావలయును. ద్వ్యచ్ = రెండచ్చులుగలది, అవరము = న్యూనము, తక్కువ; అర్ధము = సగము. ఇచట ద్వ్యజవర అనుదానికి రెండు అచ్చులకంటె తక్కువగలది అనునర్థము సంభావింపరాదు. రెండు అచ్చులు తక్కువగాఁ గలది. కనీసము రెండచ్చులు గలది అనునర్థమును గ్రహింపవలయును. అట్టి అర్ధముగలది కావలయును. అనగా అవ్యక్తానుకరణశబ్దముయొక్క సగభాగమునందు కనీసము రెండచ్చులుండవలయునని ఫలితార్థము. అట్టిదానికి, 'ఇతి' అను శబ్దము పరముగా లేనియపుడు, డాచ్ అను ప్రత్యయము వచ్చును. ఈ ప్రత్యయమున డకారచకారము లితులు.

అవ : దీని కనుబంధముగా ఈ క్రింది వార్తికము చెప్పఁబడుచున్నది.

వా : డాచి వివక్షితే ద్వే బహులమ్ 4661.

**వృ : ఇతిడాచి వివక్షితే ద్విత్వమ్.**

ప. వి : డాచి (7-1) వివక్షితే (7-1) ద్వే (1-2) బహుళమ్ (2-1).

అర్థ : డాచ్ ప్రత్యయము వివక్షింపఁబడునపుడు ద్విత్వమగును.

వివ : వివక్షితమనఁగా వివక్షింపఁ బడినది. వివక్షయనగా చెప్పఁగోరుట. ఒక పదమునకు 'డాచ్' ప్రత్యయము విధింపవలయునను ఉద్దేశమున్నపుడు ఆపదము రెండుమాఱు లుచ్చరింపఁబడునని తాత్పర్యము.

'పటత్' ఇది అవ్యక్తానుకరణశబ్దము కాని యిందు అర్థభాగమున రెండచ్చులు లేవు కావున దీనికి డాచ్ ప్రత్యయము రాదు కాని డాచ్ ప్రత్యయము దీనికి చేర్పవలయునను నిచ్చయున్నపుడు ఇది ద్విరుక్తమగును పటత్. పటత్ అప్పుడు ఇందు సగభాగమగు 'పటత్' అనుదానిలో రెండచ్చులుగలవు కావున పటత్ పటత్ అనుదానికి పరముగా 'డాచ్' ప్రత్యయము పైసూత్రముచే వచ్చును. 'పటత్ పటత్ + డాచ్'

**వా॥ నిత్యమామ్రేడితే డాచీతి వక్తవ్యమ్ 3638.**

**వృ : డాచ్పరం యదామ్రేడితం తస్మిన్ పరే పూర్వపరయో ర్వర్ణయోః పరరూపం స్యాత్. ఇతితకారపకారయోః పకారః. పట పటాకరోతి.**

ప. వి : నిత్యమ్ (2-1) ఆమ్రేడితే (7-1) డాచి (7-2) వక్తవ్యమ్ (1-1).

అర్థ : డాచ్ ప్రత్యయము పరమునఁగల ఆమ్రేడితము పరమగునపుడు పూర్వ పర స్థానములనున్న వర్ణద్వయమునకు పరవర్ణ మేకాదేశమగును. ఉదా : పటపటా కరోతి.

వివ : ఇది పరరూప సంధి ప్రకరణములో చెప్పఁబడిన వార్తికము. కావున పూర్వపర వర్ణములకు పరరూపమేకాదేశమగు నమనర్థము వచ్చినది. డాచ్ ప్రత్యయము పరముగానున్న ఆమ్రేడితము పరమైనపుడు పూర్వమున నున్నశబ్దస్వరూపము యొక్క తుదివర్ణమునకును, పరముగానున్న ఆమ్రేడితముయొక్క తొలివర్ణమునకును, పరవర్ణ మేకాదేశమగునని తాత్పర్యము. ఆమ్రేడితమనగా ద్విరుక్తము యొక్క పరరూపము.

పటత్ + పటత్ + డాచ్, ఇందు మొదటి పటత్‌లోని తకారమునకును, తరు వాతి పకారమునకును పరూపమేకాదేశమై పటపటత్ + డాచ్ అగును. పట పటత్ + డాచ్, డిత్తుపరముగా నుండుటచే టిలోపము, పటపట్ + అ=పటపటా, ఇది అవ్య యము. కావున దీనికి చేరు సుప్పులు లోపించును పటపటా కరోతి (పటత్, పటత్ అను అవ్యక్త ధ్వనిచేయుచున్నది)

అవ : అవ్యక్తానుకరణాదిత్యాది సూత్రమునందలి దళముల సార్థక్యము విచా రింపబడుచున్నది.

వృ : అవ్యక్తాను కరణాత్కిమ్? దృషత్కరోతి. ద్వ్యజవరా ర్ధాత్కిమ్? శ్రత్కరోతి. అవరేతికిమ్? ఖరటఖరటా కరోతి. అనితౌ కిమ్? పటితి కరోతి.

వివ : డాచ్ ప్రత్యయము అవ్యక్తానుకరణశబ్దములకే వచ్చుననుటచే 'దృషద్' అనునది అట్టిదికాదు. కావ దీనికి డాచ్ ప్రత్యయమురాదు. దృషద్ అను నది అరవంతమగుశబ్దము.

అవ్యక్తానుకరణమేయైనను కనీసము రెండచ్చులుగలసగభాగముండవలయు ననుటచే 'అత్' అనుదానికి డాచ్ ప్రత్యయమురాదు. దీని యందొక యచ్చే యున్నది.

· కనీసము రెండచ్చులుండవలయుననుటచే అంతకంటె ఎక్కువ అచ్చులున్న పుడును ఈడాచ్ ప్రత్యయము వచ్చును. 'ఖరటత్' ఇందు మూఁడచ్చులు గలవు. ద్విత్వము వచ్చినపుడు సగభాగమున మూఁడచ్చులుండును. ఖరటత్ ఖరటత్ + డాచ్, ఖరటఖరటత్ + అ, ఖరట ఖరటాకరోతి (పరరూపము, టిలోపము). సూత్రమున 'అవర' అనుపదములేనిచో రెండచ్చులు గలసగభాగమే యుండవలయు నను నర్థము వచ్చును. అప్పుడు ప్రకృతోదాహరణమున డాచ్ ప్రత్యయము రాక పోవును. కావున అవరశబ్దము సార్థకము.

'ఇతి' పరమగునపుడు డాచ్ ప్రత్యయము రాదు. పటత్ ఇతికరోతి-అన్ని లక్షణములు సరిపడియున్నను, ఇతిశబ్దము పరమైనది కావున నిచట డాచ్ ప్రత్య యము రాలేదు. పటత్ + ఇతి అనియుండ 'అవ్యక్తానుకరణస్యాత ఇతౌ' (6-1-18) (అవ్యక్తానుకరణశబ్దముయొక్క 'అత్' అనుభాగమునకు ఇతిశబ్దము పర

మగునపుడు పరరూపమేకాదేశమగును) అనుసూత్రముచే పరరూప మేకాదేశమై పట్ + అత్ + ఇతి - పట్ + ఇతి, పటితి కరోతి అగును.

### ఇది స్వార్థికప్రకరణము.

ప్రకరణావలోకనము : ఇందు ఆయా ప్రకృతులకు స్వార్థమునఁ జేరు ప్రత్యయములగు కన్, మయట్, అణ్, శస్, తసి, చ్వి, సాతి, డాచ్ అను ప్రత్యయములను వాని ప్రక్రియయు వివరింపఁబడినవి. ఇందు కొన్ని స్వార్థమునందే కాక యితరార్థములందును వచ్చునవియగుటచే వీనిని స్వార్థికములనుట యౌపచారికము.

### ఇంతటితో తద్ధితాధికారము పూర్తియయినది.

### తద్ధితాధికారము-సింహావలోకనము :

ఙీ, ఆప్ అనుస్త్రీ ప్రత్యయములంతమునఁగలవానికిని ప్రాతిపదిక సంజ్ఞకములకును జేరిన యాయా విభక్త్యంతరూపములపై ఆయా అపత్యాద్యర్థ విశేషములను వ్యక్తముచేయు ప్రత్యయములు అష్టాధ్యాయియందలి 4,5 అధ్యాయములతో వివరింపఁబడినవి అందలి కొన్నిసూత్రము లీప్రకరణమున వ్యాఖ్యానింపఁబడినవి. ఇందు అర్థవిశేషములను బట్టియు, అణ్ మున్నగు ప్రత్యయముల యధికారావధినిబట్టియు, ప్రకరణముల అంతర్విభాగము చేయఁబడినవి. తద్ధిత ప్రక్రియ యందును సమాస ప్రక్రియయందువలె లౌకికాలౌకిక విగ్రహవాక్యములు, సుబ్లుక్, ప్రత్యయములకు లుక్కు వచ్చుట, మఱల సముదాయమునకు లింగవచనానుగుణముగ విభక్తిప్రత్యయములు చేరుట మున్నగులక్షణములు గలవు. పంచవిధవృత్తులలో నిదియు నొకటి. పరార్థాభిధానమను సాధారణ వృత్తి లక్షణమిందు సర్వత్ర దృశ్యమానమగును. ఇత్సంజ్ఞకములనుబట్టి కార్యవిధానము జరుగుచుండును గావున ప్రత్యయస్వరూపమొకటియే యయ్యును,కొన్నియెడల అణ్, అఞ్ వంటి ప్రత్యయములవలన నేర్పడు రూపములలో భేదము లేకున్నను, ఆ ప్రత్యయభేదమును జాగ్రత్తగా పాటింపవలయును.

ఈ ప్రత్యయములలో నాదివర్ణములగు ల, శ, క వర్గములకు 'అతద్ధితే' అను పర్యుదాసమువలన నిత్సంజ్ఞ యుండదు. ఠ. ఫ, ఢ, ఖ, ఛ, ఘ అనువాని కాయా యాదేశములు విధింపఁబడినవి. సాధారణముగా అజాది యకారాది ప్రత్యయములు పరములుగా నున్నపుడు టిలోపమో, ఇకారాకారలోపమో జరుగుచుండును. వీని కపవాదములును చాల గలవు. అవి యన్నియు ప్రకరణమున

నిరూపింపఁబడినవి. ప్రత్యయములలో అకారాదులు కొన్ని ఉచ్చారణార్థకములగుటయు, 'కొన్నియెడల నవి ప్రత్యయములో నేకదేశములగుటయు మెలఁకువతో పరిశీలింపవలయును. ప్రత్యయాంతమున కవ్యయసంజ్ఞ యున్నచో నరసికొని తదనుగుణమైన ప్రక్రియ నాశ్రయింపవలయును. లేనిచో సాధారణముగ ప్రాతిపదికార్థమున ప్రథమావిభక్త్యేకవచనప్రత్యయము చేర్చి రూపప్రదర్శనము చేయఁబడినది. పదముకానిది ప్రయోగానర్హమగుటచే పదత్వసిద్ధికై సుప్ప్రత్యయము చేర్చుట ఆవశ్యకమని తెలుపుటకై యీ పద్ధతి అవసరమగుచున్నది. ఈ వ్యాఖ్యలో సుప్పులు చేరుటమాత్రము ప్రదర్శింపఁబడినది. అవి పరమగునపుడు జరుగు ప్రక్రియా విధానమంతయు గ్రంథవిస్తరభీతిచే చూపఁబడలేదు. అది శబ్దాధికార ప్రక్రియకు సంబంధించినభాగము.

తద్ధితవిధానము ముఖ్యముగా అర్థమునకు సంబంధించినది యగుటచే నిందలి కృషి శబ్దార్థజ్ఞానమునకు మిక్కిలి ఉపకారకమగును. కావున సంస్కృతభాషయందును, తదుపజీవులగు నితరభాషలయందును కృషిచేయు వారికిది తప్పక ఉపాదేయము.

# అథ స్త్రీప్రత్యయ ప్రకరణమ్.

అవ : లోకములో స్తనకేశవతిని స్త్రీ అనియు, లోమశుఁడైన వ్యక్తిని పురుషుఁడనియు నందురు. ఈ విభాగము లేనిదానిని నపుంసకమందురు. (స్తన కేశవతీ స్త్రీ స్యాల్లోమశః పురుషః స్మృతః. అనయోరన్తరం యచ్చ తదభావే నపుంసకమ్) కాని వ్యాకరణశాస్త్రమున స్త్రీపుంనపుంసకలింగముల నిర్ణయమున కీవ్యవహారము తోడ్పడఁజాలదు. ఇచట లింగము శబ్దము నాశ్రయించియుండును. అనగా నీశబ్దము పుంలింగము ఈశబ్దము స్త్రీలింగము, ఈ శబ్దము నపుంసకలింగము అని వ్యవహారము. కావున స్త్రీ వ్యక్తిని బోధించుపదము నియతముగా స్త్రీలింగమే కానక్కరలేదు. ఉదా : కళత్రమ్ అను నపుంసకలింగశబ్దము 'భార్య' అనునర్థమున వ్యవహరింపఁబడుచున్నది; దారాః అను పుంలింగశబ్దము భార్య అను నర్థము గలది. కావున నేదేని ప్రాతిపదికమునకు స్త్రీత్వమును జెప్పఁదలఁచిన యెడల దానికి కొన్ని ప్రత్యయములు చేరును. అట్టివానిని స్త్రీప్రత్యయములందురు. అష్టాధ్యాయిలో నాల్గవ అధ్యాయము మొదటిపాదము మూఁడవ సూత్రము మొదలుకొని 81 వ సూత్రమువఱకు 'స్త్రియామ్' అనునధికారము గలదు. అందు విధింపఁబడిన స్త్రీ ప్రత్యయములను వివరించు ప్రకరణమగుటచే దీనికి స్త్రీ ప్రత్యయ ప్రకరణమని పేరు.

ఇందు ప్రాతిపదిక సంజ్ఞకలవానికి ఈ ప్రత్యయములు చేరుచుండును. ప్రాతిపదిక మనగా అర్థవంతము, ధాతుభిన్నము, ప్రత్యయభిన్నము, ప్రత్యయాంత భిన్నము నైన శబ్దస్వరూపము (అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్ 1-2-45) ప్రత్యయాంతములైనను కృదంతములును, తద్ధితాంతములును, సమాసములును ప్రాతిపదికములే యగును (కృత్తద్ధితసమాసాశ్చ 1-2-46) స్త్రీ ప్రత్యయము లీలక్షణముగల వానికి పరముగా చేరును ఇవి చేరిన స్వరూపములకు ప్రాతిపదిక సంజ్ఞయుండదు. అయినను 'జ్యాప్ప్రాతిపదికాత్' అను నధికారసూత్రములో జీ, ఆప్ అనుస్త్రీప్రత్యయములను గ్రహించినందువలన జ్యంత, ఆబంతములకు సుప్ ప్రత్యయములు చేరును. ఆ విధముగా వీనికి పదత్వము సిద్ధించును. తక్కిన ప్రక్రియావిశేషములను ముందు యథాసంభవముగ పరిశీలింతము.

సూ : స్త్రియామ్ 4-1-3.

వృ : ఇత్యధికృత్య.

వ. వి స్త్రియామ్ (7-1).

అర్థ : ఇది యధికారసూత్రము.

వివ : 4-1-81 వఱకుగల సూత్రములలోనికి 'స్త్రియామ్' అను సప్తమ్యంత పదము అధికారముగా చేరును.

**సూ : అజాద్యత ష్టాప్ 4-1-4.**

**వృ : అజాదీనా మకారాంతస్య చ యద్వాచ్యం స్త్రీత్వం తత్ర ద్యోత్యేటాప్ స్యాత్. అజా, ఏడకా, అశ్వా, చటకా, మూషికా, బలాకా, వత్సా, హోడా, మన్దా, బిలాకా, మేధా ఇత్యాది, గఙ్గా, సర్వా. అదన్తాత్పృథగజాద్యుక్తి ర్ఙీప్ ఙీషో ర్బాధనాయ.**

ప. వి : అజాద్యతః (6-1) టాప్ (1-1).

అను : ప్రాతిపదికాత్ (5-1) స్త్రియామ్ (7-1) ప్రత్యయః (1-1) పరః (1-1) చ (అవ్య).

అర్థ : అజమున్నగు ప్రాతిపదికములయొక్కయు, అదంతప్రాతిపదికముల యొక్కయు స్త్రీత్వము వాచ్యమగునపుడు వానికి పరముగా 'టాప్' ప్రత్యయము వచ్చును. ఉదా : అజా మొ॥వి. అదంతములకంటె వేఱుగా అజాదులను జెప్పుట ఙీప్, ఙీష్ ప్రత్యయములను బాధించుటకొఱకు.

వివ : స్వార్థము, ద్రవ్యము, లింగము, సంఖ్య, కారకము అనునీయైదును ప్రాతిపదికార్థములు (స్వార్థద్రవ్యలింగసంఖ్యాకారకాణిపఞ్చప్రాతిపదికార్థాః). అను సిద్ధాంతము ననుసరించి లింగముకూడ ప్రాతిపదికార్థమే యగును. కావున 'ప్రాతి పదికముయొక్క లింగమైన స్త్రీత్వము వాచ్యమైనపుడు' అనునర్థము 'స్త్రియామ్'అను పదముచే గ్రహింపఁబడును. 'అజాద్యతః అనునది సమాహారద్వంద్వము. అజా దులయొక్కయు అత్తుయొక్కయు సమాహారము 'అజాద్యత్' దానిషష్ఠ్యంతరూపము 'అజాద్యతః' అనునది అనువృత్తమైన ప్రాతిపదికాత్ అనుదానిని షష్ఠ్యంతముగా మార్చుకొనవలయును. 'ప్రాతిపదికస్య' అగును. 'అజాద్యతః' అనునది 'ప్రాతి పదికస్య' అనుదానికి విశేషణము. కావున తదంతవిధిచే 'అజాదుల యొక్కయు, అజాదులంతమునఁగలవాని యొక్కయు, అదంతముల యొక్కయు అనునర్థము వచ్చును. వానియొక్క స్త్రీత్వము గమ్యమానమగునపుడు పరముగా 'టాప్' అను ప్రత్యయము వచ్చును. దేనికి పరముగా అనుఆకాంక్షకుసమాధానముగా అజాదులకును, అదంతములకును పరముగా వచ్చునమనర్థము సిద్ధించును. అజాదిశబ్దములకును,

అవి అంతమునఁ గలవానికిని, అదంత ప్రాతిపదికములకును, స్త్రీత్వము వాచ్యమగు నపుడు 'టాప్' అను ప్రత్యయమగునని ఫలితార్థము ఉదా : అజ + టాప్ (ఇందు టకారపకారము లిత్తులు. చుటూ, హలన్త్యమ్) అజ + అ = సవర్ణదీర్ఘ ముఅజా + సు = అజా. [అజా అనుదానికి ప్రాతిపదిక సంజ్ఞ యుండదు. ప్రత్యయాంతము గదా. కావుననే 'ఙ్యాప్ప్రాతిపదికాత్' అనుసూత్రముచే ఙీ, ఆప్ అనునవియు గ్రహింపఁబడినవి. వీనికి చేరు 'సు' ప్రత్యయమునకు 'హల్ఙ్యాబ్భ్యోదీర్ఘాత్సుతిస్య పృక్తంహల్' 6-1-68) (హలన్తమునకును, ఙీ,ఆప్ ప్రత్యయము లంతమునఁ గల దానికిని పరముగనున్న 'సు,తి,సి' అనువాని అపృక్తమైన హల్లు లోపించును) అనుసూత్రముచే లోపము కలుగును. (అపృక్తమనగా నొకేవర్ణముగల ప్రత్యయము. స్ + ఉ-ఉకారమిత్తు) ఈ ప్రక్రియను ముందు సర్వోదాహరణములలో యథాయోగ్యముగ ననుసంధించుకొనఁదగును. విశేష మున్నచోట చెప్పఁబడును ]

ఇట్లే ఏడక + టాప్, ఏడక + అ = ఏడకా, అశ్వ + టాప్ = అశ్వా, చటక + టాప్ = చటకా, మూషక + టాప్ = మూషికా, బాల + టాప్ = బాలా, వత్స + టాప్ = వత్సా; హోడ + టాప్ = హోడా; మన్ద + టాప్ = మన్దా; బిలాత + టాప్ = బిలాతా, మేధ + టాప్ = మేధా. మొదలయినవి.

అదంతముల కుదాహరణములు గఙ్గ + టాప్, గఙ్గ + అ, గఙ్గా + సు = గఙ్గా, సర్వ + టాప్ = సర్వా + సు = సర్వా.

ఇట నొకవిశేషముగలదు. అజాదిగణములోని శబ్దము లన్నియు అదంతములే కావున 'అతః' అనుపదము వలననే వానికిని స్త్రీత్వమున టాప్ ప్రత్యయము రావచ్చునుగదాః మఱల 'అజాది' పదమును గ్రహింపనేలః అనుశంకకు సమాధానము ఙీప్, ఙీష్ అను వక్ష్యమాణప్రత్యయములను బాధించుటకొఱకు అని చెప్పఁబడినది. అజాదిగణములోని అజ, అశ్వమున్నగువానికి 'జాతేరస్త్రీవిషయాత్' ఇత్యాదిసూత్రముచే ఙీష్ ప్రత్యయము ప్రాప్తమగుచున్నది. బాల మున్నగువానికి 'వయసిప్రథమే' ఇత్యాదిసూత్రములచే ఙీప్ ప్రత్యయము ప్రాప్తించుచున్నది వానిని బాధించుటకై అజాదిపదము విడిగా గ్రహింపఁబడినది. అది లేనిచో సామాన్య సూత్రమును బాధించి విశేషవిధులగు వక్ష్యమాణసూత్రములు ప్రవర్తించి 'అజీ' మున్నగు న విష్టరూపము లేర్పడవలసి వచ్చును అజాదిపదగ్రహణము వానిని వారించినది.

అజాదిగణము : అజా ఏడకా కోకిలా చటకా అశ్వా మూషికా బాలా హోడా పాకా వత్సా మన్దా బిలాతా పూర్వాపహాణా (పూర్వాపహాణా) అపరాపహాణా, (సంభ

స్త్రాజినశణపిండేభ్యః ఫలాత్ (37) (సదచ్కాణ్డ ప్రాన్తశత్తైకేభ్యః పుష్పాత్ 38) (శూద్రాచామహత్పూర్వాజాతిః 39) క్రుఞ్చా ఉష్ణిహా దేవవిశా. జ్యేష్ఠా కనిష్ఠా మధ్యమా పుంయోగేఽపి. (మూలాన్నఞః 40) దంష్ట్రా. (త్రిఫలా త్ర్యనీకా ద్విగౌ 41) - ఏతేఽజాదయః.

సూ : ఉగితశ్చ 4-1-6.

వృ : ఉగిదన్తాత్ప్రాతిపదికాత్ ఙీప్ స్త్రియామ్ భవన్తీ, పచన్తీ.

ప. వి : ఉగితః (5-1) చ (అవ్య).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ఙీప్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1) చ (అవ్య).

అర్థ : ఉగిదంతమైన ప్రాతిపదికమునకు పరముగా స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును. ఉదా : భవన్తీ, పచన్తీ.

వివ : 'ఉక్' అనునది ఉ ఋ ఌ వర్ణములను బోధించు ప్రత్యాహారము. ఉక్కు ఇత్తుగాఁగలది ఉగిత్తు. అది ప్రాతిపదికాత్ అనుదానికి విశేషణము. కావున తదంతవిధిచే ఉగిదంతమైన ప్రాతిపదికమునకు పరముగా స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చునని ఫలితార్థము సిద్ధించినది. ఉ, ఋ ఌ అను వర్ణములు ఇత్తుగాగల ప్రాతిపదికముల యొక్కయు అట్టి ప్రత్యయములు అంతమునఁ గల ప్రాతిపదికముల యొక్కయు స్త్రీత్వము వాచ్యమగునపుడు వానికి పరముగా 'ఙీప్' అను ప్రత్యయము వచ్చునని భావము. ఈ ప్రత్యయమున ఙకారపకారము లిత్తులు (లశక్వతద్ధితే, హలన్త్యమ్).

ఉదా : భవత్, పచత్ ఇవి భూ, పచ్ ధాతువులకు శతృప్రత్యయము చేయఁగా నేర్పడిన రూపములు శతృప్రత్యయమున ఋకారమిత్తు కావున ఇవి ఉగిదంతములు. వీనికి ప్రకృత సూత్రముచే 'ఙీప్' ప్రత్యయము భవత్ + ఙీప్ = ఈ భవత్ + ఈ అనియుండ 'శప్శ్యనోర్నిత్యమ్' అనుసూత్రముచే నుమాగమము వచ్చును (శప్, శ్యన్ ప్రత్యయముల అకారమునకు పరముగనున్న శతృప్రత్యయావయవము అంతమునఁగల అంగమునకు, శీ అనునది గాని నదీసంజ్ఞకము కాని పరముగా నున్నపుడు, నుమాగమము నిత్యముగా వచ్చును) మకారమిత్తుగాఁ గల ఆగమము తుది అచ్చునకు తర్వాతవచ్చును (మిదచోఽన్త్యాత్పరః) భవన్త్ + ఈ=భవన్తీ + సు=భవన్తీ. అట్లే పచన్త్ + ఈ=పచన్తీ + సు=పచన్తీ 'భవతు'

అను ఉకారమిత్తుగాఁగల మఱియొకశబ్దము కలదు. దానికి ఙీప్ ప్రత్యయము వచ్చి నచో 'భవతీ' అనురూపమేర్పడును (దానికి నుమాగమమురాదు).

సూ : అనుపసర్జనాత్ 4-1-14.

వృ : అధికారోఽయం, యూనస్తి రిత్యభివ్యాప్య.

ప. వి. : అను పసర్జనాత్ (5-1).

అర్థ : యూనస్తిః (4-1-77) అను సూత్రమువఱకు పంచమ్యంతమగు నీపదము అధికారమగును.

వివ : ఉపసర్జనసంజ్ఞ సమాస పరిచ్ఛేదమున వివరింపఁబడినది. సమాసవిధాయక సూత్రమున ప్రథమాంతపదముచే నిర్దేశింపఁబడినదియు విగ్రహవాక్యమున నియతమైన విభక్తికలదియు ఉపసర్జనసంజ్ఞకమగును (ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్, ఏకవిభక్తి చాపూర్వనిపాతే). ఉపసర్జనము కానిది అనుపసర్జనము. ఇటుపై విధింపఁబడు స్త్రీప్రత్యయములు అనుపసర్జనములైన ప్రాతిపదికములకే వచ్చునని యీ యధికారసూత్రమువలన చెప్పఁబడినది బహువ్రీహి సమాసాదులలో అర్థ ప్రాధాన్యము లేనిపదములు, ఉపసర్జనములుకావున నట్టివానికి పరముగా వక్ష్యమాణ స్త్రీప్రత్యయములు రావని తాత్పర్యము ఉపసర్జన సంజ్ఞలేనివానికి వక్ష్యమాణ ప్రత్యయము వచ్చునని ఫలితార్థము.

సూ : టిడ్ఢాణఞ్ ద్వయసజ్దఘ్నఞ్మాత్రచ్ తయప్ఠక్ ఠఞ్ కఞ్ క్వరపః 5-1-15.

వృ : అనుపసర్జనం యట్టిదాది తదన్తం యదదన్తం తతః స్త్రియాం ఙీప్, కురుచరీ, నదట్, నదీ, దేవట్-దేవీ, సౌపర్ణేయీ ఐన్ద్రీ ఔత్సీ, ఊరుద్వయసీ, ఊరుదఘ్నీ, ఊరుమాత్రీ, పఞ్చతయీ, ఆక్షికీ, లావణికీ, ప్రాస్థికీ, యాదృశీ, ఇత్వరీ.

ప. వి : టిడ్ఢాణఞ్.........క్వరపః (6-1).

అను : ప్రాతిపదికాత్ (5-1) అను పసర్జనాత్ (5-1) అతః (5-1) ఙీప్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1) స్త్రియామ్ (7-1).

అర్థ : అనుపసర్జనములైన టిదాదులంతమునఁ గల అదంతప్రాతిపదికములకు స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును. ఉదా : కురుచరీ మొ॥వి.

వివ : ఇచట సూత్రమంతయు పంచమ్యేకవచనాంతము. ఇతియు, అను వృత్తిగా వచ్చిన అతః, అనుపసర్జనాత్ అనునవియు ప్రాతిపదికాత్ అనుదానికి విశేషణములు. తదంత విధిచే టిదాద్యంతము, అదంతము, ఉపసర్జనముకానిదియు నగు ప్రాతిపదికమునకు పరముగా స్త్రీత్వమున జీప్ ప్రత్యయము వచ్చుననునర్థము కలుగును. సూత్రమున చెప్పఁబడిన వన్నియు సాధారణముగ ప్రత్యయములు (1) టిత్తులు=టకారమిత్తుగాఁ గలవి (2) ఢ ప్రత్యయము (3) అణ్ (4) అఞ్ (5) ద్వయసచ్ (6) దఘ్నచ్ (7) మాత్రచ్ (8) తయప్ (9) ఠక్ (10) ఠఞ్ (11) కఞ్ (12) క్వరప్ - ఇందు కొన్ని కృత్ప్రత్యయములు-మఱికొన్ని తద్ధిత ప్రత్యయములు. అదంతములైన టిత్తులయొక్కయు, అదంతములైన ఢమున్నగు ప్రత్యయములు అంతమునఁగల ప్రాతిపదికములయొక్కయు స్త్రీత్వము వాచ్యమగు నపుడు (చెప్పఁబడునపుడు) ఉపసర్జనసంజ్ఞ లేనివి యగు వీనికి పరముగా 'జీప్' ప్రత్యయము వచ్చునని ఫలితార్థము. వీనికి క్రమముగా నుదాహరణములను పరిశీలింతము.

(i) టిత్తులు (i) కురుచర (కురుషు చరతి - కురుదేశములందు తిరుగునది అనునర్థమున 'చరేష్టః' అనుసూత్రముచే 'ట' ప్రత్యయము (ట్ + అ) చేరగా నేర్పడినరూప మిది. కావున నిది టిదంతము) కురుచర + జీప్, కురుచర + ఈ యస్యేతిచ - (భసంజ్ఞకలదాని ఇవర్ణ అవర్ణములకు తద్ధితము గాని ఈకారముగాని పరమగునపుడు లోపము వచ్చును) అనుసూత్రముచే అకారలోపము, కురుచర్ + ఈ=కురచరీ + సు=కురుచరీ.

(ii) నదట్, దేవట్ అనునవి పచాదిగణములో టిత్తులుగా పఠింపఁబడినవి. నద + ఈ. అకారలోపము నదీ. దేవ+ఈ=దేవీ.

(2) ఢ=సౌపర్ణేయి - సుపర్ణీశబ్దమునకు అపత్య సంతానము అనునర్థమున 'స్త్రీభ్యోఢక్' అను సూత్రముచే 'ఢక్' ప్రత్యయము రాఁగా నేర్పడిన రూపమిది. ఆదివృద్ధి ఏయ్ ఆదేశము, ఈకారలోపము. ఇట్లిది ఢప్రత్యయాంతము. సౌపర్ణేయ + జీప్, సౌపర్ణేయ + ఈ, అకారలోపము సౌపర్ణేయీ+సు = సౌపర్ణేయీ.

(3) అణ్ - ఇన్ద్రోదేవతా అస్యాః-దీనికి ఇంద్రుఁడుదేవత అనునర్థమున 'సాఽస్యదేవతా' అనుసూత్రముచే ఇన్ద్రశబ్దమునకు అణ్ ప్రత్యయము వచ్చి ఇన్ద్ర + అణ్, ఐన్ద్ర + అ, 'ఐన్ద్ర' అగును. (ఆదివృద్ధి, అకారలోపము) ఇది

అణంతము కాన జీప్ ప్రత్యయము రాఁగా ఐన్ద్రి + ఈ, ఐన్ద్రీ (యస్యేతిచ - అకారలోపము).

(4) అఞ్ - ఉత్సస్య ఇయమ్ - ఉత్సుఁడనువానికి సంబంధించినది అను సర్థమున 'ఉత్స + ఙస్ + అణ్' ఉత్సాదిభ్యోఽఞ్ అనుసూత్రముచే అఞ్ ప్రత్యయము ఆదివృద్ధ్యాదులు. ఔత్స, ఇది అఞంతము, ఔత్స+ఈ ఔత్సీ.

(5), (6), (7) ఊరూ ప్రమాణమస్యాః - తొడలలోఁతుగలది అనునర్థమున 'ప్రమాణేద్వయసజ్దఘ్నఞ్మాత్రచః' అనుసూత్రముచే ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్ ప్రత్యయములు రాఁగా నేర్పడిన రూపములకు జీప్రత్యయము. ఊరు ద్వయస + ఈ = ఊరుద్వయసీ; ఊరుదఘ్న + ఈ = ఊరుదఘ్నీ; ఊరు మాత్ర + ఈ = ఊరుమాత్రీ.

(8) తయప్-పఞ్చఅవయవా అస్యాః-అయిదు అవయవములు దీనికిఁ గలవు అనునర్థమున 'సంఖ్యాయా అవయవే తయప్' అనుసూత్రముచే పంచన్‌శబ్దమునకు తయప్ ప్రత్యయము చేరగా పఞ్చతయ అగును. దానికి జీప్ ప్రత్యయము, పఞ్చ తయ + ఈ=పఞ్చతయీ.

(9) ఠక్ : అక్షైర్దీవ్యతి - పాచికలతో ప్రకాశించునది అనునర్థమున అక్ష శబ్దమునకు 'తేన దీవ్యతి ఖనతిజయతి జితమ్' అనుసూత్రముచే ఠక్ ప్రత్యయము. అక్ష+ఠక్, ఆదివృద్ధి (కితిచ) ఇకాదేశము (ఠస్యేకః) ఆక్ష + ఇక, అకారలోపము ఆక్షిక + ఇది ఠగంతము. ఆక్షిక + జీప్ - ఆక్షిక + ఈ, ఆక్షికీ + సు= ఆక్షికీ.

(10) ఠఞ్ - (i) లవణం పణ్యమస్యాః - లవణము ఈమెకు అమ్మకొను వస్తువు అనునర్థమున 'లవణాట్ఠఞ్' అనుసూత్రముచే లవణశబ్దమునకు పరముగా 'ఠఞ్' ప్రత్యయము. పూర్వోదాహరణమునందువలె ఆదివృద్ధ్యాదులు రాఁగా 'లావ ణిక' అగును. ఇది ఠఞంతముగాన జీప్ ప్రత్యయము, లావణిక + ఈ, అకార లోపము. లావణికీ + సు = లావణికీ.

(ii) ప్రస్థేన క్రీతా - ప్రస్థముచే కొనబడినది అనునర్థమున ప్రస్థశబ్దమునకు 'తేన క్రీతమ్' అనుసూత్రముచే ఠఞ్ ప్రత్యయము ఆదివృద్ధ్యాదులు, 'ప్రాస్థిక' ఇదియును ఠఞంతమే. ప్రాస్థిక + జీప్ ప్రాస్థిక + ఈ = ప్రాస్థికీ + సు = ప్రాస్థికీ.

(11) కఞ్ : యచ్ఛబ్ద ముపపదముగామన్న 'దృశ్' ధాతువునకు 'త్యదాదిషు దృశోఽనాలోచనే కఞ్ చ' అనుసూత్రముచే 'కఞ్' ప్రత్యయము. ఇందు కకారఞకారము లిత్తులు. యాదృశ్ + అ ('ఆస్వరనామ్నః' అను సూత్రముచే యచ్ఛబ్దమునకు ఆకార మంతాదేశ మగును) యాదృశ+ఙీప్ = యాదృశ + ఈ, యాదృశ్+ఈ= యాదృశీ + సు-యాదృశీ.

(12) క్వరప్-తిరుగు స్వభావముగలది అనునర్థమున ఇ(ణ్) ధాతువునకు 'ఇణ్నశజి సర్తిభ్యః క్వరప్' అనుసూత్రముచే క్వరప్ ప్రత్యయము, ఇ + క్వరప్ (కకారపవర్ణము లిత్తులు)-ఈ ప్రత్యయము పరమగునపుడు ధాతువునకు తుగాగమము (హ్రస్వస్య పితి కృతి తుక్) ఇత్+వర = ఇత్వర - ఇది క్వరంబంతము, కావున ఙీప్ ప్రత్యయము - ఇత్వర + ఈ, అకారలోపము - ఇత్వరీ + సు=ఇత్వరీ.

ఈ పై యుదాహరణములన్నింటను 'యస్యేతిచ' అనుసూత్రముచే తుది అకారము లోపించుటయు ఙీబంతమునకు సుప్రత్యయము చేరి హల్ఙ్యాబిత్యాది సూత్రముచే లోపించుటయు ననుసంధించుకొనవలయును. ఆయా ప్రత్యయములు చేరునపుడగు ప్రక్రియ స్థూలముగా చూపఁబడినది. (ఆయా ప్రకరణములలో సమగ్రముగా దానినరయునది).

అవ : ఇట్టి మఱికొన్ని ప్రత్యయాంతములకును ఈఙీప్ప్రత్యయము వచ్చుట నీక్రింది వార్తికము విధించుచున్నది.

వా॥ నఞ్ స్నఞీకక్ ఖ్యుం స్తరుణతలునానా ముపసంఖ్యానమ్ (2425).

వృ : స్త్రైణీ, పౌంస్నీ, శాక్తీకీ, ఆఢ్యంకరణీ, తరుణీ, తలునీ.

వ వి : నఞ్.........తలునానామ్ (6-3) ఉపసంఖ్యానమ్ (1-1).

అర్థ : నఞ్, స్నఞ్, ఈకక్, ఖ్యున్ అను ప్రత్యయములంతమునఁగల ప్రాతిపదికములకు, తరుణతలున అనుశబ్దములకు స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయమగును. ఉదా : స్త్రైణీ మొ॥వి.

వివ : పై వానిలో నఞ్ మున్నగు నాలుగును ప్రత్యయములు. తదంతవిధిచే అవి అంతమునఁ గల ప్రాతిపదికములకు అనునర్థము సిద్ధించును. వానికిని, తరుణ, తలున అనుశబ్దములకును స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును. ఇందు తరుణ, తలున శబ్దములకు 'వయసి ప్రథమే' అను వక్ష్యమాణసూత్రముచే 'ఙీప్' ప్రత్య

యము రా వీలున్నను, గౌరాదిగణములోనిది పఠింపఁబడియుండుటవలన 'షిద్గౌరాదిభ్యశ్చ' అనుసూత్రముచే 'ఙీష్' ప్రత్యయము రావలసియున్నది. ఇట్లు ఙీప్ప్రత్యయము రాకుండుటవలన నీవార్తికమున మఱల విధింపఁబడినది. ఙీప్, ఙీష్ ప్రత్యయములవలన స్వరూపములలో భేదములేదు కాని స్వరభేదము కలదు.

ఉదా : నఞ్ : 'స్త్రీ' శబ్దమునకు 'స్త్రీపుంసాభ్యాం నఞ్స్నఞౌ భవనాత్' అను సూత్రముచే అపత్యాద్యర్థములయందు నఞ్ ప్రత్యయము. స్త్రీ + న (ఞ్) ఆదివృద్ధి, ణత్వము, స్త్రైణ + ఙీప్ (ప్రకృతవార్తికముచే) స్త్రైణ + ఈ, యస్యేతి చ - అకారలోపము, స్త్రైణీ + సు = స్త్రైణీ.

స్నఞ్ : 'పుంస్' శబ్దమునకు స్త్రీ పుంసాభ్యా మిత్యాదిసూత్రముచే స్నఞ్ ప్రత్యయము - పుంస్ + స్నఞ్, ఆదివృద్ధి, పౌంస్ + స్నఞ్, సంయోగాన్తస్య లోపః అనుసూత్రముచే శబ్దములో సకారమునకు లోపము. పౌంస్న + ఙీప్, పౌంస్న + ఈ = పౌంస్నీ + సు = పౌంస్నీ.

ఈకక్ : శక్తిః ప్రహరణమస్యాః - 'శక్తి ఆయుధముగాఁ గలది' అను నర్థమున 'శక్తియష్ట్యోరీకక్', అను సూత్రముచే 'శక్తి' శబ్దమునకు ఈకక్ ప్రత్యయము. శక్తి + సు + ఈకక్, విభక్తిలోపము, ఆదివృద్ధి ఇకారలోపము. శాక్ + ఈక = శాక్తీక + ఙీప్, అకారలోపము శాక్తీక్ + ఈ = శాక్తీకీ +

ఖ్యున్: అనాఢ్యః ఆఢ్యః క్రియతే అనయా-ఈమెచేత ఆఢ్యుఁడు కానివాఁడు ఆఢ్యుఁడుగా చేయఁబడును అనునర్థమున ఆఢ్యశబ్దము ఉపపదముగానున్న 'కృఞ్' ధాతువునకు "ఆఢ్యసుభగస్థూలపలిత నగ్నాన్ధప్రియేషు చ్వ్యర్థేష్వచ్వౌ కృఞః కరణే ఖ్యున్" (3-2-56) అనుసూత్రముచే ఖ్యున్ ప్రత్యయము వచ్చును (చ్విప్రత్యయార్థము కలవియు, చ్విప్రత్యయాంతములు కానివియునగు ఆఢ్యాది శబ్దములు ఉపపదములుగా నున్నపుడు కృఞ్ ధాతువునకు కరణార్థమున 'ఖ్యున్' ప్రత్యయము వచ్చును) ఆఢ్య + కృ + ఖ్యున్ ఖకారనకారములిత్తులు. 'యు' అనుదానికి అనాదేశము, (యువోరనాకౌ) ధాతువులోని ఋకారమునకు గుణము, సార్వధాతుకార్ధధాతుకయోః, ఆఢ్య + కర్ + అన, ణత్వము ఆఢ్య + కరణ - 'అరుర్ద్విషదజన్తస్య ముమ్' అనుసూత్రముచే ఆఢ్యశబ్దమునకు ముమాగమము, ఆఢ్యమ్ + కరణ, మకారమునకనుస్వారాదేశము, పరసవర్ణము, ఆఢ్యఙ్కరణ - ఇది ఖ్యున్ ప్రత్యయాంతము. ఆఢ్యఙ్కరణ + ఙీప్, ఆఢ్యఙ్కరణ్ + ఈ = ఆఢ్యఙ్కరణీ + సు = ఆఢ్యఙ్కరణీ.

(5) తరుణ + ఙీప్, తరుణ్ + ఈ=తరుణీ+సు=తరుణీ.

(6) తలున + ఙీప్, తలున్ + ఈ=తలునీ + సు=తలునీ.

సూ : యఞ శ్చ 4-1-16.

వృ : యఞన్తాన్ఙీప్ స్త్రియామ్. అకారలోపే కృతే.

ప వి : యఞః (5-1) చ (అవ్య).

అను : ప్రాతిపదికాత్ (5-1) స్త్రియామ్ (7-1) అను పసర్జనాత్ (5-1).

అర్థ : యఞంతమైన ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును. 'గార్గ్య + ఈ' అనియుండ అకారలోపమగును. (యస్యేతిచ) కాగా.

వివ : 'యఞ్' అనునది ప్రత్యయము. తదంతవిధిచే 'యఞ్' ప్రత్యయము అంతమునఁ గల ప్రాతిపదికమునకు అనునర్థము కలుగును. అట్టిదానియొక్క స్త్రీత్వము వాచ్యమగునపుడు, దానికి పరముగా 'ఙీప్' అను ప్రత్యయము చేరును.

ఉదా : గర్గస్య అపత్యం స్త్రీ - గర్గునియొక్క సంతానమైనస్త్రీ అనునర్థమున 'గర్గాదిభ్యో యఞ్' అనుసూత్రముచే 'గర్గ+ఙస్' అనుదానికి యఞ్ ప్రత్యయము. గర్గ + ఙస్+య(ఞ్), విభక్తిలోపము, ఆదివృద్ధి (తద్ధితేష్వచామాదేః) గార్గ + య (ఞకారమిత్తు) యస్యేతి చ-అను సూత్రముచే తుది అకారమునకు లోపము రాఁగా గార్గ్+య=గార్గ్య అగును. ఇది యఞంతము. దీనికి ప్రకృతసూత్రముచే 'ఙీప్' ప్రత్యయము. గార్గ్య + ఙీప్, 'గార్గ్య + ఈ' - మిఱల నిందు యస్యేతిచ అనుసూత్రముచే తుది అకారమునకు లోపము కలిగి గార్గ్య్ + ఈ అని యుండును. ఇట్లుండగా క్రిందిసూత్రము ప్రవర్తించుచున్నది.

సూ : హల స్తద్ధితస్య 6-4-150.

వృ : హలః పరస్య తద్ధితయకారస్య లోప ఈతి పరే. గార్గీ.

ప. వి : హలః (5-1) తద్ధితస్య 6-1.

అను : లోపః (1-1) యః (6-1) ఈతి (7-1) ఉపధాయాః (6 1).

అర్థ : హల్లుకు పరముగానున్న ఉపధాభూతమైన తద్ధితయకారమునకు, ఈకారము పరమగునపుడు, లోపము వచ్చును. ఉదా : గార్గీ.

వివ : 'హలః' అనునది పంచమ్యంతము కావున 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాషచే 'హల్లునకు పరముగానున్న' అనునర్థము వచ్చును. 'ఈతి' - ఈత్ (తపరకరణము) అనుదాని సప్తమ్యంతరూపము. తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య ఇత్యాది పరిభాషచే అది

పరమగునపు దమనర్థము కలుగును. హల్లుకు పరముగానున్నదియు, ఉపధగా నున్నదియునగు తద్ధితప్రత్యయసంబంధియగు యకారమునకు (య్) ఈకారము పర మగునపుడు లోపము వచ్చును. ఉదా : 'గార్గ్య' అనుపదములో యకారము ఉపధ. అకారము లోపించిన పిదప 'గార్గ్య్ + ఈ' అనియుండ, గ్ అను హల్లునకు పరముగా నున్నదియు 'యఞ్' అను తద్ధితప్రత్యయములోనిదియునగు యకార మునకు లోపమురాఁగా గార్గ్ + ఈ గార్గీ అగును. గార్గీ + సు=గార్గీ.

అవ : 'గార్గ్య' అను యఞంత ప్రాతిపదికమునకే స్త్రీత్వమున మఱియొక ప్రత్యయము విధింపఁబడుచున్నది.

సూ : ప్రాచాం ష్ఫ తద్ధితః 4-1-17.

వృ : యఞంతాత్ ష్ఫో వా స్యాత్ సచ తద్ధితః.

ప. వి : ప్రాచామ్ (6-3) ష్ఫ (ప్రథమావిభక్తిలోపించిన పదము) తద్ధితః (1-1).

అను : యఞః (5-1) స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ప్రత్యయః (1-1) పరః (1-1).

అర్థ : యఞంతమైన ప్రాతిపదికమునకు స్త్రీత్వమున 'ష్ఫ' అను ప్రత్య యము వైకల్పికముగా వచ్చును. అది తద్ధితమగును.

వివ : ప్రాచామ్ అనగా ప్రాచాంమతే-ప్రాచీనుల అభిప్రాయము ననుస రించి యనిభావము. అనగా తక్కినవారియభిప్రాయము ననుసరించి యీ ప్రత్య యము రాదని యర్థము. కావున వైకల్పికమనునర్థము సిద్ధించినది. 'యఞ్' అను తద్ధిత ప్రత్యయము అంతమునఁ గలప్రాతిపదికముయొక్క స్త్రీత్వము వాచ్యమగు నపుడు దానికి పరముగా 'ష్ఫ' అను ప్రత్యయము వైకల్పికముగా చేరును. దానికి తద్ధితమనియు సంజ్ఞకలుగును. ఇది తద్ధితాధికారములో లేనిదగుటచే, తద్ధిత ప్రత్య యము పరమగునపుడు కావలసిన కార్యము లిందవసరములగుటచే, ఈ సూత్రము చేతనే దీనికి తద్ధితసంజ్ఞ చేయఁబడెను.

ఉదా : గార్గ్య - ఇది యఞంతము. గార్గ్య + ష్ఫ - షః ప్రత్యయస్య-(ప్రత్యయముయొక్క ఆది షకారము ఇత్తగును) అనుసూత్రముచే షకారము ఇత్తయి లోపించును. గార్గ్య + ఫ - ఆయనేయీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్-(ప్రత్యయములయొక్క ఆదివర్ణములైన ఫ్, ఢ్, ఖ్, ఛ్, ఘ్ అనువానికి క్రమముగా ఆయన్, ఏయ్, ఈన్, ఈయ్, ఇయ్ అనువాదేశములగును)

అను సూత్రముచే 'ఆయన్' ఆదేశము. గార్గ్య + ఆయన్ + అ(ట్ + అ) గార్గ్యాయన-రేఫసంబంధముచే నకారమునకు ణత్వము (అట్కు ప్వాఙ్ నుమ్ వ్యవాయేఽపి) 'గార్గ్యాయణ'.

అవ : 'గార్గ్యాయణ' అనునది షకారమిత్తుగాఁగల ప్రత్యయము (ష్ఫ) అంతమునఁ గలది యగుటచే క్రిందిసూత్రముచే దానికి 'ఙీష్' ప్రత్యయము విధింపఁబడుచున్నది

సూ : షిద్గౌరాదిభ్యశ్చ 4-1-41.

వృ : ఙీష్స్యాత్. గార్గ్యాయణీ, నర్తకీ, గౌరీ, అనడుహీ, అనడ్వాహీ, ఆకృతిగణోఽయమ్.

ప. వి : షిద్గౌరాదిభ్యః (5-3) చ (అవ్య).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ఙీష్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1)

అర్థ : షిదంతప్రాతిపదికములకును గౌరాది ప్రాతిపదికములకును స్త్రీత్వమున 'ఙీష్' ప్రత్యయము వచ్చును. ఉదా : గార్గ్యాయణీ మొఐవి.

వివ : 'షిత్' అనగా షకారమిత్తుగాఁ గలది. అది ప్రాతిపదికమునకు విశేషణ మగుటచే తదంతవిధిచే షిత్తు అంతమునగల ప్రాతిపదికమునకు అనునర్థము కలుగును. అట్టిదానికిని, గౌరాదిగణములోని శబ్దములకును, వానిస్త్రీత్వము వాచ్యమగునపుడు, ఙీష్ ప్రత్యయము వచ్చును. ఇందు ఙకారషకారము లిత్తులు (లశక్వతద్ధితే, హలన్త్యమ్) అవి లోపించును (తస్యలోపః) 'ఈ' మిగులును.

ఉదా : 'గార్గ్యాయణ' షిదంతము - గార్గ్యాయణ + ఙీష్ - గార్గ్యాయణ + ఈ, యస్యేతిచ - అకారలోపము - గార్గ్యాయణ్ + ఈ = గార్గ్యాయణీ.

'నర్తక' ఇదియును షిదంతమే. నృత్ధాతువునకు 'శిల్పిని ష్వున్' అను సూత్రముచే ష్వున్ ప్రత్యయము. నృత్ + ష్వున్ (షకారనకారములిత్తులు) 'వు' అనుదానికి 'అక' ఆదేశము (యువోరనాకౌ) నృత్ + అక, 'పుగంతలఘూపధస్యచ' అనుసూత్రముచే ఋకారమునకు గుణము. 'అర్' వచ్చును. నర్త్ + అక = నర్తక - ఇట్లిది షిదంతము. నర్తక + ఙీష్, నర్తక + ఈ, నర్త్క్ + ఈ = నర్తకీ + సు = నర్తకీ.

గౌరాదుల కుదాహరణములు : గౌర + ఙీష్ - గౌర + ఈ, గౌర్ + ఈ = గౌరీ గౌరీ + సు = గౌరీ.

అనడుహ్, అనడ్వాహ్ - అని గౌరాదిగణములో పఠింపఁబడియుండుటవలన అనడుహ్ శబ్దమునకు వైకల్పికముగా 'ఆమ్'ఆగమము వచ్చునని చెప్పినట్లయినది. 'ఆమ్'లో మకారమిత్తు. మిత్తు అంత్యాచ్చునకు పరముగా చేరును. అనడు + ఆహ్ = యణాదేశము. అనడ్వాహ్. ఈ రెండుశబ్దములకు ఙీష్ ప్రత్యయము స్త్రీలింగమున వచ్చును. అనడుహ్ + ఈ = అనడుహీ + సు = అనడుహీ; అనడ్వాహ్ + ఈ = అనడ్వాహీ + సు = అనడ్వాహీ.

గౌరాదిగణము ఆకృతిగణము. ఇతరసూత్రములచే ఙీష్ విధానములేనివాని కీ సూత్రమే గతియనిభావము.

**గౌరాదిగణము :** గౌర మత్స్య మనుష్య శృఙ్గ పిఙ్గల హయ గవయ ముకయ ఋష్య [పుట తూణ] ద్రుణ ద్రోణ హరిణ కోకణ (కాకణ) పటర ఉణక [ఆమల] ఆమలక కువల బిమ్బ బదర ఫర్కరక (కర్కర) తర్కార శర్కార పుష్కర శిఖణ్డ సలద శష్కణ్డ సనన్ద సుషమ సుషవ అలిన్ద గడుల షాణ్డశ ఆఢక ఆనన్ద ఆశ్వత్థ సృపాట ఆఖక (ఆపచ్చిక) శష్కుల సూర్మ్య (సూర్మ) శూర్మ సూచ యూష (పూష) యూథ సూప మేథ వల్లక ధాతక సల్లక మాలక మాలత సాల్వక వేతస వృక్ష (వృస) అతస [ఉభయ] భృఙ్గ మహ మఠ ఛేద పేశ మేద శ్వన్ తక్షన్ అనడుహీ అనడ్వాహీ 'ఏషణః కరణే' 42. దేహ దేహల కాకాదన గవాదన తేజన రజన లవణ-ఔద్గాహమాని (ఉద్గాహమాని) గౌతమ (గోతమ)[పారక] అయస్థూణ (అయఃస్థూణ) భౌరికి భౌలికి భౌలిఙ్గి యాన మేధ ఆలమ్బి ఆలజి ఆలబ్ధి ఆలక్షి కేవాల ఆపక ఆరట నట టోట నోట మూలాట శాతన [పోతన] పాతన పాఠన (పానఠ) ఆస్తరణ అధికరణ అధికార ఆగ్రహాయణీ (అగ్రహాయణీ) ప్రత్యవరోహిణీ [సేచన] 'సుమఙ్గలాత్సంజ్ఞాయామ్' 43. అణ్డర సున్దర మణ్డల మన్థర మఙ్గల పట పిణ్డ [షణ్డ] ఊర్ద గుర్ద శమ సూద ఔడ (ఆర్ద్రా) హ్రాద (హ్రద) పాణ్డ [భాణ్డల] భాణ్డ (లోహాణ్డ)కదర కన్దర కదల తరుణ తలున కల్మాష బృహత్ మహత్ (సోమ) సౌధర్మ. 'రోహిణీ నక్షత్రే' 44. 'రేవతీనక్షత్రే' 45. వికల నిష్కల పుష్కల 'కటాచ్ఛ్రోణివచనే' 46. 'పిప్పల్యాదయశ్చ' 47 పిప్పలీ హరితకీ (హరీతకీ) కోశాతకీ శమీ వరీ శరీ పృథివీ క్రోష్టు మాతామహ పితామహ-ఇతిగౌరాదిః.

సూ : వయసి ప్రథమే 4-1-20.

వృ : ప్రథమవయోవాచినోఽదన్తస్య స్త్రియాం ఙీప్. కుమారీ.

ప వి : వయసి (7-1) ప్రథమే (7-1).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) అతః (5-1) ఙీప్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1)

అర్థ : ప్రథమవయోవాచకమైన అదంత ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును ఉదా : కుమారీ.

వివ : ప్రాణులకు కాలముచేనైన అవస్థావిశేషమును వయస్సు అందురు బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధకము అని వయస్సుయొక్క దశలు నాలుగు. అందు ప్రథమవయస్సునందున్న స్త్రీవ్యక్తిని వచించు అదంత ప్రాతిపదికమునకు 'ఙీప్' ప్రత్యయము వచ్చును. ఉదా : కుమార + ఙీప్, కుమార్+ ఈ = కుమారీ + సు = కుమారీ. (వయోదశలు మూఁడనియొక అభిప్రాయము. అందు మొదటిది కౌమారము. నాలుగను పక్షమున మొదటివి బాల్య కౌమారములని వ్యవహారము).

సూ : ద్విగోః 4-1-21.

వృ : అదన్తాద్ద్విగోః స్త్రియాం ఙీప్. త్రిలోకీ. అజాదిత్వాత్ త్రిఫలా, త్ర్యనీకా.

ప. వి : ద్విగోః (5-1).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) అతః (5-1) ఙీప్(1-1) ప్రత్యయః (1-1) పరః (1-1).

అర్థ : అదంతమైన ద్విగువునకు స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును. ఉదా: త్రిలోకీ. అజాదిగణములోనివగుటచే త్రిఫలా, త్ర్యనీకా అనునవి టాబంతము లైనవి.

వివ : 'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' అను తత్పురుషాధికారములోని సూత్రమువలన నేర్పడిన సమాసము సంఖ్యావాచకము పూర్వపదముగా నున్నయెడల ద్విగువనఁబడును (సంఖ్యాపూర్వోద్విగుః). అతః అనునది 'ద్విగోః' అనుదానికి విశేషణము. కావున 'అదంతమైన ద్విగువునకు' అనునర్థము కలుగును ఇది యంతయు ప్రాతిపదికమునకు విశేషణము హ్రస్వలకారము అంతమునఁ గలదియు,

ద్విగుసంజ్ఞ కలదియునగు ప్రాతిపదికముయొక్క స్త్రీత్వము వాచ్యమగునపుడు, దానికి పరముగా 'ఙీప్' ప్రత్యయము వచ్చును.

ఉదా : త్రయాణాంలోకానాం సమాహారః-మూఁడులోకముల సమాహారము. త్రి + ఆమ్, లోక + ఆమ్, విభక్తిలోపము 'త్రిలోక' -'స నపుంసకమ్' అను సూత్రముచే ఇది నపుంసకము కావలసియున్నను "అకారాన్తోత్తరపదోద్విగుః స్త్రియామిష్టః" (అకారాంతము ఉత్తరపదముగాఁగలద్విగువు స్త్రీలింగమున నుండుట యిష్టము) అనువార్తికము ననుసరించి యిది స్త్రీలింగమగును త్రిలోక + ఙీప్, యస్యేతిచ - అకారలోపము. త్రిలోక్+ఈ=త్రిలోకీ + సు=త్రిలోకీ.

త్రిఫల, త్ర్యనీక అను ద్విగువులకు ఈ సూత్రముచే ఙీప్ ప్రత్యయము రావలసియుండగా అజాదులలో వీనిని పఠించిరి. కావున దీనిని బాధించి టాప్ ప్రత్యయము వచ్చును. త్రిఫల + టాప్, త్రిఫల + ఆ = త్రిఫలా + సు=త్రిఫలా, త్ర్యనీక+ఆ=త్ర్యనీకా + సు= త్ర్యనీకా. (త్రయాణాం ఫలానాం సమాహారః - మూఁడు ఫలముల సమాహారము, త్రయాణా మనీకానాం సమాహారః - మూఁడు అనీకముల (సేనల) సమూహము అని వీనికి అర్థము).

సూ : వర్ణా దను దాత్తా త్తో పధాత్తో నః 4-1-39.

వృ : వర్ణవాచీ యోఽనుదాత్తాన్త స్తోపధ స్తదన్తా దనుపసర్జనాద్వా ఙీప్, తకారస్య చ నః. ఏతా - ఏనీ, రోహితా - రోహిణీ.

ప వి : వర్ణాత్ (5-1) అనుదాత్తాత్ (5-1) తోపధాత్ (5-1) తః (6-1) నః (1-1)

అను : వా (అవ్య) ఙీప్ (1-1) ప్రాతిపదికాత్ (5-1) అనుపసర్జనాత్ (5-1).

అర్థ : అనుదాత్తాంతమును, తోపధమును అయినవర్ణవాచకము అంతమునఁ గల అనుపసర్జనమైన ప్రాతిపదికమునకు పరముగా, స్త్రీత్వమున, ఙీప్ ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. తకారమునకు నకారాదేశము కూడనగును. ఉదా : ఏనీ-ఏతా; రోహిణీ-రోహితా.

వివ : వర్ణమనగా రంగు. రంగునుతెలుపుశబ్దముయొక్క తుదిఅచ్చు అనుదాత్తమైనచో, ఆశబ్దము తకారోపధమైనచో దానియొక్క స్త్రీత్వము వాచ్యమగునపుడు, దానికి పరముగా ఙీప్ ప్రత్యయము వచ్చును. అది వచ్చునపుడు శబ్దములోని తకారమునకు నకారాదేశముకూడ వచ్చును.

ఉదా : ఏత – తెలుపు అనునర్థముగల వర్ణవాచకశబ్దము. 'వర్ణానాంతణతినితాన్తానామ్' అనుఫిట్ సూత్రముచే 'త' అనునది అంతముననున్న వర్ణవాచకము యొక్క ఆద్యచ్చు ఉదాత్తమగును. తక్కినవి అనుదాత్తములని భావము. కావున నిది అనుదాత్తాంతము కాన 'ఙీప్' ప్రత్యయము వచ్చును ఏత+ఙీప్, ఏత + ఈ, తకారమునకు నకారాదేశము, ఏన+ఈ, యస్యేతిచ – అకారలోపము–ఏనీ+సు = ఏనీ – వైకల్పికమగుటచే ఙీప్రత్యయనకారాదేశములు రానిచో ఏత + టాప్ (అజాద్యతష్టాప్) ఏతా + సు+ఏతా అగును.

ఇట్లే 'రోహిత' అనుదాత్తాంతమైన వర్ణవాచకము (ఎఱుపు) ఙీప్ ప్రత్యయము, నకారాదేశము, రోహిత+ఈ, రోహిన + ఈ, అకారలోపము, రోహినీ, రేఫయోగముచే నకారమునకు ణత్వము – రోహిణీ + సు = రోహిణీ. రానిచో రోహిత + టాప్ = రోహితా + సు = రోహితా. తకారమునకు నకారాదేశము ఙీప్రత్యయము వచ్చునపుడే వచ్చును.

సూ : వోతో గుణవచనాత్ 4–1–44.

వృ : ఉదన్తా ద్గుణవాచినో వాఙీష్. మృద్వీ, మృదుః.

ప వి : వా (అవ్య) ఉతః (5–1) గుణ వచనాత్ (5–1).

అను : స్త్రియామ్ (7–1) ప్రాతిపదికాత్ (5–1) ప్రత్యయః (1–1) పరః (1–1).

అర్థ : ఉదంతమైన గుణవాచక ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. ఉదా : మృద్వీ మృదుః.

వివ : ఈ సూత్రములోనికి 'అన్యతోఙీష్' అను సూత్రమునుండి 'ఙీష్' అనునది అనువృత్తము కావలసి యున్నది. కాని 'గుణవచనా న్ఙీబాద్యుదాత్తః' అనువార్తికము ననుసరించి 'ఙీప్' అనునదియేయిట ఉపస్థితమగును. గుణవచనప్రాతిపదికమునకు ఙీప్ ప్రత్యయమగును. అది అద్యుదాత్తమగును అని వార్తికార్థము. ఉతః అనునది గుణవచనాత్ అనుదానికి విశేషణము. కావున తదంతవిధిచే హ్రస్వ ఉకారము అంతమునఁ గలగుణవచనమున కనునర్థము కలుగును. అది ప్రాతిపదికాత్ అనుదానికి విశేషణము. ఉదంతమైన గుణవాచక ప్రాతిపదికముయొక్క స్త్రీత్వము వాచ్యమగునపుడు, దానికి పరముగా ఙీప్ ప్రత్యయము వచ్చునని సూత్రార్థము. ద్రవ్యములం దుండునది. కొన్ని ద్రవ్యముల యందుండనిది. వేర్వేఱుజాతులయందు

గోచరించునది, ఉత్పాద్యము, అనుత్పాద్యము అను రెండుభేదములు గలది. ద్రవ్యముకంటె భిన్నమైనది అను లక్షణములు గుణమునకుఁ జెప్పఁబడినవి.

సత్త్వేనివేశతేఽపైతి పృథగ్జాతిషుదృశ్యతే

ఆధేయశ్చాక్రియాజశ్చ సోఽసత్త్వప్రకృతిర్గుణః-భాష్యము

మృదు,శుచిమున్నగునవి గుణవాచకములు అందు ఉదంతగుణవాచములకు ప్రకృత సూత్రముచే ఙీప్ ప్రత్యయము. మృదు+ఙీప్, మృదు ఈ, యణాదేశము, మృద్వీ సు=మృద్వీ; వైకల్పికము కాన రానిచో మృదు + సు=మృదుః అనియు స్త్రీత్వమున రూపముండును.

సూ : బహ్వాదిభ్యశ్చ 4-1-45.

వృ : వాఙీష్. బహ్వీ, బహుః.

ప. వి : బహ్వాదిభ్య (5-3) చ (అవ్య).

అను : స్త్రియామ్ (7-1) ఙీష్ (1-1) ప్రాతిపదికాత్ (5-1) వా (అవ్య) ప్రత్యయః (1-1) పరః (1-1),

అర్థ : బహుమున్నగు ప్రాతిపదికములకును స్త్రీత్వమున ఙీష్ ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. ఉదా : బహ్వీ, బహుః.

వివ : బహుమున్నగుశబ్దముల స్త్రీత్వము వాచ్యమగునపుడు వానికి పరముగా 'ఙీష్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చును ఉదా : బహు+ఙీష్ ఙకారవ్ షకారములిత్తులు బహు + ఈ, యణాదేశము బహ్ వ్ ఈ=బహ్వీ+సు = బహ్వీ. రానిచో బహు + సు=బహుః.

బహ్వాదిగణములోని రెండుగణసూత్రము లిట వ్యాఖ్యానింపఁ బడుచున్నవి.

గ. సూ : కృదికారాదక్తినః (50).

వృ : రాత్రిః - రాత్రీ

ప వి : కృదికారాత్ (5 1) అక్తినః (5-1).

అర్థ : క్తిన్ ప్రత్యయముకాక తక్కిన కృత్ప్రత్యయసంబంధమైన ఇకారము అంతమునఁగల ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఙీష్ ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. ఉదా : రాత్రిః-రాత్రీ.

వివ : ధాతువునకుఁ జేరుతిఙ్భిన్నప్రత్యయములు కృత్తులు. 'క్తిన్' (స్త్రియాం క్తిన్) అనునది కాక తక్కిన కృత్ప్రత్యయములకు సంబంధించిన

ఇకారము అంతమునఁ గల ప్రాతిపదికమునకు స్త్రీత్వము వాచ్యమగునపుడు 'ఙీష్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చును. ఉదా : రాత్రి - 'రా' దానే అనుధాతువునకు 'రాశదిభ్యాం త్రిప్' అను సూత్రముచే 'త్రిప్' అను ప్రత్యయము చేయగా 'రాత్రి' అగును ఇది కృదికారము అంతమునఁ గలప్రాతిపదికము. దీనికి ప్రకృత సూత్రముచే ఙీష్ ప్రత్యయము రాఁగా రాత్రి + ఙీష్, రాత్రి + ఈ ఇకారలోపము రాత్ + ఈ = రాత్రీ + సు = రాత్రీ. ఙీష్‌రానిచో రాత్రి + సు = రాత్రిః అని యగును.

అవ : పై గణసూత్రమునకు కొంతసవరణము నీ క్రింది గణసూత్రము చేయుచున్నది

౫. సూ : సర్వతోఽక్తిన్నర్థాదిత్యేకే (51).

వృ : శకటిః, శకటీ.

ప వి : సర్వతః (అవ్య) అక్తిన్నర్థాత్ (5-1) ఇతి (అవ్య) ఏకే (1-3)

అర్థ : క్తిన్నర్థముకాని యే ఇకారాంతమునకైనను ఙీష్ ప్రత్యయము వైకల్పికముగా నగునని కొందఱందురు. ఉదా : శకటిః, శకటీ.

వివ : పై గణసూత్రముచే కృత్ప్రత్యయమునకు సంబంధించిన ఇకారము అంతమునఁ గలదానికే ఙీష్ ప్రత్యయము చెప్పఁబడగా 'క్తిన్' ప్రత్యయమును, ఆ అర్థముగల యితరప్రత్యయమును కాక తక్కినయే ప్రత్యయముయొక్క ఇకారము అంతమునఁ గల ప్రాతిపదికమునకైనను ఙీష్ ప్రత్యయము వైకల్పికముగా నగునని యీ సూత్రము చెప్పుచున్నది. ఇది కొందఱఅభిప్రాయమని 'ఏకే' అను పదము వలన తెలియుచున్నది.

ఉదా : 'శకటి' - ప్రకృతిప్రత్యయవిభాగముచేయుటకు వీలులేని అవ్యుత్పన్నప్రాతిపదిక మియ్యది కావున కృదంతము కాదు. కృదికారాంతమునకేఅనినచో దీనికి ఙీష్ ప్రత్యయము రాకపోవును. శకటి + ఙీష్, శకట్ + ఈ = శకటీ + సు = శకటీ; రానిచో శకటి + సు = శకటిః.

బహ్వాదిగణము : బహు పద్ధతి అఞ్చతి అఙ్కతి అంహతి శకటి (శకతి). 'శక్తిః శస్త్రే' 48. శారి వారి రాతి రాధి (శాధి) అహి కపి యష్టి ముని 'ఇతః ప్రాణ్యఙ్గాత్' 49 'కృదికారాదక్తినః' 50. సర్వతోఽక్తిన్నర్థాదిత్యేకే' 51. చణ్డ అరాల కృపణ కమల వికట విశాల విశఙ్కట భరుజ ధ్వజ. 'చన్ద్రభాగా

స్నద్యామ్' 52 (చన్ద్రభాగా నద్యామ్) కల్యాణ ఉదార పురాణ అహన్ క్రోడ నఖ ఖుర శిఖా బాల శఫ గుద-ఆకృతిగణోఽయమ్. తేన భగ గల రాగ ఇత్యాది - ఇతి బహ్వాదయః.

సూ : పుంయోగాదాఖ్యాయామ్ 4-1-48.

వృ : యా పుమాఖ్యా పుంయోగాత్ స్త్రియాం వర్తతే తతో ఙీష్. గోపస్య స్త్రీ గోపీ.

ప. వి : పుంయోగాత్ (5-1) ఆఖ్యాయామ్ (7-1).

అను : స్త్రియామ్ (7-1) ఙీష్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1) ప్రాతిపదికాత్ (5-1).

అర్థ : ఏ పురుషనామము పురుషసంబంధముగల స్త్రీయందు వర్తించునో అట్టి ప్రాతిపదికమునకు ఙీష్ ప్రత్యయము వచ్చును. ఉదా : గోపస్యస్త్రీ గోపీ.

వివ : 'ఆఖ్యాయామ్' అనునది పంచమ్యర్థమున సప్తమిచేరినరూపము. కావున ఆఖ్యావాచకశబ్దమునకు అనునర్థము వచ్చును. ఆఖ్య అనగా పేరు ఎవని పేరు' అను ఆకాంక్షకు సమాధానముగా 'పుంయోగాత్' అను పదమునుబట్టి 'పురుషుని పేరు' అనునర్థము సిద్ధించును. పుంయోగమనగా పురుషునియొక్క సంబంధము. ఇచటి పంచమికి హేతువు అర్థము. పురుషునితో స్త్రీకిఁగల సంబంధమును బట్టి ఏ పురుషనామము స్త్రీయందు వర్తించునో అట్టి పురుషవాచక ప్రాతిపదికమునకు ఙీష్ ప్రత్యయము వచ్చునని సూత్రార్థము అనగా నొక స్త్రీవ్యక్తి తనకు సంబంధించిన పురుషునిపేరితో వ్యవహరింపఁబడునెడల ఆ నామమును వచించు ప్రాతిపదికమునకు పరముగా ఙీష్ ప్రత్యయము వచ్చునని ఫలితార్థము.

ఉదా : గోపస్యస్త్రీ - ఇచట గోపునిభార్య తనభర్తకు పేరైన గోప అను శబ్దముతో వ్యవహరింపఁబడుచున్నది. కావున 'గోప' అనునది యిచట పుంయోగము వలన స్త్రీయందు వర్తించు ఆఖ్య (=పేరు)ను తెలుపుశబ్దము గోప + ఙీష్ - గోప + ఈ, యస్యేతిచ - అకారలోపము గోప్ + ఈ = గోపీ + సు=గోపీ.

పుంయోగమున ఙీష్ ప్రత్యయము సాధారణముగా అదంతములకే వచ్చును. ('అతః' అనుపదము ననువర్తింపఁజేయుటచే ఈ యర్థము కలుగును) మఱియు పుంయోగము అనుపదముచే సాధారణముగా భార్యాభర్తృత్వసంబంధమునే గ్రహింపవలయు నని భాష్యకారులశాసనము. కావున గోపుని కూతురు, గోపుని తల్లియున్నగు

నర్థములందు జీష్ ప్రత్యయము ఈ సూత్రముచే రాదని యెఱుంగునది. మఱియు స్వయముగా గోవులను పాలించునది అనునర్థమునందును ఈ ప్రత్యయమురాదు.

అవ : పై సూత్రమునకొక అపవాదము చెప్పఁబడుచున్నది.

**వా॥ పాలకాన్తాన్న (2461).**

**వృ గోపాలికా, అశ్వపాలికా.**

ప. వి : పాలకాన్తాత్ (5-1) న (అవ్య).

అర్థ : పాలక శబ్దమంతమునఁ గల పురుషనామము స్త్రీయందు వర్తించు నపుడు దానికి పరముగా జీష్ ప్రత్యయము రాదు. ఉదా : గోపాలికా, అశ్వపాలికా.

వివ : 'గోపాలక' అనునది పురుషనామము. గోపాలకుని స్త్రీ అనునర్థము నందు పై సూత్రముచే ప్రాప్తమగు జీష్ ప్రత్యయము నీ వార్తికము వారించు చున్నది 'జీష్' ప్రత్యయము రానిచో అదంతమగుటచే టాప్ ప్రత్యయము వచ్చును (అజాద్యతష్టాప్) గోపాలక + టాప్, టకార పకారము లిత్తులు. గోపాలక + అ, ముందుఁ జెప్పఁబడు సూత్రముచే 'ల'లోని అకారమునకు ఇకారాదేశము. గోపాలిక+అ, సవర్ణదీర్ఘము, గోపాలికా+సు=గోపాలికా. అట్లే అశ్వపాలకస్య స్త్రీ - అశ్వపాలికా.

అవ : పై ఉదాహరణములందు అత్వమున కిత్వమును ఈ క్రింది సూత్రము విధించుచున్నది.

**సూ : ప్రత్యయస్థాత్కాత్పూర్వస్యాత ఇదాప్యసుపః 7-3-44**

**వృ: ప్రత్యయస్థాత్కాత్పూర్వస్యాకారస్యేకారస్యాదాపి సఆప్ సుపః పరో న చేత్. సర్వికా, కారికా, అతఃకిమ్? నౌకా. ప్రత్యయస్థాత్కిమ్? శక్నోతీతి శకా. అసుపః కిమ్? బహు పరివ్రాజకా. నగరీ.**

ప. వి : ప్రత్యయస్థాత్ (5-1) కాత్ (5-1) పూర్వస్య (6-1) అతః (6-1) ఇత్ (1-1) ఆపి (7-1) అసుపః (5-1).

అర్థ : సుప్పునకు పరముగాలేని అప్పు పరమగునపుడు, ప్రత్యయస్థమైన కకారమునకు పూర్వమున నున్న అత్తునకు హ్రస్వఇకార మాదేశమగును ఉదా : సర్వికా, కారికా. అతఃఅనుటవలన నౌకా అనుచోటను, 'ప్రత్యయస్థాత్' అనుట వలన 'శకా' అనుచోటను, అసుపః అనుటవలన బహుపరివ్రాజకా (నగరీ) అను చోటను ఇత్వము రాదు.

వివ : ప్రత్యయస్థమనగా ప్రత్యయమునందున్నది ప్రత్యయము లనగా 3,4,5 అధ్యాయములందు విధింపఁబడిన సనాదులు, అట్టివానిలోనున్న కకారమునకు పూర్వమున నున్న హ్రస్వ అకారమునకు హ్రస్వఇకారము ఆదేశముగా వచ్చును ఇట్లు వచ్చుటకు అప్‌ప్రత్యయము నిమిత్తము. అనగా 'అప్' అనునది పరముగా నుండవలయును. (టాప్, డాప్, చాప్ అనుమూఁడు స్త్రీప్రత్యయములకు 'అప్' అని సామాన్య వ్యవహారము) మఱియు నొక నియమము. ఆ అప్ప్రత్యయము సుప్పునకు (నామవిభక్తికి) పరముగా నుండునది కారాదు.

ఉదా : సర్వ అను సర్వనామమునకు 'అకచ్' అను తద్ధిత ప్రత్యయము చేరఁగా 'సర్వక' అనియగును (అవ్యయసర్వనామ్నామకచ్ ప్రాక్టేః) దీనికి 'అజాద్య తష్టాప్' అనుసూత్రముచే స్త్రీత్వము టాప్ ప్రత్యయము చేయగా సర్వక + టాప్, 'సర్వక+అ' అనియుండును ఇందలికకారము ప్రత్యయములోనిది (అకచ్) దీనికి పరముగా 'అప్' ప్రత్యయము గలదు 'సర్వక' అనుదానికి సుప్పుచేరకముందే 'అప్' ప్రత్యయము వచ్చినది కావున 'అప్' అనునది సుప్పునకు పరము లేనిదియే. ఇట్టిస్థితిలో కకారమునకు పూర్వమున నున్న 'ర్వ' లోని అకారమున కీసూత్రముచే ఇకారాదేశము రాగా సర్విక + అ - సర్వికా + సు = సర్వికా అగును.

కృధాతువునకు కర్త్రర్థమున 'ణ్వుల్తృచౌ' అను సూత్రముచే ణ్వుల్ ప్రత్యయము. ఇందు ణకారలకారము లిత్తులు, కృ + వు-ప్రత్యయము ణిత్తగుటచే ధాతువులోని ఋకారమునకు వృద్ధివచ్చును. (అచోఞ్ణితి) (ఋ> ఆర్-ఉరణ్ రపరః) కార్ + వు, 'యువోరనాకౌ' అనుసూత్రముచే 'వు' అనుదానికి 'అక' ఆదేశము. కార్ + అక = కారక. ఇట్లిందలికకారము ప్రత్యయస్థము. దీనికి స్త్రీత్వమున టాప్ ప్రత్యయము. కారక + అ, ఇత్వము, కారిక + అ=కారికా + సు=కారికా. 'గోపాలికా' ఇత్యాదులందు లకారముమీఁది అకారమున కికార మీసూత్రముచేతనే వచ్చినది.

ఈ సూత్రమునందలి యాయాదశముల సార్థక్యమును చూపుచున్నారు.

అతః అనుటవలన హ్రస్వఅకారముకాక తక్కిన అచ్చునకు ఈఃఇకారాదేశము రాదు. ఉదా : నౌక + అ ప్రత్యయస్థమైన కకారమునకు, ఆప్ పరముగానున్నది. కాని కకారమునకు పూర్వమున నున్న అచ్చు ఔకారము. అట్టిదానికి ఇత్వము రాకుండుటకై 'అతః' అనుపదము సూత్రమున నవసరమగుచున్నది. అది లేనిచో 'నికా' వంటి అనిష్టరూపము లేర్పడును.

'ప్రత్యయస్థాత్' - ప్రత్యయములోనున్న అనుటవలన కకారము ప్రత్యయమునందలిది కానిచో తత్పూర్వమున నున్న హ్రస్వ అకారమునకు ఇత్వము రాదు. ఉదా : శక్నోతీతి – శకా 'శక' ఇందలి కకారము ధాతువునకు సంబంధించినది ('శక్') ప్రత్యయము 'అ' అనునదిమాత్రమే. కాన 'శక' అనుదానికి టాప్పు పరమగునపుడు 'శ'లోని అకారమునకు ఇత్వమురాదు. సూత్రమున 'ప్రత్యయస్థాత్' అను పదములేనిచో 'శికా' వంటిఅనిష్టరూపము లేర్పడును ('శక' అనుచోట 'నన్ది గ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః' అను సూత్రముచే 'అచ్' ప్రత్యయము వచ్చినది).

అసుపః – ఆప్ ప్రత్యయము సుప్పునకు పరముగా నున్నది కారాదు అనుటవలన 'బహుపరివ్రాజకానగరీ' అనుచోట ఇత్వమురాలేదు. బహవః పరివ్రాజకాః యస్యాం నగర్యాం సా బహుపరివ్రాజకా–అనేకపరివ్రాజకులు (సన్న్యాసులు) గలనగరి. పరివ్రాజకశబ్దములోని కకారము ప్రత్యయస్థమే. పరి, వ్రజ్ + ణ్వుల్=పరివ్రాజక అగును. దానికి పూర్వమున హ్రస్వ అకారము గలదు. పరముగా 'ఆప్' ప్రత్యయము ఉన్నది కాని అది సుప్పునకు (నామవిభక్తికి)పరముగా వచ్చినది. 'బహు+జస్, పరివ్రాజక+జస్' అనియుండ 'అనేకమన్యపదార్థే' అను సూత్రముచే సమాససంజ్ఞ కలుగును. సమాసమైనది ప్రాతిపదికమగును (కృత్తద్ధిత సమాసాశ్చ) ప్రాతిపదికావయవమగు సుప్పునకు లుక్కువచ్చును (సుపో ధాతు ప్రాతిపదికయోః). 'బహుపరివ్రాజక' అనియుండ దీనికి స్త్రీత్వమున 'టాప్' ప్రత్యయము వచ్చినది. ఇది అదర్శనమును పొందియున్న 'జస్' అనుసుప్పునకు పరముగా నున్నదికదా! కావున అట్టి ఆ ప్రత్యయము పరమగునపుడే ఇత్వము రాకుండుటకై సూత్రమున 'అసుపః' అనుపదము ఉంచఁబడినది. కావున 'జ' లోని అకారమునకు ఇత్వమురాదు. బహుపరివ్రాజక + అ=బహు పరివ్రాజకా + సు= బహుపరివ్రాజకా నగరీ.

అవ : పుంయోగమున నొక అపవాదము చెప్పఁబడుచున్నది.

**సూ॥ సూర్యాద్దేవతాయాం చాప్ వాచ్యః (2471).**

**వృ : సూర్యస్య(స్త్రీ) దేవతా సూర్యా.**

ప. వి : సూర్యాత్ (5-1) దేవతాయామ్ (7-1) చాప్ (1-1) వాచ్యః (1-1).

అర్థ : సూర్యశబ్దమునకు పుంయోగమున, దేవత చెప్పఁబడునపుడు, 'చాప్' అను ప్రత్యయము వచ్చును. ఉదా : సూర్యుని స్త్రీయగు దేవత-సూర్యా.

వివ – సూర్యశబ్దముతో వ్యవహరింపఁబడు సూర్యునిస్త్రీని చెప్పవలసినపుడు సూర్యశబ్దమునకు పరముగా 'చాప్' ప్రత్యయము వచ్చును. ప్రత్యయాంతముచే వాచ్యయగునది దేవజాతి స్త్రీయైనపుడే యిది వచ్చును. ఇది పుంయోగా దిత్యాది సూత్రముచే వచ్చుఙీష్ ప్రత్యయమున కపవాదము. ఉదా : సూర్యస్య స్త్రీ దేవతా. సూర్యునిభార్య (దేవత) సూర్య + చాప్ (చకారపకారము లిత్తులు) సూర్య +, అ సవర్ణదీర్ఘ సంధి, సూర్యా + సు=సూర్యా.

**వృ: దేవతాయామ్ కిమ్ ?**

అర్థ : దేవత గమ్యమానమగునపుడు అనవేల ? సూర్యునిస్త్రీ యైన మానవ జాతి స్త్రీవాచ్యయగునేని ఈ ప్రత్యయము రాదు. "పుంయోగాదాఖ్యాయామ్" అను సూత్రముచే 'ఙీష్' ప్రత్యయమే వచ్చును. ఉదా : సూర్యస్త్రీ సూరీ కున్తీ. సూర్యునియొక్క స్త్రీ అయిన కుంతి. ఈమె దేవజాతికాదు. మానుషికావున చాప్ ప్రత్యయము రాదు. ప్రక్రియక్రింద చూపఁబడుచున్నది.

**వా: సూర్యాగస్త్యయో శ్ఛే చ ఙ్యాఞ్చ 4199.**

**వృ : యలోపః సూరీకున్తీ, మానుషీయమ్.**

ప. వి : సూర్యాగస్త్యయోః (6-2) ఛే (7-1) చ (అవ్య) ఙ్యామ్ (7 7) చ (అవ్య).

అర్థ : సూర్య, అగస్త్యశబ్దములకు ఛ, ఙీ ప్రత్యయములు పరములగునపుడు ఉపధయగు యకారమునకు లోపము వచ్చును. ఉదా : సూరీ.

వివ : 'సూర్యతిష్యాగస్త్యమత్స్యానాం య ఉపధాయాః' అనుసూత్రము సూర్యాదిశబ్దముల ఉపధయగు యకారమునకు లోపమును విధించుచున్నది. ఆ సూత్రమున కనుబంధముగా ఈ వార్తికము చెప్పఁబడినది. సూర్య, అగస్త్య శబ్దములయొక్క ఉపధయగు యకారమునకు ఛ ప్రత్యయమును, ఙీప్రత్యయమును పర మగునపుడు లోపము వచ్చునని తాత్పర్యము. ఇందు యథాసంఖ్యానియమములేదు.

ఉదా : సూర్య + ఙీష్ - మానుషియగు కుంతి సూర్యశబ్దముచే, సూర్యునితోఁ గల సంబంధమును బట్టి చెప్పఁబడునపుడు 'దేవతాయామ్' అనువదమువలన 'చాప్' రాదు కావున ఙీష్ వచ్చినది. సూర్య + ఈ, యస్యేతి చ-అకారలోపము - ప్రకృతవార్తికముచే యకారలోపము, సూర్ + ఈ=సూరీ + సు=సూరీ.

సూర్యా = సంజ్ఞాదేవి, లేక ఛాయాదేవి (చాబంతము) సూరీ = కుంతి ఙీషంతము.

అవ : పుంయోగలక్షణమున ఙీష్ప్రత్యయముతోపాటు కొన్నింటికి ఆనుగాగమము వచ్చుట చెప్పఁబడుచున్నది.

సూ : ఇన్ద్రవరుణభవశర్వరుద్ర మృడహిమారణ్య యవయవనమాతులాచార్యాణామానుక్ 4-1-49.

వృ : ఙీష్ చ. ఇన్ద్రస్య స్త్రీ ఇన్ద్రాణీ, వరుణానీ, శర్వాణీ, రుద్రాణీ, మృడానీ.

వ. వి : ఇన్ద్ర.........చార్యాణామ్ (6-3) ఆనుక్ (1-1).

అను : ఙీష్ (1-1) స్త్రియామ్ (7-1) పుంయోగాత్ (5-1) ఆఖ్యాయామ్ (7-1).

అర్థ : ఇంద్ర, వరుణ, భవ, శర్వ, రుద్ర, మృడ, హిమ, అరణ్య, యవ, యవన, మాతుల, ఆచార్య అనునీశబ్దములకు ఆనుగాగమమును ఙీష్ప్రత్యయమును వచ్చును. ఉదా : ఇన్ద్రాణీ మొ॥వి.

వివ : ఇంద్ర, వరుణ, భవ, శర్వ, రుద్ర, మృడ, మాతుల, ఆచార్య అనుశబ్దములకు, 'పుంయోగాదాఖ్యాయామ్' అనుసూత్రముచే అతనిభార్య అనునర్థమున 'ఙీష్' ప్రత్యయము వచ్చునపుడు ప్రకృతసూత్రముచే 'ఆనుక్'ఆనునాగమము వచ్చును. హిమ, అరణ్య, యవ, యవన అనువానికి పుంయోగలక్షణము లేదు కావున వానికి స్త్రీత్వమున ఆనుగాగమము ఙీష్ప్రత్యయమును ఈ సూత్రముచేతనే వచ్చును. వీనికి ఏ యే యర్థములందు ఈ ప్రత్యయమును ఈ యాగమమును వచ్చునో ముందు వివరింపఁబడును. ఈ ఆగమమునందు కకారముఇత్తు. ఉకారము ఉచ్చారణార్థకము. 'ఆన్' మిగులును. ఇది కిత్తగుటచే ఇంద్రాది శబ్దములకు అంతభాగమున వాని అవయవముగా చేయును. (ఆద్యన్తౌటకితౌ).

ఉదా : (1) ఇన్ద్రస్యస్త్రీ - ఇంద్రునియొక్క-భార్య-ఇన్ద్ర + ఆనుక్ + ఙీష్ ఇన్ద్ర + ఆన్+ఈ=ఇన్ద్రానీ, రేఫయోగముచే నకారమునకు ణత్వము (అట్కు ప్వాఙ్నుమ్వ్యవాయేఽపి) ఇన్ద్రాణీ + సు=ఇన్ద్రాణీ (2) వరుణస్యస్త్రీ - వరుణునిభార్య - వరుణ + ఆన్+ఈ=వరుణానీ+సు=వరుణానీ. (3) భవస్య స్త్రీ-భవునిభార్య-భవ+ఆన్+ఈ = భవానీ - సు=భవానీ. (4) శర్వస్యస్త్రీ, శర్వుని భార్య - శర్వ + ఆన్ + ఈ, శర్వానీ ణత్వము, శర్వాణీ + సు = శర్వాణీ. (5) రుద్రస్యస్త్రీ - రుద్రునిభార్య రుద్ర + ఆన్ + ఈ=రుద్రానీ, ణత్వము, రుద్రాణీ + సు = రుద్రాణీ (6) మృడస్య స్త్రీ, మృడునిభార్య, మృడ+ఆన్ + ఈ=మృడానీ + సు=మృడానీ.

అవ : హిమ, అరణ్య, యవ, యవన అనుశబ్దములకు పుంయోగలక్షణము సరిపడదు కావున వానికేయేయర్థములందు ఆనుగాగమఙీష్ప్రత్యయములు వచ్చునో క్రిందివార్తికములచే చెప్పఁబడుచున్నది.

వా॥ హిమారణ్యయోర్మహత్త్వే 2472.

వృ : మహద్ధిమం హిమానీ; మహదరణ్య మరణ్యానీ.

ప. వి : హిమారణ్యయోః (6-2) మహత్త్వే (7-1).

అర్థ : హిమ, అరణ్యశబ్దములకు మహత్త్వము వ్యక్తమగునపుడు ఆనుగాగమ ఙీష్ ప్రత్యయములు వచ్చును. ఉదా : హిమానీ, అరణ్యానీ.

వివ : మహత్త్వమనఁగా గొప్పతనము. పెద్దది, గొప్పది అనునర్థమును వ్యక్తము చేయుచు హిమ, అరణ్యశబ్దములకు ఆనుగాగమమును, ఙీష్ ప్రత్యయ మును వచ్చును.

ఉదా: మహద్ హిమమ్=గొప్పమంచు, హిమ + ఆన్ + ఈ.సవర్ణదీర్ఘము-హిమానీ + సు=హిమానీ. మహదరణ్యమ్-గొప్పఅరణ్యము-అరణ్య + ఆన్+ ఈ=అరణ్యానీ+సు=అరణ్యానీ.

వా॥ యవాద్దోషే 2473.

వృ : దుష్టోయవో యవానీ.

ప. వి : యవాత్ (5-1) దోషే (7-1).

అర్థ : యవశబ్దమునకు, దుష్టమైనది అనునర్థమునందు, ఆనుగాగమ ఙీష్ ప్రత్యయములు వచ్చును.

వివ : 'దుష్టమైనది' అనునర్థమును వ్యక్తముచేయుచు యవశబ్దమునకు వర ముగా అనుగాగమమును, జీష్ ప్రత్యయమును వచ్చును. దుష్టః యవః = చెడిన యవము-యవ + ఆన్ + ఈ=యవానీ + సు=యవానీ.

వా|| యవనాల్లిప్యామ్ 2474.

వృ : యవనానాం లిపిర్యవనానీ.

ప వి : యవనాత్ (5-1) లిప్యామ్ (7-1)

అర్థ : యవనశబ్దమునకు, 'వారిలిపి' అనునర్థమునందు అనుగాగమ జీష్ప్రత్యయములు వచ్చును. యవనానీ=యవనులలిపి.

వివ : యవనశబ్దమునకు అనుగాగమమును జీష్ ప్రత్యయమును చేరిన శబ్ద మునకు 'యవనులలిపి'అని యర్థమగునని తాత్పర్యము. యవన+ఆన్ + ఈ = యవనానీ + సు= యవనానీ.

వా|| మాతులోపాధ్యాయయోరానుగ్వా 2475.

వృ : మాతులానీ - మాతులీ; ఉపాధ్యాయానీ - ఉపా ధ్యాయీ.

ప. వి : మాతులోపాధ్యాయయోః (6-2) ఆనుక్ (1-1) వా (అవ్య).

అర్థ : మాతుల, ఉపాధ్యాయశబ్దములకు అనుగాగమము వైకల్పికము.
ఉదా : మాతులానీ-మాతులీ; ఉపాధ్యాయానీ-ఉపాధ్యాయీ

వివ : ఇందు మాతుల శబ్దమునకు అనుగాగమము నిత్యముగా వచ్చుచున్నది. ఉపాధ్యాయశబ్దమునకు అనుగాగమము వచ్చుటకు విధిలేదు. అట్టియెడ నీరెంటికిని ప్రకృతవార్తికముచే వైకల్పికముగా అనుగాగమము విధింపఁబడుచున్నది. జీష్ ప్రత్యయము మాత్రము "పుంయోగాదాఖ్యాయామ్" అనుసూత్రముచే నిత్యముగనే వచ్చును.

ఉదా : మాతులస్య స్త్రీ - మేనమామభార్య, మాతుల + ఆనుక్ + జీష్ = మాతుల + ఆన్ + ఈ, సవర్ణదీర్ఘము = మాతులానీ + సు = మాతులానీ, అనుగాగమము రానిచో మాతుల + జీష్, మాతుల + ఈ, యస్యేతిచ-అకార లోపము. మాతుల్ + ఈ=మాతులీ + సు=మాతులీ.

ఉపాధ్యాయస్య స్త్రీ - ఉపాధ్యాయ + ఆన్ + ఈ = ఉపాధ్యాయానీ +

సు=ఉపాధ్యాయానీ, అనుక్కరానిచో ఉపాధ్యాయ + ఈ,ఉపాధ్యాయ్+ఈ=ఉపా ధ్యాయీ + సు=ఉపాధ్యాయీ.

[విభాష మూఁడు విధములు - ఒకకార్యము ఒకసూత్రముచే నిత్యముగా ప్రాప్తించుచుండగా వైకల్పికమని చెప్పినచో దానిని ప్రాప్తవిభాష యందురు ఒక కార్యమునకు ప్రాప్తియే లేనియపుడు వైకల్పికముగా విధించినచో దానిని అప్రాప్త విభాషయందురు. ఒకకార్యము కొన్ని లక్ష్యములందు నిత్యముగా ప్రాప్తించుచుండగా కొన్నింటియందు ప్రాప్తింపకుండగా, వైకల్పికముగా విధించినచో దానిని, ప్రాప్తాప్రాప్త విభాషయందురు. ఇందు ప్రకృత వార్తికము ప్రాప్తాప్రాప్త విభాష కుదాహరణము].

వా॥ ఆచార్యాదణత్వం చ 2477.

వృ : పుంయోగే. ఆచార్యానీ. ఆచార్యా స్వయం వ్యాఖ్యాత్రీ.

ప. వి : ఆచార్యాత్ (5-1) అణత్వమ్ (1-1) చ (అవ్య).

అర్థ : ఆచార్యశబ్దమునకు పుంయోగలక్షణమున ఆనుగాగమజీష్ప్రత్యయములు వచ్చునపుడు నకారమునకు ణత్వము రాకుండుటయు నగును

ఉదా : ఆచార్యానీ. ఇది పుంయోగమునందే. స్వయముగా వ్యాఖ్యానము చేయు స్త్రీ అనునర్థమున 'ఆచార్యా' అగును.

వివ : ఆచార్యశబ్దమునకు ఇంద్రవరుణేత్యాది సూత్రముచే ఆనుగాగపమును, పుంయోగాదాఖ్యాయామ్ అనుసూత్రముచే జీష్ ప్రత్యయమును వచ్చును. ఈశబ్దములో రేఫముగలదు. దానికి అవ్యవహితముగాఁగాని, కొన్నివర్ణములతో వ్యవహితముగాఁగాని పరముగనున్న నకారమునకు ణకారాదేశము రావలయును. (అట్కు ప్వాఙ్ నుమ్ వ్య వా యేఽపి) ఈ వార్తికముచే ఆ ణత్వము విషేధింపఁబడుచున్నది. ఆనుగాగమములోని నకారమునకు ఆచార్యశబ్దమునందు ణత్వమురాదు. ఆచార్యస్యస్త్రీ - ఆచార్యనిభార్య - ఆచార్య + ఆన్ + ఈ = ఆచార్యానీ+సు= ఆచార్యానీ.

పుంయోగము లేనిచో ఈ ఆనుగాగమజీష్ప్రత్యయములు రావు. స్వయముగా వేదాదులను బోధించునది అనునర్థమున పురుషనామముతో పురుషసంబంధము నుబట్టి వ్యవహరింపఁబడుటలేదు కావున జీష్ ప్రత్యయమును, దానితోపాటు వచ్చు ఆనుగాగమమును రావు. ఆచార్యశబ్దమదంతమగుటచే 'అజాద్యత ష్టాప్'

అనుసూత్రముచే 'టాప్' ప్రత్యయము వచ్చును. ఆచార్య + టాప్, ఆచార్య + ఆ, సవర్ణదీర్ఘ సంధి, ఆచార్యా + సు=ఆచార్యా.

వా॥ అర్యక్షత్రియాభ్యాం వా స్వార్థే 2478.

వృ : అర్యాణీ-అర్యా, క్షత్రియాణీ-క్షత్రియా; పుంయోగే అర్యీ, క్షత్రియీ.

ప. వి ; అర్యక్షత్రియాభ్యామ్ (5-2) వా (అవ్య) స్వార్థే (7-1).

అర్థ : అర్య, క్షత్రియశబ్దములకు స్వార్థమునందు ఆనుగాగమజీష్ప్రత్యయములు స్త్రీత్వమున వచ్చును. ఉదా : అర్యాణీ - అర్యా; క్షత్రియాణీ-క్షత్రియా-పుంయోగమున నైనచో అర్యీ-క్షత్రియీ అనియగును.

వివ : అర్య, క్షత్రియ - అనునీశబ్దములయొక్క స్త్రీత్వము వాచ్యమగు నపుడు వానికి ఆనుగాగమజీష్ప్రత్యయములు స్వార్థమునందే వైకల్పికముగా వచ్చును. స్వార్థమునందే యనగా వైశ్యజాతిస్త్రీ క్షత్రియస్త్రీ అనునర్థమునందు వచ్చును అర్యుని (వైశ్యుని) భార్య, క్షత్రియునిభార్య అనునర్థమునందు ఈ ఆనుగాగమము రాదు. జీష్ ప్రత్యయము మాత్రము రావచ్చును. ఉదా : అర్య + ఆన్ + ఈ = అర్యానీ, నకారమునకు ణత్వము, అర్యాణీ - (వైశ్యవనిత) క్షత్రియ + ఆన్ + ఈ= క్షత్రియానీ, ణత్వము, క్షత్రియాణీ + సు= క్షత్రియాణీ. (క్షత్రియవనిత). వైకల్పికముగా ననుటచే ఇవి రానిపక్షమున టాప్ ప్రత్యయము వచ్చును. అర్య + ఆ = అర్యా + సు=అర్యా, క్షత్రియ+ఆ=క్షత్రియా+ సు= క్షత్రియా.

అర్యునిభార్య, క్షత్రియునిభార్య అనునర్థము నందైనచో 'పుంయోగా దాఖ్యాయామ్' అనుసూత్రముచే జీష్ప్రత్యయము మాత్రము వచ్చును ఉదా : అర్య+ జీష్ - అర్య + ఈ, యస్యేతిచ-అకారలోపము, అర్యీ + సు=అర్యీ. క్షత్రియ + జీష్; క్షత్రియీ + సు= క్షత్రియీ. ఇంతవఱకు పుంయోగలక్షణ జీష్ ప్రత్యయము మునకు సంబంధించిన విషయము చెప్పఁబడినది.

సూ : క్రీతాత్కరణపూర్వాత్ 4-1-51.

వృ : జీష్. వస్త్రక్రీతీ, క్వచిన్నధన. క్రీతా.

ప. వి : క్రీతాత్ (5-1) కరణపూర్వాత్ (5-1).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) అతః (5-1) ప్రత్యయః (1-1).

అర్థ : కరణవాచకము పూర్వమునఁ గల క్రీతశబ్దాంతమగు నదంతప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఙీష్ ప్రత్యయము వచ్చును. ఉదా : వస్త్రక్రీతీ. ఈ ప్రత్యయము కొన్నియెడల రాదు. ధనక్రీతా.

వివ : కరణమనగా క్రియాసిద్ధియందు మిక్కిలిగా నుపకరించు సాధనము. అట్టికరణవాచకము పూర్వపదమును, క్రీతశబ్దము ఉత్తరపదముగాను ఉన్న ప్రాతిపదికముయొక్క స్త్రీత్వము వాచ్యమగునపుడు దానికి పరముగా ఙీష్ ప్రత్యయము వచ్చును ఉదా : వస్త్రైః క్రీతా - వస్త్రములచే కొనఁబడినది. ఇచట వస్త్రశబ్దము కరణవాచకము వస్త్ర + భిస్ + క్రీత అని అలౌకిక విగ్రహము. "గతికారకోపపదానాం కృద్భిస్సహ సమాసవచనం ప్రాక్సుబుత్పత్తేః" (గతులకు, కారకములకును, ఉపపదములకును సుప్పులుచేరని కృదంతములతో సమాసమగును) అను పరిభాషచే సమాస మేర్పడగా విభక్తిలోపించును, 'వస్త్రక్రీత' అనియగును. ఇట్టి స్థితిలో ప్రకృతసూత్రముచే ఙీష్ ప్రత్యయము. వస్త్రక్రీత+ఙీష్ (ఙ్, ష్లు ఇత్తులు) వస్త్రక్రీత + ఈ, అకారలోపము, వస్త్రక్రీతీ + సు=వస్త్రక్రీతీ

ఈ సూత్రములోనికి 'అజాద్యతష్టాప్' అనుసూత్రమునుండి 'అతః' అను పదము ననువృత్తి చేసికొని అదంతములకే యీ కార్యమగునని చెప్పవలయును కావున 'ధనక్రీతా' అను ఆకారాంత క్రీతశబ్దమునకు 'ఙీష్' ప్రత్యయము రాదు. ఎట్లన ధనేన క్రీతా, ధనముచేత కొనఁబడినది అనునర్థమున ధనేన అను కరణవాచక పదము 'కృతా' అను కృదంతరూపసుబంతముతో 'కర్తృకరణే కృతాబహుళమ్' అను సూత్రముచే సమసించినచో ధన + టా, క్రీతా+సు, విభక్తిలోపము కలిగి 'ధనక్రీతా' అగును ఇది అదంతముకాదు. కావున దీనికి ప్రకృతసూత్రముచే 'ఙీష్' ప్రత్యయమురాదు.

పూర్వోదాహరణమునందువలె నిందును సుప్పుచేరని 'క్రీత' అనుదానితోడనే సమాసము గతికారకోపపదానామిత్యాది పరిభాషచే చేయరాదా? అన్నచో కర్తృకరణే ఇత్యాది సూత్రమునందలి బహుళపదముచే గతికారకేత్యాది పరిభాష అనిత్యమని చెప్పఁబడినది. కావున నది అన్నియెడలను ప్రవర్తింపఁజాలదు. కావున కొన్నియెడల కృదంతములు సుబుత్పత్తి అయినతర్వాత కూడ సమసింపవచ్చును. 'ధనక్రీతా' అనునది అట్టిది. కావున అది అదంతము కాలేదు. ఙీష్‌రాలేదు. ఈ యంశమునే క్వచిన్న=కొన్నియెడలరాదు అనువృత్తివాక్యము చెప్పుచున్నది.

అవ : స్వాంగలక్షణ ఙీష్ ప్రత్యయము విధింపఁబడుచున్నది.

**సూ : స్వాఙ్గాచ్చోపసర్జనా దసంయోగోపధాత్ 4-1-54.**

**వృ అసంయోగోపధ ముపసర్జనం యత్స్వాఙ్గం తదన్తా ద్వీష్. కేశానతిక్రాన్తా అతికేశీ - అతికేశా, చన్ద్రముఖీ - చన్ద్రముఖా. అసంయోగోపధాత్కిమ్ ? సుగుల్ఫా. ఉపసర్జనాత్ కిమ్ ? సుశిఖా.**

వ. వి : స్వాఙ్గాత్ (5-1) చ (అవ్య) ఉపసర్జనాత్ (5-1) అసంయోగోప ధాత్ (5-1).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ఙీష్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1) వా (అవ్య).

అర్థ : అసంయోగోపధమై యుపసర్జనమైన స్వాంగవాచక మంతమునఁ గల ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఙీష్ ప్రత్యయము వైకల్పికముగా నగును. ఉదా : అతికేశీ - అతికేశా; చంద్రముఖీ-చంద్రముఖా. అసంయోగోపధాత్ అనుటవలన 'సుగుల్ఫా' అనునెడ, ఉపసర్జనాత్ అనుటవలన 'సుశిఖా' అనునెడను ఙీష్ ప్రత్యయము రాదు.

వివ : సంయోగమనగా అచ్చులతో వ్యవధానములేని హల్లుల సముదాయము (హలోఽనన్తరా స్సంయోగః). ఉపధయనగా తుదివర్ణమునకు ముందుండునది (అలోఽన్త్యాత్పూర్వ ఉపధా) సమాసవిధాయకసూత్రమున ప్రథమావిభక్త్యంత పదముచే నిర్దేశింపఁబడినదియు, విగ్రహమున నియతమైన విభక్తి గలదియు నుపసర్జన మనఁబడును (ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్, ఏకవిభక్తిచాపూర్వనిపాతే). సంయోగాక్షరము ఉపధగాలేనిదియు, ఉపసర్జనసంజ్ఞ కలదియు నగుస్వాంగవాచక శబ్దము అంతమునఁగల ప్రాతిపదికమునకు, స్త్రీత్వము వాచ్యముగునపుడు, ఙీష్, ప్రత్యయము వైకల్పికముగా నగును. ఇది రానిచో 'టాప్' ప్రత్యయము వచ్చు నని తాత్పర్యము.

స్వాంగమనగా శరీరావయవము. అది యిట్లు నిర్వచింపఁబడినది.

(1) అద్రవం మూర్తి మత్స్వాఙ్గం ప్రాణిస్థ మవికారజమ్.

(2) అతత్స్థం తత్రదృష్టంచ (3) తేన చేత్తత్థాయుతమ్.

(1) ద్రవముకానిదియు, ఆకారము గలదియు, ప్రాణియందుండునదియు, రోగాది వికారములవలన పుట్టనిదియు నగు అవయవమును స్వాంగమందురు. కన్ను కాలు, ముక్కు, ముఖము మున్నగునవి. (2) ఒకప్పుడు ప్రాణియందుండి అప్పుడు (దానినిగూర్చి చెప్పునపుడు లేనిదియు) స్వాంగమనఁబడును (తీసివేయఁబడిన నఖములు, దంతములు, కేశములు మున్నగునవి) (3) ప్రతిమాదులలో ప్రాణి యందెట్లుండునో యట్టిస్థితిగల అవయవములును స్వాంగములగును. దీనినిబట్టి స్వేదము ద్రవమగుటచేతను, జ్ఞానము, బుద్ధి మున్నగునవి ఆకారములేనివగుట చేతను, శోఫమున్నగునవి వికారమువలన పుట్టినవగుటచేతను స్వాంగములనఁబడవు. ఇట్టి స్వాంగవాచకములు ఉపసర్జనసంజ్ఞకలవియై ప్రాతిపదికముల అంతమునందున్న యెడల అట్టి ప్రాతిపదికములకు స్త్రీత్వమున ఙీష్ ప్రత్యయము వైకల్పికముగా నగును.

ఉదా : కేశానతిక్రాన్తా-కేశముల నతిక్రమించినది అనునర్థమున 'అతి, కేశ + శస్' అనియుండ 'అత్యాదయః క్రాన్తాద్యర్థేద్వితీయయా' అను వార్తికముచే సమాససంజ్ఞ కలుగును. విభక్తులులోపించి 'అతికేశ' అనియుండును. ఇందు కేశ శబ్దము స్వాంగవాచకము. ఇందు ఉపధ సంయోగముకాదు. ఇది విగ్రహమున మార్చుటకు వీలుకాని విభక్తిగలది యగుటచే 'ఏకవిభక్తి చాపూర్వనిపాతే' అను సూత్రముచే ఉపసర్జన సంజ్ఞను పొందును. కావున ఇది అంతమునఁగల 'అతికేశ' అను ప్రాతిపదికమునకు ఙీష్ప్రత్యయము వచ్చును. అతికేశ + ఙీష్, అతికేశ+ ఈ, అకారలోపము అతికేశీ + సు = అతికేశీ. ఇది రానిచో అదంతమగుటచే 'అజాద్యతష్టాప్' అనుసూత్రముచే టాప్ ప్రత్యయము వచ్చును. అతికేశ + అ= సవర్ణదీర్ఘము, అతికేశా+సు=అతికేశా.

చన్ద్ర ఇవ ముఖం యస్యాః సా-'చంద్రునివంటి ముఖముగలది'అను నర్థమున 'చన్ద్ర+సు, ముఖ+సు'అనుదానికి'అనేకమన్యపదార్థే'అనుసూత్రముచే సమాస సంజ్ఞ కలుగును. 'ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్' అనుసూత్రముచే ఇవిరెండును ఉపసర్జనములే యగును. కావున ముఖశబ్దము ఉపసర్జనసంజ్ఞగలదియు, సంయోగోపధముకానిదియు నగుస్వాంగవాచకము. కావున తదంతమునకు 'ఙీష్' ప్రత్యయము వచ్చును. చన్ద్రముఖ+ఈ, చంద్రముఖీ + సు=చంద్రముఖీ, 'ఙీష్' రానిచో టాప్ ప్రత్యయము వచ్చును. చన్ద్రముఖ + అ = చన్ద్రముఖా + సు = చన్ద్రముఖా.

సూత్రమునందలి కొన్నిపదముల సార్థక్యము పరిశీలింపఁబడుచున్నది.

'అసంయోగోపధాత్' - సంయోగోపధముగాని స్వాంగవాచకమునకు అనుటచేత, 'సుగుల్ఫా' అనుచోట జీష్ ప్రత్యయమురాదు. 'గుల్ఫ' అనునది స్వాంగమే, ఉపసర్జనమేకాని, ఇందు ఉపధాక్షరమగు ఫకారము సంయోగము యొక్క అంగము. కావున ఇది అంతమునఁ గల ప్రాతిపదికమునకు జీషురాదు. అదంతమగుటచే టాప్ ప్రత్యయము వచ్చును సుగుల్ఫ + టాప్ = సుగుల్ఫా.

'ఉపసర్జనాత్' అనుటవలన శోభనాశిఖా - శోభనమైన శిఖ అనుచోట 'జీషు' రాదు 'కుగతి ప్రాదయః' అనుసూత్రముచే నిచట సమాస మేర్పడును. అందు ప్రథమానిర్దిష్టము ప్రాది యగు 'సు' అనునది. కావున దానికే ఉపసర్జనసంజ్ఞ యుండును. అగుటచే నిట జీష్ ప్రత్యయము రాదు. [ఇచట 'సుశిఖా' అను నుదాహరణము ప్రామాదికము. ఏలయన, ఈ స్వాంగలక్షణజీష్ప్రత్యయము అదం ములకే వచ్చును 'సుశిఖా' అనుదానికి అదంతము కాకపోవుటవలననే జీష్ ప్రత్యయము రాదు. కావున కేవలము 'శిఖా' అనుదానినే యిట ప్రత్యుదాహరణముగా చూపుట మంచిది. 'శిఖ' అనుదానికి ఉపసర్జనసంజ్ఞలేదు 'జీషు' రాదని చెప్పుట సరివడును - ఈ విషయము బాలమనోరమావ్యాఖ్యయందు నిరూపింపఁబడినది]

అవ : పై సూత్రమునకు కొన్నియెడల నిషేధము చెప్పఁబడుచున్నది

సూ : న క్రోడాదిబహ్వచః 4-1-56.

వృ : క్రోడాదే ర్బహ్వచశ్చ స్వాఙ్గాన్న జీష్. కల్యాణక్రోడా, ఆకృతిగణోఽయమ్. సుజఘనా.

ప. వి : న (అవ్య) క్రోడాది బహ్వచః (5-1).

అను : స్త్రియామ్ (7-1) స్వాఙ్గాత్ (5-1) ప్రాతిపదికాత్ (5-1) జీష్ (1-1).

అర్థ : క్రోడాదులున్ను, బహ్వచ్కములును అగు స్వాంగవాచకములకు పరముగా జీష్ప్రత్యయము రాదు. ఉదా : కల్యాణక్రోడా. ఇది ఆకృతిగణము. సుజఘనా.

వివ : 'క్రోడా' మున్నగు స్వాంగవాచకములకును, అనేకములగు అచ్చులు గల స్వాంగవాచకములకును, పూర్వసూత్రముచే విధింపఁబడిన జీష్ ప్రత్యయము రాదు. ఇచట 'బహ్వచ్' పదముచే రెండుకంటె ఎక్కువ అచ్చులు గలదానిని గ్రహింపవలయును.

ఉదా : కల్యాణీక్రోడాయస్యాః సా. కల్యాణియగు క్రోడముగలది (క్రోడ మనగా గుఱ్ఱముయొక్క ఱొమ్ము) 'అనేకమన్యపదార్థే' అనుసూత్రముచే పుంవద్భావము. 'కల్యాణక్రోడా' 'గోస్త్రియోరుపసర్జనస్య' అనుసూత్రముచే తుదిదీర్ఘమునకు హ్రస్వము 'కల్యాణక్రోడ' - దీనికి పూర్వసూత్రముచే జీష్ ప్రత్యయము ప్రాప్తించుచుండగా నిషేధింపఁబడినది. అదంతమగుటచే టాప్' ప్రత్యయము. కల్యాణక్రోడ + అ = కల్యాణక్రోడా + సు = కల్యాణక్రోడా.

క్రోడాదిగణము అకృతిగణము కావున జీష్ ప్రత్యయనిషేధమునకు ఇతర విధానములేని స్వాంగవాచకములనిందు చేర్చుకొనవలయును.

బహ్వచ్కమున కుదాహరణము. శోభనం జఘనం యస్యాఃసా-అందమైన జఘనముగలది. ఇందు స్వాంగవాచకమగు 'జఘన' శబ్దమునందు మూఁడచ్చులు గలవు. కాన 'సుజఘన' అనుచోట జీష్ప్రత్యయము రాదు. అదంతమగుటచే 'టాప్' ప్రత్యయము సుజఘన + అ = సుజఘనా + సు = సుజఘనా.

క్రోడాదిగణము : క్రోడ నఖ ఖుర గోఖా ఉఖా శిఖా వాల శప గుద - ఆకృతిగణోఽయమ్-ఇతిక్రోడాదయః.

సూ : నఖముఖాత్సం జ్ఞాయామ్ 4-1-58.

వృ : న జీష్.

ప. వి : నఖముఖాత్ (5-1) సంజ్ఞాయామ్ (7-1)

అను ; స్వాఙ్గాత్ (5-1) న (అవ్య) ప్రాతిపదికాత్ (7-1) స్త్రియామ్ (7-1) జీష్ (1-1).

అర్థ : సంజ్ఞ గమ్యమానమగునపుడు నఖముఖ అను స్వాంగవాచకములంత మునఁ గల ప్రాతిపదికమునకు స్త్రీత్వమున జీష్ ప్రత్యయము రాదు.

వివ : నఖ, ముఖ అనుస్వాంగవాచకములు అంతమునఁగల ప్రాతిపదిక మొకదానికి సంజ్ఞయైనచో, అట్టి ప్రాతిపదికమునకు పరముగా స్త్రీత్వమున జీష్ ప్రత్యయము రాదు. స్వాంగాదిత్యాదిసూత్రమున కిది యపవాదము.

ఉదా : శూర్పాణీవ కరరుహాః యస్యాః సా - చేటలవంటిగోళ్ళు కలది. 'శూర్ప + జస్, నఖ + జస్' అనియుండ 'అనేకమన్యపదార్థే' అనుసూత్రముచే సమాససంజ్ఞ. విభక్తులు లోపించును. 'శూర్ప, నఖ' అనియుండ క్రింది సూత్రముచే నకారమునకు ణత్వము విధింపఁబడుచున్నది.

సూ : పూర్వపదాత్సంజ్ఞాయామగః 8-4-3

వృ : పూర్వపదస్థా న్నిమిత్తా త్పరస్య నస్య ణః స్యాత్సంజ్ఞాయాం, నతు గకారవ్యవధానే. శూర్పణఖా.

ప వి. పూర్వ పదాత్ (5-1) సంజ్ఞాయామ్ (7-1) అగః (5-1).

అను : రషాభ్యామ్ (5-2) నః (6-1) ణః (1-1).

అర్థ : పూర్వపదమునందున్న నిమిత్తమునకు పరముగా నున్న నకారమునకు ణత్వము, సంజ్ఞయందు, వచ్చును. గకారవ్యవధానమున్నచో రాదు. ఉదా : శూర్పణఖా.

వివ : నకారము ణకారముగా మాఱుటకు నిమిత్తములు రేఫషకారములు. అవి సమాసమున పూర్వపదములోనుండినను ఉత్తరపదములో నున్న నకారమునకు ణత్వము వచ్చును కాని నిమిత్తములగు రేఫషకారములకును, స్థానియగు నకారమునకు నడుమ గకారముండరాదు. మఱియు సముదాయముచేత సంజ్ఞ వాచ్యమగునపుడే యీ కార్యము జరుగును 'రషాభ్యాంనోణస్సమానపదే' అను సూత్రములోని 'సమానపదే' అనుదానినిబట్టి యిట్టియెడల ణత్వము సిద్ధింపక పోవుటచే నీసూత్రముచే చెప్పఁబడెను.

శూర్ప + నఖ - పూర్వపదమునందలి రేఫము నిమిత్తము ఉత్తరపదములోని నకారమునకు ణత్వము రాఁగా 'శూర్పణఖ' అయినది 'అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి' అనుసూత్రముచే ప్, అ, అనునవి మధ్యనున్నను ఈకార్యము జరుగును. 'శూర్పణఖ' అనునది యొక స్త్రీకి సంజ్ఞ కావున దీనికి ఙీష్నిషేధము. అదంతమగుటచే టాప్ ప్రత్యయము. శూర్పణఖ + టాప్ = శూర్పణఖా + సు = శూర్పణఖా.

అవ : నఖముఖాదిత్యాదిసూత్రమునందలి ముఖశబ్దాంతమున కుదాహరణమును, సంజ్ఞాయామ్ అనుపదముయొక్క ప్రయోజనమును చూపఁబడుచున్నవి.

వృ ; గౌరముఖా. సంజ్ఞాయాం కిమ్? తామ్రముఖీ కన్యా.

అర్థ : ఉదా : గౌరముఖా. సంజ్ఞయందే యననేల? తామ్రముఖీ కన్యా అనుచోట నీనిషేధము ప్రవర్తింపదు.

వివ : గౌరం వదనం యస్యాః సా - తెల్లనిముఖముగలది. 'గౌరముఖ' ఇది యొకస్త్రీకి పేరు. కావున ఙీష్నిషేధము. అదంతమగుటచే టాప్ ప్రత్యయము (అజాద్యతష్టాప్) గౌరముఖ + అ = గౌరముఖా + సు = గౌరముఖా.

ఈ నిషేధము సంజ్ఞావాచ్యమగునపుడే యనుటచే 'తామ్రం ముఖం యస్యాఃసా' తామ్రమైన ముఖముగలది అనుఅవయవార్థము కలచోట ఈ నిషేధము ప్రవర్తింపదు. 'తామ్రముఖ'+ఙీష్=తామ్రముఖీ ఇది సంజ్ఞ కాదని తెలుపుటకై 'కన్యా' అను విశేష్యము చూపఁబడినది.

[శూర్పణఖా, గౌరముఖా అనునవి సంజ్ఞలు కావున నిత్యసమాసములు. అట్టి వానికి స్వపదములతో విగ్రహముండదు కావున శూర్పాణీవకరరుహా యస్యాఃసా, గౌరం వదనం యస్యాఃసా అనువిధముగా విగ్రహము చూపఁబడినది]

ఇంతవఱకు స్వాంగలక్షణ ఙీష్ ప్రత్యయమునకు సంబంధించిన విషయములు చెప్పఁబడినవి.

అవ : జాతిలక్షణ ఙీష్ ప్రత్యయము చెప్పఁబడుచున్నది

**సూ : జాతేరస్త్రీవిషయాదయోపధాత్ 4-1-63.**

**వృ : జాతివాచి యన్నచ స్త్రియాం నియత మయోపధం తతో ఙీష్ తటీ, వృషలీ, కఠీ, బహ్వృచీ-జాతేః కిమ్? ముణ్డా. అస్త్రీవిషయాత్ కిమ్? బలాకా - అయోపధాత్కిమ్? క్షత్రియా.**

ప. వి : జాతేః (5-1) అస్త్రీవిషయాత్ (5-1) అయోపధాత్ (5-1)

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ఙీష్ (1-1) ప్రత్యయః (1-1).

అర్థ : నియతముగా స్త్రీలింగము కానిదియు, యకారోపధముకానిదియు నగుజాతి వాచకప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఙీష్ప్రత్యయము వచ్చును. ఉదా : తటీ మొ॥వి. జాతేః అనుటవలన 'ముణ్డా'ఇత్యాదులందును, అస్త్రీవిషయాత్ అనుట వలన 'బలాకా' మున్నగువానియందును, అయోపధాత్ అనుటవలన క్షత్రియా మున్నగువానియందును ఙీష్ ప్రత్యయము రాలేదు.

వివ : అస్త్రీవిషయమనగా 'నిత్యస్త్రీలింగము కానిది' అని భావము. యకార ముపధగాఁగలది యోపధము. అదికానిది అయోపధము. జాతిని తెలుపునది జాతి వాచకము. నిత్యస్త్రీలింగముకానిదియు, యకార ముపధగాలేనిదియు నగుజాతి వాచకశబ్దముయొక్క స్త్రీత్వము వాచ్యమగునపుడు, దానికి పరముగా 'ఙీష్' అను ప్రత్యయము వచ్చును. జాతియనఁగానేమో యీ క్రింది శ్లోకముచే నిర్వచింపఁ బడుచున్నది.

శ్లో॥ ఆకృతిగ్రహణా జాతిః లిఙ్గానాం చ న సర్వభాక్
సకృదాఖ్యాత నిర్గ్రాహ్యా గోత్రం చ చరణైః సహ.

మూఁడువిధములుగా జాతిత్వము నిర్ణీతమగును (1) ఆకృతిగ్రహణాజాతిః. ఆకృతిగ్రహణముగాఁగలది. ఆకృతి యనగా అవయవముల కూర్పు గ్రహణ మనగా గ్రహించుటకు సాధనము ఆకారమునుబట్టి వస్తుజ్ఞానమును పొందుటకు వీలున్నయెడల నట్టిదానిని 'జాతి' అందురు. ఉదా : తటమనఁగా నది మున్నగు వానితీరము. ఎత్తైనకట్ట, ఒకవిధమగు మట్టి, జలసామీప్యము మున్నగు ఆకార విశేషము గలదానిని చూచి ఇది తటము అనుజ్ఞానమును పొందుచున్నాము. కావున తటత్వము ఒకజాతి. దానిని వచించు 'తటః' అనునది జాతివాచకము ఇట్లే మనుష్యజాతి, గోజాతి, మృగజాతిమున్నగునవి. ఈ నిర్వచనమునుబట్టి బ్రాహ్మ ణత్వాదులకు జాతినామము కలుగుటలేదు. అందుచే మఱియొక లక్షణము చెప్పఁ బడుచున్నది. (2) లింగానాం చ న సర్వభాక్, సకృదాఖ్యాతనిర్గ్రాహ్య - అన్ని లింగములయందును ఉండనిదియు, ఒక మాఱొక వ్యక్తియందు వ్యవహరించుటచే అతనికి సంబంధించిన వ్యక్త్యంతరమునందు వ్యవహారము లేకపోయినను దెలియు టకు వీలయినదియు జాతి యనఁబడును ఉదా : వృషలః - శూద్రుఁడు ఈశబ్దము పుంనపుంసకములయం దుండును. నపుంసకలింగమునం దుండదు. కావున నిది సర్వ లింగములయందు లేనిది. మఱియు నొకవ్యక్తిని చూపి ఇతఁడు వృషలుఁడు అని వ్యవహరించినచో అతనిపుత్రాదులు వృషలులు అనునది ప్రత్యేకించి చెప్పనవస రము లేకయే తెలియును ఇట్టిదియు జాతి యగును

(3) గోత్రంచచరణైస్సహ. గోత్రమనగా అపత్యముగా (సంతానముగా) వివక్షింపఁబడిన పౌత్రాదులు. (అపత్యంపౌత్ర ప్రభృతి గోత్రమ్) చరణము లనగా వేదశాఖలు. ఆయాగోత్రములందలి వ్యక్తులును, ఆయావేదశాఖలను అధ్య యనముచేయు వ్యక్తులును 'జాతి' పదముచే వ్యవహరింపఁబడుదురు. ఉదా : ఆత్రేయులు-అత్రిమూలపురుషుఁడుగాఁగలవారు. కఠుఁడు. కఠమను వేదభాగమును అధ్యయనము చేయువాఁడు.

ఇట్లుమూఁడు విధములైనజాతివాచకములకును స్త్రీత్వమున ఙీష్ ప్రత్యయము వచ్చును. నిత్యస్త్రీలింగమైన జాతివాచకములకును, యోపధమైన జాతివాచకమునకును ఈ ప్రత్యయము రాదు.

(1) తట + ఙీష్ = తట+ఈ, యస్యేతిచ-అకారలోపము తటీ + సు = తటీ. (2) వృషల+ఙీష్=వృషలీ+సు = వృషలీ. (3) కఠ + ఙీష్ =

కలీ + సు = కలీ, బహవః ఋచః అధ్యేయా యస్యాఃసా - ఏస్త్రీకి అనేక ఋక్కులు అధ్యేయములో ఆమె బహ్వృచ (ఋక్పూరబ్ధూః పథామానక్షే అనుసూత్రముచే 'అ' అను సమాసాంతప్రత్యయమురాగా నిది అకారాంత మగును)బహ్వృచ + జీష్ - బహ్వృచీ + సు=బహ్వృచీ. (బహ్వృచ శబ్దము వేదశాఖనధ్యయనము చేయువానిని వచించునది యగుటచే జాతివాచకము)

సూత్రమునందలిపదముల సార్థక్యము చర్చింపఁబడుచున్నది. (1) జాతేః కిమ్ - జాతివాచకమున కననేల? జాతివాచకము కానిచో జీష్‌ప్రత్యయమురాదు. ఉదా : ముణ్డ-ముండత్వము అనగా నున్నగా చేయఁబడిన తలగలిగియుండుట. ఇది జాతివాచకము కాదు కావున అదంతమగుటచే టాప్ ప్రత్యయము వచ్చును. ముణ్డ+టాప్=ముణ్డా + సు=ముణ్డా.

(2) నియతస్త్రీలింగములైనవానికి ఈ ప్రత్యయము రాకుండుటకై 'అస్త్రీ విషయాత్' అనుపదము గ్రహింపఁబడినది, ఉదా : 'బలాక' ఇది నిత్యస్త్రీలింగము కావున జాతి వాచకమే యైనను దీనికి జీష్ ప్రత్యయమురాదు. 'టాప్' ప్రత్యయము వచ్చి 'బలాకా' అగును.

(3) యకారోపధమైన జాతివాచకమునకు జీష్ ప్రత్యయము రాకుండుటకై 'అయోపధాత్' అనుపదము గ్రహింపఁబడినది. ఉదా : క్షత్రియ ఇది యోపధము-కాన టాప్ ప్రత్యయము వచ్చును. క్షత్రియ + ఆ = క్షత్రియా + సు = క్షత్రియా.

అవ : యోపధవిషయమున కొన్నింటిని పరిహరింపవలయునని యీ క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా॥ హయ గవయ ముకయ మనుష్య మత్స్యానా మప్రతిషేధః (2495).

వృ : యోపధప్రతిషేధే - హయీ, గవయీ, ముకయీ హల స్తద్ధితస్య ఇతియలోపః - మనుషీ.

ప వి : హయ....మత్స్యానామ్ (6-1) అప్రతిషేధః (1-1).

అర్థ : యోపధవిషయమున హయ, గవయ, ముకయ, మనుష్య, మత్స్య అనుశబ్దములకు జీష్‌విషేధములేదు. ఉదా : హయీ మొ॥వి.

వివ : జాతివాచకములయిన 'హయ' మున్నగు శబ్దములకు 'జాతే రిత్యాది సూత్రమునందలి 'అయోపధాత్' అనుపదమువలన జీష్ ప్రత్యయము రాకపోవు చున్నది: యోపధములకు జీషురాకపోవుటలో హయ, గవయ, ముకయ,

మనుష్యమత్స్య అనుశబ్దములను పరిహరింపవలయునని యీ వార్తికము చెప్పు చున్నది. అనగా వీనికి జీష్ ప్రత్యయము వచ్చునని తాత్పర్యము. ఉదా : హయ + ఈ, అకారలోపము, హయీ + సు = హయీ; గవయ + ఈ, గవయీ, ముకయ + ఈ = ముకయీ.

'మనుష్య' శబ్దమునకు జీష్ ప్రత్యయము వచ్చి మనుష్య + ఈ అని యుండ అకారమునకు 'యస్యేతిచ' అనుసూత్రముచేతను, యకారమునకు 'హల స్తద్ధితస్య' అనుసూత్రముచేతను లోపమగును ('మనోర్జాతావఞ్యతౌ షుక్ చ' అను విధిచే మనుశబ్దమునకు యత్ప్రత్యయమును షుగాగమమును రాఁగా 'మనుష్య' అను శబ్దమేర్పడినది. కాన నిందలిది తద్ధితయకారము). మనుష్ + ఈ = మనుషీ

అవ : మత్స్యశబ్దమున క్రిందివార్తికముచే యలోపము విధింపఁబడు చున్నది.

వా॥ మత్స్యస్యఙ్యామ్ 4198.

వృ : యలోపః. మత్సీ.

ప. వి : మత్స్యస్య (6-1) ఙ్యామ్ (7-1).

అర్థ : మత్స్యశబ్దముయొక్క ఉపధాయకారమునకు ఙీ ప్రత్యయము పర మగునపుడు లోపము వచ్చును. ఉదా : మత్సీ.

వివ : ఇది 'సూర్యతిష్యాగస్త్యమత్స్యానాం య ఉపధాయాః' అనుసూత్ర మున కనుబంధముగా చెప్పఁబడిన వార్తికము. కావున ఉపధాయకారమునకు లోపము వచ్చుట అనువర్తము దానినిబట్టి వచ్చును. ఆ సూత్రముచే విధింపఁబడిన యలో పము ఙీ ప్రత్యయము పరమగునపుడే వచ్చునని యీవార్తికముయొక్క తాత్పర్యము. మత్స్య + ఙీష్ + మత్స్య + ఈ = అకారలోపము, యకారలోపము, మత్స్ + ఈ = మత్సీ + సు = మత్సీ.

సూ : ఇతో మనుష్యజాతేః 4-1-65.

వృ : ఙీష్. దాక్షీ.

ప. వి : ఇతః (5-1) మనుష్య జాతేః (5-1).

అను : ప్రాతిపదికాత్ (5-1) స్త్రియామ్ (7-1) ఙీష (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1).

అర్థ : ఇదంత మనుష్యజాతివాచక ప్రాతిపదికమునకు స్త్రీత్వమున జీష్ ప్రత్యయము వచ్చును. ఉదా : దాక్షీ.

వివ : దక్షస్య అపత్యం స్త్రీ - దక్షుని సంతానమగు స్త్రీ అమనర్థమున దక్షశబ్దమునకు 'అతఇఞ్' అను సూత్రముచే ఇఞ్ ప్రత్యయము చేయగా 'దాక్షి' అగును (ఆదివృద్ధి, అకారలోపములుగలిగినవి). ఇది గోత్రవాచకము గాన జాతివాచకమగును (గోత్రంచ చరణైస్సహ). ఇది మనుష్యజాతివాచకము. హ్రస్వ ఇకారాంతము. కావున ప్రకృతసూత్రముచే జీష్ ప్రత్యయము. దాక్షి + జీష్, దాక్షి + ఈ, యస్యేతిచ - ఇకారలోపము - దాక్షీ + సు=దాక్షీ. (జాతేరిత్యాది సూత్రములోనికి అజాద్యత ష్టాప్ సూత్రమునుండి 'అతః' అనునది అనువృత్త మగుటవలన ఆ సూత్రముచే జీషురాదు కావున మరల విధింపబడినది).

ఇంతటితో జీష్ ప్రత్యయవిధానము పూర్తి అయినది.

అవ : ఇటుపై 'ఊఙ్' అనుస్త్రీ ప్రత్యయము చెప్పబడుచున్నది.

**సూ : ఊఙుతః 4-1-66.**

**వృ : ఉదన్తా దయోపధా న్మనుష్యజాతి వాచినః స్త్రియా మూఙ్. కురూః. అయోపధాత్ కిమ్? అధ్వర్యుర్బ్రాహ్మణీ.**

ప. వి : ఊఙ్ (1-1) ఉతః (5-1).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) అయోపధాత్ (5-1) మనుష్యజాతేః (5-1).

అర్థ : అయోపధమును, మనుష్యజాతివాచకమును, ఉదంతమును అయిన ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఊఙ్ ప్రత్యయము వచ్చును. ఉదా : కురూః. అయోపధాత్ అనుటవలన 'అధ్వర్యుః' అనుచోట ఊఙ్ ప్రత్యయము రాలేదు.

వివ : 'ఉతః' అనునది విశేషణమగుటచే తదంత విధిచే 'ఉదంతమైన' అనునర్థము వచ్చును. తపరకరణమువలన 'హ్రస్వఉకారాంతమైన' అనునర్థము కలుగును. హ్రస్వ ఉకారము అంతమునందుగలదియు, యకారము ఉపధగా లేనిదియు, మనుష్యజాతిని వచించునదియు నగు ప్రాతిపదికమునకు స్త్రీత్వము వాచ్యమగు నప్పుడు ఊఙ్ అను ప్రత్యయము వచ్చును. ఇందు ఙకారమిత్తు.

ఉదా : కురోరపత్యం స్త్రీ - కురువుయొక్క సంతానమైన స్త్రీ అనునర్థమున 'కురునాదిభ్యోణ్యః' అనుసూత్రముచే (4-1-170) ణ్యప్రత్యయము కురు + ణ్య. 'స్త్రియామవన్తికున్తి కురుభ్యశ్చ' అనుసూత్రముచే ఆ ప్రత్యయమునకు లుక్కు వచ్చును (అవన్తి, కున్తి, కురుశబ్దములకు పరముగానున్న తద్రాజప్రత్యయము నకు స్త్రీత్వమున లుక్కువచ్చును) కురు ఇది గోత్రవాచకమగుటచే జాతివాచ కము. అదియు మనుష్యజాతివాచకము ఉదంతము కాన 'ఊఙ్' ప్రత్యయము రాఁగా కురు + ఊఙ్, సవర్ణదీర్ఘ సంధిచే కురూ' అగును. స్వాది ప్రత్యయములు ఙ్యంతములకును, ఆబంతములకును (ఙీప్, ఙీష్, ఙీన్, టాప్ డాప్, చాప్ అను స్త్రీ ప్రత్యయాంతములకని భావము) ప్రాతిపదికసంజ్ఞ కలవానికిని మాత్రమే చేరును. ఊఙంతము పై వానిలో లేదు ప్రత్యయాంతమగుటచే ప్రాతిపదికసంజ్ఞ కలుగదు. కావున "ప్రాతిపదిక గ్రహణే లింగవిశిష్టస్యాపి గ్రహణమ్" అను పరిభాష యిట నాశ్రయింపఁబడినది ప్రాతిపదికమును గ్రహించు నపుడు లింగవిశిష్టమైనదానికిని గ్రహణ ముండును అనగా లింగమునకు సంబంధించిన కార్యములను పొందిన వానినికూడ ప్రాతిపదికసంజ్ఞచే గ్రహింపవలయునని తాత్పర్యము 'కురూ' అను చోట ఊఙ్ ప్రత్యయము లింగవిధానమునకు చేర్పఁబడిన దగుటచే ప్రత్యయము చేరిన రూపము ప్రాతిపదికముగా పరిగణింపఁబడును. కావున సుప్ ప్రత్యయములు చేరును. కురూ + సు, సకారమునకు రుత్వము (ససజుషోరుః) రేఫమునకు విసర్గము (ఖరవసానయోర్విసర్జనీయః) కురూః.

[వక్ష్యమాణ ఊఙంతోదాహరణములయందును ఈవిషయమును స్మరించునది]

ఈ ఊఙ్ ప్రత్యయము యకారము ఉపధగాఁ గల ఉదంతమనుష్యజాతి వాచకమునకు రాదని అనువృత్తమైన 'అయోపధాత్' అనుపదమువలనఁ దెలియు చున్నది కావున 'అధ్వర్యు' శబ్దమునకు ఊఙ్ ప్రత్యయమురాదు ఇది పుంలింగస్త్రీలింగములలో నొకేరూపమున నుండును. కావున స్త్రీలింగమని స్పష్టము చేయుటకై అధ్వర్యుః బ్రాహ్మణీ-అధ్వర్యువగు బ్రాహ్మణి అని విశేష్య సహిత ముగ ఉదాహరింపఁబడినది.

సూ : పఙ్గోశ్చ 4-1-68.

వృ : పఙ్గూః.

ప. వి : పఙ్గోః (5-1) చ (అవ్య).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ఊఙ్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1).

అర్థ : పఙ్గు అను ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఊఙ్ ప్రత్యయము వచ్చును. ఉదా : పఙ్గూః.

వివ : పంగుశబ్దము జాతివాచకము కాదు కావున ప్రత్యేకించి ఊఙ్ ప్రత్యయము విధింపఁబడినది పఙ్గు + ఊఙ్, సవర్ణదీర్ఘము = పఙ్గూ + సు = పఙ్గూః - కుంటిది

వా॥ శ్వశురస్యోకారాకారలోపశ్చ 5039.

వృ : శ్వశ్రూః.

ప వి : శ్వశురస్య (6-1) ఉకారాకారలోపః (1-1) చ (అవ్య).

అర్థ : శ్వశురశబ్దమునకు స్త్రీత్వమున ఊఙ్ ప్రత్యయమును, అది పరమగునపుడు ఉకార-అకారములకు లోపమును కలుగును. ఉదా : శ్వశ్రూః.

వివ : 'శ్వశుర' అనుశబ్దము స్త్రీలింగమున వర్తించునపుడు ఊఙ్ ప్రత్యయము వచ్చును. అది పరమగునపుడు శ్వశురశబ్దములోని ఉకారఅకారములకు లోపము వచ్చును క్రమమునుబట్టి 'శు' లోని ఉకారమును, 'ర' లోని అకారమును లోపించునని భావింపవలయును. 'శ్వ' లోని అకారమునకు లోపము రాదు. శ్వశ్ ర్ + ఊఙ్ = శ్వశ్రూ + సు = శ్వశ్రూః - అత్త. (ఇచట 'పుంయోగాదాఖ్యాయామ్' అనుసూత్రముచే ఙీష్ ప్రత్యయము రావలసియుండగా అపవాదముగా ఈ వార్తికము చెప్పఁబడినది). [శ్వశ్రూశబ్దము అవ్యుత్పన్నప్రాతిపదికమని వ్యాఖ్యాతల అభిప్రాయము. అప్పుడీ ప్రత్యయవిధానమును, ఉకార-అకారములలోపమును కృతకమని తాత్పర్యము].

**సూ : ఊరూత్తరపదాదౌపమ్యే 4-1-69.**

**వృ : ఉపమానవాచి పూర్వపదమూరూత్తరపదం యత్ ప్రాతిపదికం తస్మాదూఙ్. కరభోరూః.**

ప వి : ఊరూత్తరపదాత్ (5-1) ఔపమ్యే (7-1).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ఊఙ్ (1-1) ప్రత్యయః (1-1) పరః (1-1)

అర్థ : ఉపమానవాచకము పూర్వపదముగను, ఊరుశబ్దము ఉత్తరపదముగను గల ప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఊఙ్ ప్రత్యయము వచ్చును. ఉదా : కరభోరూః.

వివ : ఉపమయే ఔపమ్యము ఉపమీయతేఽనయేత్యుపమా దేనిచేత నొకటి ఉపమింపఁబడునో అది ఉపమ ఊరుశబ్దము త్తరపదముగా నున్నదానికి అనుటచే ఉపమానవాచకము పూర్వపదముగా నుండవలయుట సిద్ధమగును. కాఫున పూర్వపదము ఉపమానవాచకమైనదియు ఉత్తరపదము ఊరుశబ్దమైనదియునగు ప్రాతి పదికమునకు స్త్రీత్వమున ఊఙ్ ప్రత్యయము వచ్చును

ఉదా : కరభౌ ఇవ ఊరూ యస్యాః సా - కరభములవంటి ఊరువులుగలది. కరభమనగా మణికట్టునుండి చిటికెనవ్రేలికొనవఱకుఁగల చేతియొక్క వెలుపలి భాగము - (మణిబన్ధా దాకనిష్ఠం కరస్య కరభో బహిః) - ఇందు కరభశబ్ద ముప మానవాచకము. కరభోరు + ఊఙ్, సవర్ణదీర్ఘము కరభోరూ + సు = కరభోరూః.

సూ : సంహితశఫలక్షణ వామాదేశ్చ 4-1-70

వృ : అనౌపమ్యార్థం సూత్రమ్. సంహితోరూః; శఫోరూః; లక్షణోరూః, వామోరూః.

ప వి : సంహితశఫలక్షణ వామాదేః (5-1) చ (అవ్య).

అను : స్త్రియామ్ (7-1) ఊఙ్ (1-1) ప్రాతిపదికాత్ (5-1) ప్రత్యయః (1-1) పరః (1-1) ఊరూత్తర పదాత్ (5-1).

అర్థ : సంహిత, శఫ, లక్షణ, వామశబ్దములు పూర్వపదములుగాగల ఊరూత్తరపదప్రాతిపదికమునకు స్త్రీత్వమున ఊఙ్ ప్రత్యయము వచ్చును. ఔపమ్యములేని సందర్భమునందు ఊఙ్ ప్రత్యయవిధానమునకై యీ సూత్రము చెప్పఁబడినది. ఉదా : సంహితోరూః మొ॥వి.

వివ : పూర్వసూత్రమున ఊరుశబ్ద ముత్తరపదముగాఁ గలప్రాతిపదికము యొక్క పూర్వపదము ఉపమానవాచకముగా నున్నపుడే ఊఙ్ ప్రత్యయము విధింపఁబడినది ఉపమానవాచకములు కాని సంహిత, శఫ, లక్షణ, వామశబ్దములు పూర్వపదములుగా నున్నపుడును ఊరుశబ్ద ముత్తరపదముగాఁ గలప్రాతిపదికమునకు ఊఙ్ ప్రత్యయము సిద్ధించుటకై యీ సూత్రము చెప్పఁబడినది.

ఉదా : సంహితౌ ఊరూయస్యాఃసా (మిక్కిలిసన్నిహితముగా నున్న ఊరు వులు కలది) 'అనేకమన్య పదార్థే' అనుసూత్రముచే సమాసము. సంహితోరు + ఊఙ్, సంహితోరూ+సు=సంహితోరూః.

శఫములనగా కాలిగిట్టలు, వానివలె మిక్కిలి సంశ్లిష్టముగానున్న ఊరువులు గలది అనునర్థమున లక్షణార్థమున ప్రయోగింపఁబడిన శఫశబ్దము పూర్వపదముగాఁ గల ఊరు శబ్దాంత ప్రాతిపదికమునకు ఊఙ్ ప్రత్యయము-శఫౌ ఊరూయస్యాః సా (శఫములైన=శఫములవలెనంటియున్న ఊరువులు గలది) శఫోరు + ఊఙ్ = శఫోరూ + సు=శఫోరూః (ఇచట శఫశబ్దమును ఉపమానవాచకముగాఁ గాక విశేషణ ముగనే గ్రహింపవలయును.)

లక్షణౌ ఊరూయస్యాః సా - లక్షణములైన ఊరువులుగలది - లక్షణోరు (అనేకమన్య పదార్థే అనుసూత్రముచే బహువ్రీహిసమాసము) లక్షణోరు+ఊఙ్, లక్షణోరూ + సు=లక్షణోరూః.

వామౌ ఊరూ యస్యాః సా (అందములయిన ఊరువులు గలది). బహువ్రీహి సమాసము - వామోరు + ఊఙ్ = వామోరూ + సు=వామోరూః

ఊఙ్ ప్రత్యయవిధానము పూర్తి అయినది.

అవ : ఙీన్ ప్రత్యయము విధింపఁబడుచున్నది.

**సూ : శార్ఙ్గరవాద్యఞో ఙీన్ 4-1-73.**

**వృ : శార్ఙ్గరవాదేరఞో యోఽకార స్తదన్తాచ్చ జాతివాచినో ఙీన్. శార్ఙ్గరవీ, బైదీ, బ్రాహ్మణీ.**

ప. వి : శార్ఙ్గరవాది (పంచమీవిభక్తిలోపించినపదము) అఞః (6-1) ఙీన్ (1-1).

అను : అతః (5-1) ప్రాతిపదికాత్ (5-1) స్త్రియామ్ (7-1) జాతేః (5-1) ప్రత్యయః (1-1) పరః (1-1).

అర్థ : శార్ఙ్గరవ మున్నగు శబ్దములకును, అఞ్ ప్రత్యయముయొక్క అకారము అంతమునఁ గల ప్రాతిపదికములకు, స్త్రీత్వము వాచ్యమగునపుడు, ఙీన్ ప్రత్యయము వచ్చును. ఉదా : శార్ఙ్గరవీ, బైదీ, బ్రాహ్మణీ.

వివ : 'అతః' అనునది 'జాతేః' అనుదానికి విశేషణము. కావున తదంత విధిచే 'అదంతమైనజాతివాచకమునకు' అనునర్థము కలుగును. ఆ హ్రస్వ అకారము 'అఞ్' ప్రత్యయమునకు సంబంధించినది కావలయునని 'అఞః' అను

షష్ఠ్యంతపదమున కర్థము శార్ఙ్గరవాది ప్రాతిపదికములకును, 'అఞ్' ప్రత్యయము యొక్క అకారము అంతమునఁ గలజాతివాచక ప్రాతిపదికములకును, స్త్రీత్వమున 'ఙీన్' ప్రత్యయము వచ్చునని ఫలితార్థము. ఇందు ఙకార, నకారము లిత్తులు. 'ఈ' మిగులును

ఉదా. శార్ఙ్గరవ' శృఙ్గరోరపత్యం స్త్రీ - శృఙ్గురువుయొక్క అపత్యమైన స్త్రీ అనునర్థమున అణ్ ప్రత్యయము రాఁగా, శార్ఙ్గరవఅగును శార్ఙ్గరవ+ఙీన్, శార్ఙ్గరవ్ + ఈ (అకారలోపము) శార్ఙ్గరవీ+సు=శార్ఙ్గరవీ

'బిదస్య అపత్యంస్త్రీ' - బిదునియొక్క అపత్యమైనస్త్రీ- 'అనృష్యానన్తర్యే బిదాదిభ్యోఽఞ్' అనుసూత్రముచే అఞ్ ప్రత్యయము బిద+ఙస్ + అఞ్, విభక్తిలోపము, ఆదివృద్ధి, అకారలోపము బైద్ + అ=బైద + ఙీన్, బైద్ + ఈ=బైదీ + సు=బైదీ. బ్రాహ్మణ + ఙీన్. బ్రాహ్మణ + ఈ, అకార లోపము. బ్రాహ్మణీ + సు=బ్రాహ్మణీ (బ్రాహ్మణశబ్దము శార్ఙ్గరవాదులలో పఠింపఁబడినది) ఈపై ఉదాహరణములందు జాతిలక్షణ ఙీష్ ప్రత్యయము రావలసియుండగా దానిని బాధించుటకై ఙీన్ ప్రత్యయము విధింపఁబడినది. ఈ ప్రత్యయములలో నేదిచేరినను ఏర్పడు రూపమొక్కటియే యైనను స్వరభేదము కొఱకు ప్రత్యయభేదము చెప్పఁబడినది.

అవ : శార్ఙ్గరవాదిగణములోని గణసూత్రమొకటి చెప్పఁబడుచున్నది.

× సూ : నృనరయో ర్వృద్ధిశ్చ (54).

వృ : నారీ.

ప. వి : నృనరయోః (6-2) వృద్ధిః (1-1) చ (అవ్య)

అర్థ : నృనరశబ్దములకు ఙీన్ ప్రత్యయముతోపాటు వృద్ధియును వచ్చును. ఉదా : నారీ.

వివ : నృ, నరశబ్దములు శార్ఙ్గరవాదులగుటచే ఙీన్ ప్రత్యయము వచ్చును. అది వచ్చునపుడు 'నృ' లోని ఋకారమునకు 'నర'లోని మొదటిఅకారమునకును వృద్ధి వచ్చును. (ఇచట వృద్ధియనగా నాదివృద్ధియే) నృ + ఙీన్, వృద్ధి (ఋ> ఆర్) నార్ + ఈ=నారీ+ సు=నారీ, నర+ఙీన్ వృద్ధి(అ> ఆ) నార+ ఈ, యస్యేతి చ-అకారలోపము-నారీ+సు=నారీ.

శార్ఙ్గరవాదిగణము : శార్ఙ్గరవ కాపటవ గౌగ్గులవ బ్రాహ్మణ బైద గౌతమ కామణ్డలేయ బ్రాహ్మణ కృతేయ (అనిచేయ) అనిధేయ ఆశోకేయ వాత్స్యాయన మౌఞ్జాయన కైకస కావ్య (కావ్య) శైబ్య ఏహి పర్యేహి ఆశ్మరథ్య ఔదపాన అరాల చణ్డాల వతణ్డ "భోగవద్గౌరిమతోః సంజ్ఞాయాం ఘాదిషు నిత్యం 'హ్రస్వార్థమ్' 53. 'నృనరయోర్వృద్ధిశ్చ' 54.

అవ : 'తి' అను స్త్రీ ప్రత్యయము విధింపఁబడుచున్నది.

**సూ : యూనస్తిః 4-1-77.**

**వృ : యువన్ శబ్దాత్ స్త్రియాం తిః స్యాత్. యువతి.**

ప వి : యూనః (5-1) తిః (1-1).

అను : స్త్రియామ్ (7-1) ప్రాతిపదికాత్ (5-1) ప్రత్యయః (1-1) తద్ధితః (1-1).

అర్థ : యువన్ శబ్దమునకు స్త్రీత్వము వాచ్యమగునపుడు 'తి' అను ప్రత్యయము వచ్చును. ఉదా : యువతిః.

వివ : 'యువన్' అనునది నకారాంత ప్రాతిపదికము. కావున 'ఋన్నేభ్యో ఙీప్' 4-1-52 (ఋదంతశబ్దములకును, నకారాంతశబ్దములకును స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును) అనుసూత్రముచే 'ఙీప్' ప్రత్యయము రావలసియుండగా నపవాదముగా నీ సూత్రముచే 'తి' ప్రత్యయము విధింపఁబడినది. ఈ సూత్రము తద్ధితాధికారములోనిది. కావున ఈ ప్రత్యయమునకు తద్ధితమని పేరు కల్గును. ఉదా : యువన్ + తి, 'స్వాదిష్వసర్వనామస్థానే' అనుసూత్రముచే 'తి' ప్రత్యయము పరమగునపుడు పూర్వమునకు పదసంజ్ఞ కలుగును. కాన 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే నకారలోపమురాగా 'యువతి' అగును. ఇది తద్ధితాంతమగుటచే దీనికి ప్రాతిపదికసంజ్ఞ కలుగును. (కృత్తద్ధితసమాసాశ్చ) సుప్పుచేరును. యువతి + సు = యువతిః. (యువతీ అను ఈకారాంతశబ్దముకూడకలదు. 'యువత్' అనుశతృప్రత్యయాంతముపై 'ఉగితశ్చ' అను సూత్రముచే 'ఙీప్' ప్రత్యయము చేరగా నది యేర్పడునని తెలియఁదగును).

**ఇది స్త్రీప్రత్యయప్రకరణము.**

**ప్రకరణావలోకనము :** అయా ప్రాతిపదికములకు స్త్రీత్వము వాచ్యమగునపుడు (వానియొక్క స్త్రీలింగరూపములు కావలసినపుడు) చేరుప్రత్యయము

స్త్రీప్రకరణమునఁ జెప్పఁబడినవి. టాప్, చాప్, డీప్, డీష్, డీన్, ఊఙ్, తి అను ప్రత్యయము లిందు విధింపఁబడినవి. 'ష్ఫ' అను ప్రత్యయముకూడ యఞంతమునకు స్త్రీత్వమునందే విధింపఁబడినది. పైవానిలో ఇత్సంజ్ఞలను తొలగించినచో ఆ, ఈ, ఊ, తి అనుస్వరూపములు మిగులును. ప్రధానముగా స్వరభేదమునకై ప్రత్యయము లిన్ని భిన్నరూపములతో చెప్పఁబడినవి ఇందు చాప్, చాప్, డీప్, డీష్, డీన్ ప్రత్యయములు సాధారణముగా అదంతములకే వచ్చును క్వాచిత్కముగా వేఱువర్ణములు అంతమునఁగలవానికిని విధింపఁబడినవి. ఇందు డీష్ ప్రత్యయమునకు సంబంధించి పుంయోగలక్షణము, స్వాంగలక్షణము, జాతిలక్షణము అనుమూఁడు ప్రధానవిభాగములు గలవు ఇవికాక వేఱుగా కూడ నీ ప్రత్యయము కొన్నింటికి విధింపఁబడినది. హల స్తద్ధితస్య, ప్రత్యయస్థాత్కాత్పూర్వస్యాత ఇదాప్యసుపః, పూర్వపదాత్సంజ్ఞాయామగః అను సూత్రములును, కతిపయవార్తికములు ఈస్త్రీ ప్రత్యయప్రక్రియలో కార్యవిశేషములను వివరించినవి. స్త్రియామ్, అనుపసర్జనాత్ అను నధికారసూత్రము లిందు అవసరములయినవి. ఇందింకను విస్తృతమైన అంశములు గలవు వానిని సిద్ధాంతకౌముదిమున్నగువానిలో నరయుట శ్రేయము.

శాస్త్రాన్తరే ప్రవిష్టానాం బాలానాం చోపకారికా
కృతా వరదరాజేన లఘుసిద్ధాన్తకౌముదీ.

తర్కము మున్నగు నితరశాస్త్రములలో ప్రవేశించినవారికిని, వ్యాకరణశాస్త్రమున ప్రారంభకులగు బాలురకును ఉపకారికయగు నీ లఘుసిద్ధాంతకౌముది వరదరాజ పండితునిచే నొనరింపఁబడినది.

ఓమ్ తత్సత్

# సూత్రసూచి

## వార్త్తికసూచి

### అ